ఓమ్



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 5. May 1914. మేనెల 1914. సంచిక 2.

## భక్తియోగము.

బ్రహ్మశ్రీ జంగంకోట శ్రీనివాసరావుగారు భక్తివిషయమై వ్రాసినవ్యాసము దివ్యజ్ఞానదీపికయందు గతసంపుటములలోఁ గొంచెము గొంచెముగా ముద్రించఁబడియె. అవియన్నియు నొక్కచోటఁజేర్చి యిపుడు పుస్తకరూపమునఁ బ్రచురింపఁబడియున్నది. ఈగ్రంథ మక్షరతప్పులేమియు లేకుండునట్లు చక్కఁగఁ బరిశోధింపఁబడి దళమైన గ్లేజుకాగితములపై పెద్ద ముద్రాక్షరములతో నేత్రముల కింపుబుట్టించుచుఁ జదువుటకు నాహ్లాదముఁ గలిగించునట్లతిసుందరముగఁ ముద్రించఁబడియున్నది. ఇందు 140 పుటలుగలవు. గ్రంథమందలి ముఖ్యాంశములఁ గ్రోడీకరించి విషయసూచిక వ్రాయఁబడి గ్రంథాదియందు ముద్రింపఁబడియున్నది. ఇందు భక్తిలక్షణము, శుద్ధాశుద్ధభక్తినిర్ణయము, శుద్ధభక్తికి ఆవశ్యకమగు జ్ఞానము, జ్ఞానయుక్తమగు భక్తి

ని పొందువిధము, పరిశుద్ధ హృదయస్వరూపము, భక్తునికుండవల
సిన మనోనిశ్చయము, పరిశుద్ధ హృదయము, కామాది శత్రువర్గ
మును జయించువిధము, కామముయొక్క జన్మస్థానము, క్రోధము
దునుమునుపాయము, మనోధృతి, విషయవైరాగ్యము, ఏకాంత
వాసముఖ్యత, మనోనిగ్రహాభ్యాసము, ఆహారనియమము, వాఙ్మ
యతపస్సు, దేవబ్రాహ్మణపూజ, బ్రహ్మచర్యవ్రతము, అహింసా
లక్షణము, ధ్యానయోగము, త్రిమూర్తులకు భేదరాహిత్యము,
అర్చకులు, ఉత్సవములు, భక్తులలక్షణములు మొదలుగాఁగల
నానావిషయములు వ్రాయఁబడియున్నవి.

శ్రీనివాసరావుగారు భారత భాగవత రామాయణ గ్రం
థములను, అనేక పురాణములను, భగవద్గీతను, ఉపనిషత్తులను
చక్కఁగాఁ బరిశోధించి వానిరహస్యములను గ్రహించినవారు.
తెలిసికొన్నవిషయమును అనుష్ఠానములోనికిఁ దెచ్చుకొనియున్న
వారు. వారిభాషాశైలి మిగుల సౌలభ్యమయి ఆబాలగోపాలు
రకు సుబోధకమై యుండు.

భక్తినిగురించి దీనికిసమానమగు గ్రంథము తెనుఁగున మ
ఱియొండు లేదని దృఢముగఁ జెప్పనగు. భక్తిమార్గావలంబు
లకుఁ గావలసిన విషయములన్నియు నిందున్నవి. ఈ కలియు
గమందు మనుష్యులు కడతేరుటకు భక్తిముఖ్యమగు నుపాయమై
యున్నది. లోకములో ననేకులు భక్తిమార్గమననుసరించి న
డచుచున్నవారు. అట్టివారికి భక్తిమార్గ లక్షణమును నిర్దుష్ట
ముగ నెఱుఁగుట యత్యావశ్యకము. భక్తిశాస్త్రమునకు ల
క్షణగ్రంథమేద్ది? శాస్త్రనియమముఁ దెలియక నెవరికిచ్చవచ్చిన
ట్లు వారు భక్తిసలుపుట సమంజసము కాదు. అట్లు సేయుట
వలనఁ బూర్ణఫలము లభింపదు. రామమందిరములలో తాళ
మృదంగాది వాద్యసహితముగ కీర్తనలుబాడుటయే భక్తియని
కొందఱును, రామకోటివ్రాయుటయే భక్తియని కొందఱును, పు

ణ్యతీర్థములకు యాత్రచేయుటయే భక్తియని కొందఱును, దేవాలయములు గట్టించుట రథములు వాహనములు మొదలగునవి చేయించుట మొదలగు కైంకర్యములే భక్తియనికొందఱును, ఉత్సవములుచేయుటయే భక్తియనికొందఱును నీప్రకారము, నానావిధములగు భిన్నాభిప్రాయములుగలవారై జనులొకరిపద్ధతి నొకరు నిందించుచున్నారు. ఇదియునుగాక భక్తికి పాత్రభూతుడఁగు జగదీశ్వరుని విషయమై సమ్యక్జ్ఞానము లేక పోవుటంబట్టి శివభక్తులకును విష్ణుభక్తులకును పరస్పర వైషమ్యము, విష్ణుభక్తులలో భిన్న తెగలవారి కన్యోన్యద్వేషమును నొకప్పుడు గానిపించుచున్నది. ఇట్టిదురవస్థలకు భక్తిశాస్త్రవిచారము లేక పోవుటయే ముఖ్యకారణము.

మన దేశమునఁ బారమార్థ విచారమున ప్రమాణగ్రంథములలో మొట్టమొదటివి వేదములు ఉపనిషత్తులు. వేదములయందు కర్మమునుగురించియు ఉపనిషత్తులయందు జ్ఞానవిషయముగను విశేషముగఁ జెప్పఁబడియున్నదిగాని భక్తివిషయమై విస్తారముగఁ జెప్పియుండలేదు. వేదములకు క్రింది మెట్టులోనుండునవి ధర్మశాస్త్రములు. వానియందు ధర్మస్వరూపము వివరింపబడియున్నదిగాని భక్తిస్వరూపమేమియుఁ జెప్పియుండలేదు. ఇఁక పురాణములఁ జూచిననో ఒక్కొక్క పురాణమున నొక్కొక్క దేవతకు ప్రాశస్త్యము గల్పించఁబడి యున్నది. పురాణగాథలు సామాన్యముగ నర్థమగుటలేదు. వానియందనేకములు వేదోక్త తత్త్వములను కథారూపముగ సామాన్యజనులకు బోధించుటకై కల్పింపఁబడిన గ్రంథములే కాని భక్తినిబోధించుటకై యేర్పడినవి కావు. వ్యాసప్రణీతములయిన శారీరమీమాంసికమనఁబరగు బ్రహ్మసూత్రములు ప్రమాణగ్రంథమే. దానినెల్లవారు నంగీకరించెదరు. అయినను దానియందును భక్తివిషయమై అధికముగ వ్రాసియుండలేదు. భాగవతపురాణము భక్తిగ్రంథమే.

అదినిస్సంశయము. భాగవతమును సాంగముగాఁ జదువుటవలన భక్తియార్జితమగును. అయిననదియు భక్తికి లక్ష్యగ్రంథమేగాని లక్షణగ్రంథముకాదు. ఇఁక లక్షణగ్రంథమెదియనిన:- భగవద్గీత. అదిభక్తిశాస్త్రమనఁదగు. అందు భక్తియొక్క లక్షణము సాంగోపాంగముగ నిర్వచింపఁబడియున్నది. 6 వ అధ్యాయము మొదలు 12 వ అధ్యాయమువఱకు ఆఱధ్యాయములును భక్తివిషయమును బోధించుచున్నవి. 18 వ అధ్యాయాంతమున భక్తిశాస్త్రసారము సంగ్రహముగఁ జెప్పఁబడియున్నది. భగవద్గీత సర్వమతస్థులు నంగీకరించిన ప్రమాణగ్రంథమైయున్నది. అది భగవంతుఁడు సాక్షాత్తుగ వచించిన గ్రంథము. మనదేశమందు మాత్రముగాక నన్యదేశస్థులును అన్యమతస్థులును అనేకులు భగవద్గీతా మహిమను గుర్తెఱిగినవారై మిగులశ్రద్ధాభక్తులతో దానింజదువుచున్నవారు. భక్తివిషయమై యథార్థజ్ఞానము నపేక్షించువారికి భగవద్గీతఁదక్క గత్యంతరములేదు.

భక్తికావశ్యకమగు జ్ఞానమెద్దియో భక్తునకుండఁదగిన సద్గుణములెవ్వియో భక్తుఁడుసేయవలసిన కర్మమెట్టిదియో యిత్యాదిసిద్ధాంతములీ గ్రంథరాజమునందు విపులముగఁ దెలియజేయఁబడియున్నవి. దీనింబూర్తిగఁజదివి యర్థముఁ గ్రహించినవారేదేవతనైన భజింపవచ్చు. ఏమూర్తినైనఁ బూజింపవచ్చు. ఏవిధమునైన భక్తిసేయవచ్చు. మొదట భక్తిస్వరూపముఁ చక్కఁగ దెలిసికొనవలయు. అందుకు భగవద్గీతకు మించిన గ్రంథములేదు.

శ్రీనివాసరావుగారు వ్రాసిన భక్తివ్యాసము భగవద్గీతాపద్ధతి ననుసరించియున్నది.

పరమాత్ముని నరసింహయ్య.

-:0:-

# దేహము—జీవేశ్వరులు.

"ద్వాసుపర్ణాసయుజా సఖాయా సమానం
వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం
స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥"
(ముండకోపనిషత్తు)

ఎప్పుడును కలిసియుండునట్టియు సమాన నామ (రూప) ములు కలిగినట్టియు పక్షులు రెండొకచెట్టుపైఁగలసి చేరియున్నవి. వానిలో నొకటి తత్ఫలముల భుజించుచున్నది. రెండవది భుజింపకయ తిలకించుచున్నది అని ముండకోపనిషత్తునందు దెల్పఁబడియున్నది. దేహమెయాచెట్టు, అందున్న పిట్టలు జీవేశ్వరులు. ఫలములు కర్మఫలములు. వాని ననుభవించునది జీవుఁడు. తాభుజింపక తటస్థముగాఁ జూచుచున్నది యీశ్వరుఁడు అని శంకరాది తత్త్వవేత్తలు బోధించియున్నారు. ఈ దేహవృక్షము తైత్తిరీయారణ్యకమునందు

శ్లో॥ ఊర్ధ్వమూలమవాక్శాఖంవృక్షంయో వేదసంప్రతి॥

అని మూలముపైకిని శాఖలు క్రిందికిని నున్నట్లు ఛకరుఁగా వర్ణింపబడియున్నది. చెట్టునకడుగుననున్న పాదునీరును నెరువునుంచిన వాటిసారము నయ్యది పైకిలాగుకొని శాఖల వ్యాపింపఁ జేసికొనుచుండ నథస్థమలగు కరచరణాది శాఖలుగల యీవృక్షము పైనున్న ముఖముగుండ నన్నమును దీసికొని హృదయముగుండ సారమునుగ్రహించి క్రిందికివ్యాపింపఁ జేయుచున్నది. ఇట్టివృక్షమునంగల జీవేశ్వరులలో జీవుఁడు తత్ఫలముల భుజించుచున్నాఁడు జ్ఞానజననమరణాది దుఃఖముల నందుచున్నాడు. అట్లు భుజింపని యీశ్వరుఁడు నిర్వికారుఁడై యున్నాఁడు. ఈవిషయము నే యాదులకును క్రైస్తవులకును

మహమ్మదీయులకుఁ బ్రమాణగ్రంథమగు బైబిలునందు సూచింపఁబడియున్నది. యెహోవా (యీశ్వరుఁడు) ఆదామను నరుని ('జీవాత్మను') తనపోలికనే సృజించి వాని నేదెను (దేహము) తోఁటయందుంచి యందలివిజ్ఞాన (అపరవిద్య) వృక్షఫలముల తినవలదని చెప్పెనుగాని సర్పము (ఆశ) చేతను హవ్వ (అజ్ఞానము) చేతను బ్రేరేపింపఁబడి తత్ఫలములఁ దిని జననమరణాది దుఃఖములకు లోనయ్యెనని బైబిలునందుఁ దెల్పఁబడియున్నది. ముండకోపనిషత్తును బైబిలునుగూడ నరుని జననమరణాది బంధములకు (కర్మ)ఫలభోక్తృత్వము కారణమని బోధించుచున్నది. బైబిలునందలి నిషిద్ధఫలకథ యీతాత్పర్యము నిచ్చునని తలంచుట యుచితము. కావున జీవుఁడజ్ఞాన ప్రేరితుండై ఫలాపేక్షచేఁ గర్మముల నాచరించుచున్నంత కాలమును భవబంధములం దగులుకొని పుట్టుచు గిట్టుచు నవయుచుండుననియు

శ్లో॥ తస్మాదసక్తస్సతతం కార్యంకర్మసమాచర
అసక్తోహ్యాచరన్ కర్మపరమాప్నోతిపూరుషః॥

అనిగీతయందుఁ దెల్పఁబడినరీతిగా ఫలాపేక్షలేక సత్కర్మముల నాచరించుచు

శ్లో॥ సమానేవృక్షే పురుషోనిమగ్నో
నీశయాశోచతి ముహ్యమానః
జుష్టంయదాపశ్యత్యన్యమీ
శమస్యమహిమాన,మితివీతశోకః॥

అని ముండకోపనిషత్తునందుఁ దెల్పఁబడినరీతిగాఁ జెంతనున్న యీశ్వరుని గనుఁగొనువాఁడు ముక్తినందు ననునది సర్వఘనమతసారమని చెప్పవచ్చును.

కాశీభట్ట బ్రహ్మయ్య.
(ఆంధ్రసంరక్షణి)

——:o:——

# కర్మ భక్తి జ్ఞానములు.

మహర్షులచే ముక్తికి సాధనములుగ నిర్దేశింపఁబడిన కర్మ భక్తిజ్ఞానముల సమన్వయము పలువురకు దురవగాహముగ నున్నది. ఆహేతువుచేతనే కొందఱు కర్మమే ప్రధానమనియుఁ మఱికొందఱు కర్మజ్ఞానసముచ్చయమువలనగాని మోక్షముకలుగదనియు, కొందఱుకర్మాచరణమువలన చిత్తశుద్ధియు దానివలనజ్ఞానమును తద్వారా మోక్షమును కలుగుచుండుటచే జ్ఞానమే ప్రధానమనియు, మఱికొందఱు భక్తియేముఖ్యమనియు అదిగలవానికి కర్మజ్ఞానములతోనిమిత్తమేలేదనియు నిట్లుబహువిధముల వాదించుచున్నారు. ఇంతమాత్రమే కాదు. యజ్ఞయాగాదులాచరించుట, సంధ్యావందనాది కర్మముల ననుష్ఠించుట, మొదలగునవి మాత్రమే కర్మమనియు, తీర్థయాత్రలను సేవించుట, భగవద్గీతాదిసద్గ్రంథములను ముందుకును వెనుకకును అడ్డముగను గ్రుడ్డిపాఠముగ పారాయణముచేయుట, మనస్సెచ్చట ప్రవర్తించుచున్నను పెదవులతోమాత్రము పైకి సహస్రనామజపములు చేయుట మొదలగునవి మాత్రమే భక్తియనియు, భావము తెలియకపోయినను, ప్రవర్తనయెట్లున్నను "సోహంబ్రహ్మ" "తత్వమసి" ఇత్యాదిమహావాక్యముల కొన్నింటిని కంఠపాఠము చేయుటయే జ్ఞానమనియు మొదలగు అపార్థములను సంకుచితభావములను గల్పించి మానవసంఘమునకు సకలవిధముల బహువిధానర్థములను కలుగఁజేయుచున్నారు. వీరిమూలముననే దేశమునందంతట మూఢాచారములును, మూఢభక్తియు, మెట్టవేదాంతమును వ్యాపించుట సంభవించినది. కావున కర్మ భక్తి జ్ఞానమార్గములెట్లు పరస్పర సమన్వయమొందునో, ఈమూడింటిలో ప్రతిమార్గమందును ప్రారంభదశనుండి చరమదశవరకు ఏయేపరివర్తనములు సంభవించునో సంగ్రహముగా విమర్శింతము.

పరబ్రహ్మము సచ్చిదానందముల నెడు వ్యవస్థాత్రయమూలముగ వ్యక్తమగుచున్నాఁడు. ఈశ్వరాంశ సంభూతుఁడగు జీవునియందా సచ్చిదానందములే క్రియాజ్ఞానేచ్ఛల నెడు మూఁడుదశలుగఁ బరిణమించుచున్నవి. అట్లే ప్రకృతియు సత్వరజస్తమోగుణత్రయ రూపముగ ఁబరిణమించి వ్యక్తమగుచున్నది. కర్మ భక్తి జ్ఞాన మార్గముల కాశ్రయమూలములగు క్రియా జ్ఞానేచ్ఛల నెడుమూఁడుదశలు మానవుని యపరిపక్వదశలో హెచ్చుతగ్గులుగను, పరిపక్వదశలో సమానముగను వ్యక్తమగుచున్నవి. అపరిపక్వదశలో నేవ్యవస్థయెక్కువగ వ్యక్తమగునో ఆవ్యవస్థననుసరించి జీవుని పరిణామము మారుచుండును. ఇట్టిదశలోనే ఒకఁడు కర్మిగను, మఱియొకఁడు భక్తుఁడుగను, వేఱొకఁడుజ్ఞానిగనుఉండుట తటస్థించుచున్నది. కాని చరమదశలో నావ్యవస్థలు సంపూర్ణముగ వికసించునపుడే సమన్వయమొందుచున్నవి. దైవగుణములే జీవునియందు బీజరూపములుగ నంతర్లీనములైయున్న యీమూఁడుదశలు ప్రకృతిమూలముననే వికాసమునొందుచున్నవి. పరిపక్వ స్థితియందును అపరిపక్వస్థితియందును సర్వదశలకును సర్వవ్యవస్థలకును మూలకారణమగు పరబ్రహ్మమొక్కటియే యగుటచేత ఆమార్గములన్నియు నొక్కచోటనే మిశ్రమములై సమన్వయమగుచున్నవి. మార్గములు మూఁడైనను గమ్యస్థాన మొక్కటియే యగుటచేత పరమార్థమందొక్కటియే యగుచున్నవి. విధానములందు భేదించినను గమ్యస్థానమున సామంజస్యమొందుచున్నవి. బాహ్యగోచరములగు వివిధ దశలయందు భేదించినను అవియన్నియు అద్వితీయ బ్రహ్మమునే నిర్దేశించుచున్నవి. సాధనసంపత్తిలో భేదించినను వాటివిశిష్ట లక్షణములు తుదకు పరస్పరసాదృశ్యభావమునొందుచు పరమావధియందేకీభవించుచున్నవి. ఈమార్గముల నవలంబించువాఁడు ప్రకృతిస్వభావములగు సత్వరజస్తమోగుణముల నతిక్ర

మించుచున్నాఁడు. ప్రకృతియందెచ్చట విలోకించినను అతిసూక్ష్మమగు పరమాణువు మొదలుకొని మహాస్థూలమగు పర్వతమువఱకుగల ప్రతిపదార్థమందు నీసత్వరజస్తమోగుణములు వ్యక్తమగుచునేయున్నవి. ఇట్టిగుణత్రయముచే వ్యక్తమగుచున్న ప్రకృతిమూలమున నే అవ్యక్తములై బీజరూపములుగ నంతర్లీనములై జీవునియందు మూఁడుదశలుగాఁబరిణమించిన దైవగుణములుతిరిగి పరిణామమూలమున పూర్ణవికాసము నొందుచున్నవి. ఈమూఁడుమార్గములయొక్క వివిధవిధానముల నాశ్రయించి క్రమక్రమముగా బాహ్యప్రవృత్తులజయించి ప్రతిమానవుఁడు బుద్ధిపూర్వకముగనో అబుద్ధిపూర్వకముగనో ఆత్మావలోకనము కొఱకే ప్రయత్నించుచున్నాఁడు. ప్రాథమికదశయందు అబుద్ధిపూర్వకముగను, చరమదశయందు బుద్ధిపూర్వకముగను పరమాత్మనన్వేషించుచున్నాఁడు. ఏమార్గముననైనను

శ్లో॥ సర్వభూతస్థితంమాంయోభజత్యేకత్వమాస్థితః
సర్వథావర్తమానోపి సయోగీమయివర్తతే॥

అను భగవద్గీతానుసారముగ యోగసిద్ధినొందినవాఁడే కృతార్థుఁడగుచున్నాఁడు. నానాత్వమందేకత్వమును దర్శించువాఁడేయోగి.

కర్మమార్గము.

ఇంద్రియవ్యాపారమూలమున వ్యక్తమగునదెల్లకర్మమనఁబడును. విధానమునుగాని పరమార్థమునుగాని బొత్తిగా గ్రహింపఁజాలక మానవునిచే సాధారణముగా నీకర్మమార్గమవలంబింపఁబడుచున్నది. ప్రప్రథమమున ఫలాపేక్షతో నాచరించుట స్వాభావికము. తొలుత తుచ్ఛసౌఖ్యములకును, పిదప ఉన్నతసౌఖ్యములకును, ఐహికసుఖములనో, ఆముష్మికసుఖములనో పరమావధిగనెంచుకొని ప్రథమదశలో విషయానందములకును, చరమదశలో మానసికానందములకును సాధారణముగా ప్రతిమానవుఁ

డును బ్రయత్నించుచున్నాడు. ఇట్టి భౌతికవిషయ భోగముల కంతములేకపోవుటచే ననుభవించినకొలఁదిని విరామములేక యంతకంటె నధికభోగములకై ప్రయత్నించుచుండుట స్వాభావికము గనున్నది. ప్రస్తుతము మనదేశమున పాశ్చాత్యసంసర్గమువలన దినదినాభివృద్ధిగాంచుచున్న ప్రస్తుతనాగరికతను దిలకించిన యెడల నట్టి స్వభావము గోచరము గాక మానదు. ఈకార్యోత్సాహమునకు పరమార్థములేదు. చరమతాత్పర్యము గ్రహింపఁబడుటలేదు. విజ్ఞానము విజ్ఞానముకొఱకే, స్వాతంత్ర్యము స్వాతంత్ర్యముకొఱకే, ద్రవ్యము ద్రవ్యముకొఱకే, భోగము భోగముకొఱకే, వేయేల కార్యము కార్యముకొఱకే యవలంబింపఁబడుచున్నది. ఇట్లు సాంఘిక నైతికరాజకీయార్థికపారిశ్రామికాదినిఖిలప్రకరణములలో వ్యక్తమగుచున్న ఈ సకలకార్యోత్సాహమునకు పరమార్థము గ్రహింపఁబడుటలేదు. ఇట్టి కార్యోత్సాహ మాహేతువుచేత నే సకలానర్థముల కాశ్రయమగుచున్నది. జీవాత్మ పరమాత్మలు స్వభావమునందొకటియే యగుటచే, పరిణామమూలమున జీవాత్మ పరమాత్మను దర్శించువఱకు, తనకు వ్యతిరిక్తమగు ప్రకృతివిషయములలో నెన్నివిధముల యత్నించినను తృప్తిలేదు. మానవుఁడు ప్రకృతివిషయములందు సౌఖ్యమనుభవింపఁజాలక తుదకిట్టి విషయావస్థలో సాధారణముగా నట్టి విషయములనే సంపూర్ణముగఁబరిత్యజించుటకు యత్నించును. ఇట్టిస్వాభావికధర్మము సర్వదేశములలోను సర్వకాలములయందును వ్యక్తమగుచునేయున్నది. భరతఖండమునకు సయితమిట్టి యవస్థసంభవించుట విచిత్రముకాదు. ప్రస్తుత మెచ్చటగాంచినను మనదేశమునందిట్టి కర్మత్యాగమే గోచరమగుచున్నది. ఇట్టికర్మత్యాగి నివృత్తి ప్రవృత్తియొక్క యభావముకాదనియు, ఫలాపేక్షనువిడిచి కర్మమాచరించుటయే నివృత్తియనియు, పరమార్థమెఱింగి సకలకర్మముల నాచరించవలయునని

యు గ్రహింపఁజాలక సకల కర్మములను, సర్వవిషయములను నిర్మూలముగత్యజించి వనములోనో, పర్వతగుహలోనో, లేక స్వగృహములోనే యేకాంతముగ జీవయాత్ర గడపుటకై యత్నించుట స్వాభావికమగుచున్నది.

శ్లో॥ నకర్మణామనారంభాత్
నైష్కర్మ్యంపురుషోశ్నుతే
నచసన్న్యసనాదేవ
సిద్ధింసమధిగచ్ఛతి॥

అను వాక్యముయొక్క సత్యము తుదకామానవునికి స్ఫురించుచున్నది. తాను విషయములను విడిచి దూరముగా పారిపోవ యత్నించినను, ఆయేకాంతస్థలమున సయితము విషయవాసనలు మాత్రము తన్నువిడవనందున మానసికముగా ననుభవించుచుండుటచేతను, అచ్చట సయితము శాంతిలభించక పోవుటచేతను తుదకు సకల కార్యములయొక్క పరమార్థము హృదయాంతరాళమున స్ఫురించుచున్నది.

శ్లో॥ కుర్యాద్విద్వాం స్తథాసక్తశ్చికీర్షుఃలోకసంగ్రహమ్॥

అనుసత్యమును గ్రహించి ప్రతికార్యముయొక్క పరమార్థము స్వప్రయోజననిమిత్తము కాదనియు, లోకసంగ్రహముకొఱకేయనియు స్ఫురించుటచే సకలకార్యముల యథావిధిగ నాచరింపయత్నించును. పూర్వమువలెనే ప్రస్తుతము కార్యముల నాచరించుచున్నను • ఉద్దేశముమారినది. పరమార్థము గమనింపబడినది. చరమతాత్పర్యము గ్రహింపబడినది.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన॥

అను భగవద్గీతా వాక్యానుసారముగ క్రమముగ జయాపజయములను స్తుతి నిందలను పాటింపక యథాశక్తి తనవిధాయక కృత్యముల నిర్వహించుటయే ప్రధానమనియు, గౌరవాగౌరవములను, సుఖదుఃఖములను, సమానభావముతో దిలకించుచు నిష్కా

మకర్మ మాచరింపఁబూనును. అప్పుడే సకలకర్మములును యజ్ఞ రూపముగ బరిణమించుచున్నవి. తాను చేయు సకలకార్యములను ఫలాపేక్షా రహితముగ జేయుటయే గాక లోకసంగ్రహమే పరమార్థముగ నైకొని ఈశ్వరార్పణముగ చేయునపుడే మానవుఁడు కర్మమార్గమూలమున గమ్యస్థానమును జేరుచున్నాఁడు. ఇట్టివాఁడే మార్గత్రయ సమన్వయమగు యోగదశను సమీపించుచున్నాఁడు. ఇట్టివాఁడే

శ్లో॥ సర్వభూతేషు చాత్మానం
సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా
సర్వత్ర సమదర్శనః॥

అనునట్లు సకలభూతములందు తన్ను, తనయందు సర్వభూతములను సమదర్శనుఁడై చూడగలుగుచున్నాఁడు.

భక్తిమార్గము.

జీవుని యిచ్ఛాదశయే ప్రప్రథమమున కామరూపముగ వ్యక్తమై క్రమక్రమముగా భక్తిరూపముగ బరిణమించి వికాసము నొందుచున్నది. ఈ కామమే ప్రేమ. ఈ ప్రేమ పరస్థితులనను సరించి వివిధనామములచే వ్యవహరింపబడుచున్నది.

మానవునికి నిత్యసన్నిహిత సాహచర్యసంబంధముగల తన శరీరమే ప్రేమకాస్పదమైన సకలవిధములపోషింపబడుచున్నది. పిదప రక్తసంబంధముగల దారాపుత్రాదులయందును, జననీజనకులయందును, సోదరీ సోదరులయందును, బంధువులయందును వ్యక్తమగుచున్నది. అనంతరము గురువులయందును, మిత్రులయందును, క్రమముగా మానవజాతియందును వికాసమునొందును. ఈ ప్రేమయే జడపదార్థములగు ధనకనకవాహనాదులయందు సయితము రాగరూపముగ వర్తించుచున్నది. ధనకనకాదుల రాగమందును, జన్యజనకభావమందును, స్నేహితుల ప్రేమయందు

ను, భార్యాభర్తల ప్రణయమందును, గురుశిష్యుల సంబంధము నందును వ్యక్తమగుచున్న దొకటే ప్రేమయే. దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములయందు వ్యక్తమగుచున్నదీ యొకటే ప్రేమయే. ప్రేమ ప్రతిమానవునియందును ఏదో యొకవిధముగ వ్యాపించియున్నను ప్రేమావిషయముమాత్రమే మారుచుండును. తుదకు ధనకనకవాహనాదిజడపదార్థములు, దారాపుత్రాదులును, బంధుమిత్రాదులును స్థిరముగానుండక పోవుటదిలకించి తృప్తిగానక వానియందిదివరకు వ్యక్తముగావించిన ప్రేమ నిరర్థకమైనదను సత్యమును గ్రహించినపుడే మానవుఁడాప్రేమను త్యుఁడగు ఈశ్వరునియెడలఁ బ్రవర్తింపఁజేయును.

బృహదారణ్యకోపనిషత్తు నందలి

న వా అరే భూతానాం కామాయ భూతాని
ప్రియాణి భవన్త్యాత్మనస్తు కామాయ భూతాని
ప్రియాణి భవన్తి న వా అరే సర్వస్య కామాయ సర్వం
ప్రియం భవత్యాత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి

అను సత్యమును గ్రహించుచున్నాఁడు. ఈప్రేమయే సర్వాంతర్యామియగు భగవంతుని నిర్దేశించునపుడు భక్తియనఁబడును. ప్రారంభదశలో నిమిత్తభక్తియు చరమదశలో నిర్నిమిత్తభక్తియు వ్యక్తమగుట స్వాభావికము. ప్రథమమున వ్యక్తుఁడును, సాకారుఁడును, సగుణుఁడునగు ఈశ్వరునియెడలను, తుదకు అవ్యక్తమును, నిరాకారమును, నిర్గుణమును అగు పరబ్రహ్మముయెడలను వర్తించుచున్నది. వ్యక్తమగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులనుగాని, రామ, కృష్ణ, క్రీస్తు, బుద్ధాది దివ్యమానవావతారములనుగాని పూజించుచున్నాఁడు. నిర్నిమిత్తభక్తిపరుఁడు తనసర్వస్వమును పరమేశ్వరుని కర్పించుచున్నాఁడు. ఇట్టి నిర్నిమిత్తభక్తిని జూపువాఁడే యోగసిద్ధి నొంది పరిపూర్ణుడగుచున్నాఁడు. జ్ఞానియగువాఁడే

శ్లో॥ యేతుసర్వాణి కర్మాణిమయిసన్న్యస్యమత్పరాః
అనన్యేనైవయోగేనమాంధ్యాయన్త ఉపాసతే॥

అనునట్లు సమన్వయభావమును, సమన్వయ కర్మమును వ్యక్తీకరించుచున్నాఁడు. ప్రత్యగాత్మావలోకనము యొక్క భావవిషయిక దశయే భక్తి. ప్రత్యగాత్మావలోకనము యొక్క బుద్ధివిషయక దశయేజ్ఞానము. వ్యవస్థలననుసరించి బాహ్యమునకు భేదము కాన్పించుచున్నను పరమార్థమందొక్కటియే. అందుచే కర్మభక్తి జ్ఞానములక భేదము సిద్ధించుచున్నది.

జ్ఞానమార్గము.

ప్రకృతిస్వభావమును గ్రహించుట విజ్ఞానము. ఆత్మస్వభావమును గ్రహించుట జ్ఞానము. మానవునికి ప్రాథమికదశలో విజ్ఞానమును చరమదశలో జ్ఞానమునుకలుగుట స్వాభావికము. విజ్ఞానమునకు బాహ్యదృష్టియు జ్ఞానమునకంతర్దృష్టియు ముఖ్యసాధనములు. జ్ఞానవిజ్ఞానములకు ప్రత్యక్షానుమానములే ముఖ్యప్రమాణములు. ఈ రెంటికిని గమనాగమనములు (Deduction and Induction) సామాన్యసాధనముగా బరిగణింపబడుచున్నది. ఈఆగమనమునకు అవలోకము, ప్రయోగము, సాదృశ్యము, అభ్యుపగమసిద్ధాంతము, అనుమానము, నిర్ధారణ, ప్రమాణీకరణము నియమము మొదలగునవి ముఖ్యాంగములు. ఈ సాధనముల మూలముననే పదార్థ విజ్ఞాన శాస్త్రము, రసవాదశాస్త్రము, జీవశాస్త్రము, శారీరశాస్త్రము మొదలగు ప్రకృతి శాస్త్రములన్నియు నూతనాంశములతో దినదినాభివృద్ధిని గాంచుచున్నవి. విజ్ఞానమభివృద్ధినొందిన కొలఁది శాస్త్రముల సంఖ్యయే గాక ఆయాశాస్త్రముల విషయము సయితమంతకంతకు వృద్ధియగుచుండుట స్వాభావికము. ప్రకృతి యపారమగుటచే నెన్నివిషయములు సాధింపబడినను నూతనవిషయములు నూతనప్రకరణములనంతముగ మానవదృష్టిని నిత్యమాకర్షించు

చునేయుండును. ఈభౌతికవికార గ్రహణమునకు ఈ అపరా విద్యకు అంతములేదు. మానవుఁడీ విజ్ఞానప్రయత్నములో విరామములేక పెనఁగులాడునపుడు తుదకు భౌతికవికారములన్నియు క్షణిక భంగురములనియు, మాయావృతములనియు గ్రహించుచున్నాఁడు. క్రమక్రమముగ బాహ్యదృష్టినివిడచి యంతర్దృష్టియే ముఖ్యసాధనముగా గైకొని నిత్యమగు యాత్మయొకటియే మాయాంతర్గతమై యున్నదనియు, ఆయాత్మావలోకన జ్ఞానమును బడయుటకు విజ్ఞానము పరిపూర్ణముగా నక్కరలేకయే సాధ్యమనియు,

శ్లో॥ నతదస్తివినాయత్స్యా
న్మయాభూతం చరాదరమ్

అనుగీతావచనాను సారముగ ఆత్మసర్వవ్యాపియగుటచే దానినిమిత్తమై భౌతిక ప్రపంచమునంతయు తిరుగ నవసరములేదనియు గ్రహించును. ఈసత్యమిదివరకు మహర్షులచే భరతఖండమునందు సాధింపబడిన దనుటకు ఉపనిషత్తులు మొదలగునవియే ప్రమాణములు. ప్రస్తుతము విజ్ఞానాభివృద్ధిగాంచుచున్న పాశ్చాత్యప్రకృతి శాస్త్రజ్ఞులు సయితమీ సత్యము నచిరకాలములోనే గ్రహింపగలరు.

ఇట్టిజ్ఞానమార్గమునకు పక్రమించినపుడే మానవుడు ' ఛాందోగ్యోపనిషత్తులోని

శ్లో॥ యథాసోమ్యై కేనమృత్పిండేన
సర్వమృణ్మయంజ్ఞాతంస్యాత్॥

బృహదారణ్యకోపనిషత్తులోని

శ్లో॥ ఆత్మనిఖల్వి రేదృష్టే
శృతే తేవిజ్ఞాతఇదంసర్వంవిదితం॥ '

అనువాక్యముల సత్యమును గ్రహింపగలుగుచున్నాడు. ఒకమృత్పిండ జ్ఞానముచే మృదన్విప సమస్తవస్తు జ్ఞానమెట్లు

కలుగునోయటుల నే బ్రహ్మజ్ఞానముచేత సమస్తప్రపంచ జ్ఞానమును కలుగును. మానవుడప్పుడే అనిత్యమందు నిత్యత్వమును గ్రహించుచున్నాడు. నానాత్వమందేకత్వమును జూచుచున్నాడు.

శ్లో॥ సర్వభూతస్థమాత్మానం
సర్వభూతానిచాత్మని
ఈక్షతేయోగయుక్తాత్మా
సర్వత్రసమదర్శనః॥

అనునటుల బ్రహ్మమొదలు స్తంబపర్యంతముగల సమస్తవస్తువులయందును సమదర్శనుడై తన్ను సమస్తభూతము అస్వరూపముగా భాసించువానిగను, తనయందు సమస్తభూతముల నాభాసించుచున్నవానిగను, జూచుచున్నాడు. ఇట్టివాడే నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రఫలభోగ విరామము మొదలగు సాధనచతుష్టయ సంపత్తికలిగి జ్ఞానయోగము నవలంబించుచున్నాడు. ఇట్టిజ్ఞానమును పొందినవాడే "తత్వమసి" "సోహంబ్రహ్మ" ఇత్యాదిమహావాక్యముల సత్యానుభవపూర్వకముగ సాధించుచున్నాడు. ఇట్టిజ్ఞానియే నిష్కామకర్మ నాచరించుటకును, నిర్నిమిత్తభక్తిజూపుటకును సమర్థుడగుచున్నాడు.

ఈపైవిషయములబట్టి కర్మ భక్తి జ్ఞానముల కావగింజంతయైన పరస్పర భేదములేదనియు, అన్నియు నొకచోటనే యే భవించి సమన్వయించుచున్నవనియు స్పష్టముగ స్ఫురించకమానదు. ప్రతిమానవుడీ తత్వమును లెస్సగగ్రహించి కృతార్థుడగునటు పరమేశ్వరుడనుగ్రహించుగాత.

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

రామానంద.

# పరమార్థ ప్రబోధిని.

(24-వ పుట శేషము)

ఇఁక అన్నదానమును గుఱించి వ్రాయఁబడును.

శ్లో॥ ఆదౌరూపవినాశినీ కృశకరీ కామోత్సవధ్వంసినీ
ప్రజ్ఞామందకరీతపః క్షయకరీధర్మస్యనిర్మూలినీ
పుత్రభ్రాతృకళత్రభేదనకరీ లజ్జాంకురచ్ఛేదినీ
సామాంపీడతిసర్వదోషజననీ ప్రాణాపహారీక్షుధా॥

అనుపండితోక్తిననుసరించి ఆఁకలి మొదట రూపవినాశన మొనరించును, ఆపైశరీరమును కృశింపఁజేయును, కామమును విధ్వంస మొనర్చును, ప్రజ్ఞనుక్షీణింపఁజేయును, తపస్సును నశింపఁజేయును, ధర్మమును నిర్మూలముచేయు, పుత్రకళత్రాదులను విడనాడఁజేయును, లజ్జనుబోఁగొట్టును, కావున నాఁకలికంటె ఘోరమైన దెద్దియు లేదు. "క్షుధాసమోనాస్తి శరీరవేదన" మ్మని పెద్దలనెడివారు. అట్టియాఁకలినిఁ బోఁగొట్టి జవసత్త్వములనొడఁగూర్చునది అన్నము. కనుక ప్రాణికోట్లకన్నముబెట్టుటకంటె మేలైనధర్మమెద్దియు లేదు. పరమదయావంతుఁడైన శ్రీరంతిదేవుఁడను భూకాంతుఁడు సర్వసంగపరిత్యాగియై యొకింత అన్నము నుదకము దక్క వేఱొకటి తనయొద్దలేనివాఁడై యరణ్యమందుండగా, నతనియొద్దకమితక్షుధాతురుండగు నొక బ్రాహ్మణుండరుదెంచి యాశ్రయించెను. దయావంతుఁడగు రాజు తాను తీవ్రక్షుత్పిపాసాపీడితుండయ్యు దనయొద్దనుండిన అన్నమునందుసగము విప్రునకిచ్చి యాదరించె; పిదప నొకశూద్రుఁడు రాఁగా నతనికొక కొంత యిచ్చె; ఆపై నొకశునకము రాఁగా శేషమును దానికిఁ బెట్టె; తుదకు మిగిలియుండిన జలమును దాను త్రావయత్నింప నంతలో నొక చండాలుఁడరుదెంచి యాచించె. పరమకరుణాళువగు నా రాజకులతిలకుఁడా

చండాలునితో;—

ఉ॥ అన్నము లేదు కొన్ని మధు
రాంబువులున్నవి త్రావుమన్న ర।
వ్వన్న శరీరధారులకు
నాపదవచ్చిన వారియాపదల్।
క్రన్నన మాన్పు వారికిసు,
ఖంబులు సేయుటకన్న నొండు మే।
లున్నదె నాకు దిక్కు పురు।
షోత్తముఁడొక్కఁడె సుమ్ము పుల్కసా॥ (భాగవతము).

అనివచించి యాజలము నతనికిచ్చి చిరకీర్తిగడించె. మేము మహానుభావులము. మాపొట్టలునిండి యుబ్బువఱకు నితరులకుఁ బెట్టమను గోముఖవ్యాఘ్రముల కీదయాగుణ మెట్లు రుచింపఁగలదు? హా! ఏకనాథా! జనాంగమున నీతత్త్వమెన్నటి కంకురించునోఁగదా? అన్నదానము మిక్కిలిమంచిది. అయినను ఒకటి రెండుపూటలు మాత్రమన్నమిడుటకంటె శాశ్వతముగా అన్నము స్వతఃసంపాదించుకొనఁజేయఁగల విద్యాదాన మొసంగినచో దానింజెందినవారును, వారిసంతతివారును శాశ్వతముగ జీవనముచేయుదురు. అన్నదానము అకస్మాత్తుగా వచ్చెడి అతిథులకును, వికలాంగులకును నర్హమయినది. యుక్తాయుక్తముల నెఱుంగక నెల్లవారికిని, పక్వాన్నములగు భక్ష్యభోజ్యములను పెట్టుచుండినయెడల జనులు తమకడుపుకూటికైన సంపాదించుకొన యత్నింపక సోమరులయి ఇతరులనే యాశ్రయించుకొని యుందురు. అది దేశాభివృద్ధికి మిక్కిలి కుందకమగును. కావున ప్రయత్నపూర్వకముగా విద్యాదానము చేయుచుండవలయు. అది ఒకరిచేతగాకపోయినచో పలువురుచేరియైన ధర్మపాఠశాలలు పెట్టించి విద్యాభివృద్ధికి తోడ్పడవలయు.

"ఆత్మలాభాన్నపరంవిద్యతే" అనుఆపస్తంభ ధర్మసూ,

శ్రీవచనముచెప్పున అన్నిలాభములకంటె మేలైనది ఆత్మలాభము. దానికిసాధనము బ్రహ్మవిద్య. కష్టపడి ప్రయాసములకోర్చి బ్రహ్మవిద్యను సంపాదించవలయు. దానినితరుల కను గ్రహించవలెను.

"సర్వేషామేవదానానాం బ్రహ్మదానంవిశిష్యతే"

(మనుస్మృతి—అ 4-233)

అన్నిదానములకంటె నెక్కువైనది బ్రహ్మ (విద్యా) దానమని మనువు వక్కాణించె. కావున నెల్లవారును దమతమ యోపినకొలది విద్యాదానము చేయుచుండవలయు. పామరులకై భయపడరాదు. సజ్జనులకు సంతోషమొనఁగూర్చెడి పదార్థమును సయితము వికారమొందించు దుర్గుణము దుర్జనులకు నుగ్గుపాలతో వచ్చియుండును. "వ్యసనంకైర్నసంప్రాప్తం కస్యసౌఖ్యం నిరంతరం" ప్రతివానికిని వ్యసనము కలుగుచునేయుండును, నిరంతరసౌఖ్యమెవనికిని కలుగదను నీతివచనముచెప్పున, ప్రపంచమునందు అన్యాయము, కష్టనిష్ఠురములు అపరిమితముగా నుండుటవలన వివేకవంతులగువారు ముస్ముందట లాభాలాభములు, జయాపజయములు, ప్రమోద విషాదములను వానియందు సమబుద్ధికలిగియుండుట నభ్యసింపవలెను.

కోపమును శాంతముచేతను, దోషమును గుణముచేతను, విరోధమును ప్రీతిచేతను, అసత్యమును సత్యముచేతను, లోభమును త్యాగముచేతను, భేదమును ఐకమత్యముచేతను, అన్యాయమును న్యాయముచేతను, జయింపవలయు. "ప్రయోజనమనుద్దిశ్యనమందోపిప్రవర్తతే" యనునీతిచే నెట్టివారయినను పదే. నిప్రయోజనమును కోరియే పనిచేయుదురు. అట్లుకోరెడి ప్రయోజనము తనకు మాత్రమే లాభదాయకమయి యుండవలయునని యవివేకికోరును. వివేకియన్ననో "ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకం" (మనువు)

పరమేశ్వరుని సర్వపితృత్వమునుఁ బట్టియు మానవు ల సర్వభ్రాతృత్వమునుఁబట్టియు తానాచరించెడి కార్యములవ లన తనకును, తనసోదరులగు తక్కిన వారికిని మేలుకలుగదగిన వానిని మాత్రమే చేయుచుండును. కాయశుద్ధిచేత దేహదోషములను, వాక్శుద్ధిచేత జిహ్వాదోషములను, మనశ్శుద్ధిచే ఆత్మ దోషములను పరిహరించవలయు. పరిశుద్ధమయిన మనస్సే నిర్దుష్టకార్య కరణమునకు అధిభారము. మనశ్శుద్ధియే ఆత్మశుద్ధి.

శ్లో॥ మనఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః
బద్ధాయవిషయాసక్తం ముక్త్యైర్నిర్విషయం స్మృతం
మనోహిద్వివిధంప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ
అశుద్ధంకామసంకల్పం శుద్ధంకామవివర్జితం॥

అను అమృతబిందూపనిషద్వచనానుసరణి మనుష్యులకు బంధమోక్షములలో దేనినిచ్చుటకును మనస్సే కారణము. దు ర్విషయాసక్తిచే బంధమును, దుర్విషయరాహిత్యముచే మోక్ష మును కలుగును. మనస్సు శుద్ధమని అశుద్ధమని రెండువిధములు. దుస్సంకల్పముతోఁగూడినది అశుద్ధమనస్సు. దుస్సంకల్పరహిత మైనది శుద్ధమనస్సు. మనశ్శుద్ధియే అన్నిటముఖ్యమైనది. మే ము వేదాంతులము మామనస్సు బ్రహ్మమునందే రమించుచున్నది. ఆయాయింద్రియము లాయాపనిచేయుచున్నవి. వానితోమాకే మి సంబంధమను వారిమాటలు మిక్కిలి భ్రాంతికిలోనైనవి. పూర్వకాలపు వేదాంతులిట్లనుచుండలేదు. పూర్వమొకప్పు డు సులభయను బ్రహ్మవాదిని పరివ్రాజికయై జనకునియొద్దకేతెంచి, యాతనిచే గౌరవింపఁబడి సుఖాసీనయైనపిదప, రాజునువీక్షించి, ఓమహీపాలా! నీతోక్రీడించవలయునని వచ్చితిని. ఔనుకాదనక నాతోగూడి సుఖసంతోషము లొందుమనగా, జనకుఁడాశ్చర్య మానసుండై యామె నట్టెదిలకించి, సాధ్వీ, ఏమేమి? నీతోక్రీడిం చవలయునే? సరి, సరి బాగున్నది. నేను ఏకపత్నీవ్రతస్థుఁడను.

నావలన నీకట్టి కోరికలభింపదు పొమ్మనగా, సులభ:— రాజా! నీకేమి వెఱ్ఱిపట్టినదా? మనకు స్త్రీపురుష సజాతీయ విజాతీయ భేదమెక్కడిది? మనమిర్వురును బ్రహ్మజ్ఞానులము. ఇంద్రియ వికారములు పామరులనంటునే కాని మనల నంటవు. మనచిత్తములు బ్రహ్మానందమునందే మునిగియుండును. భయపడక నాతోగూడి సుఖించుమని చెప్పెను. రాజు చిఱునవ్వు మోముగలవాడై సాధ్వీ! ఇంద్రియవికారములు మనలనంటవనగా యేమర్థము? మనము ఏమిచెడ్డపనులు చేసినను మనలను అంటవని కాదు. ఇంద్రియవికారముచే పామరుల కిట్టికోరికలు పుట్టునే కాని జ్ఞానులకీవికారసంబంధమైన కోరిక లేపుట్టవని యభిప్రాయము. కావున నీవీవిచారమున పొరబాటుబడియున్నావు. స్త్రీపురుషభేదమే లేదనగా ఏమర్థము. మంచిది! మనమిద్దరును స్త్రీలేయనుకొనుము లేదా ఇద్దరును పురుషులేయనియో, ఇద్దరును నపుంసకులేయనియో భావించుకొందము. అప్పుడు స్త్రీతో స్త్రీయు, పురుషునిపురుషుడును, కూడుటచే సుఖమేమి? ఫలమేమి? ఇదిసృష్టియందెక్కడనైన కలదా? స్త్రీపురుషభేదమే లేదన్నప్పుడు నాతో నీవుకూడవలసిన దేమునకు? భ్రాంతచిత్తురాలా!! చాలు, చాలు, ఈపాటికి నీప్రసంగము నిలిపి వచ్చిన దారిబట్టి వెళ్ళుమన్న రాజు మాటలువిని, సులభ పరమానందభరితయై జ్ఞానసంపూర్ణా! నీదృఢబుద్ధికి నే మెచ్చితిని. నీవంటి మహానీయులే నిజమయిన వేదాంతులు.

శ్లో॥ వాచావిరక్తాః క్రియయానురక్తాః
దారేషుపుత్రేషుధనేషుసక్తాః
విత్తార్జనేవిశ్రుతవేషభాషాః
వేదాంతవాక్యానివదంతిమూఢాః

రాజా! లోకములో దొంగవేదాంతులుకొందఱు, నేనే బ్రహ్మము, అంతయు నేనే, నాకంటె అన్యమైనవస్తువేదియును లేదు

నేను ఆత్మస్వరూపము. దేహేంద్రియాదులతో నాకుసంబంధ ము లేదు, ఆత్మకుపుణ్యపాపములులేవు, ఆత్మనిర్వికారుఁడు. ఆత్మకర్తకాదు, భోక్తకాదు, కావున పుణ్యపాపములు ఆత్మనంటవు, అట్టిఆత్మానంద పరిపూర్ణులగు మేము ఏమిచేసినను మమ్ములనంటవనిపలుకుచు, మాంసభక్షణ మద్యపాన చౌర్య పరహింసా పరాంగనాగమనాది దుష్కార్యరతులైయుందురు. మఱియు నోటితో ఇట్టివేదాంతములు చెప్పుచు ధనధాన్య పశు విత్తక్షేత్రములయందపారమైన ఆసక్తిగలవారై వివిధమాయో పాయములచే ధనముగడించుచుండు మూఢులు మాటిమాటికి విరక్తులవలె వేదాంతవాక్యములనుచ్చరించుచుందురు. జనక భూపాలా! నీవుపరమ విజ్ఞానసంపన్నుఁడవు. నీదర్శనముచేత ను, నీతోసంభాషించుటచేతను మానవులు పవిత్రులగుదురు. వివేకనిధీ! నిర్విఘ్నముగా బ్రహ్మవిచారము చేయుచుండుమని వచించి సులభ యథేచ్ఛగా వెడలిపోయెనని పూర్వులచే చెప్ప బడియున్నది. కావున వేదాంతులెట్టి దుష్కార్యములుచేసినను పాపములేదను భ్రాంతిని విడనాడి దుష్కార్యములుచేయకుండుట యే గొప్పవేదాంతమను తెలివి కలిగియుండవలయు. అది వివేకిలక్షణము. మఱియు వివేకవంతులుచేయవలసిన కార్యము లనేకములుకలవు.

పాపమనెడి గోతిలోఁబడిమిడుకరించుచుండు మానవులను తమవివేకబలముచే పైకెత్తి వారికాత్మ విచారము నేఱింగించుట వివేకుల ప్రథమకర్తవ్యము. ఇట్టిపరశ్రేయస్సాధనముకొఱకు పూనవలసినచో శాంతముండవలయు. శాంతము సముద్రమునకం టె గొప్పదని పెద్దలువచింతురు. శాంతస్వభావముకలవారే లోకోపకారము చేయదగినవారు. శాంతమునకు లొంగనిదేది యునుండదు. శాంతమనగా ఎవరేమిచేసినను ఊరకుండుట యనికొందఱియభిప్రాయము. అదిసరికాదు. దానికితామస

మనిరెూ ఉదాసీనమనిరెూ పేరు. అదిశాంతవంతుల లక్షణము కాదు. ప్రమాదసంభవములుకానట్టి యనావశ్యకవిషయముల నెల్ల ప్రవేశించి మనోవైకల్యము పొందకుండుటయు ప్రారబ్ధవశాత్తుగా సంభవించెడి సుఖదుఃఖములయందు ప్రమోదవిషాదములఁజెందకుండుటయు, స్వరూపజ్ఞానములేని పామరులుచేయునట్టి యపహాస్యములతో మాటిమాటికి జోక్యముకలిగించుకొనకుండుటయు శాంతమనఁబడును. దుష్టులదౌర్జన్యముచే బీదసాదలకేవైన ఆపదలువాటిల్లుచుండగా చూచి యూరకుండుట శాంతము కాదు. తనచేతనైనంతవఱకాదౌర్జన్యమును నివారించుటయు, తనసర్వశక్తికిని నదిలొంగనిదైనచో అదిఎవరికి లొంగునో అట్టివారి నా కార్యమునకుఁ బ్రోత్సాహపఱచుటయు, అదియు సాధ్యముకానిచో భగవంతుని స్మరించి యా దయానిధికేయప్పగించుటయు నిజమయిన శాంతముగలవారి లక్షణము. పరోపకారార్థమెంతటి కష్టమునకైన వెనుకదీయని శాంతవంతులనేకులు కలుగువఱకును దేశమభ్యుదయ మొందదు. ధర్మముతలయెత్తదు.

శ్లో॥ శాంతామహాంతోనివసంతిసంతో
వసంతవల్లోకహితంచరంతః
తీర్ణాస్స్వయంభీమమహార్ణవంజనా
నహేతునాన్యానపితారయంతః॥

(వివేకచూడామణి).

శాంతస్స్వరూపులును మహాత్ములునునగువారు వసంతునివలెనే లోకమునకు మేలొనర్తురు. భయంకరంబైన సంసారసాగరమును తాము తరించి, నిర్వ్యాజకరుణచే భవసాగరమునమునింగియున్న యితరజనులను తరింపఁజేయుచుందురని శ్రీఆది శంకరులు వచించియున్నారు.

శ్లో॥ శివాయలోకస్య.భవాయభూతయే;
యఉత్తమశ్లోక పరాయణాజనాః

జీవంతినాత్మార్థమసౌపరాశ్రయం;
విముచ్యనిర్వేద్యకుతఃకళేబరం॥

అను భాగవతోక్తిననుసరించి, మహనీయులగు బ్రహ్మజ్ఞానులకేదియు నవశ్యకములేకున్నను లోకహితార్థమయి యన్నిటిని వహించువారై ధర్మాభివృద్ధిఁ జేయుచుందురు. అయ్యది మహనీయుల నైజస్వభావము. పరోపకారమునందాశలేని మిథ్యాజ్ఞానవేషధారులు మిక్కిలి నిరర్థకులు. అట్టిస్వార్థుల దర్శనమయిన దినము దుర్దినము. వారువసించు ప్రదేశము శ్మశానమువంటిది. వారితోసంభాషణము పంచమహాపాతకులతోడి సంభాషణము. వేయేల? స్వార్థులకంటె పాపాత్ములు వేరెవ్వరును నుండఁబోరు. అట్టి స్వార్థులు ముత్తెరంగులవారు. స్వకార్యధురంధరులై, యన్యులహితమును స్వప్నమందయిననుఁ గోరని కుక్షింభరులు మొదటితెగవారు. స్వకార్యసిద్ధికై యన్యులకార్యములను చెఱుచువారు మధ్యములు.

మ॥ తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరా
ర్థప్రాపకుల్ సజ్జనుల్
దమకార్యంబుఘటించుచుం బరహితా
ర్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకై యన్యహితార్థఘాతుకజనుల్
దైత్యుల్ వృథాన్యార్థభం
గముగావించెడువారలెవ్వరొ యెఱుం
గన్ శక్యమేయేరికిన్॥ (భర్తృహరి.)

అనుసుభాషిత నీతిచందంబున, నిష్కారణముగా, పరుల కపకారముచేయు వారెట్టి వారో తెలియదు. ఆ పరమ పాతకులకొక్క పేరైనఁ బెట్టుటకు ఏభాషలోనుఁ దగినపదములే దొరకబోవని పెద్దలు వక్కాణించిరి. (సశేషము).

కారుపల్లి. శివరామయ్య.

# శ్రీకైవల్యమంజరి

(32-వ పుట శేషము.)

సంపదల్ గోరుట చాలింప నేమి
తన మేలె యెప్పుడును దప్పక కోరు
పరమేశు కార్యంబు పాటింపఁ బోదు.
పరహితమన్నను బాతకంబనును
ధ్యానింపఁ బూనిన దాటులు వేసి
బహువస్తువుల నిన్ను భావింపఁ జేయు.
నీకోరు వస్తువు నిశ్చలంబుగను
నిమిష మొకటియైన నిల్వ గానీదు.
తాఁ గోరు దానిని దాటోటు చేసి
భావవీధికిఁ దెచ్చి బాగుగా నిలుపు.
నీవది కావయ్య నికటంబు గాను
నీకు సాధనమది నెమ్మది దీనిఁ
జకటగా వెలుఁగుచు సార్వకాలంబు
జతనంబుతోడను జరియింపవలయు.
లేకున్న సాధింప లేవయ్య నీవు.

తప్పొప్పులందును దారతమ్యములు
చూడ రొకింతైన సుజ్ఞాననిధులు
తప్పగు కార్యంబు తప్పనవలయు
నొప్పగు నేనది యొప్పనవలయు
హెచ్చుతక్కువలిందు నెన్నగా లేవు.
పామరజను లెట్టు పలికిన నేమి
కడుఁ గష్టములు నీకుఁ గల్గిన నేమి
ధర్మంబు నెవ్వేడఁ దప్పంగరాదు
తప్పులఁ బోరాదు తడబాటునైనఁ

బరమేశుఁడన్నింటఁబద్ధతినడపు
గుప్తపద్ధతులెల్లఁగొనముట్టనెఱిఁగి
చక్కఁగాఁదర్కించిసద్బుద్ధితోడ
వానివెంటనెనీవువర్తింపవయ్య.
ముఖ్యమీకార్యంబముఖ్యంబదియని
పనులందుఁజక్కఁగాఁబరికింపవలయు.
తప్పొప్పులగుపట్లధైర్యంబుతోడఁ
గుధరంబుమాడ్కినిగొంచకనిలిచి
పట్టినకార్యంబెపాలింపవలయు.
తక్కినకార్యంబుతానెట్టుచనినఁ
జననిమ్ముదానికైశాంతినిమాని
పెఱవారితోనీవుపెనఁగులాఁడకుము.
సార్వకాలంబునుశాంతియుదయయు
ధరియించివర్తింపఁదగునయ్యనీకు.
క్రోఁతిపట్టుగనీవుకోరఁగారాదు
పరసుఖమొక్కింతపాటింపవలయు.
తనమాడ్కిఁబరుఁడునుదనయిచ్ఛఁబోనఁ
గాంక్షించునంచునుగానంగవలయు.
    చేయంగనర్హమౌచేఁతలఁగనుము
కొండంతపనియైనగోరంతదైన
వట్టిరూపునుజూచివ్యామోహమంది
కొఱగానికార్యంబుఁగొనియాడఁబోకు.
జగమెల్లబాగనిచాటిననేమి
కొండంతపనియైనఁగోరంగరాదు.
ఇసుమంతయైననునీశ్వరుసేవ
వేమడంగులుమేలువివరించిచూడ.
అప్రయోజనమిదియదిప్రయోజనము

నగునంచుఁ గార్యంబు లరయంగవలయు.
వినుమింతె చాలదు వీనిలో నీవు
తారతమ్యంబులఁ దరిక్కించి చూచి
కడుఁ గోరఁదగు దానిఁ గావింపవయ్య.
ఆఁకొన్న వారల కన్నంబు నిడుట
ధర్మంబు యుక్తంబు తద్దయు మేలు.
దీనికంటెను మేలు దీనులకింత
జ్ఞానాన్న మొసఁగుట జగతిలో నెపుడు.
కలవాఁడొకండింత కడివేయఁ జాలు
జ్ఞానంబు నియ్యంగ జ్ఞానికిఁ గాక
తక్కిన వారికిఁ దరమెట్టులగును.
జ్ఞానంబుగల దేని జనులకు దాని
దానంబు చేయుట ధర్మంబు నీకు.
తెలివి కెంతటనైనఁ దెగువలకలదె.
నీ తెల్వి యెంతైన నీయెఱుంగనివి
పెంద్రోవయందవి పెక్కులుగలవు
సువివేకమియ్యెడఁ జొప్పడఁ జేసి
నేర్వంగఁదగు వాని నిపుణతఁ గనుము.
ఒక్కొక్క విద్దెయు నొడవును గానఁ
బాండిత్యమున్నింటఁ బడయంగవలయు.
సర్వజ్ఞతయు నింకఁ జక్కఁగా నీకు
సిద్ధించు నొకనాఁడు చింతింప నేల?
అన్ని విద్దెలు నిప్పుడఱగొఱకాన
నుపయుక్తమగు వానినొడఁగూర్పవయ్య.
జ్ఞానంబు దయయును జగదీశు రూపు.
జ్ఞానమెంతగు నంత సర్వాత్మకుండు
నీయందు వెలుఁగుచు నింపారుచుండు

నటుగానవిద్యకై యత్నింపవలయు
పరహితమొనరింపబాగుగానీకుఁ
దోడ్పడువానినె తొలుతొల్తఁజనుము.
విఘ్నంబులెన్నైన వెలవెలఁబోక
సాహసంబునవిద్దెసాధింపవయ్య.
చదువరియగు ఎల్లఁజర్చించిచూడ
జగమందునీకీర్తిఁజాటింపఁగాదు
మోదంబుతోనీవుమురియంగఁగాదు
తెల్విగల్గినఁగదా తెలివితోనెపుడు
జనులకుమేల్చేయఁజాలుదువీవు.
ఉపకారబుద్ధినీకుండిన నేమి
తెలివిలేకున్ననుదికుఁదోచకయె
యపకారమొనరింతువకటనీవు.
కల్లనిజంబులుకనుఁగొనవలయు.
తలఁపులుమాటలుతాఁజేయుపనులు
విజ్జోడుగాకవి వెలయంగవలయు.
నిజమెమూఁడింటనునిలువంగఁజేసి
దబ్బులన్నియుదాటంగవలయు.
భావశుద్ధిఁగనుటబలుకష్టమయ్య
దబ్బఱతలఁపులుధరణిలోమెండు
మూఢభక్తియుఁగడు మోహంబునింపు.
వీనిలోమునిగినవెంగలివిత్తు
మున్నడీనన లేనిముమ్మోటుగాఁడె.
నరులెల్లనిజమనినమ్మిన నేమి?
వేయేండ్లనుండియు వెలసిన నేమి?
గొప్పపురాణముల్ గొనియాడ నేమి?
విశ్వసింపఁగఁబోకువిషయమొకటియుఁ

జక[illegible] వివేకించి సరియగు నేనిఁ
గడుఁ శ్రద్ధతో దానిఁ గైకొనుమయ్య.
విషయంబుఁ దెలియని వెఱ్ఱిమానవులు
పదివేలు నొకరీతి భావింప నేమి?
వారి భావము లెల్ల వ్యర్థంబు గావె.
కైవల్యపథమునఁ గాలిడు వాఁడు
దానె యన్నింటిని దరి[illegible]ంపవలయు.
దబ్బఱ తలఁపులు ధాత్రిలోపలను
గష్టంబులం దెల్లఁ గడుఁ గష్టమయ్య.
మూఢభక్తిని గడముట్టఁ ద్రోయక యె
కైవల్యమందుట కడు దుర్లభంబు.
పరుల గుణంబులఁ బరికించునపుడు
సత్యంబె తలఁపుల సంధింపవలయు.
నిజముగాఁ దెలియక నేరసుల నీవు
పరులపై మోపుట పాడి గాదయ్య.
పరు లెప్పుడును నిన్నె పలుకువారనుచుఁ
దలపోఁతలకుఁ జొచ్చి తాపమందకుము.
వీని కార్యం బదివిషమగు నాకు
వాఁడాడు మాటలు వరుసగా నాకె
తాకుచున్నవి తలపోసి చూడ
వీఁడు వాఁడన్న నాకు విద్వేషులనుచుఁ
దటుకున భావింప ధర్మంబు గాదు.
తామింతకును నిన్నుఁ దలఁచిరో లేదో
తమదుఃఖములె తమతలమీఁద బాపు
కడవారి కెన్నియొ కడగండ్లు గలవు.
ఎవ రేల నీమాట లెత్తుదురయ్య.
గద్దించి యెవఁడైన గట్టిమాటాడ

నీవంతట నెవాఁడు నెటిపగతోడ
నో నాఁడె నంచును నొగులంగఁ బోకు.
వేఱొక రారునితోడ వికటించి వాఁడు
కుపితుండు గాఁబోలుఁ గోపించెనిన్ను
దానికై నూఱుట ధర్మంబు గాదు.
తెలివిలేమి యొగదా తీవ్రకోపంబు.
గురుకటాక్షము నీకుఁ గుదిరిన యపుడు
భావంబులాతని భావముతోడ
సరిపోల్చి చూచినఁ జయ్యన నీకుఁ
గల్లనిజంబులు గానంగవచ్చు.
గురుశిష్యభావంబు గొప్పదిసుమ్ము
వారిక భేదంబు వర్తిల్లు నెపుడు
శిష్యుని తలఁపులశీలింప గురుని
భావంబె యొరగల్లు పరుస వేదియును.
దానితో సామ్యంబుఁ దాల్చు నితలఁపు
తప్పగునద్దానిఁ దటుకున విడుము.
సర్వజ్ఞమూర్తికి సాధుభావములె
కొంకుకొసరు లేకకొన సాఁగుఁ గాదె
పరమగురుని దయపడయని వాఁడు
సరిపోల్చి భావముల్ సవరింప లేఁడు.
మాటిమాటికి వాఁడు మానసంబందు
గురుఁడిట్టు చేయు నేకోరు నేయంచు
భావించి వర్తింప బాగగుసుమ్ము.
గురునికిరుచి కానికోరుకులఁ బనులఁ
దలఁపులఁ గలనైనఁ దలపోయరాదు
సత్యంబె మాటల సాధింపవలయు
కల్లమాటలఁ గొన్నిఁ గలయంగ వేసి

యింతలంతలనుఁజేయింతగావించి
నోరికివచ్చిననుడువులాడకుము.
పరులభావంబులఁబరికింపకీవు
నెపములుమోపుటనీతిగాదయ్య
పరులతలంపులఁబరమేశుఁడెఱుఁగు
నీవెఱుంగనిదేదోనిజముగావారి
కార్యంబులకునెల్లఁగారణంబగును.
పరులగుఱించినపలుచనిమాట
చెవియొగ్గివినరాదుచెప్పంగరాదు.
విన్ననుమఱిదానివెదచల్లరాదు.
తర్కింపనయ్యదిదబ్బఱయేమొ
నిజమైననేమయ్యెనిచ్చలుదానిఁ
దలఁపకయుండుటదయయగుసుమ్ము.
నీవుపలుకులబొంకునెఱయకుండంగ
మాటకిఁబరికించిమాటాడుమయ్య.
కపటవర్తనమెల్లఁగడఁద్రోయవలయు
సత్యంబునటనకుమస్తాష్టకంబు
లోగుట్టుదాఁచుచులోకంబునందుఁ
బైపూఁతనటనలుపచరింపఁబోకు.
నిర్మలసత్యంబునీయందువెలుఁగ
నిర్మలకర్మంబెనినుఁజేరవలయు.
కార్యంబులందెల్లఁగడుశ్రద్ధతోడఁ
దనమేలునొరుమేలుఁదర్కింపవలయు
తనమేలెకోరుటతట్టుముట్టాడుఁ
బల్కుతెఱంగులదానిఁబరికింపవయ్య.
తుదముట్టనొకచోటఁద్రుంచిననేమి
వేఱొకతెరువునవెసఁగానుపించు.

క్రమముగానియ్యదికడకొత్తిచనఁగ
బరహితబుద్ధియేబలియంగఁజొచ్చు
నప్పుడునీ మేలునరయంగఁబోవు.
అందఱయందుననన్నింటియందు
దోషముల్ పెక్కులుదోచిన నేమి
పరమాత్మయునికినిభావింపవలయు.
సకలంబునీకిందుసరిపోలుఁగాన
భ్రాతృభావంబునుబ్రవహింపఁజేసి
పరతత్త్వమును దెల్పిపసులరక్షించి
పున్నెంపుద్రోవనుబోధింపవయ్య.

## ద్వితీయకుసుమము.

వైరాగ్యరూపంబువర్ణింతువినుము
పెక్కెండ్రకియ్యది పెద్దకష్టంబు
ద్వేషంబురాగంబుదిగజారెనేని
బ్రతుకఁజాలమెయంచుఁబలవించువారు
దీనిఁబొందఁగలేనిదీనులువారు
గురుకృపఁగాననికూళలుసుమ్ము.
గురుకటాక్షముతో నెకోరికలెల్ల
గూఁకటివేళ్లతోఁగూలుటనిజము.
వానిపోలికఁదానువర్తింపహింఛ
యొక్కటేశేషించియూడలువాఱు.
కన్నులారగురునిగానకమున్నె
వైరాగ్యమెంతయువాంఛించిదాని

(సశేషము.)

పి. సీతాపతయ్య.

# ఆచమనము.

ఈ యాచమనము కర్మారంభమందేగాక కొన్నినిషేధకార్యములయందు జపహోమాదికమందు దైవవశమువలన గలిగిన నీచసందర్శన భాషణస్పర్శనములయందును తజ్జన్యదోషనివారణార్థముగ మనఋషులు చెప్పియున్నారు. వానిని సంక్షేపముగా నిచట వ్రాసెద.

ఆచమనకాలనిర్ణయము.

శ్లో॥ చండాలాదీన్ జపేహోమే
దృష్ట్వాచామేద్ద్విజోత్తమః

జపహోమాదికాలమందు బ్రాహ్మణుడు చండాలాదులను చూచెనేని వెంటనే యాచమనమును చేయవలయును. ఇంతేగాక

శ్లో॥ సుప్త్వాక్షుత్వాచభుక్త్వాచనిష్ఠీవ్యోక్త్వాఽనృతంవచః
రథ్యాం.శ్మశానమాక్రమ్య ఆచామేత్ప్రియతోపిసన్
అధోవాయుసముత్సర్గే ఆక్రందేక్రోధసంభవే
మార్జారమూషకస్పర్శే ప్రహాసేఽనృతభాషణే॥

మనుస్మృతి.

ఇట్టి సమయములయందాచమింపవలయునని చెప్పబడియున్నది. ఇట్టి స్మృతులయొక్క యభిప్రాయము ప్రమాదవశమువలనగాని అజ్ఞానమువలనగాని సంభవించినవానిని ఆచమించిన తజ్జన్యదోషము నివారించుననియేగాని అన్యథాకానేరదు. కావున మార్జారాదిస్పర్శనమును అనృతభాషణాదికమును చేసిపిమ్మట యాచమించిన తద్దోషపరిహారమానని తలంచగూడదు.

ఆచమనవిధానము.

శ్లో॥ నిబద్ధశిఖకచ్ఛస్తు ద్విజఆచమనంచరేత్
కృతోపవీతంసవ్యాంశే వాఙ్మనఃకాయసంయతః

గోకర్ణాకృతిహస్తేన మాషమాత్రంజలంపిబేత్
తన్న్యూనమధికంవాపిసురాపానసమంభవేత్

సిగను ముడివైచుకొని కచ్చనుగట్టుకొని ఉపవీతియై మౌన వ్రతమాచరించి అరచేయిగోకర్ణాకృతిగబట్టి అందుమినపగింజ మునుగునంతటి జలమునుగైకొని ఆచమింపవలయును. అంతకంటె హెచ్చుతగులగు నెడల సురాపానతుల్యమగును.

శ్లో॥ నాచామేదాసనోస్థాంఘ్రిః నబద్ధాసనఏవవా
నప్రసారితపాదోవా బహిర్జానుకరోపివా॥

ఆచమించునప్పుడు పీటపైగూర్చుండి పాదములను భూమి యందుంచవలయును. పద్మాసనములు మొదలగు ఆసనములను బట్టి బ్రాహ్మణుడు సూర్యోదయప్రభృతిచేయు ప్రతికర్మారంభ మందాచమనమును చేయవలయును. ఆచమింపక నేకర్మమును గూడ చేయరాదు. చేసినను తత్కర్మాచరణఫలము నామనుజు డుపొందడు గాని కాళ్లుచాచుకొనిగాని మోకాలికి వెలుపల చే తులుంచిగాని యాచమింపరాదు. 'పవిత్రం వైహిరణ్యం' అని చెప్పియుండుటవలన బంగారుంగరముగాని దర్భలుగాని వ్రేళ్ల యందుంచుకొని ఆచమింపవలయును. 'త్రిఃపిబేద్దక్షిణేనాపః' అనిపురాణములయందు చెప్పియుండుటవలన దక్షిణహస్తముచే మువ్మారు జలపానమును చేయవలయును. ఆజలము ఫేనబు ద్బుదసహితముగాగాని కలుషముగాని క్షారముగాగాని అగ్ని తప్తమైగాని యుండగూడదు. అట్లుండిన యాయాచమనము నిష్ఫలమగును. ఇట్లు నిర్మలమైన జలమును మువ్మారు పానము జేసి అంగుష్ఠముతో నీటితో పెదవులరెంటిని రెండుపర్యాయము లు స్పృశించి మరల నొకసారి పెదవినితాకి ఎడమచేతిని రెండు పాదములను ప్రోక్షించుకొనవలయును. కరాగ్రముతో శిరమును, అంగుష్ఠానామికలతో నేత్రములను, అంగుష్ఠతర్జనులతో నాసికా పుటములను, అంగుష్ఠానామికలతో చెవులను, కరతలముతో హృద

యమును స్పృశించవలయును. కర్మానుష్ఠానమునకు పూర్వము వారత్రయము జలపానముజేసి క్రమముగా అష్టాంగస్పర్శరూప క్రియలను జేసినయెడల భగవంతునిదయకు పాత్రుడై పిమ్మట తాను చేయు వేదచోదితకర్మల కర్తృడగుచున్నాడు.

ఆచమన భేదములు.

సమస్త కర్మములయందు మనముచేయవలసిన యాచమనములు, శ్రౌతాచమనము, (దీనినే శృత్యాచమనమనియు చెప్పెదరు.) స్మృత్యాచమనము, పురాణాచమనము అని మూడువిధములుగా బరగుచున్నవి. ఇందు శృత్యాచమనమును జపమునకు పూర్వపరములయందు చేయవలయును.

సంధ్యాయాంకర్మకాలేచ స్మృతేరాచమనంభవేత్.

సంధ్యాకర్మయారంభించునపుడు పురాణాచమనమునకు పూర్వము స్మృత్యాచమనమునుచేయవలయును. శ్రౌతస్మార్తపురాణాచమనములయొక్క లక్షణములను విశదముగా వ్రాసిన గ్రంథవిస్తారమానను తలంపుతో విరమించి అందుసంధ్యాకర్మారంభమందు జేయదగిన పురాణాచమన లక్షణమును వ్రాయదలచితి. 1, 2, 3, నామములను స్మరించుచు యాచమనమును చేయవలయును. 4, 5, ఉచ్చరించుచు హస్తములరెంటిని తుడవవలయును. 6, 7, పెదవులరెంటిని తుడవవలయును. 8, 9, శిరస్సున మార్జన జేసికొనవలయును. 10 వామహస్తమున ప్రోక్షించుకొనవలయును. 11 పాదములను ప్రోక్షించుకొనవలయును. 12 శిరస్సునందు ప్రోక్షించుకొనవలయును 13 అన్నివ్రేళ్లయొక్క మూలముచే గడ్డమును తాకవలయును. 14, 15 చూపుడువ్రేలు బొటనవ్రేలు రెంటితో ఘ్రాణద్వయమును తాకవలయును. 16, 17, 18, 19. బొటనవ్రేలు పవిత్రవ్రేలు రెంటితో నేత్రములను చెవులను తాకవలయును, 20 బొటనవ్రేలు చిటికినవ్రేలు రెంటితోబొడ్డును తాకవలయును. 21 కరమధ్యమును

హృదయమందుంచవలయును. 22 చేతికొనను శిరస్సునందుం చవలయును. 23, 24, మూయబడిన చేతితో భుజమూలము ను తాకవలయును. ఇరువదినాలుగు నామస్మరణములతో చేయబడిన క్రియలకు యాచమనమని పేరు. ఇట్లు కేశవాది నామములచే చేయబడిన యాచమనమునకు పురాణాచమనమని పేరు. ఈనామము లిరువదినాలుగగుటచే గాయత్రీ మంత్రవర్ణ సూచకములని యెరుంగునది. ఇట్లు యథావిధిగ బ్రాహ్మణుడు ప్రతికర్మారంభమందు యాచమింపవలయును. ఆచమనాభావమం దుగల దోషము మనుస్మృతియందు చెప్పబడియున్నది.

శ్లో॥ యఃక్రియాంకురుతెమోహాత్ అనాచమ్యైవనాస్తికః
భవంతిహివృథాతస్య క్రియాస్సర్వానసంశయః

నాస్తికుడగుఎవడు కర్మారంభమందు యాచమింపడో అట్టి వాడుచేయుకర్మములన్నియు నిష్ఫలములగును. ఈయాచమన మును చక్కగా ననుష్ఠించిన శరీరారోగ్య సహితములవడును. ఆచమించుటచే శ్వాసకోశములు పరిశుభ్రములగును. వైద్య శాస్త్రమందు

శ్లో॥ ఉదయేసవితుఃకాలె ప్రసృతీస్సలిలస్యయః
పిబేదష్టౌరోగజరాముక్తః జీవేచ్ఛతంసమాః॥

సూర్యోదయసమయమందు ఎనిమిదిపర్యాయములు ఎవరు ఆచమనమును చేయుచున్నారో వారురోగము ముదిమితనము లేని వారలై నూరువత్సరములు జీవించెదరు.

త్రికాలజ్ఞులగు మన ఋషులు చెప్పిన యంశములలో ఒ క్కొక్కదానియం దొక్కొక్క రహస్యమున్నది. అట్టిరహస్య స్వానుభవము జేసికొనవలయును.

గొల్లపూడి శ్రీరామశాస్త్రి, వంగోలు.

# ఋషులు, ఋషిశిష్యులు.

ఋషులు పరిపూర్ణులు. ఈశ్వరస్వరూపులయి మన మేలుకొరకు హిమవత్పర్వతాది ప్రాంతములయందు నివసించుచు సూక్ష్మశరీరముతో అంతట తిరుగుచుందురు. వీరు సదా తమ దివ్యతేజస్సును మనుష్యుల అంతరాత్మకు కారణశరీరమునకు (విజ్ఞానమయకోశమునకు) వ్యాపింపజేయుచుంధురు. ఇది వారు ఎడతెగక చేయుపని. వీరలు భూలోకమందుండు మనకును, చనిపోయి భువర్లోక సువర్లోకములందుండు జీవులకును, సదాహృదయమునందు ప్రవేశించి మనకు తెలియకయే తమ తేజస్సు నిచ్చుచు ఎల్లరను పరిశుద్ధులను జేయుదురు. సద్బుద్ధిని భూతదయ్యను ప్రేరేపించుచు జ్ఞానమును ఆత్మానందమును వృద్ధి జేయుచుందురు. వీరలు మనలను తమవంటి వారలుగ జేయుటకు అన్ని విధములగు సత్ప్రియత్నములు జేయుదురు. జీవకోటిని ఆయాదేశములందు ఆయామతములందు జన్మించునట్లు జేయుచు క్రమక్రమముగా మంచిస్థితికి దెచ్చెదరు. వీరలు సదా మనకు బంపు తేజస్సును బూర్తిగబొంది మేలుపొందుటకు మనము రాజయోగాభ్యాసులము గావలెను. అపుడు వారి తేజస్సు మన కారణ శరీరములో ప్రవేశించి దీనిద్వారా సూక్ష్మమునకు వ్యాపించి స్థూలముకూడ పరిశుద్ధమగును. కాన మనము సదా రాజయోగనిష్ఠగలవారమై స్థూలసూక్ష్మశరీరములను పరిశుద్ధస్థితి యందుంచుకొనవలయును. దీనికివలయు యుక్తాహారము, చిత్తస్థైర్యము, భూతదయ సహితమగు భక్తిగలిగి మన సంకల్పములు కార్యములన్నియు ఈశ్వరుని పర్పాటుకు అనుకూలముగ నుండవలెనను ఉద్దేశ్యము గలిగియుండవలయును. గర్వము లేక సమ్మతిడై ఈశ్వరుని కొరకుట్టుగ అన్నిపనులు చేయుచు తన సంకల్పమును ఈశ్వరునిలో ఐక్యముచేయ బ్రయత్నించవలయు

ను. ఇట్లు సదావర్తించినచో కారణ గురువులగు ఋషుల తేజస్సు ఇట్టి భక్తులయందు సూక్ష్మశరీరములకు వ్యాపించి జీవకోటికిని వ్యాపించి అనేకులు మంచివారలగుదురు. ఇట్టిమితి లేని పుణ్యము వీనికిగలిగి పరిశుద్ధుడగును. ఈరాజయోగి క్రమముగ ఋషిశిష్యుడై పిమ్మట ఋషియగును. లేనిచో సాధ్యముకాదు.

ఒకనగరు (మహల్) కట్టువాడు యింటి అడుగుననుండు కశ్మలముతీసి అడుగుభూమిని మంచిస్థితికి దెచ్చి బలమగు గుణాది వేసి దానికి సామగ్రులన్నియు సిద్ధపరిచి ఆసామగ్రులలో చెడు వస్తువులనుతీసి మంచివి మాత్రముపయోగపరిచి కట్టడమును క్రమ క్రమముగా వృద్ధిపరిచి ముగించి సిద్ధపరుచులాగున జీవుడు మోక్షము అను నగరు (మహల్) పొందవలెనన్న స్థూలసూక్ష్మాదిశరీరములు అనుభూమిని మంచిస్థితికి దేవలయును. దుష్టఆహారాదులు కామక్రోధాదులు వదలవలయును. ఆశ, చింత, దుఃఖము, భయము, గర్వము, మొదలగు చెడువస్తువులను తొలగించుచు వీనికిబదులుగ వైరాగ్యము, నిశ్చింత, శాంతము, ధైర్యము, నమ్రత, మొదలగు సద్గుణములను వృద్ధిపరిచి తానుచేయు అన్ని మంచికార్యములు పరోపకారమునకే చేయుచు ఈశ్వరుని పరావటుకు అనుగుణ్యమగు ఉద్దేశ్యము అను గుణాదినీ చక్కగవేసి, యెడతెగక సత్కార్యములు సత్సంకల్పములు అను కట్టువస్తువులచే భక్తిజ్ఞానముల నభ్యసించినచో మోక్షమను నగరు (మహల్) ఏర్పడును. లేనిచో సాధ్యముకాదు.

ఈస్థితిని గలుగజేయుటకై ఋషులు మనకు తెలియకయే మనమేలుకొరకు మిక్కిలి ఓర్పుతో జాగరూకతతో దయతో అనేకయుగములుగ పాటుపడుచున్నారు. మనమీస్థితిని బొందువరకు యికమందుకూడ పాటుపడుదురు. వీరుమహోపకారముచేయు అదృశ్యసహాయులు. మనము వీరితేజస్సును బొందుటకు తగు యోగ్యతను వృద్ధిపరచుకొనవలయును.

ఋషుల శిష్యులు గురువుయొక్క ఆజ్ఞననుసరించి జీవ కోటికి సదా పలువిధములగు మేలుచేయుచుందురు. వీరలు భూలోకమునందుండియు స్థూలశరీరము వదలి సూక్ష్మశరీరముతో భువర్లోకములో తిరుగువారుకొందరును, భువర్లోక సువర్లోక ఉత్తమలోకములలో దిరుగువారు కొందరును గలరు. వీరుచేయు ఉపకారములు కొన్ని దెలిసికొందము.

భక్తివిషయములు ఆత్మవిషయములు బోధించువారికిని ఉపన్యసించువారికిని సరిఅయిన విషయములు సిద్ధాంతములు మనస్సునకు స్ఫురించునట్లు చేయుట, అట్టిస్థలములకు సూక్ష్మశరీరముతో వచ్చి తమదివ్యతేజస్సును వ్యాపింపజేసి అచ్చట గుమిచేరినవారికి భక్తిని ప్రేరేపించుట, ఎచ్చటెచ్చట భక్తులు గుంపుచేరుదురో అచ్చటంతయు భక్తిజ్ఞానములు వృద్ధిచేయు తేజస్సునించుట, గొప్పదేవాలయములు క్షేత్రములు మొదలగు భక్తులు గుమిచేరుస్థలములందు దివ్యతేజస్సు వ్యాపింపజేయుట, పతివ్రతలను బ్రహ్మనిష్ఠులను కాపాడుట వారినిష్ఠను వృద్ధిపరచుట, సత్కార్యములు సత్కాలక్షేపము చేయుమనుజులకు సభలకు వారి ఉద్దేశ్యము నెరవేరు అవకాశములు కలుగజేయుట. ఇత్యాది అనేక ఉపకారములు ఋషుల శిష్యులు అదృశ్యసహాయులుగ మనకగుపడకయే చేయుచుండుదురు.

ఎ. నంజుండప్ప,
కడప.

-:0:-

## గ్రంథవిమర్శనము.

(1) అక్కిరాజు ఉమాకాంతంపంతులుగారిచే ప్రచురింపఁబడిన 'పాణినీయము' అనుగ్రంథముయొక్క మొదటిసంచిక మాకార్యస్థానము నలంకరించినది. ఇందు సంస్కృత వ్యా

కరణశాస్త్రమునకు మూలాధారమనఁదగు పాణినీసూత్రములు పదవిభాగముతోడను, వృత్తితోడను, ప్రతిపదాంధ్ర వివరణము తోడను తాత్పర్యముతోడను ముద్రింపఁబడియున్నవి. సంస్కృత భాషను సుశబ్దాపశబ్ద భేదము దెలిసికొని చక్కగా నేర్చుకొనఁ గోరువారికి పాణినీసూత్రములఁ జదువుట అత్యంతావశ్యకము. అంధ్రభాషనభ్యసింపఁగోరువారికిని ఉపయుక్తములగు విషయము లిందుఁ జెక్కగలవు. ఈశాస్త్ర మాంధ్రవివరణముతోడ నిది వఱకుఁ బ్రచురింపఁబడి యుండలేదు. ఇది ప్రథమోద్యమము. అధికపరిశ్రమముతో విషయముచక్కగ వ్రాయబడియున్నది. సంస్కృతభాషయందు విశేషపాండిత్యములేనివారికి సయితము సుబోధముకాఁగలదు. గ్రంథమును 32 సంచికలలోఁ బూర్తి చేయ నిశ్చయించి రెండుమాసములకొకసంచిక వెల్వడునట్లు ప్రకటించెదరఁట.

వలయువారు చెన్నపురి తిరువల్లికేణిలో ఆఫీసు వెంకటాచలమొదలి 52 నంబరు ఇంటిలో ఆంధ్రవాఙ్మయసమితీ మానేజర్ గారికి వ్రాసుకొనవలయును.

———:0:———

(2) కడప మునిసిపల్ హైస్కూలు తెనుఁగు పండితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచియింపఁబడి చెన్నపురి వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ బ్రకటింపఁబడిన శ్రీమదాంధ్ర బ్రహ్మాండపురాణమను గొప్పగ్రంథము 1, గుంటూరుజిల్లా చీరాలయందు జరిగిన 11-వ నియోగిమహాజనసభాతీర్మానముగల పొత్తము 1, యీరెండును మాకార్యస్థానము నలంకరించినవి. ఈ సంచికయందవకాశములేమిచే వచ్చెడునెల సంచికలో నివి విమర్శించఁబడును.

———:0:———

## CONTENTS OF THIS NUMBER.

—:o:—



—:o:—

**Registered No. M. 716**

ఓమ్



# దివ్యజ్ఞానదీపికః

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కుడుధర్మములేదు).

**June 1914.**

సంపుటము 5. — జూను నెల 1914. — సంచిక 3.

## విషయసూచిక.

పుట



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBI PRESS
FOR P. NARASIMHA AIYA G. Publisher.

ఓమ్



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక

సంపుటము 5. { **June 1914.** జూన్ నెల **1914.** } సంచిక 3.

## బ్రాహ్మణత్వము.

మనదేశమునందు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులని నాలుగువర్ణములు చిరకాలమునుండియేర్పడియున్నవి. ఆయావర్ణమునకుఁదగిన ధర్మములును, నాయావర్ణమువారు చేయఁదగిన కార్యంబులును శాస్త్రములయందు నియమింపఁబడియున్నవి. ఈవర్ణవిభాగమెప్పుడేర్పడినదో యెంతకాలమునుండి యున్నదో శాస్త్రప్రమాణమువలన నిర్ధారణఁజేయుట సాధ్యముకాకనున్నది. అయిన నేర్పడినది మొదలు పూర్వయుగములందంతయు నాయావర్ణములవారు దమతమ ధర్మములఁ గ్రమముగ నాచరించుచుండిరి. ద్వాపరాంతమునుండి వర్ణధర్మాచరణము క్రమక్రమంబుగ క్షీణించె. "కలౌపంచసహస్రాణి జాయతేవర్ణసంకరః" అనువాక్యమెల్లరకుఁ దెలిసినదియే. ఇపుడు కలియుగంబున నయిదువేల సంవత్సరములుగడిచినవి. వర్ణసంకరము లేర్పడినవనుటకు సంశయములేదు. వర్ణధర్మములు నశించినవి. ఏవర్ణమువారుగాని

తమ కట్టుదిట్టములకు లోఁబడియుండుటలేదు. దీనికిం గారణ మెద్ది?

ఈవర్ణసంకరమునకుఁ గారణము కలికాలస్వభావమనికొందఱును, మతాంతరుల ప్రభుత్వమువలనఁ గలిగినదనికొందఱును, ఆంగ్లేయ భాషాభ్యాసమువలన వచ్చినదని కొందఱును, మనదేశస్థులు సముద్రము దాటి యన్యదేశములకుఁ బోసాగినందువలన సంభవించినదనికొందఱును, నీప్రకారము నానావిధకారణము లూహించఁబడుచున్నవి. దీనియథార్థము కొంతవిచారింతము.

దీనికి మొదట వర్ణభేదము లెట్లేర్పడినవో, నాలుగుజాతులకును పరస్పరముగల వాస్తవభేద మెయ్యదియో యెఱుఁగవలయు. ఈవిషయమై శ్రీకృష్ణభగవానులు గీతయందర్జునునికిట్లుపదేశించె.

శ్లో॥ చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః॥

తా॥ నాలుఁగు వర్ణములను గుణభేదముచేతను కర్మభేదముచేతను నేను సృజించితిని అనిస్వామిచెప్పెను. కాఁబట్టి గుణభేదము కర్మభేదము అనురెంటిచేతనే వర్ణభేదమేర్పడినది. కొన్నిగుణములుగలవారు బ్రాహ్మణులనియు, కొన్నిగుణములుగలవారు క్షత్రియులనియు, కొన్నిగుణములుగలవారు వైశ్యులనియు కొన్నిగుణములుగలవారు శూద్రులనియు విభజింపఁబడిరి. ఏజాతికి సహజమయినగుణము లేపురుషునియందుఁగలిగియుండునో వాఁడాజాతిలోఁ జేరినవాఁడు. గుణముప్రధానమే కాని జన్మము ప్రధానముకాదు.

జాతినిర్ణయమునకు రెండవకారణము కర్మము. అనఁగా నాయాజాతివారు చేయుచుండినకార్యములు. బ్రాహ్మణకర్మముల నేపురుషుఁడు సేయుచుండునో వాఁడే బ్రాహ్మణుఁడు. క్షత్రియజాతికై యేర్పరుపఁబడిన కర్మముల నెవ్వఁడుచేయునో వాఁడు క్షత్రియుఁడు. అవ్విధమున నే వైశ్యకర్మచేయువాఁడు వైశ్యుఁడు శూద్రకర్మముసేయువాఁడు శూద్రుఁడు. ఏజాతికర్మమును జేయువాఁడాజాతిలోఁజేరినవాఁడగు నే గాని ఆకర్మముంజేయని వాఁ

యాజాతికిఁ జేరదు.

ఆయాజాతివారు చేయఁదగిన కర్మములు దేనినిఁబట్టి విధించబడియున్నవి?

శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచపరంతప
కర్మాణిప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥
(గీ 18—41.)

తా॥ ఓయర్జునుఁడా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాలుగుజాతులవారికిని స్వభావమువలనఁబుట్టిన గుణములచేత వారివారికి విహితములగు కర్మములు వేఱువేఱుగా విభజించిచెప్పబడినవని శ్రీకృష్ణమూర్తి సెలవిచ్చె.

ఎవరికే గుణములున్నవో ఆగుణములకుఁ దగినకర్మములు వారికి నిర్ణయింపఁబడినవి. వారివారి యోగ్యతకును శక్తికినిఁ దగినట్టి పనులు వారికిఁ బెట్టుదురుగాని శక్తికిమించిన పనిఁబెట్టరు. విశేషశక్తిగలవారికి నల్పమగుపనిఁ బెట్టుటయుఁదగదు.

ఇవ్విధముగ గుణములనుబట్టియు వానికిఁ దగినకర్మములను బట్టియు ఆదికాలమున చాతుర్వర్ణవిభాగమేర్పడియె. ఇందుబ్రాహ్మణవర్ణ మగ్రవర్ణము. అన్నివర్ణములలో నుత్తమమైనది. బ్రాహ్మణులకు భూదేవతలనియుఁ బేరుగలదు. సద్గుణసంపదయందును నుత్తమకర్మములు జేయగల శక్తియందును దేవతలతో సమానులు. ఈవర్ణమునుగురించిమాత్ర మిపుడు విచారింతము.

బ్రాహ్మణవర్ణము సర్వోత్తమమైనది గనుక వారియందుత్తమగుణములనేకములుండుట సహజము. వారియందుండఁదగిన యుత్కృష్ట గుణములు శాస్త్రములందనేకచోట్ల విశదీకరింపఁబడియున్నవి. కొన్నిమాత్ర మిచట నుదాహరింపఁబడును.

శ్లో॥ సర్వభూతహితంకుర్యాత్ నాఽహితంకశ్చచిత్ ద్విజః
మైత్రీసమస్తభూతేషు బ్రాహ్మణస్యోత్తమంధనం॥
(విష్ణుపురాణము.)

తా॥ బ్రాహ్మణుఁడు సర్వభూతములకు మేలుచేయవల యును. ఏప్రాణికింగీడుసేయరాదు. సమస్తభూతములయెడ మైత్రిగలిగియుండవలయు. బ్రాహ్మణునకిదియ యుత్తమధనము.

శ్లో॥ సత్యందానంక్షమాశీలం అనృశంస్యంతపోఘృణా
దృశ్యంతేయత్రనాగేంద్ర సబ్రాహ్మణఇతిస్మృతః॥
(భారతము.)

తా॥ సత్యము, దానము, క్షమ, సదాచారము, ఘాతుకబుద్ధిలేకుండుట, తపస్సు, భూతదయ, ఎవనియందుండునో వాఁడు బ్రాహ్మణుఁడు.

శ్లో॥ శమోదమస్తపశ్శౌచం సంతోషఃక్షాంతిరార్జవం
మద్భక్తిశ్చదయాసత్యం బ్రహ్మప్రకృతియస్త్విమాః॥
(భాగవతము-ఏకాదశస్కంధము.)

తా॥ అంతరింద్రియనిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, తపస్సు, పరిశుద్ధత్వము, సంతోషము, క్షమ, ధర్మప్రవర్తనము, ఇవి బ్రాహ్మణులకు స్వభావగుణములని శ్రీకృష్ణమూర్తి యుద్ధవునకు నుపదేశించె.

ఈవిషయమునే శ్రీకృష్ణమూర్తి గీతయందర్జునునికిట్లువదేశించె.

శ్లో॥ శమోదమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ
జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజమ్
(అ 18 శ్లో 42.)

తా॥ అంతరింద్రియనిగ్రహము, బాహ్యేంద్రియనిగ్రహము, తపస్సు, పరిశుద్ధత, క్షమ, ఆత్మజ్ఞానము, శాస్త్రజ్ఞానము, ఆస్తిక్యము, అనునవి బ్రాహ్మణునికి స్వభావగుణములు.

పైశ్లోకముల సారాంశమేమనఁగా బ్రాహ్మణునివలన నే ప్రాణికిని నీషత్తైన కీడుకలుగఁగూడదు. బ్రాహ్మణుఁడు సర్వభూతములయందు మైత్రిగలిగియుండవలయు. మనోవాకాయ

యములజయించియుండవలయు. క్షమాగుణము పూర్తిగకలిగి యుండవలయు. లోపలను వెలుపలను శుచిర్భూతుఁడై యుండ వలయు. నిత్యసంతోషియైయుండవలయు. సత్యసంధుఁడై యుండవలయు. సర్వశాస్త్ర పారంగతుఁడైయుండవలయు. ఆత్మానుభవము కలిగియుండవలయు. అట్టివాఁడే బ్రాహ్మణుడు.

ఇన్ని యుత్తమగుణములు బ్రాహ్మణులయందుండవలసిన దెందుకన:—

శ్లో॥ బ్రాహ్మణాలోకసారేణ సృష్టాధాత్రాగుణోద్ధినా
లోకస్తారయితుంకృత్స్నం మర్త్యేషుక్షితిదేవతాః॥
(భారతము—శాంతిపర్వము.)

తా॥ భూదేవతలగు బ్రాహ్మణులు లోకములో నందఱిని తరింపఁజేయవలసినవారుగాన వారిని సర్వసారభూతముగ బ్రహ్మదేవుడు సృజించెను.

శ్లో॥ బ్రాహ్మణస్యతుదేహోయం నకామార్థాయజాయతే

బ్రాహ్మణజన్మమెత్తుట ధనముసంపాదించుటకుకాదు. కామసుఖములననుభవించుటకుకాదు. కష్టపడితాముతరించి ఇతరులను తరింపఁజేయుటకై బ్రాహ్మణజన్మములభించినది.

బ్రాహ్మణజాతియందిట్టి గుణములుండవలయు. ఇఁకవారికి నియమింపఁబడినకర్మముల సంగ్రహముగ విచారింతము.

శ్లో॥ అధ్యాపనంచాధ్యయనంయజనంయాజనంతథా
దానంప్రతిగ్రహంచైవబ్రాహ్మణానామకల్పయత్
షణ్ణాంతుకర్మణామస్యత్రీణికర్మాణిజీవికాః
యాజనాధ్యాపనేచైవవిశుద్ధాచప్రతిగ్రహః॥
(మనుస్మృతి)

తా॥ తాను వేదముల జదువుట, ఇతరులకు వేదముల జెప్పుట, తాను యజ్ఞముచేయుట, ఇతరులచే యజ్ఞము జేయించుట, దానము, ప్రతిగ్రహము అనుషట్కర్మములు బ్రాహ్మణునికి నియ

మింపబడినవి. వీనిలో నితరులకు వేదముచెప్పుట, ఇతరులచేత యజ్ఞముసేయించుట సద్దానములఁదీసికొనుట ఈమూఁడును బ్రాహ్మణునికి జీవనోపాయములుగా నేర్పరుపఁబడినవి.

ఇవి బ్రాహ్మణకర్మములు. శ్రౌత యజ్ఞములయొక్క వైభవము ద్వాపరయుగముతో వెళ్లిపోయినది. ఇపుడు వాని ప్రచారము తగ్గినది. దానముచేయుట బ్రాహ్మణునికి విహితకర్మమేగాని సద్బ్రాహ్మణుఁడు ధనార్జనముచేయఁడు కావున పుష్కలముగ దానమియ్యనోపఁడు. యథేష్టముగ దానముచేయుటకు క్షత్రియవైశ్యులు మాత్రమే సమర్థులగుదురు గాని వారితో బ్రాహ్మణులు సరితూఁగజాలరు. ఇఁక ప్రతిగ్రహమన్ననో అదిఘనకార్యము గాదు. దానమువలన లభ్యమైనవస్తువులను బ్రాహ్మణుఁడు స్వప్రయోజనమునకై ఉంచుకొనఁగూడదు. తక్షణము ఇతరులకు వినియోగించవలయును. కావున షట్కర్మములలో ప్రశంసనీయములైనవి అధ్యయనము అధ్యాపనము రెండే. తాఁజదువుకొనుట, ఇతరులకుఁ జదువుచెప్పుట. అధ్యయనయోగ్యములయినవి కేవలము వేదములుమాత్రమే కాదు. వేదములు, వేదాంగములు, శాస్త్రములు, పురాణములు చతుష్షష్టివిద్యలును చదువఁదగినవే. బ్రాహ్మణుఁడివియన్నియు వానివానిశక్తికొలదిని బుద్ధిబలముకొలదిఁగఱవవలయు. తానేర్చినవిద్య నితరులకుఁ జెప్పవలయు. ఇవి బ్రాహ్మణునికి ముఖ్యధర్మములు. వేదశాస్త్రరహస్యముల నుపదేశించుశక్తి అందరికిని లేకున్నను బ్రాహ్మణజన్మమెత్తిన ప్రతి పురుషుఁడును యథాశక్తి విద్యాదాన కైంకర్యముచేయవలయును. తుదకు వీథిబడియైనఁ బెట్టుకొనవలయు. కావున ప్రతి బ్రాహ్మణుఁడును బ్రహ్మచర్యమంతయు విద్యాభ్యాసమున గడపవలయు. మనశాస్త్రగ్రంథములన్నియు సంస్కృతభాషయందున్నవి. సంస్కృతభాషా పరిచయములేనివానికి శాస్త్రపరిశోధన యలవడదు. అర్థమేమియుఁదెలియక వేదమును కంఠపాఠము

గ నేర్చుకొనుటయే అధ్యయనమనియు నందువలన బ్రాహ్మణత్వ ము ప్రాప్తియగుననియు ననేకులు తలచెదరు. ఇంతకన్నమూ ర్ఖ్యము వేరొండులేదు. అర్థము తెలియని చదువు వ్యర్థము. చది వినదాని యర్థముఁ దెలిసికొనవలయును. తెలిసికొనినదాని న నుష్ఠించవలయు. స్వానుష్ఠానమునకు రానివిద్య నిష్ప్రయో జనము. కావున బ్రాహ్మణుల' కందఱికిని సంస్కృతభాషాజ్ఞా నమత్యంతావశ్యకము.

బ్రాహ్మణులకు విద్యాదాన కైంకర్యమునకంటె నెక్కు డుధర్మము లేదు. ఇతరవృత్తులేవియు బ్రాహ్మణోచితకర్మము లు కావు. న్యాయాధిపత్యము, న్యాయవాదము, ఇంకనుండకు గలరాజకీయోద్యోగములన్నియు క్షత్రియకర్మములు. వాణి జ్యాది వ్యాపారములన్నియు వైశ్యకర్మములు.

ఇపుడు సాక్షాత్తుగ బ్రాహ్మణషట్కర్మములనే ఆచరించు చున్న బ్రాహ్మణులెందుగలరు? యజనయాజనములునశించినవి. అధ్యయనము ఆధ్యాపనము నామావశిష్టములైనవి. దానము శూన్యమయినది. ప్రతిగ్రహముమాత్రము నిలిచియున్నది. ఏ వృత్తిచేతనైన నేవిధముననైన ద్రవ్యమును పరిగ్రహించు వృత్తి యందు బ్రాహ్మణ్యము ప్రవేశించియున్నది. కొందఱు బ్రాహ్మణు లు క్షత్రియకర్మమును, కొందఱు వైశ్యకర్మమును, కొందఱు పరిచా రకకర్మమును చేయుచున్నవారు. అందఱును ద్రవ్యార్జనా సక్తులై యున్నవారు. "సర్వేజనాః కాంచనమాశ్రయంతి" బాహ్మణులుసయితము.

బ్రాహ్మణులెప్పుడు తమ స్వగుణములవిడిచిరో ఎప్పుడు అన్యజాతి కర్మములయందుఁ బ్రవేశించిరో అప్పుడె వర్ణ సాంకర్యమున కాకరమాయె. ఎచట బ్రాహ్మణులు పరహింసా కార్యముల కొడిగట్టిరో అచటవర్ణసంకరముకలిగె. ఎచట బ్రాహ్మణుల కింద్రియనిగ్రహములేక కామక్రోధాదులవశులైరో

అచట బ్రాహ్మణత్వమునకు లోపముగలిగె. దయాసత్యశౌచాది సద్గుణసంపద యేబ్రాహ్మణునియందులేదో వానివలన బ్రాహ్మణత్వముచెడెను. ఏబ్రాహ్మణుఁడు వేదమునుచదువడో వానియందు బ్రాహ్మణకర్మములోపించె. ఏబ్రాహ్మణుఁడు తాఁజదివినదాని నర్థముచేసికొనలేఁడో వానివలన బ్రాహ్మణత్వమునకు లోపముసంభవించె. తానేర్చుకొన్న యర్థము నేబ్రాహ్మణు డితరులకు గఱపడో వానివలనఁ గర్మభ్రష్టుత్వము సంభవించె.

ఏబ్రాహ్మణునియందితర వర్ణముల గుణములుకనఁబడునో, ఏబ్రాహ్మణుఁడు పరవర్ణకర్మములఁజేయునో వానివలన వర్ణసంకరమేర్పడె. ధనాపేక్ష వైశ్యగుణము. రాజకీయోద్యోగము క్షత్రియకర్మము. బ్రాహ్మణజన్మమెత్తి ధనాపేక్షకలిగి రాజకీయోద్యోగముంజేయువానిని బ్రాహ్మణుఁడనుదమా! క్షత్రియుఁడనుదమా! వైశ్యుఁడనుదమా! ఇదిగదా వర్ణసంకరము. అగ్రజన్ములగు బ్రాహ్మణులు దమకుండఁదగు యోగ్యతను సంపాదించుకొని తమస్వధర్మమును చక్కఁగ జరుపుచున్నపుడుగదా తక్కినవర్ణములవారు దమతమధర్మముల నడపుదురు. మొదటివాఁడు బోవుత్రోవనఁగదా వెనుకటివారు నడతురు!

కావున బ్రాహ్మణోత్తములారా! భూదేవులారా! మీయగ్రజన్మమున కర్హములగు నుత్కృష్టగుణములు మీకుసహజములుగఁజేసికొనుఁడు. వేదశాస్త్రముల నభ్యసింపుడు. ధనాపేక్షవిడువుఁడు. జ్ఞానప్రదానకైంకర్యముం బూనుకొనుఁడు. ఆచార్యపీఠముల నలంకరింపుడు. స్వధర్మమునాచరింపుఁడు. బ్రాహ్మణత్వము నుద్ధరింపుఁడు. అటులఁగాదేని వర్ణసంకరమునకు నొడిగట్టుఁడు!

పరమాత్ముని నరసింహాయ్య.

---:0:---

# మహాపురుషుడవతరించుటకిదిసమయమా?

(15-వ పుట శేషము.)

పూర్వకాలమందాచరించుటకు నియమింపబడిన వర్ణాశ్రమధర్మములన్నియు నిప్పుడాచరించుటకు సాధ్యమా? అన్నియు నాచరించుటకు సాధ్యములేకుండిన, నేవిఆచరించుటకు సాధ్యమైయున్నవి? ఈవర్ణాశ్రమ ధర్మములు అనాదినుండి వచ్చినవా? లేక, దేశకాల సందర్భములనుబట్టి మహనీయులు మధ్యకాలమున (అవసరముగనుండినందున) ఏర్పరచినారా? ఏర్పరచఁబడినవేని అవసరసమయము గడచినతరువాత విడువవచ్చునా విడువదగదా? ఇప్పుడాధర్మము లెంతవఱకాచరించుచున్నారు? హిందూదేశమందు ప్రాంతమున ఆచరింపబడుచుండు ధర్మములు శాస్త్రములలోవిధింపబడినవాని ననుసరించియున్నవా? లేకుండినను ఈయాచరణ జనుల శ్రేయోభివృద్ధికనుగుణ్యముగ నున్నదా? లేనపుడెట్టి ధర్మములను సర్వజన శ్రేయోభివృద్ధికై నియమించవలెను? నియమించవలసినపుడెట్టివారు నియమించవలెను? ఈ మొదలగువిషయములను గురించి విచారించుట యీదేశశ్రేయోభివృద్ధి కత్యంత ముఖ్యముగానుండుటవలనబట్టి వానినిగురించి సంగ్రహముగ వ్రాయబడును.

## ధర్మలక్షణము.

మొట్టమొదట సామాన్య ధర్మలక్షణము బాగుగనెరింగినగాని విశేషధర్మమును గురించి తెలియుటసాధ్యముకాదు. జగత్తునుధరించునదేదో అదిధర్మమని యింతకుముందే వ్రాయబడియుండెను.

> ధారణాత్ ధర్మ ఇత్యాహుః ధర్మోధారయతిప్రజాః
> ధర్మోవిశ్వస్యజగతఃప్రతిష్ఠా॥

అను భారతప్రమాణమును, తైత్తిరీయ ఉపనిషత్ప్రమాణ

మును ఆయర్థమును దృఢపరచుటకై ఉదాహరింపబడియుండె ను. ఈధర్మము అనాదియనియు, దీనికర్తలెవరును లేరనియు స్వప్రమాణము చెప్పబడియుండెను. దీనికి ప్రకృతి ధర్మమనియు స్వభావధర్మమనియు నామములుగలవు.

"ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీఉభావపి
వికారాంశ్చగుణాంశ్చైవ విద్ధిప్రకృతిసంభవాన్॥

ప్రకృతి పురుషులు రెండును అనాదిగనుండునవి. సమస్త జగద్వికారములును, గుణములును ప్రకృతినుండి పుట్టినవి. అనగా జగత్తు నందగపడు సమస్తమార్పులును, గుణములును ప్రకృతినుండి పుట్టినవని భగవద్గీత ౧౩ వ అధ్యాయము ౨౦ శ్లోకమందు చెప్పబడినది.

ఈశ్వరుడు ప్రకృతిసహాయములేక ప్రకాశింపజాలడు. ఈశ్వరుడు ప్రకృతిద్వారా వ్యక్తమగును. అదేజగత్ప్రకాశము. ఈశ్వరునికి సచ్చిదానందములెట్లు లక్షణములో అట్లనే ప్రకృతికి సత్వరజస్తమోగుణములు లక్షణములు. జగత్తంతయు నీగుణములతో వ్యాపించియున్నది.

"త్రిభిర్గుణమయైర్భావై రేభిస్సర్వమిదంజగత్॥

అని భగవద్గీత 2 అధ్యాయము ౧౩ శ్లోకమం దుదాహరింపబడినది. మరియు గీత ౧౮ వ అధ్యాయము ౪౦ శ్లోకమందు

"నతదస్తిపృథివ్యాంవాదివిదేవేషువాపునః
సత్వంప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః

తా॥ భూలోకమందైనను, స్వర్గలోకమందు దేవతలందుము ఈసత్వరజస్తమో గుణములతో నావరింపబడనిదేదియు లేదని తాత్పర్యము. బ్రహ్మాండమందుండు సమస్తమును త్రిగుణములతో వ్యాపించియున్నదని తాత్పర్యము.

ఈగుణముల సామాన్యలక్షణము లీక్రిందిశ్లోకమునందు వివరింపబడినవి.

శ్లో॥ సత్వంరజ స్తమఇతిగుణాః ప్రకృతిసంభవాః
నిబధ్నంతిమహాబాహూందేహే దేహినమవ్యయమ్

తా॥ సత్వరజ స్తమో గుణములు ప్రకృతినుండి సంభవించినవి. ఇవి దేహిని (జీవుని) దేహమందు బాగుగ కట్టివేయుచున్నవని తాత్పర్యము. అనగా జీవుడు (స్థూలసూక్ష్మకారణ దేహములనుండి) వదలించుకొని పోకుండబంధించుచున్నవని యర్థము. ఎందాక జీవుడు గుణములకుచిక్కియుండునో అందాక బద్ధుడై పీడింపబడుచున్నాడు. కారాగృహమందు బంధింపబడినవానికి సుఖమెక్కడిది? స్వతంత్రమెక్కడిది? దేహములను కారాగృహములందు గుణములను త్రాళ్లతోబంధించబడిన జీవులు గుణములను త్రాళ్లను తెంచుకొని దేహములను కారాగృహములనుండి బయలువెడలి వచ్చువరకు మోక్షానందమును అనుభవింపజాలరు.

బ్రహ్మఆనందస్వరూపుడు
''ఆనందంబ్రహ్మేతివ్యజానాత్''॥

ఆనందమునే బ్రహ్మముగా తెలియుమని తైత్తిరీయోపనిషత్తునందుదాహరింపబడినది. బహిరంతస్సదానందుడెవడో అనగా వెలుపలను లోపలను ఎల్లప్పుడును ఆనందమొంది యున్నవాడే ముక్తుడు. సమస్తజీవులు ఈస్థితికివచ్చుటయే ఈశ్వర సంకల్పము. ఇదేభగవదిచ్ఛ, ఇదేభగవదాజ్ఞ, ఈయాజ్ఞకే ధర్మమనిపేరు.

''అస్యధర్మస్యసర్వజ్ఞః కల్పాదౌపరమేశ్వరః
వ్యంజకఃకేవలంవిప్రా నైవకర్తానసంశయః॥''

ఈధర్మమును సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు కల్పాదియందు బయల్పరచుచున్నాడుగాని కర్తకాడని మత్స్యపురాణమందు చెప్పబడినది.

ప్రతికల్పాదియందును పరమేశ్వరుడు జగద్రక్షణార్థమై

తనఆజ్ఞను (అనగా ధర్మమును) బహిరంగపరచుచున్నాడు. ఏ దేశమందుగాని, ఏకోశమందుగాని, ఏకాలమందుగాని ఏసందర్భమందుగాని పైచెప్పబడిన భగవదాజ్ఞయనెడు ధర్మమునను వర్తించువారెవరో వారే దేహములనెడు కారాగృహములనుండి త్రిగుణములనెడు త్రాళ్లను త్రెంచుకొని, బయటికివచ్చువారగుదురు. దీనినిబట్టి ధర్మమనగా భగవదాజ్ఞయనియు, దానిననుసరించి వర్తించువారికి ఇహపర సుఖములు కలుగుటయేగాక తుదకు ముక్తులై బ్రహ్మవంటివారగుదురనియు తెలియుచున్నది. ఇదిసామాన్య ధర్మలక్షణము.

విశేషధర్మములు వేర్వేరుదేశములకును, వేర్వేరుజనసంఘములకును వేర్వేరుకాలములకును, వేర్వేరుసందర్భములకును తగినట్లేర్పరచిన ధర్మములు విశేషధర్మములనబడును. ఏవిశేషధర్మముగాని మొదటిదగుసామాన్య ధర్మమును అనగా జనులు త్రిగుణములనుండి తొలగుటకు సాధనముగా నుండవలెను. ఇట్టి ధర్మము లేర్పరచువారు సామాన్యధర్మవేత్తలుగా నుండవలెనని యింతకుముందే వ్రాయబడియుండెను. వీరు ఈశ్వరునిసంకల్పము నెరింగినవారుగా నుండవలెను. ఈశ్వరు నెరింగినవారు తప్ప వేరెవరును ఈశ్వరసంకల్ప మెరుగలేరు. వీరుముక్తులగుటద్వారా బ్రహ్మవేత్తలై జగదుద్ధరణార్థమై కంకణబద్ధులై యుండవలెను.

హిందూదేశమునకు నియమింపబడియుండిన వర్ణాశ్రమధర్మములట్టివైయున్నవో విచారింతము.

వర్ణాశ్రమధర్మము లాదినుండియున్నవా?

హిందూధర్మశాస్త్రములం దేర్పరచిన బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులవర్ణధర్మములు ఆదినుండియుండలేదు. ఇది మధ్యకాలమందు మహనీయులైన మన్వాదిమహర్షులచే నేర్పరచబడినవని తెలియుచున్నది.

మహాభారతము, శాంతిపర్వము, భృగుభరద్వాజ సంవాదమందిట్లు దీనినిగురించి వ్రాయబడినది.

శ్లో॥ నవిశేషోస్తివర్ణానాం సర్వంబ్రాహ్మమిదంజగత్
బ్రహ్మణాపూర్వసృష్టంహి కర్మభిర్వర్ణతాంగతం

తా॥ కల్పాదియందు బ్రహ్మ సృజించినపుడు వర్ణవ్యత్యస్తము లుండలేదనియు సమస్తమును బ్రహ్మముగానుండెననియు కర్మభేదములచే వర్ణము లేర్పడెననియు దీనితాత్పర్యము.

వర్ణములెట్లేర్పడెను?

చాతుర్వర్ణ్యంమయాసృష్టం గుణకర్మవిభాగశః

గుణకర్మ విభాగములననుసరించి నాలుగు వర్ణములు నాచేకల్పించబడినవని భగవద్గీత నాల్గవ అధ్యాయము ౧౩ శ్లోకమందు చెప్పబడినది.

బ్రాహ్మణుని గుణకర్మములేవి?

శ్లో॥ శమోదమస్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ
జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజం॥

అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము, శుచిత్వము, క్షమ, ఋజుత్వము, శాస్త్రజన్యజ్ఞానము, అనుభవజ్ఞానము, ఆస్తిక్యము, అనగా ఈశ్వరుడున్నాడను నిశ్చయము ఇవన్నియు బ్రాహ్మణునికి సహజగుణకర్మములు. బ్రాహ్మణుడీగుణములన్నియు కలిగినవాడై వానినభివృద్ధి చేసికొనుటకు దగిన కర్మములనే చేయుచుండునని భావము.

ఇతరవర్ణములెట్లుత్పత్తియైనవి?

"కామభోగప్రియాస్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః
త్యక్తస్వధర్మారక్తాంగా స్తేద్విజాఃక్షత్రతాంగతాః
గోభ్యోవృత్తింసమాస్థాయ పీతాఃకృష్యుపజీవినః
స్వధర్మాన్నానుతిష్ఠంతి తేద్విజావైశ్యతాంగతాః.
హింసానృతప్రియాలుబ్ధాః సర్వకర్మోపజీవినః

కృష్ణాశౌచపరిభ్రష్టాస్తే ద్విజాఃశూద్రతాంగతాః
ఇత్యేతైఃకర్మభిర్వ్యస్తాః ద్విజావర్ణాంతరంగతాః''॥

పైశ్లోకములోవివరించిన బ్రాహ్మణునికి సహజమగు శమదమాదికర్మములనువిడచి కామమందును మితిలేనికోరికెలు భోగమందును (నానావిధఐహిక సుఖాపేక్షలు) ఇచ్ఛగలవారై ప్రియాప్రియములకు లోబడి సర్వసాహసములు చేయబూనిన బ్రాహ్మణులు శమదమాదులననుసరించివచ్చు సితవర్ణము (తెల్లని తేజస్సును) పోగొట్టుకొని యెర్రనివర్ణమునుపొంది క్షత్రియులైరి. గోరక్షణ, కృషి మొదలగు వృత్తులను జీవనమునకై చేయుచు నే బ్రాహ్మణులు తమధర్మమగు శమదమాదులను విడచిరో వారు పసపువర్ణమునుపొంది (ఆవర్ణపు తేజస్సు) వైశ్యులైరి. హింసయు, అనృతమందపేక్షయు, (అసత్యరతులనుట) లుబ్ధత్వమును, పొంది జీవనమునకై ఎట్టికర్మమునైనను చేయుచు శుచిత్వము బొత్తిగావిడచినబ్రాహ్మణులు నల్లనివర్ణమునుపొంది శూద్రులైరి. ఇట్లు కర్మవ్యత్యస్తములచే బ్రాహ్మణులే ఇతరవర్ణముల వారైరని శాంతిపర్వము భృగుభరద్వాజ సంవాదమందు చెప్పబడినది.

పైనుదాహరించిన శ్లోకములలో రక్త, పీత, అసితవర్ణములను క్రమముగా క్షత్రియ, వైశ్య, శూద్రులు పొందిరని చెప్పుటకు గల కారణమును కనుగొనుట అవశ్యముగనుక దానిని గురించి కొంచముగ విచారింతము.

జగత్తులోనుండు ప్రతివస్తువునకును దానిదానిగుణమునుబట్టి ఒకవర్ణము (రంగు, ఛాయ) చుట్టియుండుట సహజము. రాళ్లు చెట్లు, పశువులు, మనుష్యులు, దేవతలు మొదలగు సమస్త భూతములకు ఏదోయొక వర్ణముచుట్టియున్నదని హిందూశాస్త్రములలోను ప్రమాణములుగలవు. ఈచుట్టియుండు రంగును దివ్యజ్ఞాన సమాజమువారు ఆరా (Aura) అని చెప్పుదురు. సనాతన శాస్త్రములలో ప్రభ, తేజస్సు, వర్చస్సు అనిచెప్పబ

డియున్నది. ఈ తేజస్సు గుణములుమారినట్లంతయు మారు చుండును. ఇది బాహ్యముమండి వచ్చునదికాదు. ఆవస్తువు నుండియే బయటకువచ్చుచుండును. వస్తువులనుండి వచ్చునట్లే మనుష్యులనుండివచ్చుచుండును గనుక గుణములనుబట్టి యేర్పర చిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు వేర్వేరు వర్ణము లుగల తేజస్సు చుట్టియుండును. లోకోద్ధారణ పరాయణులై రాగద్వేషములువదలిన గుణాతీతులగు మహనీయుల తేజస్సు బహుదూరము వ్యాపించియుండును. ఇదిసామాన్యస్థూలచక్షువుల కగుపడకయుండినను దివ్యదృష్టిగల యోగులకందరికి నగపడు చుండును. గనుక భృగుభరద్వాజ సంవాదమందు దీనినిగురించి యిట్లు చెప్పబడినది.

శ్లో॥ బ్రాహ్మణాఃక్షత్రియావైశ్యాఃశూద్రాశ్చద్విజసత్తమ
యేచాన్యేభూతసంఘానాంవర్ణాస్తాంశ్చాపినిర్మమే
బ్రాహ్మణానాంసితోవర్ణః క్షత్రియాణాంచలోహితః
వైశ్యానాంపీతరోవర్ణఃశూద్రాణామసితస్తథా॥

బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు ఇతరసమస్తభూతకోటికి వారివారివర్ణములను నిర్మింపబడెను. బ్రాహ్మణులకు తెల్లనివర్ణమును, క్షత్రియులకు, యెఱ్ఱవర్ణము, వైశ్యులకు పసుపువర్ణమును, శూద్రులకు నల్లవర్ణమును, నిర్మింపబడెనని తాత్పర్యము.

కల్పాదియందు బ్రాహ్మణులుగానుండినవారు స్వకర్మములనువిడచి వేరుకర్మముల నవలంబించుటచేతను, నిర్మలగుణములను వదలి మిశ్రగుణములను పొందుటచేతను సితవర్ణముపోగొట్టుకొని రక్త పీత, అసితవర్ణముగల తేజస్సులతోచుట్టబడిరని పైనుదాహరించిన శ్లోకము ముఖ్యాభిప్రాయము.

నిర్మలముగనుండిన బ్రాహ్మణులు కామక్రోధములకు జిక్కి తదనుసారమైన నీచగుణములను బొందుటచేతనే యితరవర్ణము

లేర్పడినట్లు ఇతరప్రమాణములును గలవు.

"వేదపురాణేతిహాసప్రామాణ్యా
న్నారాయణముఖాన్నిర్గతాః
సర్వకర్తారఃసర్వభావాచ్చబ్రాహ్మణాశ్చ
వాక్సంయమకాలేహితస్యవరప్రదస్యదేవదేవస్య
బ్రాహ్మణాఃప్రథమంప్రాదుర్భూతాః
బ్రాహ్మణేభ్యశ్చ శేషావర్ణాఃప్రాదుర్భూతాః॥

శాంతిపర్వము, మోక్షధర్మపర్వము, కృష్ణార్జున సంవాదము:—

దేవదేవుండైన నారాయణుని ముఖసంయమకాలమందు మొదటబ్రాహ్మణులుపుట్టిరనియు బ్రాహ్మణులనుండితరులు పుట్టిరని పైప్రమాణముయొక్క తాత్పర్యము.

ఎంతదూరముఆలోచించినను గుణకర్మముల పరగతులను పట్టి వర్ణవ్యత్యస్తము స్వభావముగ నేర్పరుటచేత జాతులను నియమించినట్లు దృఢపడుచున్నది.

ఒకవర్ణపు తేజస్సువారింకొక వర్ణపు తేజస్సువారితో పరస్పర వివాహములుచేసికొనుటచేతను ఇతరవిధమున కలసిమెలసి యుండుటచేతను వర్ణసంకరమై నిర్మలవర్ణములు చెడకుండుటకై వర్ణములనుబట్టి జాతులేర్పరచి ఆయాజాతులలోనే వివాహములుచేసికొనునట్లును ఆయాజాతివర్ణములు తగ్గుతరగతికి రాకుండుటకు తదనుసారమైన కర్మములను ప్రతిజాతివారికిని నియమించినట్లు నిశ్చయమగుచున్నది.

ఇప్పుడు హిందువులలో ప్రతిమనుష్యునకును గుణములను పట్టి వర్ణమువానినుండి వెడలి వానిచుట్టియున్నదనిగాని ఆ వర్ణమునుపట్టి జాతులేర్పడినవియనిగాని తలంచరు. ఈవిషయముపూర్తిగ మరచి అన్నిజాతులొకటేతూరి బ్రహ్మముఖమునుండియు, బాహువులనుండియు, తొడలనుండియు, పాదములనుం

డియు నుద్భవించెనని నమ్మియున్నారు. ఇదివదలవలయు. సమస్త భూతములచుట్టు వర్ణము, ప్రభ, యున్నదని అనేకచిహ్నములచే చూపుచుండినను దానియథార్థమును తెలియకున్నారు. దేవాలయములలోనుండు ప్రతివిగ్రహముచుట్టును, ఉత్సవవిగ్రహములచుట్టును ప్రభావళియనునవి తప్పక కట్టియుండుట చూచుచుండలేదా? అట్లుకట్టియుండుట దేవతలచుట్టి బహుదూరమువారి తేజస్సు వ్యాపించియుండుననుటను దృఢముగ తెలియజేయుటకేయని నిశ్చయము.

మరియు మహాభారత శాంతిపర్వమునందు బ్రాహ్మణులను వర్ణించునపుడిట్లు చెప్పబడియున్నది.

"అసృజద్బ్రాహ్మణా నేవం పూర్వంబ్రహ్మాప్రజాపతిః
ఆత్మతేజోభినిర్వృత్తా౯ భాస్కరాగ్నిసమప్రభా౯

ప్రజాపతియైన బ్రహ్మ పూర్వము సూర్యునియొక్కయు, అగ్నియొక్కయు, ప్రభవంటి తేజస్సుతో చుట్టబడిన బ్రాహ్మణులను సృజించెనని తాత్పర్యము.

ఈశ్లోకము బ్రాహ్మణుల సహజగుణములగు శమదమాదులుగలవారిని చుట్టియుండు తేజస్సు సూర్యాగ్నుల తేజస్సువలెనుండునని స్పష్టమగుచున్నది.

ఇట్టితేజస్సును చెడకుండనుంచికొనుటకే బ్రాహ్మణులకు సమదమతపశ్శౌచాది ఉత్కృష్టకర్మములు నియమించియున్నారు.

(సశేషము)

జం. శ్రీనివాసరావు.

# పరమార్థ ప్రబోధిని.

(64-వ పుట శేషము.)

కావున పురుషార్థపరులు స్వార్థగుణమునుండి విముక్తిఁ జెందవలయు. మనయందుగల సత్కార్య సాధనోత్సాహము ను, ధైర్యస్థైర్యములను, భక్తివిశ్వాసములను, ప్రకాశపఱచు టకు గొప్పకార్యములు సంభవించవలెనని వేచియుండరాదు. ఈగుణములను ప్రతినిత్యమును జేసెడి సామాన్య కార్యముల యందే వినియోగించుచుండవలెను.

స్వార్థులవిచార మింతవిరళముగా వర్ణించిన దెందుకనగా, మనయందుఁగల స్వార్థత్వమును విడనాడుటకై యుపకరించునట్టి సదోబ్ధయగుననను తలంపేగాని, ఇతరులను స్వార్థులని, నిష్కా రణముగా మాటిమాటికి నిందించుటకుఁగాదు. ఎవఁడు తన యందుగల స్వార్థగుణములను పరిత్యజించునో అతఁడే వివేకశాలి. ఈలోకమున చేయవలసిన కార్యములెన్నియో యున్నవి. ఆత్మవిచారము, పరోపకారము, అను రెండింటిలో నన్నియు నిమి డియున్నవి. ఇట్లుండ, మాకు, పొద్దుపోనేపోదు. మిక్కిలి వే సటగానున్నదను వారును; తదుద్దేశముతో, పుల్లిగట్టి, వెలిగట్టి, చీట్లపేకలు, మున్నగు దుర్వ్యాపారములచే కాలక్షేపము చేయు వారును, ఇట్టికార్యముల కితరులను ప్రోత్సాహపఱుచు వారును లోకద్రోహులగుదురు. అట్టివారి సాంగత్యముచేయుట యెట్టి దనగా, కొఱవితో తల్లకాల్చుకొనుటవంటిది. దుడ్డిచ్చి తద్దినము ను వెలకుదీయుటవంటిది. "త్యజదుర్జనసంసర్గం, భజసాధుసమా గమం, కురుధర్మమహోరాత్రిం స్మరనిత్యమనిత్యతాం" అను నీతివచనానుసారముగా దుర్జనులసాంగత్యమును ప్రయత్నపూ ర్వకముగా విడనాడవలయు. లేనిచో మేఘము సూర్యుని మూ యులాగున దుష్టుల దుర్బోధలచే మనయందుఁగల వివేకమును

వెలుగు నానాట మూసిపోవును. కావున, దుర్జనుల మైత్రి విడనాడవలయు. సత్కర్మాచరణమునకు తోడుగా సదాచార సంపత్తి యుండవలయు. ఆచారము బాహ్యాభ్యంతరములని రెండువిధములు. స్నానము, ధౌతవస్త్రధారణము, తిలకధారణము, మున్నగునవి బాహ్యసంబంధములు. జపము, ధ్యానము, మున్నగునవి ఆంతర్యసంబంధములు. ఆసనము, జపమాల, పుష్పాక్షత చందన ధూపదీపాదులు బాహ్యాచారమునకుపకరణములు. శమ, దమ, శాంతి, సంతోషాదులాంతర్య సాధనోపకరణములు.

"నశ్రేయోనియమంవినా" అనుటచే బాహ్యాభ్యంతర శుద్ధిగల నియమవంతులే సదాచార సంపత్తిగల వారనందగినవారు. ఉత్తమోత్తమ విచారము నందాంతర్య శుద్ధియే ముఖ్యమైనది. బాహ్యశుద్ధి దానికుపసహాయకమైనది. సంకల్ప వికల్పములనెడు ఒడ్డులుగలదియు, ఒడ్డులందుగల ధైర్యమను చెట్లను పెల్లగించునదియు, కామక్రోధాది మొసళ్ళతో గూడుకొన్నదియు, అహంకార మమకారములను సుడులు గలదియు, దుఃఖమునెడి ప్రవాహముగలదియునగు సంసారమను నదిలో మానవుల జీవితము నీటిబుగ్గవంటిది. కావున నెవరియందును ద్వేషముంచరాదు. మఱియు విరోధము సాధించరాదు. దీర్ఘద్వేష, దీర్ఘకోప, దీర్ఘమోహాది దురభ్యాసములను, సత్సాంగత్య బలముచే వదలుకొనవలయు. సాధుసాంగత్యమునకు మించిన సౌభాగ్యమీలోకమునందింకేదియు దొరకబోదు.

"గంగాపాపంశశీతాపం; దైన్యంకల్పతరుస్తథా
పాపంతాపంచదైన్యంచ; హంతిసంగోమహాత్మనాం"

గంగానది తనలో స్నానముచేసిన వారి కల్మషమును మాత్రము పోగొట్టును, చంద్రుడు స్వకీయ శైత్యముచే ఆశ్రితుల తాపమును పోగొట్టును, కల్పవృక్షము దానిని ఆశ్రయించిన వారి

దరిద్రమును బోగొట్టును; అయితే సజ్జనుల సాంగత్యము, పాప, తాప, దారిద్ర్యాదుల నన్నిటినిఁ బోగొట్టి పరమసౌఖ్యము నొసంగును. కావున సజ్జన సాంగత్యము నవశ్యకముగాఁ జేయవలయు. సజ్జనులెట్టి వారనగా,

"సద్బుద్ధిస్సాధుసేవీ,
సముచితచరిత స్తత్త్వబోధాభిలాషీ
శాంతోదాంతోఽనసూయాశ్శరణ
ముపగతశ్శాస్త్రవిశ్వాసశాలీ
సద్ధర్మేసానురక్తస్సకలగుణ
గణస్సత్యవాచానురక్తః॥ (విజ్ఞానదర్పణము)

మంచిస్వభావముకలవారును, సాధుసేవాధురంధరులును పవిత్రవర్తన గలవారును, తామెఱింగియుండు తత్త్వార్థము నితరులకెఱింగించుటకిచ్ఛగలవారును, శాంతముగలవారును, స్థైర్యముగలవారును, అసూయలేనివారును, శరణాగతరక్షణమునందాసక్తిగలవారును, శాస్త్రములయందు విశ్వాసముగలవారును, ధర్మమునందను రక్తిగలవారును, సమస్తసద్గుణశోభితులును, సత్యవంతులునునగువారు సజ్జనులనఁబడుదురు. అంతేగాని ఒకట్రా పాండిత్యమో, విచారములేని ఆచారమోగలవారు సజ్జనశ్రేణిలో జేరుట కర్హులుకారు. వైద్యశాస్త్రమును సంపూర్ణముగా చదివినవారైనను, వ్యాధిగ్రస్తులకు ధైర్యమొసఁగి దృఢబుద్ధితో చికిత్సచేయలేక, రోగులుపడెడు అవస్థను చూచుటతోనే భ్రాంతిఁజెంది మిడుకరించెడి పిఱికివైద్యులవలె, సందిగ్ధవిషయములలో, ధైర్యమవలంబించి ధర్మాధర్మనిర్ణయముచేసికొని కార్యసాధనముగావింపలేక తాము సందేహవార్ధిలోఁబడి మిడుకరించుటేగాక, తమ్మునాశ్రయించిన వారినిఁగూడ డోలాందోళనమున త్రొక్కులాటబెట్టెడి పిఱికిపందలు ఎంతవిద్య నేర్చియున్నను ఎన్నెంతు అధ్యయనముచేసినవారైనను లోకోపకారులు కాజాలరు.

వారినాశ్రయించునట్టివారికిని, ఇహపరసాధనములను రెంటిలో ను తృణమంతయయిన లాభము కలుగదు. కావున సజ్జనత్వ మునకు, పాండిత్యమొకటే చాలదు. విద్య, వివేకము, విచా రము, విమలవర్తనము, విమర్శనాచాతుర్యము, వితరణ, విశ్వాస ము, వికాసము, వినయము, విజ్ఞానము, విన్నాణము, విరాగము, మున్నగు గుణగణంబెచ్చోటనైకమత్యమొంది ప్రకాశించునో అచ్చట సంపూర్ణ సజ్జనత్వమున్నదని యెంచవలయు. కావున ఇతరులయొద్దనుండు సజ్జనత్వమును మాత్రమే మనము నేర్చుకొన వలయు. హంస, పాలునుండి నీరును వేరుపఱచి పాలుత్రాగి నీళ్ళనువిడనాడును. అట్లే వివేకవంతులు ఇతరులందుఁగల మం చిగుణములను మాత్రమేగ్రహించి, చెడువానినివిడిచి పెట్టవలయు. శుద్ధమగుబంగారముతో నగలుచేయుటకు వీలుపడదు. దానితో నేదైన భిన్నలోహమునొకటిని జేర్చి కఱగించి యాపైనసాగగొ ట్టినచో నెంతపొడుగుగానైన తీగరాగలదు. దానిచేత కావల సిన సొమ్ములను నిర్మింపవచ్చును. అదిధరించుటకు మిక్కిలి రమ్య ముగానుండును. దానినందఱునుఁగోరుదురు. అట్లే ధర్మముగూ డ రమ్యమైన దృష్టాంతములతో కథారూపముగా లోకమునకు బోధించవలయు. అప్పుడందఱును ప్రీతిపూర్వకముగా నాలకిం తురు, దానిచే కార్యసాఫల్యముకాఁగలదు. ఆరోగ్యమిచ్చు నదేయైనను చేదుగానుండెడి యౌషధమును ఎవరోలక్ష్యకొకరు దక్క తక్కినవారు స్వీకరించరుగదా? అట్టివారి కౌషధమును మధురమగు తేనె, పంచదార, బెల్లములను అనుపానములతోఁ జేర్చి యియ్యవలయుగదా? అట్లిచ్చెడి అనుపానములగు, తేనె పంచదార, మున్నగునవిఁగూడ మంచిపదార్థములేగదా? అట్లే ధ ర్మమునుఁగూడ రమ్యమైనకథలనెడు అనుపానములతోచేర్చి బోధిం పవలయు. అట్లు బోధించుటలో, మంచిన కనుపానములగు తే నె, పంచదారలెట్లు మంచివస్తువులో అట్లే ధర్మమున కనుపాన

మఁగు కథలుగూడ మంచివైయుండవలయు. నీతిబాహ్యములై యుండగూడదు. ఈవిచారమున బోధకులు మిక్కిలి జాగ్రత కలిగియుండవలయు.

సత్యమునకు హరిశ్చంద్రుని, దానమునకు బలి, కర్ణులను, దయకురంతిదేవుని, శాంతమునకు ధర్మరాజ, తుకారామాదులను నీతికి శ్రీరామాదులను, ధైర్యమునకు అభిమన్యాదులను, పాతివ్రత్యమునకు అనసూయా, నాళాయనీ, చంద్రమతీ, దమయంతీ సీతా, సావిత్రి, సుందరా, మమతా, భవానీ, మున్నగువారిని బ్రహ్మచర్యమునకు, భీష్మ, సులభ, శ్రుతావతి మున్నగువారిని స్వామిభక్తికి ఆంజనేయాదులను సౌభ్రాతృత్వమునకు రామలక్ష్మణాదులను, దృష్టాంతముగా చెప్పవలయు. తారాశశాంకులను సుందోపసుందులను తాటకీశూర్పణఖామున్నగు వారి దుశ్చర్యలను నిందించి విడనాడవలయు.

మోక్షాపేక్షగలమానవులు పరికోరిమంచి గుణములనే యభ్యసింపవలెను.

శ్లో॥ మోక్షద్వారేద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః
శమోవిచారస్సంతోష శ్చతుర్థస్సాధుసంగమః॥

మహోపనిషత్తు.

మోక్షద్వారమునందు నలుగురు ద్వారపాలకులుగలరు. వారెవరన; శాంతము ఆత్మానాత్మవివేకము సంతోషము సాధుసంగమములనువారు. ఈనాల్గుగుణములే నలుగురు ద్వారపాలకులని యభిప్రాయము. ప్రయత్నపూర్వకముగా నొక్కొక్కటినే క్రమక్రమముగా సాధించి వశపరచుకొనవలయు. వీనిని సాధించుటయే ఈశ్వరానుగ్రహ సాధనము. వీనినిగురించిన ధర్మసంభాషణమే ఈశ్వరభజనము చేయుట.

"లోకవార్తానుగమనే జిహ్వోస్యైకాసహస్రశః
ఈశవార్తానుగమనే ద్వాత్రింశద్దంతకీలితా॥

లోకవ్యవహారములను ప్రసంగించినపుడు మనుష్యునికిఁగల ఒకనాలుక వేయినాలుకలు చేయునంతటి ధాటితో పనిచేయును. ఈశ్వరధర్మ జిజ్ఞాసమునందో ఆ ఒక నాలుకఁగూడ ముప్పదిరెండు పండ్లసందునఁజిక్కుకొని కదలమెదలలేక స్తభించిపోవును. ఈచెడ్డవాడుకను వివేకబలముచే మట్టుబెట్టవలయు. ఈశ్వరసంబంధ ధర్మములను వినుటయందు మిక్కిలి యభిరుచికలిగియుండవలయు. దేనిని చాలునని చెప్పినను చెప్పవచ్చును గాని

కం॥ భవములకుమందు చిత్త। శ్రవణానందము ముముక్షు
జనపవనము హరి। స్తవము పశుఘ్నుఁడు దక్కను।
చెవులకు దనివయ్యెననెడి చెనటియుఁగలఁడే॥

(భాగవతము.)

పాపరోగమున కౌషధంబును; శ్రవణమానసానందకరంబును; మోక్షాసక్తుల కత్యంతావశ్యకంబును నైన భగవంతుని దివ్యస్తోత్ర కథాలాపములను పశుహంతకుఁడగు చండాలుఁడు దక్క తక్కిన వారు చాలునని విసుగుఁజెందరని తాత్పర్యము.

కం॥ ఏకథలయందుఁబుణ్య। శ్లోకుఁడు హరి చెప్పఁబడును
సూరిజనముచే। నాకథలు పుణ్యకథలని। యాకర్ణించు
దురు పెద్దలతిహర్షముతోన్॥ భాగవతము.

ఎట్టికథలయిననుసరే ఈశ్వరనామములోఁ గూడియున్నచో అది పవిత్రమయినదని యభిప్రాయము. అనగా ఎట్టికథలయిననుసరె యనుటలో బండబూతులతోనిండిన్న కథలను కల్పించి వానిమధ్యనుండొకచోట భగవన్నామము నుంచినంతటనే యాకథాభాగమంతయు మంచిదగునా? ఎన్నటికిని కాజాలదు. అందలి భగవన్నామముమాత్రము మంచిదేతప్ప కథమంచిదికాదు పైపద్యమునందు సూరిజనముచే• యని వివరముగా పరిష్కరింపఁబడియున్నది. సూరి యనునది జ్ఞానపరిపూర్ణుఁడగు మ

హాత్మునకన్వయించునట్టి నామము. అట్టిమహాత్ములెన్నడును పవిత్రమయిన కథలను చెప్పుదురే కాని నీతివిరుద్ధములగు కథలను చెప్పఁజాలరు. అన్నినీళ్ళయందును నారాయణుండంతర్యామియై యున్నను బురదనీళ్లు త్రాగుట కర్హము కానట్లు అంతటను అన్నికథలయందును భగవన్నామము చెప్పఁబడియున్నను నారాయణుండెడి బురదనీళ్ళను మనము త్రాగక విడిచిపెట్టునట్లు; దుష్టకథలను విడనాడవలయు. మనము కొన్నిపదార్థములను కొనుటకై సంతకుబోయినచో సంతకూడియుండు చోటికి దూరమున నుండువరకు హోహో యను అర్థములేని శబ్దమే వినబడుచు చిత్తమును కలతబెట్టుచుండును. అయితే సంతలోపల ప్రవేశించినపిదప అస్పష్టమైన మొదట గద్దలము మనలను బాధింపదు. మనకేయే అంగడిలో నేయేపదార్థము కావలయునో ఆ యాపదార్థములను వెలకుదీయుచు నెవరితోఁ గావలసిన వారితో మాట్లాడవచ్చునుగదా? అట్లే గొప్పసంతకూటమనఁదగు నీప్రపంచమునంతను భరించియుండు మహాప్రభువగు దేవునియొక్క సత్యతత్త్వము నెఱుంగకయుండునంతవరకు మనలను అర్థములేని మూర్ఖాచారములు మతమత్సరములు మున్నగు నెన్నియో గద్దలములు బాధించుచుండును. కాని, దేవునిదివ్యసాన్నిధ్యమునకు మనము సమీపించునట్లంతయు చెడ్డవాదుకలు మతమత్సరములు వితండవాదము లాదిగాగల తంత్రములన్నియు నణగిపోవును. అంతట దురభిమానములన్నియు క్రమక్రమముగా నశించి ఆనందము జీవకారుణ్యము నెమ్మది కలుగును.

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాఽప్యహమ్

(భగవద్గీత అ ౯-౨౯.)

అర్జునా! నేను సర్వభూతములను సమదృష్టితోఁ జూచుచున్నాను, నాకు ద్వేషార్హుఁడును ప్రేమార్హుఁడును లేఁడు.

భక్తితో నన్ను భజించువారెవరో వారు నాయందున్నారు. నేనువారియందున్నానని గీతాచార్యుఁడగు శ్రీకృష్ణమూర్తియాన తిచ్చియుండుటవలన భగవంతునకొక మతము లేక యొకదేశము వారు ప్రియులనియు వేరొకమతము గాని దేశమువారుగాని విరోధులనియు లేదు.

భక్తియొక్కటే ప్రాధాన్యమైనది. "మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ" మోక్షసాధనమునకు భక్తి యొక్కటే ముఖ్యమైనదని వివేకచూడామణిలో శ్రీఆదిశంకరుల నుగ్రహించియున్నారు. భక్తిలేనిపూజ పత్రిరిచేటు అని శ్రీవేమన గారును భక్తినే యెక్కువయనినారు. ఈలోకమునందు కలుగఁ గల సర్వశుభములకును పరలోకసాధనమునకును భక్తియే ప్రధానమైనది.

భక్తియనగా సాధుసజ్జనులాదిగాగల మహనీయులను గౌరవింపక యొకవిగ్రహమునకెదుటగూర్చుండి పువ్వులతో పూజించుట మాత్రమే కాదు.

శ్లో॥ అర్చాయామేవ హరయే పూజాంయశ్శ్రద్ధయేహతే
నతద్భక్తేషుచాన్యేషు సభక్తః ప్రాకృతః స్మృతః॥
(భాగవత-ఏకాదశస్కంధము)

శ్రద్ధగాప్రతిమార్చనను చేయుచుండువాడు భగవద్భక్తులు సాధువులు మున్నగువారిని గౌరవింపడేని వాడు అధమభక్తుడని శ్రీమహాభాగవతమునందున్నది. కావున భక్తునకు జ్ఞానులయందు విశ్వాసగౌరవములును, భూతదయయు ముఖ్యముగా నుండవలయు.

(సశేషము.)

కారుపల్లి. శివరామయ్య.

# శ్రీకైవల్యమంజరి.

(72-వ పుట శేషము.)

నభ్యసించితివేని నలవడు నీకు.
మన్నానసహాన్నాన సమనుజులకెల్ల
మట్టుమీఱుచు సాగు మహిలోన నెపుడు.
మన్నుహొన్నును వేగ మాయంబుఁ జెందు.
వానిఁ గోరఁగ రాదు వర్జింపవయ్య.
ఈవివేకము గల్గెనింతకుమున్నె.
మాటమాత్రమె గాక మదిలోన నిదియుఁ
జక్కఁగా నాటిన సర్వవాంఛలును
మూలల దాగుచు మొదలెత్తవోవు.
ఇంతకు నేర్పుట యెవ్వరికైన
సువివేకముబ్బిన సుకరంబుగాదె.
స్వర్గసుఖంబును స్వాత్మమోక్షమును
గాంక్షించి యిహలోక కార్యంబులెల్ల
విడనాడి తిరుగుచు విశ్వంబునందుఁ
బెద్దలమను వారు పెక్కండ్రు గలరు.
తెలివిలేమిదిసుమ్ము తెంపున నీవు
దూరంబుగా దీనిఁ ద్రోయంగవలయు.
తన్నుఁ దామఱచినఁ దన మోక్షమేల?
స్వర్గమెట్టిదియైన వాపోవనేల.
గొప్పఫలంబును గోరిన నేమి
తాఁబొందఁ గోరినఁ దప్పక తనకు
బంధకంబది యగు భావించి చూడ.
తుదముట్టఫల కాంక్షఁ ద్రోయక యున్న
గురుసేవ కొఱలేక కూర్పంగ లేవు.

తనమేలె కోరుట తప్పిన నేమి
తన కార్యఫలమును దాఁ జూడఁ గోరిక
విడుచుట కష్టంబు వెంబడి వచ్చు.
ఒరునికై నొక కార్యమొనరించి దాని
ఫలమెంతుకోయంచుఁ బరికింపుదేమొ.
పెఱవాఁడు దానిని బెద్దగాఁ జూచి
నీకును మ్రొక్కంగ నెఱిఁ గోరుదేమొ.
కర్తృసంగంబిది కడు శ్రద్ధ లేమి.
శక్తికొలఁది నీవు సాయంబు చేసి
కనినను గనకున్నఁ గలుగును ఫలము.
కర్మమర్మంబది కడవంగ రాదు
ఫలమునొక్కింతయుఁ బాటింపకీవు
ధర్మంబెఱిఁగి చేసి ధర్మంబు నడపు.
దయయను పాములోఁ దలచూపి నిక్క
పరహితలత భువిఁ బ్రాకవర్తింపు.
యోగసిద్ధులఁ గోరయుక్తంబు గాదు.
తఱియగు నేన వితామె సిద్ధించు.
వేగిరపాటున వికసింపఁ జేయ
విపరీతములు వాని వెనుఁదన్ని వచ్చు.
త్వరపడి సిద్ధులఁ దానందె నేని
టక్కు దయ్యంబుల టక్కులఁ జిక్కి
గ్రుక్కుమిక్కనలేక గోడొందు వాఁడు
తలక్రొవ్వుతో వాఁడు తానెఱుంగనిది
భువిలోన లేదని పొంగుచునుండు.
సిద్ధులఁ బొందంగఁ జెల్లు కాలంబుఁ
గష్టంబుఁ బరహిత కార్యంబులందు
సవరించుటదిగదా చక్కని తెలివి.

అధికారివగు దేనినప్పుడెనీకు
సిద్ధులుతప్పక చేకూఱునుసుమ్ము.
నీవిప్పుడే వానినింపారఁగనుట
బాగనితోఁచినఁబడయుమార్గంబు
గురుఁడుపదేశించుఁగూర్చునునీకు.
అందాఁక లేకుంటయత్యంతసుఖము.
సాధారణంబిదిజనులకునెల్లఁ
జిన్నకోరికలెన్నొచిగురొత్తుచుంట.
వానికిదవ్వులవర్తింపవయ్య.
నీప్రతాపముఁదెల్పనిక్కఁగాఁబోకు.
ప్రావీణ్యమునుజూపఁబగ్గలాడకుము.
మాటలసివమెత్తిమాటాడఁబోకు.
మితభాషణమునీకుమేలగుసుమ్ము.
సత్యంబుఁబ్రియమునుసర్వహితంబుఁ
గాదేనిమౌనంబెకడుమేలుసుమ్ము.
పలుకిట్టిదేయంచుఁబరికింపవలయుఁ
గాకున్ననద్దానిఁగడఁద్రోయవలయు.
పరికించిపలుకుటపరమయుక్తంబు.
దానినిప్పుడెకూర్పఁదలఁచుటమేలు.
బ్రహ్మోపదేశంబుఁబడసినయపుడుఁ
బలుకులలెక్కించిపలుకంగవలయుఁ
గాకున్న నేమఱికడుదాచఁదగిన
మర్మంబువెలివడమాటలుజాఱు.
సాధారణంబగుసల్లాపమెన్న
వ్యర్థమజ్ఞానంబువరదలుపాఱు.
పరనిందయగు నేనిఁబలుగాకితనము.
వదరుటకంటెనువాసియాఁకొనుట.

పేరొకని పిలువని పేరంటమేగి
యోగుబాగులఁ జూపి యుగ్గడింపకుము.
జ్ఞానంబు ధైర్యంబు సంకల్పబలము
మానంబు ననునివి మన్నింపఁదగిన
మోక్షసాధనములు ముఖ్యంబులండ్రు.
కడ దాని సాధింపఁగడుఁ గష్టమయ్య.
పరుల కార్యంబులఁ బైఁబూసికొనుట
జనులకు సహజంబు చక్కఁగాదీని
మొదలంటఁ గోయుట ముఖ్యంబు నీకు.
పరుల భావంబులు పలుకులు పనులు
నీకేల తమయిచ్చ నెఱి సాగనిమ్ము.
పెఱవారి కడ్డంబు పెనఁగొనకున్న
తమతమయిష్టంబె తలయెత్తవచ్చు.
తగునని తోఁచిన దానిని నీవు
కొంకక చేయంగఁ గోరుము గాదె.
అటుగాన నీవెప్పు నడ్డంబు పోక
పరులను స్వేచ్ఛతోఁ బని సేయనిమ్ము.
వారెట్లు నడచిన వారియిష్టంబు
తప్పులుపట్టుట తగదయ్య నీకు.
పరుఁడెవ్వఁడైనను బథమును దప్పి
తప్పుచేసెడినంచుఁ దలఁచితివేని
జనులెవ్వరును లేని సమయంబుఁ జూచి
తియ్యని మాటలఁ దిన్నగా వాని
దిద్దుచుఁ ద్రోవకుఁ దెచ్చుట మేలు.
ఇంత మాత్రంబైన హితమును దెల్పఁ
బోరాని చోటులు పుడమిలో మెండు.
ఎదియెట్టు లేగిన నెగ్గులాడుచును

బరులతోనద్దానిబలుకంగఁబోకు.
పరనిందమిక్కిలిపాపంబుసుమ్ము.
నోరులేనిపసులనొప్పించుచున్న
ముద్దుబిడ్డలఁదిట్టిమోదుచుండినను
వారించుటనిధర్మవర్తనంబగును.
రాజాజ్ఞమీఱుచురాయిడిచేయు
తులువలరచ్చకుఁదోలంగవలయు.
విద్దెబుద్ధులుచెప్పివిద్వాంసుఁజేయఁ
దనకప్పగించినఁదప్పులుదెల్పి
తిన్నగావానినిదీర్చంగవలయు.
తక్కినచోటులఁదనపనిఁగనుచు
నోరెత్తకుండుటనుతికెక్కుతెరువు.

## తృతీయకుసుమము.

సద్వర్తనంబునుసవరింపవలయు.
శమముదమంబునుజరుగనావెన్క
నుపరతియుఁదితిక్షయునువీనితోడఁ
దగుసమాధానంబుతఱఁగనిశ్రద్ధ
యననాఱుతెఱఁగులనయ్యదియొప్పు.
వేర్వేఱవీనినివివరింతువినుము.
తనయిచ్చఁబోనీకతగుమార్గమున నె
కామదేహంబునుగడకతోనిల్ప
వైరాగ్యమనిమున్నెవచియింపఁబడియె.
మానసతమువిట్టుమరలించినడప
శమమగునద్దానిసాధింపవయ్య.
మూఁడుదేహంబులముత్తెఱంగులుగ
నానాటశమమునునాటంగవలయు.

తుచ్ఛకోపంబును దుందుడుకఁ ణంగి
కడుమాయునట్టుగఁ గామదేహంబుఁ
జక్కఁగా నిలుపుచు సాధించుటొకటి.
కళవళపాటిక గాంభీర్యమంది
భావమే వేళను బ్రసరించునట్టు
మనసును జేకొని మర్దించుటొకటి.
ఇంతకునంతకు నెంత యోయనుడుకు
నాడులను ప్రశాంతినానాటఁ జేర్చి
మనసు చేనుడుకెల్ల మాన్పుట యొకటి.
కడ దాని సాధింపఁ గష్టంబు సుమ్ము.
మోక్షమార్గముఁ ద్రొక్కఁ మొదలిడినపుడె
సర్వాంగకంబున శక్తులన్నియును
వింత వాఁడిమిఁ గాంచి వికసింపఁ జొచ్చు.
దాని చే నాడులుత్తలపడుచు
చిన్నమంతయు సద్దు చెవి సోకెనేని
దబ్బాటదుఃఖంబు దాటించెనేనిఁ
జిడిముడిపాటుతోఁ జేడ్పాటుఁ జెందు
గోరంత సోఁకినఁ గొండంతఁ జేయు.
శక్తికొలఁది దీని సాధింపవయ్య.
మాలిన్య మెడలిన మానసంబందు
శాంతితో ధైర్యంబు స్థైర్యంబుఁ గలుగు.
మోక్షమార్గంబున ముట్టడి వేయు
బలుసంకటంబులఁ బరిశోధనలను
ధైర్యంబుతో డప్పుడ దాటంగవచ్చు.
జనులకుఁ గష్టముల్ సహజంబు గాదె.
చినచిన్న పనులకుఁ జిత్తంబు చెదరి
యెల్లప్పుడును వాని నెదలోనఁ దలఁచి

వనటచేఁగొందలు వాడుచున్నారు.
స్థైర్యమబ్బినవీనిదాటంగవచ్చు.
వెలుపలిబాధలు వేయైన నేమి
దుఃఖంబురోగంబుతుద లేకయున్న
కష్టంబునష్టంబుఁగడుఁజుట్టుకొన్న
లేశమాత్రంబైన లెక్కింపరాదు.
మనసులోశాంతంబుమానంగరాదు.
గురువాక్యమియ్యదికొనియాడవయ్య.
తొలుమేనఁగట్టినదుష్కర్మఫలము
కుడువకపోదదిగోడులఁగుడుపు.
కష్టమెల్లను వేగఁగడ వెళ్లుననుచు
సంతోషముప్పొంగఁజరియింపవలయు.
చిత్తమానందంబు చిగురొత్తుచుండఁ
గలకాలమెంతయు గాంభీర్యమొంది
నిశ్చలంబుగనుంటనీకుధర్మంబు.
కష్టముల్ మును మేనికర్మంబుఫలము.
వానిమాన్పగరాదు వారింపఁబోదు.
వానికైకుందుటవ్యర్థంబుసుమ్ము.
ఇప్పటినీపను లెన్నుట మేలు.
పరికింపనివిగా వెఫలమిచ్చునింక.
రానున్నజన్మంబు రాజిల్లఁజేయ
'నీచేతనున్నదినిక్కంబుసుమ్ము.
దుఃఖంబు దెసనైనఁదొంగిచూడకుము.
దిగులందిదీనతదిగఁబడఁబోకు.
నీచభూతంబిదినినుసోఁకెనేని
నీతోడఁబోదయ్యనినుఁజేరవచ్చు
వీరివారినిబట్టివేధింపఁబూను.

పరుల బాధించుట పాడియే నీకు.
నిను సోఁకఁ జూచిన నిమిషంబె దాని
నుచ్చాటనముఁ జేయ నొప్పగు సుమ్ము.
తనయిచ్ఛఁ దిరుగు నుదక్కరి మనసు.
జతనంబుతో దానిఁ జక్కగా నిలుపు.
ముట్టిన కార్యంబు ముక్కాక దీఱ
చిత్తమంతయు నందె చేర్పంగవలయు.
తేరకు చిత్తంబు తిరుగఁ బో నీకు
పని లేని వేళలఁ బరమార్థములనె
భావింపఁ జేయుట పథ్యంబు సుమ్ము.
సంకల్పశక్తి చే సాధింపరాని
పను లెవ్వియును లేవు భావించి చూడ
సత్కార్యముల దాని సార్వకాలంబుఁ
బ్రవహింపఁ జేయుట భావ్యంబు సుమ్ము.
జగముద్ధరించుచుఁ జరియింపవయ్య.
తొలఁగఁ ద్రోయఁగరాని దుఃఖంబులంది
పడరాని కష్టముల్ పడుచుండు వారు
నీ వెఱింగిన వారు నెఱిగూర్చు వారు
జగతిలో నెందఱు జనులు లేరయ్య.
రేపుమాపును మదిరిత్తవోకుండ
వారిమీదను బ్రీతి వర్షింపవయ్య.
అవివేకమునఁ బుట్టు నమితగర్వంబు.
గర్వంబు చెంతకుఁ గలనైనఁ బోకు.
గొప్పవాఁడను నేను గొప్పకార్యముల
సాధించినాఁడ నాసరి యెవ్వరనుచుఁ
దెలివిమాలిన వాఁడు ద్రిమ్మరుచుండు.
పరమేశుఁ డొక్కఁడే పరికింప గొప్ప

వాఁడెయన్నింటినివర్తింపఁజేయు.
వాఁడొక్కరుఁడెకర్తవసుధలోననుచుఁ
దలపోసిసుజ్ఞానిదర్పంబువిడచు.

దమమునుసాధింపఁదలపెట్టవలయు.
తలఁపులుతగురీతితప్పకయున్నఁ
బనులన్నియునునట్లైపరగునుసుమ్ము.
మంచితలంపునీమదిలోనెయున్నఁ
బరులకుదానిచేఫలమేమిగలుగు.
వెలుపలకార్యమైవెలయంగవలయు.
పరులకప్పుడుగదాఫలమియ్యఁజాలు
సోమరితనమునసోలుటమాని
సత్కార్యమెప్పుడుఁజక్కగానడపు.
నీధర్మమునెకోరినెమ్మిసాధింపు
పరధర్మములఁబూనిపాలింపఁబోకు.
పెఱవాఁడునినుఁగోరిపిలిచినయేని
వానికిఁదోడ్పడవాంఛింతువేనిఁ
బరుకార్యములఁదూఱఁబాడియౌనీకు.
తమకోరువిధమునఁదమతమపనుల
నెరవేర్పఁబోనిమ్మునీకవియేల?
జనులకుఁదోడ్పడసార్వకాలంబు
సిద్ధంబుగానుండిసేవింపవలయు.
పరికింపకెంతయుఁబైఁబడగాదు
పరులజోలికిఁబోయిపనిచేటుచేసి
పెరిమెతోఁదలవీచుపెద్దలుమెండు.
వారిమార్గమునీవువర్జింపవయ్య.

గొప్పకార్యంబులఁగూర్పంగఁజూచు
నాకేలయివియంచునవ్వుచునీవు

సామాన్యకృత్యముల్ చాలింపఁబోకు.
వీనిసాధించిన వెనుక నెసుమ్ము
వానిఁ జేయఁగనీకు వశమగునయ్య.
కావరంబునఁ గ్రొత్త కార్యభారంబుఁ
దల కెత్తికొని నీవు తాండవింపకుము.
మునుపటిపను లెల్ల మొక్క పోకుండ
నెమ్మదిఁ జేయుట నీకు ధర్మంబు.
నీమనసున కెక్కు నిర్మలంబగుచు
నింపారు కార్యంబు నీధర్మమనుచు
భావించి దానిని బాటింపవయ్య.
పరులు వంచన తోడ బలవంతముగను
నీధర్మమని చెప్పి నీమీదఁ బెట్టు
లేనిపోనిపనిని లెక్కింపఁబోకు.
పరులకంటెను నీవు బలువాసి గాఁగ
సామాన్యకృత్యముల్ చక్కగానడపి
పరమేశుప్రీతికిఁ బాత్రుఁడుగమ్ము.
తక్కువపడు నేనిఁ దప్పగుసుమ్ము.
పరమేశుకొఱకునై పనులెల్లఁ జేసి
వానికర్పించుచు వర్తింపవలయు.
ఉపరతిఁ గూర్పంగ నూహింపవయ్య.
సహనమందురు దీనిజగతిఁ బెక్కండ్రు.
సంపూర్ణమగు నోర్పు సర్వంబునందు
ధరియించుటది సుమా ధర్మంబు నీకు
నీమతంబున భక్తి నీకొప్పుగాదె

(శేషము.)

పి. సీతాపతయ్య.

# స్నానము.

పిదప స్నానము చేయవలయు. ఉషఃకాలస్నానము సుఖమునుగోరు ప్రతిమనుజునికి అత్యావశ్యకము. ఇది కేవలమాచారమునకే గాక శరీరారోగ్యమునకు సయితము దివ్యౌషధము అరుణోదయకాలమందు చేయుస్నానము పిత్తోష్ణములను నశింపజేసి మనస్సునకుల్లాసమును గలిగించు. కావున ధన్వంతరి

శ్లో॥ ప్రాతస్స్నాతనరస్యపాపహరణందుస్స్వప్నవిధ్వంసనం
శౌచస్యాయతనంమలాపహరణంసంవర్ధనంతేజసాం
రూపద్యోతకరంశరీరసుఖదంకామాగ్నిసందీపనం
స్త్రీణాంమన్మథగాహనంశ్రమహరంస్నానేదశైతేగుణాః

ప్రాతఃకాలమందు స్నానము చేయువానికిపాపమునశించు. దుస్స్వప్నశాంతిగలుగును. పరిశుభ్రత కలుగును శరీరమందుగల మురికిపోవును. తేజోవృద్ధియు శరీరశోభయును శరీరసౌఖ్యమును జఠరాగ్నిదీపనము స్త్రీలకు కామోద్రేకము శ్రమనివారణము మొదలగుగుణములు గలుగునని చెప్పియున్నాఁడు. గనుక అరుణోదయకాలమందు శీతలోదకముచేత స్నానమును చేయవలయును. ఈస్నానముచేత భిషగ్వర్యులకసాధ్యములగు వ్యాధులు సయితము తప్పకనశించును. ఉషఃకాలమందు నద్యాదులయందు స్నానముచేయుటముఖ్యము. ఎందులకన అప్పుడు అగస్త్యోదయమగుననియు ఆఅగస్త్య ప్రసారమువలన ఉదకమందుగల కలుషమునశించి ఒకవిధమైన తేజోత్పత్తిగలుగుననియు అట్టిజలమందు స్నానముచేసిన శరీరమందుగల వ్యాధులు నశించి ఆరోగ్యముచేకూరుననియు పెద్దలుచెప్పెదరు. ఆఅగస్త్యప్రసారము భవనాంతర్గతకూపోదకములయందు కలశోదకములయందుకలుగ నేరదు. తత్ప్రసారశూన్యమగు జలముశరీరమున కెక్కువ సౌఖ్యమునుగలుగచేయనేరదు. కావుననె పురాణములయందు "ఉత్త

మంతునదీస్నానం'' అనిచెప్పబడియున్నది. ఆచారమును గురించి విచారింతము. స్నానమును చేయకేకర్మమును చేయగూడదు. నవఛ్ఛిద్రమగుశరీరము దివారాత్రులందు స్రవించుచుండుటచేత అపరిశుద్ధుడగుచున్నాడు. అపరిశుద్ధుడే కర్మమును జేసినను తత్ఫలమునుపొంద నేరడు (కూర్మపురాణమందు).

శ్లో॥ అస్నాత్వానాచరేత్కర్మజపహోమాదికంచయత్
అజ్ఞానాద్యదివా మోహాద్రాత్రౌదుశ్చరితంకృతం
ప్రాతస్నానేనతత్సర్వంశోధయంతిద్విజాతయః॥

స్నానమునుచేయక జపహోమాదికర్మమునుచేయరాదు అజ్ఞానమువలనగాని మోహమువలనగాని రాత్రియందుచేయబడిన దుష్కర్మమును ప్రాతఃకాలస్నానముచేత ద్విజులుపరిశోధనచేసికొనుచున్నారు, అనిచెప్పబడియున్నది ఇంతేగాక

శ్లో॥ సర్వమర్హతిశుద్ధాత్మాప్రాతస్నాయీజపాదికం

ప్రాతఃకాలమందు స్నానముచేయు మనుజుడు నిర్మలమనస్సుగలవాడై సకలకర్మముల కర్తయగుచున్నాడు. ఈస్నానమును యథావిధిగ నొనర్చిన శరీరసౌఖ్యాదిక మలవడుటయేగాక ఆముష్మికఫలముగూడ తప్పక చేకూరును. స్నానవిధానమునుగూర్చి విచారింతము. ఉషఃకాలమందు శౌచాదికర్మముల నివర్తించుకొని పిదప నదికివెళ్లి గంగాష్టకమునుపఠించుచు నాభిమాత్రజలమందున్నవాడై మూడుపర్యాయములును స్నానముచేయవలయు. (విష్ణుపురాణమందు).

శ్లో॥ నాభిమాత్రజలేస్నాత్వాకృత్వాకేశాద్విధాద్విజః
నిరుద్ధకర్ణనాసస్తుత్రివారంమజ్జనంచరేత్

బొడ్డులోతు నీటనిలచి సిగనురెండుపాయలగావిప్పుకొని చెవులును ముక్కునుమూసికొని ముమ్మారుస్నానముచేయవలయును. అనిచెప్పబడియున్నది. ఇంతేగాక

శ్లో॥ త్రిరాప్లుత్యసమాచమ్యశిఖాంబధ్వాసమాచమేత్

ప్రాణానాయమ్యసంకల్ప్యత్రివారంమజ్జయేత్సునః॥

మూడుమారులుమునిగి ఆచమించి సిగనుముడివైచుకొని మరలనాచమించి ప్రాణాయామమును చేసి మరలసంకల్పము చేసి ముమ్మారుస్నానము చేయవలయు. ఈస్నానమునకు ఐదంగములు. ఈపంచాంగపురస్సరముగా చేయు స్నానము మిక్కిలి యుత్తమమైనది. యీఐదింటిలో (1) సంకల్ప (2) సూక్తపఠనము (3) మార్జనము (4) అఘమర్షణము (5) దేవాదితర్పణము. ఈసంకల్పము దేశకాలసంకీర్తన పూర్వకముగా చేయబడుచున్నది. బ్రహ్మాండాదిస్వగృహాపర్యంతముగల మహత్వాలఘుత్వాదిద్యోతకములగు వచనములతో చేయునది దేశ సంకీర్తనము. సృష్ట్యాద్యైతత్క్షణ పర్యంతముగల కాలబోధకములగు వచనములతో చేయునది కాలసంకీర్తనము. ఇటుల దేశకాలములను జెప్పి ప్రతికర్మము నారంభింతురు ఈసంకల్పము 1. మహాసంకల్పము 2. సంకల్పము 3. లఘుసంకల్పము అని మూడువిధములుగాబరగుచున్నది. ఇందుమహాసంకల్పము కన్యాదానాదులయందు చెప్పబడును. 2. సంకల్పము ప్రతికర్మము నారంభించునపుడు 3. లఘుసంకల్పము ఏకకర్మాంగములగు నవాంతరకర్మముల కారంభమందును చెప్పబడును. శుభే ముహూర్తేప్రీత్యర్థంస్నాన మహంకరిష్యే అనిసంకల్పమును జేసి పిదప హిరణ్యశృంగంవరుణంప్రపద్యే అనుసూక్తమునుపఠించవలయును. 3. అపోహిష్ఠామయోభువః మొదలగుమంత్రముల చేత మార్జన జేసికొనవలయు. 4. యదపాంక్రూరం అనుమంత్రమును జెప్పుచు బొటనవ్రేలితో యజ్ఞోపవీతమునుగ్రహించి జలమును మూడుమారులు కుండ్రముగాను ప్రదక్షిణముగాను త్రిప్పుచు ఆమధ్యభాగమందు ఋతంచేత్యఘమర్షణ సూక్తపఠనము చేయుచు స్నానమును చేయవలయు, పిమ్మట 5. దేవర్షిపితృతర్పణములను చేయవలయును బ్రహ్మాండపురాణమందు

శ్లో॥ స్నాత్వాతీరంసమాసాద్యస్థిత్వాచమ్యవిధానతః
స్థిత్వాపునఃపూర్వముఖఉత్తరస్యోథవాద్విజః
పాదౌద్వౌయుగ్మతఃకృత్వాపూరయేమదకాంజలిం
గోశృంగమాత్రముద్ధృత్యజలమధ్యేజలంక్షిపేత్

స్నానమైన పిదప తీరమునుపొంది ఆచమనమునుచేసి ప్రాఙ్ముఖుడైగాని యుదఙ్ముఖుడైయుండి రెండుపాదములను జతగాచేర్చి అంజలిని యుదకముచేత పూరించి యంజలిని గోశృంగప్రమాణమెత్తి ఉదకమధ్యమందాజలమును విడువవలయు.

శ్లో॥ దేవతీర్థేనవై దేవాఋషితీర్థేనవైఋషీన్
పితౄంశ్చపితృతీర్థేనస్నానాంతేతర్పయేత్క్రమాత్
కనిష్ఠదేశిన్యంగుష్ఠమూలాన్యగ్రంకరస్యతు
ప్రజాపతిపితృబ్రహ్మదేవతీర్థాన్యనుక్రమాత్॥

కనిష్ఠకామూలము ప్రజాపతితీర్థము దీనినే ఋషితీర్థమందురు తర్జనీమూలము పితృతీర్థము అంగుష్ఠమూలము బ్రహ్మతీర్థము కరాగ్రము దేవతీర్థము అనిస్మృతికారులుచెప్పియున్నారు. కావున ఆయాతీర్థములచేత ఆయాదేవతలకు తర్పణముచేయవలయు ఇటుల స్నానమునుచేసిన పిదప.

శ్లో॥ యన్మయాదూషితంతోయం శారీరమలసంయుతం
తస్యపాపవిశుద్ధ్యర్థం యక్ష్మాణంతర్పయామ్యహం
అసంస్కారాశ్చయేకేచిజ్జలాశాఃపితరోమమ
తేషామాప్యాయనార్థాయదీయతేసలిలంమయా॥

అనియీరెండుశ్లోకములను చదువుచు అంజలితో యుదకమును రెండుపర్యాయములు ఒడ్డునందుంచి పిమ్మట వస్త్రమును నాలుగుమడతలుబెట్టి ప్రాచీనావీతియయి పిండవలయు.

గొల్లపూడి. శ్రీరామశాస్త్రి,
వంగవోలు.

───※───

# గ్రంథవిమర్శనము.

కడప మునిసిపల్ హైస్కూల్ తెలుఁగుపండితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిచే రచియింపఁబడిన "శ్రీమదాంధ్ర బ్రహ్మాండపురాణము" అనునాంధ్రపద్యకావ్యము గడు గొప్పగ్రంథము. బ్రహ్మాండపురాణమనునది దీనికిసార్థకనామమై యొప్పుచున్నది. దీనియందారేవేలనూటపంద్రెండు పద్యములున్నవి. ముద్రితగ్రంథము 824 పుటలనిండియున్నది. ఇదిగాక పీఠికలు భూమికలు పండితాభిప్రాయములు విషయసూచిక మొదలగు ననుబంధములు సుమారు 60 పుటలున్నవి. పెద్దఅక్షరములతో మంచికాగితములమీద సొగసుగ ముద్రింపఁబడి చక్కగ బైండుచేయఁబడియున్నది.

ఇఁక విషయమన్ననో ఇయ్యది సంస్కృతముననుండు నతిప్రాచీనగ్రంథమగు బ్రహ్మాండపురాణముయొక్క భాషాంతరీకరణము. ఇదియష్టాదశమహాపురాణములలోనొక్కటి బ్రహ్మాండముయొక్క సృష్ట్యాదిచరిత్రమును ప్రశంసించునదిగావున దీనికీనామముగలిగె ఇందుసృష్టిక్రమము, సప్తద్వీపవివరణము, భారతవర్షాదివర్ణనము, యుగనిర్ణయము, శ్రౌతస్మార్తధర్మములు, వేదవిభాగము, పంచయజ్ఞలక్షణము, శ్రాద్ధవిధులు, శ్రీరామ శ్రీకృష్ణ పరశురామాద్యవతారచరిత్రములు సగరాది పూర్వచక్రవర్తులకథలు మొదలగు ననేకములగువిషయములు వివరింపఁబడియున్నవి.

శైలిద్రాక్షాపాకమును లక్షణసమన్వితమును రసవంతమునై యొప్పుచున్నది. కవిత్రయమువారి శైలితో సరిబోల్పఁదగునన్ననతిశయోక్తిగానేరదు. భాగవతపురాణముం దెనిఁగించిన బమ్మెరపోతనార్యునివలెనే యాంధ్రీకరించుటచే గ్రంథకర్తగారాంధ్రలోకమునకు మహోపకారముం గావించినవారైరి.

——:0:——

## CONTENTS OF THIS NUMBER.

—:o:—



—:o:—

**Registered No. M. 716.** :

ఓమ్



# దివ్యజ్ఞానదీపిక.

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్రదివ్యజ్ఞానమాసపత్రిక.

(సత్యమునకంటె వేరొకధర్మములేదు).

సంపుటము 5. | **July 1914.** జూలైనెల 1914. | సంచిక 4.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్



# దివ్యజ్ఞానదీపికః

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 5. { July 1914. జూలైనెల 1914. } సంచిక 4.

## మహాపురుషుడవతరించుటకిదిసమయమా?

(97-వ పుట శేషము.)

మనుష్యుల మనోభావముల ననుసరించియు, తదనుగుణ్యంబులగు జీవికవృత్తులనుపట్టియు వర్ణములు అనగా తెల్లని, యెఱ్ఱని, పసుపు, నల్లని ప్రభ వారినిచుట్టియుండునని వ్రాయబడెను గదా! ఈ తేజో భేదములననుసరించి వేర్వేరు తేజస్సుగల వారు వేర్వేరుగుంపులుగా నేర్పరచబడి ఒక్కొకగుంపువారికి ఒక్కొక పేరిడబడెను. తెల్లని తేజస్సుగలవారి సమూహమునకు బ్రాహ్మణులనియు, యెఱ్ఱని తేజస్సుగల గుంపుకు క్షత్రియులనియు, పసపువర్ణముగల సంఘమునకు వైశ్యులనియు, నల్లనిరంగుగల మూకకు శూద్రులనియు నామములియ్యబడెను. వీరందరు తమతమ మనోబల, దేహసామర్థ్యముల ననుసరించి చేయు పనులన్నియు పరస్పరానుకూలమైనకును, లోకక్షేమమునకును, సర్వభూతహితమునకును తగినటులుండుటకు ప్రతిగుంపువారికి

వేర్వేరుకర్తలు, మహనీయులగు మన్వాదులు నియమించిరి. ఈవేర్వేరు గుంపులవారు వారివారిమనోదేహ నైర్మల్య బలంబులనుపట్టి చేయదగినపనులకే వర్ణధర్మములని పేరు. ఇక్కడ ధర్మమన చేయదగినపని (Duty). ఈవర్ణభేదములేర్పడిన తరువాత బహుకాలమువారివారి ధర్మములు తప్పక స్వలాభమపేక్షింపక లోకహితార్థమైచేయుచు దానిఫలంబగు సుఖంబును, శాంతియుచెంది అభివృద్ధినొందుచుండిరి. ఎవరెవరికే ధర్మము (పని)చేయుటకుసాధ్యమో ఆపనికి స్వధర్మమని పేరు. ఎవనికిగాని చేయుటకలవిగానిపని స్వధర్మమనబడదు. అన్నిజాతులవారును (వర్ణములవారు) తమధర్మమును (చేతనైనపనిని) సర్వభూతహితార్థమై ఆచరించుచు సిద్ధిచెందుచుండిరి. జగత్తునందు చేయవలసిన పనులన్నియు భగవంతునిపనులుగాని వేరుకావు. పనులందు నీచోచ్చములులేవు. ఇది నీచకర్మ, ఇది యుత్తమకర్మ అనుట శుద్ధతప్పు. కర్మచేయువాని భావములలో నీచోచ్చములేర్పడినవిగాని కర్మలందేమాత్రము నీచోచ్చములు లేవనుటస్పష్టము.

ఈశ్వరుడు జగద్రూపముగ పరిణమించియున్నాడనుట అందరికి తెలిసినవిషయమే. జగత్తునందుండు వారందరు ఈశ్వరాంశములే. జగత్ప్రీతికొరకు చేయుపనులన్నియు ఈశ్వరప్రీతికొరకు చేయుపనులేయని దృఢపడుచున్నది. కేవల శుచిమంతుడగు బ్రాహ్మణుడు నిర్మలమనోభావముతో దేవాలయమందు తులసి బిల్వాదులతో నొనర్చుపూజలును, అట్టినిర్మల మనోభావముతోనే అంత్యజుడు తనకు సాధ్యమైనదగు గ్రామమునందు జనులు విసర్జించిన మూత్రపురీషములనుయెత్తి గ్రామమంతయు పరిశుద్ధిచేయుపనులును ఈశ్వరునికి సమానముగ ప్రీతికరములుగానుండునేగాని బ్రాహ్మణుడుచేయు పూజాకార్య మెక్కువగాను, గ్రామపరిశుద్ధకార్యము తక్కువగా నెప్పటికిని నుండ

జాలదు.

పూర్వమందీ ధర్మరహస్యము తెలిసియుండిరిగనుక అన్ని వర్ణములవారు వారివారి శక్త్యానుసారము చేయుపనులన్ని భగవత్కైంకర్యములుగా నెంచి ఒకవర్ణమువారింకొక వర్ణమువారిని తిరస్కరించక దేహమందు అంగములన్నియు నెవ్విధంబున తాముచేయుచుండు వేర్వేరుపనుల ఫలంబులు తాము ప్రత్యేకముగ ననుభవించక దేహమునకంతయు వ్యాపింపజేయు చున్నవో అవ్విధంబుననే వీరును (సర్వవర్ణములవారును) జగదుపకారముననకే సమర్పించుచుండిరి.

అదెట్లన:—

బ్రాహ్మణు లితరవర్ణములవారికి చేయనలవికాని ఉత్కృష్టమైనదియు, కష్టతరమైనదియు, స్వలాభస్వసుఖరహితమైనదియునైన సమస్తభూతకోటికి తరుణోపాయంబైన కర్మను చేయుచుండిరి. వీరి దేహములును, మనస్సును, బుద్ధియు, నట్టిశ్రేష్ఠమైన కర్మలనుచేయుటకు శక్తిగలవైయుండినందున ఆకర్మలను వీరుచేయుచుండిరి.

శ్లో॥ బ్రాహ్మణస్యతుదేహోయం
నకామార్థాయజాయతే
ఇహక్లేశాయతపసే
ప్రేత్యత్వనుపమంసుఖం॥

బ్రాహ్మణుని దేహము కామములు అనగా దేహసుఖముల నుభవించుటకు పుట్టలేదు. ఇక్కడ అనగా నీభూలోకమందు కష్టములనుభవించి తీక్ష్ణములగు తపశ్చర్యలుసల్పి తదనంతరము అనుపమానంబైన సుఖమనుభవించుటకు జనించినదని మహాభారతము శాంతిపర్వమందు చెప్పబడినది.

దీనికి ముఖ్యాభిప్రాయము బ్రాహ్మణులదేహములు శీతోష్ణములను, సుఖదుఃఖములను, ఆకలిదప్పులను భరించి తపస్సు

లాచరించుటకు తగినవిగానుండెనని తెలియవలెను. ఇట్టిశక్తి గలదేహములు లభించుట దుర్లభము. లభించినతరువాత వాని నెట్టిపనుల కుపయోగించదగునో అట్టిపనుల కుపయోగించవలెను గాని వానికి తగని పనుల కుపయోగించదగదు.

శ్లో॥ బ్రాహ్మణ్యంబహుభితపోభిర్లభ్యతే
తల్లబ్ధ్వానరతిపరేన హేళితవ్యం
స్వాధ్యాయేతపసిదమేచనిత్యయుక్తః
క్షేమార్థీస్స్వకుశలపరస్సదాయతస్వ॥

బ్రాహ్మణదేహము పలువిధంబులగు తపస్సుచే ఘటిల్లుచున్నది. అట్టిదేహమును పొంది దానికి సుఖము లొసంగుటచే హేళనచేయదగదు అనగా తిరస్కరించదగదు. అధ్యయనము చేయుటయందును తపస్సు లాచరించుటయందును వినియోగించుచు ఇంద్రియనిగ్రహము చెంది సర్వదా లోకక్షేమమునకే ప్రయత్నించుచుండవలెనని మహాభారతమం దుదాహరింపబడినది. కనుక బ్రాహ్మణు లెప్పటికిగాని తమదేహ సుఖోపభోగములకుగాను ద్రవ్యమార్జించుటకు తమకాలమును, బుద్ధిని, విద్యను ఉపయోగించదగదని స్పష్టముగా దృఢపడుచున్నది. లోకోద్ధారమునకు తగిన మహాతేజోమయంబైన యుత్కృష్టశక్తిగల దేహమనోబుద్ధులను అల్పశక్తిచేనైన గూర్చుటకుసాధ్యంబైన దేహసుఖములు సంపాదించుటకు వినయోగించుట, అత్యంతవాడిగల మిక్కిలివెలగల శ్రేష్ఠమైన కత్తిని రణరంగమందు మహాబలశాలులైన శత్రులను నరికి దిగ్విజయముపొందుటకు మారుగా రాతిని మొలచుట కుపయోగించుచందమొందు.

వీరిదేహములు లోకోద్ధారమునకే సృజింపబడినదని అనేక ప్రమాణములుగలవు.

శ్లో॥ బ్రాహ్మణాలోకసారేణ
సృష్టాధాత్రాగుణార్థినా

లోకస్తారయతుంకృత్స్నా
న్మర్త్యేషుక్షితిదేవతాః॥

బ్రాహ్మణులను, సమస్తలోకములను తరింపజేయుటకు మనుష్యులందు భూదేవతలుగా మిక్కిలి సారవంతంబులగు దేహములతో బ్రహ్మసృజించెనని మహాభారత శాంతిపర్వమందే చెప్పబడినది. గనుక బ్రాహ్మణులు తమపోషణార్థమై పాటుబడుట స్వధర్మము కాదు. ఇందుకై వీరితరులకు సాధకంబైన ద్రవ్యమార్జించదగదు. వీరార్జించదగిన విత్తము వేరు. ఆవిత్తము సంపాదించుటకు వీరెవరిని ఆశ్రయించ నక్కరలేదు. ఆవిత్తము తమలోనేపుట్టి తమలోనే పెరుగును. ఆవిత్త మార్జించుటయందెవరికైనను, నష్టముగాని, కష్టముగాని, దుఃఖముగాని లవలేశమంతైనను సంభవించదు. ఆవిత్తమార్జించిన కొలది లోకముల క్షేమమభివృద్ధియగుచునేయుండును.

ఆవిత్తమేదన:—

శ్లో॥ నైతాదృశంబ్రాహ్మణస్యాస్తివిత్తం
యథైకతాసమతాసత్యతాచ
శీలేస్థితిర్దండవిధానమార్జవం
తతస్తతశ్చోపరమఃక్రియాభ్యః॥

బ్రాహ్మణులకు ఏకత్వము, సమత్వము, సత్యత సదాచారమందు నిలుకడ, అహింస, ఋజుత్వము (నిష్కాపట్యము) సమస్తకార్యములనుండి యుపరతి వీనితో సమానమైన విత్తము లేదని తాత్పర్యము.

బ్రాహ్మణులకు ధనమిదిగాని బాహ్యమందందరికేని సామాన్యమగు సువర్ణము మొదలైనవికావు. ఏకతా అనగా నేకత్వము, తన్నుగానే సమస్తమును భావించుట. తనవలె భావించుట తన్నేగాభావించుటకంటె తగ్గుతరగతికి చేరినదిగానున్నది. తన్నుగా భావించువారు సర్వముతానేయని

యొంచువారుగా నుందురు. వీరికి, తమకును జగత్తునందుం డు సమస్తమునకును భేదమేమాత్రముగాని గన్పడదు. తమ వలె నితరులను జూచువారికి భేదముగుపడును. ఏకత్వమును పొందుటనగా బ్రహ్మత్వమును పొందుటేతప్ప వేరుగాదు. వీరి కి శోకమోహాము లించుకైన నంటియుండవు.

శ్లో॥ తత్రకోమోహాఃకశ్శోకః ఏకత్వమనుపశ్యతః

ఏకత్వమును పొందినవారికి శోకమెక్కడిది, మోహ మెక్కడిదని ఈశావాస్యోపనిషత్తు చెప్పుచున్నది. ఏకత్వము నుపొందుటే ఆత్మవిద్యయొక్క ముఖ్యఫలము. దీనిని సంపాదిం చుటకే సమస్తయోగములు, వివిధధ్యానములు, పలుతెరంగుల గు తపశ్చరణలు, మొదలగునవి మహనీయులాచరించుచున్నారు. ఇదిబ్రాహ్మణులకు విత్తములలో సర్వోత్కృష్టమైన విత్తము. ప్రతిబ్రాహ్మణుడును ఈవిత్తమును సంపాదించుటందే లక్ష్య ముంచి దానిని పొందువరకు దానికితగిన ప్రయత్నము లెడతెగక చేయుచుండవలెను. పూర్వమందు బ్రాహ్మణులందరు దీనిని పొందుటకే యత్నముచేయుచుండిరనుటకు సంశయములేదు. దీనినిపొందినవారు జగత్తునంతయు తామేయని తెలిసియుందురు గాన జగదుద్ధారణార్థమే సర్వదా సమస్తకార్యములు చేయు చుందురు. జగత్తే తామగుటనుపట్టి జగద్ధితము తమహితముగా నేయెంచియుందురు. జగత్తంతయు కడతేరువరకు తాముకడ తేరలేదని తలంచి జగత్తుకడతేరువరకు జగత్హితార్థమే పని సేయుచుందురు.

"సమతా, సత్యతా" మొదలగునవన్నియు నేకత్వమును పొందుటకు ముఖ్యసాధనములు. "సమతా" అనుపదమునకు శీతో ష్ణ, సుఖదుఃఖ, మానావమాన, లాభనష్టములాదిగాగల ద్వంద్వ ములు ప్రాప్తమైనపుడు మనస్సుసమముగా నుంచియుండుటయని గాని లేక సమస్తభూతములను తనకుసమముగా అనగా తన

వలెచూచుటయనిగాని అర్థముచేయవచ్చును. పరంతు సమత ఏకతకు ముఖ్యసాధన. తనవలె నితరభూతములను చూచుట స్వభావముగా స్థిరపడువరకు వానినితన్నుగా చూచుట కాదు. ఆదియందు తమకంటె వేరుగానగుపడు వానిని గురించి సుఖమందుగాని దుఃఖమందుగాని తననుపోల్చికొని కార్యములు చేయుట నభ్యసించవలెను. ఇదిగొప్పయోగమని శ్రీకృష్ణులు అర్జునుని కుపదేశించినారు.

"ఆత్మౌపమ్యేనసర్వత్ర సమంపశ్యతియోఽర్జున
సుఖంవాయదివాదుఃఖం సయోగీపరమోమతః॥"

సాధువులందరు సమస్తభూతములను తమతోపోల్చి సర్వభూతములందును దయచూపుచుందురని మనుస్మృతియం దుదాహరింపబడినది.

"ఆత్మౌపమ్యేనభూతేషు దయాంకుర్వంతిసాధవః॥"

ఇంక "సత్యత" అనుపదమునకును రెండర్థములున్నవి. యథార్థవాదము లేక మాటసత్యమని అందరికి తెలిసినదే. సత్యమన భూతహితమని ఇంకొక అర్థము "కింసత్యంభూతహితం, ప్రియంచకిం ప్రాణినామసవః" అని శ్రీశంకరాచార్యులవారు ప్రశ్నోత్తరరత్నమాలయందు సెలవిచ్చినారు.

"సత్యస్యవచనంశ్రేయః సత్యాదపిహితంవదేత్
యద్భూతహితమత్యంత మేతత్సత్యంమతంమమ॥"

సత్యవచనము శ్రేయస్కరమైనది, దానిలో హితమైన సత్యము మరియు శ్రేష్ఠమైనది. ఏదిఅత్యంత భూతహితమైన వచనమో అదేసత్యమని నాయభిప్రాయమని కర్ణుడుపలికినట్లు భారతమందు చెప్పబడినది. ఏగ్రంథము, ఏపురాణము, ఏయితిహాసము, ఏస్మృతి ఏశ్రుతి చూచినను బ్రాహ్మణునికి సర్వభూతహిత కార్యములు సేయుటే ముఖ్యధర్మమని దృఢముగ స్పష్టమగుచున్నది.

మరియు విష్ణుపురాణమందు:—

"సర్వభూతహితంకుర్యాత్
నాఽహితంకస్యచిత్ ద్విజః
మైత్రీసమస్తభూతేషు
బ్రాహ్మణస్యోత్తమంధనం॥"

బ్రాహ్మణుడు సర్వభూతములకు హితము చేయుచుండవలెను. ఎప్పటికిగాని యించుకైన అహితము చేయదగదు. సర్వభూతములందు మిత్రభావమే బ్రాహ్మణుల కుత్తమమైన ధనమని తాత్పర్యము.

సమస్తభూతములందు "మైత్రి" చూపవలెననగా మిత్రభావమును చూపవలెను. మిత్రమన పాపములనుండి తొలగించుట. "కింమిత్రంయన్నివారయతిపాపాత్" మిత్రమన నేమి? పరిపాపములనుండి తొలగించునో అదియని శ్రీశంకరాచార్యుల వారానతిచ్చినారు గనుక బ్రాహ్మణులు అందరిపాపములను తొలగించువారుగా నుండవలెను. తాము మొదట పాపకార్యములను విడువవలెను. పాపమనగా పరపీడ. "పాపాయపరపీడనం" అని చెప్పబడినది గనుక బ్రాహ్మణులెప్పటికిగాని మనోవాక్కాయములచే పరపీడ చేయదగదు.

మరియు బ్రాహ్మణులెప్పటికిగాని క్రూరభావముగాని కాఠిన్యముగాని వహించి యుండదగదు. అట్టిగుణములుండువాడు బ్రాహ్మణుడు కాడని ఒక గాడిది మతంగుడను బ్రాహ్మణునికి చెప్పినట్లు మహాభారతము అనుశాసనీక పర్వమం దుదాహరింపబడినది.

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

# అవతారములు.*

## ప్రథమప్రసంగము.

సోదరులారా!

మతముల మూలతత్త్వములను విచారింపఁదలచి మనమప్పుడప్పుడు ఇచ్చోట సమావేశమగుచున్నారముగదా! అట్లు చేరినప్పుడెల్ల మనవిచారవిషయము ఎంతగొప్పదైయుండునో ప్రసంగముచేయు నాశక్తి అంత అల్పమైయున్నట్టును, సంగతులు ఎంతవిస్తారములైయుండునో వానిని వెల్లడిఁజేయు నావాక్కులు అంత సంకుచితములై యున్నట్టును నాకుతప్పక స్ఫురించుచున్నది. జీవితముయొక్క నిశ్చితార్థమును, ఆత్మవిషయమగు రహస్యమును దెలిసికొన యత్నించుటకన్న నుత్తమమైన కార్యము మానవులకు మఱియేమున్నది? ఇందునిమిత్తముగానే మనము ప్రతిసంవత్సరము ఒకచోట సమావేశమగుచున్నాము. ఇట్టి విచారములు తప్ప తక్కినవన్నియు నస్థిరములు. జలబుద్బుదములవలె క్షణభంగురములు. జగమందును, మానవునియందును అభివ్యక్తమైయుండు ఆత్మప్రభాసాన్నిధ్యమందు యశోధనాధికారశాస్త్రములాదిగాఁగల ఐహికములైన సమస్త వస్తువులు కళాహీనములై తుచ్ఛములుగా నగుపడును. ఆత్మ బహురూపములుగా వ్యక్తమైయున్నది. ప్రతిరూపమందు నది మనోహరమైయున్నది. తాను సృజించిన లోకము నుద్ధరించఁదలచి తన ఇచ్ఛచేతనే అతిసూక్ష్మమైన కాయమును, కల్పించుకొనుచు తద్వారా లోకమందు తననిజప్రకాశమును వెల్లడిజేయుచు స్వామియైవర్తించు నాపరమాత్మయొక్క యవతార విశేషములను మనమీసంవత్సరము విచారించఁదలచియున్నాము. ఉ

* శ్రీమతి అనిబెసంటమ్మగారిచే ఇంగ్లీషునందు వ్రాయఁబడిన గ్రంథమునుండి దివ్యజ్ఞానసమాజ ఇన్‌స్పెక్టర్ బ్రహ్మశ్రీ, ఎం, వెంకట్రావుగారిచే తెనుగించఁబడినది.

తక్కుప్పష్టమైన భక్తివినయములతో తప్ప ఈవిషయమును దెలి యనుద్యమించరాదు. ఆదేవదేవుని మాహాత్మ్యమును కొద్దిగా వెల్లడిజేయు నతని కార్యవిశేషములను దెలిసికొనవలయునన్న ఎంతయో ఓపికయు, భక్తియు, వినయము నత్యావశ్యకములై యుండ నతని అవతారవిషయమును, దానియర్థమును, దాని యుద్దేశమును గ్రహించుటకెంత అధికముగ నాసాధనము లుండ వలయునో మీరే ఊహించుఁడు.

స్వామియొక్క అవతారవిషయమందు సమస్తమతస్థుల కు నమ్మకమున్నదని మనఅగ్రాసనాధిపతి ఇప్పుడే సెలవిచ్చిరి గదా! ఇదియథార్థమైన సంగతి. వెండిముక్కకు కంపినీముద్ర (Hall mark) యుండినయెడల అదిచొక్కముగా నున్నదని ఎట్లునమ్మెదరో అట్లనే అవతారవిషయమందు సమస్తమతముల లోను, సమస్తదేశములలోను, సమస్త కాలములయందును జనులకు నమ్మకముండుటంబట్టి యదినిశ్చయమైనదనియే చెప్పవ చ్చును. కొన్నివిషయములందు మతములకు పరస్పరభేదము లుండవచ్చును. కొన్ని సిద్ధాంతవిషయములందు జనులకు వి వాదములుండవచ్చును. అయితే, దేనివిషయమై అట్టి భిన్నా భిప్రాయములుగాని, వివాదములుగాని లేవో, దేనియందు మాన వకోటియంతయు నేకీభవించి భక్తివిశ్వాసములతో నేకమనస్కు లై నమ్మకమును బొందియున్నారో అట్టివిషయము యథార్థముద్ర తోకూడియున్నదనియే చెప్పవచ్చును. దానికి పారమార్థిక సత్యత్వము తప్పకయుండును. అయితే, మనప్రసంగ విషయ మందు, ఉపన్యసించెడు నాకును శ్రోతలైనమీకును ఒకకష్టము త టస్థించియున్నది. అదిఏద్దియనగా:—లోకములో నిప్పుడు స త్యమునకు కళంకముకలిగియున్నది. సత్యము లోకములో నే కమైయున్నను దానికనేక కళలుగలవు. ఆకళలన్నింటిని గ్ర హించుశక్తి బుద్ధికిలేదుగనుకనే యనేక దర్శనములు, తత్వ

శాస్త్రములు లోకములోఁ పుట్టియున్నవి. ఒక్కొక్క దర్శనము, ఒక్కొక్క తత్వశాస్త్రము సత్యముయొక్క వేరువేరుకళలను ప్రకాశింపఁజేయుచున్నది. అన్నియు జేరినగాని సత్యమునకుగల పరిపూర్ణజ్యోతి ప్రకాశముకాఁజాలదు. అయితే, ప్రతి దర్శనము, ప్రతితత్వశాస్త్రము భిన్నభిన్నకళలను ప్రకాశపరుచుచున్నదని తెలియజాలక నవియన్నియు పరస్పరము తిరస్కరించుకొనుచు వర్తించుచున్నవి. ఇదిగాక, ఒకయుగము గడచి మరియొకయుగము రాగానే పూర్వయుగమందున్న జ్ఞానము కాంతిహీనమగుట నిశ్చయము. తుదకు పారమార్థికజ్ఞానమే కనుపించకపోవును. తెలిసినవారికన్న మాటలాడువారే ప్రబలులగుదురు. అర్థములేకనే పట్టిసంప్రదాయములను మాత్రము బెట్టుకొని దురభిమానపడుచుండు మహాజనులగుంపులో పరమార్థదృష్టిచే నిజమును చెప్పశక్తిగలవారు దుర్లభులగుదురు. ఇపుడు పురోహితులకును (Priests) తత్వవేత్తలకును (Prophets) బద్ధవైరమే తటస్థించియున్నది. పురోహితులు ప్రాచీన సంప్రదాయములను మాత్రమే పదిలము జేసికొని యున్నారుగాని వాని రహస్యార్థములను బోధజేయుశక్తి వారికిలేదు. తత్వవేత్తలైతేనో "ఈశ్వరాజ్ఞ" యను కాలాగ్నిని నోటబెట్టుకొనివచ్చి దానిద్వారా ప్రాచీన సత్యమునే వేడివేడిగా వెడలించుచు ఆసంప్రదాయములనే మరల వెలిగించుచున్నారు. బాహ్యసంప్రదాయములయందే శ్రద్ధకలిగి వానిరహస్యార్థము నెరుగకయున్న జనులు తత్వజ్ఞునినోటవెడలు ప్రదీపనాజ్యోతిచే నంధులై తాము మరచియుండుసత్యమునే అతడు బోధించుచున్నాడని గ్రహింపజాలక అతనిని మతదూషకుడని నిందచేసెదరు. కనుకనే, తత్వజ్ఞులకు తమమతస్థులతో వైరమును తిరస్కారమునుతప్పక కలుగుచున్నవి. తత్వజ్ఞుడు వెల్లడిజేయు సత్యము పరమోత్తమమైనదై యుండుటచేత అరగుడ్డివారైన మనుజుల పరిమితికి తగినట్టు

సంకుచితము జేయ సాధ్యముకాదు. మనప్రసంగ విషయమును తమకుతోచినట్లే జనులు ఇదివరకు గ్రహించియుండుటచేతను, క్లిష్టమైన త్రోవలయందే వారియభిప్రాయములుకూడా వెళ్లి యుండుటచేతను బాహ్యసంప్రదాయములయందు ప్రాశస్త్యబుద్ధి కలిగియుండు కొందరికి నేను చెప్పెడి సంగతులు విరుద్ధములుగా దోచవచ్చును. హిందూమతమందు అనేక ప్రభేదములుండుట చేత నేనుచెప్పెడి సంగతులలో ఏప్రభేదము వారికైనను కొన్ని భిన్నాభిప్రాయములు గోచరించవచ్చును. అట్లు గోచరించినచో క్షమించవేడెద. ఏలయన, బహుకాలమునుండి స్థిరమైయుండు అజ్ఞానపరిమితులకు పొందికయగులాగున నాకు తెలిసిన సత్యము ను సంకుచితము చేయజాలను. నాకంతటి సాహసబుద్ధిలేదు. ఆకారమాత్రమే నిలిచియున్న సంప్రదాయములను పోషించుకొరకు పరమార్థ సత్యమును మార్చనోపునా? అనన్యశరణ్యుడగు నాసద్గురువుకు నేను ఆజ్ఞాబద్ధురాలై యుండుటచేతను, సమస్తమతస్థులకు పారమార్థిక సత్యమునే వెల్లడిజేయవలయునని నాకు వారు ఆనతిచ్చియుండుటచేతను, మీరు తత్కాలమున అంగీకరించినను, లేకపోయినను, నేనుమాత్రము యాథార్థ్యమును బోధించక తప్పదు. సత్యము వెల్లడిజేయుకాలమున నంగీకారముగాకున్నను చివరకు అంగీకారమగుట నిశ్చయము. ప్రాచీన ఋషులపేర్లను స్మరించువారు ఆమహనీయు లుపదేశించియున్న సత్యమునె చెప్పవలెనుగాని ఇటీవల వ్యాఖ్యానకారులచే కల్పించబడియున్న సంకుచితార్థమునుగాని మనుష్యులలో భేదమును పుట్టించుటకై వ్రాసియున్న కుచ్ఛితకల్పిత వాక్యములనుగాని బోధించరాదు.

మనప్రసంగము గొప్పదగుటచేత సులభముగా గ్రహించుకొనునిమిత్తము వేరువేరుఅంశములుగా విభజించదలచినాను. మొదటి అంశమందు అవతారముయొక్క రెండు తరగతులను

వివరింపదలచినాను. ఈ రెండు తరగతులును సామాన్యముగా సర్వసమ్మతములై యున్నవి. రెండవ అంశమందు "అవతార మనగానేమి" యను సంగతిని నేటిదినమే అనువాదించెద. రేపటిరోజున "అవతారమునకుమూలమెద్ది" యను సంగతిని యథాశక్తి వెల్లడిజేసెద. తరువాత బ్రహ్మాండమునకు, మనువంశమునకు సంబంధించిన అవతార విశేషములను వివరించెద. ఇవ్విధమున నాప్రసంగవిషయమును సాధ్యమైనంత స్పష్టముగాను, యుక్తియుక్తముగాను మీకుశ్రుతపరచదలచినాను. నానోట వచ్చుటచేతనే అందరు ప్రమాణవాక్యములగా పరిగ్రహించవలెనని నేను జెప్పుటలేదు. నాచేజెప్పబడిన మాత్రమున నట్టి వాక్కులు పురస్కరణీయములని నేను సర్వథాచెప్పను. నా వాక్కులు మీబుద్ధికి సత్యములుగా గోచరించనియెడల వానిని సత్యములని నమ్మకెట్లు? మీజెవినిబడు వాక్కులకు ప్రత్యుత్తరముగా మీమీహృదయాంతరంగములనుండి ప్రతిధ్వనిరాకున్న బాహ్యవాక్కులు ఎంతఅధికారయుక్తమైయున్నను వానికి మీరు లోబడరాదు. దానిచేమీకు దోషమేసంప్రాప్తించును. మీమీ మనస్సులకు సరియని తోచకున్నను మీహృదయములను ప్రదీపనము జేయకున్నను సత్యము సత్యమైతోచదు. ఉదయభాస్కరుని కిరణములచే పుష్పము వికసించులాగున సత్యప్రకాశముచే మీహృదయములు వికాసము కావలయును. లేనియెడల సత్యము సత్యము కానేరదు.

సర్వసమ్మతమైన అవతారతరగతులను, మొదట విచారించెదము. అవశ్యకమేర్పడినపుడు దేవుడు శరీరమును ధరించి యవతరించుచున్నాడు. జగమందంతయు యనేకరూపములుగా దేవుడు ప్రకాశించుచుండుట నిశ్చయమైనను సర్వసామాన్యములగు నారూపములకును ఎద్దియోయొక కార్యవిశేషమును జేయబూని అతడు స్వీకరించు అవతారములకు భేదమున్నది. ఉత్తమప్రాణు

లగు దేవతలయందుండులాగుననే ధరణిపైప్రాకుచున్న క్రిమియందును దేవుడున్నాడు. తానే తానైజగత్తులోనంత అతడు ప్రకాశించుచున్నాడు. ఇదినిశ్చయమే. ఇదిగాక అవశ్యకముకలిగినప్పుడు అతడు విశేషరూపములనుదాల్చి ఈలోకమునకు వచ్చుటకలదు. ఇట్లుఅతడు వచ్చుటను "అవతారమనియు," "ఆవేశమనియు" రెండుపదములను హిందూమతమందు ప్రయోగించుచున్నారు. ఈ రెండుశబ్దముల వ్యుత్పత్తియందే వానికిఁగల భేదములు గోచరించుచున్నవి. "అవతార" మనుశబ్దము "అవ" క్రిందికి, "తౄ" దిగుట, యను అర్థము నిచ్చుచున్నది. "విశ్" ప్రవేశించుటలేక వ్యాపించుట అనుధాతువునుండి "ఆవేశ" శబ్దము పుట్టియున్నది. దేవుడు మానవవర్గమునకుగాని పశువర్గమునకుగాని సంబంధించిన దేహమునకు దిగుట యని "అవతార" శబ్దము సూచించుచున్నది. ఇదివరకే జీవించియున్న యొక మానవునియందు ఈశ్వరశక్తి ప్రవేశించుటయు వ్యాపించుటయునను అర్థమును "ఆవేశ" శబ్దము బోధించుచున్నది. ఎవరియందు ఈశ్వరశక్తి ఆవేశమైయున్నదో వారికితప్పక ఉత్తేజనము కలుగుచున్నది. సర్వసామాన్యముగ జగమందంతయు దేవుడువ్యాపించియున్నస్థితికిని, అప్పుడప్పుడు శరీరవిశేషములనుబొంది యవతరించుస్థితికి మధ్యమందు ఆవేశస్థితియున్నదని జెప్పవచ్చును. ఈశ్వరుడోలేక యతనితో నేకీభవించియున్నయొక మహాత్ముడో మరియొక జీవుని శరీరమందు ప్రవేశించి ప్రకాశించుచున్నయెడల దానికి ఆవేశమని జెప్పనగు.

ఇకముందు "స్వామివిశేషశరీరములను బొందుటకు ఎట్టి సమయములు అవశ్యకము" యను అంశమును విచారించెదము. ఈవిషయమందు కలియుగారంభమునకు పూర్వమే తనఇచ్ఛానుసారముగా నవతరించియున్న శ్రీకృష్ణస్వామి యానతిచ్చిన వాక్యములకన్న ప్రమాణములైనవి మరియెవరివల్లను జెప్పబడ

లేదు. అద్భుతగ్రంథమగు భగవద్గీతలో లోకప్రభువుగా తన్ను జన్మించునట్లు జేయుకారణము లెవ్వియను సంగతిని వర్ణించి యున్నాడు.

శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానంసృజామ్యహం॥
పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే॥
(అధ్యా 4 శ్లో 7-8.)

తా॥ ఎప్పుడెప్పుడు ధర్మముక్షీణించి అధర్మము ప్రబలమగుచున్నదో అప్పుడప్పుడు నేనునన్ను సృష్టిచేసికొనుచున్నాను. సాధువులనుద్ధరించి దుష్టులను సంహారముజేసి ధర్మమును స్థాపించుకొరకు నేను యుగయుగమందును పుట్టుచున్నాను.

తానవతరించుటకు అవశ్యకమైన కారణములను స్వామి ఇదిగో ఇచ్చోట ఆనతిచ్చియున్నాడు! ప్రపంచముయొక్క అవశ్యకములే యతనిజన్మమునకు కారణములు. మానవులకు అవశ్యకముకలిగినప్పుడేగాక జగచ్చక్రము తిరుగవలసినప్పుడుకూడ అతడుజన్మించునని మరియొకచోట అతడుసెలవిచ్చియుండు వాక్కులచే దెలియవచ్చుచున్నది. లోకమునకు ఉన్నతమైన మరియొకస్థితి సంప్రాప్తముకావలసినపుడు ఆనూతనస్థితిలో పరిణమించవలసిన జీవజాలములకు మేల్బంతియైన నొకరూపవిశేషమును పరిగ్రహించి లోకనాయకుడై వెలుగుచు కాలచక్రమును త్రిప్పుచున్నాడు. ఇవియే దేవుని యవతారములయొక్క ముఖ్యోద్దేశములు.

తరువాత, "అవతారమనగానేమి" యనుసంగతిని విచారించెదము. ఇందులోమీకు పరిచయములేని కొన్ని కొత్తసంగతులను వెల్లడిచేయదలచినాను గనుక సావధానముగా గమనముంచివినగోరెద. తత్వరహస్యము ననుసరించి మనప్రసంగవిష

యమును వెల్లడిజేసెదనని మున్నేమీకు మనవిసి జేసియున్నాను గదా! తత్వరహస్యము నెరుగనివారు నావాక్కులను తిరస్కరించుటకుమునుపు చక్కగా ఆలోచించకోరెద. "అవతార మనగానేమి" యనుప్రశ్నకు సదుత్తరమును బొందుకొరకు ప్రమాణవాక్యములు ఎంతవరకు సహాయముగానున్నవి, వాటిని చక్కగా అర్థముజేసుకొనక యుండుటచేత ఎన్ని అనర్థములకు కారణముగలిగియున్నది యనుసంగతిని విమర్శగా పరిశీలించవలెను. కీర్తిశేషులైన టి. సుబ్బరావుస్వామిగారు భగవద్గీతా విషయమైకొన్ని ప్రసంగములను జేసియున్నారుగదా! వానిలోయవతారవిషయమును ప్రస్తాపించినపుడు "ఈశ్వరుడు ఒకమానవజీవునియందు ప్రవేశించుటయే యవతారమని" సూచించియున్నారు. ఆమహాశయుని ఉద్దామపాండిత్యము నెంతయోపురస్కరించెదనుగాని ఈవిషయమందు అతడు సెలవిచ్చియున్న అభిప్రాయము పూర్ణాభిప్రాయముగాదని నాకుతోచుచున్నది. తానుజేయబూనిన కొన్నిప్రసంగములలోనే పలువిధములగు గీతావిషయములను ఇమిడించి చెప్పవలసివచ్చినందున ఒక్కొక్క యవతారమును దృష్టాంతముగాబెట్టుకొని అవతారశబ్దమునకు అర్థమునతడు నిర్ణయించలేదని తోచుచున్నది. ఒకవేళ అట్లు చేయదలచియున్నను కాలవ్యవధానములేక విడిచియుండవచ్చును. అవతారవిషయమునే ప్రసంగవిషయముగా పరిగ్రహించినపుడు దొరుకునంతటి కాలవ్యవధానమతనికి దొరకక పోయినందున ఒక అవతారమునుమాత్రమే వివరించి ఇతరఅవతారములను వదలిపెట్టినట్టు తోచుచున్నది. అదిఏటులుండినను, ప్రకృతము నేను మాత్రము అవతారవిషయమును ఆమూలాగ్రముగ ఉపవాదించదలచినాను.

(సశేషము.)

ఎం. వెంకట్రావు.

# పరమార్థ ప్రబోధిని.

(105-వ పుట శేషము.)

శ్రీకృష్ణమూర్తి యొకభక్తునితో నీకేమివరము కావలయు నని యడుగగా నందుల కతండు

కం॥ నీపాదకమలసేవయు
నీపాదార్చకులతోటి నెయ్యమునునితాం
తాపారభూతదయయును
తాపసమందార నాకు దయసేయగదే॥

దేవదేవా! నీపాదసేవ, నీభక్తులతోటిమైత్రి, అపార భూతదయ, కలిగియుండు నట్లనుగ్రహించుమని వేడుకొనెను. కావున, నాకుదైవభక్తికలదను గర్వముతో సిద్ధులను, పెద్దలను, నుదాసీనము సేయరాదు. అపారమయిన దైవభక్తితో పర్వతాగ్రమందు తపస్సుచేయుచుండిన ఇంద్రద్యుమ్న మహారాజు తనయొద్దకే తెంచిన అగస్త్యమునివరేణ్యుని, లక్ష్యపెట్టకపోయినందున ఘోరశాపమొందెనను కథ మనము వినుచుండలేదా? ఎట్టివారికిని గర్వము మిక్కిలి చేటుఁగలుగజేయును. గర్వగ్రంథులగు వారికి ధర్మార్థకామమోక్షములను పురుషార్థచతుష్టయము నందొక్కటియైన సిద్ధింపఁజాలదు. గర్వమును విడనాడి సరళచిత్తుడగుటకును, నిశ్చింతగలవాడగుటకును, నిర్మలప్రవర్తకుడగుటకును, మహాపురుష జీవితచరిత్రములను చదువుట, పెద్దలవలన వినుట, మిక్కిలిమంచిది. రాత్రింబవళ్ళును ధనసంపాదనకై పలవరించెడు దుస్స్వభావమును విడనాడవలెను. ఆర్జించుట కొకకాలము, భుజించుట కొకకాలము, విశ్రమించుట కొకకాలము, క్రీడించుట కొకకాలము, శయనించుట కొకకాలము, విహరించుట కొకకాలము, ఇట్లన్నివిషయములకును కాలనిర్ణయము చేసుకొని యుండవలెను. లేకున్నచో, ఇవియన్నియు నుద్రేకించి

ఆత్మవిచారమునకు భంగము కలుగఁజేయును.

ఆ॥ నిద్రపెంపు నిద్రనిగ్రహించుటయును
గొలదిమీరికుడుపు కుడువమియును
యొప్పునతడుయుక్తవర్తనుండై వేగ
నువిదదుఃఖహారి యోగమొందు॥

(భారతము.)

అనగా మితిమీరినిద్రించుట, బొత్తిగా నిద్రయే లేకుండుట, మిక్కుటముగా భుజించుట, భోజనమే లేకుండుట, మున్నగువిరుద్ధవాడుకలను విడనాడి యుక్తాహారవిహారములు కలవాడై యుండవలయును. దేనియందును ఆశయెక్కువగా నుంచరాదు. అతి సర్వత్రవర్జయేత్తని పెద్దలువిధించినారు.

ఏవేళను ద్రవ్యలాభమునందే ధ్యానముంచినయెడల ఆత్మలాభము కలుగబోదు. ఆశకు పారమెక్కడిది?

శ్లో॥ జీర్యంతేజీర్యతఃకేశాః దంతాజీర్యంతిజీర్యతః
చక్షుశ్శ్రోత్రేచజీర్యంతే తృష్ణైకానిరుపద్రవా॥

ముదిమిచే వెంట్రుకలు తెల్లబారినను, పండ్లూడినను, కన్నులు కాన్పించకపోయినను, చెవులు వినగాకపోయినను, పోవచ్చునుకాని, మానవుల ఆశకుమాత్రము పారమే లేదు. ముదిమియధికరించిన కొలదిని ఆశ పెరుగుచునే యుండును. ఇంతకు లెక్కింప నీప్రపంచమునందలి ధనధాన్యములు, పశువులు, స్త్రీలు, వస్త్రములు, వాహనములు, మిద్దెలుమేడలు, స్వర్ణాభరణములు, రత్నరాసులు, మొదలగునవన్నియు ఒక్కమనుజుని ఆశకె చాలియుండవు.

శ్లో॥ నిష్కీహ్యేకశతంశతీదశశతం లక్షంసహస్రాధిపో
లక్షేశఃపునరింద్రతాంసురపతి బ్రహ్మాస్పదంవాంఛతి
బ్రహ్మారుద్రపదంహరోహరిపదం తృష్ణావధింకోగతః॥

ఏమియు లేనివాని కర్థవరహా దొరికెనేని, వాడంతటితో

నూరకుండదు; నూరువరహాలను కోరును. అంతసొమ్ముదిక్కినచో వేయివరహాలుకోరును, అదిలభించినచో లక్షవరహాలు కోరును, అదిలభించినచో తానొక రాజు కావలెనని కోరును, అశైనచో ఇంద్రపదవిని కోరును. అదికలిగెనేని బ్రహ్మపదవిని, ఆపైరుద్రపదవిని, ఆపైవిష్ణుపదవిని, ఆపైపరబ్రహ్మపదవినిఁ గోరుచుండును. అనగా ఆశకు పారమెక్కడిదనుట. ఇట్లనుటచే బొత్తిగా ఆశయేలేకుండవలెనని యభిప్రాయముకాదు. ఆశయే లేకుండినచో ప్రపంచమిప్పటి స్థితియందుండియుండదు. అత్యాశకులోబడరాదనుటే ముఖ్యసిద్ధాంతము. శుద్ధాంగముగా ఆశనేవిడనాడి నిరుత్సాహులైయుండవలెనను వారిమాట శుష్కవేదాంతపుమాట.

శ్లో॥ ఆశానామనదీమనోరథజలా
తృష్ణాతరంగాకులా
రాగగ్రాహవతీవితర్కవిహగా
ధైర్యద్రుమధ్వంసినీ
మోహావర్తసుదుస్తరాతిగహనా ప్రోత్తుంగచింతాతటీ
తస్యాఃపారగతావిశుద్ధమనసో
నందంతియోగీశ్వరాః॥

(భర్తృహరి-వైరాగ్యశతకం.)

తా॥ ఆశయనుపేరుగల నదియొకటికలదు; దానిలో, మనోరథమను జలమునిండి తృష్ణారూపతరంగములు లేచుచున్నవి. అందు, రాగమను భయంకరమగు మొసలియున్నది. తర్కవితర్కములను రెండుపక్షులా తీరమునందున్నవి. అవిధైర్యమను వృక్షమును తోడివేయుచున్నవి. మరియు దానిలో మోహమను భ్రమరములులేచియున్నవి. ఇట్టిలోతైన గంభీరమైననదికి, చింత, దుఃఖములను రెండుగట్లులున్నవి. అగాధమగు ఈనదిని, విశుద్ధమానసులగు యోగీశ్వరులు దాటిపోయి ఆనం

దింతురని మహాయోగి భర్తృహరి వక్కాణించియున్నాఁడు. అట్టివిశుద్ధమనస్కులగు ధర్మపురుషులుదక్క అన్యులీమహానదిని తరింపఁజాలరు. ఈనదీస్వభావ మెఱుంగనివారికి మోహజాలమధికరించుచునే యుండును. వ్యర్థమనోరథములుగలిగి యుద్విఘ్నులౌచుందురు. సంకల్పములనంతానంతముగ నభివృద్ధిఁ జెంది పరుగులిడుచుండును. ఆపై మొదలు తుదలేగోచరము కానంతటి ద్వంద్వదశ ప్రాప్తించును. అంతమున గతి మోక్షము లే కానరాకపోవును, దీనికొక ప్రాచీనేతిహాసము కలదు.

బ్రహ్మర్షియగు సౌభరియనువారు ఒకానొకనాడు స్నానార్థమయి నదీతీరమున కేగిరి. అచ్చట వారొకమీనమిథునము క్రీడించుచుండుటంజూచిరి. తాపసికి స్త్రీసంగమమునందాశ కలిగినది. వారచ్చటనుండి పత్నీలాభమునకై పయనమైవెళ్ళిరి. నదీనదవాపీ కూపతటాకములతోఁగూడియుండిన వనములు, కనములు, గట్టులు, మిట్టలు, మున్నగు దుర్గమారణ్యమునుఁగడచి, మాంధాతమహారాజుచే పాలింపఁబడుచుండిన పట్టణముఁ జేరిరి. పెక్కువీధులుగడచి రాజభవనమున కరుదెంచిరి. రాజావిచారము నెఱింగి భయభక్తులతో మునినెదుర్కొని ఉచితరీతిని గౌరవించి సుఖాసీనునింజేసి ధర్మసల్లాపము చేయుచుండఁగా సౌభరి రాజుతో ఇట్లనియె. పుడమిపాలా! నాకుసంసారసుఖముపై ఇచ్ఛకలిగియున్నది. కావున నీపుత్రికనొకతెనిచ్చి వివాహముఁగావింపుమనిరి. రాజు తనమదిలో, ఆహా!! ఇదేమాశ్చర్యము!! పరమతపోధనుండగు నీవిశుద్ధచారిత్రునకీతలంపెందుకు పుట్టెనో తెలియకున్నదే! యనికొంతవడియోచించి ప్రసన్నచిత్తుఁడై, ఋషివంకఁజూచి స్వామీ, పరమతపోధనులును, జితేంద్రియులునునగు మీకీమాయాజాలమునందేల కోరికబుట్టినదో తెలియ లేకున్నది; ఒకవేళనన్ను పరీక్షించుటకేమైన అడిగితిరా? యనఁగా మునికులోత్తముడు రాజేంద్రా! నిక్కముగ నాకీకోరిక

బుట్టియుండుటచేతనే నిక్కడికివచ్చినవాడనేకాని నిన్ను పరీక్షించుటకై ఇక్కడకురాలేదు. మారువచింపక నాకోర్కె నీడేర్చుమని త్వరపెట్టగా నట్లేకానిమ్మని, ఆడుతనమంత్రిపుంగవులందోడ్కొని బయటకేగి;—సచివా, నాకూతురునొకతె నీతపసికిచ్చుటలో నాకేయభ్యంతరమును లేదుగాని, తపోభారముచే జడలుదాల్చుకొని వికారముగానుండు ఈఋషిని, సర్వాంగసుందరీమణులగు నాకూతుండ్రలో నెవరు తానేయొప్పుకొందురో తెలియకున్నదే, ఏమిచేయుదుననగా సచివుండు వినయముతోప మహీధవా! మనమేమిచేయఁగలము? తమ కుమారికలనందఱినిం దెచ్చి యీసంయమీంద్రునెదుట నిలుపుటకేర్పాటుచేసినచో ఆ పైదైవానుగ్రహమున్నట్లు కానిమ్మని హితమెఱింగించెను. అంత రాజట్లే తననూర్గురు పుత్రికలను బిలిపించి యీసంగతి వారికెఱుకపఱచి వారందఱిని నామునికులతిలకు నెదుట నిలవఁజేసెను. పరమ తపోధనుండగు మునిచంద్రుడు తనయోగబలముచేత, నవయావనుండై యీరాజుకూతుండ్ర కగుబడె. రాకుమారికలు నూర్గురును ఆతనిని వరించిరి. ఎల్లరును విస్మయవిభ్రాంతచిత్తులైరి. ఒక్కతెయైన వరించునోలేదోయని యట్లేచూచుచుండిన మహారాజు, ఆశ్చర్యప్రమోదమగ్న మానసుండైయుండి కొంతసేపటికి స్మృతిఁదెచ్చుకొని వారందఱిని నాఋషికిచ్చి వివాహముగావించె. పిదప ఋషి తనసతీశతమును వెంటబెట్టుకొని యరణ్యమునకేగి తనయోగబలముచేత, చిత్రవిచిత్ర భవనములతోఁగూడిన పట్టణమొకటిని నిర్మించి, సుందరతర విలాసమందిరములందు అందకత్తెలగు తనమందగమనలతో కందర్పక్రీడలు గావించుచుండె. నిజతపోబలముచేత ఆకాశవిమానములు కల్పించి గగనమార్గములందు సతీసహితుడై సంచరించుచుండె. వేయేల! క్రీడావినోదములనన్నిటిని సమగ్రముగ నాతడనుభవించె. బహుకాలమట్లు జరుగగా, యోగికి పుత్రులు, పౌత్రులు, ప్ర

పౌత్రులు, కోడండ్రు, మనుమరాండ్రు, మున్నగు బంధుబళగము వారు మితిమీరిన యభివృద్ధిస్థితికి వచ్చుచుండిరి. అనంతధ్యానపరాయణుండగు తాపసి, అనంతసంసార పరాయణుండయ్యె. యోగము రాగముగా మారుచుండె. ఇట్లుండ నొకానొకనాడ తండేడంతస్తుల మేడపైన కతిపయసతీబృందముతో గ్రీడించుచుండ, నాతనియెట్టెదుటనొక తపసి, యాకాశము వంక యోగబలముచే పోవుచుండె. దానిం గాంచిన ఈతపసి కొక్షణమే యోగమునుగురించిన స్ఫురణకలిగె. వెంటనే చిత్తము నవీనభావమొందుచుండె. కొన్నినిమిషములలోపలనే అతనికి యనంతసంసారమునందలి భ్రాంతితగ్గె. ఇట్లగుటకు మూలకారణంబైన, మీనమిథున సురతవిషయిక పర్యవేక్షాస్ఫురణ చిత్తమునందప్పుడేయంకురించె. అంతట నాసంయమి, తనలో, హా పరమేశ్వరా!! ఎంతటిమోసమునకు లోనైతి. నీమాయ గెలువ నెవరితరము. పాలావునిచ్చి గొడ్డెనుమును పుచ్చుకొన్నటుల నిరుపమానమహిమఁగల నా తపోబలమును వ్యర్థపుచ్చి ఈ మోహజాలములో తగులుకొంటినిగదా? గతించినదానికై వగచిన లాభమేమి?

"గతాన్నశోచయేత్ప్రాజ్ఞాః"

అనిగదా పెద్దలు నుడివియున్నారు. మంచిది; ఇంకనే నీ బంధమును దెంచివైచెదను. చాలుచాలు ఈసుఖమీపాటితో చాలునని, నిశ్చయించి యచ్చటనొక విశాలప్రదేశమునందొక స్తంభమునునాటించి, దానిచుట్టును తనవారినందఱిని నిలిపి తానా స్తంభముపై హస్తమునునిచికొని, నిలుచున్నవాడై అంత్యకాలమునందీరీతిగా ఉపన్యసించె.

"ఆమృత్యుతో నైవమనోరథానాం
అంతోస్తివిజ్ఞాతమిదంమయాద్య
మనోరథాసక్తిపరస్యచిత్తం

నజాయతే వైపరమార్థసంగీ॥

ఓ, హితమిత్రబంధువులారా! మృత్యువు సమీపించినది. ఐనను, ఈమూఢమానవుని మనోరథములు సమాప్తిపొందలేదు. ఏమానవుని మనస్సు సాంసారిక విషయములందే ఆసక్తమైయుండునో ఆమానవునకు పరమార్థచింత ఏమాత్రమును అలవడదు. నిజమాలోచింప విషయములు మనలను భోగించుచున్నవేకాని విషయములను మనము భోగించుటలేదు. ఆహా! తృష్ణాప్రభావము నెంత వర్ణించినను తీరదుగదా? అదినాది, ఇదినాది, యని సతీసుతపశువిత్తముల యందపారమైన భ్రాంతియుంచుకొని ఆత్మవిచారమునుబొత్తిగా మఱపుఁజెందువారికి తుదకేమిగతి? ఆహా! ఇదెంతటి దుర్భ్రాంతి! కాలమా మనలను మ్రింగివేయుచున్నది. మానవుడన్నిటియందును అపారమయిన మోహముపెట్టుకొని ధర్మవిచారములేక మైమఱచి యుండునుగాని తాను మోహించిన వాటిలో ఏయేపదార్థము తనవెంబడి యెంతవరకువచ్చి తన్నేవిధముగా కాపాడుచున్నదో ఆరహస్యమునుమాత్రము యోచింపడు. ఔరా! ఈమాయాజాలమెంతటి శక్తిఁగలది? ఎందుకీ భ్రాంతి, యని దీర్ఘముగానుపన్యసించి, ఎల్లవారిని కలయఁజూచి, భాగ్యవంతులారా బ్రహ్మానందము ననుభవింపుడు! అనుభవింపుడు! అనివచించి ప్రణవమునను సంధించి, యోగమార్గమునఁ బరమేశ్వరునియం దైక్యంబై సంసారసాగరమును తరించె.

ద్వితీయప్రసంగం సమాప్తం.

తత్సత్.

కారువల్లి శివరామయ్య.

# కైవల్యమంజరి.

(115–వ పుట శేషము.)

పెఱమతంబట్టులఁ బెద్దగాఁ జూచి
మదినిండు తాల్మితో మన్నింపవలయు.
నీమతంబును బోలె నిఖిలేశుఁ జేర్పఁ
బెఱ వారిమతమును బెంద్రోవసుమ్ము.
సర్వహితంబును జకచ్చా గానడప
నన్నింట సారంబు నరయంగవలయు.
కర్మతత్వంబును గడు మూఢభక్తి
విసపాలవిత్తులు వీనిజయించి
సహాన సామ్రాజ్యంబు సాధింపవయ్య
కర్మముల్ ముఖ్యంబుగా వంచు నెఱిఁగి
వర్తింపవలయును వసుధలో నీవు.
కాకున్న కర్మముల్ కావింపకుండు
వారికం టెను గడు వాసి నేననుచు
భావింపఁ జొత్తువు బలు పెద్దవోలె.
కర్మసంగుల నీవు ఖండింపఁ బోకు
వారు పోవెడిత్రోవ వారిఁ బోనిమ్ము
నిజమెఱుంగుదు వీవు నిర్మలాత్ముఁడవు
కర్మంబులెల్లను గడుఁ ద్రోసితివి
నీకేలయవియెల్ల నిను వారు పట్టి
బాధించి కర్మముల్ పైఁ బెట్టకునచి
శ్శాంతియె చాలు పొమ్మంచు వర్తింపు.
సర్వంబునందును సత్సఁ దాల్పవయ్య
తప్పక యన్నింట దయఁ జూపవయ్య.
విజ్ఞాన నేత్రంబు వికసించెనిపుడు

పూర్వభావంబులుపూర్వకర్మములు
విరసంబులైనీకు వెసఁదోచునేమొ.
అవియునున్నట్టివె యగును గాకేమి?
వానిఁజేయఁగఁబ్రీతివదలిననేమి
కర్మముల్ విడఁచినఁగడతేఱలేని
పామరజనులకుఁబరమహితంబు
మదిఁగోరి వానినిమన్నింపవయ్య.
కర్మంబులన్నియుగణుతించిచూడఁ
దమతమచోటులఁదాముముఖ్యంబు
లుపయుక్తములునగునుర్విలోనమ్ము
వ్రాయనేరనిచిన్నవాఁడుతాగుంత
మోనమాలనుదిద్దుటొప్పగుఁగాదె.
మేల్బంతియావెనుక మేలగునమ్ము
వ్రాలువట్రువలైనవాఁడిదివదలు.
కర్మంబులీరీతిఁగనుఁగొనవలయు
దాటినాఁడవునీవుతాల్మితో వాని
నీకిపుడవిగావునిశ్చయంబుగను.

చిన్నతనంబునఁజిన్నలఁబోలె
మాటలుపనులునుమదిఁదలంపులును
సాగించివయసునసద్బుద్ధిగలుగ
వానినిదిగనాడివర్తింపవలయు.
తనబాల్యదశలోనితట్టాటలెల్ల
మదిలోననెంతయుమఱచినవాఁడు
బాలురతప్పులభావింపఁబోక
సాకితంబునఁజూడఁజాలనివాఁడు
వారికిఁదోడ్పడివారినిదిద్ది
నిర్మలమార్గంబునెఱిచూపలేఁడు.

చల్లదనంబును సంపూర్ణదయయు
సహనంబు నెవ్వేళ సాధింపవలయు
వీరుయూథులు జైనివీడగువారు
క్రైస్తవులీతఁడారబ్బిహిందువులు
వారంచు మదిలోన వగచుట మాని
యేమతం బైనను నేదేశ మైన
నొకరేరూపుగఁ జూడ నొప్పగుసుమ్ము
ఉల్లాసమునఁ జెల్లునుర్విఁ దితీక్షు
నీకర్మఫలమెట్టు నినుఁజుట్టుకొన్న
సంతోషమున దాని సైరింపవయ్య.
కష్టంబులగు నేని గడు ప్రసాదంబు
కరుణాస్వరూపులు కర్మదేవతలు
నీమీదదయ చేసి నీకుఁ దోడ్పడిరి
దానికై చింతింపఁదగదయ్య నీకు.
ఎంతకష్టం బైన నింతెగాయనుచు
నిఁక నెంతరోగామి యీశ్వరుకృపయె
క్రమొకెరేద నేనంచు ముదము వహింపు
పాపకర్మం బెల్లఁ బాసిపోకున్న
బంధంబు లెల్లను బడఁదన్నకున్న
గురుని కైంకర్యంబుఁ గూర్పంగ లేవు.
గురుసేవదీక్ష కైకొన్నాఁడవీవు.
కర్మమహారణ్యమున కాలు దాచితివి
వేపుట్టుకలనైన విడివడరాని
గడుదుస్సహంబగు కర్మఫలంబు
నొకటరెంటనత్రోయ్యనూహ చేసితివి
కష్టంబులిఁక నేల కాకుండునయ్య
యుల్లాసమున వాని నేర్పితి వేనిఁ

దాపంబునందక దాటంగవచ్చు.
మమతను మొదలంట మదిఁ గోయవలయు.
కడుఁ బ్రీతితో నీవు కనుఁగొను వారు
కర్మవశంబునఁ గనుమూసినపుడుఁ
గూర్చు పదార్థముల్ గూలినయపుడు
సంతోషమున నీవు చరియింపవలయు.
సర్వంబు వర్జింపసమకట్టవలయు.
పరహితంబొనరించుఁ బలుమాఱు నిన్ను
సాధనంబుగఁ గొను సాధురక్షకుఁడు.
శిష్యుండు దీనతఁ జిక్కినయేని
సాధ్యంబు గాదది చర్చించి చూడ
సంతోషమున నీవు సార్వకాలంబు
చరియించుటది సుమా సద్వర్తనంబు.
విను సమాధానంబు వివరింతు నింక.

నేకాగ్రతన్బెరనిది చెల్లుచుండు
నేవిధంబుననైన నెచ్చటనైన
గురుకార్యమొకటే కోరి భజింపు.
తక్కిన పనులెన్ని తనుఁ జుట్టుకొన్న
మదిలోన దానిని మఱవంగ రాదు.
తక్కిన పనులను తప్పమాటేల
జనుల మేలునకునై సాగించు పనులు
వాని కార్యంబులు వాని సమ్మతము.
ఫలమింతయైనను బరికింపఁబోక
వానికిఁ బ్రీతిగా వర్తింపవలయు.
శక్తికొలది దీని సమకూర్తునంచుఁ
జిత్తమంతయు నందె చిక్కంగఁబట్టి
చేయఁబూనిన పనిఁ జిత్రింపవయ్య.

పొగడికనాకేలపొమ్మంచుఁదలఁచి
కార్యంబులన్నియుఁగడుశ్రద్ధతోడ
పరమేశుమదికెక్కఁబాటింపవలయు.
కర్తమర్మజ్ఞుండుకన్నంటఁజూడ
నేతెంచునన్నను నేరీతిపనులఁ
గావింతువట్టులఁగావింపుమయ్య.
తెలివికొలఁదిసుమ్మిదీనియర్థంబు.
సర్వంబుఁదెలిసినసత్పురుషులకు
సర్వంబుదీననెచక్కఁగాఁదోచు.
చిన్ననిపెద్దనిచింతింపఁబోక
చేతికబ్బినపనిచెలువందనీవు
శక్తికొలదివేగసాధింపవలయు
సాధువాక్యంబిదిసవరింపవయ్య.
మిన్నుమన్నెననిమిషమాత్రమైన
సత్పథంబునుమానిచరియింపఁబోక
నిశ్చలంబుగనందెనిలువంగవలయు.
సిరులుభోగంబులు చెలులపైఁబ్రీతి
యెవ్వియైననునీడ్వనిట్టట్టుఁబోక
నిశ్చలంబుగనందెనిలువంగవలయు.
మార్గసుఖముఁగాంచిమైసొక్కనీవు
వెలిచెవ్వులన్నింటివెలివెట్టిదాని
సారూప్యమందుచుసార్వకాలంబు
సహజంబుగానందెచరియింపవలయు.
సర్వేశుకథనీవుశపథంబుచేసి
కడకతోఁబథమునఁగాలుపెట్టితివి
వదలుటయుదియాత్మవంచనసుమ్ము
శ్రద్ధాస్వరూపంబుచక్కఁగాఁగనుము.

గురునందుఁగడుశ్రద్ధఁగూర్పంగవలయు
తనశక్తియింతనితలపంగవలయు
కనులారసద్గురుఁగనుఁగొన్నవాఁడు
జన్మజన్మంబులశ్రద్ధతోమెలఁగు.
కానివాఁడైనఁగడుశ్రద్ధతోడ
భావరూపంబునుభజియింపవలయు.
లేకున్నఁదోడ్పడలేఁడయ్యగురుఁడు.
సంపూర్ణముగశ్రద్ధసవరింపకున్న
సత్ఫలపనీదెససాగుటలేదు.
నీశక్తినమ్మికనెమ్మదినిలుపు.
నేనెఱుంగుదునన్నునికరంబుగాను
దడబాటులేదనితలఁచెదవేమొ
తన్నుఁదెలియునంచుఁదలఁచెడివాఁడు
తన్నుఁదాఁదెలియనిదమ్మఁడుసుమ్ము.
నీవెఱింగినదెల్లనిస్సారమైన
వెలుపలిపొరగాదెవివరింపనదియుఁ
బలుమాఱుమన్నయ్యెఁబడనున్నదిపుడు.
నీవుపరంజ్యోతినిర్మలాంశంబు
నీయందునీశుండునిలిచియున్నాఁడు
సర్వసక్తుఁడువాఁడుసర్వనియంత.
అటుగాననీకింతయరసిచూచినను
సాధింపరానిదిజగతిలోలేదు.
నరుఁడుగూర్చినదానినరుఁడోపుఁగూర్ప
నరుఁడగుటయెగాదునారాయణుండ
సాధింపనేర్తునుసర్వంబునేను
నాకెంతయుదియంచునమ్మికతోడ
సర్వకార్యంబులసాధింపఁబోను.

సత్పథంబునఁ బోవు సజ్జనుబుద్ధి
యుకుఱుతునుక పోలె నుఱిది కావలయు

## ముముక్షుత్వము.

వినుముముక్షుత్వంబు వివరింతు నింక
బ్రీతినాఁ జెల్లును బ్రవృత్తిలోనిదియు.
సాధనంబుల కెల్లఁ జక్కని పెద్ద
తక్కిన వానికిఁ దలమానికంబు.
ప్రీతిమిక్కిలి మదిఁ బెఱిగినయేనిఁ
దక్కిన వానిని దానె నేర్పించు
ప్రీతిలేకున్నను బెఱయవి యెల్ల
నిష్ఫలంబులు సుమ్ము నిశ్చయంబుగను
పుట్టుచావులు వీడి పురహరునందుఁ
గలయంగ మిక్కిలి కాంక్షించుటదియె
మోక్షేచ్ఛయందురు మోసపోవకుము.
తనకుమాత్రమె కోరఁదన కాయెఁ గాక
పరులకు దాని చేఫలమేమి కలుగు.
సారమింతియె గాదు చర్చించి చూడ
నానందరూపమై యచలతఁ గాంచు
సంకల్పమయ్యది చక్కఁగాఁ గనుము
నీయందు నియ్యది నింపార హెచ్చి
తక్కిన వానికిఁ దాపీక యుండు
పరిపాకమందిన ఫలమియ్యఁ జాలు.
పరమేశుతో నైక్యభావంబుఁ గాంచఁ
దలఁచుట మోక్షేచ్ఛతథ్యంబు గాను.
దానిఁ గోరుట లెల్ల దనుఁ జుట్టుకొన్న
వినుగును కష్టంబు వెలిఁద్రోయఁగాదు.

పగమేశునందలిభక్తినిండార
వానికిఁదోడ్పడి వానిపోలికను
దానునువర్తింపఁదలపోయవలయు
వినుదయారూపుఁడు విశ్వనాథుండు
వానితోఁజేరంగ వాంఛింతువేని
సంపూర్ణదయయును స్వార్థవర్జనము.
నీయందుమిక్కిలి నెగడంగవలయు.

ఇరుదెఱంగులవీని నిహలోకమందు
విస్తరిల్లఁగఁజేసి విడుదలఁగనుము.
ఎవ్వరినైనను నేవిధంబునను
నొప్పింపకుండుట నుతికెక్కునొకటి
సార్వకాలంబుల సర్వహితంబు
సమకూర్పఁజూచుచుఁజరియించుటొకటి.

కలనైనహింసకుఁగడుదవ్వుచనుము.
పరనిందక్రూరతబలుమూఢభక్తి
హింసలనిమ్మూఁడుహీనజాతములు.
జగదపకారంబుసాధించుటందుఁ
దక్కిన నెవ్వియుఁదమసాటిగావు.
పాపంబులియ్యవి పగవారుదయకు.
పరమేశునందలిభక్తినిండారఁ
గడునీచములవీనిఁగడఁద్రోయవయ్య.

పరనిందయెంతకుఁబాల్పడుచూడు.
దుష్టసంకల్పంబుదోషంబుసుమ్ము
పరనిందదీనిలోఁబ్రభవించుచుండు.
మరిచియుఁజెడ్డయుమహిలోనివాని
నన్నింటఁగలదయ్యయరసిచూచినను.
సుగుణంబుఁదలఁచినసుగుణంబుమించు

దుర్గుణమెన్న నదుర్గుణమగును.
మర్మమియ్యది దీని మదిఁగాంచవలయు.
మేలుకీడును నిట్టు మేదినికీవు
కూర్పంగ నేర్తువు కోరితి వేని.
పుణ్యంబె తలఁచుచుఁ బుడమిలో నీవు
సర్వేశు తలఁపును సాధింపవచ్చు
పాపంబె తలఁచుచు బడఁద్రోయవచ్చు.
పరుని పాపంబులఁ బరికించువాఁడు
దుష్కర్మములు మూఁడు తోడన చేయు.
ప్రథమకర్మంబిది పాపబీజంబు.
మంచిభావంబుల మన్నింపఁబోవు
చెడ్డతలంపుల చిచ్చును రేఁపి
నీచుట్టు ప్రక్కల నిండారఁ జేసి
పెఱవారి దుఃఖంబుఁ బెంచుదువయ్య.
ఇంతియె గాదయ్య యెంచిన తప్పు
నిజముగాఁ బరునందు నిలిచినయేని
నీతలంపులు దాని నెమ్మిఁ బోషించు.
బలమెక్కి యదియును బరుని బాధింపఁ
గ్రిందికి దిగజారి కీడొందువాఁడు.
తఱచుగాఁ బరునందు తప్పు లేకుండు
నీమనంబునఁ గాని నిజముగాఁ దప్పు
పరునందు లేకున్నఁ బాపమేమందు.
నీదుష్టభావంబు నీసహోదరుని
శాపంబులకు నీడ్చుఁ బరికించిచూడు.

(సశేషము.)

పి. సీతాపతయ్య.

# సంధ్యావందనము.

ద్విజుఁడు బ్రాహ్మముహూర్తమందు లేచి శౌచాదికర్మముల నిర్వర్తించుకొని స్నానముచేసి శుభ్రవస్త్రధారణమును చేసి పిదప సంధ్యావందనమును చేయవలయును. ఈసంధ్యావందనమును చేయక ఏకర్మమును చేయఁగూడదు. చేసినను తత్ఫలమును పొందఁడు.

శ్లో॥ సంధ్యాస్నానంజపోహోమో
దేవతానాంచపూజనం
ఆతిథ్యంవైశ్వదేవంచ
షట్కర్మాణిదినేదినే (పరాశరస్మృతి)

బ్రాహ్మణుఁడు సంధ్యాది షట్కర్మములను ప్రత్యహమాచరించవలయును. పరాశరఋషిప్రోక్తమగు ఈ శ్లోకమందు సంధ్యాస్నానంఅని యుండుటవలన సంధ్యయైనపిదప స్నానమనితోచవచ్చును, ఈవిషయమునుగురించి వ్యాఖ్యానకర్తలచ్చటనే వ్రాసియున్నారు. ఏమన, అగ్నిహోత్రంజుహోతి, యవాగూంపచతి అనుస్థలమందు హోమమునుగూర్చి యవాగూపకము సాధనమవుటవలన యవాగూపకమునకెట్లు పూర్వభావిత్వమో అటులనె సంధ్యాస్నానమను స్థలమందుఁగూడ పరిశుద్ధినిగూర్చి స్నానము కారణమగుటవలన పరిశుద్ధుడే సంధ్యావందనాధికారియగుటవలనను స్నానమునకె పూర్వభావిత్వముకాని అన్యమునకు గానేరదు. కావున యథావిధిగ స్నానముజేసి పిదప సంధ్యాకర్మము నాచరించవలయును. 'అహరహస్సంధ్యాముపాసీత' అని శృతి. బ్రాహ్మణుడు ప్రతిదినమునందు సంధ్యనుపాసించవలయును అని చెప్పియుండుటవలన ఇదిభూసురునికి నిత్యకర్మముగా ప్రవర్తించుచున్నది. 'నిత్యత్వంనామఅకరణె ప్రత్యవాయత్వం' దేనిననుష్ఠించకపోయిన

దోషముసంభవించునో అదియే నిత్యకర్మమనబడును. సంధ్యా శబ్దార్థమును గురించి విచారింతము, 'సమ్పూర్వకధ్యై చింతాయామితిధాతుః' 'సమ్యక్ ధ్యాయత్యస్యామితిసంధ్యా' లెస్సగా భగవంతునియందు మనస్సునిలుపుట, భగవంతునిధ్యానించుట యే సంధ్యయనబడును. ఇంతేగాక 'సంధౌభవాక్రియాసంధ్యా' అహోరాత్రముల సంధికాలములయందు చేయదగిన క్రియగావున సంధ్యయనబడునని కొందరార్యులు చెప్పెదరు. కనుకనే

శ్లో॥ ఉపాస్తేసంధివేళాయాం నిశాయాదివసస్యచ
తామేవసంధ్యాంతస్మాత్తు ప్రవదంతిమనీషిణః॥

అహోరాత్రములయొక్క సంధివేళయందు జేయదగిన కర్మముగావున దీనినిసంధ్యయని యార్యులు వచించెదరు. ఈ సంధ్యాకర్మ మూడువిధములు.

శ్లో॥ సంధ్యాత్రయంతుకర్తవ్యం
ద్విజేనాత్మవిదాసదా॥

ఆత్మజ్ఞానమును గుర్తెరిగిన బ్రాహ్మణునిచేత ఎల్లప్పుడు సంధ్యాత్రయము జేయదగినది. ఆసంధ్యాత్రయ కాలనిర్ణయము స్మృతులయందిట్లు చెప్పబడియున్నది.

శ్లో॥ ప్రాతస్సంధ్యాంసనక్షత్రా
మధ్యమాంస్నానకర్మణి
సాదిత్యాంపశ్చిమాంసంధ్యా
ముపాసీతయథావిధి

ప్రాతస్సంధ్యను సనక్షత్రముగను, మాధ్యాహ్నికసంధ్యను స్నానానంతరమందును, సాయంసంధ్యను సూర్యసహితముగను యథాశాస్త్రముగ నుపాసించవలయును. సంధ్యయన భగవద్ధ్యానమని చెప్పియుండుటవలన నీ కాలములయందు చేయుటముఖ్యము. ఎట్లన మనస్సు మనోవ్యాకులము చేత శూన్యమై నిద్రానందముచే విడువబడి మొదట నిర్మలముగా

నుండును. కనుక ప్రాతఃకాలము సత్వగుణ ప్రధానమైనది. అట్టికాలమందు భగవంతుని ధ్యానముచేయుట మంచిది. మనస్సుక్రమముగా సత్వగుణమునువదలి రజోగుణమునుపొంది సాంసారిక కృత్యములయందు ప్రవేశించి ఆయాసమునుపొంది క్షుద్బాధితమై భోజనప్రయత్నమును చేయును. భోజనమునకు పూర్వము భగవంతునిధ్యానముజేసి ఆభోజ్యమును ముందుగా భగవదర్పణము జేసి భుజించవలయును. అటుల భగవదర్పణమును జేయక భుజించగూడదు. భగవద్గీతలయందు తృతీయాధ్యాయమందు

శ్లో॥ యజ్ఞశిష్టాశినస్సంతో ముచ్యంతేసర్వకిల్బిషైః
తేత్వఘంభుంజతేపాపా యేపచంత్యాత్మకారణాత్

భగవదారాధనరూపమైన యజ్ఞమును జేయగా మిగిలిన దానిని భుజించుచు సత్పురుషులు సర్వపాపములచేత విడువబడుచున్నారు. ఎవరు తమ నిమిత్తము పాకముచేయుచున్నారో ఆపాపులు పాపమునె భుజించుచున్నారు అనిచెప్పబడియున్నది. సాయంకాలము మూడుగుణములలో నీచమైన తమోగుణ ప్రధానమైనది. అట్టికాలమందు మనస్సుచెడకయుండుటకై భగవద్ధ్యానముచేయవలయును. ఇంతేగాక మందేహులనురాక్షసులు బ్రహ్మవరముచేత సుప్రసిద్ధమైన బలముగలవారలై లోకబాంధవుడగు సూర్యునిరాకకడ్డుపడి ఘోరయుద్ధమును ప్రత్యహము చేయుచుందురనియు అటుల దినకరగమన నిరోధకులగు రాక్షసుల హననమునకుగాను బ్రాహ్మణులు సూర్యోదయమునకంటె పూర్వమేస్నానమును జేసి పరిశుద్ధులై అంజలిచే జలమునుగ్రహించి యాజలమును గాయత్రీమంత్రముచే నభిమంత్రించి సూర్యునికెదురుగా వదలిన యామంత్రోదక బిందువులు బాణరూపములై యారాక్షసుల సంహరించుననియు పిమ్మట సూర్యుడు సుప్రసన్నుడై లోకమును తనసహస్ర కిరణములచేత ప్రకాశింపజేయుననియు వేదమందు సయితము చెప్పబడియున్నది.

హారీత స్మృతియందు

శ్లో॥ తస్మాన్నలంఘయేత్సంధ్యాం
సాయంప్రాతస్సమాహితః
ఉల్లంఘయతియో మోహాత్
సయాతినరకంధ్రువం॥

కావున సాయం ప్రాతఃకాలములయందు ద్విజుడు స్థిరచిత్తుడై సంధ్యను విడిపించగూడదు. ఎవడు మోహామువలన విడిపించుచున్నాడో వాడునిశ్చయముగా నరకమును పొందుచున్నాడు.

శ్లో॥ సంధ్యాహీనోశుచిర్నిత్య మనహాస్సర్వకర్మసు
యదన్యత్కురుతెకర్మ నతస్యఫలభాగ్భవేత్॥

సంధ్యావందనమును జేయనివాడు అపవిత్రుడు, ఏకర్మమును చేయుటకుతగడు. ఇతరములైన కర్మములను జేసినను ఆకర్మమువలన గలుగుఫలమును పొందడు.

శ్లో॥ సంధ్యాయేనవిజ్ఞాతా సంధ్యాయేనానుపాసితా
జీవమానోభవేచ్ఛూద్రో మృతశ్వానోభిజాయతె॥

ఎవనికి సంధ్యావందనము తెలియదో ఎవడు సంధ్యావందనమునుచేయడో వాడు బ్రతికియుండియు శూద్రుడు. వాడు మృతుడై శ్వానముగా జన్మించును. కావున సంధ్యాకర్మము నేమరక సకాలమందు జేయవలయును. ఇటుల యథావిధిగ సంధ్యాదికర్మముల నాచరించుటచేతనే మనపూర్వులు బ్రహ్మావర్చస్సంభూతులై "పరాధీనవృత్తి నవలంబించక తమకాలమును స్వేచ్ఛగా వెళ్లగడిపిరి. ఇదానీంతనులగు కొందరి దుస్థితి నిచూడుడు. సూర్యోదయప్రభృతిచేయు వ్యాపారములను సావధానచిత్తులై సక్రమముగ చేయుచు సంధ్యావిహితకాలము నతిక్రమించుచు తాముచేయుకాలమందైన యథావిధిగచేయక వాయువేగ మనోవేగములను ధిక్కరించువేగముచేత పాణినీయ

సందుగల ఆదిరంత్యేనసహేతయను సూత్రవిహితమగు ప్రత్యాహారమును మధ్యమధ్య యీసంధ్యయం దుపయోగించుచు పచనాదికము విషయమై జాయామలను తొందరపెట్టుచు భావికార్యాలోచనము చేయుచు బహువిధములగు ప్రయత్నములతో నీ సంధ్యాకర్మమును పరిసమాప్తి పొందించుచున్నారు. ఇట్టివారు శరీరారోగ్యము గూడలేక మనస్వాస్థ్యశూన్యులై పరాధీనవృత్తిగలిగి సకలకష్టములకులోనై దుస్థితిని పొందుచున్నారనుటకు సంశయముండదు. గీతలయందు శ్రీకృష్ణస్వామి యర్జునునికి చెప్పుటచూడుడు.

శ్లో॥ నియతంకురుకర్మత్వం కర్మజ్యాయోహ్యకర్మణః
శరీరయాత్రాపిచతే నప్రసిద్ధ్యేదకర్మణః॥ (అ 3 )

నీవు నీకునియతమైన కర్మమునుజేయుము. కర్మానుష్ఠానముమిక్కిలి శ్రేష్టమైనది. కర్మాచరణ శూన్యునికి శరీరధారణము సయితము సిద్ధింపదు. ప్రవరాఖ్యునికట్టి సౌందర్య సౌకుమార్య సౌశీల్య ధనధాన్య సమృద్ధులు గలిగియుండుటకు కారణము నియతకర్మానుష్ఠానముచేతనేయని మనుచరిత్రమును చదివినవారలకు ద్యోతకముకాకమానదు. ప్రథమాశ్వాసము 55 పద్యమును చూడుడు

సాలగ్రావమునున్న గాగోనడు
మాన్యక్షేత్రముల్ పెక్కుచందాలంబండు
నొకప్పుడుందరుగదింట్లంబాడియుంబంటయుః

శ్లో॥ యాచిన్తాభువిపుత్రపౌత్ర
భరణవ్యాపారసంరక్షణే
యాచిన్తాధనధాన్యభోగ
యశసాంలాభేసదాజాయతే
సాచిన్తాయదివేదమాతృచరణాం
భోజేక్షణేహైతుకీ

కాచిన్త్రాయమ రాజభీను సదన
ద్వారప్రయాణేన్నృణాం॥

ఆర్యులారా మీయొక్క మనస్సును భూసంపాదనమందును తద్రక్షణమందును సమస్త భోగ్యములయందును ప్రపంచమందు కీర్తిసంపాదనమందును సర్వదా ఎటుల వినియోగించెదరో అందుస్వల్పభాగమును క్షణకాలము సంధ్యావందనమను వేదమాతయొక్క పాదారవిందమున నుంచినయెడల మరణసమయమందు భయంకరమగు యమునియొక్క పిలుపుకాలమందు చింతయెట్లుకలుగును. అనగా త్రికాలములయందు యథావిధిగ సంధ్యావందనమును జేయువానిని యముడుగూడ ఏమియుంజేయజాలడు. ఇట్లు ఆత్మహితమై యిహపరసాధకంబగు నియతకర్మమును త్యజించువారలు తాముచెడుటయటుండగా నొరులనుగూడ చెరచుచు లోకమును పాపభూయిష్ఠముగ జేయుచున్నారనుటకు సంశయముండదు. కావున స్వోదరపూరణార్థము సూర్యోదయాదిగ జేయుకర్మములలో నీసంధ్యావందనమునుగూడ పరిగణించి యితరకర్మములనువలె యీకర్మమునుగూడ సావధానచిత్తులై చేయుచువచ్చిన సకలశ్రేయములొనగూడును.

గొల్లపూడి శ్రీరామశాస్త్రి,
వంగవోలు.

—— :0: ——

## జాబులు.

### యువతీ వివాహము.

(1) శ్రీకాకుళపట్టణంబున ప్రసిద్ధులగు మ॥రా॥ కోలాచలం వెంకట్రావుగారి తమ్ములగు కవివర్యులగు శ్రీనివాసరావుగారి కొమార్తెను ఈ జ్యేష్ఠశుద్ధ ౧౦ దినంబున బర్‌హంపూరులోనుండు బారిస్టరు విశ్వనాథరావుఅను వరశ్రేష్ఠునికిచ్చి వారిగృహములో

నే వివాహకార్యము శాస్త్రసమ్మతంబుగ వైదికశ్రేష్ఠులు యేలోప ములేక జరిపిరి. ఈవధూమణి రజస్వలయై రెండుసంవత్సరముల కు పైబడినది. శిశువివాహంబులు సరికావనియు, అశాస్త్రీయంబులనియు వీరికి నిశ్చయముగ తోచినందున ఈసత్కార్య మందేలాటి కష్టనిష్ఠూరములుకలిగినను ధైర్యముగలిగి చేయవలె నని సంకల్పించిరిగనుక వీరి అభీష్టము యేలాటిభంగములేక నెర వేరెను.

బళ్లారిపట్టణములోనుండు లౌకికులందురును వైదికులలో బహుజనులును వివాహకాలమందు వచ్చియుండి వధూవరులను ఆశీర్వదించి ఫలతాంబూలంబులు గైకొని వెళ్లిరి. వచ్చినవారి లో బహుమంది యీవివాహమును గురించి శ్లాఘించినవారేగాని నిందించలేదు. వెంకట్రావుగారిని, శ్రీనివాసరావుగారిని యిం దుకై కొనియాడుచుండిరి.

పెండ్లిభోజనమునకుకూడా బహుమంది వచ్చియుండిరి. ఎవరికిగాని యెవరినుండియు ఆక్షేపణకలుగలేదు. వీరుబహు మందికి యీసద్విషయమై దారిచూపినందుకై జనులందరు కృత జ్ఞతచెంది యుండవలయు.

సత్కార్యము వాడుకలోలేనందున తత్కాలమందెందరి కి విరోధమై తోచుచున్నను, ధైర్యముగలగి చేసినపుడు అదినెర వేరకపోదు. ధర్మమునకు ఈశ్వరుడు సహాయముచేయకమా నడు. మహర్షులు తోడ్పడుదురుగనుక అందరు శాస్త్రీయము లైన యిట్టివివాహములను చేయించు మనమాతృభూమియగు హిందూదేశమునకు పూర్వపుయశస్సు ప్రాప్తింపచేయుచము.

జం. శ్రీనివాసరావు.

-:0:-

(2) దివ్యజ్ఞాన సభాధ్యక్షులగు శ్రీఆనిబిసంటమ్మగారు లండనుపట్టణమునకు దయచేసి యుండినసంగతి అందరికి తెలిసే

యుండవచ్చును. వీరచ్చట అనేక యుపన్యాసములిచ్చిరి. వీరి స్వాగతమకఁడివారు అత్యంతకుతూహలముతో నిరీక్షించుచు అనేకప్రముఖ జనులు వీరుదిగుస్టేషనుకు ఎదురొఁనుటకై వచ్చి యుండిరి. శ్రీఆనిబిసంటమ్మగారు దిగినతోడనే వారందరు సాదరపూర్వకంబైన బహుమానముతో స్వీకరించి పరమానందభరితులైరి. వీరిఆగమనముననే సజ్జనులానందించకుండరు?

ఈమాతో శ్రీగారు ఈనెల 10 తేది నీదేశమునకు విజయము చేయుదురు. వీరుమద్రాసు హైకోర్టువారితీర్పుపైన ప్రివీకౌన్సిల్ కు (న్యాయాగ్రేససభకు) చేసినఅపీలులో పరిపూర్ణముగ జయప్రదమొందిరి. వీరుహైకోర్టులో వాదించుసమయమున యేఅంశములు న్యాయమైనవనియు, న్యాయాధిపతులైన జడ్జీలచే అంగీకరించదగినవనియు దృఢముగ చెప్పినను అంగీకరించక తిరస్కరించఁబడినవో ఆయంశములన్నియు ఆసభవారు న్యాయమైనవనియు, యుక్తమైనవనియు అంగీకరించి హైకోర్టువారితీర్పును రద్దుపరచి అమ్మగారికి అన్నికోర్టులలో వెచ్చమైన ఖర్చులన్నియు వాదియగు జిడ్డునారణయ్యగారిచ్చునట్లు తీర్పుచేసిరి. వీరీ వ్యాజ్యమందించుకైన సత్యముతప్పక దృఢముగనిలిచి సత్యముననే జయము కలుగజేసిరి.

సత్యమేవజయతే నానృతమను ఉపనిషద్వాక్యము కోర్టు వ్యవహారములో సయితము స్థిరపరచిరి.

వీరిజయప్రదమునుగురించి యీదేశజనులు పొందినఆనందమింతంతని చెప్పనలవిగాదు.

"సర్వత్రసర్వకాలేషు, సర్వకార్యేషుజయావిజయభవ, దిగ్విజయ భవ"

అని అందరు ప్రార్థింతుము.

జం. శ్రీనివాసరావు.

## CONTENTS OF THIS NUMBER.

:o:



:o:

Registered No. M. 716.

ఓమ్



# దివ్యజ్ఞానదీపిక.

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక

(సత్యమునకంటె వేరు పరధర్మము లేదు).

సంపుటము 5. August 1914. ఆగష్టు నెల 1914. సంచిక 5.

## విషయసూచిక.

పుట



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher*.

ఓమ్



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

**August 1914.**

సంపుటము 5. ఆగష్టునెల 1914. సంచిక

## సర్వభూతముల ఐక్యభావము.

వేదాంతశాస్త్రమునఁ జెప్పఁబడియుండెడు నన్నిసిద్ధాంతములలో నగ్రగణ్యమైనది సమస్తభూతముల యొక్క ఐక్యభావము. అదియె సర్వధర్మములకు మూలము.

శ్లో॥ యథాప్రకాశయత్యేకః కృత్స్నంలోకమిమంరవిః
క్షేత్రంక్షేత్రీతథాకృత్స్నం ప్రకాశయతిభారత॥

తా॥ ఓయర్జునుడా! ఒకఁడైన సూర్యుఁడుసమస్తమైన లోకముల నేలాగున ప్రకాశింపఁజేయుచున్నాఁడో ఆలాగుననే పరమాత్మసమస్తమైనప్రపంచమును ప్రకాశింపఁజేయుచున్నాఁడు.

అని భగవద్గీత 13 అధ్యాయమునఁ జెప్పఁబడియున్నది. మఱియును శ్వేతాశ్వతరోపనిషత్తునందు

ఏకోదేవస్సర్వభూతేషుగూఢః
సర్వవ్యాపీసర్వభూతాంతరాత్మా॥

సర్వభూతములయందడఁగియున్నవాఁడును సర్వవ్యాపియు సర్వభూతముల కంతరాత్మయునైయున్న యీశ్వరుఁ

డొక్కఁడేయని చెప్పఁబడియున్నది.

లోకములకెల్ల సూర్యుఁడొక్కఁడేయుండయ్యు నానాస్థలములందెట్లు ప్రకాశించునో అవ్విధముననే ఆత్మపదార్థ మొక్కటియయ్యు భిన్నములగు నుపాధులయందుఁ బ్రకాశించుచున్నది. సూర్యకిరణములు ప్రపంచమందెల్ల నెట్లునిండియున్నదో అటులనే జగదీశ్వరునియొక్క కిరణములనఁదగు జీవాత్మలు ప్రపంచమెల్ల నిండియున్నవి. భూతాత్మలన్నియు వేర్వేరుగనుండునట్లు బాహ్యమునఁ గోచరించుగాని యథార్థముగ నన్నియు నవిభక్తములైయున్నవి.

శ్లో॥ అవిభక్తంచభూతేషు విభక్తమివచస్థితమ్॥ (గీ-13 అ.)

బ్రహ్మపదార్థము భూతములయందు ప్రత్యేకప్రత్యేకముగ నుండునట్లగుపడినను వాస్తవమున నవిభక్తమైయుండు.

ఈసిద్ధాంతమే సర్వధర్మముల కాధారము. జీవన్ముక్తులకు దక్క నితరుల కీతత్త్వము ప్రత్యక్షానుభవముగానోపదు. అయినను వివేకియగువాఁడు బుద్ధిచే దానియథార్థమును గ్రహించి యాచరణకు దెచ్చుకొనఁదగు. మన మనంబున నియ్యది యెంతస్థిరముగఁ బట్టుబడునో మనమంత ధర్మాత్ములమగుదుము. ఆత్మయొక్కటియగునేని నితరులకు నేఁజేయుబాధ నన్నుంబీడించుఁ గదా. ఎవఁడుగానితనచేతితో తనపాదమును ఛేదించుకొనునా? ఏయంగమునకు బాధకలిగినను దేహమునకంతయు బాధయగుఁగదా! అటులనే సమస్తభూతములును నీశ్వరుని శరీరమై యొప్పు. శరీరముననేభాగమున నొప్పిదగిలినను శరీరమునకంతయు నొప్పియగు. అటులనేభూతమునకు హింసగలిగినను నన్నిభూతములకు బాధయగును. కావున ఆత్మయొక్కటియను నిశ్చయమెవనిమనంబున దృఢముగ నెలకొనునో వాఁడేప్రాణికిని నీషత్తైన హింససేయఁడు. అట్టివాఁడే సర్వభూతములయందుఁ దన్నును తనయందు సర్వభూతములనుంబొడగనును.

అట్లు సర్వభూతములయందు సమబుద్ధిగలవానికి శాస్త్రబోధితములగు విధినిషేధములతో నక్కఱలేదు. అట్టివాఁడెల్లప్పుడు సర్వభూతములకు హితమగుమార్గముననే వర్తిల్లుచుండు.

సర్వభూతములందు సమబుద్ధికలుగుట దుస్తరము. మహనీయులకుగాని యది లభించదు. అట్టిజ్ఞానము లేనివారికి శాస్త్రవిచార మావశ్యకము. ఎట్టియాచరణము లోకమునకు మేలుదెచ్చునో ఎట్టిది కీడొనర్చునో జ్ఞానదృష్టిచే నెఱింగినవారు గనుక శాస్త్రకారులగు మహాత్ములు 'ఇట్లు చేయుము ఇట్లు చేయకు' మని శాసించియున్నవారు. కావున శాస్త్రములు ప్రమాణములు. జనసామాన్యమునకు పుణ్యపాపముల విభేదము శాస్త్రసహాయమువలననే యెఱుఁగదగియున్నది. పరమార్థదృష్టితోఁ జూచువారికి శాస్త్రసిద్ధాంతములు సహేతుకములును యుక్తియుక్తములునై గన్పట్టు. ఒకవేళ నట్లుగన్పట్టకున్నను నంతమాత్రముననే శాస్త్రములఁ దృణీకరించి యిష్టానుసారము ప్రవర్తించఁదగదు. కేవలము నిర్మలమైన మనస్సుతో విచారించువారికిమాత్రమే ఇదిధర్మము ఇదియధర్మమునని తెలియనగు. సామాన్యమనుజుని మనస్సు నిర్మలమైయుండదు. కామక్రోధాది దుర్భావములతోఁ గలిసియుండు. తనకెయ్యది లాభకరమగునని వాఁడాలోచించుగాని లోకమునకెద్ది శ్రేయస్కరమగునని వాఁడాలోచింపఁడు. తనకార్యమును బరిత్యజించియైనను లోకమునకు మేలుగోరువాని మనస్సుమాత్రము నిర్మలమైయుండు. నిర్మలమనస్సునకే ధర్మముగోచరించు.

ఈవిషయము భారతమందిట్లు చెప్పఁబడియున్నది.

కం॥ ధర్మమధర్మము భంగిన
ధర్మముధర్మంబుమాఱుఁదనయాతోఁచున్
నిర్మలమతినరయవలయు
ధార్మికతంగోరువారు దమకేర్పడఁగన్॥

మానవకోటియంతయు పరస్పర భ్రాతృసంబంధము కలిగియున్నారని చెప్పుటకు నీయేకత్వమే యాధారము. ఒకరికి జేసినమేలు లోకమునకంతయు మేలగు. ఒకరికిఁజేసినకీడు లోకమునకంతకీడగు. ఇతరులకెగ్గుజేసి తాములాభము వడయఁగోరువారు కేవలమవివేకులు. అట్టితలంపెన్నటికిని కొనసాగదు.

శ్రీకృష్ణస్వామి భగవద్గీతయందు "నిర్వైరస్సర్వభూతేషు" అనియు "అద్వేష్టాసర్వభూతానాం" అనియుఁ బెక్కుచోట్ల భూతములయెడ వైరభావముకూడదని యుపదేశించియున్నాఁడు.

ఇంకను శాస్త్రములయం దనేకచోట్ల భూతద్వేషము గర్హింపఁబడియున్నయది. సమస్తభూతములం దాత్మభావముగలిగియుండుటయే జ్ఞానలక్షణమనియుం జెప్పఁబడియున్నది. దీనికంతయుం గారణమేమి? సర్వభూతముల ఐక్యభావమే కారణము.

ఈయైక్యభావమునే శ్రీకృష్ణమూర్తి భగవద్గీతయందు 7 వ అధ్యాయము మొదలు 10 వ అధ్యాయాంతమువఱకు ననేకవిధముల నుపదేశించెను. 10 వ అధ్యాయమున నియ్యది విశేషముగఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ అహమాత్మాగుడాకేశ సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చమధ్యంచ భూతానామంతఏవచ॥

తా॥ అర్జునా! సమస్తభూతములయొక్క హృదయములనుండునట్టిఆత్మ నేనే. భూతములయొక్క ఆదిమధ్యమాంతములు నేనే. అని ప్రారంభించి ప్రపంచముననుండు ప్రధానవస్తువులెల్ల తానేయని నిర్దేశించిచెప్పి సూర్యుఁడు, చంద్రుడు, దేవతలు, ఋషులు, నరులు, పర్వతములు, నదులు, వృక్షములు, గజములు, అశ్వములు, పశువులు, పక్షులు, సర్పములు సమస్తము

దానని వచించి కడపట నిట్లనియె.

శ్లో॥ యచ్చాపిసర్వభూతానాం బీజంతదహమర్జున
నతదస్తివినాయత్స్యా న్మయాభూతంచరాచరమ్॥

తా॥ సమస్తభూతములకు నేదిబీజమో అదినేను. ఇంత ఏల! స్థావరజంగమాత్మకమైన భూతసమూహమున నేనుగాని వస్తువేద్దియును లేదు.

స్వామి 7 వ అధ్యాయము మొదలు 10 వ అధ్యాయము వఱకు నీవిషయమును వ్యాఖ్యాపముగ బహువిధముల నుపదేశించి పిమ్మట 11 వ యధ్యాయమున నర్జునునికిఁ బ్రత్యక్షనిదర్శనము సేయఁగోరి విశ్వరూపముంజూపి యిట్లనియె.

శ్లో॥ ఇహైకస్థంజగత్కృత్స్నం పశ్యాద్యసచరాచరం
మమదేహేగుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥

తా॥ ఓయర్జునుఁడా! స్థావరజంగమాత్మకమైన సమస్తజగత్తును నాశరీరమునందుఁ జూడుము. ఇంకను నీవేమేమి చూడఁగోరెదవో అంతయు నిచటఁజూడుము.

అనిభగవంతుఁడు చెప్పి విశ్వరూపముంజూపఁగా నర్జునుని కట్లనగనిపించె.

శ్లో॥ తత్రైకస్థంజగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా
అపశ్యద్దేవదేవస్య శరీరేపాండవస్తదా॥

తా॥ అపుడు భగవంతునియొక్క విశ్వరూపమునందు నానానామరూపములుగ విభజింపఁబడియుండు సమస్తజగత్తును ఒక్కచోటనున్నదానిగా నర్జునుఁడుచూచెను.

ఇంకయు ననేకస్థలములందు కృష్ణమూర్తి యీవిషయము నుపదేశించి యున్నవాఁడు.

శ్లో॥ సమంసర్వేషుభూతేషు తిష్ఠంతంపరమేశ్వరమ్
వినశ్యత్స్వవినశ్యంతం యఃపశ్యతిసపశ్యతి॥
సమంపశ్యన్హిసర్వత్ర సమవస్థితమీశ్వరమ్

సహినస్త్యాత్మనాత్మానం తతోయాతిపరాంగతిమ్
యదాభూతపృథగ్భావ మేకస్థమనుపశ్యతి
తతఏవచవిస్తారం బ్రహ్మసంపద్యతేతదా

(13 అ. 27. 28. 30)

తా॥ సమస్తభూతములయందు సమానముగానుండునట్టి పరమేశ్వరుని, సర్వప్రపంచము నశించినను నశింపనివానిగా నెవ్వఁడు దెలియుచునో వాఁడే నిజమును దెలిసికొనినవాఁడు.

సమస్తప్రాణులందును సమముగానున్నట్టి యీశ్వరుని చూచుచున్నవాఁడు తనచే దన్నుహింసించుకొనఁడు. దాని వలన మోక్షమునుఁ బొందుచున్నాడు.

నానావిధభేదములుగా గన్పించెడు భూతములన్నియు నొకటియగు నాత్మయందే గల్పింపఁబడినవని మనుజుడెప్పుడు చూచునో అప్పుడేవాఁడు బ్రహ్మమగును.

ఇవ్విధమున నీవిషయము భగవద్గీతయం దచ్చటచ్చట ననేకస్థలములందుఁ జెప్పఁబడియుండుటయే గాక నుపనిషత్తులన్నియు ననేకవాక్యముగ నుద్ఘోషించుచున్నయవి.

ఎవనిమనంబునఁ దనకును సమస్తభూతములకుంగల యైక్యభావము దృఢముగ నాటుకొనునో వానికి సర్వభూతములయెడ ప్రేమగలిగియుండు. ప్రేమతో నిండినమనస్సుగలవాఁడు సేయుకార్యములన్నియు లోకమునకు హితమైయుండు. అవి పుణ్యకార్యములగు. అటులగాక పృథగ్భావము గలవానికి భూతములయెడ ద్వేషబుద్ధి గలిగియుండు. ద్వేషపూరితమైన మనస్సుతోఁ జేయుకార్యములన్నియు లోకమునకు పీడాకరములైయుండు. అవిపాపకార్యములగు. పుణ్యపాపవిభేదమునకు నిదియె మూలము.

పరమాత్ముని నరసింహయ్య.

# మహాపురుషుడవతరించుటకిదిసమయమా?

(128-వ పుట శేషము.)

శ్లో॥ బ్రాహ్మణేదారుణంనాస్తి మైత్రోబ్రాహ్మణఉచ్యతే
ఆచార్యస్సర్వభూతానాం శాస్త్రాకింప్రహరిష్యతే॥

తా॥ బ్రాహ్మణునియందు క్రూరముండదు. బ్రాహ్మణుడు సర్వభూతములకు మిత్రుడై ఆచార్యుడుగా నుండవలయు.

ఆచార్యుడు తాను పరిశుద్ధుడై సదనుష్ఠానపరుడై సర్వదా సత్కర్మములు సేయుచు నితరులచే చేయించుచుండవలయు.

శ్లో॥ ఆచినోతిహిశాస్త్రాణి ఆచారేస్థాపయత్యపి
స్వయమాచరతేయస్మాత్ తస్మాదాచార్యఉచ్యతే॥ (మను)

తా॥ శాస్త్రములను బాగుగచదివి, చదివినప్రకారము తానాచరించుచు, ఇతరులను ఆచరింపజేయువాఁడే ఆచార్యుఁడు.

పూర్వము బ్రాహ్మణులను గొప్పగాతలంచి ఆచార్యులుగా నెంచుచుండినందుకు ముఖ్యకారణ మిదే. మొదటతాము తమశక్తికితగిన శ్రేష్ఠములైన ఆచారములను ఆచరించుచు ఇతరులను వారివారి శక్తికితగినట్టివియు, వారు ప్రకృతమున్న స్థితికంటె నెక్కువస్థితికి అందుటకు తగినవియునైన సదాచారములను ఆచరింపజేయుచుండిరి గనుకనే వారిని పూజ్యులుగా నెంచియుండిరి. శ్రుతిస్మృతులలో చెప్పినట్లాచరించకుండియుండిన వారికి ఆఫలములభించి పూజనీయులుగా చేయుచుండలేదు.

శ్లో॥ ఆచారాద్వ్యచ్యుతేవిప్రో నవేదఫలమశ్నుతే
ఆచారేణహిసంయుక్తః సంపూర్ణఫలభాగ్భవేత్॥

వేదములను చదివి వానిననుసరించి ఆచరించని బ్రాహ్మణునికి వేదముల ఫలము లభించదు. ఆయాచారమ్ములతో కూడియుండు వాడు. వేదములఫలమును సంపూర్ణముగపొందును.

పూర్వపుబ్రాహ్మణులు, లోకసారభూతములుగల దేహం

బులను నిర్మలమనోభావంబులను, బ్రాహ్మణులకు ముఖ్యధనంబగు ఏకత్వ సమత్వములను, భూతదయా స్వభావంబునుపొంది, సర్వభూతములకు మిత్రులై, వేదములనుపఠించి, తదాచరణ పరత్వముచేత ఆచార్యులై ఎవ్విధంబున లోకములను తరింపజేయుచుండిరో ఆవిషయమునుగురించి ఇంక విచారింతము.

శ్లో॥ జపైర్హోమైశ్చ హోమైశ్చ
స్వాధ్యాయాధ్యాపనేనచ
నావం వేదమయీంకృత్వా
తారయంతితరంతిచ॥

జపములచేతను, దివ్యమంత్రములచేతను, హవనహోమములచేతను, వేదాధ్యయనము చేయుటచేతను, అధ్యయనమితరులకు చెప్పుటచేతను, విద్య నేర్పుటచేతను, వేదమునే నావగాచేసికొని నావికుడెవ్విధంబున ఇతరులను నావలో నెక్కించుకొని దరిచేర్చి తానును దరిచేరునో అవ్విధంబుననే బ్రాహ్మణులు జనులనందరిని తరింపజేసి తామును తరించుచుండిరని మహాభారతారణ్య పర్వమందు చెప్పబడియున్నది.

నిరంతరము భగవన్నామ జపము సేయుటచేత చేసినపాపములు తొలగిపోవుటయేగాక ముందుపాపములు చేరకుండును. "కస్యనపాపంజపతః" ఎవరికి పాపములుండవు? జపము సేయువానికని శ్రీశంకరాచార్యులవారు ప్రశ్నోత్తర రత్నమాలయందు చెప్పినారు. పాపరహితుడుగనుండువాడేసత్కార్యము చేసినను ఆకార్యము పవిత్రతచెంది సఫలమగును.

బ్రాహ్మణుం డితరుల పాపములను నివారణసేయుటే అతనికిస్వధర్మము. మొదట తాను పాపరహితుడు కాక యితరుల పాపములను నివారించుట యెప్పటికిని కాదు. దీనిచేతనే సర్వభూతముల హితమునకై బ్రాహ్మణుడు జపించుటచేత తన పాపములు మొదట నశింపజేయుచుండెను. జపముచేత పాప

ము లెల్ల తొలగిపోవునని అడుగవచ్చును. జపించవలసిన నామ ములు, మంత్రములు, చతుర్విధవాక్కుల రహస్యము తెలిసిన మహనీయులచే నియమింపబడినవి. ఆవాక్కులేవియన:—

శ్లో॥ చత్వారివాక్పరిమితాపదాని
తానివిదుఃబ్రాహ్మణాయేమనీషిణః
గుహాత్రీణీనిహితానేంజయంతి
తురీయంవాచోమనుష్యావదంతి॥

పదములన్నియు నాలుగువిధములగు వాక్కులందు ఇమిడి యున్నవి. వాటిని పండితులగు బ్రాహ్మణులు ఎరుగుదురు. ఆ నాలుగువిధములగు వాక్కులలో మూడుగుప్తములు. అవియె ప్పటికిని యుండును. నాలుగవవాక్కు మనుష్యులు పలుకు చున్నారు అని శృతి నుడువుచున్నది. ఈ వాక్కులకు వైఖరీ, మధ్యమ, పశ్యంతి, పరావాక్కులనియు, నాదబిందుశక్తి కళలనియు నామాంతరములుగలవు. నాదమనధ్వని. ఏనాదము కలుగవలసియున్నను చలనము (కదిలి) కావలసియుండును. చలనములేక ధ్వని యెప్పటికి కలుగదు. చలనవేగ భేదమునను సరించి (According to the rate of the rapidity of vibration) నాదభేదములుండును. చలనము (స్పందము) కలుగచే యునది పరావాక్కు, కళ లేక శక్తి. (Force) ఈశక్తి తారతమ్యము ననుసరించి చలనవేగ బలముండును, ఈబలమునుపట్టి వర్ణమేర్పడును, వర్ణమేర్పడినతరువాత నాదము (ధ్వని) పుట్టును. ధ్వనులలో, (నాదముల్లలో) పలు తెరంగులున్నవని అందరికి విశదమేకదా? చెవులకింపైన ధ్వనులు, మనస్సుకుల్లా సము కలుగజేయు ధ్వనులు, హృదయమందు భయోత్పాతము చేయుధ్వనులు, శోకముకలుగజేయునవి, ధైర్యముపుట్టించునవి, భక్తినభివృద్ధిజేయునవి, ఇంకననేక తరగతుల ధ్వనులు ఈచలన భేదముల ననుసరించి కలుగును. మేఘగర్జనయు, సౌదా

మినీకాంతియు (మెరుపు) పిడుగుపడి వృక్షములు, గృహములు, మనుష్యులు, పశువులు కాలిపోవుటయు మేఘములు వాయుబలముచే చెలించుటచేత నేకదా కలుగుచున్నవి? పిడుగు విద్యుచ్ఛక్తి (Electric force). మేఘములందు మిక్కిలి వడిగల వాయుబలముచేత వేగమైన చలనముకలుగకున్న పిడుగుపడదు. వాయుబలము తగ్గినకొలది మేఘఘర్జనబలమును తగ్గును.

మానవశరీరము ఆకాశాది పంచభూతాత్మకమైనది. ఈ భూతముల స్థూలసూక్ష్మాంశములనుపట్టియు నాడీబంధభేద తారతమ్యము ననుసరించియు జనుల దేహస్వభావ భేదములేర్పడియుండును. దేహస్వభావములనుపట్టి గుణములేర్పడియుండును. విషయవిరక్తి, విషయానురక్తినిపట్టి సుగుణ దుర్గుణములు క్రమముగా నేర్పడియున్నవి. విషయవిరక్తి కనుకూలముగు భూతాణువులును, విషయానురక్తి కనుకూలములగు భూతాణువులును మానవశరీరమునందు చేరియుండును. విషయాసక్తి అభివృద్ధికితగిన అణువులు విస్తారముగ గలవారు ధర్మముతప్పి అమితముగ విషయము లనుభవించుటచేత పాపిష్ఠులనబడుదురు. పాపకార్యములు సేయుటకు తోడ్పడుభూతాణువులు దేహమందభివృద్ధి కాను కాను అట్టికార్యములు జనులు విశేషముగజేయుచుందురు. ఇట్టిభూతాణువులు పెరుగకుండను, ఉండినవి నశించునట్లును చేయుటచే పాపములుసేయుట తగ్గుచువచ్చును. అట్లగుటకు వాక్కులరహస్యము తెలిసిన మహనీయులు భగవన్నామములు, మంత్రములు జపించుటకు నియమించినారు ఎవరుగాని దేనిని ఉచ్చరించవలసియున్నను మొదట లోపలచలనము పుట్టవలెను. ఆచలనముపుట్టుటకు శక్తికావలెను. చలనశబ్దముచే వర్ణముత్పత్తియగును. ఆవర్ణమునకు తగిన ధ్వని వెడలును. భగవన్నామోచ్చారణకు కావలసిన శక్తి, చలనవేగబలము, వర్ణము ఇవిఅన్నియు విషయాసక్తిని వృద్ధిచే

యు నికృష్టమైన భూతాణువులను నాశముచేసి విషయవిరక్తియు భక్తియు వృద్ధిచేయుట కనుగుణ్యమగు భూతాణువులను చేర్చును. నామముఅనేకమారు లెడతెగక జపించుటచే దేహాముందు గలుగు చలనవేగముచేత అగ్నియుత్పత్తియై నికృష్టభూతములను నాశముచేయును. ఇట్లుచేయుట మనకు గోచరముకాకపోయినను ఆప్రకారము నికృష్టాణువులు నాశమై వానిస్థానమందుత్కృష్టాణువులు చేరుసేమో సత్యము. జఠరాగ్ని మనము భుజించుపదార్థములను యెట్లుపచనచేయునది మనమెరుగుదుమా? భగవన్నామములు జపించుటచేత స్థూలసూక్ష్మాది దేహములు పరిశుద్ధమగును. తద్వారా ఏదేవనామము జపించుదుమో ఆదేవునియందేకాగ్రత కలుగును. దానిచే మనసు పాపకార్యములను తలంచుటకు విరామములేకపోవును. గనుక జపముచేత పాపములు నివారణమగునని చెప్పబడినది.

చలనవేగ బలముచేత వస్తువులు పరస్పరముఒరయుటచేత అగ్నిపుట్టి ఆవస్తువులనుకాల్చివేయును. అరణ్యమందు మ్రాకులు ఒకటికొకటి వాయుబలముచే నొరసికొనుటవలన అగ్నిపుట్టి ఆయగ్నిచే మ్రాకులు కాలిపోవునుకదా? అవ్విధంబుననే నామజపముచే కలుగు చలనవేగబలముచే పుట్టిన అగ్ని మానవదేహామందు నిండియుండు పాపకార్యములుసేయుట కనుకూలమైన నికృష్టాణువులను కాల్చివేయును.

టెనిసన్ అను పశ్చిమదేశకవివర్యుడు తననామమునే పలుమారు జపించుటచే బహిఃప్రజ్ఞనువదలి సమాధినిచెంది ఆనందమునుపొందినట్లు వ్రాసియున్నాడు. కాబట్టి నామజపముచే దేహామనంబులు పరిశుద్ధతచెందును.

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

—:0:—

# అవతారములు.

(136-వ పుట శేషము.)

నేను నిర్దేశము జేయు సిద్ధాంతాభిప్రాయము మీకును సమ్మత మయ్యేలాగున కొన్ని ప్రమాణములను జూపదలచినాను. మరుగు మాటలేల, ప్రవర్ధమానముయొక్క (Evolution) ఫలసంపత్తియే అవతారము. అవతారపురుషులు పూర్వకాలములయందు ఖనిజ, సస్య, జంతు, మానవవర్గములయందు క్రమముగావృద్ధియై తుదకు జీవన్ముక్తదశనుబొంది అమానుషస్థితికెక్కి నిత్యసూరుల పరంపర లో ప్రవేశించియున్నవారు. వారుభిన్నభావమున కతీతులై ఈశ్వరునితో నేకీభవించి యతనిఅఖండప్రజ్ఞతో కలసియున్నారు. నిత్యమును నేచైతన్యమునుండి తొల్లి వారు బయలువెడలిరో మరల నాచైతన్యములోనే వారుఐక్యమైయున్నారు. వస్తుతః ఆచైతన్యమునకు వారికి నభేదమున్నను జ్ఞానముతో నాయేకత్వ మును సాక్షాత్కరించుకొని యున్నారు. పరిధిలేకయున్న కేంద్రమువలెవారు పరమాత్మయందు ప్రకాశించుచున్నారు. వారికి అనేకజన్మములు గడచిపోయియున్నవి. నరస్థితినుండి యవతారపురుషపదవికి బోవననేకజన్మములు పట్టును. అవ తారపురుషపదవికి రెండుముఖ్యసాధనములున్నవి. వానిని నరజన్మమందే సాధించి ప్రదర్శించవలయును. అట్టివాడే ఆప దవికి పర్వరచబడును. ఆసాధనములలో మొదటిది భక్తి. భక్తి యన తనదైవమందు సంపూర్ణప్రేమ. ఆప్రేమతోకూడ జ్ఞాన సాధనమున్నయెడల అవతారపురుష పదవికి యోగ్యత కలుగు చున్నది. "భక్తిచేనన్నుపొందుచున్నారు" అని శ్రీకృష్ణస్వా మి ఆనతివ్వలేదా? అవతార పురుషస్థితికి వెళ్లదలచినవానికి "భక్తి" అంతఅతిశయసాధనముగా నుండుటకు కారణములేక పోలేదు. అవతారపురుషుడు శక్తిలోను జ్ఞానములోను ఈశ్వ

రునితో సమానుడై అతనివలె లోకమందు ప్రకాశించుకొరకు అతనిలోనొక కేంద్రమును ప్రతిష్ఠించుకొని అవసరము గలిగినపుడు ఆ కేంద్రముచుట్టు పరిధిని కల్పించుకొనుటకు సామర్థ్యుడై యుండవలెను. ఎట్టిరూపమందైనను తాను సంకుచితముగు నట్లుండవలెను. కేంద్రములేక రూపముగలుగదుగదా! అతడు కేంద్రమును కలుగజేసుకొనుట మొదటిపని. కేంద్రమేర్పడినపిమ్మట రూపముకలుగుట సులభము. యజ్ఞముచేతనే ఈశ్వరుడు జగమును కలుగజేసియున్నాడు. అవతార పురుషస్థితికి వెళ్లదలచినవాడు ఈశ్వరుని నిరంతర యజ్ఞకార్యములో భాగియై సంతోషముగ లోకహితము సలుప నాసక్తుడై యుండవలెను. కనుకనే, తనదైవికమార్గమందు బోవుచున్న యమ్మహాత్మునికి భక్తియొకటేచాలదు. ఈశ్వరునివలె మానవకోటిపై ప్రీతిగలిగి యుండవలెను. ఆహా! మానవకోటియని చెప్పిన అర్థసంకోచమగుచున్నదిగదా! జగమందుండు సమస్త చరాచరములను ప్రీతించు హృదయానుకంపము అతనికుండవలెను. అట్లులేకున్న తాను సృజించియుండు వస్తువులలో ప్రాణప్రీతులను నించియున్న అఖండశాశ్వతుడైన ఈశ్వరునివలె లోకమందు ప్రకాశించుటకు అతడు సమర్థుడు కాజాలడు. "నన్నువిడిచి చరాచరములయందెద్దియులేదు" అని శ్రీకృష్ణమూర్తి యానతిచ్చి యుండలేదా? (గీతా 10. 39.) వస్తువులు రమ్యములైయున్నను, మంచివిగానున్నను లేకున్నను, ఆకర్షించినను, అపకర్షించినను, లేకున్నను వాటిని ప్రేమించుసామర్థ్యమును కలుగుజేసుకొనకపోతే ప్రతియొక రూపమందున్న ఆత్మను కనుగొను శక్తిని కలుగజేసుకొను మనుష్యులు అవతార పురుషపదవికి కొనిపోవు పటవాలు మార్గమును ఎక్కజాలరు.

కనుక అవతారపురుషపదవికి బోదలచినవారు (1) తాము ఏకీభావమునుబొందు స్వామిని ప్రేమించవలెను. ఇదియే భక్తి.

(2) ఆస్వామిచైతన్యమే ఎవరియందున్నదో అట్టిజీవకోటికి కారుణ్యమును జూపవలెను. ఈ రెండు సాధనలను ఏమానవుడు సాధించి సహజవృత్తులుగా తనయందుంచుకొనునో అతడే అనేక కల్పములు కడచినపిదప నెద్దియోనొక జగత్తులో స్వామియై మర్త్యలోకమం దవతరించును.

అవతార పురుషుని లక్షణములను గురించి పైజెప్పిన అభిప్రాయములలో అనేకులకు ఇంకను సంశయముండవచ్చును. ఈవిషయమును జనులు విమర్శచేయక నుండుటచేతను, తమ మతస్థులలో ఎవరోయొక గొప్పవారుచెప్పిన వాక్యమునే ప్రమాణముగా నంగీకరించి యుండుటచేతను, సంపూర్ణముగా తెలుసుకొనుటకు యత్నించకుండుటచేతను, వారికి సంశయముపుట్టుట సహజమైయున్నది. జనులుయెద్దియోనొక అర్థమునుచేసికొన్న పిదప ఆయర్థము శ్రుతిస్మృతి వాక్యములకు భిన్నముగానున్నట్టు వెల్లడియైన తమఅర్థమునకు తగినట్టు ఆశ్రుతిస్మృతి వాక్యములను అన్వయించుకొనియెదరేగాని తమఅర్థమును విడువరు. ప్రతియొకమతమందును నిట్టి వాడుకయున్నది. సంప్రదాయముచేతను, అభ్యాసబలముచేతను, వంశానుగతముచేతను, లోకాభిప్రాయముచేతను, తాత్కాలిక సందర్భములచేతను బద్ధులై జనులు అభిప్రాయములను కలిగియుందురు. ఒకకాలమునకు మాత్రమేచేరక, ఒకయుగమునకుమాత్రమే సంబంధించక, ఒక జనపదమునకుమాత్రమే అన్వయించక కేవలము సనాతనమగు ధర్మములనే వెల్లడిజేయు వేదమువంటి గ్రంథములలో తమసంకుచితాభిప్రాయములకు భిన్నించిన వాక్యములుండినచో బాహ్యాకదృష్టిగల జనులు తమఅభిప్రాయములకు సమంజసమగులాగున ఆవేదవాక్యములనే అన్వయించెదరు. వ్యాకరణ సూత్రములకది విరుద్ధముగానుండినను, అనుభవార్థమునకు భిన్నముగానుండినను ఆవాక్యములకు పదియోనొకనూతనార్థములను కల్పిం

చి వ్యాఖ్యానముజేసియున్న వాఖ్యానకారుల బుద్ధికౌశల్యమును ఎరుగనివారెవరు? ప్రతియొక మతప్రభేదమందును ఇట్టియసంగతకార్యములు నడచియుండుటయేగాక వారివారిబుద్ధికి పట్టువిషయములను మాత్రమే బోధించియున్న తత్త్వవేత్తల వాక్యములకు అర్థాంతరములనుకల్పించి యవియే తత్త్వవేత్తల యభిప్రాయముల ని సాధించుచు సద్భావవృద్ధిమార్గమందున్న మానవకోటికి చిక్కుల ను కలుగజేయుచున్నారు.

తానుపదేశించిన సత్యమును స్వతఃఎరిగి తానుపక్వదశలోనున్నను తనఉపదేశమును గ్రహించువారు ఇకను బాల్యావస్థయందున్నారని తెలుసుకొనియున్న యొకమతోద్ధారకుని దృష్టాంతమును ఇచ్చోటచెప్పిన నాయభిప్రాయము తేటతెల్లమగుచున్నది. మతత్రయస్థాపకులలో నొకడగు శ్రీరామానుజులు భగవద్గీతకు చేసియున్న వ్యాఖ్యానమును త్రిమతస్థులు చదువుట మంచిది. ఆవ్యాఖ్యానములో "బహూనిమేవ్యతీతాని జన్మానితవచార్జున" యనిశ్రీకృష్ణుడానతిచ్చియుండుచోట అతనిజన్మములెన్నోవిధములైయుండెనని వ్రాసియున్నారు. అటుపిమ్మట శ్రీకృష్ణుడు ఈశ్వరస్థితికి వెళ్ళినతరువాత పొందినజన్మ విశేషములనుమాత్రమే జెప్పియున్నారు. ఆజన్మములను తనస్వేచ్ఛచేతనే ఎత్తియుండెనుగాని కర్మవశుడైగాని బాహ్యనిర్బంధమునకులోబడిగాని వాటిని బొందలేదని యథార్థమునే అతడు వ్రాసియున్నాడు. ఈశ్వరస్థితికి రాకమునుపు శ్రీకృష్ణుడు ఎక్కడెక్కడ ఏయేజన్మములను బొందియుండెనో అతడువ్రాయలేదు. లోకులకు శ్రీకృష్ణస్వామిని యొకపూజార్హమైన మూర్తిగా ప్రదర్శించివారికి భక్తిని గలుగజేసి తద్ద్వారా వారికియాత్మవికాసము చేకూరునట్లు చేయుటయే యతనిముఖ్యోద్దేశమైయుండినందువల్ల శ్రీకృష్ణుడు ఈశ్వరపదవికి పోకముందు ఎత్తిన అనంతజన్మముల విషయమును రామానుజులు ప్రస్తాపించక విడ

చియున్నారు. ఇంతటితో శ్రీకృష్ణునికి పూర్వకల్పములయందు జన్మములుండలేదని భావించకూడదు. ఈశ్వరస్థితికి రాకమునుపు అతనికి అనంతజన్మములు కడచిపోయియుండెను. వానినన్నిటిని విడిచి శ్రీకృష్ణుడు తనయిచ్ఛానుసారముగా పరిగ్రహించిన దేవ, నాగ, గంధర్వ మొదలైన జన్మముల సుగతినిమాత్రమే రామానుజులు చెప్పియున్నారు. దశావతారములేగాక శ్రీకృష్ణుడు మరియుకొన్ని జన్మములను స్వేచ్ఛగా పొందియుండెనని మీకు తెలిసియుండవచ్చును. అట్లు తెలియకున్న భాగవతమును జదివితిరేని తప్పక తేటపడుచున్నది. స్వామిధరించియుండెనని జెప్పిన ఆధునికులకు చోద్యముగాదోచు చిత్రవిచిత్ర రూపములను శ్రీకృష్ణస్వామి ధరించియున్నట్టు ఆగ్రంధములో వ్రాయబడియున్నది. ఆరూపముల రహస్యార్థమును ఆస్వామియే వేరొకచోట ఆనతిచ్చియుండుటచేత చోద్యపడుటకు కారణములేదు. తత్వరహస్యమును బోధజేయు యోగవాశిష్ఠమను గ్రంధములో బ్రహ్మ, విష్ణు, మహేశ్వర పదవులకు జీవులు క్రమముగా నెక్కెదరని స్పష్టముగా జెప్పబడియున్నది.

శ్లో॥ పౌరుషేణైవయత్నేన సహసాంభోరుహాస్పదం
కచ్చిదేవచిదుల్లాసో బ్రహ్మతామధితిష్ఠతి॥
సారేణపురుషార్థేన స్వేనైవగరుడధ్వజః
కశ్చిదేవపుమానేవ పురుషోత్తమతాంగతః॥
పౌరుషేణైవయత్నేన లలనావలితాకృతిః
శరీరీకశ్చిదేవేహ గతశ్చంద్రార్ధచూడతాం॥

(2. ముముక్షుప్రకరణం 4 వ అధ్యాయము 14-15-16).

అట్లనే, దేవీభాగవతములో 3 భాగం 5 అధ్యాయం శ్లో 21 మరియు నీలకంఠవ్యాఖ్యానమును జూడుడు:—

"అనేకచబ్రహ్మాదీనాం జీవత్వంస్పష్టమేవోక్తం"

మరియు 4 భాగం 2 అధ్యాయం 8 12 13 శ్లోకముల

వ్యాఖ్యానమును జూడుడు.

శ్లో॥ సురత్వంచమనుత్వంచ రాజేంద్రత్వంలభేన్నరః
కర్మణాచశివత్వంచ గణేశత్వంతథైవచ॥
కర్మణాచమునీంద్రత్వం తపస్విత్వంస్వకర్మణా
స్వకర్మణాక్షత్రియత్వం వైశ్యత్వంచస్వకర్మణా॥
(దేవీభాగవతం 4 భాగం 27 అధ్యాయం 20 21 శ్లోకములు).

చక్కగా ఆలోచించిన పైనుదాహరించిన సంగతి యథార్థమనే తేటపడుచున్నది. అయితే, ఇందువలన నాపదవులయందున్న మహానుభావుల ప్రాశస్త్యమునకు కొరత గలుగునని ఎప్పటికిని భావించరాదు. ఏలనన, సద్వస్తువు ఒక్కటే. అదియే జగచ్ఛరీరమందు ఈశ్వరుడుగాను, మానవశరీరమందు జీవుడుగాను వేరువేరుగా పరిణమించుటకు ఆధారభూతమైన నిత్యమూలముగా నున్నది. అద్వితీయమైన ఆ ఏకవస్తువే సుస్థిరముగానున్నది. ఆయాత్మవస్తువుయొక్క చైతన్యముతప్ప వేరుచైతన్యమేలేదు. ఆత్మయొక్క స్వాతంత్రముతప్ప వేరుస్వాతంత్రమేలేదు. ఆత్మయొక్క స్వస్థితితప్ప వేరుస్వస్థితియేలేదు. ఆయాత్మనుండి దేవతులు, మనుష్యులు, ఇతరప్రాణులుపుట్టి ఆత్మయొక్క శాశ్వతచైతన్యముతోకూడి ఆత్మయందేఉన్నవి. అభివ్యక్తిలో వేరువేరు అంతస్థులు కనుబడుచున్నవేగాని అభివ్యక్తమగు వస్తువుమాత్రము ఒక్కటే.

ఆయొకవస్తువే నానాస్థితులయందు ప్రకాశించు చున్నది. భగవద్గీతా 2 అధ్యాయం 20 శ్లోకమందు చెప్పబడిన ప్రకారము నరులయందున్న ఆత్మవస్తువు (“అజోనిత్యశ్శాశ్వతోయం పురాణో”) పుట్టుకలేనిదై, నిత్యమై, శాశ్వతమై, పురాణమై, యుండుట యథార్థమైతే అదిస్వయంసత్తుగానుండు వస్తువుతోనేకమైయుండవలయును. అటువలెనే ఈశ్వరుడుకూడా అద్వితీయమైన యాసద్వస్తువుయొక్క ఉత్కృష్టప్రకాశమై యుండ

వలయును. "అతడు శ్వాసోచ్ఛ్వాసములకంటె సమీపమందును, చేతులుకాళ్లకంటె సమీపమందును నున్నాడు" అనియొక ఆంగ్లేయకవి దేవుని వర్ణించియున్నాడు. ఆత్మనీయందును, నాయందును, ఈశ్వరునియందును ఉన్నాడు. శాశ్వతమై, వ్యత్యాసములేనిదై, నాశరహితమై, ఏకమైయున్న ఆత్మనుండియే ప్రతియొక వ్యక్తియు బయలుదేరి దానియొక్క యొక్కొక కిరణముగానున్నది. భక్తిపురస్సరముగా మనము నమస్కరించుచున్న మహామహిముడుకూడా అగణితములై పూర్వకల్పములనుండి క్రమముగ నభివృద్ధిజెంది యామహోన్నత పదవికి వచ్చియుండుట నిశ్చయమే. ప్రపంచమందు స్వామియై యవతరించుకొరకు ఆయాత్మవస్తువులోగదా సంసిద్ధుడైయుండును.

అవతారములోమరియొక వాస్తవికమైన ప్రభేదమున్నది. పూర్ణావతారమను శబ్దము వాడుకలోనున్నదిగదా! దాని అర్థమేమి? ఈశబ్దమును శ్రీకృష్ణావతారమునకే ఉపయోగించుచున్నారుగదా! కారణమేమి? అఖండవస్తువుకు పూర్ణావతారమను శబ్దము సమన్వయించదు. ఏలనన, అఖండవస్తువు ఎట్టి రూపములోను సంపూర్ణముగా ప్రకాశించజాలదు. ఆ వస్తువునుజూడ నేత్రమునకు శక్తిజాలదు. అయితే ఆవస్తువే అయియున్న ఆత్మకు ఆవస్తువునుగ్రహించు సామర్థ్యమున్నది. అట్లైన, పూర్ణావతారమనగానేమి? నిరాకారమగు నఖండవస్తువు ఆకారపరిమితిలోనెంత అధికముగా ప్రకాశించవచ్చునో అంతఅధికముగా లోకహితమునాచరించదలచి అవతరించియున్న స్వామియందు ప్రకాశించుననని యర్థము.

(సశేషము.)

ఎం. వెంకట్రావు.

-:o:-

# కైవల్యమంజరి.

(152-వ పుట శేషము.)

గుణమెల్ల వానికిఁ గుదరక యున్న
నీతలంచినయంత నిజమగునట్టు
వానిఁ గావింతువు వసుమతియందు.
ఇంత మాత్రమె గాదె యింకను గలదు.
చెడ్డతలంపులు చెలరేఁగు నీకు
మంచితలంపులు మటుమాయమగును
నీవృద్ధిదానట్టె నిలుచును సుమ్ము
సూక్ష్మదేహము చూడ సుందరంబగుచు
నింపులుగులుకుట యెంతయు మాని
కడువికారముఁ జెందికన్నీరు దెచ్చు.
దివ్యదృష్టికి నిట్టు దెలియును సుమ్ము.
తనకును నెదిరికిఁ దప్పని కీడు
తా నింత చేసియుఁ దనివోవఁ డయ్య
తక్కిన వారికిఁ దన దోషము కట
పంచి పెట్టఁగ జూచుఁ బాడుదూషకుఁడు.
విను వారు నమ్ముచు విస్మయంబంద
బలుసంభ్రమంబునఁ బరులకు వాఁడు
చెన్నటికతయింత చెవిలోన నూదు.
ఇంతంత గాదయ్య యీ వెనక్కపాటు
వీఁడు వాఁడనె గాక వేన వేలుగను
గుసగుసవోవుచు గుంపులుగూడి
శాపోదకంబులు చల్లుదురయ్య.
అయ్యలకక్కలుగూడి యాదరింపగను
దిక్కుమాలినకత దిగువాటు లేక

తీఁగలుసాగుచుదెసలకుఁబాఱు.
పరనిందఁబుట్టినఫలమెంతో చూడు.
దానికి వెలిగాగధరణి వేఱొకటి
నీచంబు పాపంబు నెవకిన లేదు.
పరులనిందింపకు పాపమందకుము.
పరునితప్పెవఁడైన భాషించెనేని
విననొల్లనేననివీడొఁకనుమయ్య.
నీకతపరికింపనిజముగాదేమొ
నిజమైననేమయ్యెనెనరుతో నీవు
భాషింపకుండుటబలువాసియంచుఁ
దిన్నగా వానికిఁ దెల్పుట మేలు.
క్రూరతఁజూపుటకొయ్యతనంబు
బుద్ధిపూర్వకమునబుద్ధిపూర్వకము
నన రెండువిధములనవి చెల్లుచుండు.
పరికించినీచపుఁబ్రాణికినైనఁ
గడకతో నొప్పింత కాపించుటదియె
బుద్ధిపూర్వకహింస పూని చేయకుము.
పాపంబులందిదిపరమనీచంబు.
రాక్షసకృత్యంబురట్టదియగును
మానుషకృత్యంబు మదినెంచఁగాదు.
పషాపియొడిగట్టునింతకునంచుఁ
దలఁపఁగాఁబోకుము ధరణిలోఁగలరు.
పూర్వముకొందఱుపుణ్యాత్ములకట
పరులనుబలుమారుపడఁగొట్టినారు.
ప్రతిదినంబునునిష్టుప్రాణులన్నింటి
హింసించుచున్నారుహీనమానవులు.
మతమంచుఁబరులనుమర్దించువారు

వైద్యులమని ప్రాణివధఁ జేయువారు
కూడంచు గొంతులఁ గోసెడివారు
చదువంచు బాలురఁ జదిపెడివారు
పరికింప నెందఱు పాపులు లేరు
పుణ్యపూరుషులార పోనిండు దీనిఁ
జెన్నటి కార్యంబు చేయ నేలన్న
నాచారమిదియంచు నదలింతురయ్య
పలువురు చేసినఁ బాపమంతటనె
పుణ్యంబు కాఁబోదు పూజ్యంబు గాదు.
ఆచారమని కర్మ మడలఁ గాఁబోదు
పాపంబు తప్పదు పట్టి బాధించు.
హింసకు మించిన హీనకర్మంబు
వెతకిచూచిన లేదు విశ్వంబునందు.
భారతదేశంబు పరమపావనము
సన్ముని ప్రవరుల సంచారభూమి
పున్నెంబులన్నింటి పుట్టిన యిల్లు
ధర్మంబు బోధించి దరిచూపు తల్లి
సర్వభూతదయకు జన్మదేశంబు
పరుల హింసించుట పాపంబఁటంచు
నెఱుఁగని మూఢాత్ములిచ్చట లేరు.
అటులయ్యు నిచ్చట నరసిచూచినను
సర్వవిధంబుల సాగెడు హింస.
పాపమియ్యది దీనిఁ బడఁ దన్నవలయు.
వేటాఁడి జీవుల వెతకి వధించు
పాపాత్ముఁడును హింసపరగించువాఁడు
నరకంబునకుఁ జేరు నష్టాత్ములయ్య.
తమకు వేటవినోదతాండవమంట

జంతువులకు బ్రాణచలనంబుగాదె.
పశుపతికూనలబాధించువాఁడు
తప్పకనరకంబుఁదాఁజెందుటరుదె.
గురువాక్యమరసినగుణశాలివీవు
నీవేలచేసెదునీచపాపముల.
పరమేశునకునీవుపరమభక్తుఁడవు
సమయమబ్బిననీవుచక్కగాఁదెలిపి
కడుదోషములవీనిఖండింపవయ్య.
పాపకృత్యమెగాదుపరికించిచూడ
మనుజులహింసింపమాటలుగలవు
పరుషభాషణములఁబరులనొప్పించు
కఠినాత్ముఁడాతఁడుకడుఁబాపిసుమ్ము.
మర్మముల్ నాటంగమాటాడఁబోకు
తెలిసినొప్పించెడితెగులట్టులుండ
నేమఱుపాటుననిట్టట్టుపలుక
నొక్కొక్కతఱిఁగష్టమొరులకుఁగలుగు.
మాటలచేనీవుమఱపుననైన
హింసఁగావింపకుమెప్పుడుఁగాని.
పరికింపకుండినఁబరహింసపుట్టు.
పేరాశలోభంబుపెనుపిశాచములు
పట్టిమైమఱచినపలుగాకినరుఁడు
పరులకష్టంబింతపరికింపఁబోఁడు
పిచ్చబత్తెములిచ్చిపేదలనొంచు.
చాలిచాలనితిండిఁజదికిలఁబడిన
యాలుబిడ్డలకైననన్నంబునిడఁడు
కామంబుచేఁగన్నుగాననివాఁడు
తనసుఖంబునెచూచుఁదనకామమునకు

ధర్మంబు దేహంబు దత్తంబు చేసి
నరకంబు దెసఁ బోవు వారలఁ గనఁడు
తన దేహకష్టంబుఁ దప్పింపనొకఁడు
కాలంబు లోపలఁ గడుఁ బ్రీతితోడ
జీతంబు లియ్యఁడు జీతగాండ్రకును
వారి సంకటముల వాఁడెన్నఁ బోఁడు.
ఇన్ని కష్టంబులు నింత పాపంబుఁ
దన కార్యఫలమింత తా విచారించి
కావించె నేనవికలుగవు కాదె.
మఱచినఁ దాని వి మఱచు గాకేమి?
మఱపులు సహజంబు మనుజులకంచు
మఱవదు కర్మంబు మన్నింపఁ బోదు.
సత్పథంబున నీవు చనఁ గోరుదేని
నీ కార్యఫల మెల్ల నెమ్మదిఁ గనుము.
కనకున్నఁ బరులను గడు నేపుఱిల్లి
హింసించి పోదువు హీనంపు గతికి.

మూఢభక్తి తలఁప ముని ముచ్చు సుమ్ము.
కష్టంబుఁ గావింపఁ గడు పెద్ద దాని
క్రూరచర్యలు గాంచ గుండెలు పగులు.
దీని సేవించుచుఁ దిరుగు మూర్ఖుండు
జ్ఞానుల దూషించి చాలు పొండనును.
నాపోలికి మీరును నడచుట మేలు
రండంచు వారిని రాయిడి పెట్టు.
దాని ఫలముఁ జెప్పఁ దరము గాదయ్య
పర దేవతకుఁ బ్రీతి పశువధయంచు
తలఁప సాధ్యము గాని ఖలలఁ ద్రెంచుచు నురు
మాంసంబు తినకున్న మనలేఁడు నరుఁడు

తానంచుజీవులతలలఁద్రెంచుచుదురు.
కడుఁబాపమియ్యదికడఁద్రోయవలయు
హిందుదేశమునందుహీనజాతులను
మటమటలాడుచుమన్నింపరయ్య.
సోదరభావంబుచొప్పడమీరు
సర్వజీవులఁబ్రీతిసంరక్షచేసి
వర్తించుటదిమాన్యవర్తనంబనుచుఁ
గడుపుచల్లఁగదయఁగన్నమాయమ్మ
మనపుణ్యదేశంబుమనకుబోధించు.
బోధింపనేమారెుఁబుయిలోటలేక
మనదేశమందలిమతిమంతులెల్ల
నీచులువారనినిరసింతురయ్య
మూఢభక్తియెదీనిమూలంబునమ్ము
దానికిఁబారంబుఁదలఁపఁగాలేము.
పరమదయానిధిపరమేశ్వరుండు
వానిపేరునుజెప్పివసుధలోజనులు
రాకాసిదీనికిరాణువయగుచు
ప్రాణులహింసింపఁబడగెత్తినారు.
జతనంబుతోనీవుచయ్యనదీని
మొదలంటఁగోయుటముఖ్యంబునమ్ము
పాపంబులిమ్మూఁటఁబాఱఁగాఁగొట్టు.
పరికింపదయకిషిపరమశత్రువులు
సన్మార్గమునసిన్నుసాగిపోనీవు
హింసమాను టెగాదుహితమునునీవు
పూర్వకాలంబునుసమపూర్వవలయు.
జన్మసాఫల్యంబుజన్ములకుహితముఁ
గావించుటయెుయంచుఁగడకనేవేళ

సమయంబుఁ గోరుచుఁ జరియింపవయ్యా.
జనులకె కాదయ్యా జంతువులకును
స్థావరంబులకును దయతోడ నీవు
మేలుఁ గూర్చుచు భువి మెలఁగంగవలయు.
ప్రతిదినంబును నీవు పరులకు హితము
గోరంత పనులందుఁ గోరి కావింప
సద్వర్తనము నీకు సహజమయ్యెడిని.
దీని ఫలంబింత స్థిరమగు నమ్ము
గొప్ప కార్యంబది కూడుటయరిది
కూడిన యపుడింత కొంకక దాని
సాధింప నేర్తువు చక్కగా నీవు.
విశ్వనాథుని జేర వేఁడుట లెల్ల
నీ సుఖంబెంతయు నిండఁగాదయ్యా
నీవు కారణముగ నిఖిలేశుప్రీతి
భూతంబులన్నింటిఁ బోషింపనమ్ము
సత్పథంబునయందుఁ జరియించువాఁడు
పరహితంబును జేయ బ్రతుకుచున్నాఁడు.
తన మేలు గోరఁడు తడబాటునైన.
పరులకు హితమును బరగింపఁ గోరి
తన్నుఁ దాను మఱచి తార్మితోఁ దిరుగు.
సర్వేశునకుఁ దాను సాధనంబగుచు
వాని సంకల్పంబు వమ్ముగాకుండ
వసుధలోఁ జక్కఁగా వర్థిల్లఁ జేయు.
తన మనంబున నిండి తనుపారుచుండు
పుణ్యోదయారసంబు దెసలు నిండ
జీవులమీదఁ దాఁ జిమ్ముచునుండు
సర్వహితము నేర్పు సద్జ్ఞానమదియుఁ

జకర్ర దానినడపుసంకల్పమదియు
దీనిఁ బ్రేరేపించుదివ్యదయయును
నీగుణంబులుగాఁగ నెమ్మదిఁగోరు.
సచ్చిదానందంబుసర్వేశురూపు
వానికింకరుఁడవైవర్తింపఁగోరు
నీవునీగుణములనిర్మలశ్రద్ధ
జగతిలోనే వేళ సాధింపవలయు.
గురుఁడుసెప్పినత్రోవఁగోరివర్తింపు.
గురుఁడుపదేశించెగుప్తయోగంబు
చకర్రగాదీనినిజర్పించినీవు
ఘఅవకనుష్ఠించిమఱుపుట్టులేక
కైవల్యరాజ్యంబుఁగాంచుటశుభము.
కౌశికగోత్రుండుకవిజనప్రియుఁడు
సీతాపతిరచించిశివునకర్పించె
నాచంద్రతారార్కమైయొప్పుగాఁత.

సంపూర్ణము.

పి. సీతాపతయ్య.

—————:0:—————

త్రికరణముల కూడిక.

శ్రుతి॥ యన్మనసాధ్యాయతి, తద్వాచావదతి, యద్వాచావదతి,
తత్కర్మణాకరోతి, యత్కర్మణాకరోతి తదభిసంపద్యతే॥

అనగా జీవుడు దేనిని మనస్సుతో ధ్యానించునో దానిని వాక్కుతో చెప్పును; దేనిని వాక్కుతోఁ జెప్పునో దానిని చేయును; దేనిని జేయునో దానిని బొందును:—అనుటవలన త్రికరణములలో దేనిచేత చేసినను ఫలమొకటేయని అర్థము. కావున త్రికరణశుద్ధి యుండవలయు. (శ్రీసుజ్ఞానచంద్రోదయము.)

-:0:-

# సత్యాసత్యవివేచనము

(4-వ సంపుటము 299-వ పుట శేషము.)

ఇదివఱకుఁ బ్రశంసించిన యంశములవలన భగవత్స్వరూపమనిర్దేశ్యమనియును, సృష్టియనాదియనియును, సకలచరాచరంబులయందును నిత్యసత్యబుద్ధశుద్ధ శాంతస్వరూపుండగు నీశ్వరుఁడొక్కఁడే బీజరూపకంబుగ వ్యాపించియున్నాఁడనియునుఁ గార్య కారణ భ్రమలే జీవేశ్వర భేదాభేద వాదనాకల్పితములైనవనియును, స్థూలతః వ్యక్తావస్థయందు స్త్రీపుంనపుంసక రూపములేర్పడినయవియేగాని సకలభూతాంతర్యామియగు నీశ్వరునికిగాని పురుషునికిగాని వీనిలోనేవిధమైన నామరూపక్రియలు లేవనియునుఁ బురుషుని స్వాతంత్ర్యమునకెప్పుడును నెట్టిమార్పును లేదనియును అనఁగా పురుషుఁడు స్వతంత్రాధికారము కలవాఁడనియును అనఁగా తన్నుఁదాఁదెలిసికొనఁ బ్రయత్నించినచోఁ దన్నుఁదాఁనే దెలిసికొను సామర్థ్యముకల యంతటివాఁడనియునుఁ దన్నుఁదెలిసికొనఁ జేయువాఁడింకొకఁడెవఁడును వేరుగాలేడనియును నిర్దేశింపబడియెను.

ఇకనాపురుషుని ప్రయత్నము లెట్టివను విషయమునింత విచారింతము:—

అంతకు మున్నొక్క విషయమును మాత్రము మఱవక జ్ఞాపకమందుంచుకొని మఱలమఱలనుఁ బలుమాఱును విచారించుటత్యావశ్యకముగ నున్నయది.

అదెయ్యదనిన:— భగవత్సంకల్ప మనునదియె. ఆమహానుభావుని సంకల్పం బెట్టిదనినఁ దనయవ్యక్తావస్థనుండి తలఁచినమాత్రంబున వ్యక్తమైన యఖిలప్రపంచంబును *మఱలందనయందె లీనమై సకలప్రాణికోటియునుఁ దనుం జేరుఁగాకయనునదియును సదాజగద్ధితమును నతనిదృఢ సంకల్పము. పైవిషయ

మును మఱవక జ్ఞాపకమునసుంచుకొని యామార్గమునఁ బ్రవర్తించుటయె పురుషునకు ముముక్షావస్థ యనంబఱగుచున్నయది.

స్థూలప్రపంచము స్థావర జంగమంబులచేనిండి నిబిడీకృతమై యున్నది. తరు లత పర్వత పాషాణాదులు స్థావరంబులు, నర పశు పక్షి కీటక సరీసృపాదులు జంగమంబులు. స్థావరంబులకొకచోటనుంచి మఱియొండుచోటికిఁ గదలుశక్తిలేని యచేతనత్వమున్నను ఈశ్వరకళాభరితములగుటచే జంగమ ప్రాణుల కత్యంతోప యుక్తములైయున్నయవి. అచేతనములు కావుననే వీనికి స్థూలముతప్ప సూక్ష్మకారణశరీరంబులు లేవు. జంగమంబులయందు నరులకుఁదప్ప దక్కిన పశుపక్షి కీటక సరీసృపాదులకు స్థూలసూక్ష్మములుదప్ప కారణశరీరంబు లేదు; ఒకవేళ గోవులాదిగగల కొన్ని శ్రేష్ఠజంతువులయందు మాత్రము కలదన్నను నయ్యది సంపూర్ణముగ నేర్పడి యుండదు. నరులకు స్థూలసూక్ష్మకారణ శరీరంబులు మూడును గలవు. ఈ కారణ శరీరమే సుకృత దుష్కృత కర్మఫలముల కాలయమై జీవుని బంధమోక్షములకు హేతుభూతమునై యున్నది. కారణశరీరము విస్పష్టముగ నేర్పడినగాని బంధమోక్షములు సంఘటింపవు. నర పశు పక్షి కీటక సరీసృపాదులు స్థావరంబులవలె నుండినచోటనే యుండక నొకచోటనుండి మఱియొండుచోటికి గదలు శక్తికలవగుటచే చేతనంబులనంబఱగుచున్నవి. ఈ చేత నాచేతనములు రెండింటియందును గల ఈశ్వరాంశ మొక్కటియె. నరులకుంబోలె దక్కిన చేతన ప్రాణులకు మనోమయకోశము సంపూర్ణముగనేర్పడమి మనోవికాసమున కవకాశములేనందుననే కారణశరీరముయొక్క పాటవముకూడ తక్కువయని చెప్పవలసియున్నది. నరులకును పశు పక్షి కీటక సరీసృపాదులకును క్షుద్భయనిద్రా మైథున ధర్మంబులు నాల్గును సమానంబులు. నరుడు మనోవికాస

బలంబుచే నీనాల్గింటి నతిక్రమించి (పశుప్రాయుడుగాక) భూత దయ పశ్చాత్తాపానుకంపంబులు గలవాడై స్వార్థంబునైనం గోలుపోయి సర్వభూతహితంబె తనకుగార్యంబని నిశ్చయించి వర్తింపవలయును.

"ఇయంపృథివీసర్వేషాం భూతానాంమధ్వస్యైపృథి
వ్యైసర్వాణిభూతాని మధుయశ్చాయమస్యాంపృథి
వ్యాం తేజోమయోఽమృతమయః
పురుషోయశ్చాయమధ్యాత్మం శారీరస్తేజోమయోఽ
మృతమయః పురుషోఽయమేవసయోఽయమాత్మే
దమమృతమిదంబ్రహ్మేదంసర్వం॥"

(బృహదారణ్యకోపనిషత్తు 5-వ బ్రాహ్మణము 1 వ వాక్యము.)

ఇట్లుదనంతట గలదియునై లేని దానివలెననగా బూదిగప్పిన నిప్పునుంబోలెనుండి వెవ్వేఱుగానట్టిదై వెలియై నికరమునై వెలుంగు బ్రహ్మంబును (ఆత్మను) స్వానుభవముచే నూహించి చకచకితచకితరించినచో నెద్దియును బురుషుని స్వాతంత్ర్య శక్తినతిక్రమింపలేదని సిద్ధాంతముసేయ సాధ్యముగుంగాని లేకున్న నెన్నివిధములైన బుద్ధిచాతుర్యంబు గలిగియున్నను స్వానుభవములేని విచారమెంతయును సార్థకంబుగాదు, సార్థిక్యతను సమర్థించుటకును వీలులేదు. ఈ కారణమునుబట్టియే నరజన్మం బతిశ్రేష్ఠంబైనదని పెద్దలు సెప్పుదురు. ఇట్టిశ్రేష్ఠమైన నరజన్మము నెత్తియే సదుపాయముచేతనైనను దుష్కర్మంబుల వదలి బుద్ధి వికాసమున మనోవికారమునణంచి కేవలవిషయానుభవమే నిత్యానందమని లోలలాడక క్రమక్రమేణ పతద్విషయ వాంఛలను దగ్గింపగల సదుపాయము నభ్యసింప బ్రయత్నముసేయవలయును.

శ్లో॥ అసంశయంమహాబాహో మనోదుర్నిగ్రహంచలమ్
అభ్యాసేనతుకౌంతేయ వైరాగ్యేణచగృహ్యతే॥

(గీ 6-35.)

ఓయర్జునా! మనస్సును విషయప్రవృత్తినుండి మఱలించుట శక్యముకాకపోవుటయు, ఒకప్పుడైనను నిలుకడలేనిదగుటయు నిస్సంశయముగా సత్యమే. అయినను అభ్యాసముచేతను వైరాగ్యముచేతను దానిని స్వాధీనముచేసికొనవచ్చును. అభ్యాసమనగా గురూపదేశప్రకారము మనస్సున లక్ష్యముగా నేర్పఱచుకొనబడిన ధ్యేయవిషయమందు బుద్ధిని జెదరకుండ మఱలమఱల నిలుపుచుండుట. వైరాగ్యమనగా కనబడు నిహలోకభోగవిషయములయందునుఁ బ్రస్తుతము చూచుటకు వీలులేక ముందుకలుగునని నమ్మదగిన పరలోకభోగవిషయములయందును అశాశ్వతత్వము మొదలగు దోషములు కనబడుచుండుటవలన గలుగునిస్పృహత. ఈ రెంటిచేతను చిత్తము (మనస్సు) యొక్క విక్షేపము (మాలిన్యము) నిగ్రహింపబడునని యెఱుంగునది.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసానాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతిపార్థానుచింతయన్॥
(గీ 8-8.)

ఓయర్జునా! చిత్తమును నిలుపుటకై నన్నుగురూపదేశప్రకారమున మచ్చములగు నితరవస్తువుల తలంపు కలుగనీయక యెడతెగక లక్ష్యమందు మనస్సును నిలుపుటయనెడు నభ్యాసయోగము కలదియును, అందువలన నితరవిషయములయందు బ్రవర్తింపనిదియునగు మనస్సుకలవాఁడు స్వయంప్రకాశ స్వరూపుడగు పరబ్రహ్మమును శాస్త్రము ఆచార్యోపదేశము వీనిననుసరించి ధ్యానము చేయుచున్నవాఁడై యట్టిపరమపురుషుని (బ్రహ్మమును) బొందును. అనగా మనస్సు నీశ్వరధ్యానమందు నిలుపనభ్యసించినవానికి వాసనావశమున నింద్రియములు విషయములయందు బ్రవర్తించినను మనస్సుమాత్రము బ్రహ్మధ్యానమందే నిలిచియుండును.

ఇందుకు దృష్టాంతము:—

శ్లో॥ పుంఖానుపుంఖవిషయే క్షణతత్పరోపి
బ్రహ్మావలోకనధియంనజహాతియోగి
సంగీతతాళలయవాద్యవశంగతోఽపి
మౌళిస్థకుంభపరిరక్షణధీర్నటీవ॥

శ్లో॥ అభ్యాసేఽప్యసమర్థోఽసిమత్కర్మపరమోభవ
మదర్థమపికర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి॥

(గీ 12-10.)

ఒకవేళ నభ్యాసయోగ మవలంబించుట యందసమర్థుడ వైనయెడల నన్నుగూర్చి నాప్రీతికొఱకు, తపోదానవ్రతముల నెడు కర్మముల జేయుచుండుము. ఇట్లు కర్మముల నాచరించుచున్నను క్రమముగా జిత్తశుద్ధియు, నందువలన బ్రహ్మజ్ఞానము నందువలన మోక్షమును నీకులభించును.

అని శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమునం దర్జునునకు బోధించియున్నవారు. కాగా:

శ్లో॥ నధనానినమిత్రాణి నశాస్త్రాణినబాంధవాః
నరాణాముపకుర్వంతి మగ్నస్యాత్మసముద్ధృతౌ॥

సంసారమునందు మునింగియున్న యాత్మ నుద్ధరించు విషయమై ధనములుగాని, మిత్రులుగాని, శాస్త్రములుగాని, బాంధవులుగాని యుపకారము చేయనేరరు.

శ్లో॥ మనోమాత్రేణసుహృదా సదైవసహవాసినా
సహకిందిత్వరాఘవ్శ్య భవత్యాత్మాసముద్ధృతః

ఎప్పుడు నెడబాయకనుండునట్టి మనస్సను మిత్రునితోడ గలసి నేనెవ్వడనని విచారణసేయబడగా నాత్మసంసారము నుండి లేవనెత్తబడుచున్నాడు.

శ్లో॥ నదైవంనచకర్మాణి నధనానినబాంధవాః
శరణంభవభీతానాం స్వప్రయత్నాదృతేనృణాం॥

(జ్ఞానవాశిష్ఠము ఉపశమప్రకరణము షడ్వింశసర్గము శ్లో॥౮౯.)

సంసారమువలన భయపడిన మనుజులకు స్వప్రయత్న మే సంరక్షణమగుగాని, అదివినాగా, దైవముగాని కర్మములు గాని, ధనములుగాని, బంధువులుగాని రక్షకులుగానేరరు.

ఇంతియేగాక:—

శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్
ఆత్మైవహ్యాత్మనోబన్ధు రాత్మైవరిపురాత్మనః (గీ 6 5.)

తానుజీవుడనని మిథ్యాజ్ఞానముచేత భ్రమపడుచుండు నాత్మను (తన్ను) వివేకముగల మనస్సుచేత సంసారసముద్రము నుండి గట్టెక్కింపవలసినదిగాని యధోగతిని బొందింపకూడదు.

అనగా:—

యోగాభ్యాసావస్థను బొందవలెననుట. సంసారవిముక్తి విషయమై గురూపదేశ జన్యమహావాక్యార్థ శ్రవణ మనన నిధిధ్యాసలవలన బరిశుద్ధమైనమనస్సు తనకుబంధువు (సాధకము) అనియు, అట్లుకాని యపరిశుద్ధమనస్సు తనకుశత్రువు (బాధకము) అనియుఁదెలియవలయును.

శ్రుతి॥ పితృమాతృసహోదరదారాఽపత్యగృహారామక్షేత్రాదిమమతా సంసారావరణ
సంకల్పోబన్ధః॥ (నిరాలంబోపనిషత్తు.)

లోకమందు పుత్రమిత్ర కళత్రాది బంధువులందలను స్నేహాది బంధములకు హేతువులుగాని మోక్షమునకు విరోధులే.

అయితే వీరలయెడ విరోధింపవలెనని భావముకాదు. కేవలము మమతనుంచక భగవదర్పిత లోకసామాన్య ప్రేమానుబంధములు మాత్రముంచుటయందు దోషములేదు.

వివేకముగల మనస్సు మోక్షప్రాప్తి విషయమై పరమాప్తబంధువని యెఱుంగవలయును.

శ్లో॥ మనోహిద్వివిధంప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ
అశుద్ధంకామసంకల్పగ్ం శుద్ధంకామవివర్జితం

మన ఏవ మనుష్యాణాం కారణంబంధమోక్షయోః
బన్ధాయవిషయాసక్తం ము_క్త్యైనిర్విషయగ్ం స్మృతమ్॥
(అమృతబిందూపనిషత్తు.)

శుద్ధమనియు, అశుద్ధమనియు మనస్సు రెండు విధములు. కోరికలను గలుగఁజేయుచుండునది యశుద్ధ మనస్సనఁబడును. కోరికలులేనిది శుద్ధమనస్సనబడును. మనుష్యులు సంసారమునుగాని ముక్తినిగాని పొందుటకిట్లు రెండు విధములుగనుండు మనస్సే సాధనము. ఎట్లనగా:— శబ్దాది విషయములయందుఁ బ్రవర్తించుచుండు చంచలమైన మనస్సు సంసారప్రాప్తి హేతువనియు అట్లు విషయములయందుఁబ్రవర్తింపక నిశ్చలమైయుండు పరిశుద్ధమనస్సు ముక్తిసాధనమనియు వేదాంతములయందుఁ జెప్పఁబడియున్నది: ఇందుకు దృష్టాంతములు:-

తామరతీగకు జలమే మాతాపితలై యాతీగకు తెంపులేకుండువఱకును బోషించి యభివృద్ధిని జేయుచున్నది. ఆతీగ తునిగిపోయినపు డాజలమే దానిని కుళ్లిపోవునట్లుచేసి వినాశమునకు గారణమగుచున్నది. కమలముతీగనంటియుండువఱకును సూర్యుఁడు దానికిఁ బతిగాభావింపబడి యాపుష్పమునకు వికాసమును గలిగించుచున్నాఁడు. ఆపుష్ప తీగనెడఁబాసినంతటనే యాసూర్యుడేదానినిముకుళింపజేసి శుష్కింపఁ జేయుచున్నాఁడు.

ఇట్లే శుద్ధాశుద్ధ మనస్సునుగూడ గ్రహించునది.

పైప్రమాణములవలన బురుషప్రయత్నమునకు ముఖ్యసాధనమైనయది మనస్సనియు నట్టిమనస్సుగలవాఁడే మనుష్యుఁడనియును దెలియవచ్చుచున్నది.

పురుషుఁడీశ్వరాంశ సంభూతుఁడని ప్రశంసింపబడియెగదా! పురుషునియొక్క మనస్సుకూడ బరమాత్మయైయగును.

శ్లో॥ సఆత్మాసర్వగోరామః నిత్యోదితమహావపుః
యన్మనాఙ్మననీంశక్తింధత్తేతన్మనఉచ్యతే॥

శ్రీరామచంద్రా! సర్వవ్యాపకుఁడును, స్వయంప్రకాశమానమును గొప్పశరీరము కలవాఁడునునగు నాపరమాత్మ కొంచముసంకల్పశక్తి కలవాఁడగునేని మనస్సని చెప్పబడుచున్నాఁడు.

శ్లో॥ ఆదౌమనస్తదనుబంధవిమోక్షదృష్టి
పశ్చాత్ప్రపంచరచనాభువనాభిధానా
ఇత్యాదికాస్థితిరియంహిగతాప్రతిష్ఠా
మాఖ్యాయికాసుభగబాలజనోదితేవ॥

(జ్ఞా॥ వా॥ ఉత్పత్తిప్రకరణము పకాదశస్సర్గ 7 8.)

మొదలు మనస్సు పిమ్మట బంధమోక్ష పరిజ్ఞానము, (అనగా బంధమోక్షపరిజ్ఞానము లేనిది భోగమోక్షములకై సృష్టికలుగదుగనుక బంధమోక్షముల వివేకమావశ్యకమనుట) అనంతరము ప్రపంచసృష్టియుఁగలుగును. ఇదియంతయు దాదిబాలకునకుఁజెప్పిన కథవలె నిజముగాతోఁచినను విచారించిన నసత్యమేయగును.

కావున వస్త్వంతర విచారమున మనస్సునుగూడ నాత్మతోపాటు బంధమోక్షముల విషయమై స్వానుభవముచేతనే దెలియఁదగునుగాని స్వానుభవములేని విచారమెంతయును దీనికికూడ సహకారికానేరదు. స్వానుభవ స్వస్వరూపజ్ఞానము కలిగినతోడనే మనస్సాత్మయందు లయమైపోవునుగనుక దానికి (మనస్సునకు) సత్యత్వము ఆవరణమాత్రమేగాని యాత్మకువలె నాభాసితముగ సిద్ధింపదు. ఈ రెంటికినిమధ్య విక్షేపసామాన్యతను వహించి ప్రకృతియనెడు మహాభూతమొకర్తెయున్నది. దీనిని మనస్సుతో విక్షిప్తమగుఁగఁజేసినచో సృష్టినంతయును దల్లక్రిందులుగజేసి యవాంతరమును గల్పించెడిని. అట్లుగాక నాత్మతో విక్షిప్తముగజేసినచో దానియాటలేమియును సాగవు.

(సశేషము).

గుడిపాటి శేషగిరిరావు.

:0:

# విధిని జయించుటకు సాధ్యముగాదు.

శ్రీజగదీశ్వరునిచే సృజింపఁబడిన యీప్రపంచంబునంగల జీవకోట్లలో (దేవమానవ తిర్యగ్జంతువులకు) నెల్లవారికిని "విధిని జయించుటకు సాధ్యముగాదు" అనునది, మనపూర్వపు మహర్షులవలన రచింపఁబడియుండు పురాణేతిహాసములు మొదలగు గ్రంథములయందన్నిటియందును బాగుగాబోధింపఁబడియున్నది. ఈ విషయము తాత్కాలిక సందర్భములందు ప్రతిదినము అనుభవమునకువచ్చుచునే యున్నది. అట్లుండియు కొందఱు విధిని జయించుటకు సాధ్యమగుననియు, జాగ్రతగానుండిన యెడల విధియేమియుఁ జేయనేరదనియు, మానవులయొక్క ప్రయత్నములవలననే అన్నికార్యములును జరుగుచున్నదనియు, నుడువుచున్నారు. వీరియెన్నికల నెంచిచూడ మిక్కిలివ్యసనకరముగానున్నయది. ఇట్టివారందఱును సత్సాంగత్యమునుపొంది శాస్త్రవిచారణ జేయుటకు బూనుదురేని, వీరిమనో మాలిన్యములన్నియు నశించినవారై శ్రేయస్కరమగు బ్రహ్మజ్ఞానమును తెలియుటకు పాత్రులై "అన్నియు భగవత్సంకల్పమే" గాక, మనచేజరుగుట యేదియులేదు అనునిశ్చలతత్వమునుబొంది పురాకృత కర్మఫలములను అనుభవించునపుడు మనస్సు చలింపక "అన్నియు దేవదేవుని ఆజ్ఞచొప్పున నడుచుచున్నది" అను దృఢవైరాగ్య జ్ఞానశీలురగుదురు.

2. ఇట్టి తెలివిలేనిమానవులగు స్త్రీపురుషుల కెల్లరికిని దినక్రమమున శాస్త్రమూలంబుగను, అనుష్ఠాన పూర్వకంబుగను నిశ్చలజ్ఞానమును బోధించి తెలివిగలవారినిగ చేయుటకే మన తత్వజ్ఞానసభ, అనేకవేల శాఖలుగలదై ప్రపంచక్షేమమును గోరుచుండు పూర్వపు మహర్షులవలన స్థాపింపఁబడి ఈభూవలయంబెల్ల వ్యాపించియున్నది. ఇట్టిమహోత్కృష్టమగు నీ

మహాసభయందు కొందఱు ద్వేషముగలవారై లేనిపోని నిందలను బలికి అగౌరవించుచున్నారు. ఐన వారికోరిక లీడేరదయ్యె.

3. ఇక వ్యాసమునకు నుదాహరణంబుగ మహాభారతంబునందుఁ జెప్పఁబడియుండు రెండువిషయములను వ్రాసెదను. దయతో గైకొనుడు! చిత్తగింపుడు!

పరీక్షిత్తు వృత్తాంతము.

4. తొల్లి ద్వాపరయుగాంతంబున హస్తినాపురంబు నేలుచున్న శశికులతిలకుడగు ధర్మరాజునకు రెండవతమ్ముడగు అర్జునునికిని సుభద్రాదేవికిని ప్రియకుమారుండగు అభిమన్యుఁడనువానికి విరాటపుత్రియగు ఉత్తరయను బాలికను వారి యుద్ధసమయంబున వివాహము గావించిన దెల్లవారికిని తెలిసిన విషయమేగదా? తోడనే యుద్ధమునందు అభిమన్యుడు వీరస్వర్గమును జెందినవాడయ్యె. అప్పుడు ఉత్తరయను అంగనామణి గర్భము ధరించినదిగానుండె. పిమ్మట యుద్ధానంతరంబున అశ్వత్థామయొక్క శరాగ్నిచే ఆగర్భము దగ్ధముజేయఁబడి జననకాలంబున శ్రీకృష్ణమూర్తి సాహాయ్యముచే పునర్జీవితుఁడుగ నుద్భవించినందువలన ఆసుతునకు "పరీక్షిత్తు" అనునామ మిడంబడియె. అతడు యుక్తవయస్కుడై తనపితామహులచే పట్టాభిషేకమునొంది మిగుల ధర్మాచరణగలవాడై రాజ్యమేలుచుండి యొక్కనాడు మృగయావినోదార్థమై అడవికింజని పులులుమొదలగు క్రూరమృగముల దునిమివచ్చునెడ నొకవ్యాఘ్రమునుగాంచి దానివేయుటకొఱకై తరిమిచనెను. ఆక్రూరమృగము ఒకఋష్యాశ్రమము ద్వారా పరుగెత్తి వనములో మరుగుపడెను. భూపాలుఁడును ఆమార్గమునుంబట్టిపోయి అచ్చట తపస్సుచేయుచున్న యొకఋషిశ్రేష్ఠుంజూచి 'ఓతాపసోత్తమ! ఇచ్చటవచ్చిన బెబ్బులియెచ్చట బొాతెను. ఆమార్గమును నాకెరుగించఁగోరెదనని అడిగెను. మునిపుఙ్గవుడు బ్రహ్మమునందు లీనమై ధ్యానమునందు మనస్సుల

యుంచి యున్నందుచే ఇంద్రియవ్యాపారమేదియు నెఱుంగక మానవృత్తినుండెను. అదిజూచి పరీక్షిత్తు రాజ్యగర్వంబున క్రోధముజెంది నన్నవమానించితివాయని బలికి ప్రక్కననున్న యొకమృత సర్పకళేబరంబును తనవింటికొనచేతనెత్తి అతని మెడయందుంచి తన నగరంబునకుంజనియె. ఇవియెల్లజూచుచున్న కొందఱు మునిపుఙ్గవులుచని అతనికుమారుఁడగు శమీక మహాముని కెఱుకజేయ అతడును కోపోద్దీపితుఁడై త్వరితంబుగవచ్చి తండ్రిమెడయందుండు సర్పశవమును వీక్షించి ఈరీతిగ నొనర్చినవాఁడు నేటికి పడవనాడు తక్షకుని విషాగ్నిచే మృతిజెందుగాక! అనిశాపంబిచ్చి సర్పమును దూరముగా పారవైచి తండ్రికి నమస్కరించి స్వస్థానముఁజేరె. ఈవృత్తాంతమంతయు నెఱింగి పరీక్షిత్తు చాలదుఃఖించి కడపట మంత్రులచే తెలివినొంది ధైర్యముగలవాడై సముద్రమధ్యమునందొక మంటపము నిర్మించి తక్షకుని విషాగ్నికి తప్పించుకొనుటకై అతిజాగరూకత గలవాఁడై యుండియు, శాపవశమున పడవనాడు గతించినవాడయ్యె. ఎంతజాగ్రతతోనుండియేమి ఫలంబు? ఇట్లే పరీక్షిత్తు కుమారుడు జనమేజయభూపతి, తనకు బ్రహ్మహత్యదోషము సంభవించబోవుచున్నదని యేడుదినములకుముందే దెలిసికొని అట్లురాకుండుటకొఱకై రాత్రింబగళ్లు నిద్రలేకయాగముచేయుచుండెను. అట్లుండియు క్రమేణ పడవనాడురాత్రి బ్రహ్మహత్య దోషమును బొందినవాఁడయ్యె. కాఁబట్టి మనతలంపెయ్యదియు సమగూడదు. వారివారి కర్మఫలములను వారువారు అనుభవించే తీరవలెను. ఇందుకు సందియములేదు. ''రాకన్ మానవు హాని వృద్ధులు మహారణ్యంబులోడాగినన్'' అను శాస్త్రోక్తరీతిని మనమెచ్చటడాగియున్నను పురాకృత కర్మఫలములు విడువనేరవు.

పి. ఎ. కృష్ణస్వామి.

# హైదరాబాదులో జరిగిన దివ్యజ్ఞానసభ.

కడచినజూలై నెల 17-18-19వ తేదీలలో హైదరాబాద్ నగరమందు దివ్యజ్ఞాన సమాజముల సమావేశోత్సవము అతివిజృంభణగా నడచెను. నైజాంసర్కారువారి హోమ్ డిపార్టుమెంట్ సెక్రటరిగారగు మ. ఎ. హైదరీగారు అగ్రాసనమును వహించియుండిరి. దివ్యజ్ఞాన సమాజముయొక్క అధ్యక్షురాలగు శ్రీమతి ఆనీబెసెంటమ్మగారు ఈయుత్సవమునకు దయచేసి 17 వ తేది సాయంకాలమున "బ్రహ్మవిద్యయొక్క తత్వములను" గురించియు, 18 వ తేది సాయంకాలమున "పారమార్థికజన్మము"ను గురించియు రెండుప్రసంగములను కృష్ణానాటకశాలయందు జేసిరి. ఈ రెండు ఉపన్యాసములకును స్థలముచాలకున్నట్లు జనులువచ్చియుండిరి. ఇవిగాక, తెలుగుభాషయందు రెండుపన్యాసములు ఉరుదుభాషలో సూఫీమతమును గురించి యొకప్రసంగము, రెండు ప్రశ్నోత్తరసభలు, 4 గూఢశాఖా సభలు, నడచినవి. "ఇండియాదేశములో దివ్యజ్ఞాన సమాజముయొక్కపని" అనెడి విషయమునుగురించి తెనుగులో ఉపన్యాసము జేయబూనియున్న మ॥ వి. రామలింగదీక్షితులవారు బాపట్లనుండిరాను వీలుకాకపోయినందున కడపలో వకీలుగానున్న మ॥ ఎ. నంజుండప్పగారు ఆవిషయమై ప్రసంగముజేసిరి. సెకెందరాబాద్ శివిల్ జడ్జిగారగు మ॥ వావిలాల వెంకటశివావధానులుగారు "జగద్గురు" విషయమై ప్రసంగమును తెలుగులోజేసి కలియుగమున మైత్రేయులే జగద్గురు స్థానమందున్నారనుటకు పురాణములనుండి అనేకప్రమాణములను జూపించిరి. ప్రస్తుత లోకసందర్భములను బట్టి జగద్గురువు లవతరించుట కిదిసమయముగానున్నదిగాన వారానతిచ్చెడి బోధలను గ్రహించుటకు తగిన యోగ్యతను సంపాదించ వలసినదనియానతిచ్చిరి.

ఈయుత్సవమునకు సెకందరాబాద్, బొలారం, వారంగల్ భాగ్యనగరము, రాయచూరు మొదలగు శాఖాసమాజములవారు వచ్చియుండిరి. హైదరాబాద్ నివాసులగు రామనాథ్ వారియు జగన్నాథ్ సేట్ అనెడు ఉదారసోదరులు మెంబర్లకును సహాయకులకును 3 రోజుల సమారాధనను జేసి సమాజమునకు ఉపకరించిరి. ఇట్టిపుణ్యపురుషులను కొనియాడుట కెవరికితరము!

శ్రీమతి ఆనీబెసెంటమ్మగారు హైదరాబాద్‌కు వచ్చినపుడును మరల తిరిగిపోవునపుడును రైల్ స్టేషనులో చాలామంది పెద్దమనుష్యులు సమావేశమైయుండి సత్కరించిరి. ఆమె జేసిన ప్రసంగములచే నగరమంతయు పరిశుద్ధమాయెనని కొందరనుకొనుచుండిరి. సత్పురుషులవాక్కు ఎవరికి ఆనందకరముగానుండదు. శారదా విగ్రహమును నీబ్రహ్మవాదినియుండుచోట సుఖసంతోషములకు కొదవయగునే!

# గ్రంథవిమర్శనము.

ఈఅడుగున వ్రాసినగ్రంథములు మాకార్యస్థానము నలంకరించినవి.

1 జీవకారుణ్యము—ఇది బ్రహ్మశ్రీ కారుపల్లి శివరామయ్యగారిచే ప్రచురించఁబడినది. జీవహింస, మాంసభక్షణము, సురాపానము, మొదలగు దురాచారములు ఇందు ఖండింపఁబడియున్నవి. ఇందు కనేకశాస్త్ర ప్రమాణములు, ఇతిహాసములు, పూర్వాచారములు, ఆధునికాభిప్రాయములును ఉదహరింపఁబడియున్నవి. ఇదిమిగుల నీతిబోధకమగు గ్రంథము. ఇందు 140 పుటలుగలవు. వెల 6 అణాలు. "ఎంతటి కఠినచిత్తులయినను, పక్షపాతి వితండవాదులయినను, ఈగ్రంథము నొకసారి యామూలాగ్రముగ విన్నచో తమదురాచారము వదలుకొనక మానరు.

ఇందలి అహింసావిలాపమును విని, ఈ ప్రాంత్యములో ననేకులీ దురాచారమునుండి విముక్తి జెందియుండుటట్లుండ, రెండు మూడు గ్రామములలో గ్రామజాతరలుకూడ జీవహింసలేక నేఁ జరుపఁ బడినది." అని గ్రంథకర్తగారు వ్రాసియున్నారు. సేలంజిల్లా కొరటగిరిలో కారుపల్లి శివరామయ్యగారికి వ్రాసుకొనవలయు.

2. అధ్యాత్మ రామాయణము—వచనకావ్యము. వేలమూరు వెంకటసుబ్బయ్యగారిచే రచియింపఁబడినది. సంస్కృత మునుండి నిర్దుష్టముగ భాషాంతరీకరింపంబడినది. శైలిమృదువుగను మధురముగనున్నది. అచ్చుతప్పులేమియు లేక మంచి కాగితములమీద చక్కగముద్రించఁబడియున్నది. వెల 1 రూ.

3. శ్రీఘటికాచలమాహాత్మ్యము— ఇదియును వేలమూరు వెంకటసుబ్బయ్యగారిచే రచియింపఁబడిన వచనకావ్యము. బ్రహ్మకైవర్తమహాపురాణంబునంగల వ్యాసప్రోక్తంబగు ఘటికాచలమాహాత్మ్యమగు గ్రంథమును నాంధ్రవచనంబున నందఱకుం దెలియురీతి సులభశైలిని వ్రాయఁబడియున్నది. ఇదిమంచి గ్రంథము. వెల 6 అణాలు. 2, 3 నంబర్ల గ్రంథములు చెన్నపురి శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు దొరకును.

## వృత్తాంతము.

మధ్యజిల్లాల దివ్యజ్ఞానసమాజశాఖలవారి సమావేశము సంవత్సరమున కొక్కచోట జరుగవలసిన నియమముంబట్టి గత సంవత్సరమున ఆగష్టు నెలలో, నెల్లూరులోజరిగినదిగదా. ఈ నెల 22, 23 తేదులయందు ఆసభ బళ్లారిలో జరుగఁబోవుచున్నది. శ్రీమతి ఆనిబెసంటమ్మగారు అగ్రాసనాధిపత్యమును వహించెదరు. ఇతర స్థలములనుండి యీసభకు వెళ్లువారికి భోజనవసతి మొదలగు సదుపాయముల బళ్లారివారు సిద్ధపరతురు.

## CONTENTS OF THIS NUMBER.

**Registered No. M. 716**

ఓమ్



# దివ్యజ్ఞానదీపిక.

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కుడగు ధర్మము లేదు).

సంపుటము 5. { **January 1915.** / జనవరినెల 1915. } సంచిక 10.

---

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్




# దివ్యజ్ఞానదీపిక:

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 5. { January 1915. జనవరినెల 1915. } సంచిక 10.


## ఐరోపాయుద్ధము.

ఘోరసంగ్రామము పెరుగుచునే యున్నదిగదా! ప్రజానష్టము భయంకరముగనున్నది. ఉభయపక్షములలోను లక్షలకొలది జనులు మృతులైయున్నారు. ఇంకను నెందఱు మృతులుగానున్నవారలో యూహించుటకైన నసాధ్యము. ఆహా! ఇట్టిసంగ్రామమెన్నడు తుదముట్టునో! మఱియు మఱియు క్రొత్తరాజ్యములు యుద్ధరంగమునంప్రవేశించుచున్నయవి. ఇది యెంతకాలము జరుగవలయునో, ఎన్నడు కలహములు అంతమై సంధి సమకూరునో భగవంతునకే తెలియఁదగునుగాని యితరులకు సాధ్యముకాదు.

భగవంతుఁడు సర్వభూతమయుఁడుగదా! "పరమేశ్వరాజ్ఞలేకయే పక్షియైనను నేలఁబడంజాలదు." "శివునియాజ్ఞలేక చీమయైనను గుట్టఁజాలదు!" అను నార్యోక్తులు మననము

చేయఁదగినవి.

పూర్వగ్రంథములం జదువ నొకవిషయము దెలియవచ్చు చున్నయది. ఘోరయుద్ధము లారంభించుటకుముందు భూమిపై యధర్మము అభివృద్ధికాగా నాభారమును భరింపఁజాలక జగదీశ్వరునితో జగములెల్ల మొరపెట్టుకొనుటయు, భూభారము దీర్చునుద్దేశ్యముతో మహనీయులు లోకమున నవతరింప నిశ్చయించుటయు, ఆపిదప లోకమున ఘోరయుద్ధములు జరుగుటయు, కట్టకడపట యుద్ధసమాప్తియగుట, ధర్మసంస్థాపనయును, ప్రజాక్షేమమును సమకూరుచుండెనని పూర్వగ్రంథములు సూచించుచున్నయవి.

ఇపుడు మాత్రము భగవదాజ్ఞ లేనిదియే యింతఘోర సంగ్రామము ఆరంభమైయుండునా! మనబోంట్ల యజ్ఞానదృష్టికి ఘోరముగఁ గన్పడినను ఆమహనీయుల దివ్యదృష్టికిది యేయపూర్వ శుభదాయకముగఁ దోచియున్నదో మనము చెప్పఁజాలముగదా! వేయేల లక్షలకొలది ప్రాణులీమూలమున విదేహులగుటయు, మఱిపెక్కండ్రు గాయములతో బాధలుపడుటయు వారి కుటుంబములు దుఃఖాక్రాంతములై పీడితములగుటయును జూడ కర్మగతులెట్లున్నవో అస్మదాదుల కగోచరములుగదా! ‘‘గహనా కర్మణోగతిః’’ యనునట్లు కర్మగతి యతి దురూహము. ఇందఱు కర్మమొక్క రీతిగనేర్పడి సంఘాతకర్మ ఫలభూతమయి యున్నదనుట స్పష్టము.

ఇంత ఘోరయుద్ధము భూలోకమున నింతకు ముందెన్నడును జరిగినట్లు తోచదు. సేనల సంఖ్యను చూచినను, రణరంగము యొక్క విస్తీర్ణమును యోచించినను, కాలవిడంబము నాలోచించినను, ద్రవ్యనష్టమును ప్రజాక్షయము నాలోచించినను, పూర్వగ్రంథములయందు కవులచే నతిశయోక్తులతో వర్ణింపఁబడియుండు మహాయుద్ధములన్నియు అత్యల్పములుగ దోచు

చున్నవిగదా?

ఏననుమొలలోతు దుఃఖమునడుమ మోకాటిలోతు సంతోషమన్నట్లు, ఇట్టి కాలమున మానవుల హృదయములలో దాగియున్న ఔదార్యము భూతదయయు నెట్లు ప్రకాశించుచున్నవో యాలోచింప నానందదాయకములుగ నున్నయవి. పుణ్యాత్ముఁడనదగు నొకానొకఁడు మాత్రముగాక యొకొ్కక రాష్ట్రపు ప్రజలందఱు నుదారులై మఱియొక రాష్ట్రపు ప్రజలకు సహాయులై వర్తించుటంజూడ నత్యాశ్చర్యముగ నున్నయది.

'బెల్జియము' నుండి ప్రభువును, ప్రజలును, సంపూర్ణముగ పదభ్రష్టులై యనికేతనులై స్త్రీలు, పురుషులు, బిడ్డలతో దేశము వెడలి పోవలసినట్లు సంభవించెనుగదా! ఒకవారము దినములలో 50,000 యేబది వేలజనము ఇంగ్లాండు దేశమునం బ్రవేశించిరి. ఇంగ్లీషువారు ఏకవాక్యముగ వారలకందఱకు స్వాగతమొసంగి వారలకు బహువిధోపచారములు చేయుచు వారల కాతిథ్యమిచ్చుచున్నారు గదా! ఇంతియ కాదు. తమదేశమునకు వచ్చిన వారికాతిథ్యమిచ్చుటయే గాక యనేకులు హాలాండా వారి దేశమునకుఁ బోయియుండుట యెఱింగి యారాజ్యము చిన్నది యగుటంబట్టి యా దేశమువారు ఇందఱుజనులకు దగుసహాయము చేయుటకు శక్తిలేనివారగుటయు నాలోచించి యాప్రభుత్వము వారికి దాదాపుగ నొకకోటియు నిరువదిలక్షల రూప్యముల నంపిరట! ఆహా యాంగ్లేయుల యౌదార్యము!

"ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకమ్" అను మనువచనము సార్థకమాయెను.

బెల్జియమునుండి ప్రజలుమాత్రము కాదు ఆ దేశమునందలి గొప్పగొప్ప విశ్వవిద్యాలయములుగూడ ఇంగ్లాండులోనే తమ తమ విద్యార్థులకు తమతమ సంప్రదాయములకు భంగములేక విద్యయొసంగుటకుఁ దగుసౌకర్యములు ఇంగ్లీషు విద్యాలయముల

లో స్థలమునిచ్చి సహాయముచేయుచున్నారు.

అనేకులు ఇంగ్లీషువిద్యాలయములయందలి విద్యార్థులు, ఇంగ్లీషువారును హిందువులును బెల్జియము ఫ్రాన్సుదేశములలో పోయి యుద్ధభూమియందు దెబ్బలుతిని బాధపడువారలకు చికిత్స చేయుచు ఉపచారములుచేయుచు పరోపకార తత్పరులుగానుండగా బెల్జియందేశపు విద్యార్థులుగొందఱు యుద్ధరంగమునకుఁ బోఁజాలనివారు ఇంగ్లీషువిద్యాలయములలో తమవిద్యాభ్యాసము చేసికొనుచున్నారు.

* * * *

ప్రాచ్యులకును పాశ్చాత్యులకును ఐకమత్యమెక్కుడగు సమయముసమీపించినది. ప్రాచీనులకు నవనాగరికులకును సమరస భావమొనగూడు సమయమైనది. ప్రపంచచక్రమును ద్రిప్పు మహనీయుల చర్య యీసమయమున విశదమగుచున్నది. ఈజగన్నాటక సూత్రధారులు చేయుపని సూచనలు కొంచెము కొంచెము బయలుపడుచున్నవి.

పశ్చిమఖండమున సామాన్యముగ స్వప్రయోజన పరత్వము ప్రాముఖ్యముగ గానవచ్చుచుండెను. పెక్కండ్రు స్వకార్య ధురంధరులును, పరహితార్థ విముఖులుగనున్నవారు. కొద్దిమంది మాత్రము పరోపకార తత్పరులు. అట్టిస్థితియే యిక్కాలపు ప్రాచీనులగు ప్రాచ్యులయందును ప్రబలుచుండుట గానవచ్చుచున్నది.

ఈయుద్ధమునుండి, స్వప్రయోజన పరత్వమును, స్వకార్య ధురంధరత్వమును నిష్ఫలములని సూచించి, సర్వభూతదయయును, సమస్తప్రాణులయందన్యోన్యానుకూల్యమును ముఖ్యధర్మములుగ లోకమునందు ప్రతిష్ఠించుటకై జగదీశ్వరుఁడిట్టి యుద్ధమును సంకల్పించెనోయన్నట్లు తోఁచెడిని.

ఎల్లభంగుల నిరుగు పొరుగు రాష్ట్రముల నాశముచేసియై

నను, ఒడంబడికలను, కట్టుబాట్లను భగ్నముచేసియయినను, తన రాజ్యమును, అధికారమును, తనయైశ్వర్యమును, బలపఱచుకొన వలెనను జర్మనీ చక్రవర్తిగారును, తదనువర్తులును, ఇతరుల పు స్వార్థపరత్వమును మూర్తీభవించినట్లున్నది. తుదకు కష్టమైనను, నష్టమైనను, ధర్మము, దీనరక్షణము, సత్యవాక్పరిపాలనము, పరోపకార ప్రవణత్వము లోనగు నుదారగుణములను మూర్తీభవించినది యింగ్లాండుసామ్రాజ్యము. ఈయుద్ధమున, నాసామ్రాజ్యమును నలుదెసలవారు పలుతెగలవారు, వారివారివైషమ్యములను మాని యేకకుటుంబమువలెనిలిచి, ధర్మమునకును రాజ్యమునకుంగలిగిన యపాయమును తొలగించుకొనుటకుఁ బూనియున్నారు.

హిందువులలో పూర్వకాలపు క్షత్రియధర్మము నశించెనేమోయని యాలోచించుచుండిన వారలకు ఉత్సాహముగలుగఁ జేయునటుల నైరోపాయుద్ధరంగములలో హైందవ సైనికులు సమాన స్థైర్యసాహసములంజూపి యెల్లరచే సంభావితులగుచున్నారు.

హైందవులయందు దృఢమగునమ్మకము, గౌరవము, అధికమాయెను. భారతీయులను, తక్కుదేశములవారు ద్వేషబుద్ధితోఁ జూచుచు, నాయాదేశములకు వారిని రాకుండునట్లు ఆయా ప్రభుత్వములవారు చట్టములనుచేయుచు పలువిధముల అననుకూలముల గలిగించుచుండిరిగదా! ఈయుద్ధమారంభమైన నాటినుండి యాదేశస్థులందఱు హైందవులు గౌరవపాత్రులుగ నెంచుచు నేకోదరన్యాయమున వర్తించుచున్నారు. మఱియు నిద్దేశమునను ప్రభుత్వమువారును భారతీయుల విషయములో నెక్కుడు సౌకర్యములను చేయఁదలచియున్నారు.

రాజ్యకార్యనిర్వహణమున నెక్కువమంది భారతీయుల నియమించు విషయమై విచారణచేయుచుండు కమిషనువారు

హారియభిప్రాయమును శ్రీ శ్రీ చక్రవర్తిగారికి నివేదించుసమయమునకు సరిగా నీయుద్ధముద్వారా నాంగ్లేయభారతీయులకు పరస్పరానురాగ గౌరవములు వృద్ధియగుటయంతయు జూడనిదియంతయు మహనీయులచే నడిపింపఁబడుచున్నదనుటకు సందియము లేదు.

ప్రపంచచరిత్రమను చదురంగపు పీటపై చక్రవర్తులు సైన్యములు మంత్రులు బలములు లోనగు చదురంగపు కాయలను నడుపుసర్వజ్ఞుల దివ్యహస్తమిట్టి సమయముల కొంతమట్టుకు గానవచ్చుచున్నది.

సర్వశక్తుఁడు సర్వజ్ఞుఁడు సర్వభూత హృదంతరాత్మయు, పరమప్రేమస్వరూపుఁడగు జగదీశ్వరుఁడు జగత్తును రక్షించుచుండగా గొప్పప్రయోజనములేక యింతఘోర సంగ్రామము సంభవించునా!

మహాఘోర సంగ్రామములయిన పిదప, పూర్వము శ్రీరామరాజ్యము వర్ధిల్లినట్లు, ఈసంగ్రామానంతరము శ్రీరామరాజ్యము ననుకరించు కాలము లోకమునంతట వెలయుననుటకు సందియము లేదు. లోకానుగ్రహార్థము జగద్గురువతరింప నున్నాఁడని వినుచుండిన వార్తకు సాఫల్యసమయము ఆసన్నమాయెననుటయు స్పష్టము.

శ్లో॥ స్వస్తిప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేనమార్గేణమహింమహీశాః
గోబ్రాహ్మణేభ్యశ్శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తాస్సుఖినోభవంతు॥

చిట్టమూరు రామయ్య.

# యజ్ఞవిద్య.*

## యజ్ఞముచేఁ గర్మబంధము తప్పును.

1. శ్రీకృష్ణభగవాను లర్జునునకు యోగవిద్య నుపదేశించు నపుడు

"యజ్ఞార్థాత్కర్మణోన్యత్ర లోకోయంకర్మబంధనః"
(గీత 3-9.)

యనివక్కాణించిరి. "మనుజుఁడు ప్రతిక్షణము నేదో యొకవిధమగు కర్మము నాచరించుచుండును. అట్టికర్మమును యజ్ఞార్థమై వినియోగించినచో నది బంధకముకానేరదు. యజ్ఞము కొఱకుగాక వేఱుప్రయోజనము నపేక్షించి చేయుకర్మమంతయూ బంధకమగుచున్నది. దానిచే మనపురోభివృద్ధి కాలస్యమగును" అని తాత్పర్యము. బుద్ధిమంతునకు శాస్త్రప్రకారము నడచుకొనుచు యజ్ఞరూపమును దెలిసికొని దానికొఱకే తనకర్మమునంతయు నర్పణముచేయవలయు. కాన శాస్త్రవచనానుసారముగ యజ్ఞస్వరూపమును దానిప్రయోజనమును వివరించెదము.

## మానవులందఱు యజ్ఞమున కధికారులు.

2. యజ్ఞము ప్రపంచమందాదినుండియు ప్రచారమందుండెనని గీతయందు శ్రీకృష్ణులు చెప్పియున్నారు.

శ్లో॥ సహయజ్ఞాఃప్రజాస్సృష్ట్వా పురోవాచప్రజాపతిః
అనేనప్రసవిష్యధ్వమేషవోస్త్విష్టకామధుక్॥
(గీత 3-10.)

సృష్టికాలమందు ప్రజాపతి యజ్ఞములతోగూడ ప్రజలను బుట్టించి వారింజూచి యిట్లు పలికెను:— "ఈయజ్ఞముచే మీరం

---

* ఈ వ్యాసము మైసూరులో బ్రం॥ అల్లాడిమహాదేవశాస్త్రివారిచే కన్నడ భాషయందు వ్రాయబడి సుపంథాపత్రికయందు ప్రచురింపఁబడి ఇపుడాంధ్రమున తర్జుమాచేయబడినది.

దలు మీమీపురోభివృద్ధిని జేసికొనుడు. ఇదియేమీకు కావలసిన ఫలములనిచ్చును'' ప్రజలయభివృద్ధికి యజ్ఞమే కారణభూతము. ఇట్టియజ్ఞమును ప్రజలెల్లరు చేయదగినవారని సృష్టికర్తయొక్క యభిప్రాయమైనట్టు తేటపడుచున్నది. నిత్యము ప్రజలాచరించవలసినదియై, సకల ప్రజలకభివృద్ధికరమైన యజ్ఞముయొక్క వైభవమేమని చెప్పవచ్చును! దానివస్తుతత్వమును దెలిసికొని దానిని యథావిధిగ ననుష్ఠానముచేయుటయే మనకు ప్రకృత మువపరమైనది.

యజ్ఞము శ్రేయస్కరము.

3. ''యజ్ఞముచే నుత్పన్నముచేయుడు'' అనిప్రజాపతి ప్రజలకు బోధించియున్నభావమును దెలిసికొందము. ''దేవాన్ భావయతానేన'' (3-11) ఈయజ్ఞముచే దేవతల నుత్పన్నముచేయుడు'' అని ప్రజాపతిచెప్పెనుకదా! దేవతలనుత్పన్నముచేయుట యనగనేమి? మనము దేనినైనను దృఢముగా సంకల్పించుటచేతను, ఆసంకల్పమున కనుసారముగ శరీరేంద్రియముల మూలమున గర్మము నాచరించుటచేతను, ఒకానొక పదార్థము జనించును.

శ్లో॥ భూతభావోద్భవకరో విసర్గఃకర్మసంజ్ఞితః॥ (8-3)

మనముచేయు ప్రతిమానసిక వాచిక కాయిక వ్యాపారము పదార్థముల నుత్పన్నము చేయునని శ్రీకృష్ణులానతిచ్చిరి. మనసంకల్పాదికర్మములు జగదీశ్వరుడైనభగవంతుని సంకల్పాదుల కనుకూలములైనపక్షమున, ఆసంకల్పములచేఁ బుట్టుపదార్థము లీశ్వరుఁడు లోకపాలనమునకై తనసంకల్పాదులచేఁబుట్టించిన దేవతల కార్యముల కనుకూలములగును. అప్పుడు దేవతలు ప్రీతిఁజెందు మనకనుకూలురై యనుగ్రహింతురు. ''తేదేవాభావయంతువః'' (3-11) ఇట్లుమనమేయే విషయములందు మనసంకల్పాదుల నీశ్వరసంకల్పాదులకనుకూలముగఁజేసి లోక

మందు వర్తించుదుమో అట్టివిషయములందు దేవానుగ్రహముచే మనసంపత్తు వృద్ధియగును. ఇట్లువృద్ధియైన సంపత్తును తిరిగి యా దేవతల కార్యార్థమై సమర్పించుట యుచితముకదా! దాని వలన సంపత్తు మరింత యధికమగును. ఈవిధముగ పరస్పరానుకూలురమై మనము, దేవతలును, నడచుకొనుటచే పరమ శ్రేయస్సు కలుగుచున్నది. "పరస్పరంభావయన్తః శ్రేయః పరమవాప్స్యథ" (3-11) అని ప్రజాపతి యానతిచ్చెనుకదా. దేవతల యనుగ్రహముచే వారు మనకిచ్చు భోగములన్నియు సిద్ధించును. మనశక్తి సంపత్తును దేవతలకార్యార్థమై వినియోగించి వారియనుగ్రహముచే లభించు భోగములను మాత్ర మనుభవించుటచే మనపాపములన్నియు నశించును. అట్లుగాక స్వప్రయోజనముకొరకే యావచ్ఛక్తిని వినియోగించువారు పాపులు (3-13)

ఈశ్వరానుకూలమైన కర్మమే యజ్ఞము.

4. ఆదియందు ప్రజలకు ప్రజాపతి యుపదేశించిన ప్రకార మీశ్వరుని కనుకూలముగ వర్తించుటయే యజ్ఞము. యజ్ఞమును విధించు వేదమంత్రమీ యర్థమునే బోధించుచున్నది. ఆమంత్రమేమన:—

విశ్వో దేవస్య నేతుర్మర్తో వురీత సఖ్యం
విశ్వోరాయ ఇషుధ్యతి ద్యుమ్నం వృణీత పుష్యసే స్వాహా॥
(వాజసనేయసంహిత 4-8 తైత్తిరీయసంహిత 1-2)

ప్రతిమానవుఁడు జగదీశ్వరుడైన దేవుని సఖ్యమును గోరదగును. ఎల్లరైశ్వర్యమును గోరుదురుకదా! వారుతమ కోరికను సాధించుట కీశ్వరుని జ్యోతిస్సును గోరవలయు" అని భావము. మరణమును తప్పించుకొన గోరువారు ఈశ్వర సఖ్యమును గోరవలయును, అనగ నీశ్వరుని కనుకూలురై వర్తించవలయును. మన మెల్లరము మరణదుఃఖమును తప్పించుకొన

వలయునని యున్నాముగదా! కాన మనమెల్లర మీశ్వరుని సంకల్పముల కనుకూలముగా నడువవలయును. మనమీశ్వరుని కనుకూలముగా వర్తించవలసినచో నీశ్వరునకుండు శక్తిమనయం దుండవలయునుకదా! మనకందరకు సకలైశ్వర్యములు సిద్ధించ వలయునను కోరికయుండుటయే యట్టిశక్తి మనయందున్నదనుట కు నిదర్శనము. ఈశ్వరునియందు సిద్ధముగనుండు శక్తియం తయు మనయందు బీజరూపమైయున్నది. అందువలననే బీజ రూపముగనుండు శక్తి వృద్ధికావలయునను కోరిక మనకు కలిగి యున్నది. సమగ్రమైన శక్తి సిద్ధించవలయునన్న మనమీశ్వ రుని వైభవమును లక్ష్యమందుంచి దానిని సాధించుటకు తగిన ప్రయత్నమును జేయవలయును. అనగా నీశ్వరుఁడు సర్వాంత ర్యామియై కరుణానిధియై లోకమును పాలించువిధమును గ్రహిం చి దానికనుకూలముగ మనము యావచ్ఛక్తి పనిచేయవలయును. ఇదియే పైనవివరింపబడిన వేదమంత్రము విధించు యజ్ఞము.

యజ్ఞము ప్రథమధర్మము.

5. ఇట్టియజ్ఞమును ప్రజాపతితానే ప్రప్రథమమున నాచ రించి యాదర్శకుఁడయ్యెనని శ్రుతి తెలుపుచున్నది.

"యజ్ఞేనయజ్ఞమయజంత దేవాః
తానిధర్మాణిప్రథమాన్యాసన్" (పురుషసూక్తము).

"దేవతలు (ఋషులు) మొదటయజ్ఞముజేసిరి. ఆయజ్ఞ మే మూలధర్మమయ్యెను" ఇది పురుషసూక్తమందలి వాక్యము. ఆసూక్తమందు ప్రజాపతి (ఋషి) దేవతలకుదానే యజ్ఞపశువుగ బరిణమించి స్థావరజంగమాత్మకమైన యీప్రపంచమునంతయు సృష్టించెనని చెప్పబడియున్నది. ఇచ్చట (ఋషులు) దేవత లనగ నాదిపురుషుఁడైన ప్రజాపతియొక్క ప్రాణశక్తులు, ఇంద్రి యశక్తులని భావింపవలయును. మనము జ్ఞానేంద్రియ కర్మేం ద్రియములద్వారా యజ్ఞముచేయునట్లు తనజ్ఞానేంద్రియ కర్మేం

ప్రియములైన దేవతల (ఋషుల) మూలమున ప్రజాపతితానే యజ్ఞపశువుగ బరిణమించి ప్రపంచమునంతయు సృష్టించెనని తాత్పర్యము. మొదట ప్రజాపతి సర్వమయుడై తనయందొక భాగముచే ప్రాణుల భుక్తిముక్తులకై యీప్రపంచమందలి నానాపదార్థరూపముల నుత్పాదన జేసెనని వేదమీ సూక్తిమూలమున బోధించుచున్నది. తానుస్వయముగ బ్రహ్మానంద మనుభవించగల పదవిని జెందినవాడైనను యాపదవినివిడిచి సంసారమందుండువారల నుద్ధరించుటకై తనశరీరముచే బ్రపంచమును సృష్టించి దానియోగక్షేమార్థమై సర్వదా జాగరూకుడైయుండును. ఇదియే ధర్మముయొక్క మూలస్వరూపము. తనసుఖమును గణనచేయక యితరుల యోగక్షేమార్థమై తనశక్తిని వినియోగించుటయే పరమధర్మము. ఇదియే సృష్ట్యాదియందు ప్రజాపతిచేసిన యజ్ఞమువలన మనమునేర్చుకొనదగిన ముఖ్యధర్మము.

యజ్ఞము ముక్తిసాధనము.

6 స్వప్రయోజనమును గణింపక పరహితమునకై పాటుపడుచు లోకరక్షణమందు మనయాపచ్ఛక్తిని జగదీశ్వరునకు వినియోగించినయెడల క్రమముగా నాజగదీశ్వరుని స్వరూపము మనహృదయమునం బ్రవేశించి ప్రకాశమగును. అప్పుడు మనము జగదీశ్వరునితో నైక్యమొందుదుము. అతని స్వరూపము మనస్వరూపమువలె మనకు ప్రత్యక్షమగును. ఇట్లీశ్వరస్వరూపము సాక్షాత్కారమైనపుడు మనకు జననమరణములుండజాలవు మనము ముక్తులమగుదుము. జననమరణములు దేహములకు సంబంధించినవేకాని జీవునకులేవు. జీవుడుఁ తానీశ్వరాంశ సంభూతుఁడనియు నీశ్వరతుల్యుఁడనియు దృఢముగా గ్రహించుటచే దేహధర్మములగు జననమరణములను దప్పించుకొనశక్తుఁడగును. ఇదియే ముక్తి. ముక్తికిదియేమార్గమనియు, వేరొకమార్గ

ము లేదనియు శ్రుతి కంఠోక్తిగ జెప్పుచున్నది.

"తమేవంవిద్వానమృతఇహభవతి
నాన్యఃపంథావిద్యతేయనాయ" (పురుషసూక్తము)

యజ్ఞమందు జ్ఞానము ముఖ్యాంశము.

7. ఇచ్చటనిరూపింపఁబడిన యజ్ఞస్వరూపమును జక్కఁగా బర్యాలోచనముచేయు వారలకు యజ్ఞము కేవలము కాయిక కర్మము మాత్రముకాదని తెలియవచ్చును. యజ్ఞమనగ నీశ్వర సఖ్యమునుగోరుటయని యజ్ఞవిధాయక మూలప్రమాణమైన వేదమంత్రమువలన మనము గ్రహించుచున్నాము. ఈశ్వర సఖ్యమునుగోరుట యనగ నీశ్వరుని కనుకూలముగవర్తించుట. ఇట్లువర్తించువాఁడీశ్వర స్వరూపమును కృత్యమును, జీవేశ్వరుల కు గల సంబంధమును, యజ్ఞముచే జీవునకుగలుగు ఫలమును, ఆఫలమును సాధించువిధానమును గ్రహించియుండవలయును. ఇట్టిజ్ఞానము మనముచేయు యజ్ఞరూపకర్మము నాచరించుట కాధారభూతమైనది. అట్టిజ్ఞానములేకున్నచో మనకు యజ్ఞార్థ మైన కర్మమందు ప్రవృత్తి కలుగనేరదు. మొదట నీవిషయముల ను గురుముఖమునను శాస్త్రమువలనను గ్రహించి శ్రద్ధాన్వితుల మై మనము యజ్ఞార్థమగు కర్మమందు బ్రవర్తించినయెడల క్రమ ముగ మనస్సుస్థిమితమగును. అప్పుడు పూర్వము శాస్త్రగురువుల మూలమున బరోక్షముగ గ్రహించినవిషయములు ప్రత్యక్షముగ ననుభవగోచరములగును. తుదకాజ్ఞానము స్థిరముగానిలుచును. ఇట్లు యజ్ఞము జ్ఞానముతో ప్రారంభమై జ్ఞానముచే నాచరింప బడి జ్ఞానమందే పర్యవసానమగుచున్నది. "సర్వంకర్మాఖిలం పార్థ జ్ఞానేపరిసమాప్యతే" (గీ. 4-33). మొదట పరోక్షముగ నుండిన జ్ఞానము ప్రత్యక్షమగుటకై స్వభావసిద్ధములైన స్వార్థ సాధనవ్యాపారములయందాసక్తిని విడిచి శాస్త్రోక్తమును యజ్ఞ రూపమునగు కర్మమునాచరించవలయును. అనంతర మాజ్ఞాన

ము ప్రత్యక్షముగను దృఢముగను నిలుచును. తరువాత జ్ఞానిక్లేశ బుద్ధిలేక ప్రీతిపూర్వకముగనే లోకపాలనరూపమైన కర్మమును చేయుచుండును, కానయజ్ఞాచరణమందు జ్ఞానాంశము ప్రధానము. ఇట్టిప్రధానాంశమును విడిచి దానికంగభూతమైన లోకోపకారకమగు శారీర కర్మమును మాత్రమనుష్ఠానముచేయు వారలకు సిద్ధించుఫలమంతయధికముగనుండజాలదు. అట్టి కర్మము నాచరింపకనే దానిని సూచించు యేదోయొక క్రియనుమాత్రము పరమార్థవిషయ జ్ఞానములేక చేయుటవలన సిద్ధించుఫలమత్యల్పముగా నుండును. ఇట్టిక్రియను కేవలము దంభముకొరకు స్వార్థపరత్వముతో జేయుటవలన ననర్థమేకలుగును. అందువలన కర్మానుష్ఠానముచేయువాఁడు దానికాధారభూతమగు తత్త్వమును గ్రహించి యాచరించినగాని కర్మముయొక్క యుత్కృష్టఫలమును పొందఁజాలడు. లేనిచో జ్ఞానశూన్యముగ నన్యథాచేయుటచే నాకర్మమునిష్ఫలముకావచ్చును, ఒకప్పుడు అనర్థము కూడా కావచ్చును.

జ్ఞానరూపమైన యజ్ఞమే సంసారతారకము.

8. యజ్ఞమందు జ్ఞానమే ముఖ్యాంశము, అనగ జ్ఞానరూపమైన యజ్ఞమే యజ్ఞము. అట్టియజ్ఞమే తారకమనియు సుఖదాయకమనియు యజ్ఞస్వరూపమును నిరూపించు వేదమంత్రమువలన దెలియవచ్చుచున్నది. అదియెట్లన దీక్షితుండాదియందీశ్వరునిగూర్చి యిట్లుప్రార్థించుచున్నాడు.

"ఇమాంధియంశిక్షమాణస్యదేవక్రతుం దక్షంవరుణసంశిశాధి యయాతి విశ్వాదురితాతరేమసుతర్మాణ మధినావంరుహేమ" (తై. సం 1-11-2)

"వరుణుఁడా! ఈబుద్ధిని దృఢపరుచుకొనవేలెనను మా సంకల్పమును కార్యకారియగునట్లు నియమించుము. అట్టిబుద్ధిచే మేము సకలపాపములను దాటుదుము, సంసారసముద్రమును

సులభముగ దాటించగల బుద్ధియను నావను మేమెక్కుదుము.'' ఇచ్చట ''బుద్ధి''యనగ యజ్ఞవిధాయకమైనమూలమంత్రము సూచించిన రీతిగ నీశ్వరసఖ్యమునుగోరుటయే బుద్ధివృత్తిరూపమైన యజ్ఞము. ఇదిజ్ఞానరూపమైనది. ఇట్టిజ్ఞానరూపమైన యజ్ఞమేదృఢమైననావ. జ్ఞానరహితమై కేవలము బాహ్యకర్మరూపములైన యజ్ఞములు ''ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః'' (ముండకోపనిషత్తు 11-7)అను వాక్యముననుసరించి దృఢములుగాని నావలని నిందింపబడినవి. అవి సంసారతారకములుకాజాలవు. ఇట్టి జ్ఞానముచేతనే యజ్ఞనిష్పత్తియై పరమసుఖము సిద్ధించునని దీక్షితుడు జపించు మరియొక మంత్రముచే దెలియుచున్నది. ఆమంత్రమేదియన.

'' దైవంధియం మనామహేసుమృడీకామభీష్టయే
వర్చోధాంయజ్ఞవాహసంసుపారానోఅసుదృశే''
(తై సం 11-3)

''మంచి సుఖము నిచ్చి తేజస్సును గలుగజేయు యజ్ఞనిర్వాహకమైన దైవమునుగురించిన జ్ఞానమునే ఇష్టసిద్ధికొరకు మననముచేయుదుము. సుఖముగా సంసారమును దాటించునట్టి జ్ఞానము మనస్వాధీనమునకువచ్చుగాక'' దీనినిబట్టి బ్రహ్మజ్ఞానమును శాస్త్రగురువుల మూలమున సంపాదించి యది దృఢముగ నిలుచుకొరకు దానియందు శ్రద్ధయుంచి భగవత్ప్రీతికరములైన కర్మములను చేయుటయే యజ్ఞమని గ్రహింపవలయు

ఓంశాంతి శ్శాంతి శ్శాంతిః.

పి. శేషయ్యశెట్టి.

# సంధ్యావందనము.*

(3 వ సంపుటము 430 పుట శేషము.)

## అధికారివిషయము.

### సంధ్యకు బ్రాహ్మణుఁడధికారి.

1. శ్రుతిచేవిధింపఁబడిన సంధ్యకధికారి ఎవరు? అనగా అట్టిసంధ్యను అవశ్యముగా చేయవలసినవాడెవడు? ఈయంశము శ్రుతివాక్యములచేతనే నిర్ణయించుటమంచిది. అధికారిని సూచించు శ్రుతివాక్యములేవియన:—

1 "తస్మాత్ బ్రాహ్మణో౽హోరాత్రస్య సంయోగేసంధ్యాముపాస్తే" (షడ్వింశబ్రాహ్మణము 5.) కనుక బ్రాహ్మణుడు అహోరాత్రుల సంధియందు సంధ్యనుపాసించవలయును.

2 "తదుహ వాప తే బ్రహ్మవాదిన:......సంధ్యాయాం ఆపఊర్ధ్వంవిక్షిపంతి ..ఉద్యంతమస్తంయంతమాదిత్యమభిధ్యాయన్ కుర్వన్ బ్రాహ్మణోవిద్వాన్ సకలంభద్రమశ్నుతే (తైత్తిరీయారణ్యకం 2) అందువల్లనే ఇప్పటిబ్రహ్మవాదులు సంధ్యలో పైకియుదకమును చల్లుచున్నారు. ఆదిత్యుని ఉదయించునపుడును అస్తమించునపుడును ధ్యానముజేసి క్రియలను సలుపు బ్రాహ్మణుఁడు తెలిసి సకల శ్రేయస్సులను బొందుచున్నాడు.

ఈవాక్యములచే సంధ్యకు బ్రాహ్మణుడే యధికారియని తేటపడుచున్నది.

### బ్రాహ్మణుడనగా బ్రహ్మవాది.

2. ఈవాక్యములచే బ్రాహ్మణుడనగా నెట్టివాడని తెలియవచ్చుచున్నది. కేవలము జాతిమాత్రముచేత బ్రాహ్మణుడు కాజాలడని తెలియవచ్చుచున్నది. అదెట్లనిన:— ఈవాక్య

* మైసూరు మహాదేవశాస్త్రులవారిచే కన్నడభాషయందు వ్రాయబడి సుపంథలో ముద్రింపబడి ఇప్పుడు ఆంధ్రీకరింపఁబడినది.

ములలో నొకచోట సంధ్యను జేయువాడు "బ్రాహ్మణుడు" అని యు మరియొకచోట "బ్రహ్మవాది" యనియు శ్రుతిపలుకుచున్నది. ఇందువలన "బ్రాహ్మణు" డనగా "బ్రహ్మవాది" యని అర్థమగుచున్నది. "బ్రహ్మవాది" యనగా బ్రహ్మముయొక డున్నాఁడు, బ్రహ్మనుపొందుటయే పరమపురుషార్థము. అని తెలిసికొని దానికితగిన ప్రయత్నములను చేయువాఁడు. అట్టిబ్రహ్మవాదమును వివరముగా తెలిసికొనెదము.

బ్రహ్మవాదియొక్క సిద్ధాంతము— 1. బ్రహ్మస్వరూపము

3. శ్రుతిబ్రహ్మస్వరూపము నిట్లు తెలుపుచున్నది:—

"సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" (తైత్తిరీయోపనిషత్తు.)

"ఒకటేవిధముగానుండి జ్ఞానరూపముగాను అపరిచ్ఛిన్నముగానుండు తత్వమేబ్రహ్మ"

"విజ్ఞానమానందంబ్రహ్మ" (బృహదారణ్యకము)జ్ఞానరూపమై, ఆనందరూపమై యుండునదే బ్రహ్మ"

"ఋతంసత్యం పరంబ్రహ్మ" (తైత్తిరీయారణ్యకము). "పరబ్రహ్మ కార్యరూపముగాను కారణరూపముగానుండును."

"యతోవాఇమానిభూతాని జాయంతే యేనజాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి" (తై. ఉ) ఏతత్వమువలన ఈభూతము లుత్పన్నమగుచున్నవో, ఉత్పన్నమైనవస్తువులు దేనివలన జీవించుచున్నవో, నాశమగునావస్తువులు దేనినిబ్రవేశించుచున్నవో, దానిని బ్రహ్మమని తెలియుము.

ఇట్టివాక్యములద్వారా శ్రుతిబ్రహ్మను బోధించియున్నది. బ్రహ్మతత్వము గొప్పది, అనంతమైనది. అతనిస్వరూపము జ్ఞానానందమయము. అతనిస్వరూపభూతములైన జ్ఞానానందములకు పారమేలేదు. మనమనుభవించు ఆనందము మనజ్ఞానము బ్రహ్మయొక్క జ్ఞానానందముల యంశమాత్రమే. బ్రహ్మ

యెప్పుడును ఒకటేవిధముగా నుండు కారణస్వరూపుడు. ప్రతి క్షణమందును వ్యత్యాసమగుచుండు నీప్రపంచము వానిరూపమే. మనకగుపడు ప్రపంచమంతయు బ్రహ్మమయమేగాని వేరుగాదు. ప్రపంచమంతయు బ్రహ్మయందేపుట్టి బ్రహ్మయందేనిలిచి బ్రహ్మయందే లయమగుచున్నది.

2. బ్రహ్మవిద్యయొక్క-ఫలము.

4. "బ్రహ్మవిదాప్నోతిపరం" "బ్రహ్మను తెలిసినవాడు పరమపురుషార్థమును బొందును" అని శ్రుతియుపదేశించి యున్నది. బ్రహ్మవిద్యవలన మనుష్యుడు పరమసుఖము ననుభవించునని యర్థము. బ్రహ్మను ఎట్లు తెలిసికొనిన పరమసుఖము లభించును? దానిని శ్రుతి యిట్లు సూచించుచున్నది:—

"సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ। యోవేదనిహితంగుహాయాం పరమేవ్యోమన్। సోశ్నుతేసర్వాన్ కామాన్‌సహ। బ్రహ్మణావిపశ్చితా॥" "సత్యమై, జ్ఞానరూపమై, అంతరహితమై బుద్ధిగుహయొక్క- పరమాకాశములోనున్న బ్రహ్మను ఎవడు తెలిసికొనునో వాడు సర్వజ్ఞుడైన బ్రహ్మస్వరూపుడై సమస్తకామములను బొందుచున్నాడు." తనహృదయమందున్న బ్రహ్మను సాక్షాత్క-రించుకొనినవాడు తానేబ్రహ్మస్వరూపుడై సమస్తపురుషార్థములను బొందునని తాత్పర్యము.

జీవుడు బ్రహ్మస్వరూపుడు.

5. పురుషులలో ఆత్మస్వరూపుడై బ్రహ్మయున్నాడని శ్రుతిస్పష్టముగా జెప్పుచున్నది:—

"సయశ్చాయంపురుషే యశ్చాసావాదిత్యే సఏకః":—

(తై. ఉ)

"ఇచ్చట పురుషునిలోనుండువాడు అచ్చట ఆదిత్యునిలో నుండువాడును ఒకడే"

"అసావాదిత్యోబ్రహ్మ" (తై. ఆ) "ఈఆదిత్యుడే

బ్రహ్మ" "అహంబ్రహ్మాస్మి" నేనుబ్రహ్మ.

"అయమాత్మాబ్రహ్మ" (మాం. ఉ) ఈయాత్మేబ్రహ్మ. ఈ యర్థమునే భగవద్గీతలో ఈశ్వరుడుపదేశించియున్నాడు.

"మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" (XV. 7)

"నా (ఈశ్వరుని) యంశమే జీవలోకమందు జీవుడై నిత్యముగా నున్నాడు."

బ్రహ్మవాదసంగ్రహము.

6. ఈవిధముగా శాస్త్రము తెలియజేయునదేమనగా:- మనుష్యాదేమొదలగు ప్రాణులయందున్న జీవుడు బ్రహ్మస్వరూపుడు, బ్రహ్మసముడు, తగిన ప్రయత్నము జేయువాడు. అట్టి స్వస్వరూపమును సాక్షాత్కరించుకొని బ్రహ్మయందున్న అపరిచ్ఛిన్నమైన జ్ఞానానందముల ననుభవించగలడు. ఇట్టిస్వస్వరూపజ్ఞానమే బ్రహ్మవిద్య. దానిని బొందనుచితమార్గమే శాస్త్రవిహితమైన ధర్మమార్గము. ఇదిబ్రహ్మవాదులసిద్ధాంతము. ఈసిద్ధాంతము ఇప్పుడు లోకమందు ప్రచారములోనున్న ప్రసిద్ధమతముల నన్నిటిలోను గర్భీకరించబడియున్నది. విశేషాంశముల నాయామతముల ఆచార్యులు వారివారికి యుచితమని తోచినట్లు భిన్నభిన్నముగా నిరూపించియున్నారు గనుక మతములందు భేదములగుపడుచున్నవి. ముఖ్యాంశములలో భేదము కనుపడను. ఇచ్చట వివరించబడిన బ్రహ్మవాదియొక్క సిద్ధాంతము సమస్తమతస్థులు అంగీకరించతగియున్నది. భేదమ్ముందే యభినివేశము నుంచుకొనియుండు ఆయామతస్థులకు మాత్రము ఈముఖ్యాంశములలోను భేదమున్నట్టు తోచవచ్చును. లోపలవెళ్లిజూచిన ఐక్యము తప్పక గోచరించుచున్నది.

ఋణత్రయమును తీర్చుట బ్రాహ్మణుని కర్తవ్యము.

7. బ్రహ్మవాదమనెడి సిద్ధాంతమునసుసరించి నడచువాడు

బ్రాహ్మణుడు. అనగా, తనబ్రహ్మస్వరూపమును సాక్షాత్కారము జేసుకొనుటకు యత్నించువాడు బ్రాహ్మణుడని యర్థము. వానిప్రయత్న మెటువంటిదో శ్రుతిసూచించియున్నది:—

"జాయమానోవై బ్రాహ్మణస్త్రిభిరృణవాజాయతే బ్రహ్మచర్యేణర్షిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయాపితృభ్యః ఏష వాఅనృణోయః పుత్రీయజ్వాబ్రహ్మచారి వాసీతి॥ (తై సంహిత 6-3-10.)

బ్రాహ్మణుడుగా జనించినవాడు మూడుఋణములతో కూడియుండును. ఋషులకుబ్రహ్మచర్యరూపమైన ఋణమును, దేవతలకు యజ్ఞరూపమైన ఋణమును, పితృలకు సంతానరూప ఋణమును తీర్చవలెను. ఎవడుపుత్రవంతుడై యాగముజేసి బ్రహ్మచారియై వాసముజేసునో వాడు ఋణమును తీర్చినవాడు.

తనబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించుకొను నుద్దేశముగలవాడు చేయవలసినదేమనగా:—ఋషి దేవ పితృఋణములనుతీర్చుట. (1) బ్రహ్మచర్యముచే ఋషిఋణమును తీర్చవలయును. బ్రహ్మచర్యమనగా నైహికసుఖములయందాసక్తిని విడిచి దేహేంద్రియములను వశముజేసుకొని తననిజమైన బ్రహ్మస్వరూపమును అట్టిబ్రహ్మస్వరూపము లభించునట్టి ధర్మమార్గమును, గురుశాస్త్రముఖమున తెలుసుకొనుట, తరువాత ఆరెంటిని తెలుసుకొనన పేక్షించువారికి యుపదేశించుట. (2) యజ్ఞానుష్ఠానముచే దేవఋణమును తీర్చుకొనుట. యజ్ఞానుష్ఠానమనగా దేహేంద్రియముల సుఖార్థమైన వ్యాపారములను వదలి వాటికి ప్రభువైన జీవుని బ్రహ్మస్వరూపము ననుసరించి బ్రహ్మవలెనే లోకహితార్థమై యావచ్ఛక్తిని వినియోగించుట. ఇట్లు చేయుటవలన జీవునియందు బ్రహ్మస్వరూపము క్రమేణ ఆవిర్భవించుచున్నది. జీవుని జ్ఞానక్రియాశక్తులు వృద్ధియై ఆనందాతిశయము కలుగును, (3) మంచిసంతానమును కలుగజేయుటచేత పితృల ఋణముతీరుచున్నది. ధర్మానుష్ఠానమునకును, బ్రహ్మజ్ఞానసంపాదనమునకును,

తగిన సచ్ఛరీరములు లోకమందు సదాయుండులాగున చూచుకొనుట పితృదేవతల పనిగానున్నది. బ్రాహ్మణుని శరీరమట్టి పితృదేవతల యనుగ్రహముచే లభించియుండుటచేత బ్రాహ్మణుడు పితృదేవతలకు ఋణస్థుడైయున్నాడు. వాడు నియమపురస్సరమైన యనగా శాస్త్రవిహితమైన వ్రతములను యథోక్తముగా నాచరించి, తనదేహమును శుద్ధిజేసుకొని అనురూపముగల స్త్రీరత్నమును బెండ్లిచేసుకొని కుమారులను, కుమార్తెలను గనుటవలన పితృదేవతల ఋణముతీరుచున్నది. ఈమూడు ఋణములను తీర్చుకొనుట బ్రాహ్మణుని కర్తవ్యముగా నున్నది.

ఋణత్రయమును తీర్చువాడే ముక్తికియోగ్యుడు.

8. "ఋణానిత్రీణ్యపాకృత్యమనో మోక్షేనివేశయేత్"

అనెడిమనువచనానుసారము ఈమూడు ఋణములను తీర్చిన పిదప మానవుడు మోక్షమునుకోరవలయును. అనగా ఈలోకమునకు సంబంధించిన కర్మములనువిడిచి కేవలము జ్ఞానాభ్యాసమును చేయవలయును. ఋషి, దేవ, పితృలవలె లోకహితార్థముగా ఆయాపనులను చేయుటచే ఋష్యాదులలో నావిర్భవించియుండు ఈశ్వరునిశక్తి బ్రాహ్మణునియందును ఆవిర్భవించును. గనుక బ్రాహ్మణునకు తన ఈశ్వరసమానమైన రూపమునుగోచరించుచువచ్చుచున్నది. ఇట్టిమూడు ఋణములను తీర్చుటచే ఈమానవలోకమందు సాధించదగిన యంశము బ్రాహ్మణునకు సిద్ధించి ముక్తియోగ్యుడగుచున్నాడు. అప్పుడీమానవసంసారమునువిడిచి బోవయోగ్యుడై ఉత్తీర్ణుడగుచున్నాడు.

సోపానములు.

9. ఋణత్రయములనుతీర్చి ముక్తిమార్గమందుండువాడు ఎక్కవలసిన సోపానములు ఉపనిషత్తులోనిట్లు సూచించబడియున్నది:—

ఏతంవైతమాత్మానంవిదిత్వాబ్రాహ్మణాః పుత్రైషణాయా

శ్చవిత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయంథాభిక్షా చర్యంచరంతి। తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యంనిర్విద్య బాల్యేనతిష్ఠాసేత్। బాల్యంచపాండిత్యంచ నిర్విద్యాథమునిః। అమౌనంచమౌనంచ నిర్విద్యాథబ్రాహ్మణః। సబ్రాహ్మణః కేనస్యాత్। యేనస్యాత్తే నేదృశఏవ. (బృహదారణ్యకోపనిషత్.)

ఇట్టియాత్మయుండుటను తెలుసుకొని బ్రాహ్మణులు పుత్ర విత్త లోకములకు సంబంధించిన యపేక్షలను విడిచి (ఆత్మవిద్యకై) భిక్షాచరణను జేయుదురు. తరువాత (బ్రాహ్మణుడు) ఆత్మవిద్యను సమగ్రముగా సంపాదించి విద్యను బలపరచుకొనుచున్నాడు. విద్యను దానిబలమును పూర్ణముగా సంపాదించి మననముజేయును. తరువాత విద్యాబలమననములను సమగ్రముగా సాధించి ముఖ్యబ్రాహ్మణుడగుచున్నాడు (కృతకృత్యుడగుచున్నాడు) అట్టి బ్రాహ్మణుడెట్లుండును? బ్రహ్మనిష్ఠకనుకూలమైన యాచరణలో నుండును.

చివర సోపానము నెక్కినవాడే ముఖ్యబ్రాహ్మణుడు. ఇట్లు వేదాధ్యయన పురస్సరమగు ధర్మమార్గమును తెలుసుకొను దశ నుండి బ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించుకొను స్థితివరకు మనుష్యుడు బ్రాహ్మణుడని చెప్పబడుచున్నాడు. ఇట్టిబ్రాహ్మణుడే సంధ్యజేయుటకర్హుడు.

మనుష్యమాత్రుఁడు వేదోక్తధర్మమున కధికారి.

10. మనుష్యమాత్రునికి సంధ్యమొదలగు వేదోక్తధర్మమున కధికారమున్నదని శ్రుతినుండి తెలియవచ్చుచున్నది. యాగములలో ప్రధానమగు సోమయాగముయొక్క ప్రధానదీక్షాహుతి మంత్రము సమస్తులు యాగమును జేయవలసినదని విధించుచున్నది. ఆమంత్రమేమనగా:—

“విశ్వో దేవస్య నేతుర్మర్తో వురీతసఖ్యం విశ్వోరాయఇషుధ్యతిద్యుమ్నం వృణీతపుష్యసే॥ — (ఋగ్వేదము)

మరణభీతిని పోగొట్టుకొనదలచిన మనుష్యులందరు ఈశ్వరునిసఖ్యమును అనగా ఈశ్వరసహభావమును బొందుటకు యత్నించవలయును. అట్టివాడు ఈశ్వరుని దివ్య తేజస్సును సద్భావ ర్తించుటచేత సకలైశ్వర్యములను బొందును.

ఇట్లు మనుష్యులందరు వేదోక్తయాగమున కధికారులని శ్రుతిబోధించుచున్నది. ఈశ్వరసఖ్యమును వరించుటయే యాగము. అట్టియాగదీక్షను వహించినవాడే బ్రాహ్మణుడని ("దీక్షితోయంబ్రాహ్మణః)" శ్రుతి జెప్పుచున్నది.

ధర్మదృష్ట్యా వర్ణభేదము లేదు.

ఈశ్వరసఖ్యమును వరించుటచేత బ్రాహ్మణునకు "వర్ణ"మని పేరువచ్చియున్నది. ఈశ్వరసఖ్యమును వరించువారందరు వర్ణమునకు జేరియుందురు. వారందరు బ్రహ్మనిష్ఠులుగాన బ్రాహ్మణులే. ఈశ్వరోపాసకులందరు వర్ణమునకు జేరినవారుగాన లోకములో అట్టివారే జనాంగములలో నుండినను వర్ణమునకు జేరినవారే యగుచున్నారు. ఈశ్వరోపాసనయనెడి యాగము ననుష్ఠానముచేయుటచే వారందరు బ్రాహ్మణులనియే జెప్పవచ్చును. అందువలననే మహాభారతములో భృగుమహర్షి వర్ణములయందెట్టి విశేషము లేదని బోధించియున్నాడు:—

శ్లో॥ నవిశేషోస్తివర్ణానాం సర్వంబ్రహ్మమిదంజగత్
బ్రాహ్మణాఃపూర్వసృష్టాహి కర్మభిర్వర్ణతాంగతాః॥
(శాంతిపర్వము 188 అధ్యాయము)

అనగా, వర్ణములలో విశేషమేమియు లేదు. ధర్మానుష్ఠానముచే మానవుడు వర్ణస్థుడగుచున్నాడు. జగమందు ఈశ్వరోపాసనయనెడి ధర్మమునాచరించువారందరు వర్ణమువారు, బ్రాహ్మణులు. (సశేషము.)

ఎం. వెంకట్రావు.

# సత్యాసత్యవివేచనము.

(194 పుట శేషము.)

వాయువేగమునకన్నను మనోవేగ మెక్కుడు. తృటికాలమున వేయియోజనముల దూరమున నైన నున్నపదార్థమునుం దన సంకల్పబలంబుచేఁ దానున్నచోటనుండియే గ్రహించుసామర్థ్యము మనస్సునకుఁగలదు. తృటికాలనిర్ణయము స్తుతిమాత్రమే గాని మనోవేగమునకు గాలనిర్ణయముసేయుట దుర్లభము. మనస్సు ఆతృటికాలములోనే యెన్నియోసంకల్పములను సంకల్పించుచునుండును. ఆత్మనుఁబోలె మనస్సుకూడ రూపములేనిది. గనుకనే ఆత్మనెఱుంగుట యెంతకష్టమో మనస్సునెఱుంగుటకూడ నంతకష్టము. చంచలత్వమే దీనిధర్మమగుననిఁ బెద్దలు సెప్పుదురు.

శ్లో॥ నహిచంచలతాహీనం మనఃక్వచనవిద్యతే
చంచలత్వంమనోధర్మో వహ్నేర్ధర్మోయథోష్ణతా॥
(జ్ఞానవాశిష్ఠము ఉత్పత్తిప్రకరణము 23.)

తాత్పర్యము:—ఉష్ణత్వ మగ్నియొక్క ధర్మమగునట్లు చంచలత్వము మనస్సుయొక్క ధర్మమగును. కావున నెచ్చటను వేడిలేక అగ్నియుండనియట్లు సాధారణముగ చాంచల్యములేక మనస్సు ఉండ నేరదు. కాఁగా:—

శ్లో॥ యత్తత్సదసతోర్మధ్యం యన్మధ్యంచిత్తజాడ్యయోః
తన్మనఃప్రోచ్యతేరామ॰ద్వయదోలాయితాకృతి॥
(జ్ఞానవాశిష్ఠం ఉత్పత్తిప్రకరణం 28.)

తాత్పర్యము:—సద్వస్తువు అసద్వస్తువు ఈరెంటికిని చేతనాచేతనములకును నడుమనుండు నట్టిదియు నేను, నాయది, యను రెండువృత్తులయందుఁ దిరుగున్నట్టిదియు మనస్సని చెప్పఁబడును.

ఇట్టిచంచల స్వభావమునుఁ గలిగిననైనను సాధక బాధక

ములకు రెంటికిని సాధనమైనదైనను మనస్సు పురుషస్వాతంత్ర్య శక్తి నతిక్రమింపలేదు.

శ్లో॥ పౌరుషేణప్రయత్నేన తస్మిన్నేవపదేమనః
యోజ్యతేతత్పదంప్రాప్య భవత్యభ్యాసతోహియత్
అతఃపౌరుషమాశ్రిత్య చిత్తమాక్రమ్యచేతసా
విశోకంపదమాలంబ్య నిరాతంకఃస్థిరోభవ॥
(జ్ఞానవాశిష్ట ఉత్పత్తిప్రకరణం 31-32)

తాత్పర్యము:—మనస్సు పురుషప్రయత్నముచే నేవిధమగు వస్తువునందుఁ బ్రవేశపెట్టఁబడుచున్నదో నావిధమగు వస్తురూపమును అభ్యాసమువలనఁ బొందుచున్నది. కావున పురుష ప్రయత్నమువలన మనస్సుచేతనే మనస్సును నిగ్రహించి దుఃఖరాహిత్యమగు బ్రహ్మవస్తువునందుఁజేర్చి నిర్విఘ్నముగా స్థైర్యమునుఁ బొందినవాఁడవగుము.

బాహ్యాంతరేంద్రియ వ్యాపారములకులోనై సార్వదావిషయముల నూహించి సంకల్పించుచుండుటే మనస్సుయొక్క కార్యము. సంకల్పములుకూడ మనస్సునువలె శుద్ధాశుద్ధముల ని ద్వివిధము. ఇట్టిసంకల్పపూరితమగు మనస్సు పురుషునకు పరమాప్తబంధువును, సర్వకాల సర్వావస్థలయందునుఁ గూడ నెడఁబాయని సన్మిత్రమును, సంసారసముద్రమునకు నావవంటిదియును, భవరూపాటవికిఁ గార్చిచ్చునుఁ బోలునదియునై యున్నది. ఈమనస్సు బాహ్యాంతరేంద్రియములకు రాజుగాఁ జెప్పఁబడుచున్నది. దీనికంటెఁ శ్రేష్టతనువహించి పురుషునకు బుద్ధి యనెడు నింకొకమిత్రముకూడఁ గలదు మనస్సూహించిన సంకల్పములను దృఢాదృఢపఱచు సామర్థ్యము బుద్ధికిఁగలదు. స్వభావముచేతనే నిలుకడలేని చంచలత్వముఁ గల మనస్సు విషయములను సంకల్పించుటయందుఁ బ్రవర్తించుటకై లోపలినుండి పైకివచ్చునపు డడ్డపడి ఆసంకల్పములను నెఱవేర్చుటయునోఁ

గాక నెఱవేర్పకుండుటయునో నిశ్చయించి మంచిమార్గమునఁ బ్రవర్తింపచేయుటే బుద్ధియొక్క కార్యము. మనస్సంకల్పములయొక్క వివేకావివేకములనుఁ బరిశీలించి నిశ్చయించును గనుకనే మనస్సును జయింపఁగల పురుషప్రయత్నమునకు బుద్ధి ముఖ్యమైన సాధనము. కావుననే మనస్సుకంటె శ్రేష్ఠమని చెప్పఁబడుచున్నది.

స్వలాభాపేక్షలేని సంకల్పములు శుద్ధములు; స్వలాభాపేక్షతోఁగూడిన సంకల్పములు అశుద్ధములు. ఈశుద్ధాశుద్ధ వివేచనముసేయుట బుద్ధియొక్క బలము. ఇట్లు వితర్కింపబడిన పరిశుద్ధ సంకల్పములనుఁ గార్యరూపకమున స్థూలతః బహిర్వ్యక్తముసేయుటే పురుషప్రయత్నము.

(పురుషస్వాతంత్ర్యశక్తి.)

శ్లో॥ సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వాసర్వానశేషతః
మనసైవేంద్రియగ్రామం వినియమ్యసమన్తతః॥
శనైశ్శనైరుపరమే ద్బుద్ధ్యాధృతిగృహీతయా
ఆత్మసంస్థంమనఃకృత్వా నకించిదపిచిన్తయేత్॥

(గీత అ 6 24-25.)

తాత్పర్యము:—సంకల్పమువలనఁ గలుఁగు సమస్తమైన విషయాశలను విడిచి మనస్సుచేతనే సమస్తేంద్రియములను సమస్తమైన విషయములలోనుండి త్రిప్పి ధైర్యముచే స్వాధీనముచేసికొనఁబడిన బుద్ధిచేత సంకల్పాత్మకమైన మనస్సును ఆత్మయందుండులాగునఁజేసి మెల్లమెల్లఁగా మనస్సును మఱలింపవలయును. ఆత్మవ్యతిరిక్తమైన యేవస్తువునుఁ దలంపఁగూడదు.

పురుషుఁడీశ్వరాంశ సంభూతుఁడనియును, ఈశ్వరుఁడెల్లప్పుడును, సత్సంకల్పుఁడును, శుద్ధసత్వగుణయుఁడును, సర్వభూతసమహితరతుండనియు నిదివఱకెన్నియో మాఱులు చెప్పఁబడియుండినందున చర్విత చర్వణ దోషము సంఘటించునని దోఁచి

నను చదువరులీ యంశమును గాలువక గాలల గాలల జ్ఞాపకమున కుఁ దెచ్చుకొందురుగాక! యని సూచింపఁబడియె.

"దేహో దేఃపరతరత్వాత్ :—

"బ్రహ్మైవపరమాత్మా సబ్రహ్మా స్సవిష్ణు స్సరుద్రస్స ఇంద్ర స్సశమన స్ససూర్య సచన్ద్రా స్తేఅసురా స్తే పిశాచా స్తేమనుష్యా స్త్రాస్త్రియ స్తేపశ్వాదయ స్త త్థావరం తేబ్రాహ్మణాదయస్సర్వం ఖల్విదంబ్రహ్మ నేహనానా స్తికిఇ్చన"॥ (నిరాలంబోపనిషత్.)

"యద్భావంతద్భవతి" అను నంశమును మనస్సున జక్క గా నూహించి "ఏకోదేవోబహుధానివిష్టః" అను వేదాంత సిద్ధాంతమును బుద్ధిచేనిశ్చయించి ప్రజ్ఞానంబ్రహ్మ, అహంబ్రహ్మాస్మి తత్త్వమసి, అయమాత్మాబ్రహ్మ" అను మహావాక్యోపలక్ష్యముల ను ధర్మార్థకామమోక్షములనెడు చతుర్విధ ఫలపురుషార్థాను సంధానములనుఁగఁజేసి పురుషుఁడు మొట్టమొదటఁ దన్నుఁదా నెఱిఁగి పిదపసర్వమందునుఁ దన్నేగాంచుచు నీశ్వరునంతటి వాఁడగుటకు బ్రయత్నించుటేఁ గార్యరూపకమున బహిర్వ్యక్త ముసేయంబడు పురుషప్రయత్నమనఁబడును.

శ్లో॥ హృత్పద్మమధ్యే పురుషంప్రమాణం
సత్యాత్మకంసర్వజగత్స్వరూపమ్
ధ్యాయామినిత్యంపరమాత్మసంజ్ఞం
చిద్రూపమేకంవచసామగమ్యమ్॥

(దేవీభాగవతం ఏకాదశస్కంధము షోడశోధ్యాయం 74.)

తాత్పర్యము:—హృదయకమల మధ్యస్థుండై పురుషప్ర మాణుండై, సత్యాత్మకుండునై, సర్వజగత్స్వరూపకుండునై, చిద్రూపకుండునై, ఒకఁడునై వెలయు పరమాత్మ సంజ్ఞునినిత్య మును నేనుధ్యానముచేయుచున్నాను.

ఇందునకుధర్మమును ధర్మసూక్ష్మము నెఱుఁగుట అత్యావశ్య

శము. ధర్మములును ధర్మసూక్ష్మములును ఆయాపురుషుని పారిశుద్ధ్యత జ్ఞానమున ననుసరించి అనేకవిధములుగ నున్నవి. వాని నెఱుంగుట దుర్లభము కాదు. పురుషుఁడు తనశుభాశుభ వాసనల ను గుఱించి యించుక విచారింపఁ దొడఁగునేని ధర్మములును ధర్మ సూక్ష్మములును బహుసులభముగాఁ దనబుద్ధిచే నూహింపవచ్చు ను. శుభాశుభవాసనలను గుఱించి వితర్కించుటకుఁ బురుషు నియొక్క సంచితము, ప్రారబ్ధము, ఆగామియనుకర్మత్రయము లే స్వానుభవ సాక్షీభూత సాధనములుఁగనున్నవి.

అనేకకోటి జన్మములయం దనుభవింపఁ బడఁగా శేషిం చిన కర్మసముదాయము సంచితమనఁబడును, ప్రకృత జన్మమున ననుభవింపఁబడుచుండు కర్మప్రారబ్ధమనఁబడును, క్రొత్తఁగాఁ జేయునట్టి కర్మము ఆగామియనఁబడును. ఇదియే జన్మాంతర మున ననుభవింపఁ బడవలసినట్టి సంచితముతో జేరునది.

సంచితమును, ఆగామిని బురుషప్రయత్నముచే ఫలోన్ము ఖములుఁగాకుండ మార్పనగుంగాని ప్రారబ్ధములనుమాత్ర మనుభవించియే దీరవలయునని పెద్దలు వచించెదరు. అయినను అనుభవసిద్ధములైన ప్రారబ్ధములనుఁగూడఁ బురుషుఁడు తనసత్సం కల్పములయొక్క బలిమిచే నణఁపనగుననికూడ యాపెద్దలేవచిం చెదరు. కావున నన్నిఁటికిని మూలము పురుషునియొక్క సంకల్పములు సర్వకాల సర్వావస్థలయందును పరిశుభ్రములైన విగా నుండవలయునని భావము. ఇయ్యది తత్వజ్ఞానము వలన మాత్రమే సాధ్యమగుంగాని వేరొండుమార్గమెయ్యదియు ను గోచరింపలేదు.

శ్లో॥ యథైధాంసిసమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున
జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా॥
నహిజ్ఞానేనసదృశం పవిత్రమిహవిద్యతే
తత్స్వయంయోగసంసిద్ధః కాలేనాత్మనివిన్దతి॥

తాత్పర్యము:—ఓయర్జునా! జ్ఞానము, పుణ్యపాపములను నశింపఁజేయుననుట దృష్టాంతసహితముగాఁ దెలియఁజేసెద వినుము:—లెస్సఁగామండునట్టి యగ్ని కట్టెలనెట్లు భస్మముఁగా జేయునో, అట్లు జ్ఞానమనెడియగ్ని సమస్తకర్మములను భస్మము చేసివేయును, అనఁగా బ్రహ్మజ్ఞానము కర్మములకు మూలమగు నజ్ఞానమును నివర్తింపఁజేయునని యర్థము. ఇందువలన నశించు కర్మములేవియనఁగా :—బ్రకృతజన్మమునకు మూలమగు ప్రారబ్ధకర్మము నశింపదు. అదిఅనుభవైక వినశ్యమే; అనేక జన్మములనుండి సంచితములైయున్న కర్మములును ఆగామి కర్మములును నశించును. ఈలోకమందు తపస్సు యోగము మొదలగువానిలో జ్ఞానమువలెనే పావనమైనది యెద్దియు లేదు. ఏలయనిన:— కర్మయోగముచేతఁ జిత్తశుద్ధిద్వారా కలిగిన సమాధియోగముచేత యోగ్యతనుఁ బొందినముముక్షువు కాలక్రమమున స్వస్వరూపజ్ఞానమునుఁ దనకుఁదానేఁ బొందును. తపస్సు యోగములు మొదలగునవి సులభసాధ్యములు. జ్ఞానము కష్టసాధ్యము, కాఁబట్టి సర్వోత్తమమగు తత్వజ్ఞానమును సంపాదించుకొనుటకు వివేకి ప్రయత్నముచేయవలయును.

"జ్ఞానాదేవతుకైవల్యం"

జ్ఞానమే కైవల్యము అనుశ్రుతి ప్రమాణమునుఁ బట్టి పురుషుఁడు పైనఁజెప్పిన తత్వజ్ఞానము, బ్రహ్మజ్ఞానమును సంపాదించుటకుఁ బ్రయత్నింపవలయును.

పురుషుఁడు తానుస్థూలసూక్ష్మకారణ శరీరములకంటెను వేఱనియును ఈశ్వరసంకల్పమునకు వ్యతిరేకమగు సంకల్పములను సంకల్పించెడు మనస్సుకూడ తనకన్న భిన్నమనియును దెలియుట అత్యావశ్యకము. తనయందును సకలచరాచరంబులయందును వ్యాపించియుండు నీశ్వరాంశ మొకఁటియే యను తత్వజ్ఞానము ఆత్మజ్ఞాన మలవడు వఱకును మనస్సునుఁ దన

కన్న భిన్నమని యెన్నియే తీరవలయును. అట్టిజ్ఞానము కలిగిన వెంటనే మనశ్శక్తి నశించును. ఇందునకు;—

"అహింసాపరమోధర్మః"

అను శ్రుతివాక్యమునే మఱవక స్మరించినచోఁ దన స్థూల సూక్ష్మ కారణాది శరీరములకును మనస్సునకునుగోచరించు కష్టములే ఇతరుల స్థూలసూక్ష్మ కారణాది శరీరములకును మనస్సునకునుగోచరించు కష్టములనియునుఁ దన శరీరములకును మనస్సునకును గోచరించు సుఖములే ఇతరుల శరీరములకును మనస్సునకును గోచరించు సుఖములనియునుఁ దెలియు సామర్థ్యము పురుషునకుఁ దప్పకస్ఫురించును. ఇచ్చట తాను ఇతరులు అను పదములను శరీరాది భేదములచే గుర్తింపఁబడు రూపములని యెఱుంగునది. అంతర్యామిన్మై కష్టసుఖముల శరీరాదులను భవమునకుఁ దెచ్చుకొని బాధపడుటయును ఆనందించుటయును సాక్షిమాత్రుఁడై గనువాఁడుమాత్రమొకఁడే యను నంశమును మఱవకుండ వాఁడే తాను తానే వాఁడనియును, తనశరీర కష్టములవంటివే వానిశరీర కష్టములనియును, తనవలెనె వాఁడును సౌఖ్యపడఁదలఁచువాఁడనియును దలంచి మనోవాకాయ కర్మములయందునుఁగూడ పరహింస సేయకూడదని సిద్ధాంతము సేయవలయును.

"పాపాయపరపీడాయ"

అనువాక్యమునుఁగూడ స్మరించుట అత్యావశ్యకము. వాకాయ కర్మములద్వారా సేయఁబడు హింసలకంటెను మనస్సుద్వారా చెడుసంకల్పములను సంకల్పించి యొరులకుఁగలుగఁజేయు హింసలు బలీయములైనవి.

(సశేషము.)

గుడిపాటి. శేషగిరిరావు.

—:0:—

# జన్మసాఫల్యము.

ఏమహాపురుషుడనంత కల్యాణగుణ పరిపూర్ణుడో, ఎవండ వినాశియో, ఎవనియందు పృథివీసూర్యాదిలోకములు స్థిరములై యున్నవో, ఎవండాకాశమునుంబోలిన సర్వవ్యాపకుడును సర్వదేవదేవుండునునగు పరమాత్మయో, ఆభగవంతుని నెఱుంగక ధ్యానింపక సేవింపకయుండు మందమతులగు మనుష్యులు సంసారకాంతారమునుండి విముక్తిచెంద లేక మిడుకరించువారై తుదకు దుఃఖార్ణవమున మునిగియుందురు. కావున మనుష్య జన్మమెత్తిన యెల్లవారును సర్వవిధములం బ్రయత్నించి యాపర బ్రహ్మము నెఱింగి నిరతిశయానంద మొందవలెను. అదియ జన్మసాఫల్యమనంబడును. అనంత జంతుసంతానమందంతట నీ మనుష్యజన్మ మిక్కిలియుత్తమంబైనది. దీనినినే శ్రీ ఆదిశంకరులవారీవిధముగా వచించిరి.

శ్లో॥ జన్తూనాం నరజన్మదుర్లభమతః పుంస్త్వంతతోవిప్రతా
తస్మాద్వైదికధర్మమార్గపరతావిద్వత్వమస్మాత్పరమ్
ఆత్మానాత్మవివేచనంస్వనుభవోబ్రహ్మాత్మనాసంస్థితిః
ముక్తిర్నోశతజన్మకోటి సుకృతైఃపుణ్యైర్వినాలభ్యతే॥
(వివేకచూడామణి.)

అనంతజీవకోటిలో మనుష్యజన్మములభించుట మిక్కిలి యరుదు. అందును గర్భధారణాది వివిధదుఃఖములకాలవాలంబైన స్త్రీ జన్మమునెత్తక పురుషుఁడై జనించుటరుదు. ఇచ్చట కొంతసంశయంబు కలుగుచున్నది. అనగా స్త్రీ జన్మమంత హేయమైనదా యనుట స్త్రీ జన్మమే హేయమన్నచో నది యసంబంధ ప్రలాపమగునే కాని యుత్తమవాక్యమైగనప్పట్టదు. స్త్రీ లేనిచో పురుషుఁడును లేఁడు. ముఖ్యాంశమేమనగా సర్వదా గర్భధారణ, ప్రసవ, శిశుపోషణ, సంయోగవియోగాది

దుఃఖముల కొటపట్టనుటయె. స్త్రీపురుషాది భిన్నభేదవ్యవస్థ లు శరీరములకే గాఁ ఆత్మకులేవు. ఆత్మసందర్శన మొందియుం డువారికిట్టి భేదభావము లంతరించియుండును.

శ్లో॥ సమోహంసర్వభూతేషు నమేద్వేష్యోస్తినప్రియః
యేభజంతితుమాంభక్త్యా మయితే తేషుచాప్యహమ్॥
(భగవద్గీత ౯-౨౯.)

అను గీతావాక్యము ననుసరించి విజ్ఞానవిశారదులగు మహనీయులు దశాభేదముల నెఱింగి వర్తింతురేకాని ఈశ్వర విభూతికిచేరిన యేజంతువును గాని హింసింపరు. పరిహసింపరు. అట్టివారే బ్రహ్మవేత్తలు. వారే మానవులలో నుత్తములు.

శ్లో॥ యద్యదాచరతిశ్రేష్ఠ స్తత్తదేవేతరోజనః
సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే॥ (3-21)

అనుగీతా వాక్యముచొప్పున గొప్పవారిమార్గము ననుస రించి ప్రవర్తించుట తక్కిన వారగు సజ్జనులకు ప్రధానధర్మము. ఇట్టిపురుషశ్రేష్ఠులు, వసంతునింబోలి లోకహితముకొఱకు వర్తిం చువారును, భయంకర సంసారసముద్రమును దాముతరించి నిర్వ్యాజకరుణచే పామరులయి భవసాగరమున మునింగియున్న యితరజనులను దరింపఁజేయు వారునునై యెప్పుడును నామహాత్ము లు నివసించియేయున్నవారు. ఇతరులకష్టములనుఁ బరిహరించుట యే వారినైజగుణము. వారేభక్తులు, ముక్తులు, జ్ఞానులు, ధ్యాను లు, యోగులు మానులును సదానంద మయులునైయున్నారు.

శ్లో॥ యోమాంపశ్యతిసర్వత్ర సర్వంచమయిపశ్యతి
సర్వభూతస్థమాత్మానం సర్వభూతానిచాత్మని

అనుగీతావాక్యముల ననుసరించి యామహాత్ములెల్లెడల భగ ద్దర్శనము జేయుచుందురు. తత్వవేత్తల కీవిశ్వమంతయు నీశ్వ రమయముగానే గనవచ్చును. ప్రకృతి శాస్త్రప్రవీణుల కొక చిన్న వస్తువు సయితమనంత కార్యనిర్మాణమునకుఁ దోడుపడును.

భగవద్భక్తుల కన్నిటియందును భగవంతుని లీలలే తోఁచుచుం డును. చిత్రకారుల కెంతటియల్పపదార్థము దొరికినను దాని తోనే సృష్టివైచిత్రమునుఁ బ్రదర్శింతురు. కవిపుంగవులొక చిన్నపద్యముచేతనే ఈశ్వరమహిమనుఁ బ్రకటింతురు. పతివ్రతా శిరోమణులగు పరమసాధ్వీమణులెంత దరిద్రస్థితి పేదరికమునందు న్నను గృహమును భూతలస్వర్గముగాఁ జేతురు. సత్పురుషు లకెట్టి యాపదలు సంభవించినను, వెనుదీయక ధైర్యముతో ధర్మసేవచేయుచునే యుందురు. వేయేల! ఈశ్వరమహిమ యొక నిర్మలమైన అద్దమువంటిది. ఎవరేభావముతో దానిని దర్శించిన వారివారికాయా విధముననే ప్రతిఫలించుచుండును. దృక్కుఁ భ్రాంతిఁజెందినచో దృశ్యముయొక్క స్వభావపరిణామము భిన్నమైదోఁచును. అంతట వివేకియగువాడు తనదృగ్దోషమును పరిహరించుకొని యాపై ఈశ్వరదర్పణమును దర్శింపవలెను. అటుగాక స్వదోషమును మరచి దృశ్యమునందే దోషముఁ గల దని వాదించుట మిక్కిలి యసమంజసము. కావుననే సదసద్వి వేకముఁగలిగి మెలంగవలెనని జ్ఞానులు వేనోళ్ళ వక్కాణించి యున్నారు. అట్టి సదసద్వివేకము సాధనచతుష్టయ సంపత్తి యనఁబడుచున్నది. అయ్యది యాత్మానాత్మ వివేకము, ఇహాము త్రార్థఫలభోగ విరాగము, శమాదిషట్క సాధనము, ముముక్షుత, యని నాల్గువిధములుగానున్నది. సనాతన ధర్మప్రచారకు లైన, వసిష్ట, విశ్వామిత్ర, కణ్వ, కాశ్యప, ఆంగిరసాది, మహర్షి పుంగవులును, హరిశ్చంద్ర, నళ, భగీరథాంబరీష, రుక్మాంగదాది రాజన్యప్రముఖులును, గార్గి, చంద్రమతీ, దమయం తీ, అనసూయా, సీతా, సావిత్ర్యాది పరమసాధ్వీమణులును, భీష్మాంజనేయాది దీర్ఘ బ్రహ్మచర్యవ్రతపరిపాలకులును, శిబిరం తిదేవాది కారుణ్యవంతులును, జడభరతాది జ్ఞానులును, ప్రహ్లా దాది భాగవతులును, పరమేశ్వరుని కటాక్షమునకుఁ బాత్రులైరి.

వారాచరించిన ధర్మములే మనకు బరమార్థసాధన సూత్రములు. వారి ప్రవర్తనమే మనకు మేలుబంతి. లాభాలాభములు, జయాపజయములు, నిందాస్తుతులు, మానావమానములు, మున్నగు నన్నిటియందును సమబుద్ధికలవారై, యుండినందుననే వారికీర్తి యజరామరంబై ప్రకాశించుచున్నది.

"భవోహిలోకాభ్యుదయం తాదృశాం"

అనుపండితోక్తి చందంబున, నట్టివారిజన్మము లోకహితము కొఱకే యగును. ఆమహామహుల వంశమందవతరించిన మనము వారి దివ్యగుణములలో లక్షాంశమైనఁ గడింపక పోయినచో వారిసంతతి వారమను పేరు మనయం దెట్లన్వయింపఁగలదు?

"ఏకమేవాద్వితీయంబ్రహ్మ" యను వారి యున్నత తత్వాదర్శమునకుఁ బ్రత్యక్ష విరుద్ధముగా నిప్పుడా దేవుడు పెద్ద, ఈదేవుడు చిన్న, ఆదేవుడు సర్వజ్ఞుడు, ఈదేవుడల్పజ్ఞుడను నిత్యాది భేదములనుకల్పించి ప్రచండవాదములు సలుపఁబడుచున్నవి. సత్యంవద ధర్మంచర, యను మహావాక్యమునకు విరుద్ధముగా నిప్పుడసత్యాధర్మములకుఁ జోటివ్వబడుచున్నది. అహింసాపరమోధర్మః, యనుటనుమరచి జీవహింసలు గావింపఁబడుచున్నది. క్షమాధర్మం విశేషతః యనుట నేమాత్రమునుఁ బాటింపక మాటిమాటికి క్రోధావేశము లుబ్బుచున్నవి. శీలం పరం భూషణమ్, అను వాక్యము నతిక్రమించి స్వేచ్ఛాప్రవర్తన దుష్కార్యాచరణములకుఁ బాల్పడుచుండుటే తటస్థించుచున్నది. బాహ్యాడంబరముతోగూడిన కార్యములయందే లోలుపడి వర్తించుటచే నీతిమార్గము క్రమేణ క్షీణింపజొచ్చినది.

(సశేషము.)

కారుపల్లి శివరామయ్య,

# అవతారములు.

## తృతీయప్రసంగము.

సోదరులారా,

నేటి మనప్రసంగవిషయము సులభముగాను కష్టముగాను ఉన్నది. అవతారముల వృత్తాంతములను త్వరత్వరగా జెప్ప వచ్చును, గ్రహించవచ్చునుగాన విషయము సులభమైయున్నది. అయితే శ్రోతలైన మీరు వాటి గూడార్థమును విచారించక తెలుసుకొనక యుండవచ్చునుగాన నదికష్టమైన యంశముగా నున్నది. ఈ యవతారవిశేషములను గురించి యుపన్యసించుటకు మునుపు సామాన్యమై యొక సంగతిని నేను విన్నవించక తప్పదు. ఈశ్వరుడే జగద్రూపముగ పరిణమించియుండుటచేత జగమంతయు నతనిస్వయంప్రకాశరూపమనియే చెప్పవచ్చును. మనమిపుడట్టి స్వయంప్రకాశరూపమును విచారించుటకుద్యమించియుండలేదు. ఈశ్వరుడు కొన్నివిశేషగుణములతో అప్పుడప్పుడు అవతరించియున్నాడు. వానినన్నిటినిగూడా మనము విచారించబూనియున్నవారముకాము. పురాతన గ్రంథములను జూచిన దేవుడు అనేక మాదులవతరించియున్నట్లు తెలియవచ్చుచున్నది. వానినన్నిటిని మనము విచారించక "ముఖ్యావతారములని" పరిగ్రహించబడియున్న పదియవతారములను మాత్రమే విచారించ బూనియున్నాము.

ఈవిషయమందు నాకొక సంశయము తలచూపుచున్నది. మీబాహ్యగ్రంథములలో నది నివర్తిచేయబడియున్నదో లేదో నాకు తెలియదు. ఆసంశయ మెద్దియనగా:—దేవుడనేక అవతారములను బొందియున్నట్టు జెప్పియుండగా ఈ పది యవతారములను మాత్రమే ముఖ్యావతారములుగా నేర్పరచియుండుటకు కారణమేమి? ఎవరు, ఏప్రమాణముచే వీటిని పర్ప

రచిరి? ఈసంశయమును నివర్తింపజేయ నవకాశములేదుగాన మనము దానిని ఊరక విడువవలసియున్నది. బాహ్యగ్రంథముల ను పరిశోధించియున్నవారలకు ఈసంశయము బహుశ గోచరిం చియుండవచ్చును. అధ్యాత్మరీత్యా దీనికారణము కనుగొనవ చ్చునుగాని అందుకు కొంతకాలమును శ్రమను వినియోగపరచ వలయును. ఈసంశయము మనకాలశ్రమలను వినియోగ పరచవలసినంతటి ముఖ్యమైన విషయముకాదు గనుక నే నాపనికి బూనకొనను. అయినను, ఈపది యవతారములనే ముఖ్యావతారములుగా గ్రహించియుండుటకు స్పష్టమైన కారణ మొకటి నాకుగోచరించుచున్నది. అవి లోకాభివృద్ధియొక్క వేరువేరుస్థితులను సూచించుచున్నవని నాయభిప్రాయము. అందునిమిత్తమై వీనిని ముఖ్యావతారములుగా గ్రహించియు న్నారో యేమో నేనుజెప్పజాలను. అయినను నాకు స్ఫురిం చిన కారణము ప్రస్తుతము చాలుననియే నాకుతోచుచున్నది.

మరియొకసంగతినికూడా మనము తెలుసుకొనవలయును. అదేమనగా:—అవతారముల వృత్తాంతములన్నియు పురాణము లలోజెప్పబడియున్నను ఇతర పురాతన గ్రంథములలోను వాని ప్రస్తావన వచ్చియున్నది. అయితే, వానిని విశదముగా తెలు సుకొనవలయునన్న పురాణములలోని వృత్తాంతములను విచా రించవలయును. ఋషులు తమ జ్ఞానదృష్టిచే ఊర్ధ్వలోకము లయందు జూచిన యాథార్థ్యములనే పురాణములయందు వ్రాసియున్నారని మీకు తెలుసునుగదా! పురాణములలో వారు వర్ణించియున్న సంగతులు యాథార్థ్య తత్వములనుబోధించునవి గానున్నవి. పురాణములలో అనూహనీయులు వర్ణించియున్న కొన్నిరూప విశేషములు ఈ లోకమున విచిత్ర తరమైయున్న ట్లు తోచుచున్నవి. వాగానతిచ్చియున్న కొన్నియథార్థ సంగతులు అధునికులకు అక్షేపకరములగా తోచును. ఇది

వరకెన్నడను వినక, చూడక, ఊహించకయున్న అద్భుతమైన రూపములు పురాణములలో వర్ణించియుండుటను చదవగానే పారమార్థికజ్ఞానము లేని ఆధునికులకు ఆరూపములు అసహ్యాకరములుగా తోచుచున్నవి. వస్తుపరిశోధన శాస్త్రముయొక్క పరిక్లుప్తమైనశిక్షారేఖయందు వర్తించుచున్న ఆధునికుల చిత్తము ఆ పరిమితిరేఖను దాటిపోజాలదు. ఆపరిమితిరేఖయు ఈకాలమందు ఇప్పటిమానవులకు యోగ్యమైనదిగా నున్నదిగాని వేరుగాదు. భూగర్భశోధనలు అంధకారయుగములనిజెప్పబడు పంతొమ్మిదవ శతాబ్దములో పూర్వభాగమందు బహుకాలమువరకువెళ్లియున్నది. ఎప్పుడు భూగర్భశాస్త్రము చరిత్రకాలమునకంటె వెనుకటివరకు బోవుచున్నదో అప్పుడది కాలనిర్ణయవిషయమై యూహించ నారంభించునేగాని దృఢముగా నిర్ణయించజాలదు. భూగర్భ పరిశోధకులకు దొరకిన ఎముకలనుబట్టి వాటికాలనిర్ణయమును జేయుడని వారినడిగిన ఒకొక్కరొకొక్క కాలమును నిర్ణయించుచున్నారేగాని అందరు ఒకటే కాలమును జెప్పుటలేదు. వారునిర్ణయించు కాలముకూడా వేయారుసంవత్సరములు వ్యత్యాసముగలదిగానుండును. మనము ఘడియ విఘడియలను ఎంచునటులవారు సంవత్సరములనే ఎంచుచున్నారు. ఆధునికశాస్త్రము తనపరిమితియందెంత నిష్కర్షగా జెప్పుచున్నను కల్పకల్పములనే చూడగల దృష్టికి అదివెల్లడిజేయు వృత్తాంతము అత్యల్పమైయుండును.

(సశేషము)

ఎం. వి. వెంకట్రావు.

# సత్వగుణమహిమ.

(308-వ పుట శేషము.)

క్షేత్రజ్ఞుడగు జీవుడు క్షేత్రమగు దనశరీరమునందు కృషి జేయుటకు ఆరంభింపగా మొట్టమొదట శ్లాఘ్యమగు ధాన్యమును తనక్షేత్రమున ఫలింపజేయుట కాంక్షించువాడగును. లోకమునందుఁ దరచుగా కృషిజీవనము చేయువారలందరును శక్త్యనుగుణముగఁ దాముతాము ఉత్తమధాన్యమును పంటచేసి తన్మూలముగ ధనవంతులయి యుత్తమజీవనమునొంది యానందింప నిచ్చింతురుగదా! శరీరమగు క్షేత్రమునందు ఫలించుధాన్యము సత్వము, రజము, తమములగు గుణములయి కనుబడుచున్నవి. ఆధాన్యములు పరస్పరము మిశ్రములయియున్నను వానిలో సత్వాంశము ఉత్తమమనియు, రజోంశము మధ్యమమనియు, తమోంశము అధమమనియు నిట్లు తారతమ్యమేర్పడియున్న విషయము సుప్రసిద్ధము. వీనిలోనుత్తమ తరము శ్లాఘ్యమయి నందున కృషిఁజేయువారలందరు అపేక్షింపతగినది యయ్యేయుండును. ఆయాధాన్యమును పంటఁజేయువారలెట్లు తాముద్దేశించిన ధాన్యము సంపూర్ణముగ ఫలించుటకనుకూలముగ సత్తువ చేయుదురో ఆరీతిగా నుత్తమధాన్యమగు సత్వమును సంపూర్ణముగఁ బొందుటకపేక్షించు వారలందరును తమక్షేత్రమునకు సత్తువ చేయుట అత్యావశ్యకమయియుండును. క్షేత్రమునకు దోహదముచేయునపుడు ఆయావిత్తనముల కనుకూలముగ సత్తువ వేర్వేరయియున్నటుల ప్రకృతమున సత్వాది బీజముల కనుకూలముగ దోహదంబులు ప్రత్యేకములయి యుండుట సత్యము. క్షేత్రజ్ఞులగు కర్షకులుఁ దమకుండు భూములలో నుత్తమాధమమధ్యమ భేదములను చక్కగాఁ దెలిసికొని ఆయాపొలములను క్రమముగా దోహదమూలముగ నధమస్థితిలోనున్న

వాటిని మధ్యమస్థితికిఁ దెచ్చుటయు, మధ్యమస్థితిలోనున్న వాటిని నుత్తమస్థితికిఁ దెచ్చుటయు, నిట్లు క్షేత్రములను జక్కనిస్థితికిఁ దెచ్చుకొని కర్షకులెట్లు మేలుగా జీవింతురో అటుల వివేకులగు క్షేత్రజ్ఞులును తమశరీరమగు క్షేత్రమునకుండు తత్కాలస్థితినిఁ దెలిసికొని తరములను చక్కగా నవగాహించి యుచితకాలములయందు కర్షించుటయు, దోహదము సేయుటయు, నీరముపూరించుటయు, నంకురములను నాటుటయు, వాటికిఁ బ్రతిబంధకములను నివర్తించుటయు, ననుకూలమును సేయుటయు నీ మొదలగు ననేకవిధములయిన కృషికార్యంబులను సంపూర్ణముగాఁ జేయగలరు. మనోవాక్కాయములలోనున్న వైషమ్యమగు మిట్టపల్లములను సమముగాఁ జేయుటయు, జ్ఞానక్రియ కర్మాశ్రయములగు నేకాదశేంద్రియములను నాయావర్ణాశ్రమంబుల కుచితంబులగు విహితవిషయములకుఁదప్ప నితరవిషయములలోఁ బోనియ్యక నియమించుటయునగు గెట్టులను నాల్గుప్రక్కల నేర్పరుచుటయు, వేదవేదాంతమునందలి విహితములగు సత్కర్మలను క్రమక్రమముగాఁ జేయుటయు నిట్టికర్మాభ్యాస రూపకర్షణము జేయుటయు, నిఖిలజీవకారుణ్యమగు నీరమును నిల్పుటయు, నిట్లుసంపూర్ణములగు సామగ్రిలతో, గూడియున్న క్షేత్రమునందు సహజముగ నంతర్గతమయియున్న సత్వరజస్తమోగుణ కందంబులలో నొక్కటియగు సత్వకందంబుగాని రజఃకందముగాని తమఃకందముగాని లేక సత్వరజస్తమః కందంబులుగాని యవి మొలుచుటకు ననుకూలమయి మరియొకటి మొలుచుటకుం బ్రతికూలమయియున్న విహితనిషిద్ధ కామ్యపదార్థములను భక్షించుటయగు దోహదకర్మమును జేయువిషయమున సత్వధాన్యమునుఁ గోరియుండు క్షేత్రజ్ఞుఁడు సత్వము ఫలించుట కుచితంబై శాస్త్రవిహితంబులైన సాత్వికపదార్థంబులనే భక్షించుటయగు సత్వదోహదముఁ జేయుటయు, రజస్తమోగుణాంకురంబులభివృద్ధి

నొందుట కనుకూలమయిన నిషిద్ధపదార్థంబులను వదలుటయు నందువలన నిందితంబులయియున్న రజస్తమోంకురంబులగు విరుద్ధతృణంబులను నున్మూలించుటయు నిదిమొదలగు సంపూర్ణ కృషి జేయువాడగును.

శుద్ధమయిన ఆహారమేగదా సత్వము శుద్ధమగుటకు ముఖ్యమూలము. అట్టిసత్వగుణము నిర్మలజ్ఞానమును కలిగించును. పదార్థములయథార్థతను దెల్పునది యానిర్మలజ్ఞానమేయనియు నదియేమనుజులకుఁ గలిగెడి సకలసందియంబులనుఁ బోగొట్టుననియు నాపస్తంబులానతిచ్చిరి.

వా॥ ఆహారశుద్ధౌసత్వశుద్ధిః సత్వశుద్ధౌధ్రువస్మృతిః
ధ్రువానుస్మృతౌసర్వగ్రంధీనాంవిప్రమోక్షః

తా॥ అన్నమునకు జెప్పఁబడియున్న దోషంబులులేక శాస్త్రోక్తముగ నిర్దుష్టమయిన శుద్ధాన్నమును భుజించినచో నది సత్వగుణమును నభివృద్ధిజేయుననియు, అట్లు అభివృద్ధినొందిన సత్వము స్థిరమగు సమ్యక్ జ్ఞానమును బుట్టించుననియు, నివాతదేశమునందుంచిన దీపముఁబోలె నిశ్చలమయిన జ్ఞానము సకలసంశయములనుఁ బోగొట్టి పదార్థముల యదార్థతను వెలుగించుననియు శుద్ధాన్నభోజనమునకుండెడి మహిమను బయలుదేర్చిరి.

శుద్ధమగునన్నమును భుజించువారలకు నాయన్నము దేహమునకారోగ్యమును సురూపమునుఁ గీర్తిని లావణ్యమును జ్ఞానమును శాంతియనెడి యహంకార రాహిత్యమును వేదవిహిత సత్కర్మల ననుష్ఠించుట కనుకూలమగు శ్రద్ధాతిశయమును సంపూర్ణముగఁ గలుగఁజేసి వారలను సర్వవిధముల సుఖింపఁజేయునది కావున అట్టిశుద్ధాన్నమే సత్వకాముకుల కాదరణీయమనియు నాసాత్వికాహారము లాయువు సత్వము దేహబలము ఆరోగ్యము మధురరసమున నతిప్రీతి మొదలగు సద్గుణముల కభి

వర్ధనకములనియు నవిరసయుక్తములును స్నేహయుక్తములును స్థైర్యగుణ యుక్తములును మనోహరములును నయియుండుననియు నాసాత్త్వికాహారములకున్నట్టి గుణాతిశయములను బ్రకాశపరచిరి శ్రీపరాశర మునివరులు.

శ్లో॥ ఆరోగ్యంరూపవత్త్వాచ కీర్తిశ్శ్రీర్జ్ఞానమేవచ
శాన్తిస్సత్కర్మణిశ్రద్ధా శుద్ధాన్నేనభవన్తిహి
ఆయుస్సత్త్వబలారోగ్య రసప్రీతివివర్ధనాః
రస్యాస్స్నిగ్ధాస్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః

తా॥ ఉదాహరింపబడిన శుద్ధాన్నమును నుపయోగించినచో నదిశరీరమున కారోగ్యమును సౌందర్యమునుఁ గీర్తిని లావణ్యమును నిర్మలజ్ఞానమును మానసేన్ద్రియ నిగ్రహరూపంబగు శాంతిని సత్కర్మానుష్ఠానమున కనుకూలమగు శ్రద్ధాతిశయమును గల్గుజేయునదియు నంతమాత్రమే గాక నాయువు సత్త్వము మనోబలము ఆరోగ్యము మధురము మొదలగు నుత్తమరసములయందుఁ బ్రీతి మొదలగు వాటిని నభివృద్ధినొందించునదియు నట్టిసాత్త్వికాహారములు ఉత్తమరసయుక్తములయి మృదురూపములయి స్థైర్యగుణయుక్తములయి మనోహరములయినట్టి లక్షణ లక్షితంబులయి యుండుననియు అట్లున్న యాహారంబులే సాత్త్వికాహారంబులనబడుననియు విశదముగ వక్కాణించిరి.

(సశేషము)

T. M. దాశరథిశర్మ,
తిన్ననూరు.

# Divyagnanadeepika.

## CIRCULATION 1250.

CONTENTS OF THIS NUMBER.



:o:

## బాల సరస్వతీ పరిషత్ పరీక్ష.

పెనుగొండ:—అనంతపుర మండలమువంగల బాలుర కాంధ్రభాషయందభిరుచిం గల్పించుటకై పెనుగొండ యందలి కొందఱు విద్యార్థులచే నిది యీసంవత్సరమున స్థాపింపఁబడినది. 1915వ సంవత్సరము మార్చి నెలలో హిందూపురము, పెనుగొండ, ధర్మవరము, అనంతపురము, గుత్తి గ్రామములయందు పరీక్ష జరుపఁబడును. సీతావనవాసము రూ. 0-7-0 (ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము నిడదవోలు వారిది) నీతికథాసంగ్రహము పద్యములు రూ. 0-2-0 (ఆర్. వెంకటేశయ్య బ్రాడ్వే మద్రాసు వారిది) ధ్రువోపాఖ్యానము రూ. 0-2-0 (శ్రీపి ఆంజనేయులు ధర్మవరము అనంతపురము జిల్లా వారిది) కుసుమాంగి అచ్చగుచున్నది (ఎమ్. వాసుదేవరావు ట్రెయినింగు కాలేజి రాజమండ్రి వారిది) పైసభవారిచే నీనాలుగుపుస్తకములును పఠనీయగ్రంథములుగ నిర్ణయింపఁబడినవి. ఇందు విషయమునకు 50 గుణములు, భాషకు 35 గుణములు, వ్రాఁత పరిశుభ్రతకు 15 గుణములునుంచబడినవి. మొత్తము మీఁద 100-కి 40 గుణములఁ దీసినవారందరును కృతార్థులుగ నెంచఁబడుదురు. కృతార్థులలో నుత్తముఁడుగఁ జేరిన వానికొక వెండిపతకమును, రెండవవానికొక చక్రనిపదియును మూఁడవవానికి పరీక్షా ఫలితార్థపత్రికయు నొసంగఁబడును. వివరములఁదెలియఁగోరువారు పరిషత్సంఘ కార్యదర్శి, కే. కేశవరావుగారికి పెనుగొండకు వ్రాసుకొనవచ్చును.

Registered No. M.

# దివ్యజ్ఞానదీపిక:

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కుడు ధర్మము లేదు).

July 1915.

సంపుటము 6. | జూలై నెల 1915. | సంచిక 4.

## విషయసూచిక



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher*.

ఓమ్




# దివ్యజ్ఞానదీపికః

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక

**July 1915.**

సంపుటము 6. జూలై నెల 1915. సంచిక 4.


## కాలదేశ వర్తమానములు.

ఈ పత్రికయందు ప్రచురించునట్టి వ్యాసములయందలి అభిప్రాయములకు పత్రికాధిపతులు ఉత్తరవాదులు కారు. ఎవరి యభిప్రాయములకు వారే ఉత్తరవాదులు. ఎవరి యభిప్రాయములకుగాని దివ్యజ్ఞాన సమాజము ఉత్తరవాదిత్వము వహింపదు.

* * *

బ్రహ్మవిద్యావిచార మొకఁటియె యీపత్రికయొక్క యుద్దేశము. సంఘసంస్కరణము దీనికి సంబంధములేదు. ధర్మశాస్త్రవిచారముచేయుచో ప్రస్తావవశమున స్త్రీలకు వివాహమునకుయుక్తకాలమెయ్యది యను ప్రశంసవచ్చినందున ఆవిషయమై శాస్త్రప్రమాణము లెట్లున్నవో తెలియుటకై కొన్ని వ్యాసములు ముద్రించితిమి. ఇకమీఁద నట్టివిషయము లీపత్రికయందు దఱచుగఁ జర్చింపఁబడవు.

దివ్యజ్ఞాన సమాజముయొక్క సాంవత్సరికోత్సవము మొదట ప్రతిసంవత్సరము అడయారులోనే జరుగుచువచ్చెను. పిమ్మట ఒక సంవత్సరము అడయారులోను ఒక సంవత్సరము కాశీలోను జరుగవలసినట్లు నిర్ణయముచేయఁబడి కొంతకాలమునుండి ఆప్రకారము జరుగుచువచ్చెను. ఇప్పుడానియమము తీసివేయఁబడి సందర్భానుసారముగ ఇండియాలో నెచ్చోటనైన సభజరుగవచ్చునని తీర్మానింపఁబడినది. ఈతీర్మానము ననుసరించి రాఁగల డిసెంబరునెలలో జరుగఁబోవు సాంవత్సరికోత్సవము బొంబాయి నగరములో జరుపఁబడునని తోచుచున్నది.

*　　*　　*

బ్రహ్మ మానసపుత్రుఁడగు వశిష్ఠుఁడొకప్పుడు తనజనకుని శాపవశమున ఘోరమగు సంసారసాగరమున బడి దాని దుఃఖములనుభవింపజాలక తనస్వస్వరూపమునే మరచి చీకాకుపడుచుండెను. ఆకుమారకుని చిత్తవైకల్యమును జూచి లోకపితామహుఁడు మరల వానికి నిజస్వరూపమును దెలియిజేసి 'ఓయి! కుమారా! నీవుమర్త్యలోకముయొక్క దుఃఖములను తెలిసియున్న కరుణామయుఁడు కాజాలవు. జీవకారుణ్యము పుట్టియున్న లోకహితమునకై పాటుపడ నలవికాదు. సంసారార్ణవమందు దుఃఖపడుచున్న మానవుల నుద్ధరించు నిమిత్తమై నిన్ను నేను సృజించియుండుటచేత వారిదుఃఖములు నీకు గోచరమగునట్లు చేసితిని. నీవు మర్త్యలోకమునకు వెళ్లి సంసారదుఃఖములచే పీడితులగు జనుల నుద్ధరించుము" అని యానతిచ్చెను. వశిష్ఠుఁడొకఁడేకాదు. నారదుఁడును, సనకసనందనాది కుమారవర్గమువారును, మరియును నితరఋషులును, లోకహితమునకై నియమింపబడియున్నారని యోగవాశిష్ఠమందు చెప్పబడియున్నది.

*　　*　　*

మహానుభావులగు నీఋషులు బ్రహ్మవిద్యా సంప్రదాయము

ను కాపాడుచు నీశ్వరాజ్ఞా పరిపాలకులై లోకహితముకొరకు సదా పాటుపడుచుందురు. ఈమహానుభావుల గోష్ఠికిజేరి రాబోవు మన్వంతరమున మనుపదవికిని వ్యాసపీఠమునకును నధికారులగు మరు, దేవాపి, యను మహాత్ములిద్దరు దివ్యజ్ఞాన సమాజమునకు మూలపురుషులై నిలిచి యాధునికులకు పరమార్థచింతను గలుగఁజేసి ఈశ్వరాజ్ఞను పరిపాలించుచున్నారు.

* * *

లోకహితముకొరకు పాటుపడవలసిన యవసరమును భారతీయులు మరిచియుండిరి. దివ్యజ్ఞాన సమాజమువారి సంగతిని మరల జ్ఞాపకమునకు తెచ్చి లోకపాలకులగు మహానుభావులను మార్గదర్శకులగా గ్రహించియున్నారు. లోకము బాగుపడవలెనన్న మర్త్యులలో తెలివితేటలు గలవారు లోకపాలకులగు మహనీయులు జేయు కార్యములకు తోడు కావలెను. తమకు మాత్రమే ముక్తిలభించినచాలునని కోరువారు స్వార్థపరులేగాని పారమార్థికులు కాజాలరు.

* * *

ఇప్పుడు లోకహితమునకై పాటుపడు వార్ల నేకులు కావలసియున్నది. పరమార్థబుద్ధిలేనివరు లోకహితమును కావింపజాలరు గాన లోకోపకార పరాయణులు పారమార్థికజ్ఞానమును సంపాదింపవలెను. పారమార్థిక జ్ఞానముచే లోకవ్యవహారములను బాగుపరుచుట సులభము. అదినిజమైన స్థితి యని కూడా చెప్పవచ్చును. లోకవ్యవహారములు హీనస్థితికి వచ్చినపుడు వానినుద్ధరించుటకు పారమార్థిక చైతన్యము నియ్యవలెను.

* * *

ఈ తత్త్వము నెరిగిన దివ్యజ్ఞాన సమాజములోని యాధ్యులు గొందరు, మన దేశము పూర్వమువలె నుచ్ఛ్రయస్థితికి రావలెనన్న విద్య మొదలగు విషయములలో సుశిక్షితులు కావలెనని

దలచి తగిన యేర్పాటులను జేయ నారంభించియున్నారు. మొట్టమొదట విద్యాపద్ధతిని బాగుపరుచుటకై ప్రానుకొని లౌకిక విద్యతోపాటు మతసంబంధమైన విద్యను, నీతిశాస్త్రమును సయితము, బాలురకు నేర్పింపవలసినదని తలచి కాశీక్షేత్రమందొక గొప్ప కాలేజిని స్థాపించిరి. అదికొన్ని సంవత్సరములుగా పనిచేయుచు సింహాకలాశాలగా నేర్పడుటకు సిద్ధముగానున్నది.

అన్ని మతముల బాలురకును లౌకికవిద్యతోపాటు మతసంబంధమైనవిద్యను, నీతిని, బోధించి అనుష్ఠింపజేయవలెనను సంకల్పముచే "Theosophical Educational Trust" అను నొక సంఘమును నేర్పరిచి యున్నారు. దీనికి అనిబెసెంటమ్మగారు అగ్రాసనాధిపతిగా నున్నారు. ఈసంఘముక్రింద సుమారు 15 పాఠశాలలున్నవి. కొన్ని కాలేజులు, కొన్నిహైస్కూళ్లు, కొన్ని సెకెండరీస్కూళ్లు, బాలికాపాఠశాలలును ఈ సంఘమువారి యాధీనమందున్నవి. లౌకికవిద్యతోపాటు మతసంబంధమైన విద్యను, నీపాఠశాలలయందు నేర్పించుచున్నారు.

మన తెనుగు జిల్లాలలో చిత్తూరుజిల్లాకు చేరిన మదనపల్లెలో సుమారు 20 సంవత్సరములగా కష్టపడి నడపించుచువచ్చిన హైస్కూలును ఈసంఘమువారి యాధీనమునకిచ్చినందున దానిని కాలేజుగా చేయుటకు తీర్మానించి దరఖాస్తుచేయఁగా యూనివర్సిటీవారు తమసమ్మతమును సర్కారువారికి తెలియజేసియున్నారు. ఇది జూలైమాసమునుంచి కాలేజుకాబోవుచున్నది. దీనినిదివరకును నతిశ్రమతో కాపాడుచువచ్చిన మ॥ ఆర్. గిరిరావుగారి శ్రమ యిదికాలేజు కావడముతో పరిహారమగుచున్నది. స్వార్థరహితమగు వీరు పడినపాటు సార్థకమగుట యిప్పుడు తటస్థించుచున్నది. మ॥ అర్నెష్టువుడ్ దొరగారు ఈవిద్యాశాలకై చాలశ్రద్ధపుచ్చుకొని ద్రవ్యసహాయమునకుగాను దేశదేశముల

దిరుగుచు ఆశ్చర్యకరముగా కాలేజుకు కావలసిన మందిరములను నిర్మించుచున్నారు. ఈవిద్యాశాలలో చేర్చుకొనుడని అనేకదరఖాస్తులు బాలకులనుండి వచ్చియున్నవి. అచ్చటనే నివసించు బాలురకు భోజనాదులకు తగినయేర్పాటును చేసియున్నారు నెల 1కి 10 రూపాయలు భోజనమునకు తగులుచున్నది. రెండుమారులు భోజనము ఒకతూరి ఫలాహారము బాలురకీవ్వబడుచున్నది. తమబాలురను ఆస్కూలుకు పంపదలచినవారు అచ్చట ప్రిన్సిపాల్ గారికి వ్రాసికొనవచ్చును.

* * *

ఐరోపాలో నడచుచుండు ఘోరసంగ్రామము పరస్పరవిరుద్ధములగు రెండుమార్గములను ప్రవర్తించుచున్నది. తమదేశముయొక్క క్షేమమే ముఖ్యమని భావించి జర్మనీవారితరదేశీయులను తమయాధీనమునకు తెచ్చుకొనవలయునని యత్నించుచున్నారు. లోకమందుగల సమస్తదేశీయులు క్షేమముగాను స్వతంత్రులుగాను యుండవలెనని ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, రష్యావారు, ఇటలీవారు తలచి తమసంకల్పములు సార్థకము చేసికొనుటకై పోరాడుచున్నారు. ఈయుద్ధము రామరావణుల యుద్ధమువలె నున్నది. స్వలాభమునకుగాను పోరాడుచుండు జర్మనీ సార్వభౌముడు రావణునిబోలియున్నాడు. అతనిసేనలు సలుపుచుండు యధర్మయుద్ధము ఇప్పటినాగరకతకు చాలవిరుద్ధమైయున్నది. మనప్రభువులును, వారిమిత్రులును చేయుచుండుయుద్ధము ధర్మయుద్ధముగానున్నది. మనవారికి జయమగుట నిశ్చయమని త్రికాలజ్ఞులు చెప్పుటయేగాక వారు సలుపుచుండు ధర్మపక్షపుయుద్ధక్రమము సహితము సూచించుచున్నది. అయితే భూభారము చాలాతక్కువ కాకమునుపు యీసంగ్రామము నిలుచులాగున లేదు.

* * *

ఐరోపాలోని రాష్ట్రములన్నియు నైకమత్యముగా జేరి ప్రజలక్షేమమునకు పాటుపడవలసినదని యొక సంఘమిదివరకే బయలుదేరినది. ఇది చేకూరవలసినయెడల యనాగరికతకు సహజమైన పశుశక్తి నాశనము కావలయును. ప్రకృతము జరుగుచుండు యుద్ధమువలన కేవలము పశుశక్తినే యుపయోగించుట మనుజులకు తగదని తోచుటయేగాక తనకుగలిగిన యెట్టి శక్తినైనను ఇతరులను బాధపరుచుటకొరకు నుపయోగించుట ధర్మము కాదని తేటపడును. పారమార్థికశక్తినిగాని మేధాశక్తినిగాని దేహశక్తినిగాని పరప్రయోజనముకొఱ కుపయోగపరపవలయునేతప్ప స్వార్థతకొరకు వినియోగింపరాదు. ఈ పాఠమును ఐరోపాదేశస్థులు ప్రకృతము జరుగుచుండు యుద్ధమువలన నేర్చుకొనెదరు కాబోలు!

మదనపల్లె గౌర్నమెంటు బాలికాపాఠశాలలో 7-6-15 తేదియందు సమావేశమైన స్త్రీపురుష బాలికాసభయందు కాశీ థియసాఫికల్ బాలికాపాఠశాలలో విద్యార్థినిగానుండు "కావేరిబాయి" అను శీలవంతురాలు "స్త్రీలు బాగుపడు విధానములను" గురించి శ్లాఘ్యమగునొక ప్రసంగమును జేసెను. హైస్కూల్ హెడ్మాష్టరు గారగు మ॥ ఆర్. గిరిరావుగారి జ్యేష్ఠపుత్రి యగు పద్మావతమ్మ అగ్రాసనమును వహించియుండెను. చిన్నవయస్సువారైనను వీరిరువురును ప్రదర్శించిన వాక్పటుత్వమును, మనోభిప్రాయములును చాల ఆనందకరములై యుండెను. సుమారు 25 పురుషులు, 40 స్త్రీలు, 50 బాలికలు సభకువచ్చియుండిరి. మనస్త్రీలకు తగిన సన్నివేశములను గలుగజేసినట్లైన వారి బుద్ధికుశలతయు, పారమార్థిక తెలివియు నధికమై మనదేశము బాగుపడునను నభిప్రాయము సభికులకు చక్కగా తోచెను.

———:0:———

# భాగవత ధర్మములు.

(94-వ పుట శేషము)

12. "సమత్వం ద్వంద్వసంజ్ఞయోః". శీతోష్ణములు సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములయందు సమత్వము గలిగి యుండవలయు శీతోష్ణాది ద్వంద్వములు శరీరమునకే గాని ఆత్మకు లేవు. శరీరముతోఁ జేరినవి యన్నియు ననిత్యములు. భగవద్గీత ప్రారంభములోనే శ్రీకృష్ణస్వామి యీవిషయము నర్జునున కిట్లుపదేశించె.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥
(2 అ 14 శ్లో:)

తా॥ శబ్దాదివిషయములతోడి సంస్పర్శములు సుఖదుఃఖాదుల గలుగఁజేయును. అవి వచ్చుచుఁ బోవుచునుండును. అనిత్యములయినవి. కాఁబట్టి వానినోర్చుకొనుము.

భక్తుఁడు దేహాభిమానమును వదలినవాఁడు. భగవత్పాదారవింద చింతనామృతమును నిరంతరము పానము జేయుచు పరమానందమున నుండువాఁడు. తదితరము లెల్లవానికి తృణప్రాయములు. ఉన్నప్పుడపి వానికి సంతోషము గల్గనోపదు. పోయినపుడు దుఃఖమునీఁజాలదు. కాబట్టి భక్తుఁడు ద్వంద్వాతీతుఁడు గావలయు.

భగవద్గీత 12 వ అధ్యాయమునందు భక్తుని లక్షణముల వివరించునెడ శ్రీకృష్ణస్వామి యిట్లు సెప్పియున్నారు.

శ్లో॥ సమశ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సంగవివర్జితః
తుల్యనిందాస్తుతిః॥..................
..................భక్తిమాన్మే ప్రియోనరః

తా॥ శత్రు మిత్రులయందును, ఇతరులు తన్ను సన్మానించినపుడును అవమానించినపుడును, శీతోష్ణములందును, సుఖదుఃఖములందును, నిందాస్తుతులందును భక్తుఁడు సమముగానుండునో వాఁడు నాకు ప్రియుఁడు.

భగవంతునికిఁ బ్రియుఁడగుటయే భక్తుని పరమోద్దేశ మగుటచే ద్వంద్వసహిష్ణుత్వము సాధింపవలయు.

13 "సర్వత్రాత్మేశ్వరాన్వీక్షాం". ఇచట "ఆత్మేశ్వర" అను సమాసమునకు "ఆత్మయు నీశ్వరుఁడును" యని యర్థ మగుచున్నది. అన్నిస్థలములందు సంవిద్రూపమైన ఆత్మయు జగన్నియామకుఁడైన ఈశ్వరుఁడును ఉండుటను కనుంగొనవలయునని యర్థము. ఆత్మేశ్వరుఁడనగా ఆత్మకు ఈశ్వరుఁడని యుఁ జెప్పనగు. ఇదిస్వామి భృత్యభావమునుఁ దెలుపు. పరమాత్మకు జీవాత్మ భృత్యుఁడు. ఇదియునుఁగాక ఆత్మయగు నీశ్వరుఁడు ఆత్మేశ్వరుఁడు అనియుఁ జెప్పవచ్చు. ఈయర్థము ఈశ్వరునకును జీవాత్మకును స్వరూపమునందు భేదము లేదనుటను సూచించుచున్నది. ఏయర్థమునంజూచినను నీశ్వరుఁడు సర్వవ్యాపియనియు సమస్తవస్తువులయొక్క లోపలను వెలుపలను నిండి నిబిడీకృతమై యున్నాఁడనియుఁ దెలియవలయు.

ఈవిషయమై ప్రహ్లాదుండు తన తండ్రికిట్లనియె.

మ॥ కలఁడంబోధిఁ గలండు గాలిఁ గల డాకాశంబునం గుంభినిం
కలఁడగ్నిన్ దిశలంబగళ్ళ నిశలన్ ఖద్యోతచంద్రాములం
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులందంతటం
గలఁడీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీనాయెడన్॥

క॥ ఇందుఁగలఁ డందులేఁడని
సందేహమువలదు చక్రిసర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందేకలఁడు దానవాగ్రణివింటే॥

భక్తిమార్గముయొక్క పర్యవసానమున నీతత్త్వము భక్తునికి ప్రత్యక్షగోచరము కాఁగలదు. అట్టివానికి నెచటఁజూచినను భగవంతుఁడు గోచరించు. భక్తుఁడట్టి పరమోన్నతస్థితిని బొందువఱకు భగవంతుఁడెల్లెడల నున్నాఁడను భావముతోఁ బ్రవర్తించవలయు. అట్లుచేయుటచే మనముచేయు కార్యములను, మన మాడెడు పలుకులను, మనమనోభావములను నిరంతరము భగవంతుఁడు చూచుచున్నాఁడనెడు నిశ్చయము మనకు దృఢపడును. అందువలన మన నడవడి నిర్దోషంబగు.

14. "కైవల్యమ్". కేవలము అను శబ్దమునుండి పుట్టినది కైవల్యము. అనఁగా ఏకాంతశీలత్వము. ఇతరులతోఁ గూడుట కిచ్ఛయించమి. సాధుజన సాంగత్యమవశ్యమాచరణీయమని మొదటనే చెప్పఁబడి యుండుటచే తదితరులగు పామర జనులతో జేర నిచ్ఛగింపకుండుట యని యిచట నర్థము. పామర జనులు సాధారణముగా స్వలాభాపేక్షతో ప్రాపంచిక కార్యములఁ జేయుచుందురు. పరదోష ప్రశంసనమందును వృథాభాషణములందును కాలము గడుపుచుందురు. ఎప్పుడు చూచినను కలహమునకు కాలుద్రవ్వుచుందురు. అట్టివారి సాంగత్యము భక్తునికి రుచింపఁగూడదు. అయ్యది వానికి శ్రేయస్కరము కాదు. దీనినే భగవద్గీతయందు "అరతిర్జనసంసది" యని స్వామి చెప్పియున్నవాఁడు. సాధ్యమైనంతవరకు పామర జనులతోటి సహవాసము తప్పించుకొనవలయు. ఒంటరిపాటున నుండ బ్రయత్నించవలయు.

కైవల్యమను శబ్దమునకు మఱియొక అర్థముకూడ స్ఫురించుచున్నది. కేవలము ఆత్మయందే వర్తించుట కైవల్యము. దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అనునవి తాను కావనియు, వీనికన్నిటికంటెఁ దాను విలక్షణుఁడనియు, ఇవియన్నియు ప్రకృతిమయములైన తనయుపకరణములనియుం దెలిసికొని వాని

నన్నిటికి నతీతుఁడై తనస్వస్వరూప[illegible]చేరి [illegible]యుచటనే విహరించుచు నితరసంపర్కము లేకుండుట కైవల్యమనఁబడు. అట్టి వానిని గురించి భగవద్గీత యిట్లుచెప్పుచున్నది.

శ్లో॥ యస్త్వాత్మరతిరేవస్యా దాత్మతృప్తశ్చమానవః
ఆత్మన్యేవచసంతుష్ట స్తస్య కార్యంనవిద్యతే॥

తా॥ ఏపురుషుఁడైతే ఆత్మయందే అభిరుచిగలవాఁడును, ఆత్మయందే తృప్తిని బొందుచున్నవాఁడును, ఆత్మయందే సంతోషపడుచున్నవాఁడు నగునో వానికి కామ్యకర్మములతో నక్కర యుండదు.

కావున భక్తుఁడు పామరజనులతో చేరక నొంటరిగా నుండవలయు. ఒంటరిగానున్నపుడు సయితము ఇంద్రియసుఖములను మనోవృత్తులను స్మరించుచుండక ఆత్మారాముఁడై మెలగవలయు.

15. "అనికేతతాం". నికేతనమనఁగా వాసగృహము. అనికేతత యనఁగా ఇల్లు లేకుండుట యని శబ్దార్థము. గృహాదులయందభిమానము లేకుండుట యని తాత్పర్యము. గృహములు, తోటలు, భూములు మొదలగువానియందు 'నాది' యను మమత లేకుండవలయు. సంపదలేనివానికి వైరాగ్యము గలిగిన నది యతిశయముగాదు. సహస్రసంపదలు కలిగియుండియు వానిపై మమకారము లేకుండుటయే అనికేతత్వము.

ఈవిషయమై ప్రహ్లాదుని గురించి యిట్లువ్రాయఁబడి యున్నది.

సీ॥ ఆకారజన్మవిద్యార్థవిశిష్టుఁడై
గర్వసంరంభసంగతుఁడు గాఁడు।
వివిధమహానేకవిషయసంపన్నుఁడై
పంచేంద్రియములచేఁ బట్టువడఁడు।
భవ్యవయోబలప్రాభవోపేతుఁడై

కామరోషాదులఁ గ్రంథుకొనఁడు।
కామినీప్రముఖభోగము లెన్నిగలిగిన
వ్యసనసంసక్తి నావంకఁబోఁడు।
విశ్వమందుఁ గన్నవిన్నయర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛయిడఁడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర
తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు॥
(భాగవత సప్తమస్కంధము)

గృహాది పదార్థములందు మనుజునకుంగల స్వాభిమాన ముం దెగగోసికొనుట సులభముకాదు. క్రమక్రమంబుగ తగ్గించుకొనవలయును. మనకత్యంత ప్రీతికరములైయుండు పదార్థముల నితరులకుఁ గొంత యిచ్చుటవలనను, ఇతరులు మన వస్తువులు వాడుకొన నిచ్చుటచేతను వానియందు మనకుగల అభి మానము వదలును. సర్వసంగ పరిత్యాగము చేయవలయు నని శాస్త్రము చెప్పుచున్నదిగాని సర్వవస్తుపరిత్యాగమును శాసించియుండలేదు. వస్తువునందు దోషములేదు. సంగము నందు దోషమున్నది. వస్తువులయెడ మనకుఁగల మనోభావ మును మార్చుకొనవలయును.

16. "వివిక్తచీరవసనమ్". అనఁగా నిర్జన ప్రదేశమునం బడియుండెడు చింపిగుడ్డల నయినను పరిశుద్ధములగు నారవస్త్ర ముల నయినను ధరించుట యని వ్యాఖ్యానకారులు అర్థము వ్రాసియున్నారు. దీనిముఖ్య తాత్పర్యమేమనఁగా భక్తుఁడు డాంబికములగు వస్త్రభూషణాదులచే దేహాలంకారముఁ జేసి కొనఁగోరరాదు. భక్తుఁడు భగవత్కైంకర్యార్థమై శరీరముం గాపాడుకొనుచున్నాఁడుగాని వానికి దానియందలి యభిమాన మెన్నఁడో విడిచిపోయినది. కేవలము పామరుడును వేషధారి యు నగువానికి వస్త్రభూషణాద్యలంకారములు రుచియించును

గాని నిజమైన భక్తునకు రుచింపవు. భక్తియనునది బాహ్య వేషము గాదు. అది యంతరంగభావము. భక్తునకు దయా సత్య శౌచాదులు భూషణములగుగాని చేలాదులుగావు. ఎవఁడుగాని తగినవేషమున నుండవలయుగాని డాంబికము కూడదు. దేహము నలంకరించుకొనుట వలన నహంకార మధికమగును. భక్తుఁనికి అడకువ, వినయము, అకించనత్వము నుండవలయుఁగదా! కావున నట్టివాఁడలంకార ప్రియుడు గాకూడదు.

17. "సంతోషంయేన కేనచిత్". కలిగినదానితో తృప్తి జెందవలయు. ఈశ్వరుఁడు మనుజులకు వారివారి కర్మానుగుణముగ ఫలము నిచ్చును, దానితో సంతుష్టిఁజెందవలయు. తృప్తిఁజెందుటవలన సుఖము గలుగును. తృప్తిలేనివాడు నిరంతరము దుఃఖము ననుభవించును. ఆశకెన్నటికిని మేరలేదు. సంతుష్టివలననే ఆశను జయించవలయును.

రుక్మిణీదేవియొద్ద నుండి వివాహసందేశముం దీసికొని వచ్చిన బ్రాహ్మణునితో కృష్ణస్వామి కుశలప్రశ్న చేయు సమయమున నిట్లనివక్కాణించె.

"సంతోషిగాడేని శక్రుఁడైన నశించు, నిర్ధనికుండైన నింద్రుబోలు। సంతసించెనేని"

అనఁగా తృప్తిలేనివానికి దేవేంద్రభోగము లభించినను సుఖము కలుగదు. సంతుష్టిగలవాఁడు నిర్ధనుండైనను దేవేంద్రసుఖము ననుభవించును.

కావుననే శంకరాచార్యులవారు

శ్లో॥ యల్లభసేనిజకర్మోపాత్తం
విత్తంతేనవినోదయచిత్తం

అనివ్రాసియున్నారు. నీకష్టార్జితముగ నెంతద్రవ్యము భించునో దానితో మనస్సున సంతోషింపుమని యర్థము.

ఈ యర్థమే.

కం॥ వ్యాప్తింబొందక వగవక
ప్రాప్తించిన లేశమైన పదివేలనుచుం
దృప్తిం బొందని మనుజుఁడు
సప్తద్వీపముల నైనఁ జక్కఁబడునే!

అని భాగవతమునందు జెప్పబడియున్నది.

18. "శ్రద్ధాం భాగవతే శాస్త్రే నిందామన్యత్ర చైవహి" అనఁగా భాగవత శాస్త్రమునందు శ్రద్ధ గలిగి యుండవలయు. ఇతర శాస్త్రముల నిందింపఁగూడదు. ప్రకృతమునఁ జెప్పుచుండునది భాగవత ధర్మములు గనుక భాగవతశాస్త్రమునకు ప్రాముఖ్యత కల్పింపఁబడినది. భాగవత శాస్త్రములనఁగా భగవంతుని గురించి చెప్పెడి గ్రంథములని యర్థము. భగవంతుని స్వరూపము, వానిచరిత్రము, వానియనంత కల్యాణగుణములు మొదలగు వానిం దెలుపు గ్రంథములు. శ్రీమద్భాగవతము, రామాయణము, విష్ణుపురాణము, మొదలగునవి యన్నియు భాగవతగ్రంథములే. ఇదిగాక శివపరములగు గ్రంథములనేకములున్నవి. వీనియందు శ్రద్ధయుండవలయు. భక్తుఁడుగా నుండువానికి తన స్వామిని గురించి చెప్పునట్టి గ్రంథములయందు శ్రద్ధయుండుట సహజము. అందు విశేషమేమియు లేదు. విశేషమేమనఁగా:—

ఇతర శాస్త్రముల నిందింపఁగూడదు. తనకిష్టమగు గ్రంథములందుగల శ్రద్ధయే ఒకపుడు అన్యమతగ్రంథముల దూషించుటకు కారణభూత మగుచున్నది. 'లోకములోఁగల మతవైషమ్యమున కిదియె గదా కారణము. ఎవరిమత గ్రంథములువారు శ్రద్ధతోఁ జదివికొనుచు నితరమత ప్రశంస నెత్తకుందురేని భూలోకమే స్వర్గమగును. క్రీస్తుమత పాదిరీలు కొందఱు తమ మతమును బోధించునపుడు హిందూమతమును, హిందువుల కత్యంత ప్రియములగు భాగవతాది గ్రంథములను, దూషించుట యెల్లర

కుం దెలిసిన విషయమేగదా! శైవులు వైష్ణవ గ్రంథముల దూషించకను, వైష్ణవులు శైవసిద్ధాంత గ్రంథముల నిందింపకయు నున్నయెడల నెంత బాగుగనుండును! హిందువులలో త్రిమతస్థులు నెవరిమత గ్రంథముల వారు జదివికొని యంతటితో తృప్తిజెందుట యైననున్నదా? స్వమతసిద్ధాంత విచారమునకు పూర్వము పరమత ఖండనము 'కాలక్షేపము' చేయవలయునట! పరమత ఖండన మనఁగా పరమత దూషణము. ఇట్లు ప్రారంభించువార్లలో ననేకులకు శాస్త్రవిచార మంతటితోనే ముగియును అట్టివారు తమ మతవిషయము నించుకైన నెఱుంగరుగాని పరమత నింద యందు ప్రావీణ్యులై యుందురు.

మన మతమునందు మనకెట్టి శ్రద్ధయు భక్తియు కలిగి యుండునో ప్రతిమనుజునికిని వానివాని మతమునందట్టి శ్రద్ధయు భక్తియు గలిగియుండు. మన మతమునుగూర్చి ఇతరులు దూష్యముగను తిరస్కారముగను మాట్లాడినపుడు మనకెట్టిసంకటమును ఆగ్రహమును కలుగునో వారిమతమును మనము దూషించినపుడు వారికి నట్లేయగు. ప్రతిదినము మాతృపూజ చేయఁదలచువాఁడు ఉదయమున లేవగానే తనప్రక్కయింటికిపోయి ప్రక్కయింటి వానితల్లిని నాలుగు దెబ్బలు కొట్టి వచ్చి పిమ్మటనా తనతల్లిని పూజింపవలయును! తనతల్లి తనకెట్లు పూజనీయురాలో అటులనే ప్రక్కయింటివానితల్లి వానికి పూజనీయురాలుగదా! మతములు నట్టివేకదా! ఎవని మతము వానికి హెచ్చు. ఎవనిమత గ్రంథములు వానికి గౌరవార్హములు. ఒకరిమత గ్రంథముల నొకరు నిందించుట భక్తుఁడు సేయఁదగిన కార్యమా! మతములు భిన్నములయినను, మతగ్రంథములనేకములయినను, భగవంతుడొక్కఁడే గదా! మార్గములు పెక్కులైనను గమ్యస్థాన మొక్కటియే గదా!

19. "మనోవాక్కర్మదండంచ". మనోదండము, వా

ద్గండము, కర్మదండము నను మూడు దండములుండవలయు. వీనికే త్రిదండమని పేరు. దండమనఁగా దండించుట. తన యాజ్ఞలోనుంచుకొనుట యని యర్థము. మనస్సు వాక్కు కాయము నను మూడును మనుజునికిగల యుపకరణములు. ఏకర్మఁ జేసినను వీనిచేఁ జేయవలయు ఏపని చేయువానికైన తనకోరమట్లు తనకు స్వాధీనము లేనియెడ తనకోరిన పని యెట్లు జరుగును? భక్తునకు మనస్సు వాక్కు కాయము మూడును స్వాధీనమందుండవలయు. అభ్యాస వైరాగ్యములచేత మనస్సును దండించవలయు. మౌనముచేత వాక్కును దండించవలయు. ఆశారాహిత్యమువలన కర్మమును దండించవలయు. అట్లు దండింపఁబడినపుడు మనస్సు దుష్టసంకల్పములకు చోటివ్వదు. వాక్కు పరదూషణము పరుషవచనములు వ్యర్థసల్లాపములు మొదలగు దోషములకెడమివ్వదు. శరీరము హింసా కార్యములకుఁ బూనుకొనదు. మూడును పారమార్థిక ప్రయత్నమునకుఁ దోడ్పడఁగలవు.

బ్రహ్మచారికిని యతికిని దండము ఉండవలయునని చెప్పుటకిదియ కారణము. దండమనఁగా కట్టెగాదు. త్రిదండమనఁగా మూడువంకరలుగల కట్టె యని యర్థము గాదు. ఇట్టి యపార్థముంగల్పించుకొని సన్యాసులు చేతిలోనొక కఱ్ఱను బుచ్చుకొందురు ఉపనయనమునందు నూతనవటువు చేతికి నొక మోదుగు మండనిత్తురు. అకటా! ఎట్టిగొప్ప తత్త్వములను బోధించు వాక్యములు ఎంత హేయనీయ దశకువచ్చినవి! బ్రహ్మచారిచేతిలోగాని సన్యాసిచేతిలోఁగాని ఒకదుడ్డుకఱ్ఱ యుండుటవలన ఎవరికేమి ప్రయోజనము! కఱ్ఱ యెందుకు? కుక్కలు పైబడివచ్చినపుడు అదలించుటకా? మనోవాక్కాయములు మూటిని వశపరచుకొన్న సన్యాసికి త్రిదండ సన్యాసియని పేరు. అట్టి మహాత్ముడు లోకమునకు మహోపకారియైయుండు. బ్ర

హ్మచారికి నుపనయనకాలమందు దండమిచ్చుటచేత నదిమొదలు వాఁడు మనోవాక్కర్మముల మూటిని స్వాధీనముఁ దెచ్చుకొన ప్రయత్నించవలయునని యర్థము.

20. "సత్యమ్". అనఁగా యథార్థభాషణము. "సత్యం వద" అని శృతిశాసించుచున్నది ఈవిధికి దేశకాలసమయాది నియమములు లేవు. అన్నిచోట్ల నెల్లవేళల సమస్తసమయముల సత్యమేపలుకఁదగినది. "సత్యే సర్వం ప్రతిష్ఠితమ్" అనియు శృతి నుడువుచున్నది. ప్రపంచమంతయు సత్యముయొక్క ఆధారము వలననే నిలిచియున్నదని యర్థము. ఇదియునుంగాక సత్యము భగవంతుని స్వరూపమైయున్నది "సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" మొదలగు ననేకశృతివాక్య ప్రమాణములున్నవి. భక్తుఁడు భగవంతునియొక్క స్వరూపమువంటి స్వరూపముగలవాఁడుగా నగుటకు నెల్లవిధములఁ బ్రయత్నించుచుండు గావున సత్యభాషిగా నుండవలయు. మఱియు "సత్యమేవజయతి, నానృతమ్" సత్యమే జయించును. అసత్యమెన్నటికిని జయించదు ప్రాపంచిక కార్యములయందు సయితమిది యనుభవసిద్ధాంతము. అట్లుండ భక్తుఁడు భగవదనుగ్రహమును సాధించుటకుఁ బూనుకొన్నవాఁడు. అట్టి మహాకార్యమును సత్యముచే సాధింపలయు గాని తద్వ్యతిరేకాచరణముచే సాధ్యమగునా!

సత్యవ్రతము దృఢముతో నాచరించుచున్న వానికిఁ దక్కిన సుగుణములన్నియు సులభముగ పట్టుబడును కాననే "సత్యాన్నాస్తి పరోధర్మః" అని చెప్పఁబడియున్నది. సత్యమునకు మించిన ధర్మము లేదని యర్థము.

(సశేషము)

పరమాత్ముని. నరసింహయ్య.

—:o:—

# తరుణీవివాహము.

ఈసంవత్సరము ఏప్రిల్ నెల సంచికలో బ్రహ్మశ్రీ క. మార్కండే యశర్మగారు వ్రాసిన జాబుకు సమాధానము.

నేను ఈమార్చి నెల సంచికలో 'మహాపురుషుడవతరించుట కిదిసమయమా' అను విషయము వ్రాసినపుడు వివాహవిషయమై కొంతమట్టుకు ప్రశంసించియుంటిని. దానిలో తరుణీ వివాహము శాస్త్రములలో అంగీకరింపబడియున్నదని సూచించుచు దానికుపబలముగా కొన్నిశ్లోకము లుదాహరించియుంటిని. దానికి బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు ఆక్షేపించి వ్రాసిన దానికి సమాధానము వ్రాయుటకుముందు నావిషయమై కొంత మట్టుకు మనవిచేసెద.

నేను సంస్కృతభాష క్రమముగ నెవరియొద్దను చదివిన వాడను కాను. కావున నాకు సంస్కృత భాషా మర్యాద అంతగా తెలియదని దృఢముగా చెప్పుచున్నాను.

కేవలము ప్రసిద్ధిచెందియుండె మహామహిమగలిగి జ్ఞాన విజ్ఞానములందును, తపశ్శక్తియందును, సత్యసంధత్వమునందును, వీర్య శౌర్య బల పరాక్రమములందును, దయారసమందును, తేజః ప్రభావమందును, ఔదార్యభావమందును, నీతిమార్గ ప్రవర్తనయందును, స్వధర్మావలంబనమందును, ధర్మపరిపాలనమందును, అనన్యభక్తియందును, వరిష్ఠమైన బ్రహ్మనిష్ఠాను వర్తనమందును, ఇంచుకైన కొరతలేని వశిష్ఠ వామదేవాదులను, రామచంద్ర హరిశ్చంద్ర ప్రతాపచంద్రాదులను, యుధిష్ఠిర విదుర భీమార్జునాదులను, మహాపతివ్రతలును, వీరమాతలునగు అనసూయ, దమయంతి, సీత, అహల్యాబాయి మొదలగువారిని కని వెలుగుచుండిన పుణ్యభూమియగు ఈఇండియా (హిందూ) దేశమందు పసతాకార్యమును పూని నెరవేర్పజాలని మనబోట

వారుదయించుటచే త్రిలోకప్రఖ్యాతినొందిన ఈపావనమాతృభూమికి సంభవించిన అపయశస్సును గురించిన తలంపు హృదయమం దంకురించినపుడె నాకు దురంతమైన దుఃఖముగలిగి దీనికికారణ మేమైయుండవచ్చునని స్వయముగా కొంతవరకు యోచించి సంస్కృతభాషామర్యాద నెరింగిన వారినడిగి వారుచెప్పిన శాస్త్రసందర్భములను గైకొని మనదేశము హీనదశకువచ్చుట కు కారణములని నాకుతోచినవి వ్రాయుటచే అవినిజమైన కారణములుగానుండెనేని ఎవరైన మహాపురుషులు ఆకారణముల ను సమూలముగ తెగటార్చి ఆకారణములచే నుత్పత్తియగు కార్యములు ముందుదయించకుండ చేయుదురను భావముచే నేన ప్పుడప్పుడు వ్రాయుచున్నాను. నేను వ్రాయుటయందేదైన తప్పని చెప్పినప్పుడు అదినిజముగా తప్పని తెలిసినతోడనే వారికి కృతజ్ఞతజూపి ఒప్పుకొని యెప్పటికిని సవరించుటయందే దృఢ సంకల్పముగలిగియున్నానని శ్రీశర్మగారికి విన్నవించెద.

శ్రీశర్మగారి ఆక్షేపణ.

శ్లో॥ కామమామరణాత్తిష్ఠేద్గృహేకన్యర్తుమత్యపి
నచైవైనాంప్రయచ్ఛేత్తు గుణహీనాయకర్హిచిత్॥

ఈ శ్లోకమునకు నేను వ్రాసియుండిన అర్థము కన్యఋతుమతియైనను ఆమరణాంతము అనగా చచ్చువరకు పుట్టినింట యథేచ్ఛగా నుండవచ్చును. ఎప్పటికైనను ఆకన్యను గుణహీనుని కియ్యదగదని తాత్పర్యము

దీనికుపబలముగా మేధాతిథి వ్యాఖ్యానమును వ్రాసియుంటిని. అదేదన:—

"ప్రాగ్ఋతోః కన్యాయాః నదానంబుతావపి
యావద్గుణవాన్వరోనలభ్యతే॥

"ఋతువుగాకముందు కన్యను దానమియ్యదగదు, ఋతుమతియైనను గుణవంతుడు దొరకువరకు ఇయ్యదగదు"అని యర్థము.

దీనికిశర్మగారిట్లు ఆక్షేపించి వ్రాసియున్నారు:—

"ఇకదీనిని విమర్శింతము. ఈశ్లోకమువలన గుణహీనున కు కన్యక నివ్వవలదు, యనియగునుగాని అవివాహితగా స్త్రీ యుండవచ్చునని కాదని సంస్కృతభాషా మర్యాద నెఱింగిన శ్రీ రావుగారునుగ్రహించెదరని నమ్ముచున్నాడను." అనివ్రాసినారు.

నాకు సంస్కృతభాషా మర్యాద తెలియదని ముందేవిన్న వించితిని. ఆమర్యాద నెరింగినవారగు కొందరు ప్రముఖు లను మైసూరు, మద్రాసు పట్టణములలో నడుగగా వారుగుణవం తుడగు వరుడు దొరకనపుడు స్త్రీఋతుమతియైనను వివాహము లేకనే (అవివాహితగా) నుండవచ్చుననుటే ఆశ్లోకార్థమని స్పష్టముగాచెప్పిరి.

గుణవంతుడగు వరుడుదొరకనపుడు కన్యకను అవివాహి తగా నుంచవచ్చుననెడి యర్థముతప్ప ఆశ్లోకమునకు వేరుఅర్థ ములేదని బహుమంది పండితులు చెప్పుచున్నారు.

మరియు నేనాశ్లోకము నుదాహరించిన సందర్భమును శ్రీశర్మగారు యోచించినట్లగుపడదు.

ఆసందర్భమిట్లు వ్రాయబడినది. కేవలము పిల్లల క్షేమము కోరువారు సయితము ఈ యల్పకాలమందు తగినవరు డు దొరకకుండినను ఈప్రమాణములకు (పదిసంవత్సరములలోపల వివాహము కావలెనను ప్రమాణములకు) వెరచి తమముద్దుబిడ్డలను ఎవరికైనను, ఎట్టివానికైన నిచ్చి వివాహము చేయుచున్నారు. ఈప్రమాణములెంత బాధకరములైనవో యోచింపుడు. తల్లి దండ్రులకును, బిడ్డలకును ఇట్టిదురంత దుఃఖము ప్రాప్తమగుచున్న దని తెలిసి సర్వజ్ఞమూర్తియు మనమూలపురుషుడునగు వైవస్వ తమనువు సమస్తజన క్షేమార్థమై సిద్ధాంతవచన మిట్లానతిచ్చి నారని వ్రాసి "కామమామరణాత్తిష్ఠేత్" అను శ్లోకము దాహరించియుంటిని.

ఇప్పుడు గుణవంతుడగు వరుడు దొరకనపుడు ఋతుమతి
యైన కన్యకను అవివాహితగానుంచు ఆచారమున్నదా? పది
సంవత్సరములలోపల వివాహము కావలెనను ప్రమాణములకు
వెరచికదా ఎట్టివానికైనను యిచ్చుచున్నారు. దీనివలన దుఃఖ
ము ప్రాప్తముగుటలేదా? ఇవన్నియు యోచించవలెను.

శ్రీశర్మగారు ఎనిమిది సంవత్సరములలోనే వివాహముచే
యుట విధియని స్థాపించుటకు ఈక్రిందిశ్లోకము నుదాహరించినారు.

"త్రింశద్వర్షోద్వహేత్కన్యాం హృద్యాం ద్వాదశవార్షికీం
త్ర్యష్టవర్షోఽష్టవర్షాంవాధర్మే శీదతిసత్వరః॥"

అనగా ౩౦ సం॥ వరుడు ౧౨ సం॥ కన్యకను, ౨౪ సం॥
వరుడు ౮ సం॥ కన్యకను వివాహమాడవలెనని యర్థమని"
వ్రాసినారు.

ఈశ్లోకము "వర్షైరేకగుణాంభార్యా ముద్వహేత్త్రిగుణ
స్స్వయం" (విష్ణుపురాణం).

అనగా వివాహవిషయమందు కన్యవయసుకంటె వరు
నివయసు మూడంతలకంటె మీరియుండకూడదని పరమావధి
నిరూపించి చెప్పుటకు దృష్టాంతముగా ఆశ్లోకముదాహరించినట్లు
గుపడుచున్నది. అనగా చిన్నవయసులోనుండు కన్యకలను
వృద్ధులకివ్వదగదనుట యందిది ముఖ్యప్రమాణముగా నెంచుటకు
చెప్పినదని తోచుచున్నది. ఎనిమిది సంవత్సరములలోపల
వయసునుకూడా ఇవ్విధంబున లెక్కించుటచే మూడింతలుండు
టకుదాహరణముగా నెత్తినట్లు స్పష్టమగుచున్నది.

"త్రింశద్వర్షోదశాబ్దాంతు భార్యాంవిందేతనగ్నికాం
ఏకవింశతివర్షోవా సప్తవర్షామవాప్నుయాత్॥

ముప్పదేండ్లవాడు పదిసంవత్సరములదానిని, యిరువదొ
క్కటి వయసువాడేడేండ్లదానిని, వివాహమాడవచ్చునని
చెప్పబడినది.

ఇప్పుడు సామాన్యముగ నంగీకరింపబడిన ప్రమాణముల ననుసరించి ఎనిమిది సంవత్సరములవరకు వివాహమునకు యోగ్యత లేకుండుటనుపట్టి, ఏడుసంవత్సరముల వయసుగలదానికి ఇరువదియొక్క సంవత్సరముల వాడు వరుడుగా నుండవచ్చునని బృహస్పతి వాక్యముండుటచేత ఈప్రమాణము "వర్షైరేకగుణాంభార్యా ముద్వహేత్త్రిగుణస్వయమ్" అనుదానికి ఉదాహరణముగా చెప్పినట్లు స్పష్టమగుచున్నది.

3. శ్రీశర్మగారు తమఆక్షేపణకుపబలముగా నీశ్లోకము లుదాహరించి వానికి అర్థమును వ్రాసినారు.

శ్లో॥ అకన్యేతితుయఃకన్యాం బ్రూయాద్ద్వేషేణమానవః
సశతంప్రాప్నుయాద్దండం తస్యాదోషమదర్శయన్
పాణిగ్రహణికామంత్రాః కన్యాస్వేవప్రతిష్ఠితాః
నాకన్యాసుక్వచిన్నౄణాంలుప్తధర్మక్రియాహితాః

శ్రీశర్మగారు వ్రాసిన అర్థము:—

ఋతుమతికాని బాలికను ద్వేషముతో నెవడైన ఇది ఋతుమతియైనది అని చెప్పునెడల వానికి రాజు ౧౦౦ పణములు అపరాధముగా విధించవలెనని విధించినాడు. అట్లు మాట్లాడినంతమాత్రముననే దండించవలయునా అని సందేహించి మరల తానే ఈవిధముగ సమాధానము చెప్పియున్నాడు. ఋతుమతికానివారలకే వివాహముచేయవలయునని మంత్రములందు గలదనియు ఋతుమతులైన వారలకు వివాహసంస్కారముచేసినను వారలు శాస్త్రీయధర్మములకు తగరనియు చెప్పియున్నాడు. కనుక ఇట్లన్నవానికి దండనము న్యాయమేను అని అర్థముఁవ్రాసినారు. ఇచ్చట ముఖ్యముగా విచారించదగినది "కన్య" అను పదమునకర్థము.

శ్రీశర్మగారు 'కన్య' అనుపదమునకు 'రజస్వలకానిస్త్రీ' అని అర్థము చేసినారు.

ఈశ్లోకమందుండు కన్య అనుపదమునకు అక్షతయోని యని కుల్లూకభట్టవ్యాఖ్యానములో చెప్పబడినది. క్షతమనగా గాయముచేయబడినది. శబ్దకల్పద్రుమమను గొప్పనిఘంటు నందు "క్షణ్యతే, వధ్యతే, ఇతిక్షతం" అనివ్రాయబడినది. అన గా గాయముచేయబడినదని తాత్పర్యము.

మఱియు ఆప్తెఅనువారి నిఘంటునందు క్షతయోని అను పదమునకు పురుషసంపర్కమైన స్త్రీఅని వ్రాసినారు.

ఇదేశ్లోకమునకు వ్యాఖ్యానముచేయుటయందు మేధాతిథి గారు ఇట్లువ్రాసినారు:— "అకన్యా వృత్తమైథునసంబంధా" అనియు; కన్యఅనుశబ్దమునకు, "అప్రాప్తమైథునాస్త్రీకన్యోచ్య తే" అని వ్రాసినారు. అనగా అకన్య అనగా పురుషసంప ర్కమైనదనియు, కన్య అనగా పురుషసంపర్కము కానిదనియు స్పష్టముగా వ్రాసినారు. కాని కన్య అనగా రజస్వలకాని దనియు, అకన్య అనగా రజస్వల అయినదనియు వ్యాఖ్యానకా రులెవరును వ్రాయలేదు. నిఘంటునందును ఆయర్థములే దు. కనుక పురుషసంసర్గమగువరకు కన్యయనబడుచున్న ది గనుక రజస్వలఅయినస్త్రీ వివాహమున కనర్హముకాదని తెలియుచున్నది.

రజస్వలకానిదానిని రజస్వలఅయినదని చెప్పినవానికి దండన విధింపబడలేదని స్పష్టమగుచున్నది.

ఇంక దండనవిధిని గురించి యోచించుటలో, పురుషసంప ర్కముకానిస్త్రీని పురుషసంపర్కమైనదని చెప్పినవానికి దండన విధించబడినది. (ఈదండనవిధి యిప్పటికి నాచారములోను న్నది) కాని ఇక్కడ విశేషమేమియు గన్పడదు.

కడపటి ఆక్షేపణకు సమాధానము. "తమయభిప్రా యమునకు విరుద్ధముగా గనంబడు ప్రతివచనమును చేర్చినదియని వాదించుటమాత్రము న్యాయముగాదని రావుగారెఱుంగుదురు

గాకయని శర్మగారు వ్రాసినారు.

"ప్రయచ్ఛేన్నగ్నికాంకన్యాం ఋతుకాలభయాత్పితా
ఋతుమత్యాంహితిష్ఠంత్యాం దోషఃపితరమృచ్ఛతి॥
"తస్మాదుద్వాహయేత్కన్యాం
యావన్నర్తుమతీభవేత్"
"యావన్నలజ్జితాంగాని కన్యాపురుషసన్నిధౌ
యోన్యాదీన్యవగూహేత తావద్భవతికన్యకా॥"
"యావచ్చేలంనగృహ్ణాతి యావత్క్రీడతిపాంసుభిః
యావద్దోషంనజానాతి తావద్భవతికన్యకా॥

ఈశ్లోకములు కాలదేశ సందర్భములనుపట్టి చేర్చినవని వ్రాసినది నిశ్చయము. మఱియు నిట్టి శ్లోకములన్నియు చేర్చినవేఅని చెప్పుటకు సరియైన కారణములున్నవనెడి దృఢముతో నట్లు చెప్పితినికాని నాయభిప్రాయమునకు విరుద్ధముగా నుండినందుచే చెప్పలేదు.

మొదటికారణము.

వివాహకర్మ ఈలోకసంబంధమైన పంచదశ సంస్కారములలో అత్యంతముఖ్యమైనది. ఎందుకన ఆసంస్కారము సత్సంతానమునకును తద్ద్వారా మాతృభూమియొక్కయు, సద్వంశములయొక్కయు, పవిత్రతయు, మహిమయు, ఐశ్వర్యమును, సుగుణసంపత్తియు, అభివృద్ధియగుటకును, సర్వలోకహితమునకును, క్షేమమునకును, మూలాధారమగు సంస్కారమగుటచే ఆసంస్కారమునకు సంబంధించిన సమస్తమంత్రతంత్రములయొక్కయు, ప్రమాణములయొక్కయు ప్రాముఖ్యతయు, వధూవరులు దీనిచే వహించదగిన ఉత్తరవాదత్వమును (జవాబుదారీ) వీరలిద్దరికిని విశదముగా తెలియుట అత్యంతావశ్యకమని అందరికి తెలిసిన విషయమనుటకు సంశయములేదు.

మట్టియందాడుకొనుచుండు పసిపిల్లలకు వివాహసంబంధ

మైన పలాటి పవిత్రమైన యుద్దేశములు మొదలగునవి తెలియు
ట యసంభవమని ఎవరెరుగరు? ఇట్టివారికి పెనిమిటి అనగ
నేమో తెలియకుండవచ్చును. ఏమియు తెలియని పసిబాలురచే
సర్వలోక హితమునకును, ఋషివంశోద్ధారమునకును, దేశక్షే
మమునకును ఆధారభూతంబులగు ప్రమాణములు చేయించవచ్చు
నా? ధర్మార్థకామములను త్రివర్గమునకు ముఖ్యాధారము
భార్య. "భార్యామూలంత్రివర్గస్య" అని మహాభారతారణ్య
పర్వమందు చెప్పబడినది. ధర్మము, అర్థము, కామము ఈ
మూడును పరస్పర విరోధములైనవి. ధర్మము ననుసరించిన
అర్థము, ధర్మము ననుసరించిన కామమును పొందుటకు భార్య
యే మూలమని యక్షప్రశ్నలలో పరిష్కరింపబడినది.

"ధర్మశ్చార్థశ్చ కామశ్చ పరస్పరవిరోధినః
తేషాంనిత్యవిరుద్ధానాం కథమేకత్ర సంగమః
యదాధర్మశ్చ భార్యాచ పరస్పరవశానుగౌ
తదాధర్మార్థకామానాం త్రయాణామపిసంగమః॥

ధర్మమునకు అర్థమునకు కామమునకు పరస్పర విరోధ
ము. ఈనిత్యవిరోధములైనవి ఎట్లు ఒకచోటనే విరుద్ధములేక
అన్యోన్యముగ చేరునని యక్షుడు ధర్మరాజునడగగా ధర్మరాజు,
ధర్మమును భార్యయు పరస్పర వశులై అనువర్తించినపుడే మూ
డును అన్యోన్యముగ నొకచోటనే చేరునని ఉత్తరము చెప్పెను.

ఈ కారణము చేతకదా ఈత్రివర్గమును గురించి వివాహ
కాలమందు అగ్నిసాక్షిగా ప్రమాణము చేయించుచున్నారు?

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

# లోకసేవావిధానము.

1. ఇతరులకు సుఖముకలుగునట్లును, మనకపాయము కలుగకుండునట్లును, మనము లోకసేవ చేయదలచినచో, ముఖ్యమైన యీయుద్దేశముల మూడింటి నెఱుగవలయు.

(I) పరోపకారమే మనకానందమును, గలుగఁ జేయునదిగ నుండవలయు.

(II) లోకహితమొనరించుటకు నియమింపఁబడిన యీశ్వరశక్తి మనమూలమున బహిర్గతమగుచున్నదనియు, మనమట్టి శక్తికి నిమిత్తమాత్రులమనియు దెలిసికోనవలయు.

(III) మనయందు వ్యక్తమగు దైవస్వభావమునే మన మితరులయందును జూడవలయు.

2. పరులవిషయమై మనమేమితలచెదమో, యేమిమాటలాడెదమో వారట్లంతకు పూర్వమే మనవిషయమై తలచియు, మాటలాడియు నుందురని జ్ఞాపకముంచుకోనవలయు.

3. మనమితరులవలన నేవిధమైన కీడుజెందియున్నను, కీడుచేసిన వారధికదుఃఖము జెందుదురని తెలిసి బాధను సహించుకొని యుండవలయు.

4. మనకెవరియందయిన, నధికప్రేమ యున్నయెడల, తన్మూలమున మనకును వారికిని, మనస్థైర్యము చెడకుండునట్లు, మనము వారియెడ నడుచుకోనవలయు. ఎందుకనగా, మనము చేయు నుపకారము వలన జనులకు, మంచినడతకు ఉత్తేజము కలుగవలయునే కాని యితరము కాగూడదు.

5. మనకంటె మరియొకనియందు పరోపకారబుద్ధి యధికముగనున్నచో, నతనినిజూచి యసూయఁ జెందగూడదు. మన యల్పశక్తిచే, చేయనోపని యుపకారము మనకంటె నధిక సామర్థ్యముగల మరియొకరిచేఁ జేయబడిన జనులకెక్కువ సుఖ

ముకలుగుటనుజూచి, మనము సంతసింపవలయు.

6. మనమిచ్చు దానమును, ప్రతిగ్రహముఁ జేయువాఁడు మాత్రమే యనుభవింపవలయునని యుద్దేశింపగూడదు. ఆదాన మితరులకుగూడ, సుఖదాయకమైనను సంతోషింపవలయు.

7. ఒకరికి సహాయముజేయ గలిగినపుడు, మనకట్టి యుపకారశక్తి ననుగ్రహించినందులకై కరుణామయుడగు నీశ్వరుని ధ్యానించి పూజింపవలయు. మనమట్లు చేసినచో, నీశ్వరప్రీతిని బొందుటయే గాక మనముచేయు సహాయముకూడ విశేషఫలదాయకమగును.

8. మనముచేయు నుపకారమునకు ప్రతిఫలము నపేక్షింపగూడదు. మనవలన నుపకారము బొందినవారు కృతజ్ఞతావాక్యములు బలుకలేదని ఖిన్నతఁ జెందగూడదు. ఎందుకనగా, మనముచేసెడి యుపకార మాత్మకేగాని దేహమునకుగాదు. ముఖమునుండి కృతజ్ఞతావాక్యములు వెడలకున్నను, ఆత్మమాత్రము సంతోషమును, కృతజ్ఞతాభావమును, వహింపుచున్నది.

9. మనమెవరిని ప్రేమించెదమో వారును మనలనట్లే ప్రేమింపవలెనని యపేక్షింపగూడదు. మనప్రీతి నిష్కపటమైనదిగా నున్నచో, నదియెప్పుడైనను వాని హృదయమును ప్రవేశించి, ప్రతిప్రీతిని తప్పక పుట్టించును. మనప్రీతి చంచలమైయుండినచో, ఉత్తరోత్తర వారియెడ, మనమువహించు ప్రేమ తగ్గిపోయి, యందుచేవారికి వ్యసనము కలుగుటకన్న నిప్పుడేమనయందు వారికి అనురాగము పుట్టకుండుటయే మేలు.

10. ఎవరికి ఆత్మసంయమనము (మనోనిగ్రహము) కొంతమట్టుకైనను కలుగకయుండునో యట్టివారితరుల కుపకారము జేయనేలేరు.

11. భారమును మోయుటకు శక్తిని కలుగఁ జేయునది యుపకారమేగాని భారమును దొలగించుట యుపకారముగాదు.

12. జనులు ఎట్లు భావించెదరో అట్లే యగుదురు అను దానిని మన మెప్పుడు గ్రహించెదమో, అప్పుడు మనము వారికి సర్వోత్తమముగా సహాయము చేయుటకు సమర్థులగుదుము.

13. ప్రతిమనుజునియందును, ఈశ్వరునికళ ఒక్కొక్క సద్గుణముగా వ్యక్తమైయుండును, ఆమనుజునకు ఆమూలకముగా సహాయము చేయవలెను కాని, వేరువిధముగ కాజాలదు.

14. జీవితకాలములో ప్రతియొకనిముషము, ఉపకారమునకు నుంచినసమయమే. ప్రతికార్యము జేయను, సహాయసమయము దొరకకున్నను, ఉపకారబుద్ధికి తావులేని సమయమే లేదు.

15. మనుజుడు స్వంతచింతను, విడచినకొలది అభివృద్ధి యగును. ఎందుకనగా, తాజేయు అత్యల్పమైన ప్రతియొక యుపకారముచేతను, వానికి పరోపకార సామర్థ్యము అధికముగుచువచ్చును.

16. మనమెవరికి సహాయము చేయుచుండెదమో వారు మనపద్ధతికి సమ్మతించనియెడల వేరువిధముగా వారికి సహాయ మొనరింపవలయును. ఏలాగయినను వారికే సహాయము చేయవలసినదే మనఉద్దేశమై యుండవలయునుగాని, ఆసహాయము ఏ రూపముదాల్చినను చింతలేదు.

17. మనకు పరిచయమున్నను, లేకున్నను కష్టపడుచుండువారికి సహాయముజేయ వెనుకకు తియ్యరాదు. అవశ్యకముండుటచేతనే వారు మనసహాయమునకు పాత్రులయిరి. మనము సిగ్గుజెందినచో, ఆపత్కాలమున వారికి మననుండి కావలసిన సహాయముతప్పిపోవును. మరియు మనసిగ్గే మనగర్వముగా పరిణమించును.

18. నేటిదినము నేనితరులకెంతో సహాయముజేసియున్నానని, ఎప్పుడును తలపకూడదు. "దానికిమారుగా; నేనింకను ఎంతోఉపకారము చేయవలసినదిగా నుండెను; లోకము

యొక్క దుఃఖములను కష్టములను తగ్గించుటకుగాను, నేజేసిన ప్రయత్న మెంతో యల్పముగానున్నది" యని భావింపవలెను.

19. ఎవరు తమపై యధికారుల ఇష్టముచొప్పున నడుచుకొనుట యందత్యంత నిపుణులో, అట్టివారే తమకంటె తక్కువంతస్తునందుగల వారలపై అధికారముచేయుటకు, అత్యంత యోగ్యులు. ఎందుకనగా, విధేయతను నేర్చుకొననివారు ఇతరులపై వివేకముగా అధికారముచేయఁజాలరు.

20. సద్బోధను ఇతరుల హృదయమునకు అంకితమగునట్లు చేయవలెనన్న మనము ఆ సద్బోధననుసరించి నడుచుకొనుట ఉత్తమమైనమార్గము.

21. మనసదుద్దేశములను పురస్కారమును మన మెట్లపేక్షించెదమో అటువలె యితరులను, వారిసదుద్దేశమునకుగాను మనము సన్మానింపవలయు.

22. మానావమానభావము, మనయందులేనిచో మనకవమానమే లేదు. ఎందుకనగ, అవమానమును, గ్రహించునది మనుష్యుని, దేహాత్మయేగాని జీవుడుగాడు అనగ, నేనుదేహముకాదు, జీవుడను జ్ఞానముగల మనుష్యునికి మానావమానమును జెందుటకవకాశమే లేదు.

23. మనము లోకసేవానిరతులమనియు, ఇతరులుకారనియు, అందువలన ఇతరులకంటె మనము శ్రేష్ఠులమనియు, నెప్పుడు భావించెదమో ఆక్షణమే మనము సేవామార్గమునుండి జారుదుము.

24. మన మితరులతో నేకీభవించి మనసన్మార్గమును పంచుకొనుటవలన వారికుపకారమగును. ప్రత్యక్షముగా కాని, పరోక్షముగా కాని, పృథగ్భావముచే, మనము వేరుమనుష్యులని, చూపించుకొనుటవలన పరోపకారము కానేరదు.

25. చెప్పినడుచుటకన్న నడిచిచెప్పునదిమేలు. నడిచి

మానముగనుండుట సర్వోత్తమము.

26. ఒకమనుజుని కైంకర్యమునగ పరోపకారముచేయుట యందెంత సమర్థుడనునది నిర్ధరించవలెనన్న వాడు వ్రాసియున్న గ్రంథములు, చెందియున్నఖ్యాతి, చేసియున్న వాక్ప్రసంగములు, ఆచరించిన బాహ్యకార్యములు వీనిచేపరీక్షించుటకు కానేరదు. కాన వాడు ప్రతిదినము గృహకృత్యములందు నెవరికి గోచరముకాక చేయుచున్న కార్యములచే కనుగొనవచ్చును.

27. చేతనైనంత ఉపకారము చేయదలచెడివారు ఉపకారపుణ్యమును సంపాదించుటకుగాను తమసర్వస్వమును త్యాగముచేయుటకు సిద్ధముగానుండవలయు.

28. తనకు పలువిధములగు నుపకారములు కావలెనని ఒక మనుజుడు మనలను యాచింపవచ్చును అయితే వానికెట్టి సహాయము ఆవశ్యకమనునది చూచి మనము వానికి సహాయము చేయువలెనుకాని వాడుకోరిన సహాయములన్నియు చేయకూడదు. అందుచేవానికి కోపమువచ్చినను చింతలేదు. అయినను మనముచేయు సహాయమువలన సాధ్యమైనంతవరకు పరిగ్రహీతలకు తృప్తికలుగునటుల యత్నించవలయును.

29. ఒకరికి చేయవలసిన సహాయము మరియొకరికి చేయుట సరియైన యుపకారముకాదు. పరోపకారముచేయుట కపేక్షించుచున్న అనేకజనులు ఎవరికి సహాయముచేయవలసినది. తమకర్తవ్యమో దానినివిడిచి తమమనస్సుకు తోచిన వారికి సహాయముచేయుచున్నారు. దీనిచే తప్పుత్రోవలో పోవుచున్నారు.

30. చేసినఉపకారము ఉత్తమమైనట్లైనను దినముకూడా అంత సుదినమగును.

31. అల్పస్వల్పమైనను ఆవశ్యకతలేనివారు ప్రపంచమందే లేరు. అల్పస్వల్పమైనను ఇయ్యనివారలుకూడా ప్రపంచ

ముందు లేనే లేదు.

32. మన మెవరికి ఉపకారము చేయదలచెదమో వారి యందు కనబడుచున్న దోషములను గణింపకూడదు. వారి లోపములచేత నేకదా మనకు సహాయము చేయుట కవకాశము కలిగినది.

33. ముందుసుఖము కలుగచేయని దుఃఖము ఎట్లులేదో అటువలె ముందు సద్గుణముగా పరిణమించని లోపమే లేదు.

34. ఒకమనుజుని లోపములయందుండు శక్తి మన ఉపకారముచే ముందుసద్గుణదాయకమైన శక్తియగుచున్నది. మనము సహాయము చేయునపుడు దీనిని మనస్సునందుంచుకొనవలయు. శక్తిని మార్చ సాధ్యములేదన్నను దానిగతి వినియోగములను వ్యత్యాసపరచుటకు మన మవశ్యముగా యత్నము చేయవలయు.

35. నాయందింకను విశేష సామగ్రులుండియున్న నెంతో అతిశయముగా సహాయము చేయుచుంటిని యనితలుచుట కన్న మనయందుండు అల్పసామగ్రులచే కించిత్తుసహాయమును ఇప్పుడు కార్యతః చేయునది అధికప్రయోజనకరము.

36. పరులయందు లేని సద్గుణములను మనస్వభావమున మనము ప్రదర్శనముచేసినచో మనము వారికి చాలసహాయము చేసినట్లగును.

37. ప్రతిదినము మన మాచరించు పరహితకార్యము పారమార్థికమో లేక డాంభికమో అనునది తెలిసికోవలెనన్న మనయందు దినదినమునకు శాంతి సంతోషము, సుఖము, ఉపరతి, అతిశయమగుచున్నవా యనువానిని చూచుకొనవలయు.

38. పరోపకారమును మనము యథాశక్తిచేయవలెను గాని మరియొకరిశక్తికి తగినంత చేయవలసినదిలేదు. మనచేతనైనంత చేసినచో మనకర్తవ్యమును నెరవేర్చినట్లగును.

39. మన మెవరికైనను సహాయము చేయుటకు యత్నించి

నపుడు మనసహాయమనకక్కరలేదని వారొకవేళతిరస్కరించినచో దానిని నెపముగా ఉంచుకొని ముందెప్పుడును సహాయముచేయుట లేదని సంకల్పించకూడదు. సహాయమును ఆరంభమందక్కరలేదనువారు పరిణామమునందు మరింత అధిక సహాయము నపేక్షింతురు.

40. ఎవరైనను సంపూర్ణప్రేమచే మనకు సేవనొసగినచో తిరస్కరింపకూడదు. ఎందుకనగ సేవకు పదియుత్తమఫలమో సేవాస్వీకారమునకు కూడా అదేఉత్తమఫలము.

41. మనఃపూర్వకముగా మనబుద్ధికిని శక్తికిని ననుగుణముగా మనము ఉపకారము చేసినపిదప దానిఫలమును గురించి చింతింపకూడదు. ఎందుకనగ పరిశుద్ధాంతఃకరణచే చేసినయుపకారము యుపకారము చేసినవానికి అనుగ్రహరూపముగా వెనుకకు మరలివచ్చును; ఇదిగాక ఉపకృతునకుకూడ అనుగ్రహము కలుగచేయును.

42. లోకసేవనుండి ప్రేమించుటకును దానినుండి ఉపకారము చేయుటకును కలుగు అధికమయినశక్తి పరోపకారముచే కలుగు ఫలములందు ఉత్తమమైనది.

43. నిజమైన సుఖశాంతిని ననుభవించక యుండువాడు చక్కగా నుపకారమును చేయనోపడు.

44. నిజమైన అంతఃకరుణచేచేసిన సేవయొక్క వేళ అవివేకమైనదిగా పరిణమించినను దానిచే సేవను స్వీకరించిన వానికి ముందుచెడుపు సంభవింపదు. అవివేకముచే సంభవించు చెడుపును పరోపకారము తొలగించును.

45. ఒకమనుజుడు నొకతప్పిదముచేసి క్షమను వేడినచో వానిస్వభావమునందట్టి కొరత యాతప్పిదమును చేయించెనో ఆకొరతను మనము తెలిసికొనవలయు. దానిని వాడు పోగొట్టుకొన్నచో వానికిమనము విశ్వాసపూర్వకముగా సహాయము

చేయవలెను. ఇదే నిజమైన క్షమాపణ.

46. కొన్ని సందర్భములయందు పరుల తప్పితములను కని పెట్టుట మన కార్యముగా నుండవచ్చును. ఇట్టిసందర్భములు అరుదు. అయితే వారికి సహాయముచేయుట సర్వదా మనకు కర్తవ్యముగానుండవలయు.

47. మనము యోగసోపానమును నెక్కుచుండుటను కనుగొనవలెనన్న పరోపకార సందర్భములను మొదటికంటె నిప్పుడధికముగా సార్థకపరుచుచుండుటను పరీక్షించుకొనవలయు.

48. ఇతరులు చేయుచున్న పరోపకార పద్ధతిని మనము ఆక్షేపించకూడదు. ఎందుకనగ మనపద్ధతియొక్క ఉపకారముచే నెవరికి ప్రయోజనము కానేరదో అట్టివారికి ఆపద్ధతియొక్క ఉపకారముచే ప్రయోజనము కావచ్చును.

49. ఏ మూలవస్తువుయొక్క దర్శనముచే మనకు ఉపకారము చేయవలెనను తలంపుకు ఉత్తేజనము కలిగినదో ఆవస్తువును ఘంటాఘోషముగా వెల్లడిచేయుటకు వెనుకతియ్యరాదు. ఎందుకనగ మనకుసుఖమును కలుగజేసిన వస్తువుయొక్క జ్ఞానము లోక నివేదనకు యోగ్యమైన వస్తువులలో నొకటిగానున్నది.

50. అన్యులకు మనము చేయుప్రతియొక ప్రీతికార్యము వారికిప్రక్కనుండ వారిని రక్షించి ప్రోత్సాహపరుచుటకుగాను మనము సృష్టించిన నొకదేవత. మనఉపకారమును మనమెంతప్రేమతో చేయుదుమో అంతంతదేవతకు జీవకళ అధికమగును. అదిదీర్ఘకాలమువరకు మనసోదరుని సమీపమున కాచియుండి వానికి ప్రోత్సాహమిచ్చి కాపాడును.

(సశేషము)

# అవతారములు.

(108-వ పుట శేషము.)

శ్మశాననాథుఁడైన మహాదేవుని యఘోర మహిమలు ప్రపంచ భోగములన్నియు నశ్వరములని గ్రహించి వానియందు విరక్తిగలిగియున్న జనులహృదయములను విశేషముగా నాకర్షించుచున్నవి. శ్రీకృష్ణస్వామియైననో కులదేవుఁడై, కుటుంబస్వామియై విరాజిల్లుచు ప్రతియొక అంశమందును మనోహరమూర్తిగా నున్నాఁడు. ఎంతదూరము విచారించిచూచినను అతనియందు మానవలీలలే ఎక్కువగా నున్నవి. తాను సెలవిచ్చియున్న ప్రకారమే అతఁడు నరరూపమును దాల్చి సమస్త విషయముల నరునివలె వర్తించియున్నాఁడు. బాల్యమందు బాలలీలలతోను ఆహ్లాదకరమైన గంభీరభావముతోను వర్తించియున్నాఁడు. బాల్యయౌవన దశలయందు స్త్రీపురుషశిశువుల మనస్సులను సమముగా నపహరించియున్నాఁడు అతఁడున్నచోట సంతోషోల్లాసమనోహరత్వములు తప్పకయుండును. శ్రీకృష్ణపరమాత్ముని ధ్యానించిన మాత్రమున నదీతరంగములు, ఘోషవనవీధులయందు రాలియున్న ఎండుటాకులశబ్దము, తృణపల్లవములయందు మేయుచున్న గోవుల అరుపు, తల్లిదండ్రులను చుట్టుకొని యుల్లాసముతో క్రీడించుచున్న బాలురప్రహసనధ్వనియు, వినవచ్చుచున్నవి. ఏయంశమునుబట్టి చూచినను అతఁడు లీలామానుషమూర్తియై యున్నాఁడు. మానుషప్రేమచే శిశువుయొక్క యుయ్యాలపై వంగియున్నాఁడు. మానుషప్రేమచే యువకుని వినోదములను ఆమోదించిచూచుచున్నాఁడు. మానుషప్రేమచే ప్రేమించువారికి సహృదయుఁడై యున్నాఁడు. మానుషప్రేమచే భార్యాభర్తలను కరుణించుచున్నాఁడు. మానుషప్రేమచే తొలికుమారునికనిన పసితల్లిని జూచి హర్షోన్ముఖుఁడైయున్నాఁడు. ఎచ్చోటచూచినను అతఁడు

ప్రేమమయుడై మానవులకు సుఖసంతోషముల నొసంగు మనోహరమూర్తియై యున్నాడు. మనోహరమైన యతనిగాంభీర్యము మానవుల హృదయముల నపహరించుననుట చోద్యము కాదు.

ఇట్టి యసమానమూర్తి విషయమును ఈప్రాతఃకాలమున మనము విచారించబూనియున్నాము. ప్రథమమున కొన్ని ఆరంభ సంశయములను మనము విచారించక తప్పదు. ప్రపంచమందు అవతారములు రెండర్థములను బోధించుచున్నవి. అవతారములు నిజముగా జరిగినవను సంగతిని మరువకుడు. మహనీయుల చరిత్రను చదువునపుడు అది నిజముగా జరిగిన వృత్తాంతమేగాని కట్టుకథ కాదని మీరు గ్రహించుడు. అవతారము వెల్లడిజేయు నొక యర్థము ఇందులోనున్నది. ఇది గాక అవతారము మరియొక అర్థమునుకూడా బోధించుచున్నది. అవతారపురుషుడు ప్రపంచరంగమందొక క్లుప్తమైన నాటకము నాడవచ్చుచున్నాడు. ఆనాటకము ఒకపరమార్థ తత్వమును వెల్లడిచేయుచున్నది. చరిత్రవృత్తాంతములు యథార్థములైయున్నను అవి పరమార్థ రహస్యములను తప్పక బోధించుచున్నవి. చరిత్రములు తత్వార్థసూచన కథలుగాని యథార్థములు కావని భావించిన సత్యమున కొకవిధమైన కొరతగలుగుచున్నది అటుగాక చరిత్రములు యథార్థ వృత్తాంతములేగాని తత్వార్థసూచకములు కావని భావించిన సత్యమునకు మరియొక విధమైన కొరతగలుగుచున్నది. గనుక అవతారపురుషుని చరిత్రము యథార్థ వృత్తాంతమైనదిగాను పద్దియోయొక పరమార్థ తత్వమును బోధించు విషయముగాను నున్నదని తెలియుడు. అవతారపురుషుడవనిలోజన్మించి అనేక కార్యములను జేసినను ఆకార్యములు తత్వార్థమును బోధించుచున్నవని గ్రంథకర్తలు వ్రాసియున్నారు. ఈసంగతులను జ్ఞాపకముంచుకొనవలయును. లేనిచో అవతారములవలన నేర్చుకొనదగిన పెద్దపాఠములు

విడిచిపోవుచున్నవి.

అవతార పురుషునితో పూర్వజన్మములయందు బుట్టియున్న జనులు తనతోకూడా మరలజన్మించియుండిరి. వారిలో కొందరు మిత్రులుగాను మరికొందరు శత్రులుగాను మానవులై బుట్టియుండిరి. నేనిచ్చోట కృష్ణావతారవిషయమునే చెప్పుచుండినను ప్రతియొక యవతారమువచ్చినపుడు కొందరు శత్రుపక్షమందును మరికొందరు స్వపక్షమందును జన్మించుట సహజముగానున్నదని తెలియుడు. అవతారపురుషులు ఒంటిగా జన్మించుటలేదు. స్వపక్షమందు మిత్రులైయుండు కొందరితోను పరపక్షమందు శత్రులవలెనుండు మరి కొందరితోను వారు ప్రపంచ నాటకము నాడజన్మించెదరు.

మనమిప్పుడు విచారముచేయబూనియున్న కృష్ణావతారమందు ఈసంగతి బహుస్పష్టముగా గోచరమగుచున్నది. కృష్ణావతారము బహుగహనమై యుండుటచేతను ఆయవతారపురుషుడు పలువిధముల మానుషస్వభావమును వెల్లడిజేసియుండుటచేతను మనమనస్సుకు చక్కగాబోధయగునట్లు అతనివృత్తాంతమును ఏడంకములుగా విభాగముజేసికొనెదము. నాటకపరిభాషనుపయోగపరచుటచే ఈయవతారముయొక్క రహస్యార్థము తేటపడుచున్నది. శ్రీకృష్ణుడు తనజీవచరిత్రమందు ఏడువిధములైన నాటకాంకములను స్పష్టముగా నటించియుండుటచేత ప్రతియొకంకము వేరువేరు స్థితియందున్న జనులకు పాఠమును నేర్పించు నిమిత్తము నటించబడియున్నదని తెలియవలెను.

ఈయంకములు సహితము కొంతవరకు అతనిజన్మవృత్తాంతములో వేరువేరు కాలమున తటస్థించియున్నట్లు గోచరించుచున్నవి. కొంతవరకు అవి ఒకటి జరుగుచుండగా మరియొకటి తటస్థించినట్లు గోచరించుచున్నది. వానిని చక్కగా మనస్సులో ప్రతిష్ఠచేసికొనినయెడల ఈ యవతారముయొక్క సం

గతి యంతయు బాగుగ తెలియవచ్చుచున్నది. వేరువేరు పాత్రములను పదిలముజేసికొనుటకై మనమనస్సులయందు వేరు వేరు స్థానములను కల్పించుకొనుట మంచిది.

ప్రథమమున నతడు భక్తివిషయుడై, భక్తవత్సలుడై ప్రకాశించియున్నాడు. ఇదియే యతని జన్మనాటకమున మొదటి యంకము. తానుభక్తివిషయుడై నిలిచి భక్తులకు స్వామి ఎట్టి దయనుచూపించునో దానిని వెల్లడిజేసియున్నాడు. శ్రీకృష్ణుని జీవితమందు ఇదియొక స్పష్టమైన లక్షణముగానున్నది.

ద్వితీయాంకమున నతడు దుష్టశక్తుల వినాశనమునకై యవతరించిన మూర్తియని వెల్లడిజేసికొనియున్నాడు. ఈలక్షణము తనజీవితమున అంత్యమువరకు తప్పకయున్నది.

తృతీయాంకమున నతడు బుద్ధికుశలుడై, రాజతంత్రజ్ఞుడై లోకచరిత్రలో వన్నెకెక్కియున్నాడు. అత్యద్భుతమైన ఉపాయముతోను బుద్ధికుశలతతోను కూడుకొని లోకులను నియమిత మార్గమున నడపించు పురుషుడై నటించియున్నాడు. ఎంతదూరము విచారించినను అతడు రాజతంత్రవిశారదుడై యున్నట్లు వెల్లడియగుచున్నదేగాని ప్రభువుగానున్నట్లు తోచదు.

నాల్గవ యంకమందు మిత్రుడై వర్తించియున్నాడు. ముఖ్యముగా పాండవులయందతడు వెల్లడిజేసిన మైత్రి లోకప్రసిద్ధముగా నున్నది.

పంచమాంకముననతడు గురుస్వరూపుడై ప్రకాశించియున్నాడు. ఒకవంశమునకుమాత్రమే గురువని భావింపకుడు. లోకగురువై వర్తించియున్నాడు.

ఆరవ అంకమందు ఆస్వామి జనుల హృదయములను శోధించువ్యక్తి విశేషముగా గోచరించియున్నాడు. మనుష్యుల స్వభావమును చక్కగా పరీక్షించి కనుగొనుసామర్థ్యమును కలిగియుండెను.

సప్తమాంకమున జగములో సర్వవ్యాపకుడై. అంతయు తనలోనున్నట్టు చూపించుచు దృష్టాదృష్టములను. ప్రకాశాంధకారములను, తనయందే చేర్చుకొని తన్నుపిడిచి ఏదియు లేదని వెల్లడిజేసిన పరావస్తువై ప్రకాశించియున్నాడు.

ఇట్లు శ్రీకృష్ణుని జీవచరిత్రను పది అంకములుగా విభజించవచ్చును. ప్రతియొకఅంకము ఒకజన్మవ్యాసమునకు యోగ్యమై యున్నదిగాని నానవలె యొక యుపన్యాసములో సంక్షిప్తము జేయునట్టులేదు. ఎంత అసంపూర్తిగాగాని నానవమాయంకములను ఒక్కొకటిగా విచారించుదము. నేనుకొన్ని సూచనలనుమాత్రమే ఇయ్యగలను. వానిని మీమీ విస్తారవృత్తులకు తనుగుణముగ విస్తారము జేసికొనవలసినది మీపనిగానున్నది. ఒక్కొకఅంకము ఒక్కొకరికి అభిరుచిగా నుండవచ్చునుగాని అన్ని అంకములను విచారించుట యవసరమైయున్నది. అంకములన్నియు సమముగా భక్తిని తప్పక కలుగజేయుచున్నవి. భక్తి భావముతో విచారించిన శ్రీకృష్ణుని జీవితము యొక్క ఆదిభాగములు ఉత్తేజకములుగాను, ప్రసాదకరములుగాను నున్నవి. శైశవ బాల్యదశలయందు వ్రజబృందావనములలో నున్నప్పుడు శ్రీకృష్ణుడు గోపీగోపాలక గోపబాలకుల మధ్యనివసించి వారిహృదయముల నపహరించెను. ఈసందర్భమున నొకసంగతిని మరువవలదు: అతడు గోపీబృందమునకు మనోహరమూర్తియై వర్తించినది తనబాల్యదశయందేగాని యౌవనావిర్భావానంతరము కాదు.

నాతోకూడా ఇప్పుడు ఆస్వామియొక్క జననకాలమునకు మీరురావలెనని కోరెద. అతడవతరించుటకు మునుపు దేవతలందరు సత్యలోకమునకువెళ్లి లోకకంటకులైయున్న జనులను సంహరించి భూభారమును బాపవలెనని విష్ణుమూర్తిని ప్రార్థించిరి. అప్పుడాస్వామి ఆదేవతలను గురించి ఇట్లుపలి

కెను:— "ఓ దేవతలారా! మీరు మీమీయంశములతో మర్త్య లోకమందు జన్మించుడు." విష్ణువేయవతరించు స్థళమున మహా ర్షులుకూడా బుట్టిరి. గనుక అతడు పుట్టకమునుపే అతడు నటిం చవలసిన నాటకసామగ్రులు సిద్ధమైయుండెను. వ్రజమందు న్న గోపాలుకులు, నందుడు, అతనిపరివారము, అద్భుతమైన ఆపవిత్రక్షేత్ర నివాసులగు గోపిబృందము మొదలగు నితరజనులు "దేవతలవలె"నుండిరని వినియున్నాము. వారు లోకపా లకులైయుండి లోకోద్ధారమునకై మానవజన్మమును బొందియుం డిరి. అనగా దేవతలే మానవులై జన్మించియుండిరి. శ్రీకృ ష్ణుడు బాల్యదశలో సలిపిన బాలలీలలను స్మరించిన అతనితోకూ డా ఆప్రథమాంకముండిన స్త్రీపురుషులు సామాన్య స్త్రీపురు షులుగా నుండలేదని వేద్యమగుచున్నది. వారు లోకపరి పాలకులై ఆస్వామిని నావరించుకొని గోపాలకులై పుట్టియుండిరి. గోపాలకుల భార్యలు ప్రాచీనఋషులైయుండిరి. ఆదేవదేవుని యనుగ్రహముచే వారుస్వామిని బాల్యదశలోచుట్టునుండి సేవచే యుటకును, అమ్మహాత్ముని బాలపాదములకు తమభక్తిని నివేదిం చుటచే వారికున్న పరమాత్మవిషయక భక్తిఇట్టిదని అతడు కను గొనుటకును వారుగోపికలై జన్మించియుండిరి.

ఇట్టి సన్నాహములన్నియు సిద్ధమైన పిదప స్వామి యవత రించెను. అతడు పుట్టినకాలమున నడచిన వృత్తాంతమునంత యు నేను విస్తారముగా జెప్పతలవలేను. కంసుని జంపువాడు బుట్టునని మొదటనే అశరీరవాణి పలికినది.

(సశేషము).

ఎం. వి. వెంకట్రావు.

-:0:-

# గ్రంథస్వీకారము.

ఈయడుగునఁగనిన గ్రంథములు మా కార్యస్థానము నలం కరించినవి.

1. సంసారదర్పణము. ఇది ఛత్రపురములోనుండు గాడి శ్రీజగన్నాథస్వామి పంతులుగారిచే రచియింపఁబడిన నాటక గ్రంథము. ఇదియేడంకములు గలిగి 150 పుటలు నిండియున్నవి. ఈగ్రంథముయొక్క ఉద్దేశము సంఘసంస్కరణము. బాల్యవివాహములు, రజస్వలానంతర వివాహములు, నిర్బంధ వైధవ్యము, విధవాపునర్వివాహము, స్త్రీలవిద్యాభ్యాసము, సముద్రయానము, జాతిభేదములు మున్నగువిషయములిందు చర్చింపఁబడియున్నవి. ఇవియన్నియు నొక్కయెడ భూషింపబడియున్నవి. ఒక్కచో దూషింపఁబడియున్నవి. ఒక్కచో పరిహసింపఁబడియున్నవి. ప్రాచీనమతములొక్కచో ప్రశంసింపఁబడియున్నవి, మఱియొక్కచో నవనాగరికత స్తుతించఁబడియున్నది ఇదియంతయు విశేషము కాదు. సంఘసంస్కరణ పరాయణులు కొందఱు బాలికలకు విద్యనేర్పుటకై యొకపంతుల నేర్పాటుచేసుకొని వార్లకు విద్యగరపుచుండగా నతడంతలో రజస్వలయయిన యొకకన్యకను 10 వేల రూపాయలతోఁగూడ ఆమె తండ్రియింటనుంచి రహస్యముగ లేవదీసి కొని దేశాంతరగతుఁడాయెనట! సంఘసంస్కారము!!.

దీనివెల 12 అణాలు. వలయువారు గ్రంథకర్తగారికి వ్రాసుకొనవలయు.

* * * *

2. నిరుద్ధభారతము. ఇది రాజమహేంద్రవరము శ్రీ॥ మాగిపూడి వెంకటశర్మగారిచే రచియింపఁబడిన పద్యకావ్యము. దీనియుద్యమమును సంఘసంస్కరణమే. మాలమాదిగలు మొదల

గు నీచజాతులయెడ మనకుగల అనాదరణమును, వారికి మనము చేయవలసిన యుపకారమును ఇందనేక విధములుగఁ జెప్పఁబడియున్నది. కవిత్వము ద్రాక్షాపాకమై రసవంతమై యున్నది.

దీని వెల 8 అణాలు. వలయువారు గ్రంథకర్త గారికి వ్రాసుకొనవలయు.

*    *    *    *

3. శ్రీ నందగిరి త్ర్యంబకరావు గారిచే రచియింపఁబడి అనంతపురము జిల్లా ధర్మవరమునందలి 'విజ్ఞానవల్లికా' సంపాదకులగు శీరిపి ఆంజనేయులు గారిచే ప్రకటింపఁబడిన 'మనుష్య కర్తవ్యము' అను చిన్న వచన గ్రంథము ఇది పరమార్థవిషయబోధకమైన వ్యాసము. దీని సారమును గ్రంథకర్తగారు వ్యాసముయొక్క కడపటనిట్లు సంగ్రహించి వ్రాసియున్నారు.

"కాబట్టి మనము తోడిమానవులయెడల భ్రాతృభావమును వహించి యన్యోన్యక్షేమాభివృద్ధికై పాటుబడుచు నెవ్వరిని ద్వేషింపక ఎవ్వరిని వంచింపక ఎవరి కన్యాయముచేయక సత్కాలక్షేపముఁ జేయుచు యుక్తరీతిని విత్తమార్జించి కుటుంబపోషణముఁ గావించుచు లోకసేవయే యీశ్వరసేవయను నమ్మకముతో వర్తించుట యీశ్వరునకు బ్రీతికరము.

"ఈప్రకారము స్వార్థపరత్వమునూని పరోపకార పారాయణత్వమునూని తనకుగల ధనము కాలము శక్తి సర్వస్వము నితరుల క్షేమమునకై వినియోగపఱచుచు నీశ్వరునకుఁ బ్రీతికరముగా మానవుఁడు వర్తింపవలయును.

ఇదియె మనుష్య కర్తవ్యము."

దీని వెల 3 అణాలు. వలయువారు అనంతపురము జిల్లా ధర్మవరములో 'విజ్ఞానవల్లికా' మానేజరుగారికి వ్రాసికొనవలయును.

—:O:—

# Divyagnanadeep

## CIRCULATION 1200.

CONTENTS OF THIS NUMBER.

**Registered No. M. 716.**

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కుడు ధర్మములేదు).

సంపుటము 6. **January 1916.** జనవరి నెల **1916.** సంచిక 10.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక:

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

**January 1916.**

సంపుటము 6. జనవరి నెల 1916. సంచిక 10.

## కాలదేశ వర్తమానములు.

దివ్యజ్ఞానదీపికయొక్క ఆరవసంపుటము ఇఁక రెండు నెలలలో సమాప్తమగును. ఏప్రిల్ నెల సంచిక మాచందాదారుల కందఱికి వి. పి. పోస్టులో పంపఁబడును. అక్కఱలేనివారు ఈసంచిక చేరిన తక్షణము దయచేసి మాకు తెలియపరచవలయునని వేడెదము. ఇపుడు పలుకక ఊరకుండి మేము వి. పి. పంపినపుడు పత్రికను తిరుగఁగొట్టడమువలన మాకు వృథా నష్టముకలుగును. ఈ ధర్మకార్యమునకుఁ బూనుకొని చాలినంత ద్రవ్యోపపత్తి లేక చిక్కుబడుచున్నాము. ఇట్టి మాకు వృథానష్టము కలిగించుట పుణ్యకార్యముగాదు. కడచిన ఏప్రిల్ నెలలో మాకు చాలానష్టముకలిగినది. ఈసంవత్సరము మరల ఆప్రకారము జరుగకుండునట్లు మాచందాదారులందఱు తోడ్పడుదురుగాక!

* * *

దివ్యజ్ఞాన సమాజముయొక్క సాంవత్సరికోత్సవము కడచిన డిసెంబరునెల కడపట బొంబాయినగరమునందు యతి వైభవముతో జరిగెను. సభాధ్యక్షురాలగు శ్రీమతి ఆని బెసంటమ్మగారు అగ్రాసనమును వహించి సభాకార్యములన్నియుం జరిపిరి. నానాదేశములనుండియు ననేకులు సభకు వచ్చియుండిరి.

* * *

హిందూబాలురను ఆర్యధర్మమందును, నవీన విద్యలయందును బాగుగా శిక్షించు నిమిత్తము ఆనీబెసెంటమ్మగారు కాశీక్షేత్రములో సెంట్రల్ హిందూకాలేజి (Central Hindu College) అను నామముతో నొక విద్యాశాలను స్థాపించి బహుకాలముగా జరుపుచున్నారుగదా! దేశవత్సలురగు దర్భంగామహారాజు గారును, పండిత మదనమోహన్ మాలవ్యగారును హైందవుల కనుకూలమగు విశ్వవిద్యాలయమును (University) స్థాపింప నిశ్చయించుకొనినందున విశ్వవిద్యాలయమునకు మూలస్థానముగానుండులాగున సెంట్రల్ హిందూకాలేజును ఆనీబెసెంటమ్మగారు వారికొసగిరి. కడపిన అక్టోబర్ 1 వ తేదీన నావిశ్వవిద్యాలయము నంగీకరించి గవర్నర్‌జనరల్‌గారిచట్ట నిర్మాణ సభలో నొక చట్టమేర్పరచబడినదని తెలియుజేయుటకు చాల సంతసిల్లుచున్నారము. భారతీయుల పురోభివృద్ధికి ఈసర్వకలాశాల సహకారిగానుండుగాక యని ప్రార్థించెదము.

* * *

సంగ్రామమున సామ్రాజ్యముయొక్క విజయముకొరకు తమ ప్రాణములనే బలియిచ్చుచున్న యుద్ధవీరులున్నత జన్మముంధు మరలబుట్టుట సహజమే. ధర్మపక్షమందు వర్తించుచున్న మనప్రభువులను చిరస్థాయిగా నుండునట్లు జేయునిమిత్తము మన దేశమునుండి సైన్యము బోయియున్నదిగదా! దానిలో పని

వారుగానుండు యుద్ధవీరులు మృతినొందిన త్వరగా జన్మమునకు వచ్చెదరని త్రికాలజ్ఞులు జెప్పుచున్నారు. ఇది నిజమైనచో స్వార్థత్యాగ పుణ్యముచే పావనులయిన మృతులకు తగిన దేహములనిచ్చుట గృహస్థుల ధర్మమైయున్నది. ఓ గృహస్థులారా! మీరు సత్సంతానలాభార్థమై జితేంద్రియులై, శ్రద్ధాభక్తులు గలవారై గృహస్థధర్మము నాచరింపుడు. స్త్రీ పురుషులు శాస్త్రోక్తముగా గృహస్థధర్మము నాచరించిన యెడల దేశాభిమానులగు పుత్రులు బుట్టి భారతమాతను సేవ నెత్తురు.

*　*　*

యుద్ధమువలన జనాంగముల యదృష్టములే మారుచున్నవి. నిరంకుశ ప్రభుత్వమాచరణలోనుండిన రష్యాదేశమందు సాంకుశ ప్రభుత్వము గలుగుచున్నది. బెల్జియంవారి దుర్దశ యికను బోలేదు. తురీకీవారి యచాతుర్యము వారి భవిష్యత్తును సూచింపజాలకయున్నది. ఆస్ట్రియా, సర్వియా, మొదలగు దేశముల రాజకీయస్థితి నిలుకడకు త్వరగావచ్చు చిన్నాలు గోచరముగాకయున్నవి. ఘోరతరమగు నీసంగ్రామము వలన ఇంకిమీద నరుల యుద్ధప్రసక్తియే లేకుండ భగవంతుడు జేయదలచియున్నాడని తోచుచున్నది. అన్ని దేశములవారును యుద్ధమువలన గలుగు నష్టములను చక్కగా గ్రహించి సైన్యముల నిమిత్తమై, ఆయుధముల నిమిత్తమై, వ్యయముజేయుచున్న ద్రవ్యమును ప్రజల హితముకొరకు వినియోగపరచుట మంచిదను పాఠమును నేర్చుకొనవలసివచ్చును. అంతవరకు యెన్నిప్రాణములు బలిగావలసియున్నదో, యెన్ని వ్యత్యాసములు జరుగవలసియున్నదో, భగవంతునికే తెలుసునుగాని మనబోటి మానవులూహించజాలము!

ఇట్లు దేశ దేశముల యదృష్టము మారుచుండగా భారతీయులమగు మనము మన మాతృభూమిని మరల నుజ్జీవనము జేయింప యత్నించవలయును. అన్నిదేశములలోపల నిది పుణ్యభూమియైయున్నది. పరమార్థజ్ఞానమునకు దీని నతిక్రమించిన దేశముగాని దీనితో సమానమయిన దేశముగాని భూమండలమందు లేదు. అయితే యిప్పుడు హీనదశలోనున్నది. మాతృవత్సలురగు మనము మన దేశమును మరల పూర్వపు యౌన్నత్యమునకు దీసికొని రావలయును. పూర్వపు ధర్మమును, భక్తి శ్రద్ధలను, తెలివితేటలను, మరల బొందయత్నించుటయే గాక నవీనస్థితివలన గలిగిన యున్నత మార్గములను సహిత మభ్యసింపవలయును. ప్రతివారును వారివారి ధర్మమును శ్రద్ధాభక్తులతో నిర్వహించుచు తాముచేయు సమస్త కార్యములను భగవదర్పణముగా జేసినయెడల భారతమాత యున్నతపీఠమునకు మరల నెక్కుటకు సంశయములేదు.

* * *

బ్రహ్మవిద్య సమస్త మతములకును మూలము. మతములన్నియు వేరువేరు రంగులైయున్నవి. సప్తవర్ణములు సూర్యుని దివ్యకాంతియగు ధావళ్యమువలన బుట్టియున్నవని శాస్త్రజ్ఞులు జెప్పులాగున లోకములోనుండు మతములన్నియును బ్రహ్మవిద్యవలన బుట్టినవి. మూలము నాశ్రయించువారు బ్రహ్మవేత్తలు. వారు సమస్త మతములయందును గలరు. బ్రహ్మవిద్యయే వారిమతము. వేరువేరు మతములయందు జన్మించియున్నను వారి చిత్తవృత్తి మూలస్థాన మందుండునేగాని జన సామాన్యుల కుండులాగున మతమందు దురభిమాన ముండదు.

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

లోకములో లెక్కకుమీరిన మతములుగలవు. సమస్త మతములందును జగదీశ్వరుని చేరుటకు మార్గములు నియమింపబడినవి. ఈశ్వరుడు లేడనుమతము నాస్తికముతప్ప మరేదియు లేదు. అన్నిమతములవారు ఈశ్వరుడున్నాడనియు, ఈశ్వరుని అనుగ్రహమును పొందుటకే జనులందరు ప్రయత్నించుట ముఖ్యధర్మమనియు దృఢముగా చెప్పుచున్నారు. దానికి తగిన మార్గములను సయితము ఏర్పరచినారు. అన్నిమార్గములును శ్లాఘనీయములే. పలనన అన్నియు నీశ్వరుని చేరుటకు ఏర్పడినవి.

ఒకయూరికి అనేకమార్గములుండినను ఒకమార్గము మిక్కిలి సమముగాను, అచ్చటచ్చట మార్గస్థులు దిగుటకు ప్రతిశ్రయములును, (సత్రములు) అన్నోదకములకు వసతులును కలిగి కొనవఱకు అరణ్యములు లేక దుష్టమృగముల భాధయు చోరుల భయమును లేక ఎవరుగాని పోవుటకు సులభముగా నుండవచ్చును. ఇంకొకమార్గము మిట్టపల్లములతోను రాళ్లు ముండ్లతోను కూడి సామాన్యులుపోవుటకు కష్టముగా నుండవచ్చును. మరియొకమార్గము పర్వతములు వనములు దాటవలసినదిగాను దుష్టమృగములయొక్కయు అరణ్యవాసులగు కిరాతకులయొక్కయు బాధకలిగి యుండవచ్చును. భయంకరమైన కఠిన మార్గములలో ధైర్యమును సామర్థ్యమును లేనివారు పోవుటకు సాధ్యపడదు. అప్పుడు ఆమార్గములు దుర్బలులకును, శక్తిహీనులకును అనుపయోగముగా నుండును. ఒకమతమునందే అందరికిని, అనగా శక్తిమంతులకును, అశక్తులకును. భీరులకును, ధీరులకును కుశల బుద్ధిగలవారికిని, మందబుద్ధిగలవారికిని అన్ని తరగతులవారికిని తగిన పద్ధతులేర్పరచబడిన మార్గము హిందూదేశ

మునకుగాను నియమింపబడిన సనాతన మతముతప్ప వేరేదియు లేదని తోచుచున్నది.

ఈశ్వరునిబొందుటకు జితేంద్రియత్వము, భూతదయాపరత్వము, అస్తేయము, భయరాహిత్యము, ద్వంద్వములు ప్రాప్తించినపుడు సమత్వము, మొదలగు సాధనము లత్యంత అవసరములని సర్వమతములవారు చెప్పుచున్నారు.

ఇట్టి సర్వోత్తమములైనట్టియు, అవలంబించుటకు అత్యంత కష్టసాధ్యమైనట్టియు నియమములు అందరు ఆచరించుటకు శక్య మాగి ఆహార నిద్రాభయ మైథునములే పురుషార్థములనియెన్ను చుండు పశుప్రాయులైన జనులకు ఇట్టితీక్ష్ణములైన నియమము లభ్య సించవలెనని బోధించినచో వారి కాబోధపట్టుబడునాగి అట్టివారు వాటినభ్యసించుటకు పూనుమరాగి జగత్తునందు సర్వమును సమముగా లేదనుట అందరి అనుభవసిద్ధము. కొందరు పైనుదాహరించిన తీక్ష్ణనియమము లనుసరించుటకు సమర్థతకలవారును కొందరు అంతకంటె కొంచము సులభమైన పద్ధతు లవలంబించుటకు శక్తిగలవారును మరికొందరు అంతకంటె నశక్తులును ఇంక కొందరు కేవల పశుప్రాయులై ఇంద్రియ మనంబులను కించిత్తైన వశపరచుకొనుటకు సామర్థ్యములేక అవిలాగినట్లంతయు పోవు వారుగా నున్నారు.

జగదీశ్వరుడు బ్రహ్మాండమును తననుండి బయల్వరుచుట బ్రహ్మాండములోనుండు సమస్తభూతములు తనవలె సర్వశక్తిని పొంది తనలో చేరుటకని అనేక ప్రమాణములుకలవు. కాబట్టి ధీరులకును, భీరులకును, శక్తిమంతులకును, అశక్తులకును మరియు సర్వజనులకును పరమగతి ఈశ్వరుడుతప్ప వేరెవరును లేరు. ఈశ్వరునిపొందుటకు పైనుదాహరించి అతితీక్ష్ణములైన నియమములు ఆచరించు సమర్థతయుండినగాని పొందుట కలవికాదనే సిద్ధాంతము.

అట్లైనపుడు అసమర్థుల గతి యేమని శంకకలుగు చున్నది.

ఒకదేశమందుండు జనులందరిని సకలకళాప్రవీణులుగా చేయదలచినరాజు గొప్పశాస్త్ర పాఠశాలను నియమించి దానిలో ఓనమాలు నేర్చుకొనువారు మొదలు బ్రహ్మవిద్యాభ్యాసము చేయువారివరకునుండు తారతమ్యయోగ్యతగల విద్యార్థులకు వేర్వేరు తరగతు లేర్పరచి తదనుగుణ్యములగు పాఠములను, ఆయాపాఠములు గరపుటకు తగిన పండితులును నియమించి తుదకు సమస్త తరగతుల బాలురను పరిపూర్ణ ప్రజ్ఞగలవారినిగా నెట్లుచేయునో అట్లనే బ్రహ్మాండమను పాఠశాలలోనుండు సమస్త తరగతులగు ప్రాణులను ఈశ్వరుని చేరుటకు తగినట్లు సర్వశక్తిమంతులుగా చేయుటకు యోగ్యతా తారతమ్యముల ననుసరించి ఆచరించి అభివృద్ధియగుటకు తగినట్లు వేర్వేరు పద్ధతులను బ్రహ్మవేత్త లేర్పరచినారు. ఈపద్ధతులు మార్గానుగుణ్యముగా నున్నవి.

ఆమార్గము లేవనిన:—

1 ప్రవృత్తిమార్గము; 2 నివృత్తిమార్గము.

ప్రవృత్తిమార్గమునకు కృష్ణగతియనియు, పితృయానమనియు, ధూమాదిమార్గమనియు, నివృత్తిమార్గమునకు శుక్లగతియనియు, దేవయానమనియు, అర్చిరాదిమార్గమనియు నామాంతరములుగలవు. ఈరెండుమార్గములును శాశ్వతములైనవి. సమస్తులును ఈరెండు మార్గముల ననుసరించే పోవలెను.

శ్లో॥ శుక్లకృష్ణగతీహ్యేతే జగతశ్శాశ్వతేమతే
ఏకయాయాత్యనావృత్తి మన్యయావర్తతేపునః॥

(భగవద్గీత అధ్యాయము 8, శ్లోకము 26.)

శుక్లగతి కృష్ణగతులనెడు రెండుగతులు జగత్తునందు శాశ్వతములైనవి. శుక్లగతి జన్మరాహిత్యమునకును, కృష్ణగతి

జన్మము లెత్తుటకును కారణములని తాత్పర్యము.

రెండుగతు లేర్పడుటకు కారణమేమన:—

బ్రహ్మాండమను పాఠశాలలోనుండు రెండువస్తువులను గురించి నేర్చుకొనుటకు రెండుమార్గము లేర్పడినవి. జగత్తు నందంతయు రెండువస్తువులుతప్ప ఎక్కువ లేవు. గనుక రెంటిలో నొక్కొక్క వస్తువును తెలియుటకు ఒక్కొక్క మార్గమేర్పడిన ది. ఆవస్తువు లేవన:—

అనాత్మవస్తువొకటి, ఆత్మవస్తువొకటి. అనాత్మవస్తువును తెలియవలసిన మార్గము ప్రవృత్తిమార్గము. ఆత్మవస్తువును నేర్వదగినమార్గము నివృత్తిమార్గము. ప్రవృత్తిమార్గము ననుసరించి అనాత్మవస్తువును గురించి తెలియుటకుగాను పర్పర చిన విద్యకు అపరావిద్యయని పేరు. నివృత్తిమార్గము నవలంబించి ఆత్మవిద్యను నేర్వవలసిన విద్యను పరావిద్యయనుదురు. ఈశ్వరుని పొందవలసియుంటే ఈ రెండువిద్యలను నేర్చితీరవలెను.

"ద్వేవిద్యే వేదితవ్యే ఇతిహాస్మయద్బ్రహ్మావిదోవదంతి
పరాచై వాపరాచ"

పరాపర విద్యలు రెండును నేర్వదగినవని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారని మాండూక్యోపనిషత్తునందు చెప్పబడినది.

అనాత్మవస్తువుయొక్క సారమంతయు పూర్తిగ తెలియక ఆత్మవిద్య నభ్యసించుటకు వీలులేదు. అనాత్మవస్తువుయొక్క సారము తెలియుట అనగా అనాత్మనిస్సారమని దృఢముగా అనుభవముచే గ్రహించుటతప్ప వేరు కాదు. దృశ్యమగు సమస్తమును అనాత్మయే. భూలోకసంబంధమైన వస్తువులుగాక భువర్లోక సువర్లోక సంబంధమైనవి సయితము అనాత్మవస్తువునకు చేరినవే గనుక భూలోక భువర్లోక సువర్లోకములన్నియు నిస్సారములని తెలియువరకు ఆత్మవిద్య విచారమునకు పాత్రతరాజాలదు. కలాపాఠశాలలో చేరుటకు మెట్రిక్యులేషన్ పరిక్ష ప్యాస్ చేయుట

యెట్లు అవశ్యకమో అట్లనే ఆత్మవిద్య నేర్చు తరగతికి రావలసి యుంటే అనాత్మవిద్యలో ప్యాసుకావలెను.

అనాత్మవిద్య (అపరావిద్య)లో కడతేరవలసియుంటే లెక్కకుమీరిన జన్మములు కావలెను. గనుక ఈవిద్య నేర్చు మార్గమునకు ప్రవృత్తిమార్గమని పేరిడబడినది. ఈమార్గముం డుండి అపరావిద్యను నేర్వదగినవారు ఒకతరగతివారు కాక అనేకతరగతులవారై పలుతెరంగుల యోగ్యతా తారతమ్యముల ననుసరించి విద్యను నేర్పబడుచుండెను.

శ్లో॥ క్షుద్రాస్త్రిషష్టివిద్యాస్స్యుః నశ్వరంతత్ఫలంభవేత్
చతుష్షష్టితమీబ్రహ్మవిద్యా త్వమృతదాయినీ॥

అని సనత్కుమార సంహితయందు చెప్పబడినది.

జీవికవిద్యలగు చెప్పులుకుట్టు విద్యమొదలుకొని స్వర్గభోగములనుపొందు యజ్ఞాది విద్యలవరకు తారతమ్యానుసారముగ వానిఫలములు నశ్వరములు (నశించునవి) గనుక వాటికి క్షుద్ర విద్యలనియు అపరావిద్యయనియు నామమిడబడినది.

"తత్రాపరాఋగ్వేదో యజుర్వేదఃసామవేదోఽ
థర్వవేదోశిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో
జ్యోతిషమితి"

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము ఇవన్నియు అపరావిద్యలు అని ముండకోపనిషత్తునందు చెప్పబడినది.

మరియు నదేయుపనిషత్తునందు:—

"ప్లవాహ్యేతేఅదృఢాయజ్ఞరూపా
అష్టాదశోక్తమవరంపముకర్మ"

యజ్ఞరూపములగు కర్మలు శ్రేష్ఠములైనవి కావు; వీని ఫలములశాశ్వతములైనవని ముఖ్యతాత్పర్యము.

ముల్లోకములలోనుండు అశాశ్వత సుఖవిషయములందు కామములు పూర్తిగనుడుగువరకు అమృతత్వమునిచ్చు ఆత్మవిద్య నభ్యసించుటకు అర్హతరాదని యింతకుముందే చెప్పబడినది. కాబట్టి ప్రవృత్తిమార్గము మొదట ఆచరించవలెను. నివృత్తి మార్గము తదనంతర మాచరించవలెను గనుక ప్రవృత్తిమార్గ విద్యకు పూర్వమీమాంసయనియు నివృత్తిమార్గవిద్యకు ఉత్తర మీమాంసయనియు చెప్పుదురు.

ఇచ్చట దేనికి పూర్వము దేనికి ఉత్తరమని శంకకలుగు చున్నది.

శ్లో॥ చిత్తస్యశుద్ధయేకర్మ నచవస్తూపలబ్ధయె
వస్తుసిద్ధిర్విచార్యేణ నకించితర్కకోటిభిః॥

చిత్తశుద్ధికలుగుటకు కర్మపర్పడినదిగాని పరవస్తువును పొందుటకు కాదు. ఆవస్తుసిద్ధి బ్రహ్మవిచారమువలననే కలుగును కాని కోటికర్మములు చేసినను కలుగదని వివేకచూడామణియందు చెప్పబడినది.

చిత్తశుద్ధియనగనేమి?

శ్లో॥ మనోపింద్వివిధంప్రోక్తం శుద్ధంచాశుద్ధమేవచ
అశుద్ధంకామసంకల్పం శుద్ధంకామవివర్జితం॥

మనసు అనగా చిత్తము శుద్ధమని యశుద్ధమని రెండువిధ ములు. కామసంకల్పములుండు మనసు అశుద్ధము, కామము లులేని మనసు శుద్ధము, అనితాత్పర్యము.

అనంతకోటి కామములుపుట్టుచుండు మనసునందే కామము ను పుట్టకుండువరకు, క్రమక్రమముగా వాటిని తగ్గించుటకుగాను చేయుకర్మలు ప్రవృత్తిమార్గమందు చెప్పబడుచున్నది.

అనగా చిత్తశుద్ధికలుగువరకు ప్రవృత్తిమార్గము, లేక పూర్వమీమాంసావలంబించిన చిత్తశుద్ధికి ఆవల నివృత్తిమార్గము ఉత్తరమీమాంసావలంబనమని తాత్పర్యము. చిత్తశుద్ధియే

పూర్వోత్తర మీమాంసల మేర, హద్దు.

ఇదే అర్థమే భగవద్గీతయందును చెప్పబడినది.

శ్లో॥ ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణముచ్యతే
యోగారూఢస్యతస్యైవ శమః కారణముచ్యతే॥

ఆరురుక్షువైన మునికి కర్మచేయుటే కారణము. వాడే యోగారూఢుడు కాగా శమాదులు కారణముగా నుంటున్నది.

యోగారూఢుడెవడన:—

శ్లో॥ యదాహి నేంద్రియార్థేషు నకర్మస్వనుషజ్జతే
సర్వసంకల్పసన్యాసీ యోగారూఢస్తదోచ్యతే॥

ఇంద్రియార్థములనగా ముల్లోకవిషయము లనుభవించుటకుగాని ఏలాటిసంకల్ప మంకురమెత్తక నశించిపోవుచున్నదో అప్పుడు యోగారూఢడనబడును.

ఇట్టి సంకల్పరాహిత్యమైన నిర్మలచిత్తము, అత్యంత సంకల్పానంతమలమునుండి పరిశుద్ధమెట్లు ప్రవృత్తిమార్గమునుండి అనగా కర్మమార్గమునుండి పొందువిధము తరువాత సంచికలందు వ్రాయబడును. అనంతరము నివృత్తిమార్గమును గురించి విచారించబడును.

జం. శ్రీనివాసరావు.
(సశేషము).

—:0:—

శ్లో॥ కర్ణస్త్వచం శిబిర్మాంసం జీవంజీమూతవాహనః
దదౌదధీచి రస్థీని నాస్త్యదేయంమహాత్మనాం॥

తా॥ కర్ణుడు తన శరీరముయొక్క చర్మమును (కవచము) శిబిచక్రవర్తి తన శరీర మాంసమును, ఇంద్రుడు జలమును, దధీచిమహాముని ఎముకలను ఇటుల దానమిచ్చిరి కావున, గొప్పవారికి ఈరాని పదార్థమేదికలదు; అనగా ఏదియును లేదనుట.

-:0:-

# అహింస.

మానవకోటి యాచరించవలసిన ధర్మములలో అహింస ప్రథమ ధర్మమై యున్నది. అహింస యనగా ఏజీవజంతువును గాని హింసింపకుండుట. హింస యనగా బాధగలుగ జేయుట. కాబట్టి యేప్రాణిని జంపకుండుటయెగాక బాధయైన కలుగజేయకుండుట అహింసయనఁబడును. అందుచే నితరులను దిట్టకూడదు. వారి మనస్సునకు నొప్పిగలుగ జేయగూడదు. ఇతరులను దూషించకూడదు. వారిని గురించి దూష్యముగా మాట్లాడగూడదు. దానివలన వారిమీద మనకు ద్వేషము గలుగుటయెగాక మన మనస్సునందు చెడుతలంపుల కవకాశమేర్పడును. కాబట్టి వృథాప్రసంగమును వర్జింపవలయును.

ఉపాధ్యాయులు బాలురు పాఠము చదువనియెడల వారు చక్కగా చదువవలయునను సదుద్దేశముతో శిక్షించును. ఇది కూడ హింసయే. దానికితగిన ఫలమాయన కాలాంతరమున ననుభవింపగలడు. అట్లైన బాలురు చదువనియెడల వారిని శిక్షింపక మఱియేమి చేయవలయునని యడుగవచ్చును. వారిని మంచిమాటలచే బుజ్జగించి చదువునట్లు చేయవలయును. ఇంతియెగాని వారిని జంతువులను బాదినట్లు బెత్తము తీసుకొని కొట్టరాదు. కొట్టుటకు బదులు బోధచేయవలయును. ఉపాధ్యాయునియెడ బాలురకు ప్రేమకలుగునట్లు చేయవలయునుగాని ఉపాధ్యాయుని జూచిన బాలురకు భయము గలుగకూడదు.

వినోదార్థమై కొందఱు గొప్పవారలు మృగములను వేటాడుచున్నారు. ఇది హింసకాదా! వేటాడువారికి వినోదమైనయెడ వేటాడబడు జంతువులకుగూడ వినోదమా! వనమందు సెలయేరుల నీటిని పానముచేయుచు స్వేచ్ఛగా విహరించు జంతువులను హింసించుటవలన మనుష్యులకు ప్రయోజనమేమి?

ప్రాణములు మనకెంత తీపియో వానికిని నంత తీపియో గదా. ప్రాణములుగల జంతువులను వేటాడుట వినోదమట! మనకంటె బలముగలవారు మనలను వేటాడునపుడు మనమన స్సెట్ట్రు ప్రకారముండునో అటులనే ఆజంతువులకుగూడ నుండునని మన మూహించుటకు శక్తిలేనివారమా? ఈశ్వరుడు మనలకు బుద్ధి నిచ్చినది కారణమిదియేనా? సోదరులారా! యూహింపుడు.

పూర్వమం దనేకమంది రాజులు వేటాడిరని మనపురాణములలో జెప్పియున్నది. అందుచే నీకాలమందలి ప్రజలు కూడ పలవేటాడగూడదని ప్రశ్నచేయవచ్చును. ఆకాలమందలి రాజులు తమ ప్రజలను బాధించు మృగములను జంపుటకై వేటకు వెళ్లుచుండిరిగాని వినోదార్థమై యెన్నడును పోలేదు. రాజులకు తమ ప్రజలను రక్షించుట ప్రథమ కర్తవ్యము. అందుచే వారు వేటసల్పుచుండిరి. దుష్యంతుడు, హరిశ్చంద్రుడు, నలమహారాజు, ధర్మరాజు మొదలైనరాజుల చరిత్రములను పరిశీలించినయెడల నీసంగతి స్పష్టముకాగలదు.

ఇంతియెగాక వినోదార్థమై పావురములను, రామచిలుకలను పంజరములయందుంచి పెంచుచుండుటను మనము వీక్షించుచున్నాముగదా. ఇదిమాత్రము హింసకాదా? వానిఘోష పెంచువారలకు తగులకుండునా? స్వేచ్ఛగా విహరించు పక్షులనుదెచ్చి పంజరములయందేల బంధనచేయవలయును? అందుచే మనకు లాభమేమి? లాభము కలుగక పోవుటయె గాక ధనము వ్రయమగునుగదా. ఎవరైన మనలను తీసుకొని పోయి చెఱసాలయందుంచినయెడల మనమనస్సేతీరుగానుండి మనలను బంధించినవారిని ప్రతినిమిషమెట్లు దూషింతుమో ఆప్రకారముననే చెఱసాలయగు పంజరములలో నుంచిన పక్షులుగూడ మనలను దూషించునని తెలుసుకొనజాలరా? పూర్వమందు రామదాసు గొప్ప హరిభక్తుడైనను తాను పూర్వజన్మమందు

కాను చిలుకను పెంచినందుకై చెఱసాలయందుంచబడిన విషయ ము మనకు విశదమేగదా. అగస్త్యమహర్షి మహాతపస్సం పన్నుడైనను తాను బాల్యము దజ్ఞానముచే తుమ్మెద రెక్కలనూ విరికినందుకై గట్టికొయ్యయందు దిగవేయబడలేదా? మృగమున యెంచి బ్రాహ్మణ కుమారుని బాణముచే కొట్టినందుకై దశరథుడు పుత్రశోక మనుభవింపలేదా? కాబట్టి తెలియక యేహింస నొనర్చినను దాని తప్పక ఫలముకలుగును. హింసయే యొనర్పవలె దానికి ఫలమేల యనుభవింపవలె!

మాంసాహారమందు ప్రీతిగలవారును అలవాటుగలవారు ను తాము మాంసమును భుజింపనియెడల జీవింపజాలమనియు కావున దానిని వదలజాలమనియు వక్కాణించుచున్నారు. తమ కోరికను నెరవేర్చుటకై జంతువులను హింసించుట పాపము కాదా! మాంసముతప్ప భుజించుటకు తగిన పదార్థములు లేవా! మాంసము తినుటవలన లాభమేమి? ఎక్కువ బలముగా నుం దురనియా? మాంసము తిననివారు బలముగా నుండుటలేదా? మాంసమన మేమి? చంపిన జంతువుయొక్క శరీరములోని కండగదా! మృగము మరణింపగా నేమగుచున్నది? శరీరము నుండి ప్రాణము లేచిపోవుచున్నది. ఆసమయమందు దుర్గం ధములు కలిగిన వాయువులన్నియు దానిలోచేరును. అప్పుడు దుర్గంధము వచ్చును. చూచుట కసహ్యముగా నుండును. ఇంతియెగాక యామృగమునకేగుణమెక్కువగా గలదో యాగు ణముదానిని భుజించు మనుజునియందు ప్రవేశించుచున్నది. దాని వలన మనుజునకు తనకు స్వభావికముగానున్న దుర్గుణములేగాక కొత్తదుర్గుణములుకూడా అతనిలో ప్రవేశించుట కవకాశము కలుగుచున్నది. ఈకారణములచే మాంసాహారము వర్జనీయము.

అమ్మవారి పండుగులయందెన్ని జంతువులు తెగుచున్నవి? అమ్మవారికి మాంసమందెక్కువ ప్రీతియా? అమ్మవారు మనలను

సృజించిన దేవతయని కొందరియభిప్రాయము. అటులైన మనలను సృజించినదేవత గొఱ్ఱెలను సృజింపలేదా? తల్లి తానుగనినపిల్లలను చంపుచుండచూచి సంతోషించునా? ఆప్రకారమే తాను సృజించిన గొఱ్ఱెలను తనముందర నరకమని ప్రజలకు అమ్మవారువచ్చి చెప్పునా? ఏమి యజ్ఞానము! ఒక్కనిమిషములో నెన్నివేల ప్రాణములు పోవుచున్నవి! ఎంత విచారకరమైన విషయము! అమ్మవారి యాహారమునకై గొఱ్ఱెలను నరుకుచున్నారుగదా. అమ్మవారు భుజింపుచున్నదా? లేదు. నరికినవారు పొట్టవిచ్చునట్లు పానముచేసి కడుపునిండునట్లు మెక్కుచున్నారు. ఇంతియెగదా! అమ్మవారు తనయెదుట గొఱ్ఱెలను నరికినందుకై సంతసించి మనజుల కైశ్వర్యము లిచ్చుచున్నదా? కష్టపడి పెంచి పెద్దదానినిజేసి చివరకు దేవాలయమెదుట యొక్కనిమిషములో దానిప్రాణమును బలవంతముగా దీసి భుజించి మనుష్యులు సంతసించుచున్నారు గదా! పండుగదినమున జంతువులకు పసుపురాచి వేపాకుమండలను గట్టి వాయిద్యములతో గుడిదగ్గరకు తీసుకొనిపోవు సమయమందాజీవజంతువుల ముఖారవింద మొకసారి వీక్షింపుడు. ఆ జంతువు తనను బలియిచ్చుటకు తీసుకొనిపోవుచున్నారని తెలుసుకొనును. అప్పుడు విచారకరమైన ముఖముతో తలవంచుకొని, కన్నులనుండి నీరుగార, ఇటునటు పరుగెత్తుచు, నన్నెవరైన విడిపించుటకు వచ్చెదరాయని దారినడుచు మనుజుల వైపుజూచుచు, అరచుచు, తిరిగి యింటివైపు చూచుచు, దానిమెడయందు త్రాడువేసి యీడ్చువాడొకప్రక్క లాగుచుండ యదిమరియొక వైపునకు లాగుచు నీప్రకారము బలిస్థానమును సమీపించుచున్నది. ఆహా! ఆసమయమందు దానినిజూచిన కరుణగలిగిన ప్రతిమనుజునకును నేత్రములనుండి నీరుగారక మానునా? అట్టి వంటి జీవజంతువులను నిష్కారణముగా బలియిచ్చుట మనుజులకు

ధర్మమా? అప్పువారు మనలోనుండు మదమును చంపమని జెప్పినదిగాని మదముగల జంతువులను తెచ్చి చంపమని యెన్న టికిని చెప్పను. దీనిని తెలుసుకొనజాలక మదముగల జంతువులను జంపుచున్నారు. అహింసయె ప్రథమధర్మముగాగల యికాలమందలి బ్రాహ్మణులుగూడ వాటిని మాన్పుటకుమారుగ జూచి వినోదించుచున్నారు. అటువంటివారు నిజమైన బ్రాహ్మణులా? ఎంతచదివిన పండితుడైననేమి? ఇతరులకు బోధింపనియెడలను, తాను చక్కగా ప్రవర్తింపనియెడలను తాను సంపాదించిన విద్యయంతయు బూడిదలోఁ వేల్చిన నేయిగదా! కాబట్టి సోదరులారా! మనదేశమందును, సంఘమందును, గలిగిన దురభ్యాసములను పోగొట్టుటకు ప్రయత్నించి మనమాతృభూమియగు భరతఖండమును పూర్వపు ఔన్నత్యమునకు తెచ్చుటకు పాటుపడుదము.

ముదునూరు శ్రీరంగయ్య.

—·—:0:———

శ్లో॥ నభక్షయతియోమాంసం విధింహిత్వాపిశాచవత్
సలోకేప్రియతాంయాంతి వ్యాధిభిశ్చనపీడ్యతే॥

తా॥ ఎవ్వడు దయ్యమువలె మాంసభక్షణము చేయకుండునో (అనగా పిడనాడునో) వాడు లోకములో అందరికిని మిత్రుడును, రోగములేనివాడునునై యుండును.

శ్లో॥ మాంసంనజాయతేభూమ్యాం నవృక్షేనచపర్వతే
జీవఘాతసముత్పన్నం హేయంమాంసంవ్రతార్థిభిః

తా॥ మాంసము భూమియందును, వృక్షములయందును, పర్వతములయందును పుట్టదు, అదిప్రాణులను చంపుటవలననే కలుగుచున్నది. కాబట్టి సదాచారపరులు మాంసమును వర్జింపవలయును.

# త్రిమూర్తులు.

అవాఙ్మానస గోచరమగు పరబ్రహ్మ తత్త్వమునుండి మొట్ట మొదట సర్వజ్ఞుడును, సర్వశక్తుడునయిన మహామూర్తి యొకడు అంధకారమయమైన స్థూలమందు ఒక తేజోరాశివలె నుత్పత్తియగును. మఱియు దానితోనే సమస్త పదార్థములకును మూలమగు మూలప్రకృతి సయితము పుట్టును. ఒక చింత విత్తును నాటిన చో మొట్టమొదట దానినుండి రెండు ఆకులు ఏకకాలమందు ఎట్లుపుట్టునో అట్లే, పరబ్రహ్మమునుండి ఈశ్వరుడును మూలప్రకృతియు బుట్టును. ఈశ్వరునికి సగుణ బ్రహ్మయనియు పేరు గలదు. ఈ యీశ్వరునుండి బ్రహ్మ విష్ణు రుద్రులనెడు త్రిమూర్తులును, మూలప్రకృతినుండి సత్త్వము, రజస్సు, తమస్సనను మూడు గుణములును, వ్యక్తమగుచున్నవి. ఈమూర్తులు పరమేశ్వరుని అవస్థాభేదములని దెలియవలెను. ఆత్రిమూర్తులు ఒకరికొకరు భిన్నులుకారు. కర్తవ్య విశేషములకొఱకు వేరువేరు చైతన్యయుక్తములై వేరువేరు రూపములతో దృశ్యులగు ఈశ్వరుని రూపములు. వీరొక్కొక్కరు పరమేశ్వరుని ఒక్కొక్క శక్తిని ప్రదర్శించెదరు. లౌకిక నిదర్శనమొకటి దీనిని స్పష్టపఱచును. ఒక జిల్లా అధికారి కలెక్టరను పేరిట రెవిన్యూ అధికారమును, డిస్ట్రిక్టు మ్యాజిస్ట్రేటు అను పేరువహించి శిక్షాధికారమును, లోకల్ బోర్డు ప్రెసిడెంటను పేరుతో గ్రామముయొక్క ఆరోగ్యస్థితి నిర్వాహమును జరుపుచున్నాడు. మనుష్యుడు ఒకడే అయినను చేసెడుపనుల భేదమువలన వేరువేరు పేర్లతో బరగును. ఒకడు నాటకమందు వేషమువేయునెడల ఒకప్పుడు హరిశ్చంద్రుడను పేరిట రాజువేషముదాల్చి రాజువలె అభినయించును. మఱియొకతూరి వసిష్ఠుడని ఋషివలె నటించును. ఇంకొకప్పుడు వ్యాపారిగను, 'చెంబడివానివలెను తలారిగను

నటించుచును. ధరించెడు వస్త్రములు జరిగించెడు చర్యలు వీని భేదముచే రాజు, పురోహితుడు, వర్తకుడు, తలారి, చెంబడి వాడు అనిపించుకొనునేగాని మనుష్యుడేమో ఒకడేగదా. ఈ త్రిమూర్తులకర్తవ్యమేమనగ:—బ్రహ్మ, మూలప్రకృతిని ఆధార ముచేసుకొని ఆకాశము మొదలుపృథివి వరకుగల పంచతత్వము లను సృజించును. అంతేగాక ఈబ్రహ్మాండమందు ఇకముందర బుట్టబోవు దేవతలు, మానవులు, ప్రాణివర్గములు, సస్యాదులు, ఖనిజవర్గములు వీని ఆకారమును సయితము ఏర్పరచుచున్నాడు. స్థూల ప్రపంచమందు ప్రస్తుతపు రసాయన శాస్త్రవేత్తలు మూల వస్తువులని చెప్పెడు వస్తుజాలములను సృష్టి చేయు చున్నాడు. ఈపనులయందు బ్రహ్మదేవుఁడు అనేక మహార్షులవల నను దేవతలనుండియు వారిక్రింది భూతగణములనుండియు సహా యమును పొందుచున్నాడు. విష్ణువు ఈపరమాణవులను ఆకర్షణ శక్తితో వానిని విప్పక ఆపియున్నాడు. వస్తువులు ఒకటినొకటి ఆకర్షించునట్లు వానికి ప్రీతియను దైవశక్తిని ఇచ్చుచున్నాడు. ప్రీతికి వీడుమూలస్థానము. ప్రపంచము సమస్తప్రాణులు సహా ఇతనికళవలననే నిలిచియున్నవి.

వీనికి అనేక ఋషులు దేవతలు మఱియు భూతగణములు సహాయకులుగ నున్నారు.

సృష్టిముగింపు కాగానే బ్రహ్మయొక్క కార్యము ముగిసినది.

విష్ణువేమో, తనపనులను చేయుచునేయున్నాడు. ప్రళ యకాలమువరకు చేయుచునే యుండవలెను.

లోకపాలనము వీనికి కర్తవ్యము. లోకముయొక్క ధర్మము నిలిచియుండునట్లు చూచుకొనుట వీనిపని. గనుక ధర్మము నకు లోపము కలుగునపుడెల్లను విష్ణువు అవతరించి సద్ధర్మస్థాపన మును చేయుచున్నాడు.

రుద్రుని కర్తవ్యములను దెలియవలసినచో ప్రాణులకుండు నట్టి దేహములు వేరనియు వానిని ధరింపదగిన చేతన వ్యక్తులు వేరనియు దెలియవలయును. ఈ దేహములు సిద్ధమైనపుడు వానికిని ఈ చేతనవ్యక్తులకును సంబంధమును కలుగజేయుట ఆచేతనవ్యక్తికి ఆదేహమునుండి ప్రయోజనముతప్పి కీడుకలుగు వేళయందు వానికుండెడు సంబంధమును తప్పించుటయు వీనికర్తవ్యములు. సమస్త ప్రాణులకు మరణము సంభవించుట వీనిశక్తిచేతనే సుమా. మరణమనగ శరీరమునకును అందులో నివసించు చైతన్యమునకును సంబంధము వదలిపోవుట. మనుష్యులకు మోక్షము వీనికృపచే కలుగును. మోక్షమనగ సంసారనివృత్తి. మరణమునందు ఒకసారి దేహమును విడిచినను మనఅజ్ఞానముచే పునర్జన్మములు తరుచుగ కలుగుచుండును. స్థూలప్రపంచమునకును 'నేను' అను చేతనవృత్తికిని సంబంధము కొంతకాలము తప్పెనుగాని పూర్ణముగా తప్పలేదు. పూర్ణముగ తప్పుటయనగ మనకు పునర్జన్మము లేకుండునట్లు గావలసినచో రుద్రునిచే ప్రాప్తమగు జ్ఞానమనెడు చైతన్యకళచేతతప్ప తక్కిన ఏయుపాయముచేతను కానేరదు. గనుక వీనిని మోక్షదాయకుడని యోగులు పూజింతురు, వీనికళచేత ప్రాణికోటికి నేను అను అహంభావము కలుగుచున్నది. ఈత్రిమూర్తులుగాక మఱి ఏడు అంశములు యీశ్వరునికి గలవు. ఈయంశములకు గ్రహపతులు అనియు, సప్తఋషులనియు దేవరాజులనియు పేర్లు. వీరు వేరువేరు వ్యక్తులుగనున్నను వానిఅంశములే. మన స్థూలదేహమును ఉపమానముగ దీసికొనినచో త్రిమూర్తులు మెదడు, హృదయము, శ్వాసకోశములవలె నున్నారు. సప్తఋషులు మనదేహమందుండు చక్రస్థానములవలెనున్నారు. వీరిచేతిక్రింద అనేక దేవగణములు బనిచేయుచున్నారు. ఈదేవతలలో కొందు

రు దేహనిర్మాణపు బనియును మఱికొందరు జీవుల వికాసపు పనియును చేయుచున్నారు. ఈ భూలోకమందు పరమేశ్వరునికి ప్రతినిధియగు మహాపురుషుడొకడుగలడు. భూలోకమందుండు సమస్తజీవుల యభ్యుదయము వానియధికారమునకు లోబడియున్నది. జగత్తునకు ఆయన నిజమైనరాజు. వానిచేతిక్రింద వేరువేరురీతిగ పనులను జేసెడు మంత్రివర్గమునకు చేరిన ఇతరమహాత్ములుకూడ ఉన్నారు. వీరిలో స్థూలదేహముయొక్క ఆకారమును, స్థూలప్రపంచపు రాజకీయ సాంఘిక, పనులను నియమించు మహాపురుషుడొకడు గలడు. ఆయనకు మనువని పేరు.

ఆయా కాలదేశములకు దగినట్లు మతమును విద్యాభ్యాస క్రమములను పర్వరచెడు మరియొక మహాత్ముడు గలడు. ఇతనికి జగద్గురువనిపేరు. జగత్తుయొక్క పనులను తన ప్రతినిధులద్వారా ఈశ్వరుడు నడుపుచున్నాడు. జ్ఞానులును సర్వశక్తులునగు మహాత్ములచేత ప్రపంచ వ్యాపారములు జరుపబడును.

ఇది సత్పురుషుల అధికారమునకు లోబడినదిగాని అనాయకము కాదు. జనాంగముల హానివృద్ధులు, దేశముల కష్టసుఖములు, సముద్రముచే భూమిమునిగిబోవుట, సముద్రమునందుండి భూమిలేచుట, భూకంపములు, అగ్నిపర్వతజ్వాలా ముఖుల అల్లరులు, ఘోరమైనత్రావాడంబరములు, యుద్ధములు ఇవియన్నియు భూలోకమునకు కర్తయగు మహాపురుషుని యాజ్ఞానుసారమే జరుగుచున్నవి. ఇవన్నియు దేశోన్నతికిగాను అతడువినియోగించుచున్నాడు.

ప్రపంచమునందు జరుపబడుచున్నదంతయు ఈశ్వరుని సంకల్పములే సుమా.

వై. కృష్ణమూర్తి.

# సత్కర్మ రత్నావళి.

(344-వ పుట శేషము.)

యజ్ఞాది వేదోక్త కర్మంబుల ననుష్ఠించుట కుపయుక్తములైన ద్రవ్యసంపదలు సత్త్వగుణాంశముచేత గలుగుచున్నవి. తక్కినవి రజస్తమో గుణములచేతఁ బుట్టుచున్నవి. అట్టి శాస్త్రనిషిద్ధ ద్రవ్యములు గ్రహింపఁ దగినవి గావు. రాజస తామస పదార్థముల స్వరూపమును పణ్డితు లెఱుంగుదురు. శ్రీభగవంతుని ఉద్దేశించి చేయు కర్మములయందు అట్టి పదార్థములు ఉపయుక్తములుగావు. వాటిని భుజించు వాఁడు సాత్త్వికుఁడుగాఁడు. రజస్తమోగుణములు గలవాఁడు "సాత్త్వికులకు గమ్యుండై" హృదయ పుండరీకమందుండు భగవంతుని దెలిసికొనఁజాలఁడు. రాజస తామస పదార్థములను భుజించినవాఁడు ఆయారూపము నొంది ఆయాకర్మములను జేయును. అట్లే, సాత్త్వికాహారముఁ గొనినవాఁడు ఆరూపమును నొంది సాత్త్విక కార్యములను జేయును. కావున ఎల్లప్పుడును సాత్త్వికాహారములనే గొనవలెను. స్వభావముగాఁ బరిశుద్ధమైన వస్తువేదో యది సాత్త్విక గుణము గలదియగును.

2. మేచ్ఛులు, పాషండులు, జీవహింసఁ జేయువారు మొదలుగాగల దురాచార ప్రవర్తకులు లేక

**దేశశుద్ధి.** సత్పురుషులచే వసింపఁబడినదై గఙ్గలోనగు దివ్యనదులలోనుండు నిర్మలోదకముచేఁ బరిశుద్ధమైన ప్రదేశమెద్దియో యది సాధువులకు సమ్మతమైనదనియు, మోక్షభూమియనియుఁ జెప్పఁబడును. ఫలవృక్షంబులును పుష్పప్రధాన వృక్షంబులును తఱుచుగా గలదియై సర్వసమృద్ధిగలచోటు పరిశుద్ధమైనది.

3. భగవన్మన్త్రమును జపించునపుడు అయోగ్యులు సమీ

పమున నున్నయెడల విఘ్నమునుఁ జేయుదు

క్రియాశుద్ధి.

రు; కావున వారుచూడకుండ జపింపవలయును.

కపటము, అత్యాశయము, లేకుండ నతిశ్రద్ధతో జపింపవలయును. గర్వము లేశమైననుఁ గూడదు. సంకల్ప పూర్వకముగా "సంకల్పపూర్వకంధ్యేయ పదాబ్జన్యాసయోగిచ" అను వాక్యరీతిని భగవత్పాదారవిన్దములయందు మనస్సును నిలుపవలయును. శాస్త్రనిషిద్ధములైన విషయభోగములయందాశను విడిచి భక్తి, జ్ఞాన, వైరాగ్యములు గలిగి యుండవలయును. ఇట్టి లక్షణములుగల మన్త్రజపానుష్ఠానాది కర్మమే శ్రేయస్కరమగు ననుష్ఠేయ కర్మము. మఱియును, నిత్యము భగవద్భక్తుల నతిభక్తితో పూజించవలయును. భగవంతుని సేవించెడువారికి ఫలముగలుగునో లేదోయను సందేహముండునుగాని భక్తులను సేవించుట యందాశగలవారికి అట్టి సంశయముండదు. భక్తజన పాదసేవకులకు మనస్సు మిక్కిలి పరిశుద్ధమై యుండును. ఇందుకు ప్రమాణంబు:—

శ్లో॥ తోషఃచేత్పరయాభక్త్యా నిత్యంభాగవతాన్నరాః
సిద్ధిర్భవతివానేతి సంశయోచ్యుతసేవినామ్॥
నసంశయోస్తితద్భక్త పరిచర్యారతాత్మనామ్
కేవలంభగవత్పాద సేవయావిమలంమనః॥
నజాయతేయథానిత్యం తద్భక్తచరణార్చనాత్
విశిష్ఠకులసంజాత స్సంసారైస్సంస్కృతోనిజైః॥

కావున అగ్రకులమందుఁ బుట్టి వేదోక్తకర్మములనుఁ జేయువాడుగూడ భక్తజనపాదసేవకునితో సమానుడుగాడు.

4. శ్రీ పురుషోత్తమ దేవునికి సంతోషమునుఁ జేయునట్టి వేదోక్తకర్మంబులనుజేసి అట్టి భగవత్సేవచేత సంసారదుఃఖమునుఁ బోఁగొట్టుకొనఁదలంచినవాఁడు అట్టి భగవత్సేవా ప్రకారము నుపదేశించుటకు నొక సద్గురువు నాశ్రయింపవలయును.

అట్లు ఆశ్రయించుగురువు వేదవేదాన్తముల యర్థమును బాగుగాఁ దెలిసినవాఁడును తన్నుతా నెరిగినవాఁడునుగా నుండవలయును. (డు గురువుదగ్గర నమ్రుడై మర్యాదగలవాఁడుగా నుండ వలయును. మనస్సున ద్రోహపుతలంపుగూడదు. సర్వకాలమందునుఁ బరాకులేకుండ వాఙ్మనఃకాయకర్మములచే గురువు నొద్దఁ బ్రవర్తింపవలయును. ఆచార్యుని మనస్సుతో వేఱుపఱుపక సాక్షాద్భగవంతునిఁ దలచినట్లు తలంపవలయును. "ఆచార్యదేవోభవ" అను వాక్యము ఇచ్చట గమనించదగినది. ఇది శిష్యధర్మము. ఈశ్వరసమ్మతమగు కార్యము. దేవునివలె గురుఁడు ఉపాస్యుఁడు. ఎట్లనిన:—

శ్లో॥ అజ్ఞానధ్వాంతరోధాదఘపరిహరణా
దాత్మసామ్యావహత్వా జ్జన్మప్రధ్వంసిజన్మ
ప్రదగరిమతయా దివ్యదృష్టిప్రభావాత్ ॥
నిష్ప్రత్యూహానృశంస్యా న్నియతరసతయా
నిత్యశేషిత్వయోగా దాచార్యస్సద్భిరప్రత్యుపకరణ
ధియా దేవవత్స్యా దుపాస్యః॥

(గురు.............పంచరత్నము).

పాపకార్యములను జేయుటయందా సక్తిగలవారును, జీవహింస జేయువారును, ఎల్లప్పుడు వేదశాస్త్రములను నిన్దించువారును ఐన మూఢులతో సంబంధమునుఁ జేయఁగూడదు. పై వారి సహవాసము సద్భక్తిని నశింపఁజేయును. కాబట్టి సర్వదా శ్రేయస్కరమగు సదాచారము గలవారితోఁగూడ నివసింపవలయును, సత్పురుష సాంగత్యమే అవశ్యముగ జేయందగినది. "త్యజదుర్జనసంసర్గం భజసాధుసమాగమం" అని జ్ఞానులు వకాణించి యుండుటగూడ యాయర్థమునే బోధించుచున్నయది.

5. ఉదయాత్పూర్వము నిద్రలేచి స్థిరబుద్ధితో భగవంతు

ని ధ్యానించి అటుపిమ్మట (గ్రామమునకుఁ దూరముగా) చేతి లో నీళ్లు తీసుకొని మలవిసర్జనార్థము బైటపోవలయును. సస్యములు మొదలగునవి మొలచుటకు ఉపయుక్తములుగాని బయలు నందు రహస్యముగా మలవిసర్జనము జేయవలయును. అట్టి సమయమందును, స్త్రీ సంగమకాలమందును, స్నాన భోజన దన్తధావనములు జేయునప్పుడును, జపకాలమందును మాటలాడఁగూడదు. ఈ యర్థమును లోబెట్టియే,

శ్లో॥ మేహనే మైథునే స్నానే భోజనే దన్తధావనే
ఇజ్యాయాంసహోమే చ జపేమౌనంసమాచరేత్

అని శ్రీశాండిల్యస్మృతి శాసించుచున్నయది.

(సశేషము)

పి. ఎ. కృష్ణస్వామి,

సద్వాక్యములు,

శ్లో॥ యస్య దేవే పరాభక్తిః యథా దేవే తథా గురౌ
తస్యైతే కథితాహ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః॥

శ్లో॥ చిత్రంవటతరోర్మూలే వృద్ధాశిష్యాగురుర్యువా
గురోస్తుమౌనంవ్యాఖ్యానం శిష్యాస్తుచ్ఛిన్నసంశయాః

———:0:———

శ్లో॥ ఆశయా బద్ధతే లోకే కర్మణా బహుచింతయా
ఆయుక్షీణం నజానాతి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ క్షణంచిత్తం క్షణంవిత్తం క్షణం జీవితమావయోః
యమస్య కరుణానాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ మాతానాస్తి పితానాస్తి నాస్తిబంధుస్సహోదరః
అర్థంనాస్తిగృహంనాస్తి తస్మాజ్జాగ్రత జాగ్రత॥

శ్లో॥ కామఃక్రోధశ్చ లోభశ్చ దేహేతిష్టంతి తస్కరాః
జ్ఞానరత్నాపహారేణ తస్మాజ్జాగ్రత జాగ్రత॥

# గుణత్రయ లక్షణము.

(మంజరీ ద్విపద).

శ్రీపార్వతీనాథు జితదైత్యనాథు
భావంబునందున భక్తితోఁదలఁచి,
త్రిగుణలక్షణములఁ దేటవాక్స్ఫరణి,
వివరించి చెప్పెద వినరయ్య. గుణము
సాత్వికంబును, రాజసంబును, మఱియు,
తామసంబనఁ ద్రివిధంబులై యుండు.
మూఁడు గుణంబులు మూఁడు లోకములు.
సాత్వికమన నొప్పు స్వర్గలోకంబు,
మఱి రాజసగుణంబు మర్త్యలోకంబు,
తామసగుణమె పాతాళలోకంబు;
మూఁడు గుణంబులు మూఁడు మూర్తులుగ,
వెలయుచునుండును వేఱ్వేఱుగాను.
పరికింప రాజసమన బ్రహ్మయొప్పు,
వివరింప సత్వంబె విష్ణుదేవుండు,
మఱియుఁ దామసమన మాహేశ్వరుండు.
సత్వంబు నడచు రాజసశక్తిచేత,
పరగ రాజసము దామసమున నడచు,
గానఁ దామసమె ప్రధానమై నిలిచె.
తామసంబతి నిందితంబైన గుణము,
సాత్వికంబతి ప్రకాశత నొప్పు గుణము;
రాజసంబుభయమిశ్రితమైన గుణము.

(సాత్వికము).

వినుము సాత్వికగుణ వృత్తాంతమెల్ల,
విశదీకరించెద విపులంబుగాఁగ.

సంతోషమును, బ్రకాశత్వంబు; బ్రియము,
నానందమును, గరుణాభిలాషయును,
క్షమయును సత్యంబు శౌచంబు ధృతియు,
గార్పణ్యమును, దితీక్షయు నార్జవంబు,
శుద్ధి వినీతియు సుస్థిరత్వంబు,
క్రోధరాహిత్య మక్రూరభావంబు,
సమత దాక్షిణ్యంబు శ్రద్ధ దానతయు,
జపమును యజ్ఞంబుఁ దపము నహింస,
శమమును దమము హ్రీ శాంతియు గీర్తి,
జ్ఞానంబు ఘనతయు సత్వజాతములు.
మఱియు సాత్త్వికగుణ మహిమలు వినుము.
విషయంబులను ఘోరవిపినంబుఁ గాల్ప
సాత్త్విక వనవహ్ని చాలదే తలఁప,
రాగాదివైరుల రణమున ద్రుంప,
సత్వబ్రహ్మాస్త్రంబె శరవరేణ్యంబు,
కామాదికీచక గణము పాలిటికి,
సత్వప్రాధాన్యంబు శ్వసనపుత్రుండు.
లింగదేహంబను నంగజు నీఱు,
గావింపసత్వమే గరళకంఠుండు.
సత్వమే ముఖ్యంబు జనులకందఱకు.
శమదమాదులకది జన్మగృహంబు,
బంధనంబులకది పటులవిత్రంబు,
కామాది దనుజులఁ గాల దన్నుటకు
సత్వంబు గలజెట్టి సాత్త్విక గుణము.
సత్వమే యిహపర సౌఖ్యసాధనము,
సత్వమే ముక్తికి సత్సాధనంబు,
సత్వమే స్వర్లోక సోపానపంక్తి,

సత్వమే జనులకు సత్యదైవంబు,
సత్వమే నరులకు సఖుఁడు బాంధవుఁడు,
సత్వప్రధానికి సరిలేరు జగతి,
సత్వమే పోఁగొట్టు సకలకష్టముల,
సత్వమే పాపాబ్ధి సరవి దాటించు,
సత్వంబు చేఁగదా సర్వేశ్వరుండు,
సంరక్షణము సేయు సర్వలోకముల,
సత్వంబుచే హరిశ్చంద్రుండు దొల్లి,
సత్యంబు పాలించి సత్కీర్తి వెలసె.
ద్వాపరయుగమున ధర్మసూనుండు
సత్వంబుచేఁగదా సకల కష్టముల,
నోరిచి సౌఖ్యంబు లొందెను రెంట.
కాన సాత్వికమూనఁ గర్తవ్యమురయ,
యోగనిష్ఠులకది యొక్కటే తోడు.
సంకల్పరహితుఁడై సత్వంబునందె,
నిశ్చలచిత్తంబు నిలిపినట్టయిన,
జలజాప్తరూపంబు జలములలోనఁ,
దేటగాఁ దోఁచిన తెఱగునఁ దనదు
దేహమందుననె సాత్వికునకునాత్మ
దర్శనం బగుచుంట తథ్యము సుమ్మీ.
సత్వాధికంబుచేఁ దత్వంబు గల్గు,
సత్వాధికంబున సమసిన నరుఁడు,
మహిత సుజ్ఞానియై మరల జన్మించి
మరు జన్మమున మోక్ష పదముఁ జేకొనును.

(రాజసము).

విను మిఁక రాజస విధముఁ జెప్పెదను,
రాజసం బనునది రాక్షస గుణము

కోపంబుఁ దాపంబుఁ గ్రూరభావంబు,
గామంబు నుబ్బును గర్మబంధనము,
బల మహంకారంబుఁ బటు ప్రాభవంబు.
గలహము నీర్ష్య వికల్పభాషణము,
మఱి దంభదర్పాభిమాన మనృతము,
గర్వంబు శౌర్యంబు, గడు మచ్చరంబు,
దురితకర్మాపేక్ష ద్రోహచింతనము,
గరుణ లేమియు, భోగకాంక్ష, డాంబికము,
ధనతృష్ణ లోభంబు, ధర్మశూన్యంబు,
గామినీజనులందు గాఢరాగతయు,
మోదఖేదద్వంద్వమునఁ బీడనంబు,
దృష్ణ పుత్రాది బంధువులనాసక్తి,
సంసారబంధంబు జావు పుట్టుకలు,
దనర రజః ప్రభూతము లివి యన్ని.
ఈ రజోగుణ చిన్నె లింకయుఁ గలవు.
వానిని జెప్పెద వరుసగా వినుము,
సాత్త్వికవైరి రాజసగుణ మదియు,
సాంద్రదుఃఖమయంబు జనభీకరంబు,
రాజస గుణమున రాజకులంబు
నామావశిష్టమై నష్టమై పోయె.
రాజసమున భూరి రాజలోకంబు
క్షీణమొందెను గురుక్షేత్ర యుద్ధమున,
పటుఁగాన రాజస మతిహేయగుణము.
తగదది యెవరికిఁ దథ్యంబు సూవె.
రాజసగుణమున రాదు మోక్షంబు.
ఎంతకాలము నరుండీ రజోగుణము
నందు వర్తించునో యంత కాలంబు,

జననమరణాద్యవస్థలమాన లేఁడు.
కానమోక్షాసక్తిఁ గలిగినవాఁడు
దృఢముగా మోక్షమందే కాంక్షయుంచి
విషయాభిరతిమాని విడిచి కర్మముల,
శ్రద్ధతో శ్రవణాది సక్తుఁడై యుండి,
జతనంబుతో రజస్సను పిశాచమును,
వెడలఁదోలిన నదివెళ్లుగదయ్య.

(తామసము).

తామసగుణ మహాత్వంబెట్టిదనిన,
విను, తమస్సునదిపెనుదయ్యమయ్య,
పొంది యీదయ్యంబు పూను నరుని,
నది పూనినట్టయిన నానరుండకట!
మొదలంటఁ జెడిపోవుఁ దుదను సత్యముగ,
నాదయ్యమును దోల నది దుస్తరంబు,
దానిచే వస్తువితరముగాఁ దోఁచు,
నరకలోకమునకు నదియ నిశ్రేణి.
కామాది గుణముల కది యాశ్రయంబు.
అజ్ఞాన తమమున కది యాలయంబు.
ఘననిద్ర పెద్దమ్మ కది పుట్టినిల్లు.
దైన్యంబు మోహంబు ధైర్యహీనతయు,
జాడ్యంబు నలసత శ్రమము సంశయము,
విపరీత జ్ఞానంబు వెస ప్రమాదంబు,
మాంద్యంబు భీతియు భ్రాంతి హేయంబు,
నప్రకాశత శోక మతివిషాదంబు,
నక్షమత్వంబసుఖాకారతయును
గ్రంథముగ స్వప్నముల్ గనుట యేమరుట
తలఁపులు మెండుగాఁ గలిగి యుండుటయు

దామసచేష్టలు దప్పక యున్న.
ఈ గుణఫలముల నింకయు వినుము.
చెడు రోగముల నొప్పిఁ బడుచుండు వారు
పాములు జెళ్లను బసులు పందులును
గుఱ్ఱలు నక్కలుఁ గొంట నక్కలును
గాకులుఁ గ్రిములు జింకలు మీలు పేలు
చీమలు నల్లులు దోమలు కోళ్లు
నీఁగలు మఱి తేనెటీఁగ లెలుకలును
ముండ్ల చెట్టులుపొదల్ ముష్టివృక్షములు
మొదలగు పశుగణములు స్థావరములు
దామసభావముల్ దలచిచూడంగ.
కాన తామసులధోగతిఁ బొందిమరల
నతిహీనజన్మంబులందు చుండుదురు.
(గుణత్రయమిశ్రత)
సాత్వికంబును రాజసంబును దమము
మూడును బెనఁ గొని ముప్పిరిత్రాడు
గానయి యాత్మను గట్టిగాఁ జుట్టు
కొనియుండు నాత్రాటిఁ గోయను దగిన
గొడవలి వైరాగ్య కొడవలి గాని
మఱి దేనిచేత నాబంధంబు దెగదు
గ్రమముగా నీగుణగణముచేఁ గల్గు
స్వస్థత దుస్థత జడత లీమూఁటి
వృద్ధిక్షయంబులు బుద్ధికృత్యములు
తనువను తేరికి మనము పగ్గములు
రథికుఁడాత్ముండు సారథి బుద్ధిగాన
రథికుఁడవిద్యను రయమున వదలి
పగ్గంబులను లాగి పట్టుకొమ్మనుచు

సారథి కానతి సలిపినట్టయిన
మనము విచ్చలవిడి చనకుండుఁ బిసప
గడఁగి రాజస తమోకర్మ లెన్నటికి
మనమున సంకల్ప మొనరింపఁ బడవు.
ఆహారములఁగూడ నామూఁడు గుణము
లభివృద్ధి యగుచుండు నది యెట్టులనిన.
ఆయువు జ్ఞానంబు నారోగ్యసుఖము
బలమును సంతోష మధికంబు సేయు
నట్టి పదార్థంబు లతి రసవంత
మైనవియును స్నిగ్ధ మగు భోజనములు
స్థిరములై మరి మనోహరములై నవియు
సాత్వికమును వృద్ధి సల్పుచునుండు.
మిక్కిలి యగు నుప్పు నెక్కువ పులుసు
కాఁగంబు లావుగాఁగల భోజ్యములును
వేఁడి పదార్థముల్ వెగటు వస్తువులు
రాజస గుణమును రయమునఁ బెంచు.
చల్ది యన్నంబును జల్లారి నదియు
రసము లేనిదియు దుర్గంధ మైనదియు
దిని మిగిలిన యట్టిదియు నైన భోజ
నములు దామస వృత్తి నభివృద్ధి పరచు.
గురుతుగా నీమూఁడు గుణములచేతఁ
గదలింపఁ బడకుండు ఘనుఁడు నిత్యముగ
నానంద సౌఖ్యంబు లందును మదను.

సంపూర్ణము.

పరమాత్ముని రామస్వామయ్య.

# సముద్రమథనము.

భారతమాత పూర్వపుటౌన్నత్యమునుండి ప్రస్తుత మెట్టి నీచదశ ననుభవించుచున్నదియో దేశచరిత్రములను మహనీయుల చరితలను మహనీయుల యుపదేశవాక్యములను చదివిచూచిన వారికెల్లరకును విశదమే. తనపుత్రులు జ్ఞానవంతులైనచో నీమె భాగ్యమునకు కొఱతయే లేకయుండును. అమెబిడ్డలకిప్పుడు అత్మ జ్ఞాన మడుగంటునది. మూఢత్వము ప్రబలినది. శౌర్యాదికము జారినది. విద్యనశించెను. వెయ్యేల సమస్తైశ్వర్యములు సమసి పోయినవి ఆహా! బిడ్డలు బీదలైన తల్లి యెట్టుల కన్నులార చూచి సహించగలదు? పూర్వము దేశమాతలలో నగ్రగణ్యయని యనిపించుకొనిన మనభారత మాత కిప్పుడెట్టి దురవస్థ తటస్థించి నదో కనుగొనుడు! కలిమి లేములెట్టి వారికైన ననుభవింపక తీరదుగదా? తన తోబుట్టువులగు యూరపు అమెరికా జర్మనీ జపాను చీనా ఫ్రాన్సు మొదలగు దేశసోదరీ మణుల యౌన్నత్య ముంగాంచి యందరిలో మిన్నయై ప్రకాశించు తాను తన పుత్రుల యొక్కయు పుత్రికలయొక్కయు అజ్ఞానాతిరేకముచేత గలిగిన సోమరితనముచేతను ఐకమత్యహీనతచేతను నేడు మిక్కిలి దుర్దశ యందుంటున్నాను గదా యని చింతిల్లుచున్నది.

ఆమె కడుపున బుట్టి ఆమెను విచారమగ్నురాలిగా జేయుట మనకు భావ్యము కాదు. ఆమెమనకు జేయు హితోపదేశమును మీరు వినుచున్నారా! ఆమె యేమి చెప్పుచున్నది? "బిడ్డలారా! మీరు సౌఖ్యముగ నుండిన నేను సుఖంబుండెద. మీరు జ్ఞానవంతులయినచో సమస్తైశ్వర్యములున్న కన్న నెక్కుడుగా సంతసించెద. ఇప్పుడు మీకష్టములు గట్టెక్కుటకు మంచి తరుణము వచ్చెను. త్వరగా మేలుకొనుడు. కనులు విచ్చి చూడుడు.

సోదరప్రేమ ఐకమత్యము శాంతము ధైర్యము భూతదయ వీటిని సంపాదించుడు. వెనుకటి క్షీరసాగర మథనవృత్తాంతమును జ్ఞప్తికి దెచ్చుకొనుడు. అప్పుడు మీసోదరుల పట్టుదలయును ధైర్యమును కార్యనిర్వాహణశక్తియు స్మరణకు దెచ్చుకొనుడు. పట్టుదల గలిగి జ్ఞానమను పయఃపారావారమును దరచినంగాని సమస్తైశ్వర్యములం బొందలేరు. ఆరోగ్యవంతులు నైశ్వర్యవంతులు మేధావంతులు బలవంతులు చిరంజీవులునై శాశ్వతానందదాయకంబగు మోక్షమను నమృతము ననుభవించువరకు ధైర్యస్థైర్యములతో శ్రద్ధవహించి పరిశ్రమచేయుడు. మీకు జయమగుగాత!'' యని చెప్పుచున్నది. ఇట్లు చిరకాలమునుంచి చెప్పుచున్నను అజ్ఞాన సమ్మూర్ఛితులమై తెలిసికొన లేక యుండ కొందరు మహాపురుషులు పతత్ర్పయత్నమును ప్రారంభించి మార్గదర్శకులై సుమారు ముప్పదివత్సరములనుంచి పనిచేయుచున్నారు. ఒక్కమనస్సుతో పెక్కండ్రు పుణ్యపురుషులు మిక్కిలి పూనికతో మాతృవాక్యమును నిర్వర్తించుచున్నారు. కాని వారలతో మనమెల్లరము నిశ్చల మాతృభక్తి యుక్తులమై నిర్వర్తించి జయమునందవలయును. సంఘశక్తియంతయు నేకీభవించినగాని కృతార్థులము కాజాలము.

కవ్వముగా చేయబడిన ధైర్యమందరమును మనంబను సర్పరజ్జువుచే బ్రమాదరహితముగా దరచినంగాని మోక్షమను నమృతమును బడయజాలము. ఇట్టి ఘనకార్యముం జేయునపుడు ధైర్యమందరము సరిగా నిలచునా అని సంశయింపబనిలేదు. పరమార్థయుక్తమగు నిష్కార్యమునకు కూర్మమూర్తియగు భగవంతుడు అంతఃప్రవిష్టుడై ప్రమాదరహితముగ భరింపకుండునే! ప్రథమమున మృతప్రాయమగునట్టియు దుఃఖదాయకమగునట్టియు పెక్కుకష్టముల సముదాయమనే హాలాహలముగుండె బ్రద్దలగునంత భయంకరముగా గన్పట్టును. అం

ములకు సైతము భయపడవలసిన యవసరములేదు. శంకరుడు దానిం గబళించుటకు సిద్ధముగనే యున్నాడు. పిమ్మట దరిద్ర దేవతయగు జ్యేష్ఠాదేవి యుద్భవించును. అనగా మనకుగల లేమియొక్క పూర్ణత్వము గాన నగును. దీనికై వగవఁబనిలేదు. ముందు కలుముల జవరాలగు లక్ష్మీదేవి యుదయంబందును. పిమ్మట వెనుకటి యామె యొక్క యుచ్ఛ్రయము సంపూర్ణముగ నాశనము నందును. ఆపై ధన్వంతరియు నైరావతమును కల్పవృక్షమును కామధేనువును తెల్లగుఱ్ఱమును కౌస్తుభరత్నమును దివ్యాంగనా సముదయమును మొదలగు ననేక దివ్యపదార్థములు మనయభివృద్ధికై యుద్భవించును. ఇప్పటికి ప్రకృతి సంబంధము పూర్తియగును. ఇంతటితో మనయుద్యమము పూర్తికానేరదు. ప్రాపంచిక విషయములెల్ల నశాశ్వతంబులని తెలియదగును. సాధించ దగిన పురుషార్థములలో నుత్తమ పురుషార్థము మోక్షము. కాన మోక్షమును నమృతంబుబడసి శాశ్వతానందానుభవమునుబొందినప్పుడుగదా నిశ్చయముగామాతృఋణమును దీర్చుకొనిన వారమగుదుము! అప్పుడుగదా! పూర్వపుటున్నతిని దేశమాతకు కలుగచేసిన వారమగుదుము! మన యీకార్య నిర్వహణమునకు గావలసిన ధైర్యము, శక్తి, జ్ఞానము, భూతదయ, శాంతము, భక్తి, ఐకమత్యము, వీనిని సర్వేశ్వరుడు మనకొసంగుగాత!

అల్లంరాజు సూర్యనారాయణమూర్తి,
తుల్యారామేశ్వరం.

# యజ్ఞము. *

ప్రపంచమునందుఁగల చేతనరాశియంతయు నైదుగణము లుగ భాగింపఁదగు. ఎట్లనిన దేవతలనియు, ఋషులనియు, పితృదేవతలనియు, మనుష్యులనియు, నితర భూతకోటియనియు నైదుగణములుగ నున్నయవి. జీవుఁడు పాంచభౌతికమగు ప్రపంచమునఁ బ్రవేశించి యనేక కోటిజన్మముల నెత్తి మానవజన్మమునుబొంది సంసారచక్రమునందుఁ బరిభ్రమించు కాలమంతయు నీయైదుగణములకు నానావిధములైన ఋణములకులోనై యున్నవాఁడు.

* * *

బహువిధములగు పశుపక్ష్యాదులు సహితము మానవులకు సుఖము నొనఁగూర్చుచున్నవి. గోవులు మొదలగు జంతువులు దధిక్షీరఘృతంబుల నొసంగుటచేతను, వృషభములు లోనగునవి ప్రయాణములందును గృషియందును సహకారములుగ నుండుట చేతను, హేయములగు ననేకజంతువులు సహితము భూమియందలి మురికిని దొలఁగించుటచేతను, మత్స్యములు మొదలగునవి బహువిధముల జలములను బరిశుద్ధముచేయుటచేతను, పక్షులు వృక్షములయందలి ఫలములనుదిని బీజములను బహుప్రదేశముల వెదజల్లుటవలన వృక్షోత్పత్తిని జేయుటచేతను మధురస్వనముల చేతను, నివియన్నియు మనుష్యుల ఋణగ్రస్తులనుగఁ జేయుచున్నవియే. ఇదిభూతఋణము.

భూతయజ్ఞము.

“భూతాని బలికర్మణా” “బలిర్భూతౌ” అను వాక్యములు

---

* బ్ర॥ చిట్టమూరు రామయ్యగారిచే విరచింపబడిన బ్రహ్మవిద్యాదర్పణము లో నుండి గ్రహింపఁబడినది.

భూతముల ఋణము దీర్చుకొను మార్గములఁ జూపుచున్నయవి. పశుపక్ష్యాదులు సహితము మానవకోటి కుపయుక్తములుగను న్నవనియును, సర్వభూతములు నాత్మస్వరూపములేయనియు, నాత్మేతరపదార్థమొకటియుఁ గానరాదనియును బెక్కుమార్గములు నిరూపింపఁబడియెఁ గదా! అట్టి సర్వభూతములలో నైక్యభావమును దృఢముగ మానవులకుఁ గల్గించి భూతతృప్తి చేయుటకొఱకు బలిప్రదానమును సర్వజ్ఞులగు మహర్షులు విధించియున్నారు. పక్వమయిన యన్నమును ఇంటిచుట్టును నలుదిక్కుల నుంచవలయును. దీనివలన నింటిచుట్టును దిరుగుచుండు హీనజాతి జనులకును, శునక, వాయస, క్రిమి, కీటకాదిసమస్త భూతములకు నుపయుక్తమగును.

"శునాంచ పతితానాంచ శ్వపచాం పాపరోగిణామ్,
వాయసానాం క్రిమీణాంచ శనకైర్నిర్వపేద్భువి॥"
(మనుస్మృతి.)

కుక్కలు, చండాలురు, శ్వపచులు (కుక్కమాంసమును భక్షించు పరమహీనజాతులు) పూర్వపాపమువలనఁ బెద్దరోగముతో బాధపడుజనులు, వాయసములు, పురుగులు మొదలగు వానికొఱకు అన్నమును భూమిపై మెల్లఁగనుంచవలయును. అనఁగా శ్రద్ధతోడను, భక్తితోడను, పరిశుద్ధస్థలమున నుంచవలయును గాని భూమిపై విసరివేసి యన్నము మంటిలోఁ గలిసి చెడిపోవునట్లు వేయఁగూడదు. ఈకార్యము సయితము భక్తిశ్రద్ధలతోడ భగవంతునకు నివేదనము చేయురీతిని జేయవలయునని విధించుచు శాస్త్రములు సర్వభూతములందును ఈశ్వరసాన్నిధ్యమును బోధించుచున్నయవి.

ఇట్లు మనుష్యులు తమఋణములం దీర్చుకొనుటకు నైదు మహాయజ్ఞములు విధింపఁబడి యున్నయవి. ఇవియన్నియు నిత్యకర్మములు. అనఁగాఁ బ్రతిదినమును గృహస్థువగు

పురుషుఁడు జేయవలసిన కర్మములు. ఇందెద్ది లోపించినను పాపహేతువని దృఢముగఁ జెప్పఁబడి యున్నది. ఈ యజ్ఞములను జరిపిన పిదప మిగిలిన యన్నము యజ్ఞ శిష్టామృతమనియు మేధ్యమనియు నెఱుంగఁబడు. అన్న మిట్లు పరిశుద్ధము గానిచో నమేధ్యమని యెఱుంగఁబడును. ఈయాహారము తామసాహారమనంబడును.

"ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్"

(గీత 17 అ. 10 శ్లో)

అదృశ్యులై సంసారచక్రమును ద్రిప్పుచు నెల్లవిధముల నీశ్వరాజ్ఞా ప్రవర్తకులగు దేవకోటులకును, మానవకోటికిని, తిర్యగ్జంతువులగు పశుపక్ష్యాదులకును మఱియుఁ గ్రిమికీటకాదులగు సమస్తభూతములకుంగల యైక్యభావము నిర్వివాదముగఁ దత్త్వదర్శులగు మహాత్ములు వెల్లడిగ బోధించియున్నారు ఈపరస్పర సంబంధమును దెలిసికొని సమానజనములం దన్యోన్యభావమును, ఉత్తములగు దేవతాదులయందు భక్తియు, హీనులయందు దయయుఁ గలిగి ఋణములం దీర్చి యెల్లవారును కృతార్థులుగాఁదగు.

సకలజనులును వర్ణాశ్రమవిభాగమునకు లోఁబడినవారయినను, కానివారైనను నీధర్మముల మనసునకుం దెచ్చుకొనఁదగు. ఈకర్మములు హిందూదేశమున ద్విజులగువారికి మాత్రమే విధింపఁబడియుండ నెల్లవారెట్లు లీకర్మముల నెరవేర్చువారను సందియ మక్కఱలేదు. ద్విజులగు వారలు బహుకాల పరంపరానుష్ఠితములగు నాహారవిహార నియమములకు లోఁబడి కొంతవఱకుఁ బరిశుద్ధములగు నుపాధులం గలిగియుండు వారగుటంబట్టి స్వతంత్రముగ మంత్రములం బఠించుటకును, వినుటకును దగియున్నవారని విధింపఁబడియున్నను ద్విజులుగాని వారుకూడా వేదమంత్రములు లేక "నమ" యనుమంత్రమున

నీ కార్యము లన్నియుఁ జేయుట యావశ్యకమని విధింపఁబడి యే యున్నయది.

"శూద్రస్య సన్నతిశ్శౌచం సేవా స్వామిన్యమాయయా,
అమంత్రయజ్ఞోహ్యస్తేయం సత్యం గోవిప్రరక్షణమ్॥"
(భాగవతము.)

"నమస్కారేణ మంత్రేణ పంచయజ్ఞాన్ సహాపయేత్"
(విష్ణుపురాణము.)

భూతముల కొండొంటికింగల ఋణముల నంగీకరించి ఋణములం దీర్చుకొనుటయు, సర్వభూతములయందు భ్రాతృ భావముగలిగి వానికి హితముఁ గోరుటయు, యథాశక్తి భూత హితముచేయుటయు, ఎవ్వరితోఁగాని ద్వేషింపకుండుటయు ముఖ్యాంశములు. ఇవి లేనిచోట సమంత్రముగఁ జేయుకర్మములు సహితము అల్పప్రయోజకములు. జన్మమాత్రమున ద్విజులుగనుండియు, ఆహారాది నియమముల ననుష్ఠింపనివారలు మంత్రముల తోడ నొనర్చుట కనర్హులేయని యెన్నఁదగు. నియమముల బూర్ణముగ ననుష్ఠింపక పూర్వపు సద్బ్రాహ్మణులవలెఁ గొన్ని మంత్రములఁ బఠించుటచేతను, గొన్నికర్మములు చేయుటచే తను అనేక లికార్లపు బ్రాహ్మణులు రోగపీడితులును తేజో హీనులును నగుటకుఁ గారణమై యున్నది.

మహర్షులు సూక్ష్మలోకములను జూచినవారుగనుక ఆలోకములందును సూక్ష్మశరీరములయందును మంత్రపఠనమువలనఁ గలుగు ఫలముల నెఱింగిన వారగుటంబట్టియు నపారకరుణచే మంత్రముల నుపయోగింప నర్హులెవరో యనర్హులెవరో యని విధించిరికాని వేఱుకారణముల నట్లు విధించిరని యెంచి వారి యందుదోషము నారోపింపరాదు. మహాత్ములు "మంత్రద్రష్టారః" అనఁగా మంత్రములను జూచువారని పిలువఁబడుటకు గారణ మిదియె. మంత్రోచ్చారణముచేఁ గలుగు ఫలములును, అనర్హు

లుచ్చరించుటచేఁ గలుగు కీడును బూర్వము విస్తరింపఁబడిన దియే. దయాసముద్రు లగునట్టి మహాత్ములయందు దోషారోపణము చేయక యీజన్మమున మనస్సును, ఇంద్రియములను, కాయమును నియమించుకొని రాఁగల జన్మములయందుఁ బరిశుద్ధములగు నుపాధులను బొంద యత్నింపవలయు.

బ్రహ్మాండమున జన్మించినమాత్రమునఁ బైనిరూపింపఁబడిన రీతిని బ్రతిమానవుఁడును సకలభూతములకు ఋణస్థుఁడై యుండఁగా వాఁడు ఉదరపోషణముకొఱకు జేయుకర్మములయందు ఇతర భూతములకుఁ గొన్నింటికైనను హానిచేయక తీరదు. గృహసమ్మార్జనమునందును, గృహోపకరణములు కడుగుటయందును, శాకములు మొదలగు వానిని గత్తిపీఁటతో ఖండించుటయందును, బ్రొయ్యియం దింధనములు మంటచేయుటయందును, వడ్లు మొదలగుధాన్యముల దంచుటయందును మఱియు ననేకకార్యములయందు ననేకభూతములకు హింసచేయకతీరదు. ఇట్టి పాపము సర్వజనులనంటియే యుండును. ఇవి ముఖ్యముగఁ బంచసూనము లని హిందూధర్మశాస్త్రములయందుఁ బిలువఁబడుచున్నవి.

"ఖండినీపేషిణీ చుల్లీ మార్జనీ చైవ కుంభినీ,
పంచసూనా గృహస్థస్యనతై స్స్వర్గో విధీయతే॥"

ఈపంచసూనముల పరిహారముకొఱకు వైశ్వదేవమను పేరంబరఁగు హోమము గృహస్థులకు విధింపఁబడియున్నది ఈహోమమువలన సర్వభూతములఁ బోషించి యభివృద్ధిచేయ దేవతలు తృప్తులగుదురు. వారుతృప్తులగుటచేత వారిచేఁ బోషింపఁబడు భూతముల కభివృద్ధిగలుగును. ఇట్లు అల్పహింసలును బరిహింపఁబడును. ఇదియును గృహస్థునకు విధింపఁబడిన నిత్యకర్మములలో నొకటి.

# ఓమ్.



# దివ్యజ్ఞానదీపికః

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

చందాదారుల కందఱికిని ఏప్రిల్ నెల సంచిక వి. పి. పోస్టులో పంపఁబడును. అక్కఱలేని వారు ఆసంగతి తక్షణము మాకు తెలియపరచ వలయునని కోరుచున్నాను.

పరమాత్ముని నరసింహయ్య.

తృతీయము శ్రీమతి అనీబెసెంటు స్వామిగారును, శ్రీయుత॥ స. జినరాజదాసాగారును మఱియు ననేకులు సభ్యులును బొంబాయి చేరిరి. ఆదినము మొదలు దినదినమును సభ్యులు స్త్రీలును పురుషులును బొంబాయిపట్టణము చేరుచుండిరి. బొంబాయి నగరవాస్తవ్యులగు సభ్యులు పెక్కండ్రు ప్రతిదినము రైల్వేస్టేషను యొద్దకు వచ్చి రైలునుండివచ్చు సభ్యులకు స్వాగతమొసంగి వారలను ముందుగ నిశ్చయించియుండిన నాటకశాలలకు జేర్చి, పట్టణమునకు వచ్చిన వారలకందఱ యనుకూలములను వసతు

లను సమకూర్చిరి. మన చెన్నపురి పరగణానుండి దాదాపుగ 120 మందిసభ్యులు బొంబాయికి వచ్చియుండిరి. అందుముఖ్యులు శ్రీయుత న్యాయమూర్తి టి. సదాశివయ్యగారును వారి పత్నియును, న్యాయమూర్తి కే. యస్. చంద్రశేఖరయ్యర్ గారును వారిపత్నియు, పెన్షన్డ్ సబ్జడ్జి టి. రామచంద్రరావుగారును, నాగమ్మగారును, మఱియు మధుర తంజావూరు కుంభకోణము, కడప, చిత్తూరు, కర్నూలు, గుడివాడ, ప్రొద్దుటూరు పట్టణములనుండి యనేకులును వచ్చియుండిరి. అన్నిపరగణాలనుండి వేయిమందికెక్కువగ సభ్యులు వచ్చిరి. గొప్ప యుపన్యాసములకు 5000 జనము సభచేరుటకు తగినంత గొప్ప మండపము నిర్మానించియుండిరి. శ్రీమతి ఆనీబెసెంటమ్మగారి యుపన్యాసములు నాల్గును, శ్రీయుత జినరాజదాసాగారి యుపన్యాసములు రెండును ఆమండపమున జరిగెను. సమాజముయొక్క తక్కిన సభలన్నియు కీర్తిశేషులగు ధర్మసేమురార్జిగోకులదాసుగారి పుత్రులగు శ్రీయుత రతన్సెగోకులదాసుగారి దివ్య భవనమున జరిపిరి. ఈ యుదార చిత్తుడు తన సౌధమును కన్వెన్షనుకువచ్చిన సభ్యులకొరకే సమర్పించి, వారలకు సకల సహాయము చేయుచుండెను. శ్రీమతి ఆనీబెసెంటమ్మగారు వార్షికోత్సవ సంబంధములగు నుపన్యాసములు నాల్గింటి నొసంగిరి. డిసెంబరు 25 వ తేది యుదయమున ప్రారంభించి ప్రతియుదయమున 8 ఘంటలు మొదలు 9 ఘంటలవరకు నొక యుపన్యాసమిచ్చిరి. (1) ఈశ్వరతత్త్వము, (2) (మనుష్య) జీవతత్త్వము, (3) ధర్మాధర్మములు, (4) సోదరభావము అను నీనాల్గు విషయములను గురించి యత్యద్భుతముగ నుపన్యసించిరి. 25 తేది సాయంత్రమును, 29 తేది సాయంత్రమును 5-20 ఘంటలకు, శ్రీయుత సి. జినరాజదాసాగారు 'సాంఘికపునరుద్ధారణము' (Social Reconstruction) అను విషయమును గురించి రెండు

పన్యాసముల నిచ్చిరి. ఈయుపన్యాసము లన్నింటియందును మండపమునిండ మహాజనులువచ్చి యాసక్తితో విని పోవుచుండిరి. వచ్చియుండిన వారిలో ఇందూర్ మహారాజా హోల్కారు గారును వారిప్రధాన మంత్రులు ఒకనాడును, వారియంతఃపుర మొక్కనాడును, సభనలంకరించిరి. స్త్రీలకు ప్రత్యేకస్థలము ను ఏర్పరచియుండ, ప్రతిదినమును దాదాపుగ 300 గురు స్త్రీలు హిందువులు పార్శీలు సభనలంకరించుచుండిరి.

సమాజముయొక్క సభలు రతన్ సేన్ గోకులదాసుగారి సౌధమున జరిగెను. డి॥ 25 తేది నాడు మధ్యాహ్నము, సభాధ్యక్షులు శ్రీఆనీబెసెంటమ్మగారు వారి రిపోర్టుచదివిరి. మఱియును నానా దేశములనుండి సమాజవృత్తాంతములను దెలుపు రిపోర్టులును జదువఁబడినవి. ఈగత సంవత్సరమున యుద్ధమువలన కొన్ని దేశములనుండి రిపోర్టులు రాలేదు. మఱియు సమాజమునకు నానా దేశములనుండి రాదగు ద్రవ్యసహాయము తగ్గిపోయెను. ఆ కారణమున సొసైటి కార్యములలో ద్రవ్యము చాలక వచ్చెనని శ్రీకోశాధిపతిగారు తెలిపిరి. వెంటనే ఆలోపమును సవరించు నుద్దేశముతో గొందఱుమాత్రము కొన్ని వేలు రూప్యములు చందాలనొసంగిరి.

ఆదినము సాయంత్రము 5 ఘంటలకు సమాజ సంవత్సర మహోత్సవము జరిగెను. శ్రీజినరాజదాసాగారగ్రాసనాధి పత్యమువహించిరి. అందు పలువిషయములను గుఱించి పలువురు పెక్కుభాషలలో ప్రసంగించిరి, ఒకరు గుజరాతి భాషలో బ్రసంగించిరి. ఇద్దరు బ్రాహ్మణస్త్రీరత్నములు ద్రావిడభాషలో బ్రసంగించిరి. శ్రీయుత న్యాయమూర్తి సదా శివయ్యరుగారి పత్ని థియాసఫి విషయమై ద్రావిడములో ప్రసంగించిరి. ఆపిదప న్యాయమూర్తి చంద్రశేఖరయ్యర్ గారి భార్య శ్రీమతి పార్వతమ్మాళ్ భారత స్త్రీధర్మములను గురించి

ప్రసంగించిరి. ఆయన యుపన్యాసము అత్యద్భుతముగ నుండెను. వారు సెలవిచ్చిన విషయము చదువరులకు తెలియదగినది. కాన కొంచెముగ సూచించెద:—

"స్త్రీలు తమభర్తలకు సహధర్మచారులుగ నుండవలెను గదా! మనహిందూస్త్రీలు మిగుల భక్తిగలవారని ప్రసిద్ధిచెందియే యున్నారు. అయినను అది చాలదు. మనకొక సేవకు డుండెనచో వాడు భక్తిగలిగి యజమానుని చూచినపుడెల్ల నమస్కారము చేయుచుండినం జాలదుగదా! వాడు చేయవలసిన కార్యములను చక్కగ చేయవలయునుగదా! అందుకు దగిన జ్ఞానముండవలయునుగదా! అటులనే స్త్రీలు స్వధర్మమును చక్కగా నెరవేర్చవలయునన్న జ్ఞానము నభివృద్ధిచేసుకొనవలయును. కనుక స్త్రీవిద్య నభివృద్ధిచేసి స్త్రీలందరు విద్యావంతులు కావలయును.

హిందూదేశమున పురుషులందఱు స్వారాజ్యము కావలయునని పోరాడుచున్నారు. స్త్రీలును ఇతరదేశములయందువలె అభివృద్ధికానిచో స్వారాజ్యము సాధ్యముకాదు. ఇంగ్లాండుదేశమున నిపుడు పురుషులు పెక్కండ్రు యుద్ధమునకు బోగా వారి కార్యములన్నియు స్త్రీలు సమర్థించుచున్నారు. మోటారుబండ్లు, ట్రాంబండ్లు, రైలుబండ్లు నడపుట, తపాలాఫీసులోను ఇతర ఆఫీసులలోను పనిచేయుట, గుమాస్తాపనులుచేయుట మొదలగు పనుల నెరవేర్చుటయేగాక అవసరము గలిగినయెడల యుద్ధము సయితముచేయుటకు సిద్ధమై యున్నారు. మనదేశమునను స్త్రీలు అభివృద్ధికావలయును.

అదియునుంగాక శరీరమున చిన్నవ్రేలికి గాయము తగిలినచో శరీరమంతయు బాధపడునుగదా! అట్లుండ సంఘమున సర్థ శరీరమగు స్త్రీగణమంతయు నజ్ఞానపీడితముగానుండగా సంఘమునకు సౌఖ్యమెట్లు సమకూరును.

సముద్రమున పొగయోడ యొకటి పోవుచు దానివెంట నొక పడవను లాగుకొని పోవుచుండుటను చూచితిని. అట్లు పురుషులు తాము విద్యావంతులును, జ్ఞానవంతులునై యభివృద్ధికి యత్నించుచో స్త్రీలనుకూడ అభివృద్ధికి తెచ్చునుపాయముల ను చూడవలెను.

పూర్వకాలపు దమయంతి సావిత్రి మొదలగువారు తమ తమ భర్తలతో సహధర్మచారలుగ నుండిరని గ్రంథములం జదివితిమి. ఇక్కాలమున, శ్రీరామచంద్రరావుగారి భార్య రాగమ్మ గారు సన్యాసమునందును సహధర్మచారిణిగ నుండుటయు శ్రీయుత సదాశివయ్యగారి భార్య వారు బూనుకొను సంఘసంస్కరణాది కార్యములయందు సహధర్మచారిణిగ నుండుటయు తక్కిన స్త్రీలకిక్కాలమునకు దృష్టాంతములుగనున్నవారుగదా! అట్టివారల దృష్టాంతములనవలంబించి యెల్లరును జ్ఞానాభివృద్ధిచేసికొని భర్తలకు సహధర్మచారిణులుగావలయునని నాప్రార్థన" అని ఉపన్యసించిరి.

డిసెంబరు 26, 27 తేదులలో మధ్యాహ్నమున థియాసాఫికల్ సొసైటి ఇండియన్ సెక్షన్ సభలు జరిగినవి. 28 తేదిన "ఆర్డర్ ఆప్ ది స్టార్" సభయొకటి జరిగెను. ఇవిగాక ఇ. యస్. సభలును జరిగెను.

ఈసంవత్సరపు సభముందు సభలన్నిటికంటె జయప్రదముగ జరిగెను. ఎక్కువమంది సభ్యులు సభలకు వచ్చియుండిరి. భ్రాతృభావము ప్రత్యక్షముగ నుండెను.

సి. రామయ్య.

———:0:———

## II

కడచిన డిసెంబరుమాసముయొక్క చివరవారములో బొంబాయినగరము పలువిధములగు సభలతో తేజరిల్లెను.

దివ్యజ్ఞానసమాజము, బ్రహ్మసమాజము, ఆర్యసమాజము, ఆంధ్ర సమ్మేళనము, భాటియాసమ్మేళనము, సాంఘికసమ్మేళనము, రాజకీయ మహాజనసభ మొదలగు సభలుసమావేశమై తత్తదుచిత కార్యములను జరిపెను.

దివ్యజ్ఞానసమాజముయొక్క నలుబదియవ వార్షికోత్సవమునకు దేశవిదేశములనుండియు సామాజికులు వచ్చియుండిరి. వారి భోజనభాజనాదులకు బొంబాయిసమాజములవారు తగిన సముపాయముల నేర్పరచియుండిరి. శ్రీమతి అనిబెసెంటమ్మగారును, మ॥ జినరాజదాసాగారును వేరువేరు ప్రసంగములను జేసిరి. ఈశ్వరుడు, జీవుడు, ధర్మాధర్మములు, సౌభ్రాతృత్వములనుగురించి (అమ్మగారు) నాలుగు అమోఘములైన ప్రసంగములనుజేసి శ్రోత్రుల మనస్సునకానందమును గలుగజేసిరి. మ॥ జినరాజదాసాగారు ప్రపంచముయొక్క పునరుజ్జీవనమును (World's Reconstruction) గురించి రెండు ఉపన్యాసములను జేసి సభికుల కానందమును గలుగజేసిరి. ఈయుపన్యాసములకు సుమారు పదువేలమంది శ్రోత్రులువచ్చియుండిరి మ॥ జినరాజదాసాగారు విద్యార్థులకొరకు నొకప్రసంగమును వారి ప్రార్థన ననుసరించిజేసిరి. దివ్యజ్ఞానసమాజమున కాధ్యులై నిలిచి లోకోపకారపరాయణులగు శిష్యబృందమును ప్రోగుచేయుచున్న జీవన్ముక్తులగు మహానీయులకు వీరిరువురను సచ్ఛిష్యులై యేర్పడి యిరువదియవ శతాబ్దమందున్న జనులకు చాల విస్మయమును బుట్టించుచున్నారు. వీరు చిరాయువులై లోకోపకారమును గావింతురుగాక!

ఎం. వెంకట్రావు.

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

(371-వ పుట శేషము.)

ప్రవృత్తిమార్గమందు ముఖ్యముగా గ్రహించవలసిన విషయములు పునర్జన్మములు, కర్మసిద్ధాంతము. ప్రవృత్తిమార్గమునకీ రెండు ముఖ్యాంశములు. ఈ రెండును నిరాకరించువారికి ప్రవృత్తి మార్గముచే కలుగు సుఫలము బోధపడదు. హిందువులలో పునర్జన్మ కర్మసిద్ధాంతములు అనాదినుండి వదలక పట్టుబడియున్నది. బౌద్ధులలోను ఈసిద్ధాంతము దృఢముగ నిలిచినది. ఇతర మతస్థులలో మాత్రము దీనిని అంగీకరించుటలేదు. అయినను ఈవిషయమై వారిమత గ్రంథములం దచ్చటచ్చట సూచింపబడియున్నది. ఎవరంగీకరించినను అంగీకరించక పోయినను స్వభావధర్మము సర్వదా తప్పక ఏమాత్రమైనను మార్పుచెందక ఏకరీతిన ప్రవర్తించుచునే యుండును. పునర్జన్మ కర్మసిద్ధాంతముల నిరాకరించినచో ప్రపంచములోనుండు వ్యత్యస్తములకు సరియైన కారణము చెప్పుటకు ఇంచుకైన వీలుండదు. మరియు పూర్ణపరిశుద్ధుడైన జగన్నిర్మాణ కర్తయగు ఈశ్వరునకు అత్యంత నీచమైన పక్షపాతగుణము ఆరోపింపవలసివచ్చును. జగత్తు లెక్కకు మీరిన వ్యత్యస్తములతో నిండియున్నది. సర్వసముడగు జగదీశ్వరుడెందుకు సమత్వముచూపక భిన్నభిన్నముగా సృజించినాడని అడిగినపుడేమి సదుత్తరము చెప్పవచ్చును? జాత్యంధులును, కాలుసేతులులేక మొండెముమాత్రముకలవారును, కురూపులును, సురూపులును, కడుబీదలును మహదైశ్వర్యవంతులును, సకలకళాప్రవీణులును, నయతత్త్వబోధులును, కేవలమూర్ఖులును, నీతులేమియు నెరుగక నిచ్ఛానుసారము విహరించువారును, దయాపూర్ణులును, అతిక్రూరులును, పశుస్వభావముగలవారై ఒకరినొకరు తినుమృగప్రాయులును, ధైర్య,

స్థైర్య బల పరాక్రమములుగల వీరులును శూరులును తోలిపారుబోతులగు భీరులును, షండులును ఇంకననేక వ్యత్యస్తములుగల మనుష్యకోటియు, పలుభేదములగు నానావిధ పశుసమూహమును, కోట్లకొలది భిన్నతరగతులుగల సస్య, వృక్ష జాలములును, ఖనిజ రాసులును కలిగి జగత్తు పరిణమించుచున్నదిగదా?

ప్రపంచమందుండు సర్వమతస్థులును అందరు ఈశ్వరుని పొందుటకు ప్రయత్నించుట ముఖ్యధర్మమనియు, సత్యసంధత్వమును, బ్రహ్మచర్య, అస్తేయ, భూతదయాది సుగుణసంపాదనే ఆ ప్రయత్నమని ఐక్యభావముతో అంగీకరించుచున్నారని గతసంచికయందు వ్రాయబడియుండెను. పునర్జన్మములు లేక ఒక జన్మమే ఆద్యంతమని పర్వడినప్పుడు పశుప్రాయుడగువాడు ఈ ప్రయత్నము చేయుట కవకాశము కలుగునా? ఇట్టి సుప్రయత్నము (అనగా పుణ్యము) చేయువారే భగవంతుని దయకు పాత్రులై సుఖమనుభవింతురనియు, తద్విరోధులు భగవంతుని దయకు పాత్రులుగాక నరకమందు దుఃఖమునే శాశ్వతముగ అనుభవింతురనుటే నిశ్చయమని తలంచినపుడు జగత్తునందు కోటిలో నొకపాత్రైనను మరణానంతరము సుఖమనుభవించువారుండరని దృఢముగా చెప్పవచ్చును. భగవంతుడిట్టి అవ్యక్తబుద్ధిగలిగి ఇట్టిక్రూరకృత్య మొనరించునా? సామాన్య బుద్ధితో నూహించినను పునర్జన్మ, కర్మసిద్ధాంతము తప్ప నితరమేదియు నీవ్యత్యస్తములకు యుక్తియుక్తమగు కారణము గన్పడదు. పునర్జన్మ కర్మసిద్ధాంతముల నిరాకరించుచుండిన మతాంతరులుకూడ నిప్పుడు ఒప్పుకొనుటకు ప్రారంభించినారు.

సృష్టిలో సమస్తభూతములును పునర్జన్మములచే క్రమక్రమముగ తామున్నస్థితినుండి ఎక్కుచుపోవుటే స్వభావసిద్ధము. ఇట్లు ఎక్కిపోవుటకే జగదీశ్వరుడు పునర్జన్మములు నియమించినాడు. ఖనిజరాసి పునర్జన్మములచే సస్య వృక్షజాలముల

గును, సస్య వృక్షజాలములు పునర్జన్మములవలననే నానావిధ పశుసమూహంబగును. పశుసమూహము ఆపునర్జన్మములతోనే మనుష్యకోటియగును. ఆమనుష్యకోటి పునర్జన్మములతోనే దివ్యజ్ఞాన సంపదగలిగి, సమస్తదుఃఖములనుండి తొలగి మహామహిమపొంది ముక్తులై తమకు ఆదికారణభూతుడైన ఈశ్వర సములై ఈశ్వరునిపొంది ఈశ్వరకార్యములు నెరవేర్చుదురు. పునర్జన్మములకిదేమూలకారణము.

ఎప్పుడు పునర్జన్మములుండుట స్వభావసిద్ధమని నిశ్చయమగునో అప్పుడే కర్మసిద్ధాంతమును తప్పక ఒప్పుకొనవలసి వచ్చును. ఒకజన్మమందుచేసినఫల మింకొకజన్మమం దనుభవించుటద్వారా ఆకర్మఫల మిట్టిదని తెలిసి, సుఖదాయకంబగు కర్మ పుణ్యకర్మమనియు, దుఃఖమిచ్చునది పాపకర్మమనియుఁ దెలిసి సుఖమిచ్చు కర్మలను చేయుచు దుఃఖమిచ్చుకర్మలను వదలుచు క్రమక్రమముగ జన్మజన్మములందు జీవుడు వృద్ధిచెందును. ఎవడు ఎట్టికార్యమును మనసుతోగాని వాక్కుతోగాని, దేహముతోగాని చేయునో తదనుసారమైన ఫలమును వాడనుభవించి తీరుననుటేకర్మయొక్క ముఖ్యసిద్ధాంతము.

శ్లో॥ పుణ్యేనకర్మణాసౌఖ్యం దుఃఖంపాపేనకర్మణా
కృతంఫలతిసర్వత్ర నాకృతంభుజ్యతేక్వచిత్ ॥
కృతీసర్వత్రలభతే ప్రతిష్ఠాంభాగ్యసంపదాం
అకృతీలభతేభ్రష్టః క్షతేక్షారావసేచనం॥

పుణ్యకర్మచే సుఖమును, పాపకర్మచే దుఃఖమును, చేసినవాడనుభవించునేగాని చేయనివాడనుభవించడు. సత్కర్మ చేసినవాడు ప్రతిష్ఠయు, సౌభాగ్యసంపత్తును, చేయరానికార్యము చేసినవాడు భ్రష్టుత్వమునుచెంది గాయములుచేయబడి ఉప్పునీళ్లలో మునిగినవానివలె దుఃఖమును పొందునని మహాభారతము శాంతిపర్వము బ్రహ్మవసిష్ఠ సంవాదమందు చెప్పబడి

యున్నది. ఇదే కర్మసిద్ధాంత సారము.

ఈసిద్ధాంతమే జనులకు దృఢముగా పట్టుపడెనేని లోకమందు దుఃఖముగాని పాపముగాని ఉండుటకు ఆస్పదమే యుండదు. ఈసిద్ధాంతము దృఢముగా హృదయమందు నాటవలసియున్నచో మితిమీరిన జన్మములెత్తి సుఖదుఃఖము లనుభవించవలెను.

ఖనిజములగు లోహములు రాళ్లు మొదలుకొని మనుష్య జన్మమెత్తువరకు ఒకతరగతి సమూహమునుండి ఇంకొకతరగతి సమూహమునకెక్కుట ఈశ్వరసంకల్ప మహిమచేతనే సంభవించునుగాని జంతువుయొక్క స్వతంత్ర శక్తిచే కాదు. మనుష్య జన్మము వచ్చువరకు సమష్టికర్మతో జంతుసమూహములు వృద్ధియగుచువచ్చును. అనగా అవిభక్త కుటుంబములో నొకడు నష్టముకలుగజేసి ఇంకొకడు లాభముకలుగజేసినను ఈలాభనష్టములు కుటుంబములో వారికందఱి కెట్లుచేరునో అట్లనే పశ్వాది సమూహములో వేర్వేరుజంతువులు చేయుకర్మ ఆజాతి సమూహాత్మకు (Group soul) చేరును.

పశుసమూహము మనుష్య జాతి కెక్కిన వెనుక నెవరెవరు చేసిన కర్మ ప్రత్యేకముగా చేసినవారే అనుభవించవలసివచ్చును. ఇట్లగుటకు కారణము పశ్వాదులకు మనస్సు అంకురమెత్తి పక్వముగాక యుండుటయని చెప్పుదురు.

మనుష్యజాతికి జీవుండు ఎక్కిన తరువాత ఒకజన్మమందు చేసినకర్మ ఫలము ఇతర జన్మములందెట్లు అనుభవించునో ఆవివరము విచారింతము.

కర్మసిద్ధాంతమన కార్యకారణ సంబంధమని తెలియవలెను. అదెట్లన ఈజన్మమందు చేయుకార్యములు ముందుజన్మమున చేయుకార్యములకు కారణములుగా నేర్పడుచున్నవి. అదెట్లగునది విచారించుటకుముందు ఒకజన్మముయొక్క పరిమితి కను

గొందము. జీవుడు తల్లిగర్భమందుపడి గర్భములో పెరిగి పుట్టి బాల్య, కౌమార, యౌవన, వార్ధక్య దశలందు వివిధ కర్మములుచేసి యీదేహము విడిచిన తరువాత అనగా మరణానంతరము ప్రేత, పితృ, స్వర్గలోకములందు భూలోకమునందు చేసిన కర్మఫలము లనుభవించి తద్వారా నేర్వవలసినదంతయు నేర్చి పునహా జన్మమెత్తుటకు వేరుతల్లి గర్భములో ప్రవేశించుటవరకు ఒకజన్మమని తెలియవలెను.

ఈరీతి మితిగల ఒకజన్మమందు మనోవాకాయములతో (కర్మేంద్రియ జ్ఞానేంద్రియములతో) చేసిన కర్మ ఇచ్చట నే నశించక ముందుజన్మములందు చేయుకర్మలకు కారణములగుటకు దేహబీజములుగా (సూక్ష్మభూతములుగా)(Permanent Atoms) జంతువునంటి ప్రేతాదిలోకములకు పోయి మరల వచ్చుచునే యుండును. ఒకొక్క జన్మములోను స్థూల సూక్ష్మ దేహములలో చేసిన కార్యములన్నియు దేహ బీజములుగా నేర్పడి అనంతకోటి జన్మములకు కారణములుగా పరిణమించును. ఈ దేహబీజములకు స్థానమే కారణదేహమనబడును. దేనికి కారణమనగా లెక్కలేని దేహములెత్తుటకు కారణమని తాత్పర్యము. సంఖ్యకు మీరిన దేహములెత్తుట కివి బీజములుగా నుండుటనుపట్టి దేహబీజములనెడు సార్థకనామ మిడబడినది.

"ననశ్యతికృతంకర్మ సదాపంచేంద్రియైరిహ"

అనగా నిచ్చట ఈభూలోకమందు ఐదింద్రియములతో చేసిన కర్మయెప్పటికిగాని నశించదని భారతప్రమాణము కలదు.

శ్లో॥ శరీరంయదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః
గృహీత్వైతానిసంయాతి వాయుర్గంధానివాశయాత్ ॥

శరీరముపొందునపుడును, విడుచునపుడును మనసుతోను ఇంద్రియములతోను చేసిన కర్మ ఫలములన్నియు వాయువు సుగంధ దుర్గంధములను ఆయావస్తువులనుండి యెట్లుతీసుకొని

పోవుచున్నదో అట్లనే ఈశ్వరాంశమగు జీవుఁడుతీసుకొని పోవునని భగవద్గీతయందు పదినైదవ అధ్యాయములో ఎనిమిదవ శ్లోకమున చెప్పబడియున్నది.

మనుష్యజన్మ మెత్తినతరువాత ప్రతిమనుష్యుఁడు చేసిన కర్మ సమష్టికర్మలో చేరక వానినే యెట్లు అంటిపోవుననుటకు భారతము శాంతిపర్వములో నిట్లు వివరించబడియున్నది.

శ్లో॥ యథాధేనుసహాస్రేషు వత్సోవిందతిమాతరం
తథాపూర్వకృతంకర్మ కర్తారమనుగచ్ఛతి॥

వెయ్యి ఆవులగుంపులో దూడలు తమతమ తల్లులయొద్దకు చనుగుడువ నెట్లుపోవునో అట్లనే పూర్వజన్మమందు చేసినకర్మ ఆకర్మచేసినవానినే పొందుననని తాత్పర్యము.

జగత్తులోనుండు సమస్త వ్యత్యస్తములకు కారణము వారువారు చేసిన కర్మములేగాని వేఱుకారణము లేదని దృఢపడుచున్నది.

శ్లో॥ స్వరూపతాఆత్మకృతంచవిస్తరం
కులాన్వయంద్రవ్యసమృద్ధిసంచయం
నరోహిసర్వోలభతేయథాహృతం
శుభాశుభేనాత్మకృతేనకర్మణా॥

ప్రతిమనుష్యుని సురూపకురూపములు, సత్కుల దుష్కులములలో పుట్టుట, ద్రవ్యము సమృద్ధిగ ప్రోగుపుట, కాకయుండుట మొదలగు సమస్తమును తానుచేసిన సుకృత దుష్కృత ఫలములే తప్ప వేరుకాదని పరాశర గీతలందు చెప్పబడియున్నది.

జగత్తునందుండు వ్యత్యస్తములకు నింతకంటె శ్రేష్ఠమైన కారణమేమి యున్నది? ఎంతెంత ఎవడు చేయుచున్నాడో అంతంతనే అనుభవించునను శాస్త్రవాక్యము ముమ్మాటికిని సత్యము. ఇంతకంటె వేరు కారణములేదు.

ఎవనికి ఏ కాలమందు ఎట్టి స్థితియందు ఏమిసంభవించునో వాటికంతయు వాడే కారణముకాని వేరుకాదని దృఢముగా సనాతన ధర్మసిద్ధాంతమందు చెప్పఁబడియున్నది.

బాల్యమందుచేసిన కర్మఫలము బాల్యమందే ప్రాప్తమగును. యౌవనమందుచేసిన కర్మఫలము ఆయవస్థయందే లభించును. వార్ధక్యమందొనర్చిన కర్మఫలము వృద్ధదశయందు అనుభవమునకు వచ్చును. ఏకాలమం దనుభవమునకు రావలెనో ఆకాలమందు వచ్చునుగాని కాలముమీరి ఎప్పటికినిరాదు.

శ్లో॥ బాల్యేవాయది వావృద్ధేయ్యత్కరోతిశుభాశుభం
తస్యాంతస్యామవస్థాయాం భుఙ్క్తే జన్మనిజన్మని
అచోద్యమానానియథాపుష్పాణిచఫలానిచ
స్వంకాలంనాతివర్తంతే తథాకర్మపురాకృతం॥

వృక్షములందు పుష్పములు ఫలములు నియత కాలముతప్పక ఆయాకాలములందెట్లు కలుగునో అటులనే పురుషుఁడు బాల్య యౌవన వార్ధక్యదశలయందొనర్చిన కర్మములు ఆయాదశలయందు తప్పక ఫలములనిచ్చునని తాత్పర్యము.

కర్మసిద్ధాంతమే నిశ్చయమగునేని కర్మచేసినతోడనే ఎందుకు ఫలము అనుభవమునకురాదని కొందఱు ఆక్షేపింతురు. ఈయాక్షేపణ సరియైనదికాదు. ఎల్లునిన భూమిలో విత్తులు విత్తినతోడనే ఫలమునకు వచ్చునా? ఇప్పుడు కర్మచేయుట విత్తు విత్తినట్లు భావించవలెను. విత్తు అంకురించి పెరిగి వృక్షమై పుష్పించి ఫలమునిచ్చుటకు వాన కృషి, కాలము ఇవన్నియు యెటుల నవశ్యమో అటులనే చేసిన కర్మ ఫలించుటకు దైవము పురుషకారము, కాలము ఈ మూడును అవశ్యము.

శ్లో॥ దైవంపురుషకారశ్చ కాలశ్చమనుజోత్తమ
త్రయమేతన్మనుష్యశ్చ పిండితంస్యాత్ఫలాత్పలం॥

కృషివృష్టిసమాయోగాత్ దృశ్యంతే ఫలసిద్ధయః
తాశ్చ కాలే ప్రదృశ్యంతే న వాకాలే కథంచన॥

అని మత్స్యపురాణమం దుదాహరించబడినది. ఈ శ్లోకముల అర్థము పైన వ్రాయబడినది.

ఈ కార్యకారణ సిద్ధాంతము జనులకు నిశ్చయముగా హృదయమందు దృఢముగ నాటినదైన ఎవరుగాని ఏలాటి యకృత్యమైన చేయుటకు పూనుదురా? జనులు నీతిమార్గము వదలక నిలుకడగా ఆచరింపచేయుటకు ఉత్తమోత్తమైన కర్మసిద్ధాంతము తప్ప వేరేదికలదు? సమస్త జనులు సుఖమునే గదా కోరుచున్నారు. సుఖమును పొందుటకు ఉపాయమిట్టిదని నిశ్చయముగఁ దెలిపినేని దాని నెందు కాచరించకఁ బోదురు?

ఈసిద్ధాంతము సామాన్యముగ పట్టుపడుట దుర్లభము గనుక అజ్ఞులకు, మూఢులకు, అల్పబుద్ధులకు, మందులకు, సామాన్య ప్రజ్ఞగలవారికి, కుశలబుద్ధిగలవారికి అందరికిని తగిన నియమములు కర్మ సిద్ధాంత రహస్యములన్నియు తెలిసిన ఆత్మవేత్తలగు మన్వాది మహానుభావులేర్పరచి లోకమునంతయు కడతేర్చుచున్నారు.

ఆ నియమములు దీనికి తరువాత సంచికలందు వ్రాయబడును.

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

# మరణానంతర స్థితి.

మరణానంతరమున జీవునిస్థితిగతులిట్టివని యథార్థముగ లోకములో ననేకులెఱుఁగరు. ఉత్క్రమణకాలమున ఘోర రూపులగు యమదూతలు వత్తురనియు, జీవుని ననేకవిధములుగ జడిపించి పాశములతోఁ గట్టి దక్షిణ దిగ్భాగంబున బహుదూరమున నున్న యమపురికిం గొనిపోవుదురనియు, పోవుమార్గమున జీవుఁడు పెక్కు మరవస్థల బొందుననియు, అచటఁ జేరిన పిమ్మట రౌరవాది నరకములయందు ద్రోయఁబడుననియు, అచట యమ భటులు వానిని గదలతో మొత్తుటేగాదు, కత్తులతో నరుకుటేగాదు, ఇనుమునుకరగించి చెవులలోఁబోయుటేకాదు, ఎఱ్ఱగా కాలియున్న ఉక్కు స్తంభములకు వానినిబిగియించి కట్టుటేకాదు ఇట్టి చెప్పన లవిగాని అనేక చిత్రహింసల బెట్టుదురనియు ననేక కట్టుకథలు లోకములో నేర్పబడియున్నవి. ఇవియన్నియు కేవలము పుక్కిటి పురాణములై యున్నవిగాని వానియందు సత్యమించు కైనను లేదు. వీనివలన జనులకు మరణము పరలోకమును భయంకరముగ దోచును.

మరణమునుగురించియు పరలోక స్థితినిగురించియు నిశ్చయ జ్ఞానమును సంపాదించుకొనుట ప్రతిమనుజునికి నవశ్యకర్తవ్యంబు.

దివ్యజ్ఞాన సమాజములోఁ జేరిన త్రిలోక జ్ఞానసంపన్నులగు మహనీయులు కొందఱు పరలోకమును గురించియు పరలోక స్థితులను గురించియు వ్రాసిన గ్రంథములు పెక్కుగలవు. వాని నామూలాగ్రముగ జదివిన వారికి మృత్యుభయము తగ్గును. మృతి జెందిన బంధుమిత్రులు విషయమున శోకము నివర్తించును.

ప్రతిమనుజునికిని స్థూలదేహమేకాక సూక్ష్మదేహ మొకటి యున్నది. స్థూలదేహమువలెనే అదియు ప్రకృతి సంబంధమైయున్నది. స్థూలదేహము భూలోక ప్రకృతిమయమైనది.

సూక్ష్మదేహము భువర్లోక స్వర్గలోక ప్రకృతి మయమైనది. ఇమ్మూడులోకములు పరస్పర మిళితములై యొకచోటనున్నవి. భూలోకమున్నచోటనే భువర్లోక స్వర్గలోకములున్నవి. ఆలాగుననే స్థూలశరీరముతో సూక్ష్మశరీరము మిళితమై రెండును ఒకచోటనే యున్నవి. కావున ప్రతిమనుజుఁడును భూర్భువ స్వర్గలోకముల నెడి త్రిలోకములందు సంచరించుచుండును. భూలోకము ఇహలోకమనియు తక్కినవి రెండు పరలోకమనియు వ్యవహరింపఁబడును. అఁటుగావున పరలోకము ఎచటనో బహుదూరమున నుండునది కాదు. అది మనమున్నచోటనే యున్నది. పరలోకమునకు వెళ్లినవారు మనసమీపముననే యున్నారు. ఇకాలమునను కొందఱు మహనీయులకు పరలోకము దృగ్గోచరమయియున్నది. యోగాభ్యాసముల చేత సూక్ష్మదృష్టిని కలుఁగజేసుకొనుచున్నని యెల్లవారును దానిని ప్రత్యక్షముగఁ జూడఁగలుగుదురు. మృతినొందిన బంధుమిత్రులందఱు అపుడు గోచరమగుదురు. వియోగమువలనఁ గలిగిన శోకమపుడు పరిహారమగును.

నిద్రయొక్క స్వరూపము తెలిసినయెడల నీవిషయ సుబోధమగును. జీవుఁడు నిదురబోవుటలేదు. స్థూలశరీరము మాత్రమే నిద్రించును. స్థూలశరీరము నిదురించునపుడు జీవుఁడు సూక్ష్మశరీరమునుమాత్రము ధరించినవాఁడై భువర్లోకమున సంచరించుచుండును. అపుడాలోకముననున్న మృతబంధువులును, స్నేహితులును వారికి గోచరమగుదురు. వారితో మాట్లాడును కలిసిమెలసి వర్తించును. వారుజీవించియున్నకాలమందు భూలోకమున వారితో నెట్లు మెలగుచుండునో అటులనే ఇపుడు మెలగుచుండును. గతించిన ప్రబంధు మిత్రుల వియోగమునకై పగలెల్ల మనము విచారగ్రస్తులమై యుందుమో వారితో రాత్రులయందుఁ గలసి సరససల్లాపములు చేయుచుందుము. పగటి

వేళ మనము స్థూలశరీరమున వర్తించుచుండుటచేతను మృతులకు స్థూలశరీరములు లేకపోవుటచేతను మనకును వారికిని పరస్పరావలోకనము ఘటింపదు. రాత్రివేళలందు మనమును వారును సూక్ష్మశరీరములందే యుండుటచేత నన్యోన్య సమాగమము సహజముగ కలుగును. సామాన్య మనుజునికి పగటి వర్తమానములు నిద్రయందు జ్ఞాపకముండవు. నిద్రయందు జరుగు వృత్తాంతములు పగలు జ్ఞాపకముండవు. అయిన నొకప్పుడు నిద్రాకాలమందు జరిగిన వృత్తాంతములు కొంతమట్టుకు మేలొన్నపిదప జ్ఞాపకమునకు వచ్చును. దానిని స్వప్నమందుము. నిన్నటి రాత్రి స్వప్నములో నాకు చనిపోయిన వారగుపడిరని చెప్పుదుము. మృతినొందినవారు అహోరాత్రము లందెల్లప్పుడును మన సమీపముననే యుండి మనలను చూచుచుందురుగాన వారికి వియోగదుఃఖము లేదు. మనకును సూక్ష్మదృష్టి కలిగెనేని వారు మనకు రాత్రింబగళ్లు ఎల్లప్పుడు గోచరమగుచుందురు. మనకును వారిని గురించిన దుఃఖము నివర్తియగును. ఈవిషయమునే భగవద్గీతయందు

శ్లో॥ గతాసూనగతాసూంశ్చ నానుశోచంతిపండితాః॥

జ్ఞానవంతులు చచ్చినవారికిగాని బ్రతికినవారికిగాని శోకించరు. అని చెప్పబడియున్నది.

పరలోకసుఖ కారణము.

మృతిఁజెందిన పిమ్మట పరలోకమున సౌఖ్యము ననుభవించుటకు మనుజుడేమిచేయవలయునను విషయము ముఖ్యముగ విచారించఁదగినది. "అపుత్రస్య గతిర్నాస్తి" అను వచనమును బట్టి యనేకులు పుత్రులులేనివారికి పరలోకమున సద్గతిలేదని దృఢముగ నమ్ముచున్నారు. ఇందువలన ననేకులు పుత్రులులేమికై మిగుల చింతిల్లుదురు. అందుకొఱకై యెన్నియో ప్రయత్నములుజేయుదురు. కొందఱు పరసుతు నొకరిని స్వీకరించి

పెంచుకొని తన్మూలమున ననేక కష్టముల పొలగుదురు. ఇది యంతయు కేవల మవివేకము. ఎవడుగాని ఇహలోకమందు తానొనర్చిన పుణ్యపాపములకుఁ దగినట్లు పరలోకమందు సుఖ దుఃఖముల ననుభవించును. అంతియగాని మఱియొకనివలన సుఖముగాని కష్టముగాని లభింపదు. అట్లనిన పుత్రుడు చేసెడు పరలోకక్రియలు కేవలము నిష్ప్రయోజకములని యర్థము కాదు. సత్పుత్రుఁడై శ్రద్ధావంతుఁడై జ్ఞానవంతుడై యథా శాస్త్రీయముగ నొనర్చినచో పరలోకక్రియలు కించిత్సహకార ములగును. కించిత్తేగాని అధికముగాదు. జ్ఞానశ్రద్ధలులేక చేసినచో ఈషన్మాత్రముగూడ ఫలమియ్యదు. ఎది యెట్లున్నను పరలోకమున సుఖముగ కాలము గడుప నిచ్ఛయించువారు ఇహ లోకమున ధర్మముగ ప్రవర్తింపవలయును. వేరు సమపాయము లేదు. అందుకై యితరుల నమ్ముకొని యుండుట వెఱ్ఱితనము.

ఉత్క్రమణకాలమందు జీవుఁడెట్టి స్మరణతో శరీరమును వదలిపోవునో పరలోకమునను న్నట్టుకు నాభావముతోనే యుండునని శాస్త్రమునఁ జెప్పబడియున్నది. ప్రాణవంతుడై యున్నపుడు తఱచుగ నేవిషయమును స్మరించుచుండునో ఆవి షయమే అంతకాలమున స్మరణకువచ్చును గాని నూతనవిషయ మేదియురాదు. కావుననే అంతకాలమునందు నాస్మరణ రావలయునని కోరికగలదేని సర్వకాలములందు నన్నే స్మరించు చుండుమని గీతయందు స్వామి అర్జునుని కుపదేశించెను. ఒక వేళ బలాత్కారముగ నూతనవిషయమేదేని ఆసమయమున స్మర ణకుఁ దెచ్చుకొన్నను ఉత్తరక్షణమున నది పారిపోవును గాని స్థిరముగ నిలువదు. ఇదియునుగాక పరలోకమునందు బాహ్య విషయములను గురించిన ప్రజ్ఞలేక మనసులో నెదేని యొక విష యమును ధ్యానించుచు జడత్వముతోఁ బడియుండువానికి మాత్ర మే అంతిమస్మరణ నియమము చెప్పబడియున్నదిగాని అచట

స్వేచ్ఛావిహార శక్తిగలిగి విషయంబుల ననుభవించువాని కీనియమము లేదు. అట్టివాని మనోభావము ఇహలోకమందున్నప్పటివలెనే ప్రతిక్షణము మారుచుండును. అంతిమస్మరణయే స్థిరముగ నిలిచియుండదు. కావున నెన్నివిధముల విచారించినను ఇహలోకమునఁ జేసిన పుణ్యమే మనుజుని పరలోకమునఁ గాపాడవలయునుగాని తక్కిన దేమియుఁ దోడ్పడదు.

ఆకస్మిక మరణములు.

వార్ధక్యమువలనగాని వ్యాధివలనగాని మనుజునికి ఇంద్రియ విజృంభణముతగ్గి ఇహలోక పదార్థములమీది ఆశ క్రమక్రమముగ క్షీణించి వాఁడు పరలోకాభిముఖుఁడయినచో వానికి మరణానంతరమున పరలోకమున మిగుల బాధయుండదు. అటుగాక ఆకస్మికముగ అకాలమరణము సంభవించెనేని వాఁడు పరలోకమున పెక్కుడుములబడు. ఇంద్రియసుఖములపై వానియాశలన్నియు బలిష్ఠములైయుండును. అవియన్నియు క్రమక్రమముగ తగ్గిపోవుటకు చాలకాలము పట్టును. అంతకాలము వాడచట గడపవలసియుండును.

యుద్ధమునందు మృతినొందువారికి వీరస్వర్గము లభించునని శాస్త్రము చెప్పుచున్నది. యుద్ధవీరుఁడు రణరంగమున బోరాడుచో దేహముమీద అభిమానమును బొత్తుగావదలి ప్రాణమునకు తెగించి స్వధర్మమునాచరించుచుండు గావున "స్వధర్మే నిధనం శ్రేయః" అనుభగవద్వాక్యానుసారమున వాఁడా ఫలమును పరలోకమున ననుభవించు. యుద్ధభూమియందు సాహసము ధైర్యము స్వార్థత్యాగము మొదలగు సుగుణములభివృద్ధినొందు. శరీరమును పరిత్యజించి వెళ్లునపుడీగుణములన్నియు వాని వెంటఁబోవు. మరుజన్మమున నవి వానియందు ప్రకాశించు.

అపమృత్యువువలన గాని మరణమువలన గాని మృతి జెందువారలు పరలోకమున మిగుల భయభ్రాంతులై యుందురు.

అట్టివారిని వగ్గరదీసి యూరార్చి ఆలోకము యొక్క స్థితి గతుల వారికి దెలియ జెప్పుటకు కొందఱు పుణ్య పురుషులేర్పడి యున్నారు.

జనన మరణములు.

జీవుని యొక్క స్వస్థానము భూర్భువ స్వర్గలోకముల కు ఊర్ధ్వభాగముననుండును. జన్మమెత్తుటకు వాఁడచటనుండి దిగి స్వర్గలోకమున కొంతకాలము గడపి అచటనుండి భువర్లోకమునకు వచ్చి పిమ్మట భూలోకముం జేరి క్రమముగ తల్లిగర్భమునం బ్రవేశించి అచట నవమాసములుగడపి అనంతరము భూపతనమగును. అచట ప్రారబ్ధవశమగు నాయుః ప్రమాణమెంతవఱకు నుండునో అంతవఱకు జీవించియుండి పిమ్మట శరీరముం బరిత్యజించి మరల భువర్లోకముం జేరు. అచ్చోట భూలోకమున దానొనర్చిన పాపఫలము ననుభవించుచు చాలా కాలముండును. పాపమంతయు క్షీణించిన పిమ్మట వాఁడు స్వర్గమునకేగి భూలోకమునఁ దాను జేసిన పుణ్యకార్యముల యొక్క ఫలమగు స్వర్గభోగముల ననుభవించుచు ననేకనూర్ల సం॥రములు గడపి పుణ్యమంతయు క్షీణించఁగానే ఆలోకమునువిడిచి స్వస్థానముం జేరు. ఇది ఒక జన్మముయొక్క ఆద్యంత పుణ్యకాలము.

జీవుఁడు స్వస్థానమును విడిచినది మొదలు ఇహలోక పరలోకములందు ప్రదక్షిణము చేసికొని మరలయథాస్థానము చేరుటకు వేయిసంవత్సరముల పైగా బట్టును. అందు భూలోకమున గడపెడు కాలము స్వల్పభాగమేగదా. సామాన్యమనుజుఁడీ స్వల్పకాలమునే అతిముఖ్యముగ నెంచునుగాని మిగతకాలముపై నంతగా దృష్టియుంచుటలేదు. ఈస్వల్పకాలములోను నాద్యంతములు ప్రధానములుగా నెన్నునుగాని జీవితకాలమంతయు బ్రధానమని యెన్నఁడు. దాని యాద్యంతములే జనన మరణములు. జనన మరణములే కేవలము ప్రధానముగా నెంచఁబడును.

దీర్ఘాలోచన జేసి జూచినచో పరలోకమున గడిపెడు కాలమునకంటె నిహలోకమున( గడిపెడు కాలము అతిశయము కానోపదు. భూలోకముననుండు కాలములోను జనన మరణ కాలములు తక్కిన కాలము కంటెను ప్రధానములు కావు.

మనుజుని యొక్క జీవిత దశలో ముఖ్యమైన కాలమేది యన(గా జనన మరణముల రెంటికిని సరిమధ్యనున్న కాలము. అయ్యది మనుజునికి దాదాపు నలుబది సంవత్సరముల వయసు కాలము. జీవుడు స్వస్థానము విడిచినది మొదలు భూలోక మున నలుబది సం॥రముల వయస్సు దనుక అధోముఖుడై విషయాన్వేషణ పరుడై క్రిందికి దిగి వచ్చుచుండు. అది మొదలు ఊర్ధ్వముఖుడై ఆత్మాన్వేషణాసక్తుడై నిజసదనముం గూర్చి యెక్కిపోవును. వీనిలో మొదటిది ప్రవృత్తిమార్గమనియు రెండవది నివృత్తిమార్గమనియు జెప్పనగు. ఈ రెండుమార్గము లయొక్క సంధికాలము మిగుల ముఖ్యమైన కాలము. అపుడు మనుజునికి ప్రాపంచిక విషయములందభిలాష తగ్గి పారమార్థిక చింత అంకురించవలయు. లోకములో ననేకులకు అట్లగును. విశేష జ్ఞానవంతుడుగాక కేవలము పామరుడును గాక మధ్యము తరగతిలోనుండు వానికి నలుబదియేండ్లపుడు కొంచెము వివేకము కలిగి కడతేరెడుమార్గము వెదకికొనవలయునని బుద్ధిపొడమును. జన్మాంతరమున కొంచెము జ్ఞానసంపన్నుడై యుండినవానికి నలుబది సంవత్సరములకు పూర్వమే అట్టి జ్ఞానోదయమగును. కేవల మజ్ఞానదశలోనుండు వాడు ఆమరణాంతము ప్రాపంచిక విషయములందు ఆశను విడువ నేరక సంసారమునందు మునిగి యుండునుగాని పారమార్థిక విచారము కలుగదు.

మనుజుడు 21 సం॥రములు బ్రహ్మచర్యాశ్రమమున( గడు పవలయుననియు, పిమ్మట 21 సం॥రములు గృహస్థాశ్రమమునం దుండవలయుననియు, అటుతట సంసారమును పరిత్యజించి గృహ

కృత్యనిర్వాహక భారము పుత్రులకప్పగించి భార్యతోడ నరణ్యమునకుఁబోయి విషయసుఖముల వర్జింపి కందమూలాదులచే నుదరపోషణము గావించుకొనుచు తపోధ్యానాదులయందు గాలము గడపవలయుననియు, అట్లు 21 సం॥రములు గడిపిన పిమ్మట ఏకాకియై సర్వసంగపరిత్యాగముచేసి సన్యాసియై లోకానుగ్రహము కొఱకు గ్రామైక రాత్రముగా సంచారము చేయవలయునని యు శాస్త్రములు చెప్పుచున్నవి. మొదటి రెండా శ్రమములు ప్రవృత్తిమార్గమునఁ జేరినవి. తృతీయచతుర్థాశ్రమములు నివృత్తిమార్గమునఁ జేరినవి. ఈ రెండుమార్గముల సంధికాలము జీవునకెంతయు ముఖ్యమైనది. అట్టిస్థితి 40, 42 సం॥రముల వయస్సున సంభవించవలయును. ఆవయస్సు అతిక్రమించిన తరువాత సయితము ఏమనుజునికి పారమార్థిక విచారము పుట్టదో వానిది అధమజన్మమని నిశ్చయించవలయు. మనుష్యుని ఆయుష్కాలములో పైజెప్పిన ఒక సమయమే ముఖ్యమైనది. తక్కినవన్నియు సామాన్యములు. జనన మరణములందతిశయ మేమియు లేదు. అవి స్వాభావిక పరిణామములు.

ఏ మనుజుఁడుగాని బ్రహ్మచర్యమున దేహబలమును విద్యయు సంపాదించుకొని, పిమ్మట గృహస్థ ధర్మమును శాస్త్రోక్తముగ జరుపునేని వానికి నలుబది సం॥రముల వయస్సువచ్చునప్పటికి ఇంద్రియములు స్వాధీనమునకువచ్చి చిత్తశుద్ధి కలుగును. అదిమొదలు వివేక వైరాగ్యముల నభివృద్ధిజేసికొని లోకోపకార పరుడై వర్తించును. అట్టివాఁడు శరీర వియోగానంతరము పరలోకమున నేలాటి కష్టములకును లోనుగాక సుఖంబుగ కాలము గడపు.

పరమాత్మని నరసింహయ్య.

# ప్రశ్నోత్తరములు.

1. ప్ర॥ ఏకాదశి ఉపవాసమునకు అర్థమేమి? దీని నాచరించుటచే మనుష్యునందు సద్గుణము లెట్లు ఊర్జితపడి వానికి పుణ్యములభించును?

ఉ॥ ఉపవాసము చేయుటచే దేహము స్వాధీనమగును. మనుష్యునకుండు స్థూలసూక్ష్మదేహములందు స్థూలదేహము స్వాధీనమునకు రాను రాను సూక్ష్మదేహమందు వ్యవహరించుట సులభమగును. ఏకాదశి దినమందు చంద్రునికి భూమికినుండు సంబంధముచే నీభూమియందుండు ఆకర్షణశక్తులు వ్యత్యాసములను పొంది మనుష్యుడు సన్మార్గమందు ప్రవర్తించుటకు చాలా సహాయమగును.

"డాక్టరు ఆక్టర్" అనేను ఒకప్రసిద్ధుడైన వైద్యుడు మనుష్యుడు మాంసాదులు తినక ఓషధాహారమునే పుచ్చుకొనుచు వారమునకొకతూరి ఉపవాసము చేయుచు వచ్చినట్లైన వానికి ఇంద్రియనిగ్రహము సులభమగుననియు, బుద్ధికూడ చురుకగునని చెప్పియున్నాడు.

2. ప్ర॥ శ్రీరామచంద్రుని కాలమందు ఏకాదశి ఆచరించుచుండిరా?

ఉ॥ దీనికి వాల్మీకిరామాయణ మందెక్కడను ఆధారము దొరకదు. అయినను శ్రీరామచంద్రుని కాలమందు ఏకాదశి ఆచరణయందుండెననుటకు అధ్యాత్మ రామాయణమందును స్కాందపురాణమందును ఆధారము దొరుకుచున్నది.

3. ప్ర॥ ఏకాదశి క్రమముగ ఆచరించుటవలన మనుష్యుని మరణాంతరస్థితియందేమైన వ్యత్యాసమగునా? భీష్మ ఏకాదశి యొక్క ప్రాశస్త్యమేమి?

ఉ॥ సూక్ష్మశరీరముల స్థితిని క్రమపరచుకొనుటకై

ఏర్పడిన సాధనములందు ఉపవాసములు జాగరణలు మిక్కిలి ప్రబలమైనవి. వీటిని ప్రపంచమందు సమస్తులు అన్నిమతములందును ఆచరించుచుందురు. జ్యోతిషసిద్ధాంతములు జనులకు బాగా తెలియవచ్చెనేని వ్రతాచరణములకు హిందువులందు ఏర్పరచబడ్డ తిథివారముల ప్రయోజనము ఎరుగవచ్చును. భీష్మ ఏకాదశియందు ఆపేరుచేతనే జనులమనంబులు భీష్ముడను మహాపురుషునితట్టు తిరుగుటవలన అట్టిమహాత్ముని ధర్మాచరణ, సత్యసంధత్వము, తపస్సు మొదలగు విషయములు మనస్సుకువచ్చి ఉపయోగమగును. ఇదిగాక అట్టిమహాత్ములు ఈప్రపంచ సంబంధము విడువక లోకహితమునకై సూక్ష్మ ప్రపంచమందుండినట్లాయెనా వారినుండి భక్తులకు విశేషముగ అనుగ్రహము దొరకవచ్చును.

4. ప్ర॥ మరణమనఁగా నేమి? పుట్టినవారందరు చావవలసిన దెందుకు?

ఉ॥ మరణమనగా అన్నమయకోశమునకును ప్రాణమయకోశమునకునున్న సంబంధము తప్పిపోవుట. అనగా సాంద్రదేహము ఛాయాదేహము వేర్వేరగుట. స్థూలదేహమునకు చావువచ్చుట అవశ్యకము. ఏలనన అంతర్యామియైన జీవుడు శరీరమునకు తనశక్తులను వ్యక్తపరచుటకు అనుకూలమైన ఆకారమును ఇచ్చుచున్నాడు, ఆశక్తులను వ్యక్తపరచుటకు తగినట్లంతయు దేహమును మార్చుచునేయుండవలెను. అట్లు మారుటకు వీలులేనపుడు అది (దేహము) పగిలి పోవును అనగా మృతినొందును. జీవునికి జ్ఞానము వృద్ధియైనట్లంతయు ఉత్తమమైన మెదడును దేహమును కావలెను.

జం. శ్రీనివాసరావు.

# సత్కర్మ రత్నావళి

(344-వ పుట శేషము.)

పిదప శాస్త్రరీతిని కరచరణములు ప్రక్షాళనముజేసుకొనవలయును. ఇట్లు శౌచవిధిమైన తరువాత వంచి మామిడియాను మొదలైనవానితో సావకాశముగా (ఉత్తరాభిముఖముగా గూర్చుండి) దన్తశుద్ధిజేసికొని తరువాత స్నానముచేయవలయును. ఆనీటితీరము పరిశుద్ధముగా నుండవలయు. జలమందుఁబుక్కిలించి యుమ్మివేయఁగూడదు. స్నానకాలమందు దురాచారులు, స్త్రీలు, నాస్తికులు, వేదబాహ్యులు, బాలురు, రోగులు, జాతాశౌచమృతాశౌచముగలవారు వీరితోజేరి స్నానముఁజేయఁగూడదు. ఇట్లు శుద్ధావగాహస్నానముజేసి శాస్త్రోక్తప్రకారముగా నాచమనము జేయవలయును. ద్వాదశీ మొదలైన తిథులలో * నెల్లివరుగును కల్పముజేసి స్నానముజేయుట యుత్తమము. స్నానముజేసి లోపలఁ గౌపీనమును ధరించి యొక వస్త్రమునుఁ బైనవేసుకొని భగవన్తుని ధ్యానించి మౌనముగా భగవన్మంత్రమును జపించి సనాతనుండగు శ్రీదేవదేవుని ధ్యానించి ఆయామతశాస్త్రరీతిని ఊర్ధ్వపుండ్రమునో త్రిపుండ్రమునో ధరించుకొని శ్రీపురుషోత్తముదేవుని ధ్యానించి సద్భావముతో, తామస పదార్థములను త్యజించి సత్వగుణమే ప్రధానముగాఁగల సాత్వికాహారములను భుజించవలయును. సదాచారవర్తకులగు మానవులందరును ఇందుకు ప్రమాణంబుగ శ్రీకృష్ణపరమాత్ములవారు ఉపదేశించియుండు

శ్లో॥ ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః
రస్యాస్స్నిగ్ధాస్థిరాహృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః॥

---

* ద్వాదశీ నవమీనన్దా, త్రయోదశ్యష్టమీషుచ, ద్వితీయాయాం దశమ్యాంచ, స్నానమామలకోదకైః॥

అను గీతావాక్యమును ఇచ్చట గమనించఁదగినది. ఈరీతిగా ప్రతిదినము స్థిరచిత్తముగలవారై అనుష్ఠించుచు, తక్కినసమయములందు తమతమ గృహకృత్యములెవ్వియో వాటిని చక్కగ జేయుటయందాసక్తిఁ గలవారై, సర్వదా విరాజమానంబైన శ్రీ బ్రహ్మణ్యదేవుని ధ్యానింపుచు భగవద్భక్తుల పూజించుచు సత్త్వగుణమును జేకొని యుండవలయును. ఇదియే సత్కర్మము. ఇదియే శాస్త్రాభిప్రాయము. ఇదియే సనాతనధర్మము.

ఏ కాలమందును ఏ కారణమువల్లను కోపమునకు చోటియ్యగూడదు. కోపముచే గలుగు విపరీతమును వివరించి చెప్పుటకు నలవిగాదు. గీత 2వ అధ్యాయము 63వ శ్లోకము ఇచ్చట పరమోదాహరణంబగు. కాబట్టియే, "తనకోపమె తనశత్రువు" అని సుమతిశతకము వక్కాణించుచున్నది. ఇంతియగాక, "తన్ను కాపాడుకొనవలెనన్న కోపమునకు చోటియ్యఁగూడను. దాని త్యజించవలయును. లేనియెడల తన్నే చంపును ఆకోపము" అని ద్రావిడభాషయందు తిరువళ్లువులవారు ఆనతిచ్చియున్నారు కావున, "పరులలిగిన నలుగనతడు పరముడుసుమతీ" అను పెద్దల వాక్యరీతిని కోపమును దూరముగా తొలగించి మిత్రులు, విరోధులు, అందరియెడను సహోదర భావముగలవారై యుండవలయు. ఈ భూవలయమందు మిగులప్రఖ్యాతినొంది ప్రకాశించుచుండు దివ్యజ్ఞానసభ (Theosophical Society) తన ప్రథమోద్దేశముగాగొని జయభేరి మ్రోయుచుండునది యేదో అది, ఈసహోదరభావమేగదా? మనహిందూమతక్షేమమును గోరు ప్రతిమానవులును దీని అవశ్యమాచరించఁదగను.

ఇక, భక్తవత్సలుండగు శ్రీకృష్ణుడు తన ప్రియశిష్యుండైన అర్జునునికి ఎట్టివాఁడు తనకు ప్రియుండనియు, ఉత్కృష్టుఁడనియు సెలవిచ్చినారో ఇచ్చట విచారింతము.

శ్లో॥ సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబన్ధుషు

సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే॥
సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమస్సఙ్గవివర్జితః॥
॥ తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః॥
మానావమానయోస్తుల్య స్తుల్యో మిత్రారిపక్షయోః
సర్వారమ్భ పరిత్యాగీ గుణాతీతస్సఉచ్యతే॥

మఱియు నీతిసంగ్రహమునందు:—

కం॥ అలిగిన నలుగక యొగ్గులు
పలికిన మఱివిననియట్లు ప్రతివచనంబుల్
బలుకకఁ బన్నమువడి యెద
దలపకయున్నతడె చూవె తత్త్వజ్ఞుడిలన్॥

ద్వేషభావమునుఁ బొత్తిగా మానవలయును. "ఈశ్వరస్సర్వభూతానాం, హృద్దేశోఽర్జున తిష్ఠతి" అని గీతాప్రమాణంబు గావున ఏభూతమును ద్వేషించినను ఈశ్వరునే ద్వేషించినట్లు గనుటకు సందియములేదు. కావున. సర్వదా కరుణతోఁ గూడిన మనస్సుగలవారై సమస్తభూతములందును సహోదరభావమునుంచి అన్నియు భగవత్స్వరూపమేయని దలచి స్థిరచిత్తముతో భక్తి, జ్ఞాన, వైరాగ్యములను గైకొని దివ్యమంగళ విగ్రహుండగు శ్రీపురుషోత్తముదేవుని ధ్యానించుచునుండవలయు.

సత్కర్మము ననుష్ఠించుటకువలయు శ్రద్ధ, భక్తి, నిష్ఠ, నిలకడ, సర్వభూత సమత్వము ఇత్యాదులను శ్రీ జగదీశ్వరుడు కృపఁ జేయుఁగాత!!!

ఓమ్ తత్సద్బ్రహ్మార్పణమస్తు.

పి. ఏ. కృష్ణస్వామి.

# శ్రీకృష్ణోపదేశము.

## ఆత్మజ్ఞానము.

సకల దేహములయందును ఆత్మయను సత్పదార్థమొకఁటియే నిత్యమైయుండునది. కనుక, సకల జంతువులకును నిజ రూపము ఆత్మయేగాని దేహముగాదు. నీకును, నాకును అనేక దేహములు గలిగి నశించుచున్నను మనము మాత్రము నశించు వారము కాము. గనుక దేహత్యాగమునకు దుఃఖించుట యవివేకము. ప్రతిదేహమునకును బాల్య, యౌవన, కౌమార వార్ధికావస్థలు ప్రాప్తించుచున్నవిగాని ఆత్మకు నేయవస్థలును గలుగజాలవు. ఆయా అవస్థలు నశించునపుడు ఆత్మ నశించుట లేదు. ఇట్లు ఒకదేహమున కనేకావస్థలు మారుచున్నట్లు, దేహమందుండెడు ఆత్మకును మరియొక దేహప్రాప్తి కలుగుచున్నది. ఆత్మజ్ఞాని యిందుకొరకు దుఃఖించడు. ప్రతిదేహికిని ఇంద్రియ విషయంబులు సంసారదుఃఖంబును గలిగించుచున్నవి. అప్పుడు చిత్తవికారమును పొందక సహించుకొనుటయే జ్ఞానము. అట్టిధైర్యవంతుడే మోక్షమునకు సమర్థుడు. మరియు సత్తు, అసత్తు అను రెండువస్తువులలో ఆత్మ సత్తనియు దేహాదిప్రపంచము అసత్తనియు జెప్పబడును. సత్పదార్థమెప్పటికిని నాశముకాదు. అసత్పదార్థమెప్పుడును సత్యముకాదు. సత్తనెడివస్తువే విష్ణువనబడును. ఆవిష్ణువనెడి బ్రహ్మముచేత సర్వప్రపంచము వ్యాపింపబడియున్నది. ఆపరబ్రహ్మమే యీశరీరములందుండి ఆత్మయను నామముచే వ్యవహరింపబడుచున్నాడు. గనుక పరబ్రహ్మమును ఆత్మకు నాశమెవడును కలిగింపజాలడు. ఈయాత్మపరులను చంపెడువాడును కాదు. దేహేంద్రియములు లేనివాడు అగుటవలన పుట్టుచావులును వృద్ధిక్షయములును యెప్పటికిని కలుగజాలవని తెలిసికొనుము. ఇట్లు ఆత్మస్వరూపము నెరిగినవాడు తానే

బ్రహ్మమై యుండుటవలన అతని దేహేంద్రియములు చేయుచున్న కృత్యములు అతని నంటజాలవని తెలియుము. ఈకర్మలను నేను చేసితిననియు వానిఫలములు నాకు లభించవలయుననియు నిట్టి తలంపులు జ్ఞానికి కలుగజాలవు. గనుక సకలదేహముల యందుం డెడి ఆత్మయెప్పటికిని నాశములేనివాడని నీవు తెలిసికొనుము.

ఓభక్తుడా! లోకంబునమానవుడు జీర్ణవస్త్రమును విసర్జించి నూతనవస్త్రములను ధరించునట్లు ఈదేహమందుండెడి యాత్మయును కర్మవశమువలన పూర్వదేహమునువిడిచి క్రొత్త దేహములను పొందుచుండును. కాన నిర్వికారుడయిన యాత్మను శస్త్రాస్త్రములు ఛేదింపజాలవు. అగ్ని దహింపజాలదు. జలము తడుపజాలదు. వాయువు శుష్కింప నేరదు. గనుక ఆత్మ నిత్యుడనబడును. నిత్యుడగుటవలన సర్వవ్యాపియగును. సర్వగతుడగుటవలన స్థిరముగానుండువాడగును. స్థిరుడగుట వలన నిశ్చలుడనబడును. మరియు నీయాత్మ సర్వేంద్రియముల చేతను యెరుగబడనివాడగుటచేతను అవాఙ్మానసగోచరుడనబడును. ఇట్లు నిత్యుడైన ఆత్మ, మాయలో గలసి జననమరణ భ్రాంతిని పొందుచున్నాడు. మరియు అనేక సహస్రములలో నొకడు యీఆత్మను జూచి ఆశ్చర్యపడుచున్నాడు. ఇట్లుండి నను గురూపదిష్ట సంస్కార శ్రద్ధాభక్తులు లేనందున ఆత్మను ఒకడును వాస్తవముగా నెరుగడు.

ఓ భక్తుడా! ఈశ్వర సమర్పణ పూర్వకముగా సత్కర్మలనుచేసిన యెడల ఈశ్వరానుగ్రహమువలన ఆత్మజ్ఞానమును పొంది జన్మకర్మప్రతి బంధమును తప్పించుకొనగలవు. నిశ్చయ బుద్ధిలేనివారికి అనేక కర్మభేద బుద్ధులు గలిగియుండును. అట్టి వారి మనస్సు సాంఖ్యమందుగాని యోగమందైగాని నిలువ జాలదు. ఆత్మానాత్మ విచారము సాంఖ్యమనబడును. జాగ్రదవస్థయందు బుద్ధిని విషయములకు బోనీయక నిలుపుట యోగము

నబడును. యోగమందుండి భగవత్ప్రీతిగా కర్మలను చేయుచుండుము. అట్లు చేయుటచే చిత్తశుద్ధిగలిగి జ్ఞానప్రాప్తియగును. ఇట్లుచేయువారు జ్ఞానులై మోక్షమును పొందుచున్నారు. ఇట్లు కర్మయోగానుష్ఠానముచేత నీబుద్ధి యేకాలమునందు వివేకస్వభావమునుపొందునో అప్పుడు వైరాగ్యమును జనించును. అట్లు వైరాగ్యమును పొందిన బుద్ధి ఆత్మయందు నిలిచి యెప్పుడు నిశ్చలముగానుండునో అప్పుడు వివేక ప్రజ్ఞారూపమైన సమాధిని పొందగలవు. ఓ భక్తుడా మనస్సునందలి సంకల్ప కామములను బొత్తిగా విడిచి ప్రత్యగాత్మయైన తనయందే తాను తృప్తినిబొంది ఆనందించువాడు స్థితప్రజ్ఞుడనబడును. ఇతడు రాగభయక్రోధములను పొందక సుఖదుఃఖములయందు సమత్వగలిగియున్నయెడల అప్పుడు ముని యని చెప్పనగును అట్టిమునికి అహం బ్రహ్మాస్మియను జ్ఞానముకలుగగలదు. అట్టివాడు తన యింద్రియములను తాబేలువలె మనస్సులోనికి నిమిడ్చుకొనియుండును. మహాబుద్ధిమంతుడైనను సమాధికిముందు యింద్రియములను వశపరచుకొనని యెడల వానినిచలింపజేసి క్షోభపెట్టగలవు. విషయములను దలపోయువానికి విషయములయందే ప్రీతిగలుగును. ఆప్రీతివలన ఆశగలుగును. ఆయాశవలన క్రోధముగలుగును. ఆక్రోధమువలన అవివేకము కలుగును. దానివలన అదివరకు తానుగ్రహించిన జ్ఞానస్మృతి చెడిపోవును. అందువలన బుద్ధి నాశమగును. దానిచే పురుషుడు అయోగ్యుడగును. మనస్సు వశపర్చుకొన్నవాడు ఆత్మనిష్ఠను పొందగలడు. అందువలన సకలదుఃఖములు నశించుచున్నవి. ఆత్మనిష్ఠుడైనవాని బుద్ధి ఆకాశమువలె సర్వవ్యాపియై ఆత్మసాక్షాత్కారమును పొందుచున్నది. సమాధినిష్ఠలేనివానికి ఆత్మసాక్షాత్కారము కలుగనేరదు. జ్ఞానికి విషయములు సమీపమందున్నను ఆత్మయందు లయించునేగాని మనోవికాసము గలిగింప

జాలవు. అట్లు ఇచ్ఛావిషయములకు వశముగాని ఆత్మవేత్త మోక్షమును పొందుచున్నాడు. మోక్షమును కోరువాడు సకల కామములను విడువవలెను. మరణకాలమందయినను బ్రహ్మజ్ఞానముగలిగినయెడల మోక్షమును పొందగలడు. ఆత్మబ్రహ్మలకుశబ్ద భేదమేగాని అర్థభేదములేదు. గనుక జ్ఞాననిష్ఠులైన మహాత్ములకు బ్రహ్మత్వమే సిద్ధించుచున్నది.

ఓభక్తుడా, శాస్త్రమువలన ఆత్మానాత్మలనెరుగునది జ్ఞానమనబడును. ఆత్మానాత్మలకుగల అర్థానుభవము విజ్ఞానమనబడును. ఇట్టి జ్ఞానవిజ్ఞానంబులను రెంటిని కామము నశింపజేయుచున్నది గాన కామమను మహాశత్రువును జయించుము.

దేహముకంటె నింద్రియములును ఇంద్రియములకంటె మనస్సును మనస్సుకంటె బుద్ధియును శ్రేష్ఠమైనది. ఆ బుద్ధికిసాక్షియైనవాడు పరమాత్మయనబడును. ఆపరమాత్మను నీవుగోరి తెలిసి ఆత్మయందు చక్కగా నిలిచి కామరూపమైన శత్రువును ఆత్మనిష్ఠచే సంహరింపుము. సకలపుణ్యకర్మలును బ్రహ్మజ్ఞానమందు సమాప్తిని బొందుచున్నందున ద్రవ్యయజ్ఞము లన్నిటికంటెను జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమగుచున్నది. గనుక నిట్టి ఆత్మజ్ఞానమును అనుభవజ్ఞులయిన సత్పురుషులసేవించి సవినయపూర్వకముగానడుగుము. నీయందు భక్తిప్రపత్తులు బాగుగా గనుపించినయెడల ఆ సత్పురుషులు నీ యోగ్యతను పరిశీలించి పరబ్రహ్మ సాక్షాత్కారరూపమగు ఆత్మజ్ఞానము నీ కుపదేశింపగలరు. కావున భక్తులారా! అట్టి జ్ఞానముచేత శ్రీపరాత్పరుని దర్శించి ఆయన యందైక్యమును పొందుదురుగాత! ఆత్మజ్ఞానము తెలిసికొనినంత మాత్రమున సంతృప్తినొందరాదు. తెలిసికొనిన దానిని అనుభవమునకుఁ దెచ్చుకొనవలయును

పెన్మరాజు వెంకటచలము, బందరు.

-:0:-

# విష్ణు స్మరణము.

మూ॥ కృష్ణ! త్వదీయపదపంకజ పంజరాన్త
మద్యైవ మే విశతు మానసరాజహంసః
ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః
కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే॥

తా॥ కృష్ణా! నామానస్సనెడు రాజహంస యిప్పుడే నీ పాదపద్మముల నెడు పంజరములోఁ బ్రవేశించుగాక. వలననఁగా ప్రాణ మీశరీరమును విడిచిపోవునపుడు కఫ వాత పైత్యములు కంఠమున కడ్డుపడుచుండఁగా నీస్మరణ యెట్లు లభించును.

మూ॥ కృష్ణ కృష్ణేతి కృష్ణేతి యో మాం స్మరతి నిత్యశః
జలాం భిత్వా యథాపద్మం నరకా దుద్ధరామ్యహమ్

తా॥ ఎవడు నన్ను నిత్యమును కృష్ణా! కృష్ణా! కృష్ణా! అని స్మరించుచుండునో వానిని నేను జలమునుండి సూర్యుఁడు పద్మము నుద్ధరించునట్లు నరకమునుండి యుద్ధరించుచున్నాడను.

మూ॥ సకృన్నారాయణేత్యుక్త్వా పుమాన్ కల్పశతత్రయమ్
గఙ్గాదిసర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక॥

తా॥ నాయనా! ఒకసారి నారాయణా! అని పలికిన మనుష్యుఁడు మూఁడు వందల కల్పములు గఙ్గ మొదలగు సమస్తమైన పుణ్యతీర్థములయందు స్నానము చేసినవాఁడగును.

మూ॥ సకృ దుచ్చరితం యేన హరి రిత్యక్షరద్వయమ్
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి॥

ఎవనిచేత ఒకసారి హరియనెడి రెండక్షరము లుచ్చరింపఁబడునో వానికి మోక్షములభించునని తాత్పర్యము.

("సదాచారము")

-:0:-

# మనుష్య యజ్ఞము.

ప్రతిమానవుఁడును మానవకోటికి ఋణస్థుఁడై యున్నవాఁడు. మానవులందఱును అన్యోన్య సహాయములేక లోకమున జీవించుటయే యసాధ్యమైయుండ సుఖముగ నుండుట యసాధ్యమని చెప్పవలయునా? ఇంతియ కాదు. మానవు లాదిగాగల సమస్త భూతములును జగదేకపితయగు నీశ్వరునుండియే వెలువడిరనియు, నాయీశ్వరుని విరాడ్రూపము నందలి యవయవము లన్యోన్యసహకారులై వర్తించునటుల నాతనివు లెల్లరును ఇతరుల సుఖముకొఱకుఁ బాటుపడి పరస్పర ఋణములఁ దీర్చుకొనవలయుననియు, యోగదృష్టిగలమహర్షులు విధించియున్నారు. "నృయజ్ఞో౽తిథిపూజనమ్" "న్వానన్నై ర్చరయేత్" అను వాక్యములు మానవకోటికిం గల ఋణముం దీర్చుకొనుమార్గముల విధించుచున్నయవి. మనుష్యయజ్ఞమన నతిథిపూజనము. అతిథియన భోజనసమయమున నన్నార్థియై వచ్చిన మనుష్యుఁడు.

శ్లో॥ ఇష్టోవాయతివాద్వేష్యో మూర్ఖః పండితపవవా
సంప్రాప్తోవైశ్వదేవాంతే సో౽తిథి స్స్వర్గసంక్రమః॥

తా॥ మిత్రుఁడుగాని శత్రువుగాని మూర్ఖుఁడుగాని విద్వాంసుఁడుగాని వైశ్వదేవము కడపట వచ్చినవాఁడు స్వర్గ సుఖము నీజాలును. అని అన్నార్థులయి వచ్చు బీదలనందఱిని సోదరులుగ భావించి వారి కన్నదానము చేయఁదగు. దూరదేశమునుండి మార్గము నడచి శ్రమచెంది భోజనసమయమునకు వచ్చి చేరు మనుష్యుఁడు ముఖ్యముగఁ బూజ్యుఁడు. అట్టివాఁడే యతిథియని యెఱుంగఁదగు. ముందు వచ్చినవాఁడుగాదు.

శ్లో॥ దూరాధ్వోపగతం శ్రాంతం వైశ్వదేవ ఉపస్థితమ్
అతిథిం తం విజానీయాన్నాతిథిః పూర్వమాగతః॥

అట్టి పురుషుఁడుగాని, స్త్రీగాని ప్రత్యక్ష పరమేశ్వర స్వరూపముగ భావింపఁదగును. అట్టి మనుష్యుని కులగోత్రములు సయితము విచారింప నక్కఱలేదు.

శ్లో॥ నపృచ్ఛేద్గోత్రచరణే నస్వాధ్యాయంశ్రుతం తథా
హృదయే కల్పయేదేవం సర్వదేవమయోహి సః
అన్నస్యత్రుధితం పాత్రమ్॥

అను పురాణోక్తి యెల్లరకుఁ దెలిసినదియే. తెలియఁదగినదియే. అట్లు ఇలుసేరిన యతిథిని ముందు పూజించి, ఉదకములిచ్చి, యాసనమునఁ గూర్చుండఁబెట్టి ఆదరముతోడ మృదుమధురోక్తులఁ గుశలమడిగి అన్నోదకములనిచ్చి తృప్తునింజేసి పనుపఁదగు. ఇట్లొకఱిని బూజించిన మానవకోటినంతయు బూజించి తృప్తిఁజెందించినట్ల యగు. అన్నోదకము లీయవలయు ననన్నకవచ్చినవాని కావశ్యకములగునవి యన్నియు నీయఁదగినవని గ్రాహ్యము. అనఁగా నన్నోదకములు మాత్ర మిచ్చినం జాలుననుకొనరాదు. వస్త్రహీనుఁడై యుండిన యథాశక్తిగ వస్త్రదానము చేయదగు. ఒకవేళ రోగార్తుఁడై యుండినచో నౌషధమునిచ్చి యుపచరించి పంపఁదగును. కేవల మావశ్యకములనఁదగు వాంఛలన్నియు దీర్చి పంపఁదగునని యర్థము.

ఇట్లతిథి సత్కారము పంచమహాయజ్ఞములలో నొకటిగఁ జెప్పఁబడి యుండుటయేగాక అన్నిటిలో శ్రేష్ఠమనికూడ నెన్నఁబడుచున్నది.

శ్లో॥ స్వాధ్యాయేనాగ్నిహోత్రేణ యజ్ఞేన తపసాతథా
నచాప్నోతి గృహీలోకాన్ యథా హ్యతిథిపూజనాత్

ఇందు వర్ణభేదములుగాని, ఆశ్రమభేదములుగాని చూడ నవసరము లేకపోవుటయెగాక నిజముగ ఆఁకలిగొని దూరాధ్వగుఁడై వచ్చినవాఁడు అంత్యజుఁడైనను, పంచమహాపాతకులలో

నొకఁడైనను గూడ నాదరింపఁ దగినవాఁడని స్మృతులయందు దృఢముగఁ జెప్పఁబడియున్నది.

శ్లో॥ పాపోవాయది చండాలో విప్రఘ్నః పితృఘాతుకః
వైశ్వదేవేతు సంప్రాప్తేసోఽతిథిస్స్వర్గ సంక్రమః॥

ఇప్పగ్రమున నతిథిపూజనము సోమయాగము మొదలగు వానితో సమానమనియు, నిక్కాలమునఁ దఱచుగ యోగ్యత చాలని ఋత్విక్కులు మొదలగు వారిని గొని విధిహీనముగను, మంత్రహీనముగను జాలినంత యన్నదానము లేకయు విధ్యుక్తదక్షిణల నీయకయుఁ జేయఁబడు యజ్ఞములకంటెను, పంచమహాయజ్ఞములు - వానిలో ముఖ్యముగ నతిథిపూజయే శ్రేష్ఠమనియును స్మృతులయందుస్పష్టముగఁ బ్రకటింపఁబడియున్నది.

శ్లో॥ యత్ఫలంసోమయాగేన ప్రాప్నోతి ధనవాన్ ద్విజః
సమ్యక్పంచమహాయజ్ఞై ర్దరిద్రస్తదవాప్నుయాత్॥

ఈసందర్భమున నొక్క విషయము ముఖ్యముగ యోచింపఁదగియున్నది. దూరమునుండి వచ్చిన యన్నార్థియగు వాఁడు పూజ్యుఁడగు నతిథియని స్మృతులయందు నిరూపింపఁబడియున్నది. ముందుగ నాహ్వానము చేయబడిన సత్పురుషుఁడు నయితము పూజ్యుఁడగు. అట్లుగాక

శ్లో॥ నైకగ్రామీణ మతిథిం సంగృహ్ణీతక దాచన
అనిత్యమాగతో యస్మాత్తస్మాదతిథిరుచ్యతే॥

ముందు పిలువఁబడకయు దూరమునుండి మార్గవశమున రాకయు, గ్రామమునందేయుండియు, దార్ఢ్యము గలిగియుండియు నుదరపోషణమునకైనను బనిచేయనొల్లక వృథాకాల యాపనము చేయుచు, గర్హ్యములగు వృత్తులం గాలముఁగడపుచు సోమరులై భోజనసమయమునకుఁ జక్కఁగవచ్చి యతిథి పూజనమపేక్షింప నట్టివారు పూజ్యులని వారినిఁబూజించినచో, జను లనేకులు స్వధర్మచ్యుతినొంది భ్రష్టాచార హేతువులగుదురు.

మఱియు యుక్తాయుక్త విచారణము లేక దానములు సేయుటచేత నీదేశమునఁ బలువురు గృహస్థులుగనుండియుఁ దమకుటుంబ పోషణమునకైనను బాటుపడరు. కాలక్రమమున నిట్లు పెక్కుండ్రు బ్రాహ్మణు లధ్యయనాధ్యాపనాది కర్మములను విడిచి శమ దమాది సుగుణసంపత్తియుఁ బరోపకారబుద్ధియు లేక గృహస్థవృత్తినిమాని భిక్షాటనమునలుపుదురు. దానంజేసియే యిప్పుడును బ్రాహ్మణవృత్తియన భిక్షాటనమని యనేకులచే నెన్నఁబడుచున్నది.

బ్రాహ్మణులు శాస్త్రీయమగు తమవృత్తులను వదలి యాచించుచుండుటయు, మఱికొందఱు క్షత్రియులమనిపించుకొనుచు వందిమాగధులవలె నితరుల స్తుతిచేయుటయే తప్ప వేఱువృత్తి లేక కుటుంబపోషణమునకై కితరుల నాశ్రయించి యుండుటయు, వైశ్యశూద్ర ప్రముఖులగువా రనేకులు బిచ్చమెత్తుటయే వృత్తిగ నెన్నుటయు, నీమొదలగు నధర్మ వ్యాపారములు కారణములుగా నీదేశము దురవస్థకువచ్చెను. ఈవిషయములను దేశాభిమానులందఱును జక్కఁగఁ బరిశీలించి యన్నాది సమస్తదానములయందు యుక్తాయుక్త వివేచనము చేయందగు. అట్టి వివేచనములేని దానమువలన సోమరితనము వర్ధిల్లును. కావున వారలయందుండు తమోగుణమునుబోఁగొట్టి యుద్యోగవంతులుగఁ జేయుట వారికి నుత్తమమగు లాభముచేయుటయే గాని వేఱుగాదు. అట్టివారికి యుక్తమగు సాయముచేయుచు నుదరపోషణసామర్థ్యముగూడ లేని యంగహీనులు రోగపీడితులు, అనాథలులోనగు వారికి వలయు సహాయముచేయుచు, దయార్ద్ర హృదయులై, దేశాభిమానులై, పరోపకారతత్పరులై, మనుష్య యజ్ఞమును జక్కఁగ జరుపవలయును.

(బ్రహ్మవిద్యాదర్పణము).

# ఆశాస్వభావము.

ప్రపంచమందు సంసార వ్యవహారములకు ఆశయే ప్రధానముగనున్నది. ఆశ లేనిచో ద్రవ్యార్జనచేయువిధము తెలియదు. ద్రవ్యార్జన లేనిచో సంసారము జరుగదు, సంసారము సాగనియెడ ప్రారబ్ధవిమోచనము కానేరదు. ప్రవృత్తిజ్ఞానజన్యమైన దురాశతో వర్తించుచున్న పురుషుడు సకలాపత్తులను పొందుచున్నాడు. అట్టివాడు సర్వమును తెలిసిన ధీరుడుగానున్నను, శూరుడుగానున్నను, పంజరమునపడ్డ సింహమువలె పరవశుడగును. ఆశ లేని పురుషుడు శక్తిహీనుడుగానున్నను మేరువుకంటె నధికుడగును. ఎవనియందాశ అధికముగానుండునో వాడెల్లరకు దాసుడగును. ఆశ లేని పురుషునకు లోకులందరు దాసులగుదురు. లోకమునందాశకన్న చెడ్డది మరియొకటిలేదు. అయినను ఆశ సర్వప్రాణులకు ముఖ్యాధారముగనున్నది. ఆశ లేని బిడ్డ స్తన్యపానముజేయునా? ఆశవల్లనే లోకాంతరముల స్థితిని సాధించుటకు ఉత్సాహము కలుగును. దాన ధర్మములకు, సిద్ధి క్రియాదులకు ఆశయే ఆశ్రయముగనున్నది. నానావిధ ఫలపురుషార్థములకు హేతువైన దురాశ అసురప్రకృతితో కూడి మిథ్యానందముచే, తమోవృత్తిని పొందించి మోహమునందు మగ్నుడైయుండునటుల చేయును.

ఏ మనుజుడు ధనము నధికముగా సంపాదించవలయునని ప్రయత్నముచేయునో, అట్టివాడు సంపాదించుటయందు అశ్రద్ధ లేనివాడై యుక్తాయుక్తములను దెలిసికొని అనుభవయుక్తముగానున్న వ్యవహారమున ప్రవేశింపవలయు. అట్లుగాక దురాశచే జ్ఞానహీనుడై, భ్రాంతికి బద్ధుడై అహోరాత్రములయందు నిద్రాహారములులేక ద్రవ్యము నే చింతించుచుండును. ఆతురముతో నపరిమితముగా ఆర్జించవలెనని ఆశయందలి దోషము

తెరుగక, ప్రారంభమున సుఖముగాను, పిమ్మట దుఃఖముగాను, తోచినను ఇంకయుఁజాలదని పరహింసాపరుడై పరులజీవనములను భంగపరుచుచుండును. అందరికంటె తానధిక ధనసంపద పొందవలెనను కోరికచే మోహితుడై నిందాస్పదమైన నీచకృత్యమున ప్రవేశించి తన ఉదరపోషణకుగాను మోహము, వంచన, అనృతము మొదలగు దురాచారములను పరమధర్మముగా నెంచి, అర్థము ననర్థముచేయుచు, ధనబలముచే ధైర్యస్థైర్యము వహించి బీదలనోరుగొట్టి వారల కష్టార్జితములను అపహరించుటయందు నిపుణుడుగానుండును. సంసారులందరిలో తాఁదెలిసిన వాడనని యెంచి నడతలయందు గర్విష్ఠుడై "సర్వేజనాః కాంచనమాశ్రయంతి" అన్నట్లు యెల్లరు నన్నే ఆశ్రయించుచున్నారని తలచి అజ్ఞానముచే నేత్రములకు మబ్బుకప్పి వికారమొంది వరుమానమున పరాక్రమవంతుడై, ఖర్చుచేయుటయందు లోభియై, జనులందరిని స్వాధీనపరుచుకొని సేవ చేయించుకొనుచుండును. వారల ఆర్జనకంతకు దాకర్తయై, విధినిషేధములకు వెరువక, మానావమానముల కోడక, మితిలేని ద్రవ్యముచేరినను తృప్తిచెందక, మనస్సునందు సదాతాపయుక్తుడై దుర్గుణములను తనఆప్తులుగ నెంచి, నిలుకడలేని ఉన్మత్తునివలె మదించి కామోద్రేకముచే అహంకార పూరితుడై, దానధర్మ దాక్షిణ్య భూతదయా పశ్చాత్తాపములులేనివాడై అధర్మ ప్రవర్తకుడై నాకుమహాలక్ష్మి ప్రసన్నురాలైనదని సంతోషించుచుండును. ఈ లోకసంచారియగు చంచల యుక్తమైన లక్ష్మి నిలిచినచోట నిలవక మోసముచేయునని యెవరు తెలియుదురు. స్వల్పద్రవ్యము జేరిన వారికికూడా, నాభియందు శీతముచేరి అతిదాహమును పుట్టించునట్లు, దానిఫలము వివిధవ్యాపారములందు జోరబడునట్లుచేసి పాపములనే వృద్ధిపొందించును. అట్టివానికి క్షుద్రులు మొదలగు వారెల్లరు వశులై ఆజ్ఞనుల్లంఘించక ఆశ్రయించుకొనియుండు

రు. ఇట్లు పొందిన ద్రవ్యశాల ఈ అష్టావక్ర సంసార్థ మనిత్య మని యెంచక శాశ్వతమని భావించి చేర్చుచున్న పురుషుడు ధనవంతుడను ప్రశంసచెందు నేగాని, మరియేఫలమును పొంద లేడు. దీనివలన కలుగుచున్న రోదనము లేశాంశమైనను బీదలు జెందరు. బీదలు ఎల్లపుడొకేరీతి సమముగానుందురు. ధనికులకు తృప్తికొరతయై జేయరాని పనులనెల్లచేయుచు, సంభ వించువాటి నన్నిటిని అనుభవించుచున్నారు. పొలములందెలు కలు గులకరాళ్లను చేర్చిన చందంబున. వంచకులగు చంచలము గలవారు, గురువులు, మిత్రులు, స్నేహితులు, బంధువులు, బీద లనక గాసిచెందించి కొల్లగొట్టిన ధనమును తేనెటీగలు సకల సస్యాది పుష్పములందలి సారమునుపీల్చి చేర్చిపెట్టిన మధువును అపహరించుకొరకు, వాటినన్నిటిని కాల్చి పరులు స్వీకరించు నట్లు తాగూడపెట్టిన ద్రవ్యమును సద్వినియోగపరచక, తానను భవించక, కీర్తినిచెందక. పుణ్యమునుపొందక భద్రముగ పాతి బెట్టి కావలిగాడై, కడకుచోరులపాలుజేసి వ్యర్థముగాకుండుచు, దినదినమునకు క్షీణగతుడై మరణమొంది, పాపకర్మకతన మర ల దరిద్రుడై జన్మించి దుఃఖమునె అనుభవించుచుండును. అధిక ముగానున్న ద్రవ్యశాలుర మనంబునజొచ్చి చూచినచో, తాజే యు సంసారము దుఃఖమయముతోను, తన దేహము రోగమయము గాను, తన మనస్సు స్థిరములేక పిత్తవికారమొంది, భీతి, కంప ము,లజ్జమొదలగు వాటితో సంకటపడుచు సదాచింతాక్రాంతుడై, కొద్దికాలమైనను సుఖానుభవము ఎఱుంగక సంతాపముచేయుండు వారనేకులుగలరు. ధనప్రాప్తిగలిగినట్లెల్లను సద్వినియోగముచే యుచు, తాసుఖపడి కీర్తివహించి భక్తిజ్ఞానములచే సార్థకము చేయు పురుషులు అరుదుగానున్నారు.

ధనాఢ్యుడుగనున్న మూఢునియందు నానాదుర్గుణము లున్నను గణింపక, వానిడాంబికమును చూచి వివేకవంతుడను

దురు. అయినను, తనయందున్న సుగుణములను చీదలపాలు జేసి తనంతట వచ్చు వంచన మొదలగు మోసకృత్యములకెల్ల తానాధార పురుషుడై తన యాధీనమందుంచుకొనును. ధన ముండి లోభత్వముచె దానికి క్షోభను కలుగజేసి నీచమానుజులు నానాహీనజన్మములెత్తి వ్యథను పొందుదురుగాని ఈశ్వర కటాక్షమునకు పాత్రులు కాజాలరు. ధనమే తుదకు మృత్యురూపమై సకలైశ్వర్యములను నిమిషార్ధమున తొలగించి గోచిపాతరాయనిగా జేయుచున్నది. ఇట్టి దురాశ నెవరు అపేక్ష చేయకుందురు. ఆశదూరిన మనస్సు, గూబచొచ్చిన గృహమువలె పాడగునని నుడువుదురు. ఆశయెట్టి ధైర్యశాలినైనను భంగపరచును. ప్రభువుచేనైనను చాకిరిచేయించును, జితేంద్రియునకు కామము కలిగించును, మౌనిని పలకరించును, కడకు దారాపుత్రాదులనుకూడా దిక్కు-దిక్కులకు పరిగిడునట్లు చేయుచున్నది.

గనుక, బుద్ధిశాలులందరు మనంబుననుండు దురాశాపిశాచమును పారదోలి, జాగరూకతకలవారలై, స్వకార్యధురంధరులుగాక, సన్మార్గయుక్తులై, సద్ధర్మముగనున్న వ్యాపారములయందు మితముగా ఆర్జించి, సాధుసత్పురుషులకు సద్వినియోగముచేయుచు, సంసారమందు శాంతివహించి గృహకృత్యములను జరుపుచుందురు. అట్టివారే జ్ఞానముపొంది ఈశ్వర కటాక్షమునకు పాత్రులగుదురు.

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః.

పి. శేషయ్యగుప్త.

అడయార్.

ఓమ్.

# దివ్యజ్ఞానదీపిక:

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 6. **March 1916.** మార్చి నెల 1916. సంచిక 12.

## కాలదేశ వర్తమానములు.

రాఁగల ఏప్రిల్ నెల 21, 22, 23 తేదులలో అడయారు నందొక దివ్యజ్ఞానసభ జేరగలదు. దక్షిణహిందూస్థానములోని అన్నిప్రధానస్థలములనుండియు అనేకులు గొప్పవారువత్తురు. బ్ర॥ జినరాజదాసాగారు సభాకార్యముల జరిగించుదురు. ఇంగ్లీషు నందును తెనుగుభాషయందును ఉపన్యాసములు జరుపఁబడును. భోజనాదులకు తగిన వసతులేర్పరుచఁబడును.

* * *

కడచిన డిసెంబరునెల కడపట బొంబాయి నగరమునందు పలువిధములగు సభలు జరిగినవి. దేశదేశములనుండియు జనులువచ్చియుండిరి. ప్రతిసభలోను దేశహితము కొఱకు, లేక మతముమద్ధరించుకొఱకు, లేక జనాంగము నుజ్జీవించుకొరకు అనేక సలహాలును, తీర్మానములును జరిగినవి. ఇవియన్నియును నాలోచించిజూడ మన దేశపు పునరుజ్జీవనము శీఘ్రకాలములోనే

ప్రాప్తించవచ్చునను నమ్మకము గలుగుచున్నది. జనులు తమ ప్రయోజనమునే ముఖ్యోద్దేశముగా నుంచుకొని ప్రవర్తించుటను వదలి తమ మతమునకో, దేశమునకో, జనాంగమునకో మే లొనరింప పాటుపడుట పైసోపానమునకు త్రోవగానున్నది. దేశబాంధవులగు భారతీయులారా! మతద్వేషములనుమాని మాతృభూమి నుద్ధరింప మీశక్తి విశేషములన్నియును ధార బోయుడు! భారతమాతకు లోకపూజ్యతగలుగు కాలము సమీపించుచున్నది. మనమందరమును నెంత బలముగా నేకీభవించిన నంతత్వరగా దేశమాత యున్నతస్థితిని జెందగలదు.

* * *

భగవదాజ్ఞ లేక ప్రపంచముయొక్క సృష్టిస్థితిలయములు ప్రాప్తించవుగదా! స్థితి వ్యత్యాసములు సహితము భగవదాజ్ఞకు లోబడియున్నవి. ప్రకృతమున మనమందరమును భగవదాజ్ఞారూపమైయున్న "పరస్పరస్పర్ధ" (Competition) యను ధర్మము ననుసరించి ప్రవర్తించుచున్నారము. ఈధర్మమువలన మనకు బుద్ధికుశలత యధికమైనది. ఇంద్రియములకంటెను మనోప్రాబల్యమతిశయించినది. విచారబుద్ధి యెక్కువయైనది. మనగమ్యస్థానమును గుర్తెరిగి దానిని బొందనుద్యమించు శక్తి ప్రాప్తించినది. ఇకముందు వేరొకధర్మము మనకవసరమైయున్నది. "పరస్పరసహాయము" (Co-operation) రాబోవు వ్యవహార ధర్మముగానుండునని దైవజ్ఞులు జెప్పుచున్నారు. ఈధర్మము ప్రాప్తించు నిమిత్తమే పలువిధములగు సంఘములేర్పడియున్నవని యూహించవచ్చును.

* * *

ఐరోపాలో జరుగుచుండు ఘోరసంగ్రామమున చిత్రవిచిత్రములగు సంభవము లప్పుడప్పుడు జరుగుచున్నవి. మనుజుల యాంతరిక భక్తిని శ్రద్ధను శక్తివిశేషములను ప్రకాశపరు

చుట కిట్టి సంగ్రామములు ఘటించుచున్న వేమోయని తోచుచున్నది. ఒకతల్లికి నలుగురు పుత్రులుండిరట. ముగ్గురు యుద్ధసన్నద్ధులై సంగ్రామమునకు వెళ్లి మృతిబొందిరి. మరియొకడు మతమును బోధించునధికారిగా బయలుదేరి సంగ్రామమందున్న సైనికులకు వారిధర్మమును బోధించుచుండెను. ఒకనాడు వారికర్తవ్యమును గురించియు, దేశవత్సలతను గురించియు బోధించుచుండునపుడు దేశహితముకొరకు తనసోదరులు తమప్రాణముల నిచ్చిన కథను జెప్పి తనతల్లి తన్నుజూడగోరుచున్నదిగాని తన మాతృభూమికి విజయమగు నంతవఱకు తాను వెళ్లను వీలులేదని చెప్పెను. అతనిమాటలను శ్రద్ధగవినుచుండిన సైనికులలో యొకరతనియొద్దకువచ్చి అయ్యా! ముగ్గురు కొమాళ్లను పోగొట్టుకొనిన మీతల్లియొద్దకు మీరువెళ్లి ఊరడించి మరల వచ్చుట మీకు ధర్మమైయున్నది. నేనొక జాబునిచ్చెద. దానిని కొనిపోయి మీపైయధికారికిచ్చి సెలవుతీసికొని వెళ్లిరమ్ము అనిజెప్పి జాబును వ్రాసియిచ్చెను. ఆజాబుక్రింద వ్రాసిన సంతకమును చూడగా మనసార్వభౌముల జ్యేష్ఠపుత్రుడు (Prince of Wales) గారి సంతకమైయుండెను. పసివాడైనను తనవారికెంత సహాయము జేయుచున్నాడో జూడుడు! ప్రభువుల హృదయమెంత మార్దవముగానుండునో జూడుడు. వారుప్రదర్శించు కనికరము వారియనుచరులను, నౌకర్లకును నెంతహృదయానందకరముగాను నుత్తేజకరముగాను ఉండునో జూడుడు.

* * *

విద్యాశాలలయందును గృహములయందును, బాలురను నిష్కారణముగా గొట్టుటయు, తిట్టుటయు, ఈ మొదలగుదండనలు జరుగుట యందరికి తెలిసిన విషయమే. పూర్వమున నీవిధమైన దండనలెంత యవసరములై యుండినను ప్రకృతమవి యవశ్యకములు గావు. ఇప్పటి బాలురు తెలివిగలవారై యుండుటయే

మున క్షుత్పిపాసలు లేవు. ఉదర పోషణకై పాటుబడవలసిన దేమియు లేదు. ధనార్జనముతో నక్కఱ లేదు. తత్సంబంధములగు స్వీర్ష్యాసూయాది దుర్గుణములకు ప్రసక్తి లేదు. వారి వారి కభీష్టములును ఉత్సాహకరములును నగు వ్యాపారములందు వారువారు సుఖముగ కాలము గడపుచుందురు.

నూతనముగ మృతినొందిన వారికి ఇహలోకమునఁ దమ స్నేహితుల సంతోష వ్యసనములు గోచరించుచుండును. మనము సంతోషముగ నున్నపుడు వారు సంతోషింతురు. మనము దుఃఖింతుమేని వారును దుఃఖింతురు. మనకత్యంత ప్రియులై ఇపుడు పరలోకమున నున్న వారిని ఏవిధముననైన సంతోషపెట్టుట మనకు కర్తవ్యంబుగాని వారికి శోకము గలుగఁజేయుట యెంత మాత్రము ధర్మము గాదు. ఎన్ని విధముల నాలోచించినను చచ్చినవారికై శోకించుట యుచితము గాదు.

భువర్లోకమును దాటి స్వర్గలోకముఁ జేరిన పిమ్మట జీవుఁడనుభవించు సుఖము అద్భుతమైయుండును. స్వర్గమందు లేశమైన దుఃఖసంసర్గముండదు. మనుష్యలోకానందమునకంటె గంధర్వులు పితృదేవతులు మున్నగువారు వసించెడు భువర్లోకానందము పెక్కుమడుంగు లధికమగు. దానికంటె దేవనివాసమగు స్వర్గలోకానంద మనేకరెట్లధికముగ నుండు.

భువర్లోకమునఁ గొందఱు సుఖముగ నుందురు. కొందఱు క్లేశముల నొందుదురు. స్వర్గలోకమునందో క్లేశమావంతయైన లేదు. ఎల్లవారు సర్వదా సుఖము ననుభవించుదురు. అయినను సుఖమందఱికిని సమానమైయుండక వారివారి యోగ్యత ననుసరించియుండు. విశేషముగ పుణ్యముఁ జేసినవారు అతిశయమగు సుఖము ననుభవింతురు. సామాన్యమగు పుణ్యముం జేసినవారు సామాన్యమగు సుఖముఁ బొందుదురు. స్వర్గలోకమునకు నాకమనియు నామాంతరము గలదు. నాకమనఁగా దుఃఖరా

హాత్మ్యమైనదని యర్థము. అట్టి పుణ్యలోకముంగూర్చి వెళ్లిన మన సుహృత్తులకై వగవనేల!

పరలోకము సత్యము.

ఇహలోకమున్నచోటనే పరలోకమున్నదని చెప్పబడియె. అయినను పరలోకము సామాన్య నరునికి నదృశ్యమైయుండు. దృష్టిగోచరము కాకున్నమాత్రముచేతనే అది మిథ్యయని యూహించదగదు. వాయువు సర్వత్ర వ్యాపించియున్నదిగదా. మననేత్రేంద్రియమునకు దృశ్యమైయున్నదా? అందుచేతనే వాయువు మిథ్యాపదార్థమని యూహించవచ్చునా? అది వీచునపుడు స్పర్శజ్ఞానముచే మనము దానింగ్రహింతుముగదా! కంటికి కనబడని అతిసూక్ష్మ పదార్థములు కొన్నిటిని భూతఅద్దముతో మనము చూచుచుండలేదా! అటులనే సూక్ష్మలోకములు మన స్థూలదృష్టికి గన్పింపవు. మనలోని సూక్ష్మదృష్టి వికాసము నొందువఱకు నవి ప్రత్యక్ష గోచరములు కావు. అయినను శాస్త్రములను త్రిలోకజ్ఞాన సంపన్నులగు మహనీయుల వచనములను దృఢముగ నమ్మి పరలోకయాత్రకై వలయు సన్నాహమును జీవంతులమై యుండగానే చేసుకొనవలయు. ఇహలోకమెంత సత్యమో పరలోకమునంత సత్యమైనది. అట్టి నిశ్చయ జ్ఞానము సంపాదించుకొన్నవారికి మరణానంతరమున నచటికి వెళ్లినపుడు అది సహజముగనుండు. అట్టి జ్ఞానము లేనివాడు క్రొత్తచోటఁ జిక్కికొన్న పసిబిడ్డవలె పరలోకముఁ జేరినపుడు భయభ్రాంతుఁడై దిగ్భ్రమజెందు.

పరలోక కష్టములు.

మృతినొందిన వెనుక కొందఱు భువర్లోకమునఁ గష్టముల ననుభవింతురు. అటుల గష్టముల ననుభవించుటయే నరకమని చెప్పఁబడును. అయినను జీవుడు భువర్లోకమున ననుభవించెడు కష్టములు స్వయంకృతాపరాధములుగాని వేఱుగాదు. విష

యసుఖములమీద విశేషముగ ఆశగలవాఁడు శరీరమును విసర్జించి భువర్లోకమునకు వెళ్లినపిమ్మట సయితము వానియాశలన్నియు యథాప్రకారముగనుండు. స్థూలశరీరము లేమింజేసి వాఁడు తన ఆశలను దీర్చికొనఁజాలడు. అందువలననే వానిబాధ దుర్భరమైయుండు. అతిలోభబుద్ధితోఁ ధనమునుఁజేర్చి పెట్టిపోయినవాఁడు తన ధన కాంక్షను విడువనోపక పిశాచమై దానిం గాచుకొనియుండు. దాని నెవ్వరేని యెత్తుకొనఁ జూతురేని వార్లను బెదరించి తరిమివేయును. కొందఱు తామెవ్వరికిం దెలియకుండునట్లు దాచిపెట్టి పోయిన ధనము తమ పుత్రాదులు గనిపెట్టి తీసికొనవలయునను కోరికతో నచటఁగాచుకొని యుందురు. ఇతరులు తమకుఁ జేసినకీడుకు ప్రత్యపకార మొనర్పవలయునని తదేక పరాయణులై కొందఱు క్రోధభావముతో దహింపఁ బడుచుందురు. బ్రతికియున్నపుడు నపరిమితముగ మద్యపానముఁ జేయుచుండినవానికి చచ్చినవెనుక సయితము దానిపై మిగుల ప్రీతియుండును. అధిక స్త్రీలోలుఁడుగానున్న వానికి మరణానంతరమున ఆచపలము వెండియు నధికముగ నుండు. జిహ్వాకు రుచికరములగు పదార్థములందు మిగుల ప్రీతిగలిగి యుండువాడు పరలోకమందుగూడ నట్టిప్రీతి గలవాఁడైయుండు. ఇట్టివారు దమతమ మనోభీష్టముల నెరవేర్చుకొనుటకు స్థూలోపకరణములులేమిచే పిశాచములై అట్టిస్వభావములుగల స్త్రీ పురుషులఁ బట్టుకొని వారిమూలమున దమ ఆశల దీర్చుకొనఁ జూతురు. వీరందఱు పరమదౌర్భాగ్యులు. వీరనుభవించునదే రౌరవాది నరకబాధ. అట్టిబాధను తప్పించుకొన గోరువారు ఇహలోకముననే కామక్రోధాది అరిషడ్వర్గముల నిశ్శేషముగ జంపవలయు.

పరమాత్ముని నరసింహయ్య.

# జగద్గురుని అవతారము.

## ఈ కాలప్రభావము.

మన మేలుకొరకు దయాళురగు ఋషులు తమ దివ్యతేజస్సును ఈకాలమున భూలోకమునకు విశేషముగ బంపుచున్నారనియును, గురుస్వరూపులగు మహాత్ము లచ్చటచ్చట ఇపుడు అవతరింతురనియును దివ్యదృష్టిగలవారు చెప్పుచున్నారు. కాన నీవిషయములను జక్కగ దెలిసికొని ఈజ్ఞానదీపముచే నీతిదప్పక నడువవలెను.

## గురుస్వరూపము.

గుశబ్దస్త్వంధకారస్స్యాత్। రుశబ్దస్తన్నిరోధకః
అంధకారనిరోధత్వాత్। గురురిత్యభిధీయతే॥

గురువు చీకటిని అనగా అజ్ఞానమును బోగొట్టువాడు. శిష్యునియొక్క అజ్ఞానమును నశింపజేసి భక్తిని ప్రేరేపించి భక్తిద్వారా మనస్సునందుండు మాలిన్యమును అనగా జడస్థితిని నశింపజేయను గురువు లనేకులుందురు. ముఖ్యముగా గురువులు రెండు తరగతులవారు అనగా (1) పరిపూర్ణులు కారణగురువులు, (2) అపరిపూర్ణులు కార్యగురువులు.

## కారణ గురువులు. జగద్గురునిరాక.

ఈ పరిపూర్ణులలో గురువులందరికి గురువై "గురోర్గురుః" అని పేరువహించి అన్ని ఉపదేశములకు ఆధిష్ఠానమై, నిత్యుడై, శుద్ధుడై, బుద్ధుడై, జ్ఞానస్వరూపుడై చిన్నలో చిన్న పెద్దలో పెద్ద అయిన మహాదేవుడు సదాశివుడు, ప్రథమగురుడుగా నుంటున్నాడు. ఈమహానుభావునే కొందరు మహావిష్ణువని కూడ పిలుతురు. ఈ పరమపురుషుడు ప్రకృతిని భస్మముచేసి పరిపూర్ణ ఆనందమయుడై జీవులయందుండు అజ్ఞానమును నశింపజేసి జీవులను తమవంటి వారినిగ జేయుటయందే సర్వకాలములం

దు ఆసక్తిగలవాడై జనులను దయతో జూచుచు పరిశుద్ధస్థితికి దెచ్చి పరిపూర్ణులను జేయుచున్నాడు. అందుచేతనే ఈమహాపురుషునకు మహాగురువు అనియు గురుమూర్తియనియు బేళ్లుగలవు.

ఒకజీవుడు ఈమహాపురుషుని బూజించి ధ్యానించి రాజయోగ జ్ఞానాభ్యాసములచే అనేకజన్మములలో కర్మనాశనము చేసికొని చిత్తశుద్ధిపొంది ఋషిధర్మమును అనుష్ఠించుచు రాగా రాగా, అనేకజన్మములకు పరిపూర్ణభావమునుబొంది గుణాతీతుడై జీవన్ముక్తిదశనుబొంది శుకనారదాదులవలె అష్టసిద్ధులుపొంది సప్తలోకములు తిరుగుశక్తిగలిగి మాయాతీతుడై పరిపూర్ణ బ్రహ్మానందమును అనుభవించుచు స్థూలశరీరమును వదలినపిమ్మట ఈశ్వరుని సాన్నిధ్యమునుబొంది, వైకుంఠమనియు కైలాసమనియు బిలువబడు మోక్షస్థానమునుబొందును. ఇందు కొందరు ఆబ్రహ్మానందమునే యనుభవించుచు ప్రపంచము వంకదిరుగక ఆవైకుంఠ కైలాసములలోనే నిల్చియుందురు. అట్టి వైకుంఠమునుండియు కైలాసమునుండియు మరికొందరు భూలోకముతట్టుచూచి "పూర్వము జీవులలో నే నొకడనుగా నుండియు రాజయోగ జ్ఞానానుష్ఠానములచే ఈబ్రహ్మస్థితిని బొందియున్నానుగదా. అయ్యో భూలోకమునందుండు అనేకులు స్త్రీ పురుషులు పుట్టుచు గిట్టుచు కర్మను వృద్ధిచేసికొనుచు అజ్ఞానమను చీకటిలో త్రోవ తెలియక తప్పుమార్గమున నడుచుచున్నారే! ఈజీవులు ఇట్లు బాధపడుచుండగా నేనుమాత్రము ఈ మోక్షస్థానమునందు బ్రహ్మానందమును అనుభవించుచుండ నోపను. మరల భూలోకమునకేవెళ్లి ముందు నేను అనుష్ఠించి ముక్తిసంపాదించిన రాజయోగ మార్గమును జీవులకు బోధచేసి వారి అజ్ఞానదశను బోగొట్టి వారలనుగూడ నాస్థితికి జెచ్చెద" నని తలచితలచి జీవులందు మహాకనికరముగలవాడై దయాసముద్రుడై తన క్షేమి కావలసిన

ది లేకపోయినను మనకొరకై మరల భూలోకమునకు వచ్చు చున్నాడు.

ఇట్లు వెనుకకువచ్చిన దయాస్వరూపుడగు జీవన్ముక్తుడగు పురుషునే ఋషియనియు, పరిపూర్ణుడనియును, ఆరూఢుడనియును బిలుతురు. ఇతడే కారణగురువు అనబడును. ఇట్లు వేలకొలది జన్మములలో భక్తిశ్రద్ధలతో బాటుపడుటవలన సిద్ధించిన మోక్షమును సహితము వదలి అజ్ఞానాంధకారమునందు మునిగియుండు మముబోటి జీవులను దరింపజేయు నభిలాషతో భూలోకమునకు తిరిగివచ్చి మానుష్య శరీరములతో లోకమునందు సంచరించుచుండు నిట్టి మహానుభావులే కారణగురువులని బిలువబడుదురు. కారణగురువులు మహాదేవునియొక్క ప్రతినిధులుగ నేర్పడి జీవకోటికి భక్తిజ్ఞానములను బోధచేయుటకు సర్వకాలములందు ప్రయత్నము జేయుచున్నారు. ఇట్టి కారణగురుస్వరూపులగు ఋషులు ఇప్పుడును భూలోకమునందు గొందరున్నారు. వీరిసమూహము ముఖ్యముగ హిమవత్పర్వత ప్రాంతములనున్నది. వీరు సర్వజ్ఞులై సూక్ష్మశరీరములతో అంతట సంచరించుచున్నారు. తమ శిష్యులద్వారా తత్త్వజ్ఞాన సభ (Theosophical Society) ను ఏర్పాటుచేసి సూక్ష్మాంశములను బయలు పరచుచున్నారు.

ఈమహానుభావులు భూలోకమందుండు జీవకోటిని పరిశుద్ధులను జేయుటకై ఎల్లప్పుడు బాటుపడుచున్నారు. పూర్వయుగములందు జనులు మంచివారుగను పరిశుద్ధులుగ నున్నందున ఆజీవులకు ఈమహాత్ములు అప్పుడప్పుడు దర్శనమిచ్చుచు వచ్చిరి. ఇప్పుడు పాపము అభివృద్ధిఅయినందున యీ కాలపు జీవులు వారిని జూచుటకు శక్తిలేనివారై యున్నారు. అయినను ఈ మహాపురుషులు యిప్పటికి మనలను సదా దివ్యదృష్టిచే జూచుచు మనజ్ఞానవృద్ధికిని పరిశుద్ధతకును దగినపనులు చేయుచు మనకు దివ్య

తేజస్సునిచ్చుచు శిష్యులద్వారా రహస్యాంశములను దెల్పు చున్నారు.

సప్తఋషులు, నారదుడు, శుకుడు, ఉద్ధవుడు, మైత్రేయు డు, ఇత్యాది మహాత్ములు ఈ కారణ గురువర్గములో జేరినవారు. వీరలు జీవులను దరింపజేయుటయే కోరికగా గలిగి, సూర్యుడు ప్రత్యుపకారము కోరకయే లోకమునకు వెలుగు నిచ్చునట్లు, జీవు లయొక్క మేలుకొరకు బాటుపడుచున్నారు. ఈ కారణ గురు స్వరూపులగు ఋషులయొక్క సమూహమునకు గురోర్గురుడగు మహాదేవుడే (శివుడు) ఆదిగురువుగా నుంటున్నాడు. వీరిదయ చే జగద్గురుడగు మహర్షి యొకరు శీఘ్రములో భూలోకమున నవతరింతురు.

ప్రపంచములో చక్రవర్తి యొక్కడైయుండ అతనికి గొం దరు ప్రధానులుందురు. ప్రధానులక్రింద గవర్నర్లును, వీరి క్రింద కలెక్టర్లును, వీరిక్రింద చిల్లర యుద్యోగస్థులును ఏవిధముగ నేర్పాటు ఆయి స్థూలప్రపంచము ఏలబడుచున్నదో ఆలాగుననే గురువర్గమునకు అనగా జ్ఞానప్రపంచమునకు దైవికమైన ఇట్టి యేర్పాటు ఒకటి యనాదిగానున్నది.

జ్ఞానరాజ్యమునకు చక్రవర్తి మహాదేవుడుగాను, వారి ప్రధానులు కారణగురువులుగాను నుంటున్నారు. ఈ రెండు తరగతులవారున్ను తరుచుగ అదృశ్యులుగ బని చేయుదురు. ఈ కారణగురువులు అను ప్రధానులు నూరేసి సంవత్సరముల కొకతూరి వీరిముఖ్యశిష్యులను భూలోకమునకుబంపి వారిద్వారా రాజయోగ జ్ఞానాభ్యాసములను జీవులకు బోధచేయుదురు. ఇపు డట్టివారు విశేషముగ నవతరించుసమయము,

వీరు కారణగురువుల ఆజ్ఞ ననుసరించి రాజయోగజ్ఞాన మార్గములను శిష్యప్రశిష్యులద్వారా బోధచేయుచు పరులమేలు కై పాటుపడుచు కొంతకాలము భూలోకమునందుండి జీవులతో

కలిసి మెలసి భూలోకమున జ్ఞానధనమును వెదజల్లి జీవులకు రాజ యోగపద్ధతుల నుపదేశించి మరల కారణగురువుల సాన్నిధ్యము జేరుదురు. రాజయోగమనగ ఫలమునుగోరక అందరి మేలుకు గాను ధ్యానించుట, పాటుపడుట. వేమన్న, తరిగొండ వెంగమాంబ, మొదలగు రాజయోగులు ఈవర్గములో జేరినవారై యున్నారు. వీరు గవర్నర్లవంటివారు. వీరిశిష్యప్రశిష్యులు వీరిక్రింది యుద్యోగస్థులై ఉంటున్నారు.

ఏమహాపురుషులైతే తమస్వలాభమునుగోరక ఫలాపేక్ష లేక, జీవకోటికి భక్తిజ్ఞానములు కలుగజేయుటకు సదా పాటుబడుదురో వారందరు యీకారణగురువుయొక్క శిబ్బందిలో జేరినవారు. ఏభక్తుడైతే పరోపకారమునకుగాను సదా పాటుపడుటకు యత్నించునో వాడు కారణగురువుయొక్క దయకు బాత్రుడై వీరిశిబ్బందిలో జేర్చుకొనబడును. కాన, భక్తుడు ఎల్లరమేలుకుగాను ధ్యానించుచు బాటుపడవలెను.

ఒకప్పుడు కారణగురుస్వరూపుడగు ఋషికూడ భూలోకమందవతరించి స్థూలశరీరముతో జనసమూహమునందు సంచరించుటయును గలదు. ఈకలియుగమున ప్రతి 2000 సంవత్సరముల కొకతూరి కాలచక్రము తిరుగుచున్నది. ఈ 2000 సం॥ కాలచక్రమున చతుర్యుగ ధర్మములును నడుచుచున్నవి. కనుకనే ఈ కలియుగాదియందు ధర్మమువృద్ధియై కృతయుగధర్మము నడిచినది. ఇప్పుడు రెండవ 2000 స॥ కాలచక్రము ప్రారంభించినది. ఇది సంధికాలము. భక్తి, జప, తప, జ్ఞాన, అభ్యాసములకు ఇది అదును కాలము. గ్రహణకాలమువంటిది. ఈసంధికాలమందు ఋషులు తమతపశ్శక్తిని తేజస్సును విశేషముగ మనపరిశుద్ధికొరకు గ్రుమ్మరించి భక్తులకు వ్యాపింపజేయుచున్నారనియు, రాజయోగాభ్యాసకులు ఆ దివ్య తేజస్సును అధికముగ బొందుదురనియు, స్వల్పకాలములో జగద్గురుడగు మహా

ఋషియొకరు భూలోకమున అవతరించుచుందురనియును, ఈ దయా నిధి తన సహాయగణపరివారములతో జనులలో కలిసిమెలసి లోకమున భక్తి జ్ఞానములు వృద్ధిచేయుచుందురనియును, ఋషులదర్శ నమును దివ్యదృష్టియునుగల పెద్దలు చెప్పుచున్నారు. కాన, మనమిట్టి పరమరహస్యమును ఎల్లరకుబోధించుచు అందరిమేలుకు బాటుపడుచు సత్యము, వైరాగ్యము, భూతదయను నభ్యసిం చుచు భక్తిజ్ఞానములను అనుష్ఠించినచో, ఈదివ్య తేజస్సును దప్పకపొంది ఈజగద్గురుని దయకు బాత్రులమగుదుము. ఇట్లునడు వనిదే, యీమేలుపొందజాలము. గురువులు మనలను దీవింప జాలరు.

## కార్యగురువులు.

కార్యగురువులు అపరిపూర్ణులు. వీరిలో అనేకులు కారణగురువులయొక్క ప్రథమశిష్యులుగానుండి యింకయు పరి పూర్ణభావమును బొందనివారు మొదటితరగతివారు. వీరికంటె తగ్గుతరగతివారు అనేకులున్నారు. అయతే కారణగురువు జీవులకు బోధచేయుటకై ప్రత్యక్షముగగాని, పరోక్షముగగాని కార్యగురువులను ప్రేరణచేసి పంపును. చిత్తపకాగ్రత, ఈశ్వర ధ్యానము, భూతదయ, అభ్యసింపుచు కారణగురువులచే ప్రేరి తులై జీవులతో గలసిమెలసి ఈరాజయోగమార్గమును జీవులకు బోధచేయువారే కార్యగురువులు. ఇందు గొందరు కారణ గురువుయొక్క ఆజ్ఞను ప్రేరేపణను ఎరుగకయే పరోపకారము నకు బాటుపడుదురు. ఇట్టివారల హృదయమునందు కారణ గురువులు ప్రవేశించి వీరలకు దెలియకయే పరోపకారబుద్ధిని ప్రేరేపించి వీరలద్వారా రాజయోగాభ్యాసమును వృద్ధిచేయు దురు.

## కారణగురువులు చేయుమేలు.

1. కారణగురువులు తమలోనొకరు భూలోకములో

అవతారమెత్తిగాని లేక వారిముఖ్యశిష్యులను అవతరించునట్లు చేసి వారిద్వారాగాని శిష్యప్రశిష్యులకును వీరిద్వారా జీవకోటి కిని రాజయోగమార్గమును బోధచేసి జీవులను పరిశుద్ధస్థితికి దెచ్చుచున్నారు.

2. ఈకారణగురువు సూక్ష్మశరీరధారియై ప్రతిజీవుని యొక్క హృదయమందు బ్రవేశించుటకు హృదయ కవాటము వద్ద గాచుకొనియుంటున్నాడు. సూర్యుడు తనకిరణములను (వెలుగును) అన్ని యిండ్లవద్దకుబంపి "ఓజీవులారా! మీరు వాకిండ్లు తెరిచినయెడల ఈవెలుగు మీయింటిలో బ్రవేసించి యిల్లంతయును బ్రకాశింపజేయుటకు గాచుకొనియున్నది" అని చెప్పినట్టుగా బంపునుగదా! ఒకమనిషి, వాకిలి, కిటికీలు, గవాక్షములుగట్టిగామూసి లోపలనుండినయెడల సూర్యునివెలుగులోపల బ్రవేశింపక చీకటివిశేషమగునుగద. అయినను సూర్యుని వెలుగు "అయ్యో! యీమనిషి అజ్ఞానమువలన తలుపు మూసికొని యున్నాడు. చీకటిబాధకోర్వజాలక తలుపుకొంచెము తెరిచినవెంటనే లోపలబ్రవేశించి యింటిలో చీకటి పోగొట్టెద నని తలుపువద్ద కావలియుండునట్లుండి వాకిలి తెరచినవెంటనే లోపల ఎట్లు ప్రవేశించునో, అట్లే దయాస్వరూపుడగు కారణ గురువు జీవుల అజ్ఞానమునుజూచి చింతించి అత్యంత కనికరము తో ప్రతిజీవుని హృదయకవాటమువద్ద సర్వకాల సర్వావస్థలందు గాచుకొని యుంటున్నాడు. మనకామక్రోధ సంకల్పములు అహంకార మమకారములు దట్టమైన తలుపులుగా నేర్పడి కారణగురువును మన హృదయములో బ్రవేశింపకుండునట్లు చేయుచున్నవి. ఎవరైనను ఈ అజ్ఞానమును వదలి రాజయోగమును నభ్యసించినఎడల ఆకారణగురువు మన స్థూలదృష్టికి నగుపడక పోయినను మనహృదయ కమలమందు బ్రవేశించి మన మనస్సునందు భక్తిజ్ఞానములను అభివృద్ధియగునట్లుచేసి క్రమ

క్రమముగ మనకు కారణగురువు ప్రత్యక్షమగును.

3. కారణగురువు సర్వకాలములందును మనలను జూచు చున్నాడు. కొండమీదనుండునొకడు రాత్రియందు కొండక్రింద నుండు ఇండ్లలో దేనియందును వెలుతురులేక యొక ఇంటియందు మాత్రమే వెలుగు ఉన్నయెడల దానిజూచి తక్షణమే ఆయింటిని ఎట్లుగుర్తించి రాగలడో అట్లే కారణగురువు ఏజీవునియొక్క హృదయమునందు భక్తిజ్ఞానములు భూతదయ వెలుగునో అట్టి వానిని దివ్యదృష్టితో జూచి అతనికి ఉపదేశము చేయుటకు తక్షణమేవచ్చి ఉపదేశము చేసిపోవును. శిష్యునిచే పిలువబడకయే, అకలిగొన్న బిడ్డవద్దకు తల్లిపరువిడి వచ్చులాగున, శ్రద్ధాళుడగు శిష్యునివద్దకు గురువువచ్చి యుపదేశము చేసిపోవును. ఇట్టి గురువు ఉన్నాడని శిష్యునికి దెలియనక్కర అయినులేదు. శిష్యుడు పరిశుద్ధుడై శ్రద్ధాభక్తులుగలవాడైన చాలును. ధ్రువునికి ఆరణ్యములోను, ప్రహ్లాదునికి గర్భములోను, దివ్యదర్శియగు నారదమహాఋషి పిలువబడకయే వీరల పారిశుద్ధ్యమును దెలిసికొని అత్యంత కనికరముతోవచ్చి ఉపదేశము చేయలేదా!

పరీక్షిన్మహారాజునకు పిలువబడకయే దయాసముద్రుడగు శుకమహర్షివచ్చి శ్రీమద్భాగవతము బోధచేసెనుగదా! అట్లే కారణగురువులు మనముకూడ పరిశుద్ధులమైన ఎడల ఉపదేశము చేయుటకు ఇప్పటికిని సిద్ధముగనుంటున్నారు, ఇప్పుడును అట్టి శ్రద్ధాళురగు దయాళురగు భక్తులకుకొందరికి ఉపదేశము చేసియున్నారు.

## శిష్యధర్మములు.

శిష్యుడు పరిపూర్ణుడగు కారణగురువు వంటివాడగుటకై యత్నింపవలెను. కారణగురువు పూర్ణదయాస్వరూపుడుగను పరిశుద్ధుడుగను నుంటున్నాడు. కావున, శిష్యుడుకూడ అట్టి దయాసముద్రుడును, పరిశుద్ధుడును గావలయును. శిష్యు

డు ఈస్థితిని బొందుటకై మనోమాలిన్యమును నాశనము చేసి కొనుచు సర్వభూతదయను నభ్యసింపవలెను. కామక్రోధములను భేదబుద్ధులను, మతద్వేషములను, అహంకారమును, నశింప జేసికొనవలయును. వీనిని నశింపజేయుటకు ధ్యానమే ముఖ్య సాధనము.

ధ్యానమనగ కారణగురువును గాని ఈశ్వరునిగాని సర్వ కాలములందు మనస్సున నిలిపి మనస్సుతో బూజించి, సేవించి, ప్రేమించి భక్తిని అభ్యసించుట. ఈ ధ్యానమువల్ల పరిశుద్ధత్వ ము కలుగును. ఎట్లనగా, ఒక తెల్లగుడ్డ ఎఱ్ఱరంగులో నద్దిన ఎఱ్ఱగనవును. పచ్చరంగులో నద్దిన పచ్చగ నవును. ఏరంగు లో నద్దిన ఆరంగు దానికి దగులును. అట్లే మనస్సు ఏగుణము గల వస్తువును ధ్యానించునో ఆవస్తువుయొక్క గుణమును బొం దును అనగా ఆజీవుడు ఆగుణము గలవాడగును. ఎప్పుడును దొంగలను స్మరించిన దొంగబుద్ధి పుట్టును. వ్యభిచారులను స్మరించిన వ్యభిచారబుద్ధి పుట్టును. సురాపానము, భంగి, అభిని స్వీకరించు గురువులను స్మరించిన శిష్యుడును అట్టి బుద్ధి అభ్యాసముగలిగి చెడిపోవును. ఇది శాస్త్రసిద్ధము, అనుభవ సిద్ధము.

శాంతమును ఇంద్రియనిగ్రహమునుగల గురువును ధ్యానిం చిన వాడు అట్టివాడే యగును. కావున కారణగురువును గాని ఈశ్వరునిగాని ధ్యానించుచుండిన మనయందు ఆపరిపూర్ణుని తేజస్సు ప్రవేశించుచు మనస్సు పరిశుద్ధమగును. కాబట్టి సర్వ కాలములందును సర్వావస్థలందును ధ్యానమును నభ్యసించవలె ను. ధ్యానమునందు మనోమాలిన్య[illegible] ముఖ్యమార్గ మొకటి యున్నది. వేపాకు తిను[illegible] యెట్లు పోగొట్టునో, అడే విధముగ [illegible] డల, ఈశ్వరుని శాంతమూర్తిగా [illegible]

చును. అట్లే యితర దుర్గుణములను వానికి విరుద్ధములగు సద్గుణములను (opposite virtues) ధ్యానించుటవలన నశింపజేసి కొనవలెను.

కాన, మత్తువస్తువులనుతినుట మానవలెను. సాత్వికాహారములనే భక్షింపవలెను. మతవైషమ్యములను భేదబుద్ధులను కామక్రోధాదులను పూర్తిగ వదలి శాంతి, దాంతి, భూతదయల నభ్యసింపుచు స్థిరపడిన మనస్సుచేత ఈశ్వరుని అందరిని మంచివారలను చేయుమని ధ్యానింపవలెను. ఈ కాలప్రభావమును, జగద్గురుడు అతిశీఘ్రకాలములో అవతరించుటను ఎల్లరకు బోధించి భక్తులను జేయవలెను. భక్తులు సభలేర్పరచి ఈ నమ్మికను వృద్ధిచేయవలయును. ఈ ధర్మములను శ్రద్ధతో ననుష్ఠించుచురాగారాగా, తనను చుట్టుకొనియున్న సూర్యుని వెలుగును చూడలేని గ్రుడ్డివానికి కన్నులకు చూపుకలుగగానే సూర్యుని ప్రకాశమంతయు నెట్లు అగుపడి వాడు ఆ వెలుగును జూచి యెట్లు ఆనందించునో, అదే విధముగా అజ్ఞానము నివృత్తి కాగానే మనచుట్టు నెల్లపుడు వ్యాపించియుండియును మనకు నంతవరకు నగుపడకయుండిన జ్యోతిస్వరూపుడగు కారణగురువు దర్శనమిచ్చి మనల చెయ్యిపట్టుకొని గురోర్గురుడగు మహాదేవునొద్దకు జేర్చి బ్రహ్మానందము గలుగజేయును. పరిపూర్ణులను జేయును. ఈధర్మముల ననుష్ఠించుటకు వలయు సత్యము, వైరాగ్యము, భక్తి శ్రద్ధ, భూతదయ జగదీశ్వరుడు మనకు నిచ్చుగాత!

ఏ. నంజుండప్ప,

కడప.

# ఇంద్రియనిగ్రహము.

ఈ భూలోకమందు నివసించు మనుజు లాచరింపవలసిన రెండవధర్మము ఇంద్రియనిగ్రహము. తమ శరీరములయం దావిర్భవించియుండు అంతరింద్రియములను నిగ్రహింపవలయును. ఇంద్రియములు మనుజులకు మేలుకీడుల నొనరించును. వానిని మనుజుడేమార్గమందు ప్రవేశపెట్టిన నామార్గమునఁ బోవుచుండును. ఈ యింద్రియములను నడపుమార్గము మనుజుని బుద్ధిసూక్ష్మతనుబట్టి యుండును. శరీరము వేరు ఆత్మ వేరు అని దలంచు మనుజుడు ఇంద్రియములను నాత్మవైపు నడుచునట్లు జేయును. అప్పుడు బ్రహ్మానందము గలిగి సంచిత కర్మను అనుభవించి తిరిగి జన్మమునకు రానేరడు. అట్లుగాక శరీరమువైపు ప్రవహింప జేసినయెడల సంసారాంబుధిలోబడి దుఃఖములపాలై సుఖమేమియును లేక ననేకజన్మము లెత్తవలసినవాడగును. కాబట్టి యెల్లరకును ఇంద్రియనిగ్రహము ప్రధానమై యున్నది.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యములను నారును మనుజునకు శత్రువులై యున్నవి. వీనిలో నొక్కొక్కటియె మనుజుని నశింపజేయగలవు. అట్లుండ నివియన్నియు నొకనియందు గూడియుండిన నవి యొనరించు కీడును వేరెచెప్పవలయునా? వీని నణచివేయుటకు దృఢనిశ్చయము ప్రధానము. ఇదిలేనియెడల మనుజుడు నిర్వహింపజాలడు. వీనినిగురించి దెలుసుకొనుటకు పూర్వము భగవంతు డొకడున్నాడనియు, ఆయనచే లోకములన్నియు సృజింపబడినవనియు, మన మాయనబిడ్డలమనియు, ఆయన దయాస్వరూపుడనియు, ప్రేమాస్పదుడనియు గ్రహింపవలసియున్నది. ఇది మనస్సునందు దృఢముగా నాటుకొనిన యెడల పైజెప్పిన యింద్రియములను నిగ్రహించుట సులభమైయున్నది. కాబట్టి దానిని ముందు విచా

రించవలెను. ఈ యింద్రియములు శరీరమే యాత్మయనియు, శరీరము నశించినతోడ ప్రపంచమే లేదని యూహించు మనుజుని యందు వసించునుగాని భగవంతు డొకడుకలడనియు, ఆయన న్యాయమూర్తియనియు, ఆయనను మనమందరము సేవింపవల సినదనియు, ఆయనచే సృజింపబడిన యీలోకమందలి జనులం దరును సోదరులనియు భావించి ప్రేమించు మనుజుని నేమి చేయ గలవు? పాఠము చదువని బాలుని యుపాధ్యాయుడు శిక్షించును గాని, దినము పాఠమును జక్కగా పఠించు బాలుని నేమిజేయ గలడు? వాని నధికముగా ప్రేమించునుగదా!

కామము.

కామమనునది మనుజులయందేగాక జంతువులయందుగూడ నావి ర్భవించియున్నది. జంతువులయందు బుద్ధిసూక్ష్మత లేనందు వలన నవి కామము గలిగినపుడు నెరవేర్చుకొనుటకు ప్రయత్నిం చును. మనుష్యజాతి యట్లుగాక జక్కగా విచారించి పనిచే యును. కామమన కోరికయని యర్థము. కోరికలు పలు విధములు. మనుజుడా కోరికలు సంధిపియా లేక చెరుపును గలుగజేయునా యని విచారింపవలయును. కోరిక గలిగినపుడు దానినేలాగునైన నీడేర్చుకొనుటకు ప్రయత్నింపరాదు. కోరిక లు సూక్ష్మశరీరమునకు సంబంధించినవిగాని యాత్మకు సంబంధిం నవిగావు. కాబట్టి కామము దీర్చికొనుటలో బహుజాగరూ కతగలిగి ప్రవర్తింపవలయును. కామమె మనుజుని నశింపజే యగలదు. లోకసేవ యొనర్పవలయునను కోరికగలిగిన యెడ మనుజుని బాగుజేయును.

కామమన స్త్రీలతో దమకోరికల నెరవేర్చుకొనుట యని గొందరి యభిప్రాయము. దీనివలన ననేకమంది ధనికులు భిక్షా ర్థికారులగుచున్నారు. ఎంతమంది శత్రువులనైన జయింప శక్యమగునుగాని మనలోనుండు నీకామమును జయింపజాలము.

పూర్వమందు మహాఋషీశ్వరులంత తపస్సంపన్నులైయున్నను కామమును జయింపజాలక తమ తపస్సును ధారపోసుకొనిరి. వారిలో విశ్వామిత్రుడగ్రగణ్యుడు. ఈయన ఘోరతపస్సు నరించినను చివరకు మేనకయను నింద్రలోక వేశ్యవలలో పడిపోయెను. మన కామమును దీర్చుకొనుటకై వేలకొలది రూప్యములనేల వ్యయపరుపవలయును. అగ్నిసాక్షిగ వివాహము జేసుకొనిన భార్యతో ఋతుకాలములందు కామమును దీర్చుకొనవలయునుగాని విశేషధనము వ్రయముజేసి పరస్త్రీలతో నేల భోగింపవలయును. దీనివలన నష్టములెన్నిగలవు. పాపమూ సంభవించును. ధనమూ వ్రయమగును. శరీరమూ పాడగును. మనస్సు దుర్వృత్తియందు ప్రవేశించును. రోగములూ శరీరములో ప్రవేశించును. సిగ్గూపోవును. నిందా నెత్తిమీదికివచ్చును. తల్లిదండ్రులూ నిందించెదరు. కులమూ చెడిపోవును. మందబుద్ధియూ యేర్పడును. బంధువులూ పరిహాసమొనర్చెదరు.

## క్రోధము.

మనుజులను నశింపజేయు గుణములలో రెండవది క్రోధము. దీనికి మరియొక పేరు ఆగ్రహము. కోపమొనరించు కీడులను జూడుడు, కోపమువచ్చినపుడు శరీరమే దెలియక యనేకమందిని దిట్టుదుము, గొట్టుదుము, జంపుదుము. ఈ ప్రకార మొనరించుటవలన మంచియూ చెడుగా. ఇతరులనగా నెవరు? వారిశరీరములోనుండు నాత్మయు మనశరీరమునందుండు నాత్మయు నొకటియె గదా. అటువంటి సమయములో నితరులమీద గోపపడినయెడల నది మనలకు గాదా? అజ్ఞానముచే నితరులేదైన తప్పొనరించినయెడల మనము వారలకీలాగు జేయగూడదని సహనముతో బోధింపవలయునుగాని కోపము జేసినయెడల మనకేమి లాభముకలుగును, కోపమువచ్చిన

పుడొక పర్యాయము వానిసూక్ష్మశరీరమును వీక్షించినయెడల తిరిగి యెన్నటికిని గోపమును జెందడు. ఆసమయమందు సూక్ష్మశరీరము రక్తవర్ణమును దాల్చి జూచుటకు భయంకరముగా నుండును.

కోపముచెందినపుడు మనము చెడిపోవుటయేగాక యితరులకుగూడ కీడుచేయుచున్నాము. మనమెవ్వరిమీదనైన కోపముచేయునపుడు మనపిల్లలుగూడ మనలనుజూచి నేర్చుకొనుదురు. వారిమనస్సుగూడ పాడుచేసిన వారమగుదుము. క్రోధమువలన మోహముగలుగును, మోహమువలన విభ్రమగలుగును, విభ్రమవలన బుద్ధినశించును, బుద్ధినశించుటచే మనుజుడు నశించును. కోపముచే నిన్నికీడులు గలుగును.

మనము మనక్రింద పనిచేయు నౌకరులమీద యెక్కువ కోపపడి తిట్టుదుము. ఆలాగు తిట్టవచ్చునా? తిరిగి వారలు మనలను నంతరంగమందు దూషించరా? వారలచే జక్కగా పనిచేయించుకొనవలయునుగాని తిట్టికొట్టి యెన్నిదినములు పనితీసుకొనగలము? మంచిమాటలచేత నెన్నిపనులైన జేయింపగలముగాని కోపగించి యొక్కకార్యమునుగూడ చేయింపజాలము.

ఇంతియెగాక బాలురు ఏదైన చిలిపిపని చేసినయెడల తిట్టికొట్టెదము. ఇదిమంచిపనియా? వికసించిన బుద్ధిగలిగిన పెద్దవారలే యొరులమీద కోపపడుచుండ దెలియక యజ్ఞానముచే చేయరాని కార్యమొనరించిన బాలునిమీద నేలకోపపడి తిట్టవలయును? వానికి నీప్రకార మొనరింపగూడదని బోధింపవలయునుగాని తిట్టికొట్టవచ్చునా?

క్రోధమును జయించుటకు సహనము ప్రధానము.

ముదునూరు. శ్రీరంగయ్య.

# మోక్షసాధనములు.

## పరోపకారము.

సేవ రెండువిధములు. విద్యాదానమొసంగి జ్ఞానము నుపదేశించిన గురువుసేవయొకటి, లోకసంగ్రహార్థమై చేయబడు సేవయొకటి. ఈరెండును మనుజులకు నావశ్యకములు. మనకు శరీరము పరోపకారమునకై యివ్వబడియున్నది. మన గురువులు జెప్పిన కార్యములను మనము ఏవిధముగనైనను జేసి తీరవలయును. గురువు సాన్నిధ్యము దొరుకుట దుర్లభము. దొరికినను వారిని తృప్తిపొనర్చుట యతిదుస్తరము. వారుపదేశించు పనులను జేయనియెడల వారికరుణ నెట్లు బడయగలము. కాబట్టి వారిసేవ కర్తవ్యము.

రెండవది మనుజులను సేవించుట. ఇది యేప్రకారమొనర్పవలయును? బీదలయందు కరుణగలిగి వారిని పోషించుటయు, రోగపీడితులైన మనుజులను మందులు మొదలైనవి యిప్పించి యారోగ్యవంతులనుగ జేయుటయు, ఇతరులు దుర్మార్గముగా ప్రవర్తించుచుండినయెడల వారిని సన్మార్గములో ప్రవేశింపజేయు విధమును బోధించుటయు, విద్యావిహీనులకు విద్యాదానమొసంగుటయు, నతిథులను సత్కారము జేయుటయు, ఒరులను దూషింపక వారుదనకు జేయు నపకారమును సహించుకొని వారికి నుపకారమొనర్చుటయు, మార్గములయందు బోవునప్పుడెవ్వడైన నేదైన నడిగినయెడల విసుకుకొనక వారికి చక్కగా ప్రత్యుత్తరము జెప్పుటయు, బాలురయందు నధికప్రేమగలిగియుండుటయు, ప్రపంచములోనుండు ప్రతిమానవుడు నీశ్వరాంశసంభూతుడనియు, వానియందు వసించు నాత్మయు మనయందువసించు నాత్మయు నొకటియేయని గ్రహించి, వారికి నాపదలు సంభవించునపుడవి మనకుగలిగినవని భావించి వానిని తొలగిం

చుటకు ప్రయత్నముచేయుటయు, ఈశరీర మశాశ్వతమైనదని యు నితరుల సేవకొరకు మనకివ్వబడినదనియు గ్రహించి పనిచే యుటయు, మనుజులకు జ్ఞానము నుపదేశించుటయు, వారియందు ద్వేషబుద్ధిలేకుండుటయు నీవిధముగా పరోపకార మొనర్పవలయు ను. ఈప్రకార మొనర్చుట మనుజులకందరికి ధర్మము. పరోప కార మొనర్చుటచే జీవన్ముక్తులగుదురు. ఇకాలమందు సేవ యొనర్చు మహనీయులు విశేషముగా గలరు. వారు స్వలా భమునుగోరక దివారాత్రములు మనుజుల శ్రేయోభివృద్ధికై పాటుబడుచున్నారు. అటువంటి వారల యుదాహరణంబును గైకొని మనముగూడ మనశక్త్యానుసారము ప్రపంచమందు ప్రతి ఫలమునుగోరక పరోపకార మొనర్పవలయును. మనము యొక కార్యమొనర్చిన దాని ప్రతిఫలమునకై నిరీక్షించుచుండగూడదు. ఏపని నొనర్చినను ఈశ్వరార్పణబుద్ధితో జేయవలయును. అప్పుడుగదా కర్మ పరిపక్వమై జీవన్ముక్తులమగుదుము.

భక్తి.

పరమాత్మ నిర్గుణపరబ్రహ్మము. అటువంటి నిర్గుణ పర బ్రహ్మమును భజించుట బహుదుస్తరము. దీనిని జ్ఞానమువలన సంపాదింపవచ్చును. అయితే జ్ఞానముబొందుట బహుకష్ట సాధ్యము. ఎల్లరకును సాధ్యముకాదు. సామాన్యజనులకు కూడ నతిసులభమైనదియు, ఎల్లరచే నాచరింపదగినదియు, జీవ న్ముక్తుడగుటకు యోగ్యమైన రెండవది భక్తిమార్గము. ఈశ్వ రుని యవతారములలో నొకదానియందిష్టముగలిగి, ఆయనను సదాధ్యానము జేయుచు, ఆయనచే నొనరింపబడిన కార్యములను మననము జేయుచు, న్యాయప్రవర్తనగలిగి యుండినయెడల భక్తి పొడమును. దానివలన మోక్షము లభించును.

దీనిని సాధించు నుపాయములలో మొదటిది ఆహారమును భుజించుటలో నేప్రాణికిని హింసగలుగజేయకూడదు. ఏలన

న, ఈశ్వరుడు ప్రేమస్వరూపుడు. ఆయనను భజింపవలయు ననిన ఆయనచే సృజింపబడిన యేప్రాణిని హింసింపగూడదు. హింసించితిమేని ఆయన కరుణకు పాత్రులు కాజాలము. రెండవది మనస్సును పరిశుద్ధము జేసుకొనవలయును. చెడు తలంపులేవియు మనస్సునందుంచరాదు. అందువలన నీశ్వరుని ధ్యానము జేయునపు డీసంకల్పములు వచ్చి చిత్తమును చంచలము జేయును. రాగద్వేషములను త్యజింపవలయును. భగవంతునకు రాగద్వేషములు లేవు. ఆయనను ఉపాసనము జేయు మనకును నవి యుండకూడదు. సదా ఆయనను మనము మనస్సునందు ధ్యానము చేయుచుండవలెను. ఎన్ని బాధలువచ్చినను ఎన్నికష్టములు సంభవించినను భక్తిని త్యజింపగూడదు. నిరంతరము ఆయన పాదపద్మములను చేరవలయునను ఆసక్తితప్ప వేరుకోరిక యేమియును నుండగూడదు. కాబట్టి దేహమును పరిశుద్ధముగా నుంచుకొనుట, మనస్సు నిర్మలము జేయుట, భగవంతుని సదా ధ్యానముచేయుట యను నీమూడును భక్తికి లక్షణములు. ఈ భక్తి తొమ్మిదిమార్గములుగ ప్రవహింప జేయావలయునని ప్రహ్లాదుడు దనతండ్రికి వచించియున్నాడు. హరికథలను వినుటయు, ఆయన నామముచ్చరించుటయు, ఆయనను స్మరించుటయు, ఆయన పాదములను సేవించుటయు, ఆయనను పూజించుటయు, ఆయనకు నమస్కరించుటయు, ఆయనకు పరిచర్యచేయుటయు, (అనగా పరోపకార మొనర్చుటయు) ఆయనతో స్నేహముచేయుటయు, తన్నర్పించుటయు నను నీతొమ్మిది భక్తిమార్గముల నవలంబించి శ్రీహరిని నమ్మియుండుట మోక్షమునకు సాధనము. ప్రాతఃకాలమందు సూర్యోదయమునకు పూర్వము మేలుకొంచి, స్నానముచేసి ఆయనను కొంచముసేపు ధ్యానముచేయవలయును. ఆయన యొనరించిన కార్యములను కర్ణానందముకలుగునట్లు విని సంతసింపవలయును.

ఆయన యుపదేశించిన వాక్యములను పఠించి యాప్రకారము ప్రపంచమందు ప్రవర్తింపవలయును. ఆయనయందు భక్తిగలిగియుండి యాయన యాజ్ఞాపించిన ప్రకారము నడువనియెడల నిష్ప్రయోజనము. సత్పురుషుల సాంగత్యము చేయవలయును. సర్వభూతములయందును ప్రేమగలిగి యుండవలయును. ఇతరులకు బాధగలుగ చేయు కార్యము లొనగింపగూడదు. యేకార్యమొనరించినను దానిప్రతిఫలము నపేక్షింపగూడదు. అహంకార మమకారములను త్యజింపవలయును. కామక్రోధములు జయింపబడి మనస్సునిశ్చలమైన స్థితికివచ్చి సదా యీశ్వరునిధ్యానము చేయుచు యానందించి కొలదికాలములో జీవన్ముక్తుడై మోక్షమును జెందును. ఇది మోక్షమార్గమును జెందుమార్గములలో రెండవది. ప్రహ్లాదుడు భక్తిచే తరించెను. గోపికలు శ్రీకృష్ణునియందలి ప్రేమచే మోక్షమును జెందిరి. ధ్రువుడు భక్తిచే శ్రీమహావిష్ణునిగూర్చి తపస్సుచేసి ఆయనదర్శనమును పొందెను. నారదమహర్షి యేకార్యమునందును తలంపులేక హస్తమందు వీణెను ధరించి సదా భగవంతునిమీద కీర్తనలు పాడుచు తనజన్మమును సాఫల్యముచేసుకొనెను. వాల్మీకిమహర్షి రామనామోచ్చారణచే గొప్పవిద్యను బడసి శ్రీరాముల చరిత్రమును రచించెను. మనకు ప్రపంచమందు ఇన్నిదృష్టాంతములు గలవు. కాబట్టి మనము జ్ఞానమార్గమందు పోవుటకు దుర్లభమైనప్పటికిని సులభమైన యీభక్తిమార్గమును నవలంబించి భజించి, సేవించి మనజన్మము సాఫల్యముచేసుకొని జీవన్ముక్తులమై మోక్షమును చెందవలసియున్నది. ఇదియె ప్రపంచములో మనకత్యంతావశ్యకమైనది.

ముదునూరు శ్రీరంగయ్య.

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

(414-వ పుట శేషము.)

బ్రహ్మాండమను పాఠశాలయందు అనేక తరగతులలో నేర్పదగిన పలువిధములగు జీవులున్నారనియు, వారివారికి తగినట్టు నియమములు ప్రవృత్తిమార్గముయొక్క ధర్మములుగా తారతమ్యాను సారముగ సనాతనధర్మ శాస్త్రములందు వివరింపబడినవనియు, అవి ఈసంచికలో వ్రాయబడునని గతసంచికలో సూచింపబడియుండెను. ఇప్పుడవేవైనవియు విశదీకరింపబడును.

ఈశ్వర సంకల్పానువర్తనులగు సర్వజ్ఞులైన మహాత్ములు, కేవల పశుప్రాయులును ఆహారనిద్రా మైథునములే సకలంబనియెంచి తదనువర్తనులునగు మూఢులు మొదలుకొని, ప్రపంచసుఖములన్నియు నిస్సారములని తెలిసి పరమ వైరాగ్యముగల మోక్షాపేక్షులైన సాధువులవరకు, నుండు జనులనందరిని ఉద్ధరించి కడతేర్చుటకై మాంసభక్షణము, మద్యపానము, జీవహింస మొదలగు అకృత్యములని సామాన్యజనులకుతోచు కర్మలతో ప్రారంభించి అస్తేయ అస్ఖలిత బ్రహ్మచర్య, ఫలమూలాహారాదులగు తీక్ష్ణవ్రతముల వరకు ధర్మములుగానెంచి జనులాచరించుటకుగాను శాస్త్రములందు నియమించినారు.

పశువధ మాంసభక్షణ మద్యపానాదులను శాస్త్రములందు అంగీకరించినట్లు చెప్పియుండుటచేత ధర్మ సూక్ష్మము తెలియనివారును మతాంతరులును హిందూమతమును దూషించుచు పత్రికలు ప్రకటించుచు ఈమతముపై ద్వేషబుద్ధి పుట్టునట్లు చేయుచున్నారు. గనుక ఈఅకృత్యములని అందరికితోచు ఆచారములు ధర్మములుగాజెప్పియుండుటకు కారణము విచారింతము.

సమస్తజంతువులను వధచేసి మాంసము తినుచును మద్యము పానముచేయుచును మితిలేక స్త్రీసంభోగముచేయుచునుండు

పశుసమానులగు మూఢులనెట్లు క్రమముగా నీకర్మలనుండి తొలగించి వృద్ధికి తేవలెను? వీరలకు ఈ కార్యములు చేయుటతప్ప మరేమియు తెలిసికొనుటకు మనసు పక్వమై యుండదు. ఇట్టివారికి ఏవిషయములు సుఖములని తోచుచున్నవో ఆవిషయముల నుండి పూర్తిగమరల్చక కట్టులోనుంచవలెనని పరమదయానిధుల గు మహనీయులు ఎరిగి వీరికి పశుహత్యచేయుట మద్యపానము చేయుట ధర్మమని ఏర్పరచిరి. వీరికెట్లు బోధించవలెననిన:—

"దేవతలకు నివేదనముచేయక అర్చకులకివ్వక బంధువులను ఇష్టుకుంబెట్టక మాంసముతిని మద్యపానముచేసినట్లైన పాపము సంభవించుచున్నది మీకు దేవతలు మేలుచేయరు గనుక తినగోరినపుడు దేవతులకు బలియిచ్చి ఒకభాగము అర్చకుని కిచ్చి బంధువులతోకలసి అనుభవించినట్లైన దేవతలు తృప్తిజెంది మీకోరికలు ఈడేర్చుదురు మీకుసుఖముకలుగును పాపముకలుగద" ని బోధించవలెగాని "కందమూలములు తినియుండవలె" నని బోధించిన వారికా బోధపట్టదు.

అప్పుడు వారు తమకు ఇష్టమైన పదార్థములు విడువ మని చెప్పకుండుటనుపట్టి ఆమాట ఆలకింతురు. వారిని అట్లు ఆచరింపచేయుట సులభముగనుండును. ఎప్పుడువారు ఆకట్టుబాటుకులోబడిరో అప్పుడేవారు ఒక నియమముగల వారైరి. అదేవారికి తపస్సు. "నియమేషుతపశ్శబ్దః" అని ఆపస్తంబ సూత్రములలో చెప్పబడినది.

స్వధర్మమన జనులుప్రకృతము తాముండు స్థితినుండి పైకి ఎక్కుటకు మెట్టని ఇంతకు ముందుదాహరింపబడియుండెను. ఏకట్టుబాటును లేక ఇచ్ఛానుసారము యల్లమ్మ, పోలేరమ్మ అనెడి పేళ్లుంచి వానికిబలియిచ్చి శేషముభుజించుటే స్వధర్మమగుగాని అంతకెక్కువైన కర్మలు వారికి ధర్మముకాదు.

జగత్తునందు క్షుద్రదేవతులుండుటయు నిజము, వారునెత్తురు

తోను మద్యాదులతోను తృప్తి చెంది అట్లు తృప్తి చెందించువారి కభీష్టములిచ్చుటయు సత్యము.

ఈవస్తువులను తినుటకపేక్షపుట్టినప్పుడంతయు దేవతల కారగింపుచేసి అర్చకునకిచ్చి బంధుమిత్రులతో భుజించుటకు కట్టుబడినతోడనే కొన్నివిషయముల కష్టముతోచును. వ్యయమధికమగును. అప్పుడువారు దినదినము తినుటకుమాగుగా పద్దైన పండుగ పర్వములు జాతరలు మొదలైన నిమిత్తములు కలిగినప్పుడు మాత్ర మాకార్యముచేయుటకు పూనుదురు. ఇట్లుచేయుటచే ఎన్నివిధముల భూతములకు తద్వారా లోకమునకు మేలు కలుగునో యోచించుడు. జంతుహత్యతగ్గుటయు, కేవల స్వోదర పరాయణులైన తిండిపోతు, త్రాగుబోతులను ఒకయజ్ఞము (Sacrifice) చేయ నేర్పినట్లాయె. యజ్ఞమన తనకు ఇష్టమైన పదార్థమును ఇంకొకని ప్రీతికొరకై యిచ్చుట. తాము మాత్రము తిని త్రాగు మాంస మద్యములను ఇతరుల కిచ్చునట్లు చేయుట వారిచేత యజ్ఞము చేయించినట్లు కదా. కారణముచేతనే సూతసంహితయందిట్లు చెప్పబడినది.

శ్లో॥ మార్గాణాంయేవిరుద్ధాంశా వేదాంతేచవిచక్షణాః
తేచమందమతీనాంచ మహామోహావృతాత్మనాం
దర్శయిత్వాతృణంమర్త్యోధావంతీంగాంయథాగ్రహీత్
దర్శయిత్వాతథాక్షుద్రమిష్టం పూర్వంమహేశ్వరః
పశ్చాత్వాకానుగుణ్యేన దదాతిజ్ఞానముత్తమం॥

పచ్చిక తిని బలిసి పరువులిడు పశువునకు ఎవ్విధంబున పచ్చిగడ్డిచూపి దానిని పట్టికట్టివేయుదురో అవ్విధంబుననే మోహాక్రాంతులగు అత్యంతమూఢులకు భగవంతుడు పరమ కృపచే క్షుద్రమార్గములయందు వారికిష్టమైన పదార్థములను మొదట చూపి వాటియందభిరుచి కలుగజేసి తరువాత పక్వానుసారము గ జ్ఞానబోధచేసి తరింపజేయునని తాత్పర్యము.

ఎంతాక కేవలమూఢులగు అల్పజాతులందు నమ్మకము విశేషముగ ప్రబలమైయుండెనో అందాక ఈదేశమందు పశువధ తక్కువగానుండెను. క్రిశ్చియన్ పాదిరీలు దేవతులకు బలి యిచ్చుట మిక్కిలి మూఢత్వమని బోధించి ఆయభిప్రాయములందు నమ్మకముతప్పించుచువచ్చి నప్పటినుండి భక్షణ కొఱకే పశువుల ను వధించుటయు త్రాగుటయు బలమాయెను.

హిందూమతమందువలె తారతమ్యాను సారముగ నియమము లేర్పడని మతములు ప్రబలించియుండు యూరోపు అమెరికా దేశములలోనున్నంత పశువధయు త్రాగుటయు ఈదేశమందు లేనేలేదని దృఢముగా చెప్పవచ్చును.

ఇట్లనే అమిత కామాతురముతో మితిమీరి స్త్రీసంగము చేయుచుండువారికి అస్ఖలితబ్రహ్మచర్యముగాని, ఏకపత్నీవ్రతముగాని ఋతుకాలమందు మాత్రము స్వస్త్రీయందు సంపర్క విషయముగాని బోధించిన ఆబోధ వాని కంటునా? అంటదు గనుక వాని కెట్లుబోధించవలెను? "నీవుభోగించ నిచ్ఛయించిన స్త్రీలను పెండ్లిచేసికొని భోగించినట్లైన నీకుపాపముంటదు, లేని యెడల పాపము కలుగును. దానివల్ల నరకప్రాప్తియగునని చెప్పి వానినికూడా నియమప్రవర్తనలోనుండునట్లు చేయవలెను. ఈ కారణమునుపట్టి ఒకరికంటె నెక్కువసంఖ్యగల స్త్రీలను వివాహముచేసుగొనుట అంగీకరించబడినది.

శ్లో॥ లోకేవ్యవాయామిషమద్యశేవా
నిత్యాస్తుజంతోర్నహితత్రబోధనా
వ్యవస్థితిస్తత్రవివాహయజ్ఞ
స్సురాగ్రహైరాసునివృత్తిరిష్టా

లోకమందు స్త్రీసంపర్కము మద్యపానము, మాంస భక్షణ ఈపనులుసేయుటకు ఎవరి ప్రోత్సాహమును అక్కరలేక స్వభావముగ చేయుచునే ఉందురు. వివాహము, యజ్ఞము,

దేవతల కారగింపు ఇవన్ని చివరకు బొత్తుగా వదలిపెట్టుటకు గాను నియమించిన విధులని భాగవతమందు చెప్పబడినది.

ప్రవృత్తిమార్గమునకు చేరిన ధర్మములన్నియు అపక్వ మనస్సుగల వారిని వారివారి స్థితి, సామర్థ్యము, యోగ్యతలనుపట్టి క్రమముగా పక్వమనసుగలవారినిగా చేసి, వేదాంతవిచారమునకును, నివృత్తిమార్గ మవలంబించుటకును సమర్థులగు నట్లు చేయుటకు తప్ప వేరు కాదు. పక్వమనసుగల నివృత్తిమార్గపరులకే శాస్త్రమును విబోధయు అవశ్యముండదు. వారు తమ హృదయములోనుండు ఈశ్వర ప్రేరణ ననుసరించిపోదురు.

పరువంబులోనుండి కామము నణచశక్తులుగాని రాజులును, ఇంద్రియనిగ్రహ సమర్థత లేని ఇతరులును తమ అధికార బలముచేతను, ధనమదముచేతను వివాహమైన స్త్రీలను లోపరచుకొనిగాని బలాత్కారముగగాని పొంది సద్వంశములు చెరపకయుండుటకు ఒకతెకంటె నెక్కువ స్త్రీలను వివాహ మాడుట అంగీకరించబడినది. అక్కడికిని తృప్తిచెందనివారును నిగ్రహములేక ఇతరులను సత్కులములను నాశముచేయుట ఆపుటకై వారాంగనలనుకూడ ఈమతబాహ్యులుగా చేయలేదు. వెలయాండ్రు స్త్రీల పాతివ్రత్యమును నిరాటంకముగ జరుపుటకై పర్పడియున్నారు గనుక వీరును నిందనీయులు కారు. ఈ వెలయాండ్రలోను బహుమంది ఇతరవిధముల ధర్మరతులై పరోపకారముచేయుచుందురు. బళ్లారియందును, బెంగుళూరునందును ఇద్దరు వెలయాండ్రు దేవాలయమును, సత్రములును బావులును కట్టించి త్రోవ్వించి బహుమంది బాటసారులకు అనుకూలములుచేసియున్నారు. వీరిలో ఈశ్వర భక్తులును అక్కడక్కడ చూడగలము.

ఇట్టి నియమములు లేని ఇతరదేశములందు వ్యభిచారదోషము అతి ప్రబలముగానున్నదని డాక్టరు సేంజరు (Dr. Sauger)

అను వాడు తాను సమస్త దేశములుతిరిగి అచ్చటచ్చట బహుదిన ములుండి పరిశీలించి వ్రాసిన రంకులచరిత్రము (History of Prostitution) అను పెద్దగ్రంథమందు వ్రాసియున్నాడు. మరియు సమస్త దేశములకంటె ఈ హిందూ దేశమందు వ్యభిచారదోషము చాలాతక్కువయని ఆగ్రంథమందే తెలియజేసినాడు. దేశమందు వ్యభిచారదోషమును ఆపుటకై ఈనియమము లేర్పరిచినారు గాన వ్యభిచారమును ప్రోత్సాహపరచుటకు నెంత మాత్రమును కాదు.

కొందరు హిందూమతమందు అనృతమాడుటకూడా అంగీకరించబడినదని హేళనముచేయుదురు. సర్వదా అబద్ధముల చెప్పువానికి హరిశ్చంద్రునివలె సత్యవ్రతుడై యుండవలెనని బోధించిన ప్రయోజనమగునా? వ్యాపారమే సత్యానృతముల తోకూడియున్నది. "సత్యానృతంచ వాణిజ్యం" అని మనుస్మృతి యందు చెప్పబడినది. "అనృతమేవ వ్యవహారజయ హేతుః" అని విష్ణుపురాణమందు కలియుగ వర్ణనయందు దాహరించబడి నది. సమస్తవ్రతములకంటె సత్యవ్రతముసల్పుట కష్టము శ్రేష్ఠము. "నాస్తిసత్యసమంతపః" అని విదురుడు ధృత రాష్ట్రునికి బోధించినాడు. పరమార్థ దృష్టి దృఢపడక ప్రపంచ వ్యవహారమందుండి భార్యాపుత్రులను పోషించుచుండు వారికి అతి తీక్ష్ణమైన సత్యవ్రతము సల్పుట సాధ్యపడదు గనుక వారిని క్రమముగ సత్యవ్రతులుగ త్రిప్పుటకు తగిన ధర్మముపదేశింపబడినది.

ఆ॥ వె॥ వారిజాక్షులందు, వైవాహికములందు,
ప్రాణ, విత్తమానభంగమందు,
చకితగోగణాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చునఘము బొందదధిపా॥

స్త్రీలవిషయమందును, వివాహ కార్యములపుడును, ప్రాణహాని, అర్థహాని మానహాని సమయమందును, గోసమూహమును బ్రాహ్మణసంఘమును రక్షించవలసినపుడు అనృతమాడ

వచ్చును. దానిచేత పాపము కలుగదని శుక్రాచార్యులవారు బలిచక్రవర్తికి బోధించినట్లు భాగవతమందు చెప్పబడినది.

ఇట్టి బోధలు సత్యమందు నిలుకడలేని సామాన్యజనులకే గాని నిలుకడగలవారికి కాదని బలిచక్రవర్తి నిదర్శనముగా నేర్పడినాడు. బలిచక్రవర్తి సత్యసంధుడు గనుక ఈబోధకు లోపడక తనవాగ్దానమును త్రిప్పక నెరవేర్చె.

సమస్తశాస్త్రములు ప్రవృత్తిమార్గమందు క్రమముగ నెక్కి పోవుటకు నియమింపబడినవేగాని దానిని మీరినవారికి కాదు. ఎల్లప్పటికి సత్యముచెప్పు స్వభావముగలవానికి "సత్యంవద" అను శృతివాక్యముతో నేమిప్రయోజనము? కనుక పైచెప్పబడిన సులభముగా ఆచరించుటకు తగిన విధులన్నియు జననమరణ ప్రవాహరూపమైన ప్రవృత్తిమార్గమునకు లోపడిన మూఢులకు కొంచము అడ్డముగానుండుటకు యేర్పడినవని యెంచవలెగాని మంచి, చెడ్డయనెడు తారతమ్యజ్ఞానము కలవారికి కాదు. అట్టి వారికి నింతకంటె కఠినమైన నిబంధనలేర్పడినవి.

"ఏవంపతతిసంసారే తాసుతాస్వహయోనిషు
అవిద్యాకర్మతృష్ణాభి ర్భ్రామ్యమాణోథచక్రవత్
బ్రహ్మాదిషునృణాంతేషు భూతేషుపరివర్తతే
జలేభువితథాకాశే జాయమానఃపునఃపునః॥
అబుధానాంగతిస్త్వేషా బుధానామపిమేశృణు॥

దీనితాత్పర్యము పైనవ్రాయబడినది. ఈపైనియమములు అబుధులు అనగా కించిత్తైన తారతమ్యములేని వారికిని, బుధులకనగా తారతమ్యముగలవారికిని యికముందు చెప్పబోవునని భారతమందు సూచింపబడియున్నది.

జం. శ్రీనివాసరావు.

# విశ్వామిత్రుడు.

పూర్వము కుశికుఁడను వానికిఁ గుశనాభుండును, నతనికిఁ గాధియు, నాగాధికి విశ్వామిత్రుఁడును జనియించిరి. విశ్వామిత్రుఁడు మిగులఁ బరాక్రమవంతుఁడై గుఱ్ఱములు, ఏనుగులు, రథములు మొదలయిన బలముతో ననేక సహస్రవర్షంబులు నీతిఁదప్పక రాజ్యమేలుచు నొకనాఁడు దేశాటనంబుజేయఁగోరి ఇరువదిమైదు వేల ఆఱువందల పదిగుఱ్ఱములును, ఒకలక్షతొమ్మిదివేల మూఁడువందల ఏబది కాల్బలమును, మొదలుగాఁగల అక్షౌహిణీ సేనాపరివృతుండై పట్టణ నగరగ్రామంబుల ననేకంబుంజూచుచు మార్గవశంబున వశిష్ఠునాశ్రమంబుఁ బ్రవేశించి, యమ్మహర్షికి నమస్కరించి ఆశీర్వచనంబులనంది, యుచితాసనంబునఁ గూర్చుండి వశిష్ఠుం జూచి "మునిచంద్రా! రాక్షసబాధలులేక మీతపంబులు నిర్విఘ్నముగ జరుగుచున్నవా" యని యడిగెను. "నీవు దుర్మార్గులను శిక్షించుచు సన్మార్గులను రక్షించుచు న్యాయవంతుఁడవై రాజ్యమేలుచుండఁగా మాకుఁగష్టములేల గలుగును" అని వశిష్ఠుఁడుప్రత్యుత్తరమిచ్చి "నీకును సేనలకును విందుఁజేసెద"నని చెప్పి కామధేనువును దలఁచెను. అదియు నప్పుడే వచ్చి పనియేమి యని వినయముతో నడిగెను. అప్పుడు మునీంద్రుండు "ఈవిశ్వామిత్రునకును పరిజనులకును, సంతోషకరముగ విందొనర్పవలయును. వలయువాని నెల్ల నిర్మింపు"మనియె

కామధేనువును వెంటనే షడ్రసోపేతములయిన భక్ష్య భోజ్య చోష్య లేహ్యపానీయాదులను సృజించె. అంతవిశ్వామిత్రుఁడ సేనాసమేతుఁడయి విందారగించి, సంతుష్టుండయి వశిష్ఠుని జూచి నమస్కరించి నిలచి యిట్లనియె. అయ్యా! మునీంద్రా లక్షగుఱ్ఱములను, లక్షఏనుఁగులను వేయిలక్షల రత్నములను,

నేక లక్షలగోవులను యిచ్చెదను. ఈ యావు నొకదానిని మాత్రము నాకిమ్ము అని బ్రార్థించెను. అంత వశిష్టుఁడు మహారాజా! ఇది నాధనము, నాప్రాణము, నాజీవితము. నీవు త్రిలోకములు నాకిచ్చినను దీని నీయజాలను అనివచించెను. అందుకు విశ్వామిత్రుం డాగ్రహముఁజెంది భటులం బురికొల్ప వారును అసురభిం గట్టికొని పోవుచుండిరి. అంతనది "అనాధవలె నానాధుఁడు నన్నేల వీరిబారి బడజేసెనో" యని విజృంభించి కట్లుత్రెంచుకొని భటులంబడదన్ని వశిష్ఠునిఁజేరి యిట్లనియె. స్వామీ! ఈతఁడు రాజనిభయపడి నన్ననాధవలె విడచితివని తోచుచున్నది నాకనుమతి యొసంగితివేని వీరినందఱినిఁ దెగటార్చెద నని యతనిచే సెలవొంది హుంకారం బొనర్చెను.

వెంటనే దాని శరీరావయవములనుండి యవనులు, కాంభోజులు, మ్లేచ్ఛులు, కిరాతులు మొదలయిన వీరభటులనేకులుద్భవించి విశ్వామిత్రుని సైన్యంబును నశింపఁజేసిరి. అంతట విశ్వామిత్రుండు మహోగ్రుఁడై తలఁపడి యోడి తనమనంబున నిట్లని వితర్కించె ఆహా! ఏమి ఈతనితపః ప్రభావము! ధనంబులలో తపోధనమే శ్రేష్ఠమైనది. తపంబునకు మించిన దింకొకటి గోచరముకాదు. కాఁబట్టి తపంబొనర్చి యాతని నిర్జించెదనని తలఁచి, తనపుత్రునొకని రాజ్యమేల నియమించి, హిమాలయంబునకరిగి శంకరుంగూర్చి ఘోరంబగు తపంబాచరించె. శంకరుండును ప్రసన్నుండై యాతనికోరిక ననుసరించి సకలాస్త్రశస్త్రంబులును ప్రయోగోప సంహారములతో నుపదేశించె.

అంతట విశ్వామిత్రుండు వశిష్ఠుంజేరి యాతనితో నతి ఘోరంబగు రణంబొనరించె. వశిష్ఠుండు నొకఁ బ్రహ్మదండంబున విశ్వామిత్రుని పాశుపతాది యఖిలాస్త్రశస్త్రంబుల నుపసంహరించి యగ్నింబోలి దేజరిల్లుచుండె.

అంత విశ్వామిత్రుం డాశ్చర్యసంభ్రమ రోషంబులతో దపోబలంబన్నిఁటిలో నుత్తమమైనదనియు, నందుబ్రాహ్మణుడగుట సర్వోత్తమమైనదనియు, నట్టి బ్రాహ్మణత్వము సంపాదింపవలెననియు, దలఁచి భార్యంగూడి అత్యుగ్రంబగు తపంబొనరించె. ఇట్లు వేయేడులుగడచిన బ్రహ్మదేవుండు సంతసించి ప్రసన్నుండై యిట్లనియె.

“విశ్వామిత్రా! నీతపోవేడిమి స్వర్గమర్త్యపాతాళంబుల నాక్రమించె. ఇకమీఁద రాజర్షివయి లోకంబున ప్రసిద్ధికెక్కఁ గలవు” అని యనుగ్రహించె. అందుకు గాధేయుండు సంతుష్టింబొందక “ఈ రాజర్షిత్వమునా కేల? బ్రహ్మర్షిత్వమునే సంపాదించెద” నని నిరాహారుండై తపంబొనరించుచుండె. ఇట్లు సహస్రాబ్దంబులుగడిచె. అంతట ప్రజాపతి ప్రత్యక్షంబై ఇఁక మీఁద ఋషివయి పేరొందుమని వరంబొసంగె. అంతటితో తృప్తింజెందక మరల సత్యుగ్రంబగు తపంబొనరించుచుండె. అప్పుడు దేవతలపంపున మేనకయను నచ్చరవచ్చి యాతని మోహింపఁజేసె. అతఁడును మేనకతో పదిసంవత్సరములు క్రీడించి, ఇది దేవతలు తనతపోభంగమునకు చేసినయుక్తియని గ్రహించి దానియందు విముఖుండై మహోగ్రంబగు తపంబొనరించుచుండె. అట్టి సమయంబున, సురజ్యేష్ఠుండు సురసమూహముతో ప్రత్యక్షమై గాధేయా! ఇకమీద మహర్షివని జగంబునఁ గీర్తిఁగాంచుమని యాశీర్వదించె. అందుకును విశ్వామిత్రుండు సంతృప్తుండు గాక బ్రహ్మంజూచి, స్వామీ! నాకింతటితో తృప్తిగలుగదు. నన్నుబ్రహ్మర్షిని చేయునంతదనుక తపంబుసుగను, అని చెప్పి అతిభయంకరంబగు తపంబాచరించుచుండె. ఈతనితపోగ్నికి త్రిలోకంబులును కంపించె. అంతట దేవతులు ఈతని నియమంబడగించి లోకంబుల శాంతింబొందింపుమని రంభయను దేవవేశ్యనుబంపిరి. అదియెఱిఁగి కుశికనందనుండు మిగులక్రోధముతో

"నీవు వేయిసంవత్సరంబులు పాషాణమవయియుండి పిమ్మట, నొక భూసురుని యనుగ్రహంబున శాపమోక్షణమొందుమని" రంభం దిట్టె. అందువలన తనకు గలిగిన తపోమహత్త్వ వ్యయమునకుఁగుంది మరల వేయివర్షంబులు నిద్రాహారవర్జితుండై తపంబొనరించి, భోజనంబుచేయఁబోయె. అంతసురేంద్రుం డతిథియైవచ్చి యాయన్నంబంతయుఁ దానయారగించె. అప్పుడు మరల నమ్మహర్షిచంద్రుండు వేయిసంవత్సరంబు లతిభయంకరంబగు తపంబొనరించె. అప్పుడు దేవతలు పరమేష్ఠికడకేగి "అయ్యా!చతురాననా! విశ్వామిత్రుం డతిఘోరంబగు తపంబొనరించుచున్నాడు. దానిని విఘ్నముసేయ నెవరికిని సాధ్యంబుగాదు. అతని శరీరమునుండి బయలువెడలిన తపోగ్నివలన, స్వర్గలోకము కంపించుచున్నది. నక్షత్రములురాలుచున్నవి. త్రిలోకంబులు నతిభయంబు నొందుచున్నయవి. సముద్రములు కలగుచున్నవి. భూమివడకుచున్నది. అట్టి మహోగ్రంబగు తపంబుతాను బ్రహ్మర్షిగాకవిడువడు. స్వామీ! మీరనుగ్రహించి యాతనికి బ్రహ్మర్షిత్వ మనుగ్రహించి లోకంబుల బాధలుడుప బ్రార్థించుచున్నారము" అని విన్నవించిరి. అంత బ్రహ్మదేవుండు దేవ గంధర్వ కిన్నర కింపురుషాదులచే బరివేష్టితుండైచనుదెంచి విశ్వామిత్రుంజూచి, విశ్వామిత్రా! నీతపంబు ఫలించె, నీకోరికలీడేరె. ఇకమీద బ్రహ్మర్షివని పేరొందెదవు లెమ్ము, అని యానతిచ్చెను. అంతగాధేయుండు బ్రహ్మంజూచి యిట్లనియె. స్వామీ! మహాప్రభో! ఇట్టి సంతోషవాక్యము మీరన్నంతమాత్రంబున తపంబుడుగను. బ్రహ్మర్షిసత్తముండైన వశిష్ఠుండనెనేని లేచెదనని బ్రత్యుత్తరమిచ్చెను. అంత వారందఱు వశిష్ఠుంబ్రార్థింప నాతండరుదెంచి "కౌశికా! బ్రహ్మర్షివని నేనును సమ్మతించితి, లెమ్ము" అనియె, అంతగౌశికుం డత్యంత సంతుష్టాంతరంగుడై వశిష్ఠునేక విధంబుల నుతించె.

ఆహా! వింటిరా తపోమహత్త్వము! తపంబు ధనంబుల లో నుత్తమంబు. ఐశ్వర్యంబులలో శ్రేష్ఠము. కార్యంబు లలో ప్రధానము. తపోబలంబునకు మించినబలంబు లేదు. దానికిమించిన మాహాత్మ్యము లేదు. దీనివలన నెరవేరనిపని లేదు. త్రిలోకంబులును తపోవంతుని యదుచేతిలోనివి. తపోవంతునికి దైవముకూడ భయపడును.

కావున నో బ్రాహ్మణోత్తములారా! ఎవడు ఉత్తమ క్షత్రియుడై జనించెనో ఎవ్వడు నీతిదప్పక ననేకసహస్రాబ్దంబులు రాజ్యమేలెనో, ఎవ్వడు మిక్కిలి పరాక్రమవంతుడై ప్రసిద్ధి కెక్కెనో, ఎవ్వడు వశిష్ఠునితో బోరాటంబునఁనోడి రాజ్యవిముఖుండై తపంబునకేగెనో, యమ్మహానుభావుడు, ఆ కౌశికుడు ఆ గాధేయుడు, ఆ విశ్వామిత్రుడు దేనిచే సకలధనుర్వేదంబును ప్రయోగోపసంహారంబులతో సంపాదించెనో, దేనిబలంబున వశిష్ఠునెదురించి త్రిశంకుని స్వర్గంబుననిలిపెనో, దేనిమహత్త్వమున శునశ్శేఫుని బ్రతికించియు అంబరీషుని యజ్ఞము నిర్విఘ్నముగ నెరవేరజేసెనో, దేనిని వ్యయపరచి రంభంజయించి దానిని పాషాణత్వము నొందజేసి తిరిగి స్వస్వరూపంబుదాల్ప ననుగ్రహించెనో, దేనిప్రభావంబున ప్రజాపతితో నిగ్రహించి యతని సృష్టికి మాఱుసృష్టి జేసెనో, దేనిననుసరించి క్షత్రియాన్వయంబును బ్రాహ్మణత్వముగా మార్పునొందించుకొనెనో, దేనివలన త్రిలోకవాసులచేతను నభినందింపబడుచుండెనో, దేనియాధిక్యత వలన సప్తర్షులలో నొకడై నెగడుచుండెనో, ఆమహాపదవి, ఆమహోన్నతైశ్వర్యము, ఆ తేజోరాశి, ఆపుణ్యపుంజము, ఆసదాచారము, ఆకులవృత్తి ఆతపోధనము ఈ కాలమున నేల నశింపజేసెదరు? దానిని మరల నుద్ధరింపుడు, సర్వోత్తములరగుడు. ముక్తింగనుడు.

(దేశాభిమాని).

—:0:—

పైన వ్రాయఁబడిన విశ్వామిత్ర చరిత్రమువలన మనము గ్రహించఁదగిన విషయము లెవ్వియో విచారింతము.

1. దృఢవ్రతముతో పాటుపడినయెడల నెంతటికార్యము నైన సాధించనగు. పూనుకొన్నకార్యమునకు ఎన్నివిఘ్నములు కలిగినను, ఎన్నిభంగములు వాటిల్లినను, ఎంతటిబలవంతులు ప్రతిఘటించినను, కార్యసాధనమునకు నెంతదీర్ఘకాలము పట్టినను పట్టినపట్టువిడువక నిశ్చలసంకల్పముతో పురుషుఁడు ప్రయత్నించునేని కడపట కార్యసిద్ధిఁబొందును. విశ్వామిత్రుని తపంబును భంగముచేయుటకై ఇంద్రాది సమస్తదేవతలు కంకణముగట్టుకొని అనేక విధముల యత్నించిరి. త్రిశంకుఁడు శునశ్శేఫుడు మొదలగు వారివలనను తపంబునకు పెక్కు అంతరాయంబులు గలిగె. అయినను విశ్వామిత్రుఁడు భయపడక పూనికను విడువక ననేక వేల సంవత్సరములు తపంబుకొనసాగజేసి తాను సంపాదింపఁబూనుకొన్న బ్రహ్మర్షిత్వమును సంపాదించె.

2. మొదట లోభమువలన విశ్వామిత్రుఁడు వశిష్ఠమహర్షి యొక్క కామధేనువునాశించి ధర్మమును దిగనాడి దానిం బలాత్కారముగ బట్టుకొనిపోవుటకు సమకట్టె. అపుడు వశిష్ఠుని తపోమహిమవలన కామధేనువునుండి యనేక వీరులు బయలువెడలి తన సైన్యమును హతముజేయఁగా నదిచూచి విశ్వామిత్రుఁడు రాజ్యభోగాది సమస్తైశ్వర్యములును తుచ్ఛములని యెంచి లోభమును జయించి సర్వస్వమును పరిత్యజించి బ్రహ్మతేజస్సునుగోరి తపంబునకై అరణ్యమునకు వెళ్లె. ఘోరతపంబుచేయుచున్నతరి మేనకయను నప్సరస్త్రీ కంటికికనుఁబడినంత మాత్రమున కామాతురుఁడై అనేకవేల సంవత్సరము లొనర్చిన తపమును వ్యర్థపరచుకొని విషయసుఖంబుల మరిగె. అంతట కొన్నాళ్లకు తెలివితెచ్చుకొని కామమును జయించి మరల తపంబుబూనె. పిమ్మట గొంతకాలము

నకు తనతపోవిఘ్న మొనరించుటకై రంభవచ్చి తనయెదుట నిలిచినపుడు అత్యంత క్రోధావేశుఁడై రంభను శపియించి తపంబు వ్యయపరచుకొనియె. అంతట తపోవ్యయమునకు వగచి క్రోధమునణచి శాంతమనస్కుఁడై తపంబొనరించి బ్రహ్మర్షి పదవినొందె.

శ్లో॥ త్రివిధంనరకస్యేదం ద్వారంనాశనమాత్మనః
కామక్రోధ స్తథాలోభ స్త స్మాదేత త్త్రయంత్యజేత్॥
(భగవద్గీత 17–వ అ.)

కామము క్రోధము లోభము ఇమ్మూడును ఆత్మనాశనమునకు హేతువులగును, నరకప్రాప్తియునొందించును. గావున వీనిని సర్వాత్మనా జయింపవలయునని భగవద్గీతయందు స్వామి యుపదేశించిన ధర్మము విశ్వామిత్రుని చరిత్రమందు అనుభవసిద్ధమై యేర్పడినది.

3. విశ్వామిత్రుడుఁ జన్మమువలన క్షత్రియుఁడైనను తపోబలమువలన బ్రాహ్మణుండయ్యె. మనుజుడు కేవలము జన్మమువలననే బ్రాహ్మణుడుగానోపడు. ఏవర్ణమునఁ బుట్టినవాఁడైనను తపోబలమువలన బ్రాహ్మణుఁడు కానోపును. కామక్రోధ లోభములను జయించినవాఁడె బ్రాహ్మణుఁడు. వానిని జయించినవానికే తపముసిద్ధించును. మోక్షమార్గమునకు ఇంద్రియనిగ్రహామే మొదటిమెట్టు.

“తస్మాత్త్వమింద్రియాణ్యాదౌనియమ్యభరతర్షభ” అని గీతావాక్యము.

ప. నరసింహయ్య.

ఓం.

# దివ్యజ్ఞానదీపిక.



## A Telugu Monthly Organ
## OF THEOSOPHY.

## ఆంధ్రదివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మము లేదు).

**6-వ సంపుటము.**

—:O:—

1915 సం॥రము ఏప్రిల్ నెల మొదలు
1916 సం॥రము మార్చి నెలవరకు.



జంగంకోట శ్రీనివాసరావుగారు,
పరమాత్ముని నరసింహయ్యగారు,

సంపాదకులు.

V. J. PRESS, CHITTOOR.

# దివ్యజ్ఞాన దీపిక ఆఱవసంపుట విషయసూచిక.

# Divyagnanadeepika.

CONTENTS OF THIS NUMBER.



:o:

Registered No. M. 716.

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువధర్మములేదు).

**April 1916**

సంపుటము 7. ఏప్రిల్ నెల 1916. సంచిక 1.

---

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్.



# దివ్యజ్ఞానదీపికః

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

April 1916

సంపుటము 7. ఏప్రిల్ నెల 1916. సంచిక 1.

## కాలదేశ వర్తమానములు.

దివ్యజ్ఞానదీపికకు ఆఱు సంవత్సరములు వెళ్లి యీసంచికతో ఏడవ సంవత్సరము ప్రారంభించినది. గత సంవత్సరమున నీపత్రికకు సహాయమొనర్చిన పుణ్యపురుషులకెల్లఱకు సహస్ర వందనములు. పత్రికం బ్రచురించుటయందలి ద్రవ్యకష్టములధికములైనవి. పౌను అణాలు 2 పైసలు 5 వంతున అమ్ముచుండిన కాకితములు ఇపుడు పౌను అణాలు ఆఱు వంతున దొరకుట దుర్లభమైయున్నది. అచ్చువేయుటకు కావలసిన ఇతర వస్తువులు సయితము ధరలుహెచ్చి పోయినవి. అయినను మేము ఈపత్రికయొక్క చందాధనమును హెచ్చించలేదు. చందాదారుల సంఖ్య ద్విగుణమగు నేని విశేషనష్టము లేక పత్రికను జరుపఁగలము. కావున నూతన చందాదారులఁజేర్పుటకై మా చదువరులందఱు యథోచితము సాయముఁజేయఁ బ్రార్థితులు. మహాత్ముల కటాక్షమున కీపత్రిక పాత్రమగుగాక!

కడచిన మార్చినెల 17, 18, 19 తేదులయందు కడప చిత్తూరుజిల్లాల దివ్యజ్ఞాన సమాజమువారు చిత్తూరులో సమావేశమయిరి. 18, 19 తేదులయందు చిత్తూరుజిల్లా డిస్ట్రిక్టు కాన్ఫెరన్సు అచటనే జరిగెను. శ్రీమతి అనిబెసంటమ్మగారు ఈ రెండు సభలకును అగ్రాసనాధిపత్యమును వహించిరి. బెంగుళూరు, వేలూరు, మదనపల్లె, తిరుపతి, కాళహస్తి, కడప, ప్రొద్దుటూరు మొదలగు ననేక స్థలములనుండి పెక్కుమంద్రు సభలకు వచ్చియుండిరి. సభాకార్యములు అతివైభవముతో జరిగెను.

* * *

అనిబెసంటమ్మగారు మదరాసునుండి 17 తేది సాయంత్రం 5¾ ఘంటలకు రయిలుబండిలో చిత్తూరికి విజయముచేసిరి. ప్రముఖులగు వారనేకులు రయిలుస్టేషను యొద్ద కాచుకొనియుండి అమ్మగారికి నుచితరీతిని స్వాగతమొసగి పూలహారములతో నర్చించి మంగళవాద్యములతో బిలుచుకొనివచ్చిరి. వెంబడే "దివ్యజ్ఞానము-యుద్ధము" అను విషయమును గురించి అమ్మగారొక యుపన్యాసమిచ్చిరి. మరునాటియుదయమున హిందూబాలికా పాఠశాలకును పంచమవిద్యాశాలకును దయచేసి విద్యార్థుల నాశీర్వదించి అటుపిమ్మట "రాంబోవు మానవశాఖ" ను గురించి యొక ఉపన్యాసము నొసంగిరి. మధ్యాహ్నమునకు పిమ్మట డిస్ట్రిక్టు కాన్ఫెరన్సుకు వెళ్లి సభాధిపత్యమును వహించి ఆరంభోపన్యాసనమును ప్రసంగించిరి. మరుదినము భానువారమునాడు ఉదయమున అమ్మగారు హిందూస్త్రీలకొక యుపన్యాసమునిచ్చిరి. మధ్యాహ్నము మొదలు సాయంత్రం 5 ఘంటలవఱకు డిస్ట్రిక్టు కాన్ఫెరన్సు కార్యముల నెరవేర్చి 6½ ఘంటలకు "హిందూదేశీయ వ్యవహార లోపముల"నుగురించి అత్యద్భుతమైన యొక గొప్ప యుపన్యాసమిచ్చిరి. ఆరాత్రిబండిలో అమ్మగారు చెన్నపట్టణమునకు దయచేసిరి. అమ్మగారి యుపన్యాసములు ఎల్లవారికిని శ్రవ

ణానంద కరములును మనోహరములును సుజ్ఞాన బోధకములునై యుండె.

ఇదిగాక శనివారమునాడు సాయంకాలము బ్ర॥ చిట్ట మూరు రామయ్యగారు చిత్తశుద్ధిని గురించియు, ఆమరునాడు కడప బ్ర॥ నంజుండప్పగారు మనశ్శక్తిని గురించియు తెనుగున యుపన్యాసములిచ్చిరి. స్త్రీలు పురుషులును అనేకులు వచ్చి విని యానందించిరి.

పరమార్థదృష్టితో చూచునెడ ఏకాలమునగాని యుద్ధము చేయుట ధర్మమగునా కాదా అను నంశమును ఆనిబెసంటమ్మ గారు మొదటియుపన్యాసమునఁ జర్చించిరి. భూతములకెవ్వరికిని ఎగ్గు చేయకూడదనియు, సర్వభూతములయెడ నెల్లప్పుడు మైత్రి నే నలుపవలయుననియు, అన్నిమతములును మొరబెట్టుచున్నవి. అపకారము చేసినవానికి సయితము ప్రత్యపకారము చేయఁ గూడదు, ఉపకారమే చేయవలయును. ఎదుటివాఁడు కోపము జేసుకొన్నపుడు మనము శాంతముగా నుండవలయును. "అక్రోధేనజయేత్ క్రోధం" అని శాస్త్రవాక్యము. శాంతముచేత కోపము జయించవలయునని యర్థము. పగచేత పగయణగదు. మైత్రిచేతనే పగనణఁపవలయు. ఇట్లని క్రైస్తుబోధించెను. ఈ ధర్మమునే బుద్ధదేవుఁడుపదేశించెను. హిందూసనాతనధర్మము దీనినే శాసించుచున్నది. ఇట్లుండుటంజేసి యుద్ధముచేయుట ధర్మమని యెట్లు దలఁపనగునని కొందఱు వాదించెదరు.

హిందూశాస్త్రములందు వర్ణాశ్రమధర్మములేర్పడియున్నవి. ధర్మమందఱికిని నొకఫ్రటియైయుండదు. వారివారి జ్ఞాన మునకును శక్తికినిఁ దగినట్టు వారివారికి ప్రత్యేక ధర్మములేర్పడి యున్నవి.

గృహస్థుగానుండు వాడు తన భార్యాపుత్రాదులతోడ ఇంటిలో నిద్రించుచున్నపుడు ఒక సర్పముగాని పెద్దపులిగాని ఇంటిలో ప్రవేశించెనేని దానిని జంపియైన భార్యాపుత్రాదుల రక్షించవలయు. అటులనే దుష్టులగు చోరులు ప్రవేశించిరేని స్వజనరక్షణమునకై వారిని హింసించుటయు ధర్మమేనగు. సర్వకాల సర్వావస్థలయందును "అహింసా" వ్రతమును పరిపాలించుట కేవలము సన్యాసులకు మాత్రము ధర్మమైయుండును. దుష్టమృగములుగాని దుర్మార్గులుగాని పైబడివచ్చినను వానినెదిరించి సన్యాసి చంపగూడదు. తన ప్రాణమునైన నప్పగించవలయుగాని ఏజంతువుయొక్క ప్రాణమునుగాని సన్న్యాసి తీయఁగూడదు. గృహస్థధర్మ మట్టిది కాదు.

అటులనే దేశమునందు ప్రజారక్షణముచేయుట రాజధర్మము. శిష్టసంరక్షణమును దుష్టజనశిక్షణమును రాజుకు కర్తవ్యములు. భగవద్గీతయందు క్షత్రియ ధర్మమిట్లు వివరింపబడియున్నది.

శ్లో॥ శౌర్యం తేజోధృతిరాక్ష్యం
యుద్ధేచాప్యఫలాయనం
దానమీశ్వరభావశ్చ
క్షాత్రంకర్మస్వభావజమ్॥

ముందు పెట్టిన కాలు వెనుకదీయక యుద్ధముచేయుట క్షత్రియులకు స్వాభావిక కర్మము. ఇదియునుగాక

శ్లో॥ ధర్మ్యాద్ధియుద్ధాత్ శ్రేయోన్యత్
క్షత్రియస్యనవిద్యతే

ధర్మమైన యుద్ధమునకంటె క్షత్రియునికి శ్రేయస్కరమైన దేమియులేదని శ్రీకృష్ణుఁడు అర్జునుని కుపదేశించె.

పశ్చిమఖండమున క్షత్రియజాతి ప్రత్యేకముగ లేకున్నను అచటిరాజులు మంత్రులు సేనాధిపతులు సైన్యములోఁ జేరిన

వారందరు క్షత్రియులనఁదగు. అట్టివారికి యుద్ధము స్వధర్మము. ఆంగ్లేయులును వారిమిత్రమండలివారును ఇపుడుజేయుచున్న ది ధర్మయుద్ధము. ఆంగ్లేయులు స్వలాభమునకై యిపుడు యుద్ధముచేయుచున్న వారుకారు. లోకమునందు అధర్మము నణచి ధర్మమును స్థిరముగ నిలుపుటకొఱకై పోరాడుచున్నారు.

"యతోధర్మస్తతోజయః". ధర్మమేజయించును. అట్టి ధర్మ యుద్ధముజేయుచున్న వారికి సహాయముచేయుటయు వారికి విజయము గోరుటయు ధర్మప్రవర్తనమైయుండు.

* * *

భారతీయస్త్రీలు పురుషులతో పాటు పనిచేయకుండిన నీ దేశము బాగుపడదని యనేకులభిప్రాయపడియున్నారు. ఇది సత్యమైన యభిప్రాయమేగాని మనస్త్రీలున్నత దశకు గాఁదగిన ప్రయత్నములచ్చటచ్చట జరుగుచున్నవి. విద్యలేనిచో మనదేశపు స్త్రీలు బాగుపడుట దుర్లభమని తలచి వారి నిమిత్తమై యనేక విద్యాశాలల నచ్చటచ్చట నేర్పరచియున్నారు. వానిలో నుత్తీర్ణులైన కొందరు స్త్రీలు తమదేశమాతకు సేవ యొనరింప కంకణబద్ధులై తమ శక్తికొలది పాటుపడుచున్నారు. తగిన సన్నివేశములు లేమించేసి లోపలనే యప్రకాశముగా నుండిన కొందఱు స్త్రీలిపుడు బయలువెడలి దేశహితముకొరకు పాటుపడుటకై యత్నించుచుండుట మంచిసూచనగానున్నది. వీరి సంఖ్య యధికమై మాతృభూమి త్వరగా నున్నత సీమకు వెళ్లునుగాక యనిప్రార్థించెదము.

* * *

దివ్యజ్ఞాన సమాజముయొక్క యుపశాఖలలో స్త్రీ సంఘములు కొదవమైయుండెను. అడియారులో "వసంతపుర మహిళాసమాజము" 3, 4 సంవత్సరములక్రిందట స్థాపింపబడెను. అది మొదలు దివ్యజ్ఞానసమాజములో ప్రేమను బొందిన

స్త్రీల సంఖ్య యెక్కువయగుచువచ్చెను. జస్టిస్ సదాశివయ్యర్ గారి ధర్మపత్నియును, జస్టిస్ చంద్రశేఖరయ్యర్ గారి ధర్మపత్నియును నీసమాజ విషయమై యెక్కువ శ్రద్ధబుచ్చుకొని పని చేయుచుండుట నెల్లరకును తెలిసినవిషయమే. ఇటీవల బళ్లారిలో "మైత్రేయి సమాజము" అను పేరుగలిగి దివ్యజ్ఞాన సమాజమునకు నుపశాఖగా నొక మహిళాసంఘమేర్పడియున్నది. దీనిలో 27 మంది స్త్రీలు మెంబర్లుగానున్నారు. పబ్బతి రిందమ్మగారు ప్రెసిడెంటుగాను, అచ్చమ్మగారు సెక్రెటరీగాను ఉన్నారు. మ॥ చింతకుంట సుబ్బాశాస్త్రిలుగారు ప్రతిదినమును వీరికి "థియాసఫీ" కి సంబంధించిన గ్రంథములను చదివి విమర్శగా బోధించుచున్నారు. మెంబర్లుగాని స్త్రీలు సయితము ప్రతిదినము శ్రవణము జేయవచ్చుచున్నారు. వీరిభక్తి శ్రద్ధలు చాల ఆశ్చర్యకరములైయున్నవి. మహనీయుల యనుగ్రహముచే నీసమాజము నానాటికి వృద్ధియై బళ్లారిపుర నివాసులకు మేలొనరించుగాక!

*    *    *

పండిత మహాశయులగు కర్వేగారు భారతీయ స్త్రీలను విద్యానిపుణులుగా జేయు నిమిత్తమొక సర్వకలాశాల నేర్పరచదలచి పోషకులను సంపాదించు నిమిత్తమై దేశమంతయు సంచరించుచున్నారు. వారు వెళ్లిన ప్రతిస్థలమునందు పోషకుల సంఖ్య బాగుగానే పర్వడుచుండుట చాల సంతసించవలసిన విషయమైయున్నది. వీరియుద్యమముచే భారతదేశ స్త్రీలు పూర్వుల యున్నత స్థితికి వచ్చెదరుగాక యని ప్రార్థించుచున్నారము

కర్మయోగుల చర్యలు చాల విచిత్రకరములై యుండును. వారు ప్రదర్శించు చాకచక్యత సామాన్యుల కర్థమగుట కష్టము.

తత్రాపి, కర్మ చేయవలసిన యావశ్యకమును మరచిపోయి యు న్న భారతీయులకు కర్మయోగుల చర్యలెల్లు హృదయంగమ ము సును? అనేకులకు కర్మ యనగా మత సంబంధమైన "కర్మాను ష్ఠానము"నే యర్థమగుచున్నది. లోకహితమునకు సంబంధించి న వ్యవహారములను కర్మలో జేర్చుకొనక యుండు వారనేకు లున్నారు. ఇట్లుండ నీకాలమున కర్మయోగులు జేయుపనుల చక్కగా నర్థము జేసుకొనుట దుర్లభమే. జనులర్థము జేసికొనినను లేకపోయినను కర్మయోగులు తాము జేయు లోకహితమును వ దలరు. వారలలో మన ప్రెసిడెంట్ గారగు అనిబెసెంటమ్మగారు, మతవిషయమునందును, విద్యావిషయమందును, సంఘసంస్కరణ విషయమందును, రాజకీయ విషయమందును యెంతయో పాటు పడుచున్నారు. వీరియుద్యమముచే ననేక ప్రయోజనములను బొందుచున్న మనమెంత కృతజ్ఞతను జూపవలనో చదువరులే యాలోచించవలయును. మనదేశమాతకు నీమెయే జ్యేష్ఠపుత్రిక యైయున్నది. దేహము పాశ్చాత్యులదైనను నీమె మనోహృద యములు భారతీయులదైయున్నది.

* * *

చంగల్పట్టుజిల్లా దివ్యజ్ఞానసభ మార్చినెల 18, 19 తేదీ లు పూనమల గ్రామమందు చేరియుండెను.

మ॥ రా॥ హైకోర్టు జడ్జి సదాశివయ్యగారు అగ్రాస నాధిపత్యము వహించిరి. అడియారు, చంగల్పట్టు, తిరువళ్లూరు, కంచి, ఈయలూరు, ప్రొద్దుటూరు గ్రామములనుండి సభికు లువచ్చియుండిరి. ఇతర గ్రామములనుండి వచ్చిన వారం దరికి, నివాస, భోజన, ఫలహారాది వసతులు ఏమాత్ర మైన లోపములేక అతిసుఖముగ నుండునట్లు మ॥ రా॥ వకీలు రామక్రిష్ణయ్యగారు అమర్చియుండిరి.

రెండు ఉపన్యాసములు తప్ప మిగిలినవన్నియు ద్రవిడ,

ఆంధ్రభాషలలోనే జరుపబడెను. ఇంగ్లీషుభాషయందు మ॥రా॥ నరసింగరావుగారును, వాడియాగారును ఉపన్యసించిరి.

ద్రవిడ భాషలో మ॥ రా॥ గోపాలస్వామినాయుడు గారును, బ్రహ్మశ్రీ సౌందరరాజయ్యరుగారును, పెన్షన్ డిప్టి కలెక్టరు టి. వి. గోపాలస్వామి అయ్యరుగారును ఉపన్యసించిరి. ఆంధ్రభాషయందు ప్రొద్దుటూరు ప్రథమ ఉపాధ్యాయులగు ప్రసిద్ధిజెందిన చిట్టమూరురామయ్య గారును, జం. శ్రీనివాస రావు గారును ఉపన్యసించిరి.

సభాధ్యక్షులు కొనవెళ్ల ద్రవిడ భాషయందే సమస్తము ను మిగుల ఇంపైన మృదుమధురవచనములతో జనులందరికి ఆహ్లాదకరముగ చెప్పిరి.

బ్రహ్మశ్రీ పెన్షన్ సబ్ జడ్జిగారగు ఏ. రామస్వామి శాస్త్రిలవారు స్వాగతసభకు అధ్యక్షులుగానుండి స్వాగతపత్రి కను ఇంగ్లీషుభాషయందు చదివిరి. సభాధ్యక్షులకును, సభి కులకును, విన్నవారికిని ద్రవిడ భాషయందు అభివందనము లొనర్చి సభాకార్యములను ముగించిరి.

తదనంతరము దివ్యజ్ఞానసభకు చేరని పండితులొకరు ఈయుపన్యాసములన్నిటిని శ్లాఘించి అప్పుడప్పుడు దివ్యజ్ఞానసభ వారు తమపురమునకు వచ్చి ఇట్టి జ్ఞానబోధకమైన ఉపన్యా సములిచ్చి జనులందరి బుద్ధులు వికసింపజేయవలెనని మిగులశ్రద్ధ తో ప్రార్థించిరి.

దేశభాషలో అచ్చటచ్చట సభలుచేర్చి ఉపన్యాసములి చ్చుటచే ననేకులకు ఉపయోగముగ నుండునని మా యభి ప్రాయము.

-:0:-

# ప్రసన్నత్వము.

పరమేశ్వర, పరమగురు, కటాక్షప్రకాశములకు ముఖ్య ద్వారములెవ్వియో విచారింపఁబడును.

జగదీశ్వరుని కటాక్ష ప్రకాశములు మహాపురుషులును, మహాత్ములనగు పరమగురువు లందునిండి, వారినుండి శిష్య వర్గమునకువచ్చి, ఆశిష్యవర్గముద్వారా జగత్తంతయు వ్యాపించు నని పెద్దలుచెప్పుదురు. అనగా ఈశ్వర వైభవ ప్రకాశమునకు మహాపురుషులును వారిశిష్యులును ముఖములు, ద్వారములు. అట్టి వైభవమునకు ద్వారములుగా నేర్పడుటకు ముఖ్యసాధన లేవైనది శ్రీయుత, శాంత, జీనరాజదాసుగారు ఒకచిన్న పుస్త కములో నింగ్లీషుభాషయందు వ్రాసినారు. దానిసారాంశము దివ్యజ్ఞానదీపిక వాచకులకు తెలియుట విశేషప్రయోజన కారి గానుండునని తలంచి వ్రాయబూనితిని.

అవేవన:—

1. Bright Looks:—ప్రసన్న వీక్షణములు.
2. Brave Words:—ఉత్సాహ వాక్కులు.
3. Joyous Thoughts:—ఆనందసంకల్పములు.
4. Knightly Deeds:—మహత్కార్యములు.

కన్నులు, వాక్కు, మనసు, దేహము(చేతులు) ఈ నాలుగు ఇంద్రియములును పరిశుద్ధముగానుండవలెనని అభిప్రాయము.

ఇదే అంశమే ధర్మరాజుకు ధౌమ్యమహాముని ఉపదేశించినట్లు మహాభారతారణ్య పర్వమందుదాహరించబడినది.

శ్లో॥ చక్షుర్దద్యాన్మనోదద్యా
ద్వాచందద్యాత్సుభాషితామ్
ఉద్ధాయచాసనందద్యా
దేషధర్మస్సనాతనః॥

ప్రసన్న వదనుఁడైచూచుట, మంచిమనస్సుతో తలంచుట, ప్రియ వాక్యములు పలుకుట, ఇంటికివచ్చినవానికి లేచిగౌరముతో ఆసనమిచ్చుట, శాశ్వతధర్మములని తాత్పర్యము.

ఇవ్విధంబున ఆచరించు స్వభావముగలవారు మహాపురుషులను మహానదులకు పెద్దకాలువలుగా నుందురు. మహాప్రవాహములుగల గొప్పనదుల నీళ్లు విశాలములై లోతుగల పెద్దకాల్వలును చిన్నకాల్వలును లేనియెడలనెట్లు అందరికి పలువిధముల ఉపయోగపడదో అట్లనే మహాపురుషుల అనుగ్రహాశక్తి పైనుదాహరించిన ఆచారములు ఆచరించుస్వభావము పట్టుపడిన శిష్యులులేనిచో ఉపయోగపడదు.

అట్టిమహాపురుషుల అనుగ్రహ ప్రవాహమును సర్వప్రదేశముల వ్యాపింపజేయుటకు తగినకాల్వలుగా నేర్పడు భాగ్యము పొందుటకు దృఢప్రయత్నముచేయుట కంటె నుత్తమకార్యముగాని ధర్మముగాని వేరులేదని బుద్ధిమంతులందరు అంగీకరించుదురు. కాబట్టి ఈసదాచారము లెట్లు సంపాదించవలయునో విచారింతము.

మొదటిది ప్రసన్నవీక్షణములు.

ప్రసన్న వదనములేనివారికి ప్రసన్న వీక్షణములుండవు. గనుక ప్రప్రథమమున ప్రసన్నవదనుడు కావలయును.

ప్రసన్నవదనుడెవడు.

శ్లో॥ శుక్లాంబరధరంవిష్ణుం శశివర్ణంచతుర్భుజం
ప్రసన్నవదనంధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే॥

జగదీశ్వరుడగు విష్ణువు సర్వదా ప్రసన్న వదనుడైయుండును.

మహాదేవుడగు దక్షిణామూర్తియు ప్రసన్నవదనుడై సర్వదా చిరునవ్వుతో ప్రకాశించుచుండును.

శ్లో॥ మందస్మితంస్ఫురితముగ్ధముఖారవిందం

కందర్పకోటిశతసుందరదివ్యమూర్తిం
ఆతామ్రసుకోమలజటాఘటితేందురేఖ
మాలోకయేవటతటీనిలయందయాళుం॥

పరమేశ్వరుని భిన్నస్వరూపులగు విష్ణువును మహాదేవుడును ప్రసన్నవదనులని ఎరింగి, పెద్దకాల్వలు మహానదుల ప్రవాహోదకమును ఎట్లుగ్రహించి సర్వదేశముల వ్యాపింపజేసి సర్వభూతములను సంతోషపరచునో ఆరీతిని మహాపురుషులగు పరమగురులు ఈశ్వరస్వభావమైన ప్రసన్నవదనత్వము తాము ను పొంది ఆగుణమందరికిని కలుగఁజేసి ఆనందమగ్నులుగా చేయుదురు.

మహాగురువులను ప్రసన్నవదనులని స్తుతించుచున్నారు.

శ్లో॥ ప్రాంతశ్శిరసిశుక్లాబ్జే ద్వినేత్రంద్విభుజుంగురుం
ప్రసన్నవదనంశాంతం స్మరేత్తన్నామపూర్వకం॥

ఈశ్వరుడును, మహాపురుషులును ప్రసన్నవదనులని పై ప్రమాణములచే విశదమగుచున్నది. ప్రసన్నవదనులే ప్రసన్నవీక్షణములుగలవారుగా నుందురని ఇంతకుముందు చెప్పబడినది. ఈశ్వరవైభవము ప్రసన్నవీక్షణములద్వారా ప్రకాశించుచుండును గనుక ప్రసన్నవీక్షణములు ఈశ్వరానుగ్రహశక్తికిని ఆ శక్తిని పొందిన మహాపురుషుల అనుగ్రహశక్తికిని ద్వారములగును.

ప్రసన్నవదనత్వమును పొందుటకు భంగములేవైనవియు తెలిసి ఆభంగములను పూర్తిగ నాశమొనరించువరకు మనుజుఁడు దానిని పొందజాలడు.

అట్టిభంగములేవి?

దుఃఖయుక్తులును, చింతాక్రాంతులును ఎప్పటికిగాని ప్రసన్నముఖులైయుండరు. వీరు దుఃఖబాధచే ఖిన్నులై వాడిన ముఖముగలవారైయుందురు. ఈకారణముచే దుఃఖము

లకు మూలమైనది కనుగొని దానిని తెగటార్చి ప్రసన్న ముఖుడు కావలెను.

జగత్తునందంతయు రెండు విధములైన దుఃఖములుగలవు. దేహసంబంధమైన దుఃఖమొకటి, మనస్సంబంధమైన దుఃఖమొకటి. ఈ రెండు దుఃఖములలో ఒకొ్కకటియు రెండు భాగములై మొత్తమునకు నాలుగువిధముల అందరిని బాధపెట్టుచు ఖిన్నులుగా చేయుచుండును. దానినుపశమింపజేయు ఉపాయము విస్తారముగాను సంక్షేపముగాను చెప్పెదవినుమని శౌనకుడను బ్రాహ్మణుడు యుధిష్ఠిరునకు చెప్పినట్లు ఈక్రింది శ్లోకములు తెలుపుచున్నవి.

శ్లో॥ మనో దేహసముత్థాభ్యాం దుఃఖాభ్యామర్దితం జగత్
తయోర్వ్యాససమాసాభ్యాం శమోపాయమిమం శృణు॥
భారతము, ఆరణ్యపర్వము, అధ్యాయము ౨.
శ్లో॥ వ్యాధేరనిష్టసంస్పర్శాచ్ఛ్రమాదిష్టవివర్జనాత్
దుఃఖంచతుర్భిశ్శారీరం కారణైస్సంప్రవర్తతే
తదాతత్ప్రతికారాచ్చసతతం వావిచింతనాత్॥

వ్యాధి, ఇష్టములేనివిషయము ప్రాప్తించుట, దేహశ్రమ, ఇష్టమైన పదార్థము వదలిపోవుట ఈనాల్గువిధములు శరీరము కలవారిని బాధపెట్టుచుండును.

వీనినిపోగొట్టు ఉపాయము సర్వదావిచారించుచుండవలెను. వీటిలో వ్యాధి, శ్రమ, దేహసంబంధమైనవియు, అనిష్టప్రాప్తి ఇష్టవివర్జనము మనస్సంబంధమైన దుఃఖములనియు తెలియవలెను.

వీనినిపోగొట్టు మార్గములేవనిన.

శ్లో॥ ఆధివ్యాధిప్రశమనంక్రియాయోగద్వయేనచ
మతిమంతోహ్యతోవైద్యాః శమంప్రాగేవకుర్వతే॥

వ్యాధిసంబంధమైన దుఃఖమును, మనస్సంబంధమైన దుః

ఖమును చికిత్సచేతను, యోగముచేతను క్రమముగ నుపశమింప చేయవలెను. బుద్ధిమంతులైన వైద్యులు మొదట మనస్సంబంధమైన దుఃఖమును నివారణచేయుదురు.

ఎందుకన.

శ్లో॥ మానసేనహిదుఃఖేన శరీరముపతప్యతే
అయఃపిండేనతప్తేన కుంభసంస్థమివోదకం
మానసంశమయేత్తస్మాత్ జ్ఞానేనాగ్నిమివాంబునా॥

కుండలోనుండిన నీళ్లు కాలిన ఇనుముచే నెట్లు కాలుచున్నదో అట్లనే మనోవ్యాధిచే శరీరము తపించుచున్నది గనుక నీళ్లతో అగ్నిని చల్లార్చినట్లు జ్ఞానముచేత మనోదుఃఖమును చల్లార్చవలెనని భారతము వనపర్వము రెండవ అధ్యాయమందు చెప్పబడినది.

జనన మరణ ప్రవాహముగల సంసారములో ఆలు పిల్లలు, తల్లి, తండ్రి, అన్నదమ్ములు, మొదలగు బంధువులతోను, అనేక ప్రీతిగల విషయములతోను చుట్టబడియుండు వాడెట్లు ప్రసన్నవదనుడైయుండవచ్చును? దుఃఖకారణములగు వ్యాధియు, ఆధియు, ఇష్టమైనవారు పోవుట, అనారోగ్యము, సంభవించుచునే ఉండును. ఇవి ప్రాప్తమైనపుడు ప్రసన్నవదనుడై యుండుట అసాధ్యమని కొందరు చెప్పెదరు. ఎవరేమిచెప్పినను ప్రసన్నవదను డగువరకు ఈశ్వర, మహాపురుషుల ప్రకాశమునకు ద్వారముగా నుండుట సంభవించదు.

పైచెప్పబడిన దుఃఖకారణములు మనుష్యులకు సంభవించిన కాలమందేమాత్రము బాధపడక ప్రసన్నవదనులై యుండవచ్చునని నేను చూచిన రెండుదృష్టాంతములచే నిశ్చయముగ చెప్పుచున్నాను.

మహాయోగినియగు మ్యాడంబ్లావట్సుకీగారు అడియారులోనుండినపుడు నేను అచ్చటనుంటిని. వారికి ఒకసమయ

మందు అధికముగ జ్వరమువచ్చియుండెను. సమీపముననున్న వారిశిష్యులు ఉపచారముచేయుచుండిరి. అప్పుడొకరు వేదాంతరహస్యమును గురించి ఒక ప్రశ్న ఆయమ్మగారి నడిగిరి. సమీపమందుండువారు, ఆమెజ్వరముతో బాధపడుచుండునపుడు ప్రశ్న లడుగుట సరి కాదు, తలనొప్పి అధికమగును గనుక, అడుగవద్దనిచెప్పిరి. అందుకు ఆయమ్మగారు నాకు బాధలేదు. నాదేహము బాధపడుచున్నది. ఎన్ని ప్రశ్నలైనను అడుగ వచ్చునని సెలవిచ్చిరి.

నాస్నేహితులలో నొకనికి వాడిగల ఇనుపరేకుమీద యెత్తు తెలియక కాలుపెట్టినందున కాలివేళ్లు మూడు తెగి చర్మము మాత్రము కరచుకొనియుండెను. అప్పుడు ఆయన మిరపపండ్లను నూరి ఆగాయమునకు కట్టి నెమ్మదిగ ఏమాత్రము బాధలేనివానివలె చదువుచు కూర్చునియుండెను. ఆయనను "ఏమిది మిరపపండ్లు గాయమునకు కట్టియుండినను ఏబాధయు లేనివానివలె నెమ్మదిగ చదువుచున్నావే" అని అడుగగా ఆయను ఆకాలు నాదికాదనుకొన్నానని బదులుచెప్పెను. ఇట్లు దేహము, తానుకాదని వేరుపరచు సమర్థత కలవారును అట్లు దృఢముగా భావించువారును దేహము బాధపడుచుండినను ప్రసన్నవదనులై యుందురు. ఈశ్వర మహాపురుషుల ప్రకాశమునకు ద్వారములు కావలెనను వారందరు సమయము తటస్థించినప్పుడంతయు ఇట్లుభావించుచు ప్రసన్నవదనత్వమును విడువకుండవలెను.

ఎవరు ఎన్నివిషయముల మధ్యముననుండి సమస్తమైన కుటుంబముతో దేహయాత్ర నడుపుచుండినను దేహ మనోదుఃఖములనుండి బాధపడక వానినే సుఖకారణములుగా భావించు ఉపాయము శ్రీకృష్ణులు రుక్మిణీదేవి కుపదేశించినట్లు నారదసూత్రములందు చెప్పబడినది.

శ్లో॥ సుఖమూలంహిసంసారో దుఃఖమూలంతదుచ్యతె

మనుత్వేమఃఖమూలైవం తద్భిన్నేసుఖమూలకః
అహమీశోహిసర్వేషాం వస్తుసంస్థాపకస్సదా
యత్రావశ్యంభవేద్యస్య తత్రసంస్థాప్య తేహితత్
పుత్రోమిత్రస్తథాబంధుః సఖాభ్రాతాపితా స్మృతాః
నకస్యచిత్ మరణంలోకె సంస్థానస్యైవ భేదతా
సర్వపుత్రోమమేవాస్తి సర్వదామరణంభవేత్
నశోకోబాధ్యతేకించి న్మమత్వస్యపినాశనాత్ ॥

జనన మరణ ప్రవాహారూపకమగు సంసారము, దుఃఖము నకును సుఖమునకును రెంటికిని కారణముగా నుండును. మను ష్యులు ఎందాక మమత్వము అనగా నాది అనెడు భావముతో కూడినవారై ప్రతిజన్మమందును కర్మానుసారము ప్రాప్తమైన పుత్ర మిత్ర కళత్రాదులతో వ్యవహారములునడుపుచుందురో అం దాక సంసారము దుఃఖమునకు కారణముగా నుండును. ఎప్పుడు ఈసంసారము జగదీశ్వరుడు బ్రహ్మాండమను పాఠశాలలో పుత్ర మిత్ర కళత్రాదులనెడి పుస్తకముల పాఠము తెలియుటకుగాను నియమించిన చిత్రమని తెలిసి మమత్వములేక అనగా ఇవన్నియు నావియనెడి భావములుడిగి వర్తించునో అప్పుడు సుఖమునకు కారణముగా నుండును. నేను (శ్రీకృష్ణుడు) అందరికి నీశ్వరు డను, ఎక్కడెక్కడ ఏది అవశ్యమో అక్కడక్కడ దానిని స్థాపించుచున్నాను. పుత్రులు, మిత్రులు, బంధువులు, సఖు లు, అన్నదమ్ములు, తల్లులు, తండ్రులు వీరిలో నెవరికిగాని లోక మందు చావులేదు. స్థానభేదముగాని వేరుకాదు, అనగా బ్రహ్మాండమను గొప్ప పాఠశాలలో భూలోక, భువర్లోక, సువ ర్లోకములు, ఈమూడు తరగతులుగా నేర్పడియున్నవి. భూలో కమందు ఒక దేహమెత్తినపుడు ఆదేహముతో నేర్వవలసినదం తయు నేర్చినతరువాత ఆదేహము విడిచి, భువర్లోక తరగతికి వెళ్లి ఆలోక దేహముతో నేర్వదగినదంతయు ఆతరగతిలో నేర్చి

ఆ దేహమును విడిచిన వెనుక, సువర్లోక దేహమునుపొంది ఆతరగతి లో నేర్వవలసినదంతయు నేర్చిన వెనుక, మరియు భూలోకమున కు వేరు దేహముతో వచ్చి, ఇంకను నేర్వవలసినదంతయు నేర్చి మునుపటిరీతనే సంచరించును. ఇట్లుమూడులోకములలో పూర్తిగ నేర్వవలసినదంతయు నేర్చువరకు మాటిమాటికి తిరుగుటేతప్ప వేరు కాదని ఇవ్విధమున జనన మరణములను భావించినవారికి, చావువలన దుఃఖమెన్నటికిని ఉండజాలదు. తల్లితండ్రులకుగాని, పిల్లలకుగాని పాఠశాలలో ఒకతరగతినుండి ఇంకొక తరగతికి మార్చినపుడు దుఃఖముకలుగక సంతోషమెట్లు కలుగునో అట్లనే పుట్టు, చావులవలన సంతోషమే తోచుచుండును. జగత్తు లోనుండు సర్వులును నాపిల్లలే. సర్వదా దినదినమును ఎందరో మృతినొందుచున్నారు అట్లుండియు నాకు మమత్వము లేనం దున ఏదుఃఖమును నన్ను బాధించదని శ్రీకృష్ణులు రుక్మిణీదేవి కుపదేశించిరి.

శ్రీకృష్ణు లిట్టిభావన కలవారుగనుక వారెప్పటికిని ప్రస న్నవదనులుగా నున్నారు. జగదీశ్వరులైన శ్రీకృష్ణుల ప్రసన్న ప్రకాశము మనద్వారా ప్రకాశించవలసియుంటే ఇట్టి జ్ఞానము చేత దేహమునోదుఃఖములను నివారించి వెలుగవలెను.

ప్రసన్నవీక్షణములకు వైరియైన ఇంకొక పిశాచము అంద రియందు నిండియున్నది. అదేమన కోపము. కోపమున్న వానికి ప్రసన్నవదన మెక్కడిది? దీనిని నాశముచేయవలెను. ఇది శాంతముచేతతప్ప మరిదేనిచేతను నాశము కాదు. గనుక విష్ణువును, మహాదేవుడును, సద్గురువులగు మహాపురుషులును, శాంతమూర్తులై ప్రకాశించుచుందురు. విష్ణువును "శాంతాకా రం భుజగశయన"మనియు, మహాదేవుని "శాంతం పద్మాసనస్థ" మనియు, మహాగురువులను, "ప్రసన్నవదనం, శాంత" మనియు స్తుతించుదురు. వారి ప్రకాశమునకు ద్వారముగానుండు వారు

సంయితము కోపమునువదలి శాంతమును పొందియుండవలెను.

దీనిని పోగొట్టుటకు ఒకయుపాయమున్నది. అదేదన కోపమునకు స్థానమివ్వకుండుట. కోపము ఉదయించుటకు ప్రారంభించగానే నవ్వుటకు మొదలిడవలెను. కోపాక్రాంతుడైనపుడు కనుబొమలు ముడిపడును, పెదవులు పండ్లుకొరుకొను, ముఖము కన్నులు ఎఱ్ఱనగును. కోపము అగ్ని కాల్చినట్లు మనుష్యుని కాల్చుచున్నది గనుక అగ్నిసంపర్కముతో కాలువస్తువులు ఎఱ్ఱనైనట్లు ముఖమును ఎర్రనగును. కనుక, కోపముత్పత్తియైనతోడనే, నవ్వురాకున్నను నవ్వుట కుపక్రమించినచో కోపము అణగును. దానికి నిలువ నవకాశము లేకుండుటచే వదలిపోవును. ఇట్లు అభ్యసించి దానిని రానివ్వకుండ చేయవలెను. ఇట్లుచేసి పరీక్షించిన దీనిసత్యము తెలియును.

ప్రసన్నవీక్షణములకు భయము, అసూయత మొదలగునవికూడ వైరులు. వీటిని ఆత్మజ్ఞానముతో నశింపజేయవలయు. సర్వము తాననెడి నిశ్చయజ్ఞానము కలిగినపుడు భయము నాశమగును. జగత్తంతయు ఒకటేవస్తువని తెలిసినవెనుక భయమెక్కడిది? "ద్వితీయాద్వైభయంభవతి" అని బృహదారణ్యకమునందు చెప్పబడినది. రెండవవస్తువే లేనపుడు దేనినిగురించి భయము కలుగును?

ప్రసన్నవీక్షణములు గలవాడే సమస్తులకు మేలుచేయగలడు. భయముగలవాడు ఇంకొకరి భయమునెట్లు నివారణచేయగలడు. ఈవీక్షణములను పొందుట అందరిని తనవలె చేయుటకేగాని తానుమాత్రము ఈప్రకాశముతో వెలుగవలెనని కాదు.

ఉత్సాహవాక్యములను గురించి దీనికావలి సంచికయందు వ్రాయబడును.

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

———:౦:———

## పాండవగీతలు.

మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే । మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏషఏవ ॥ త్వద్భృత్యభృత్య పరిచారక భృత్యభృత్య । భృత్యస్య భృత్య ఇతిమాం స్మరలోకనాథ॥

గోవింద కేశవ జనార్దన వాసుదేవ। విశ్వేశ విశ్వమధుసూదన విశ్వనాథ । శ్రీపద్మనాభ పురుషోత్తమ పుష్కరాక్ష నారాయణాఽచ్యుతనృసింహ నమోనమస్తే॥

నాన్యంవదామి నశృణోమి నచింతయామి । నాన్యం స్మరామి నభజామి నచాశ్రయామి ॥ భక్త్యాత్వదీయ చరణాంబుజ మంతరేణ। శ్రీశ్రీనివాస పురుషోత్తమ దేహిదాస్యమ్॥

నమోనమః కారణ వామనాయ । నారాయణా యామితవిక్రమాయ। శ్రీశార్ఙ్గ చక్రాబ్జ గదాధరాయ, నమోస్తు తస్మై పురుషోత్తమాయ॥

త్వమేవమాతాచ పితాత్వమేవ త్వమేవబంధుశ్చ సఖాత్వమేవ॥ త్వమేవవిద్యా ద్రవిణంత్వమేవ। త్వమేవసర్వం మమ దేవదేవ॥

యజ్ఞేశాచ్యుత గోవింద మాధవా నంతకేశవ। కృష్ణ విష్ణో హృషీకేశ వాసుదేవ నమోస్తుతే॥

నమఃకృష్ణాయ దేవాయ బ్రహ్మణేనంతమూర్తయే। యోగీశ్వరాయ యోగాయత్వామహం శరణంగతః॥

కృష్ణాయవాసుదేవాయ దేవకీనందనాయచ। నందగోపకుమారాయ గోవిందాయనమోనమః॥

నమః పరమకల్యాణనమస్తే విశ్వభావనా వాసుదేవాయ శాంతాయ యదూనాంపతయేనమః॥

నమోబ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయచ। జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః॥

# బ్రహ్మసూత్రసారము.

## 1. అద్వైత సిద్ధాంతము.

శ్రీ శంకరాచార్యుల యద్వైతమతములో నిర్విశేష చిన్మాత్ర మగు బ్రహ్మమేపరమార్థతత్త్వము. దానికి భిన్నమగు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయనుగు (త్రిపుటి) ప్రపంచము ఆ బ్రహ్మమునందుఁ గల్పింపఁబడి మిథ్యాభూతమై యున్నది. జ్ఞాతలిద్దఱు; ఈశ్వరుఁడు, జీవుఁడు; అజ్ఞానములోని శుద్ధ సత్త్వాంశముచే నావరింపఁబడినజ్ఞాతకు నీశ్వరుఁ డనియు, సగుణబ్రహ్మ మనియుఁ బేర్లు. రజస్తమములతో మలినమయిన సత్త్వముచే నావరింపఁబడిన జ్ఞాత జీవుఁడు. అంతఃకరణవృత్తి జ్ఞానము. శబ్దస్పర్శాదులు, ఆకాశాదులు, జ్ఞేయము. మిథ్య యనఁగఁగనులకుఁ గనఁబడుచుండి బ్రహ్మముకంటె వేఱవునా కాదా యని నిరూపించుటకు వీలులేనిది. దేవతిర్యఙ్మనుష్యాది చరాచరప్రపంచము బ్రహ్మమం దవిద్యచేఁ గల్పింపఁబడినది. అది బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే నివర్తించును గాన మిథ్య యనఁబడును.

అవిద్య బ్రహ్మస్వరూపమును గప్పివేసి యనేక వివిధవిచిత్రపదార్థములను స్ఫురింపఁజేయును. దానినే అజ్ఞానమనియు, మాయ యనియు, అవ్యాకృత మనియు, అవ్యక్త మనియు, వాడుదురు. ఈమాయ యనిర్వచనీయము. అనఁగా బ్రహ్మముకంటె వేఱని కాని వేఱుకాదని కాని చెప్పుటకు శక్యముకాని యొక భావరూపమగు పదార్థము. ఇది యీశ్వరాధీన మనియు, బ్రహ్మజ్ఞానముచే నశించు ననియు, నద్వైతులు చెప్పుదురు. ఇది ప్రధానమనియు, మూల ప్రకృతి, ప్రకృతి, స్వతంత్రము, సత్త్వరజస్తమోగుణముల సామ్యావస్థ, యని సాంఖ్యాదులందురు. ఇది త్రిగుణాత్మక మనియు, దీనివలన గుణములు పుట్టుననియు, వేదాంతు లొప్పు

కొనుమదు. ఇది వంధ్యాపుత్రునివలె నభావరూపము తుచ్ఛముగాదు. ఇది యర్థక్రియాకారి. ఇదియవ్యక్తమయినను దీని కార్యములు వ్యక్తములు. దీని కాదిలేకున్నను, నిది బ్రహ్మజ్ఞానముచేనశించును గాన నంతముగలది. ఇట్టి బ్రహ్మజ్ఞానము నిత్యనిర్దోషములగు వేదాంతవాక్యముల వలనను, వాని ననుసరించిన పురాణేతిహాసాదులవలనను, గురూపదేశమువలనను గలుగును.

నిత్యనైమిత్తికాది లౌకికాలౌకిక కర్మములు, ఫలముంగోరక భగవదర్పణ పురస్సరముగఁ జేయఁబడినచో నవి చిత్తమలమును నివారించుటచే జ్ఞానోత్పత్తికి సాధనములగును. శమాది మైత్ర్యాది సహిత సగుణోపాసనాదులు, శ్రవణాదులు, చిత్తమున కేకాగ్రతను గలిగించును. సగుణబ్రహ్మ సాక్షాత్కారమునకును, నిర్గుణ బ్రహ్మ జ్ఞానోత్పత్తికిని, సాధనములగును. భగవద్గీతాదులలో వీని నే కర్మయోగ, భక్తియోగ, జ్ఞానయోగములందురు. ఈమూఁడు మార్గములును గడపటిభాగమున నొకటియే యగును. ప్రతిభాగమునను బర్యవసానమున నీమార్గములలో నొండొంటికి భేదమించుకంతయుఁ గానరాదు. కర్మయోగి భక్తిచేఁ బరిపూర్ణుఁడై భగవదర్పణ ఫలపరిత్యాగములచే, నహంకారమును నశింపఁజేయుటచేఁ బరిపూర్ణజ్ఞానియగు. అటులె జ్ఞానియు, భక్తుఁడును, గడపటఁ దత్సమ లక్షణములు గలవారలగుదురు. భక్తిపరిపూర్ణ మగునప్పుడు భక్తుని హృదయమందు జ్ఞానము తనంతటఁ దాను బ్రకాశించును. జ్ఞానికి భగవత్సాక్షాత్కారముకాఁగా, హృదయమందు భక్తి వికసింపక తీఱదు. ప్రతిమార్గమందును జీవుఁడు కొంతవఱకుఁ బరిపక్వ స్థితినొంద మహాగురువుల సాయమున కవశ్యమగు కాలము రాఁగా గురువు ప్రత్యక్షమై మార్గదర్శియై భక్తుని శిష్యునిఁగఁ బరిగ్రహించును. ఇట్లుచిత్తము శుద్ధమై యేకాగ్రతకలిగి నిర్గుణజ్ఞానమునకు యోగ్యతకలిగిన మీఁ

ద సద్గురువుచే నుపదేశింపఁబడిన వేదాంతవాక్యములచే సచ్చిదానంద రూపమై, సకలభేదశూన్యమై, యఖండమైన, చిన్మాత్ర బ్రహ్మస్వరూపము, నే ననుజ్ఞానము, శిష్యునకుఁ గల్గును. ఇది సర్వావిద్యా నివర్తకము.

వేదాంత వాక్యములవలనఁ గల్గు జ్ఞానమునకు శ్రవణ, మనన, నిధిధ్యాసములు గడు నంతరంగ సాధనములై యుండు. వీనివలన బరోక్షాపరోక్ష జ్ఞానములుక్రమముగఁ గల్గును. గురూపదిష్ట పరోక్ష జ్ఞానమువలన బుద్ధి పూర్వకృత పాపములు నశించుటయే కాక బ్రహ్మము నేను కాదను నజ్ఞానావరణము గూడ నశించును. గురూపదిష్టమగు నపరోక్షజ్ఞానమువలన భేదప్రపంచ స్ఫురణమునకు హేతువగు మూలాజ్ఞానము నశించుటయే కాక, నిర్గుణ బ్రహ్మ స్వరూపము నేనను ననుభవముకూడ శాశ్వతముగఁ గలుగును.

మఱియు సచ్చిదానంద రూపమగు పరబ్రహ్మము సకల పదార్థములందుఁ బ్రత్యక్షముగ భాసిల్లును. "కలదు" అను సత్తయుఁ, "దెలియఁబడుచున్నదను" జ్ఞానమును, "ప్రియము లేక అనుకూలమను" నానందమును, బ్రతిపదార్థమునందును బ్రత్యక్షముగా జ్ఞానికిఁ గాన్పించుచున్నను, అవిద్యా ప్రాచుర్యమైనందున, నజ్ఞానులకుఁ దెలియఁబడకయున్నవి. విచారజన్య జ్ఞానముచేఁగాని ధ్యానజనితజ్ఞానముచేఁగాని యవిద్యాంశమును దొలగించి చూచినచోఁ బ్రతిపదార్థము సచ్చిదానంద రూపముగ భాసిల్లును. అవిద్యాంశము జ్ఞానముచే నశింపఁగా బ్రహ్మము స్వయముగఁ బ్రకాశించును గానఁ దానే యనుభవగతమగును. అవిద్యామలచేఁ గప్పఁబడిన బ్రహ్మమే జీవుఁడు. అవినశింపఁగ జీవత్వము పోయి బ్రహ్మమని తెలియును. ఇదియె మోక్షస్వరూపము.

అవిద్యయను చీఁకటిచే గుడ్డివానివలెఁ గన్నుగానక

కార్యకరణ సమూహమగు దేహముకంటె దాను వేఱను వివే కము లేక జీవుడు సంసారమందుఁ గర్త యనియు భోక్త యనియుఁ దలచుచుఁ గర్త్రాద్యభిమానియై నట్టియు సర్వభూతముల కాధార మైనట్టియు సర్వ ప్రపంచమునకు సాక్షియై నట్టియుఁ జేతన స్వరూపుఁడైన యీశ్వరుని యాజ్ఞవలన వ్యవహరించుచున్నాఁ డు. ఆపరమేశ్వరునికి నాదరముతోను దీర్ఘ కాలము ప్రతిదిన ము ధ్యానాదులు కావించినచో నాపరమేశ్వరున కనుగ్రహ మువచ్చి యొకానొక పుణ్య జీవునకుఁ గంటికిఁ గానరాకపోయి న వెంటనే చూచెడు శక్తి వచ్చినట్లు జీవప్రయత్నానుగుణ ముగఁ గ్రమముక్తిని గల్గించును గాన జీవుని బంధమోక్షముల కీశ్వరుఁడే కారణము.

వ్యవహారదశయందు ఫలాపేక్షతోఁ జేయఁబడిన సర్వ కర్మములు ఫలములిచ్చును. నిష్కామమై ఈశ్వరార్పణబుద్ధితోఁ జేసినకర్మములు చిత్తశుద్ధిని గలిగించును. సగుణబ్రహ్మోపాస నము బ్రహ్మలోకమును బొందించి క్రమముగ ముక్తికి సాధనమ గును. నిర్గుణబ్రహ్మ జ్ఞానము పరమముక్తికి సాక్షాత్సాధన మగును.

భక్తి జ్ఞానమునకు ముఖ్యసాధనము. భక్తి యనఁగా నీశ్వ రునియందు పరమప్రీతి. దానిలో సాధ్యమనియు సాధనమనియు రెండు భేదములుగలవు. భగవంతునియందుఁ బ్రీతిగల్గుటకు నాచ రింపఁబడు భగవత్కథాశ్రవణ కీర్తన స్మరణాదులగు సప్తసాధ నములు సాధనభక్తి యనఁబడును. తుదనున్న సఖ్యమును ఆత్మసమర్పణమును సాధనసాధ్యభక్తి యనుచురు. భగవత్స్వ రూపమును విడువలేనిప్రేమ సాధ్యభక్తి. సాధనరూపమగు భక్తి సాధ్యభక్తికిఁ, దత్త్వజ్ఞానమునకు, నితర విషయములందలి తీవ్రవిర క్తికి, నంతరంగసాధనము. సాధ్య భక్తిని నిర్గుణ జ్ఞానమని కపి లుఁడు దేవహూతికిఁ జెప్పెను. సాధ్యభక్తిలో రహస్యమేమన

ఉపాస్యోపాసకులకు నేమాత్రము భేదములేదను స్మృతిసంతాన
ము. దీనినే యనన్యభక్తియని భగవద్గీతలలో చెప్పఁబడియు
న్నది. దీనిపేరు జ్ఞాన లక్షణమని (జ్ఞానమను నిర్వచనముగ
లది) శంకరులును, జ్ఞానాఖ్యమని (జ్ఞానమను పేరుగలది) ఆనంద
గిరులును వాఁసిరి. ఆవృత్త్యధి కరణమందు భక్తియను నుపాస
నాశబ్దమును జ్ఞానమను వేదశబ్దమును బర్యాయపదములుగా శ్రుతి
లోనున్నట్లు శంకరులు వ్రాసిరి.

నిర్గుణోపాసనమునకును నిర్గుణజ్ఞానమునకును భేదములేన
ట్లు భగవద్గీతాభాష్యమువలన నగపడుచున్నది. స్థితప్రజ్ఞుఁడు,
భగవద్భక్తుఁడు, గుణాతీతుఁడు, జీవన్ముక్తుఁడు, బ్రాహ్మణుఁడు,
అత్యాశ్రమీ, ఇవి సమానార్థకములనిశంకర విద్యారణ్యులతలం
పు. భక్తి జ్ఞానముల స్వరూపము, విరాగము, విచారము, శౌచ
ము, ఇంద్రియనిగ్రహము దేవునియందుపరమప్రీతియైనట్లు గీతల
లోని 2-12-14వ యధ్యాయములవలన స్పష్టమగునని యద్వైతా
చార్యులలోఁ గొందఱి యభిప్రాయము. జ్ఞానమువలన ముక్తి
గలిగినను భక్తికి ముక్తి యానుషంగికము. భక్తియే ముఖ్య
ఫలమని వారి తలంపు. కర్మయోగ నిష్ఠయొక్క పరమరహ
స్యము ఈశ్వరశరణతా రూపమగు భక్తి యనియు (దీనినే విశి
ష్టాద్వైతులు శరణాగతియనియు ప్రపత్తియనియు ననుదురు)
దానివలన మోక్షము తప్పకకలుగుననియు శంకరాచార్యులు
గీతాభాష్యములో 18 అ. 65 66 శ్లోకవ్యాఖ్యలలో వ్రాసిరి.
దీనిని శ్రీకృష్ణమిశ్రరచిత ప్రబోధచంద్రోదయములోని భరత
వాక్యమిట్లనుసరించుచున్నది:—

సంసారాపారసింధుప్లవకుశల మహాకర్ణధారే మురారౌ
భక్తిర్యుక్తేః పరాసా ప్రసరతుజననీ సార్వకాలంజనస్య॥

శ్రీశాంకరభాష్యములను దఱచిచూఁడ గర్మభక్తిజ్ఞాన
యోగములు మూఁడు నొండొరులకు సహకారులనియు, నా

మూఁడు పరిపాకమును బొందినఁగాని మోక్షము కలుగదనియు వానిపరిపాకావస్థకు నుపాసకుల వాసనలననుసరించి పేరు మాఱుననియు, లోతుగా విచారించినచో నది యామూటి యొక్క సంగమస్థానమనియుఁ దేలును.

## 2. విశిష్టాద్వైత సిద్ధాంతము.

శ్రీరామానుజాచార్యుల విశిష్టాద్వైతము సూక్ష్మముగాఁ జెప్పఁబడును. వీరికిఁ బ్రమాణములు అద్వైతులకువలె శ్రుతి స్మృతీతిహాస వైష్ణవ పురాణములే కాక, పాంచరాత్ర్యాద్యాగమములు, ద్రవిడప్రబంధములును ప్రమాణములై యుండు. అద్వైతులకు నన్ని పురాణములు గ్రాహ్యములు. విశిష్టాద్వైత మతములో, అచిత్తు, చిత్తు, ఈశ్వరుడు అనుమూడుతత్వములు గలవు. అచిత్తు శుద్ధసత్వమనియుఁ, బ్రకృతియనియుఁ, గాలమనియు, మూఁడువిధములు.

విశిష్టాద్వైత సిద్ధాంతము.

శుద్ధసత్వము భగవల్లోకమగు పరమపదమందు, శరీరేంద్రియ, గోపుర, మండపాదిరూపముగ భగవదిచ్ఛచేఁ బరిణమించును. శుద్ధ సత్వము జ్ఞానమునువృద్ధి బొందించును గాని దానికి నావరకముగాదు. ప్రకృతి, సత్వరజస్తమోగుణాత్మకమై సాంఖ్యులు చెప్పినప్రకారముగ మహదహంకారపంచతన్మాత్రాది రూపముగఁ బరిణమించి, బ్రహ్మాండోత్పత్తికిఁ గారణమై దేవతిర్యఙ్మనుష్యాది చరాచర దేహములుగఁ బరిణమించుచు, జీవులజ్ఞానమునకుఁ బ్రతిబంధమైయుండును. కాలము జన్మాది పరిణామములకు హేతువు.

చిత్తత్వము జీవుడు. జీవుల నేకులు. బద్ధులనియు, ముక్తులనియు, నిత్యముక్తులనియు, మూఁడు తెఱఁగులు. బద్ధులు మనవంటిసంసారులు. ముక్తులు కొంతకాలము సంసారమునందుండి, పిదప ముక్తినిఁ బొందిన శుకవామదేవాదులు. నిత్యముక్తులు

సంసారగంధము నెఱుఁగకయే భగవత్సన్నిధానమున నెల్లప్పుడు నుండు ననంత, గరుడ, విష్వక్సేనాదులు. జీవపరిమాణ మణువు. జీవుఁడు జ్ఞానస్వరూపకము.

జ్ఞానగుణకము ఈశ్వరుఁడొకఁడగు. నారాయణుఁడు, జ్ఞాన గుణకుఁడు, జ్ఞాన స్వరూపుఁడు, వ్యాపకుఁడు, గాని నిర్గుణుఁడుగాడు. హేయప్రత్యనీక సకల కల్యాణగుణ విశిష్టుఁడు, సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, దయాపూర్ణుఁడు, చిదచిత్పదార్థములలో వ్యాపించి వాని స్వరూప స్థితి ప్రవృత్తులను గలిగించుచు, స్వతంత్రుఁడై యుండును. ఈ చిదచిత్తులు వానికత్యంత విధేయములై వానియధీనమున స్వరూపస్థితి ప్రవృత్తులుగలవి గావున నీశ్వరునకు శరీరమని చెప్పబడును. ఇట్టి శరీరాత్మభావమును బట్టి సర్వము బ్రహ్మమని యభేదమును, స్వరూపమును బట్టి భేదమును, చెప్పబడుచున్నవి. చిదచిత్తులు సర్వావస్థలయందు నీశ్వరునిచే బాహ్యాభ్యంతరముల యందు వ్యాపింపజేయఁబడి తచ్ఛరీరములైయున్నందునను, మహాప్రళయమందు సూక్ష్మములుగనుండి సృష్టి కాలమునందు స్థూలములుగఁ జేయఁబడుచున్నందున నీశ్వరుఁడు చిదచిదాత్మకప్రపంచమునకుఁ గారణమని చెప్పబడుచున్నాఁడు. ఈశ్వరుడు చిదచిచ్ఛరీరకుఁడై ప్రపంచాకారమును బొందుచున్నందున నుపాదాన కారణమనియుఁ, బ్రపంచరూపముగా నేర్పడుదునని సంకల్పించినందున నిమిత్తకారణమనియుఁ జెప్పబడుచున్నాఁడు. ఈశ్వరుఁడు సర్వవ్యాపకుఁడై సర్వభూతముల హృదయములందుండి వానిని వానికార్యములను బ్రవర్తింపఁజేయఁగల శక్తిని గలుగఁజేయుచున్నందున నంతర్యామియనఁబడును.

ఈ యీశ్వరుఁడే లోకానుగ్రహార్థమై ప్రకృతిమండలము కంటె నావలనుండు పరమపదమందు వాసుదేవరూపమున దివ్యమంగళ విగ్రహోపేతుఁడై శ్రీ భూ నీళాది దేవీపరివృతుఁ

డై యనంత గరుడ విష్వక్సేనాది నిత్యముక్త భోగ్యుఁడై యుండును. ఇదియే పరరూప మనుదురు. ఈభగవంతుఁడు వాసుదేవ, ప్రద్యుమ్న అనిరుద్ధ సంకర్షణులను నాలుగు వ్యూహములు (సంస్థాన విశేషములు)గ నుండును. వాసుదేవవ్యూహము జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్య తేజములగు నాలుగుణములతోఁ బరిపూర్ణుఁడై ముక్త పురుషులకు ననుభావ్యుఁడుగ నున్నాఁడు. ప్రపంచసృష్టి నిమిత్తము ప్రద్యుమ్నవ్యూహము వీర్యైశ్వర్యములుకలిగి బ్రహ్మలోకమందుండి బ్రహ్మప్రజాపతులను సృష్టికర్మమునందు బ్రవర్తింపజేయుచుండును. అనిరుద్ధరూపము శక్తి తేజములుకలిగి శ్వేతద్వీపమందుండి లోకరక్షణాధికారులగు మనుప్రభృతులను నియమించుచు జగత్పాలనముఁజేయుచుఁ దత్త్వప్రాప్తిని గలుగఁజేయుచుండును. సంకర్షణసంస్థానము జ్ఞాన బలములు కలిగి పాతాళమందుండి లోకసంహారకులయిన రుద్ర యమ మృత్యుప్రభృతులను నియమించుచు మోక్షసాధనమగు జ్ఞానమును గలుగఁజేయుచుండును. దుష్టశిక్షణపూర్వకమైన శిష్టపరిపాలనముకొఱకును గొన్నిసమయములందు శ్రీరామకృష్ణాద్యవతారములను బరవాసుదేవుఁడే తాల్చును. వీనిపేళ్లువిభవములు. భక్తులగు వారు తమకభిమతమగు శాస్త్రసమ్మతమగు విష్ణువిగ్రహముల నేర్పఱచుకొని వానియందు భక్తిగలిగి పూజించునపుడా విగ్రహములందుఁ నావేశించియుండి తనభక్తుల కిష్టార్థముల నిచ్చుచుండును. ఇవియే విష్ణుదేవునికో వెలలలోనుండు నర్చావతారములు.

భగవద్భక్తులును సుజ్ఞానాధికులు నగు మహాపురుషులందావేశించి తనజ్ఞానాది గుణములను బ్రకటించి సంసారులగు జనులందుఁ గల కరుణచే జ్ఞాన భక్తి ప్రపత్తిలోనగు సాధనముల నుపదేశించి వారలను దుర్మార్గముల సంచరింపకుండఁ గృతార్థులఁ జేయునట్టి పరమేశ్వరుఁడే యాచా

ర్యావతారమని చెప్పఁబడును. ఈ యాచార్యావతారమే పర వ్యూహ విభవార్చావతారముల కంటె దయాదిగుణములచే నధికమైయుండును. వీనిసేవయే మోక్షదాయకమని సర్వశ్రుతి స్మృతీతిహాసపురాణ శైవ వైష్ణవ పాంచరాత్ర ద్యాగములలో నిరూపింపబడియున్నది.

బద్ధజీవుఁడు సచ్చిదానందస్వరూపుడైనను నిరతిశయజ్ఞానగుణము గలవాడైనను భగవదేకపరతంత్రుఁడైన ననాదిప్రకృతిసంబంధముచే దననిజస్వరూపగుణములను దెలియక సంసారము ననుభవించుచున్నాఁడు. బహుజన్మార్జిత సుకృతపరిపాకముచే జీవుఁడు మానవరూపముగ జన్మించినపుడు భగవత్కటాక్షము కలిగినచో సాత్త్వికుఁడై వర్ణాశ్రమవిహితకర్మములను భగవత్ప్రీతికొఱకు నాచరించుచు భగవంతునియందు జ్ఞానధ్యానోపాసనారూపమగు భక్తినిగాని ప్రపత్తినిగాని చేసి భగవదనుగ్రహముచే నర్చిరాదిమార్గమున వైకుంఠమను పరమపదమునకుఁ బోయి యచట బరిపూర్ణబ్రహ్మానుభవములవాఁడైయుండును. లేదా నారదాదులవలె భగవదాజ్ఞానుసారముగ నజ్ఞజనుల ననుగ్రహించుచుండును. ఇదియేభగవంతుని సేవ లేక కైంకర్యము లేక ముక్తి యనఁబడును. జ్ఞానమనగా భగవత్స్వరూప రూప గుణ విభూతులను జెప్పినరీతి నరయుట. తెలిసినపిమ్మట భగవంతునియందుఁ బ్రేమగల్గి నిరంతరమా భగవత్స్వరూపాదులను ధ్యానించుటయే, భక్తి. తనయొక్క శక్తిహీనత నరసి భగవంతుఁడే రక్షకుఁ డని మహావిశ్వాసముతో నాత్మసమర్పణము చేయుట ప్రపత్తి. ఇదియే మోక్షమునకు ముఖ్యసాధనము.

ప్రపత్తి కైదంగములు కలవు. (1) అనుకూల్యసంకల్పము, (2) ప్రాతికూల్యవర్జనము, (3) రక్షించు ననువిశ్వాసము, (4) రక్షకుఁ డనివరించుట, (5) దైన్య మను కార్పణ్యము, (6) ఆత్మసమర్పణము. (1) పరమదయాకరుఁడగు భగవంతుని నాశ్రయిం

చేదనను ప్రీతితోఁగూడిన తలంపు అనుకూల్యసంకల్పము. (2) అట్లాశ్రయించుటకుఁ బ్రతిబంధములగు నతిప్రవృత్తిని, యత్నమును, విడుచుట ప్రాతికూల్యవర్జనము. (3) స్వామిత్వ, సౌలభ్య, వాత్సల్యాది గుణములుకలవాఁడైనందున, శంకింపక తప్పకరక్షించునను నమ్మకము విశ్వాసము (4) నీవేనన్ను రక్షింపవలయునను బుద్ధితో రక్షకుఁడని పఠించుట. (5) నేనశక్తుఁడ, నజ్ఞుడ, నన్ను నేను రక్షించుకొనఁజాల, భగవంతునికంటె వేఱు రక్షకుఁడు లేఁడను బుద్ధి కార్పణ్యము. (6) నేనునీవాఁడను, నన్ను నిగ్రహించుటకు గాని యనుగ్రహించుటకుఁగాని నీవేకర్తవు, అనునిశ్చయజ్ఞానము కుదిరి, తన్ను, తనసంబంధమున్నియు, నర్పించుట, ఆత్మసమర్పణము. వీనిలో నాఱవది ప్రపత్తి, తక్కినయైదు దానికిసాధనములు. ఈప్రపత్తినిష్ఠుఁడు భగవదాజ్ఞారూపములగు వర్ణాశ్రమధర్మములను జీవించునంతవఱకుఁ జేయుచు దేహయాత్ర కర్మాధీనమనియు నాత్మయాత్ర సద్గతిని బొందించుట ఈశ్వరాధీనమనియు, నిశ్చయముతో నుండవలయును. భక్తిగాని ప్రపత్తిగాని మోక్షమునకు సాక్షాత్సాధనములు. భక్తికివర్ణాశ్రమ ధర్మములు, వివేకవిమోకాదు లేడు, అష్టాంగయోగములు, అంగములు. భక్తిద్వారమున గర్మజ్ఞానములు మోక్షసాధనములు.

శ్లో॥ సంసారాపారసింధు ప్లవకుశలమహో
కర్ణధారేమురారౌ। భక్తిర్యుక్తేః।
పరాసాప్రసరతుజననీ సార్వకాలంజనస్య॥

వావిలాల వేంకటశివావధాని.

# మోక్షమార్గ ప్రదీపిక.

## ఉపోద్ఘాతము.

ప్రపంచమునందలి మనుజులు జ్ఞానులు అజ్ఞానులు అని రెండు తెరగులవారని "పరమగురుచరణసన్నిధి" యను గ్రంథమునందు జెప్పబడియున్నది. పరమేశ్వరుడు లోకములను లోకపాలకులను మఱియు ననేక జీవరాసులను సృజించి నితాంతాపార కరుణాసముద్రుడగుటంజేసి జీవులందరు సంసార సుఖదుఃఖముల ననుభవించి యజ్ఞానమును బోగొట్టుకొని జ్ఞానపూర్ణులై తనపాదారవిందముల జేరవలయునని సంకల్పించెననియు, తత్సంకల్పాను ప్రవర్తనమే కర్తవ్యమని భావించి లోకపునోవృద్ధికై యేమరక పాటుపడుచుండువారు జ్ఞానులు. ఈశ్వర సంకల్పమిట్టిదని యెఱుగక దేహతాదాత్మ్యమును జెంది నశ్వరభోగాపేక్షచే జనన మరణ ప్రవాహరూపమగు సంసారమందు మునుగుచు దేలుచు దమకును నితర జీవులకునుగల భ్రాతృత్వసంబంధమును మఱచి తాము వేరని నమ్మి స్వార్థానుసంధాన ప్రవర్తకులు అజ్ఞానులు. అయిన నీయజ్ఞానము శాశ్వతముగనుండునది కాదు. జ్ఞానస్వరూపుడగు ఈశ్వరాంశులయిన జీవులు సయితము స్వభావతః జ్ఞానస్వరూపులే. ఆజ్ఞానము సంసార భ్రమణమునందు ప్రకృతి గుణ సంమూఢత్వముచే మేఘాచ్ఛాదితుడైన సూర్యునింబోలె నావరింపబడి ప్రకాశహీనముగ నుండును.

అజ్ఞానేనావృతంజ్ఞానం తేనముహ్యంతిజంతవః॥

(భగవద్గీత 5-15).

అప్పుడు జీవులు శోకమోహవశులై తమయుత్పత్తి నివాస్థానస్మృతి విహీనులై మెలగుచుందురు.

సర్వభూత యేకత్వజ్ఞానముచే శోకమోహములు నశించును.

యస్మిన్ సర్వాణిభూతాని ఆత్మైవాభూద్విజానతః
తత్రకో మోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః
(ఈ॥ ఉ॥).

అజ్ఞానము తొలంగును. జీవులు లబ్ధస్మృతులై ఈశ్వర సంకల్పాను ప్రవర్తకులగుదురు.

నష్టో మోహః స్మృతిర్లబ్ధా ..... .....
స్థితోస్మి గతసందేహః కరిష్యే వచనంతవ
భ॥ గీ॥ 18-73.

అర్జునుడు శోకమోహవశుడగుచున్నపుడు శ్రీకృష్ణప్రేరిత యుద్ధకర్మను జేయక ఆకర్మ ధర్మవిరుద్ధమగునని సందేహించెను. గీతాశాస్త్ర బోధవలన మోహము నశించగా ఈశ్వర సంకల్పమిట్టిదియని స్మృతిగలిగి భగవదిచ్ఛానుకూలముగ వర్తించెదనని నిశ్చయించెను. కనుక ఏకత్వజ్ఞానముచే నజ్ఞానమును బోగొట్టుకొని సర్వభూతహితత్వమును ఈశ్వరాజ్ఞననుసరించి ప్రవర్తించవలయు. జీవులజ్ఞానులైనచో జ్ఞానమొసంగి తరింపజేయుటకు ఋషిసంఘము వారు పాటుపడుచుందురు.

శ్లో॥ శాంతా మహాంతో నివసన్తి సంతో
వసంతవల్లోకహితంచరంతః
తీర్ణాస్స్వయంభీమభవార్ణవంజనాన్
అహేతునాఽన్యానపి తారయంతః

మహాత్ములు జీవులనుద్ధరించుటకు లోకములోనుండి పని చేయుచున్నారని శ్రీశంకరాచార్యులవారు వివేకచూడామణి యందు వర్ణించియున్నారు.

ఆమహనీయులు దేశకాలముల ననుసరించి తీర్థోపాయముల బ్రకటించుచుందురు. వారిలోగొందరు స్థూలశరీరధారులై భూలోకమున నివసించుచు శిష్యకోటికి బోధచేయుచు వారి ద్వారా జ్ఞానమును బ్రకటింతురు. వారి యధ్యక్షుత్వమున

ననేక సన్మార్గ సభలు జ్ఞానసంఘములు స్థాపించబడియున్నవి. వానిలో దివ్యజ్ఞానసభ (Theosophical Society) యనునది యొకటి. ఈశ్వరాజ్ఞాప్రకటీకరంబులగు శాస్త్రములును వారి యు జ్ఞానబోధకములగు గ్రంథములును ఆమహనీయులవలననే రచియింపబడియున్నవి. ఆగ్రంథములు కాలోచితముగను అధికారానుసారముగను బ్రకటించదగియున్నవి. ఇపుడు లోకహితార్థము కొన్నిగ్రంథములు బయలుపెట్టబడుచున్నవి. అందులో ముక్తగురు వాక్యములనే దెలుపు కొన్నిగ్రంథములను దివ్యజ్ఞాన సమాజమువారు ప్రచురించియున్నారు. మార్గజ్యోతి (Light on the path), మౌనవాక్కు (Voice of silence) పరమగురుచరణసన్నిధి (At the feet of the Master)అను నీమూడు గ్రంథములు మానవలె సంసారములో బరిభ్రమించి సుఖదుఃఖముల బాగుగ నెఱింగినట్టి మహాత్ముల వాక్యములను దెలుపునవి కనుక మనకు మిక్కిలియుపయోగకరములగు గ్రంథములుగ నెన్నవలయు. మొదటి రెండుగ్రంథములు జ్ఞానసారమును నిగూఢార్థమునుగలయవి. మూడవది విస్పష్టంబగు మాటలతో సుఖబోధకరముగనున్నది. అందు మొదటిది యగు మార్గజ్యోతి మోక్షప్రదీపిక యను గ్రంథము మనకెట్లులబ్ధమైనదియు జ్ఞానపూతులైన యోగి లెడ్‌బీటరుగారిట్లు దెల్పియున్నారు.

ఇది యపూర్వప్రాచీన సంస్కృత గ్రంథము, పదితాళపత్రంబులపైన నొక్కొక పత్రముపై మూడుసూత్రములవంతున ముప్పదిసూత్రములు తొలుత వ్రాయబడియుండినవి. పిదప తమశిష్యునుబోధార్థము "వినిషియన్" అని దివ్యజ్ఞాన సమాజమువారివలన బేర్కొనబడు ముక్తవరీయులు ఆసూత్రములకు వ్యాఖ్యానరూపమగు వాక్యములను జతపర్చి గ్రీకుభాషలో వ్రాసిరి. ఆ వాక్యములు సయితము సూత్రములుగా నెన్నబడెను. తొలుత ప్రాచీనభాషలో నుండినవి ముప్పది. వెనుక జేర్చబడినవి పంద్రెం

డు. మొత్తముకు నలుబదిరెండు సూత్రములును బ్రహ్మవిద్యాధికారిలక్షణముల దెల్పు అయిదు పూర్వవాక్యములునుగల యీ గ్రంథమునకు కొంత టీకనువ్రాసి "హైలేరియస్" అనుముక్తులు ఆంగ్లేయభాషలో ప్రచురించిరి. ఇచ్చట ప్రాచీన వ్యాఖ్యాన సూత్రములను వివరముగ గనుపర్చబడును.

ఈగ్రంథము ముముక్షువుల కత్యంతోపయుక్తము అయిన మహానుభావుల బోధలు. వానిప్రకారమనుష్ఠించిననే సఫలముకాగలవు.

"ఆహారము దినక జూచి యిదిబాగుగా నున్నదనుటచే నాకొనియున్నవాని యాకలితీరదు, చేయిచాచియాయన్నము ను తినవలయునుగదా. అటులనే పరమగురువుల వాక్కు వినుట మాత్రము చాలదు వారుచెప్పు నొక్కొక్క మాటయు గమనించి వారుసూచించు నొక్కొక్క యంశమును గ్రహించి వారు చెప్పినటుల నడచుకొనవలయును"

అని పరమగురుచరణ సన్నిధి యుపోద్ఘాతమునందు ఆలిక్యాని యనుపుణ్యపురుషుడు వ్రాసిన మాటను గమనించవలయును. మరియు.

శ్లో॥ నగచ్ఛతి వినాపానం వ్యాధిరౌషధశబ్దతః
వినాపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్నముచ్యతే

ఔషధము బాగుగనున్నదని చెప్పునంత మాత్రముననే వ్యాధినివారణ కానేరదు. పానముచేయబడి దేహమునందు వ్యాపించిననే గుణమియ్యగలదు. "బ్రహ్మ బ్రహ్మ" అని కోటి సార్లు నోటిమాటలుచెప్పిన నేమి యుపయోగము? అనుష్ఠానముచేసి యనుభవమును జెందినగాని ఫలముకలుగదు.

**కనుక మహనీయులు నుడివిన వాక్యములను గమనించి ఆ ప్రకారమునడుచుకొని పరమేశ్వరుని యనుగ్రహమునకు పాత్రతపడయవలయు.**

# మోక్షమార్గప్రదీపిక.

## ప్రథమభాగము.

### పంచవాక్యములు.

1. ఈవిధులు శిష్యులనెల్లర నుద్దేశించి వ్రాయబడియున్నవి, వానినిగమనించుడు.

2. కన్నులు చూడగలుగుటకుమున్న బాష్పవారి విడుచుటకసమర్థములు గావలయు.

3. చెవి వినగలుగుటకుమున్న పరవాదముచే జలింపబడు స్వభావమును బోగొట్టుకొని యుండవలయును.

4. వాక్కు పరమగురువుల సన్నిధానమందు వదించగలుగుటకుమున్న ఇతరుల మనస్సుకు నొప్పిగలుగజేయు శక్తిని బోగొట్టుకొని యుండవలయు.

5. జీవాత్మ పరమగురువుల సన్నిధానమున నిలవగల్గుటకుమున్న వానిపాదములు హృదయ రక్తముచే ప్రక్షాళనము చేయబడవలయు.

ఈ వాక్యములు బ్రహ్మవిద్యాధికారమునకు వలయు యోగ్యతలను తెలియజేయుచున్నవి. యోగ్యతలేనివారికి విద్య గఱపరాదు.

శ్లో॥ ఇదం తేనాతపస్కాయ నాభక్తాయకదాచన
నచాశుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్యసూయతి॥
(భ॥ గీ॥ 18-67.)

తపస్సులేనివానికి, భక్తిరహితునికి, ఆసక్తి లేని వానికి, భగవంతుని దూషించువానికిని ఈగీతాశాస్త్రము నుపదేశించవలదని శ్రీకృష్ణుడర్జునునకు జెప్పెను. ఏలనన వాడు ఆవిద్యను గ్రహించజాలక పోవుటవలన నది నిరర్థకమై పోవును. ఒకప్పుడు విపరీత భావనవలన గీడు సయితము గలుగును.

శ్లో॥ విరక్తితీవ్రత్వనిదానమాహుః

భోగ్యేషుదోషక్షణమేవసన్తః
విరజ్యవిషయవ్రాతాత్ దోష దృష్ట్యాముహుర్ముహుః
సుఖమితిమలరాశౌ పరమన్త్రేత్ర గేహే
క్రిమయఇవకళత్ర క్షేత్రపుత్రానుషక్త్యా
సురపదఇవ తేషాం నైవమోక్షప్రసంగః॥

దేహము మలరాశియనియు పుత్రక్షేత్ర కళత్రాదులందు దోషదృష్టి కలిగినగాని నిజవైరాగ్యము లేదనియు, మోక్షప్రసక్తికి నయిత మధికారము లేదనియు, నుడువు పైవాక్యములను సాధారణ ప్రపంచ ధర్మము ననుష్టించుచు ప్రవృత్తి మార్గమున వర్తించు వానికి బోధించినట్టయిన దేహాదుల నుపేక్షించి తనకును, దన్నాశ్రయించియుండు వారలకును హానికలుగ జేయును. లేక ఈ బోధలు హితములుకావని వానిని దూషణ పరిహాసములపాలుజేయును. ఔషధము రోగి వయసు ననుసరించియుండవలెను. పెద్దవాని కియ్యదగ్గ ప్రమాణమును బాలునికిచ్చిన విరోధించును. పసిబాలునిచేతికి ఖడ్గమిచ్చిన దన్ను దానే నరుకుకొనవచ్చును. దానినే యుక్తవయస్సు వచ్చిన పురుషునికిచ్చిన సుఖదాయకంబగు. అపరిశుద్ధ మనస్కులు మనోమాలిన్యముచే వస్తుపారిశుద్ధ్యమును గ్రహించజాలరు. ఎఱ్ఱని అద్దమునజూచు వానికి తెల్లని పదార్థ మెఱ్ఱగ గన్పడుగాని నైజశ్వేతవర్ణమును జూపనేరదు. చలించుచున్న నీరమునందు సూర్యబింబము జక్కగ బ్రతిబింబించ నేరనియట్లు విషయాసక్తితో సదా చలించుచున్న మనస్సునందు ఆత్మవిద్య ప్రకాశింపనేరదు. అట్టి మనస్సుగల వారికి విషయేంద్రియ సంయోగ జనితసుఖలవమే యుపేక్షణీయముగ దోచునుగాని కష్టసాధ్యమైన యక్షయసుఖ ప్రాప్తియందభిరుచియుండదు. (సశేషము).

జి. శంకరరావు.

# జ్యోతిర్మూర్తి కైంకర్య సమాజము.

# (Servants of the Star)

జగద్గురువులవారు శీఘ్రములో అవతరించబోవుచున్నారనే వార్తను లోకములో ప్రచురముచేయుటకొఱకు 1911 సం॥రమున ప్రాగ్జ్యోతిర్మూర్తి సమాజము (ఆర్డర్ ఆఫ్ ది స్టార్ ఇన్ ది ఈస్ట్) అను ఒక గొప్పసభ స్థాపించబడెనుగదా. దానిలో చేరిన బాలశాఖకు 'జ్యోతిర్మూర్తి కైంకర్యసమాజ' మని పేరు.

జగద్గురువుగారి కైంకర్యముజేయుటకు అనేకులు కావలసియుండును. ఇప్పటినుండి మీరు కైంకర్యము చేయవలసిన పద్ధతిని అభ్యసించి నేర్చుకొన్నయెడల వారు దయచేసినపుడు వారు పొమ్మన్నచోటికి పోవుటకును చెప్పిన కార్యముచేయుటకును గొప్పశిష్యవర్గము సిద్ధముగానుండునుగదా. వారాజ్ఞాపించిన కార్యమును నెరవేర్చుటకు మీరుసిద్ధముగా నుండవలసినది మాత్రమేగాక వారి కార్యమును చక్కగా నెరవేర్చుటకు నిపుణతకూడా గలిగియుండవలయు. "బాలురుగానుండు మనము జగద్గురువు రాకకై పనిచేయవలయును. ఈ సమాజములో చేరినవారును చేరనివారును ఆయన శీఘ్రమున వచ్చెదరని నమ్ముచున్నాము." వారు శీఘ్రముగ వచ్చుటకు కావలసిన సన్నాహము చేయవలయు. సమభూమిపై నీళ్లుసులభముగా పారునట్లు లోకము సిద్ధము కాగానే జగద్గురుడు అవతరించును. అపుడు మనము పనిజేయవలసియుండును గనుక మనము ఇప్పటినుండి ప్రయత్నించినయెడల క్రమక్రమముగా మార్గము సిద్ధమగును.

ఆయన ఒకడే జగదేకగురుడు. లోకరక్షణమునకై ఆయన మరల నవతరించుచున్నాడు. వారికి అనేకపేర్లుగలవు. ఏప్రక్కనుండియైనను పర్వతముమీది కెట్టు యెక్కవచ్చునో అట్లనే ఏచోటనుంచియైనను వారిసన్నిధిం జేరవచ్చును. ఆయన

యనుగ్రహము సమస్త జనులపైయుండుగాక! వారి రాకకై వేచియుండెడు సర్వదేశస్థులకు శీఘ్రముగ దర్శనమిచ్చుగాక!!

సమాజములో చేరుట.

21 సం॥రములకులోపడిన వారందరు ఈసమాజమందు చేరవచ్చును. పసివాండ్రు తల్లిదండ్రుల అనుమతిబొంది చేరవచ్చును. కట్నములుగాని చందాలుగాని చెల్లించ నక్కఱలేదు. ఈసమాజముయొక్క శాఖలు అనేకచోట్ల నుండుటవలన ఆయాచోట ఉండెడు సెక్రిటరిగారి వలన వారువారు చేయవలసిన కార్యములను తెలుసుకొనవచ్చును.

ఈ కార్యమునకు ఏవిధముగా సహాయము చేయవలయునో వారువారు విశ్చయించుకొనవలయును. బాలురు తమంతట సభజేరి తమలో ఒకరు అగ్రాసనమును వహించి తామే ఉపన్యాసములిచ్చి నిబంధనల నేర్పరచుకొని అన్నిపనులు జరుపుకొనవలయును. చిన్నబిడ్డలకు ఈవిషయము బోధించవచ్చును.

1. ప్రతిదినము ఇతరులకు ఏదైన ఒకఉపకారము చేయవలయును. అట్లుచేయక ఒకదినమైన వ్యర్థపుచ్చగూడదు.

2. ముఖ్యముగా బీదపిల్లకాయలకు సహాయముచేయవలయును. అది జగద్గురువుకు ప్రీతిగాచేయవలయును. ఆయన అనుగ్రహము బీదబాలురపై యుండునట్లు ప్రార్థించవలయును

3. నోరులేని జంతువులయెడ కనికరము కలిగియుండవలయును. ఎవరైనను వాటిని హింసించినపుడు అడ్డపడవలయు.

4. జగద్గురువును సదాజ్ఞాపకముంచుకొనవలయును. ఆయనకు అనర్హమైన కార్యమేమియు జేయరాదు.

5. ఏవిషయముగాని చక్కగా వ్రాయుటకును చెప్పుటకును నేర్చుకొనవలయును.

# శరీరవృక్షము.

సంసారమను కాంతారమున శరీరమను వృక్ష మొకటి కలదు. ఆవృక్షమున కొక పాది, రెండు ఫలములు, మూడు వేర్లు, నాలుగు రసములు, అయిదు ఊడలు, ఆరు తొఱ్ఱలు, ఏడు పొరలు, ఎనిమిది కొమ్మలు, తొమ్మిది రంధ్రములు, పది యాకులు గలిగి రెండు పక్షులచే నాశ్రయింపఁబడియున్నది.

అట్టి వృక్షమునుబోలి యుండెడి శరీరమున ప్రకృతియను పాదియు, సుఖ దుఃఖములను రెండు ఫలములును, సత్వరజస్తమో గుణములను మూడు వేళ్లును, ధర్మార్థ కామ మోక్షములను నాలుగు రసములును, పంచేంద్రియములను ఊడలైదును* శోక మోహ జరా మరణ క్షుత్పిపాసములను (షడూర్ములు) తొఱ్ఱలారును, త్వఙ్మాంస మేదోరక్త చర్మ శుక్ల శోణితములను (సప్తధాతువులు) పొరలును,† కంఠ ఉదర హస్త పాద శిరో వక్షములను (అష్టాంగములు) కొమ్మలును, కర్ణ నాసిక వాఙ్నేత్ర గుహ్యములను నవరంధ్రములును, ప్రాణో పాన వ్యానో దాన సమాన నాగ కూర్మ కృకర దేవదత్త ధనుంజయములను (దశవాయువులు) ఆకులును, గలిగి విచిత్రముగానుండు శరీగవృక్షము పరమాత్మ జీవాత్మ‡లను పక్షులచే నాశ్రయింపఁబడి, సుఖ దుఃఖములను రెండుఫలములను భుజింపుచుండుట జ్ఞానులకు గోచరము.

(సుజ్ఞానచంద్రోదయము)

---

* పంచేంద్రియములనగా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములన్నిటియొక్క కూడిక యని గ్రహించవలెను.

† పొరలు—పట్టలు.

‡ అనగా ఈశ్వరుడు జీవుడు అని అర్థము.

# ప్రాచీనకథ.

హిమాలయపర్వత ప్రాంత్యమున దక్షిణ దిశలో విశ్రాంతి యోగ్యంబగు నొక ప్రదేశములో చిరకాలము క్రిందట శంఖుఁడు, లిఖితుఁడునను నిద్దరు తపోనిధులగు సహోదరులు విజన స్థలములో వాసముచేయుచుండిరి. వారిరువుర ఆశ్రమంబులు అనతిదూరంబున ప్రత్యేక ప్రత్యేకముగానుండెను. ఒకానొకదినమున లిఖితుఁడు తనసహోదరుని చూడను పోగా అతడు బైట సంచారనిమిత్తము పోయియుండెను. అప్పటిలో చూడనుపోయిన తపోనిధి తనసహోదరుని తోటలో కూర్చుండెను. తలపైన వ్రేలాడుచున్న దివ్యసుగంధ యుక్తమైన పక్వఫలములు వీక్షించెను, అప్పుడే గ్రీష్మఋతువు ఆరంభమైయుండెను. క్షుధాపీడితుడైయుండెను. గనుక "ఈ ఫలమును నేనుభుజించినచో నాసోదరుడెప్పుఁడికి ఆక్షేపించడు, నేనడిగినప్పటికి నతడె ఇఫ్ఫలము నొసంగును. ఇది నిశ్చయమని తలంచి, తోటలోని మధురమయిన పక్వఫలమ్ఁను భుజింప నుద్యమించెను. బయిటపోయియుండిన శంఖుఁడు ఆతరుణంబున నేతెంచెను.

తన సహోదరుఁడు పండ్లను తినుచుండుటను కనుగొని "ఏమి, నీకు సంబంధపడని పదార్థమును నీవుతీసికొని స్వార్థమునకై యుపయోగము చేసుకొన్నావు గనుక నీవు వెంటనే రాజుగారి యొద్దకు వెళ్లి నిన్ను శిక్షించుటకు వేడుకొమ్ము" నెను ఇట్లాడిన మాటలువిని అత్తపోనిధి ఆలాగే రాజుగారియొద్దకు వెళ్లెను. రాజు ఈతపోనిధులను బాగా ఎరిగియుండెను వీరిగుణాతిశయములను విని వీరిద్దరియందు అత్యంత గౌరవముంచి యుండెను. ఈ తపోనిధి రాజు సమీపంబునకురాగా చూచి నృపవర్యుడు లేచి

ఈకథ 'సుపంథ' యందు కన్నడభాషలో ముద్రించబడి బ్రా॥ గుండురావు గారిచే తెనుగించఁబడినది.

పాష్టాంగ ప్రణామం బాచరించి "సుఖాగమనమా? తమ యిష్టార్థం బెద్దియో సెలవిండు తమ యభీష్టము నెరవేర్చెదనని ప్రార్థించెను" అయ్యా! రాజా! నాదిగాని పదార్థమును నేను స్వేచ్ఛగా పుచ్చుకొంటిని గనుక నాకుతగిన శిక్ష యివ్వవలెనని అడుగుటకు భవత్సమీపంబున కేతెంచితి ననగా ఆఋషిఆడిన మాటలు విని రాజు నిన్నుశిక్షించజాలను వేరొండుకోరుము నెను. ఋషిపై చెప్పినప్రార్థన నె పునఃపునః అడుగుకొనెను. కడపట రాజు తన భటులనుచూచి ఇతని చేతులు నరికివేయుండని ఆజ్ఞాపించెను. రాజాజ్ఞ తత్క్షణమె జరుపపడినది.

మందభాగ్యుడైన యీతపస్వి రక్తము స్రవించు చేతులను తన సహోదరునికి చూపవలెనని అతని ఆశ్రమంబు కడ కేతెంచి చూపగా నతడు చూచి "నీదశ నాకువచ్చి యుండినచో నేను నాహస్తములను నదిలో కడుగుకొని వచ్చి యుందుననెను" ఆమాటలువిని ఆఋషినదికేగి మొండిచేతులను నదీజలంబుల కడుగుచుండగా హస్తములచివర దివ్యమైన కాంతి ప్రసరించి తనహస్తములు నీటినుండి బైటికితీయగా తన చేతులు మునుపటివలెనె సరిగావచ్చియుండినవి. ఇది తనసహోదరునికి చూపగా తన తపః ప్రభావముచేత నతనికి అంతమాత్రము సహాయం బొనరించుటకు శక్తుడనైతినని చెప్పెను. "నాస్థితిలోనుండెడు ఇతర సామాన్యమానవులు స్వాభావికముగా చేయుచుండు ఇంతటి అల్పమైన కార్యము చేసినందుకు నన్ను శిక్షించను రాజు యొద్ద కేల పంపితివని నా తపోనిధి అడుగగా ఆఋషివరుం డిట్లనెను." నిక్రమము. ఇతరసామాన్య ప్రజలు యిట్టిపనులు చేయందగు. అయితె నీవు అందటివంటి వాడవు కాదు. నీవు పరిపూర్ణుడగుటకు ప్రయత్నపడు వాడుగాను న్నాపనెను.

ఈకథలో మనము తెలిసికొనవలసిన అంశమేమనగా:- జ్ఞానము హెచ్చినకొలది మానవునికి జవాబుదారియు హెచ్చగు

చున్నది. ఈప్రపంచమగు పరమాత్ముని పాఠశాలలో మనుజులు నేర్చుకొనవలసిన సద్గుణంబులనునవి నప్పరి పూర్ణజ్ఞానందలి సద్గుణంబుల ప్రతిబింబములు. సామాన్య నరులు తమ యిరుగుపొరుగువారు ఆచరించినట్లు ఆచరించినచో తృప్తిచెందువారు. ఇట్టివారు ప్రపంచము ప్రవాహములోపడి అనేక కాలమయిన పిమ్మట దరిచేరుదురు. అయితే ముముక్షువు ప్రవాహంబుతో పాటుపోకుండా ఎదుర నిలిచి కాలప్రవాహమును నిలిపి భగవంతుడు చేయు కార్యములలో సహభాజనుడై అతనికి త్రికాలంబుల అవస్థాత్రయమునందు సహాయభూతుడు కావలెను. గనుక నట్టివాడు సామాన్యజనులవలెనే నటించక సరియయిన త్రోవ నవలంబించవలెను.

---

## దేశీయ ప్రార్థన సమాజము.

ఈసమాజపు నాల్గవ సంవత్సరోత్సవ వేడుకలు 1915 డిసంబరు 25, 26, 27 తేదులందు హిందూపురమున నతివినోదముగా జరిగెను. దైవప్రార్థనలు, ఊరిభజన, మహాసభ, స్త్రీలసభ, బీదలకన్నదానము, బజారుపన్యాసములు, బాలకులకుఁ జిఱుతిండి ఇవియన్నియు జరిగినవి.

26 తేది మహాసభయందు మాతాలూకా తహశీలుదారు రాఘవేంద్రాచార్యులుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. వారు మిక్కిలి పారమార్థిక చింతగలవారు వారియుపన్యాస మందరికినిఁ గడురంజకముగా నుండెను. మాగాయకులకును, ప్రార్థన తరగతిలోఁ గృతార్థతఁ జెందిన విద్యార్థులకు, సంఘాభివృద్ధికిఁ బలుతెఱంగులఁ దోడ్పడిన బాలురకును బహుమతులొసఁగఁబడెను.

హిందూపురము — 2 — 1916.

మునీశ్వరయ్య.
దే. ప్రా. సమాజ కార్యదర్శి.

# Divyagnanadeepika.

CONTENTS OF THIS NUMBER.



———:0:———



———:0:———

**Registered No. M. 716.**

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కుడగు ధర్మము లేదు).

సంపుటము 7. **May 1916.** సంచిక 2.
మే నెల 1916.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 7. { May 1916 / మే నెల 1916. } సంచిక

## కాలదేశ వర్తమానములు.

ఈ నెల 17 తేది బుధవారము వైశాఖ శుద్ధ 15 వ్యాస పున్నము. అది యుత్తమమైన పుణ్యదినము. వ్యాసమహర్షి లోకాచార్యుఁడు. మన భరతఖండమునందలి మతస్థాపకులలో మూల పురుషుఁడు. వేదముల చిక్కుదీసి ప్రవచనార్థముగఁజేసి వేదవ్యాసుఁడని బిరుదాంకమునొందిన మహాపురుషుఁడు. అష్టాదశ పురాణములు, భారతము, బ్రహ్మసూత్రములను రచించిన మహానీయుఁడు. వ్యాసపున్నమనాడు ఆయనను పూజించువారును ధ్యానించువారును అమూల్య ఫలమునందఁగలరు.

*

ఈ నెల 8 తేది దివ్యజ్ఞాన సమాజస్థాపకులలో నొక్కరగు బ్లావట్స్కీగారు శరీరముం బరిత్యజించిన పుణ్యదినమై యున్నది. నాటిదినము అనేకస్థలములందు బీదలకు అన్నదానము చేయఁబడును. ఆమె జగత్తునకుచేసిన మహోపకారము

కృతజ్ఞతతో నాటిదినము స్మరించుట ఎల్లరకును కర్తవ్యము. దివ్యజ్ఞాన సమాజములో చేరినవారికి నవశ్యమాచరణీయము.

*

యోగిలెడ్‌బీటరుగారు అడియారునుండి వెళ్లినదిమొదలు ఇప్పటివరకు ఆస్ట్రేలియా దేశమందున్నారు. ఆ పుణ్యపురుషుఁడు ఇంత దీర్ఘకాలముగా అచట నివసించుచుండుట ఆదేశపు వారియొక్క భాగ్యోదయమైయున్నది.

*　　　*　　　*

బ్ర॥ జినరాజదాసాగారు ఇంగ్లండుకు వెళ్లినారు. ఆశాంత మూర్తి, ఆసాత్త్వికశిరోమణి, ఐరోపాఖండమున అడుగుపెట్టిన మాత్రమున నచట నడుచుచున్న ఘోరయుద్ధము తుదముట్టి లోకమున శాంతినెలకొననున్నదేమో! వారు క్షేమముగను శీఘ్రముగను మరల నీదేశమునకు వచ్చిచేరుదురుగాక!

ఏప్రిల్ నెల 21, 22, 23, 24 తేదీలలో అడియార్ క్షేత్రమున దక్షిణహిందూస్థానపు దివ్యజ్ఞాన సమాజములయొక్క తృతీయ వార్షికోత్సవము జరుపఁబడెను. నానాస్థలములనుండి స్త్రీలును పురుషులును దాదాపు 200 మంది సామాజికులు దయచేసియుండిరి. శ్రీమతి ఆనీబెసెంటమ్మగారు అలహాబాద్ లో జరిగిన రాజకీయ సభకుగాను వెళ్లియుండినందున బ్ర॥ జినరాజదాసాగారును, వాడియాగారును అడియారులోని కార్యములను జరిపించిరి. తెనుగుభాషలో "భాగవతసారము"ను గురించి సబ్ జడ్జి బ్ర॥ వెంకట శివావధానులుగారును అరవ భాషలో "శివ్యమార్గము"ను గురించి రంగస్వామిఅయ్యగారును చేరి మూఁడు ప్రసంగములను జేసిరి. దివ్యజ్ఞానశాఖా సమాజముల కర్తవ్యమును గురించియు, జీవేశ్వర సంబంధమును

జినరాజదాసాగారు జేసిరి. అమ్మగారు కార్యాంతరమున వెళ్లియుండినను వార్షికోత్సవమునకై వేంచేసియున్న సామాజికులలో భక్తిశ్రద్ధలును పరస్పరమైత్రీభావమును అధికముగానుండెను. సభాకార్యములు అతి వైభవముతో జరిగెను.

భరతభూమికి నున్నత దశ రానగి యున్నదని దివ్యజ్ఞాన సమాజమును స్థాపించిన ఆల్కాట్ దొరగారు సూచించియుండిరి. వారి స్థానమునకు వచ్చిన ఆనీబెసెంటమ్మగారు సహిత మీ దేశమునకు వచ్చినది మొదలు భారతీయుల నాస్థితికి దెచ్చునిమిత్తము చాల పాటుపడుచు వచ్చినది. మొదట జనులకు పారమార్థికచింత యతిశయించులాగున మతములకు చైతన్యమును గలుగచేసెను. పిదప నాలుగంగములతోగూడిన విద్యాశిక్షణకై పాటుపడెను. తరువాత సంఘసంస్కరణ నిమిత్తమై పనిచేయ నారంభించెను. ప్రకృతమున రాజకీయవిషయమై ఆమె చాలా పాటుపడుచున్నయది. ఇవన్నియును భరతభూమి నుద్ధరించు నిమిత్తమేకదా! భారతీయులారా! లోకములో స్థితివ్యత్యాసము తటస్థమగు నీకాలమున మనమందరమును నీమహానీయురాలి ననుసరించి నడచినచో మనమాతృభూమికి నున్నతదశ తప్పక గలుగును.

* * *

మనమేమి కార్యములను జేయ బూనినను బాధకములు రాకమానవు. బాధకములు సంభవించినపుడు వానిని తృణీకరించి పనిచేయ యత్నించిన మనోదార్ఢ్యమధికమై కార్యనిర్వహణ శక్తి వృద్ధియగును. ప్రకృత మీదేశమున సంఘసంస్కరణ విషయమందును, రాజకీయ పద్ధతులందు మార్పుగలుగ జేయు విషయములోను, సనాతనధర్మము ననుసరించియు భగవత్సంకల్పము ననుసరించియు మత సంప్రదాయములను వ్యత్యాస

పరుచు విషయములోను కార్యదర్శులు చాలాపాటుపడవలసి యున్నది. విఘ్నములను లక్ష్యముజేయక ధీరులై పనిజేసిన యవశ్యకములైన మార్పులు సులభముగా రాగలవు.

* * *

నూతన విద్యాభ్యాసపద్ధతిలో నుపాధ్యాయులు గమనించ వలసిన ముఖ్యవిషయము లేమన:-విద్యా శిక్షణకొరకు తమ వశవర్తులైయున్న బాలురు జీవులేగాని దేహమాత్రములు కారు. జీవునియందుగల శక్తులను వికాసమగునట్లు జేయుటయే యుపాధ్యాయుల కర్తవ్యముగాని తాము జదివి తెలిసికొనిన విషయములను వారికి బోధించుటకాదు. (1) జీవులకనేక జన్మములు గలవు. ప్రతి జన్మమందును కొంతకొంత యనుభవమును సంపాదించుచుండుటచే నీజన్మమందు బాల్యావస్థలోనున్న జీవులకు వెనుకటి వాసనలు సంస్కారములు తప్పకయుండును. (3) బాలురకు ప్రీతిచే విద్యాభ్యాసమును జేయించవలయునేగాని దండనలను ప్రయోగించరాదు. (4) మనోవికాసమొకటి మాత్రము విద్యాభ్యాసము కానేరదు. దేహాభివృద్ధియును, హృదయపరిపాకమును, మనోవికాసమును, పారమార్థికబుద్ధియును విద్యాశిక్షణకు నాలుగంగములైయుండుటవలన వీనినన్నిటి వృద్ధియగునట్లు జేయవలెను. ఇదియే పరిపూర్ణమైనవిద్య.

* * *

జాతి, మతము, స్త్రీపురుషభేదము, వర్ణము, ఇవియన్నియు ననిత్యములు. ఇవి ప్రతిజన్మమున మారుచుండును. జీవునికి నిత్యములగు విషయములే ప్రధానములు. రెంటికిని పరస్పర విరుద్ధము గన్పట్టుచో బుద్ధిమంతుఁడు అనిత్యములఁ బోనాడి నిత్యములనే దృఢముగఁ జేపట్టు.

# ప్రసన్నత్వము.

(17-వ పుట శేషము.)

గతసంచికయందు ప్రసన్న వీక్షణములు ఈశ్వర, మహా పురుషుల ప్రకాశమునకుఁగల నాలుగు ద్వారములలో ప్రథమ ద్వారమని వ్రాయబడెను. ఇప్పుడు రెండవ ద్వారమగు ఉత్సాహ వాక్కులను గురించి వ్రాయబడును.

ధీరులు ఉత్సాహవంతులుగా నుందురు గాన ధీరులుగానుండ జాలరు గనుక ధీరుల వాక్యము లెల్లప్పటికి ఉత్సాహకరములుగా నుండును. పసిపిల్లలు క్రిందపడినపుడు దెబ్బతగులుటచే స్వభావముగా నేడ్తురు. కొందరేడ్వరు. ఏడ్వని పిల్లలను ధైర్యవంతులని స్తుతింతురు. నొప్పికలిగినను సహించికొని ఉత్సాహముతో నుండువారు ధీరులు. చచ్చెదమని తెలిసియు రణరంగమున యుద్ధమునకు చేరబడువారు ధీరులనబడుదురు. ఉత్సాహము లేకుండిన వారు యుద్ధము చేయగలరా? సేనానాయకులు ధైర్యము లేకుండిన సేనను పురికొల్పి యుద్ధము సేయనుత్సాహము కలుగజేయగలరా? ధైర్యమును ఉత్సాహమును ఎల్లప్పటికి కలిసియుండును. ధైర్యోత్సాహములు స్వప్రయోజనమునకై యుండదగదు. రణధీరులు రణరంగమందు పోరుట మాతృభూమియొక్క యశస్సును కాపాడుటకు గదా? ధైర్యోత్సాహము లెల్లప్పుడును ఇతరులను కాపాడుటకుగానే ఉపయోగించవలెగాని స్వలాభమున కుపయోగించ దగదు. నేను వానిని కొట్టి చంపెదనని పలుకుట ధైర్యోత్సాహపు మాట కాదు. ఉత్సాహపుమాట సర్వదా దయతో నిండియుండును. "నేను కొట్టిచంపెద"నను మాట ఇతరునికి భయముకలుగజేయును గాని యుత్సాహము కలుగజేయదు. యుద్ధమందు మాత్రమిది వినియోగపడదు. ధైర్యోత్సాహపరులు శత్రు

సేనకు యుద్ధమందొకింత ధైర్యోత్సాహము గలుగఁ జేయును. ఇరుప్రక్కల వారును ధైర్యోత్సాహములు లేక యుద్ధము చేయఁ జాలరు గనుక నీమాట రణరంగమందుపయోగపడదు. ఒకడాడుమాట ఇంకొకనికి ఉత్సాహము కలుగ జేయవలెను గాని నిరుత్సాహపరచకూడదు.

ఈ కారణముచేతనే దయాపూరితమైన వాక్కులన్నియు ఉత్సాహవాక్యములే. భగవంతుడు పరమదయానిధి. భగవంతుని దయాప్రవాహమును లోకమంత వ్యాపించుటకు మహాపురుషులగు పరమగురువులు పెద్దకాలువలుగా నేర్పడినారు. వారి శిష్యులు చిన్నచిన్న కాలువలుగానుండి జగత్తంతయు వ్యాపింప జేయుదురు.

దయారూపకమైన జగదీశ్వరునియొక్కయు, ఆదయతో నిండిన మహాపురుషులయొక్కయు ప్రకాశమునకు ద్వారములుగా నేర్పడ నిశ్చయించుకొన్న వారందరు ఒకప్పుడును నిర్దయ వాక్కులు పలుకక సర్వదా దయాపూరితములైన వాక్కులే పలుకుచు తాము ఉత్సాహవంతులై ఇతరుల కుత్సాహముకలుగ చేయుచుండవలెను. ఎవడే సుగుణము పొందినను ఆసుగుణము నితరులకు పొందింప జేయవలెను. సర్వకాల సర్వావస్థలయందు దయాపూర్వకములైన ఉత్సాహ వాక్కులే నోటినుండి వెళ్లుటకు ఏవిభంగములుగా నుండునో విచారించి వానిని నిర్మూలముగ పారదోలినగాని ఆస్థానమందు దయాపూర్వక సంకల్పములు, మాటలు స్థిరముగా నిలవజాలదు.

ఆభంగములెవ్వి?

శ్లో॥ పరాపవాదం, పారుష్యం
పైశున్య మనృతం, తథా
చత్వారి వాచా రాజేంద్ర
నజల్పేన్నానుచింతయేత్ ॥

అని మహాభారతమందుదాహరింప బడినది.

ఇతరులను నిందించుట, కఠినముగ మాటాడుట, కొండె ములుచెప్పుట, అనృతమాడుట ఈనాల్గును అత్యంత నిషేధము లైనవని తాత్పర్యము.

భగవదైశ్వర్యమగు దయాప్రకాశము తమయందు ప్రకా శింపగోరు వారందరు సర్వప్రయత్నములతో పైనుదాహరించి న నాలుగు వాగ్దోషములను బొత్తుగా వదలవలెను.

పీనినివదలు ఉపాయము.

పరాపవాద స్వభావము పూర్తిగ పోవలసి యుంటే సర్వ దా ఇతరులయందుండు దోషముల నెంచక గుణములను మాత్రము గ్రహించి ఆగుణముల నే ఇతరులతో సమయము తటస్థించినపు డంతయు చెప్పుచుండుట తప్ప వేరు ఉపాయ మేదియులేదు. ఇట్లు నిరంతర మభ్యాసము చేయుటచే క్రమక్రమముగ పరుల నిందిం చు అలవాటుపోయి వారిసుగుణములను స్తుతించు స్వభావము పట్టుపడును. ఎవరియందేసుగుణములున్నను ఆసుగుణములు వారి అంతర్యామిగానుండు ఈశ్వరాంశమునకు చేరినవే గాని వేరు కాదు. గనుక అట్లు గుణగ్రహణము చేయువారు ఇతరులయం దుండు ఈశ్వరప్రకాశమును విస్తరింప జేయువారగుదురు. తద్ద్వారా తమలోనుండు ఈశ్వరాంశ ప్రకాశమును వృద్ధి చేయు వారగుదురు.

కఠినవాక్కులు పలుకు ప్రకృతిని నాశమొనరించుటకు మృదుమధుర వాక్కుల నుచ్చరించుచుండుట తప్ప వేరు మార్గమే దియులేదు. ఏమర్నడతను పోగొట్టవలసియుండినను తద్విరోధ మగు సత్ప్రవర్తననే అభ్యసించవలెను.

పైశున్యమనగా కొండెములు చెప్పుట. ఈదోషమును పరి హరించుటకు ఇతరులందు ద్వేషబుద్ధిని నిర్మూలము చేయవలెను. ఎవరిమీద కొండెములు చెప్పదలతుమో వారి కపకారము చేయు

తలంపు అభివృద్ధి చేయుట అభ్యసించవలెను. అప్పుడు కొండెము లు చెప్పి అపకారముచేయు స్వభావ ముడుగును.

నాలుగవదగు అన్వృతమాడు నైజమును తెగటార్చ నిశ్చ యించువారందరు సత్యము పలుకుట నభ్యసించుచు రావలెను.

శ్లో॥ జయేత్కదర్యం దానేన సత్యేనానృతవాదినం
క్షమయా క్రూరకర్మాణం అసాధుం సాధునాజయేత్ ॥

లుబ్ధత్వమును దానముచేతను, అనృతవాదిత్వమును సత్య ముచేతను, క్రూరస్వభావమును క్షమాగుణముచేతను, అసా ధుత్వమును సాధుత్వముచేతను జయించవలెనని విదురుడు ధృత రాష్ట్రుని కుపదేశించినాడు. కనుక దుర్గుణములు తద్విరోధముల గు సుగుణములచేత నే హతమగును.

ఈశ్వరుడు సత్యస్వరూపుడు. సత్యవ్రత మాచరించు వారందరు ఈశ్వరసములు. మహర్షులు సత్యవ్రతులు గనుక వారినుండి ఈశ్వర వైభవమగు సత్యప్రకాశము వారి సత్య వాక్కులచే జగత్తంతయు వ్యాపించుచుండును. ఈ కారణము చే ఈశ్వరైశ్వర్యమగు సత్యప్రకాశమునకు ద్వారములుగా నుండ నిశ్చయించిన వారందరు సత్యసంధులుగా నుండవలెను. సత్య వ్రతము తపస్సులలో నుత్తమ తపస్సు. దీనికితుల్యమగు తపస్సే లేదు.

శ్లో॥ నాస్తి విద్యాసమంచక్షుః నాస్తి సత్యసమంతపః
నాస్తి రాగసమందుఃఖం నాస్తి త్యాగసమంసుఖం॥

విద్యకు సమమైన కన్నులేదు, సత్యమునకు సరియైన తప స్సులేదు, రాగమునకు సదృశమైన దుఃఖములేదు, త్యాగమునకు సరిపోలు సుఖములేదని విదురుడు ధృతరాష్ట్రుని కుపదేశించెను.

సత్యవ్రతము వ్రతములన్నిటికంటె నాచరించుట కష్టము. హరిశ్చంద్రుడు సత్యవ్రతము వదలక నాచరించుటకు పడిన దుఃఖము లెవ రెరుగరు. బలిచక్రవర్తి సత్యవ్రతమునకై తనసర్వ

స్వమునుగాక తన్నుకూడా సమర్పించుకొనెను. సత్యవ్రత మించుకైనతప్ప కాచరించుటకు హరిశ్చంద్రునకును, బలిచక్రవర్తికిని, శ్రీఆనిబెసంటమ్మగారికిని యున్న ధృతికావలెను. సామాన్యులకు నీవ్రత మాచరించుట సాధ్యముకాదు. కనుక సత్యవాక్కులు ధీరుల ఉత్సాహ వాక్కులుగా చెప్పబడినవి.

వాక్కులు సత్యముగా నుండుటేగాక ప్రియముగానుండవలయు. అప్రియమగు సత్యము పలుకకుము, ప్రియమైన అనృతమును ఉచ్చరించకుము, ఇదిసనాతన ధర్మమని స్మృతి తెలుపుచున్నది.

భగవద్గీతయందును సత్యము, ప్రియముగాను, హితముగాను ఉండవలెనని శ్రీకృష్ణులు అర్జునుని కుపదేశించినారు.

“అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితంచయత్॥”

భగవంతుడు జగత్తునకు ఎల్లప్పటికి హితమునే చేయుచుండును. అప్రియములును అహిత వాక్కులు నుచ్చరించుట భగవన్నియామకమునకు విరోధమగును. అహితమగు సత్యమాడువారు భగవత్ప్రకాశమునకు ద్వారములుగానుండఁ జాలరు.

“జగద్ధితాయకృష్ణాయ గోవిందాయ నమోనమః”

హితముతోకూడిన సత్యమే సత్యము. ఇట్టి సత్యము ద్వారా ఈశ్వరప్రకాశము వ్యాపించును.

విష్ణుపురాణమందును ప్రియహితవాక్కులుగల వానియందు వాసుదేవుడు ప్రకాశించునని చెప్పబడినది.

శ్లో॥ విమలమతిరమత్సరః ప్రశాంత
శ్శుచిచరితోఖిలసత్వమిత్రభూతః
ప్రియహితవచనోస్తమానమాయో
నివసతిహృదితస్య వాసుదేవః

ఈకారణముచే సదా సత్యప్రియహిత వచనములే పలుకు చుండవలెను.

ఇదిగాక వాక్కులన్నియు మధురముగా నుండవలెను గాని వక్రములుగా నుండదగదు.

ఎవరైన అతిథిగాని, ఇతరుడుగాని యింటికి వచ్చినపుడు మధురవాక్కులతో ఆదరించి అన్నమిడవలెగాని వక్రవాక్కులు పలుకదగదు.

శ్లో॥ అన్నస్యదానంమధురాచవాణీ
యమస్యతేనిర్వచనాభవంతి॥

అని మహాభారతమందు చెప్పబడియున్నది. మధుర వాక్కులుగల వానినిగురించి యముడు సహితము మాటలాడ జాలడని చెప్పబడినది. అసత్యము అప్రియము అహితమును నోట రాకుండ నిరోధించుట, యోగమునకు ప్రథమ ద్వారమని వివేక చూడామణియందు చెప్పబడినది.

"యోగస్యప్రథమంద్వారం వాఙ్నిరోధోఅపరిగ్రహః॥

మహాదేవుడును, మహావిష్ణువును, మహాయోగీశ్వరులు. వారి అనుగ్రహమును పూర్తిగ పొందినమహాపురుషులును పరమ యోగులు గనుక వారిప్రకాశమునకు కాల్వలుగానో, ద్వారములుగానో ఉండగోరువారందరు వక్రమగు మాటలాడక సర్వదా వాక్కును నిరోధించుచు సత్యప్రియహిత వచనములనే ఆడుటకు దృఢప్రయత్నము చేయుచుండవలెను.

ఒకని లోపము లింకొకనికి చెప్పుట ధర్మముకాదు. ఏమతమునుగాని, ఎవరిసంప్రదాయమునుగాని దూషించదగదు.

భువియందుండునపుడు మహనీయుల అనుగ్రహము కోరువారికి ఇతరులు వారిని నమ్మునట్లు వర్తించుట ధర్మము. పరమ గురువులు శిష్యుల నేర్పరచుకొనుట తమశిష్యుల కడ కితరులేగి సహాయము పొందుటకని తెలియవలెను. కాబట్టి వారెల్లప్పటికి సర్వవిధముల సత్యమునే అవలంబించవలెను. మాటలందు ఉత్ప్రేక్షగాని, అతిశయోక్తిగాని యుండదగదు. అట్లుండినపు

డు ఇతరులు నమ్మరు. ఎప్పుడు మాటలు దయా సత్య మాధుర్య యుక్తముగా నుండునో అప్పుడామాటలు ధైర్యవాక్కులనఁబడును. ఏ వాక్కులగుండా మహాగురువుల ప్రకాశము బయలువెడలునో అవి ధైర్యపు మాటలనబడును. ఈశ్వరుడు మహాపురుషులగుండా జగత్తును చూచుచున్నాడు. మహాగురువులు తమ శిష్యులగుండా చూచుచున్నారు.

మహాపురుషులెల్లప్పటికి ఈశ్వరునితోకూడి యుందురు గనుక వారు సర్వదా శక్తిమంతులుగ నుందురు. ఎక్కడెక్కడ దుఃఖములు కష్టములుండునో అక్కడనంతయు వానిని నివారించుదురు. వారికి ఆశక్తి కలదు. వారి శిష్యులుకూడా ఆశక్తి గలవారుగా మాట్లాడవలెను. ఏపని చెప్పినను ధైర్యముతో నేను చేయుదునని ఉత్సాహ వాక్కులు పలుకవలెగాని, నేను చేయజాలనని పలుకరాదు.

ఏ సమయమందు, ఏ సందర్భమందు సద్గురువులు శిష్యులను తమ సాధనములుగా నుపయోగింతురో తెలియదు గనుక శిష్యులగుటకు కోరువారు వారికి సాధనములగుటకు పైచెప్పబడిన వాక్శుద్ధి కలిగి ధైర్యోత్సాహములగు మాటలే ఆడుచుండవలెను. ఎవరి లోపములను గురించిగాని పరిహాసముగా నితరులు నవ్వుటకైనను మాటలాడరాదు.

పై నుదాహరించినవన్నియు ధైర్యోత్సాహ వాక్కులుగా నుండును. ఇవి స్వభావముగాగలవారు ఈశ్వర, మహాపురుషులగు పరమగురువుల ప్రకాశప్రవాహమునకు కాల్వలుగాను ద్వారములుగాను ఉందురు.

జం. శ్రీనివాసరావు.

# విష్ణు స్తోత్రమ్.

ప్రహ్లాద నారద పరాశర పుండరీక। వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్॥ రుక్మాంగదార్జున వశిష్ఠ విభీషణాదీ। న్పుణ్యానిమా న్పరమ భాగవతాన్స్మరామి॥

ఏమానవా విగతరాగ పరావరజ్ఞా। నారాయణం సురగురుం సతతం స్మరంతి॥ ధ్యానేన తేన హతకిల్బిష చేతనాస్తే। మాతుః పయోధర రసం నపునఃపిబంతి॥

నారాయణోనామ నరోనరాణాం। ప్రసిద్ధచోరః కథితః పృథివ్యామ్॥ అనేక జన్మార్జిత పాపసంచయం। హరత్యశేషం స్మరతాం సదైవ॥

మేఘశ్యామం పీతకౌశేయవాసం। శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్॥ పుణ్యోపేతం పుండరీకాయతాక్షం। విష్ణుం వందే సర్వలోకైకనాథమ్॥

జలౌఘమగ్నా సచరాచరాధరా। విషాణకోట్యాఖిల విశ్వమూర్తినా॥ సముద్ధృతాయేన వరాహరూపిణా। సమేస్వయంభూ ర్భగవాన్ప్రసీదతామ్॥

అచింత్య మవ్యక్త మనంత మవ్యయం। విభుం ప్రభుం భావిత విశ్వభావనమ్॥ త్రైలోక్యవిస్తార విచార కారకం। హరిం ప్రపన్నోఽస్మి గతింమహాత్మనామ్॥

గోవింద గోవింద హరేమురారే। గోవింద గోవింద రథాంగపాణే॥ గోవింద గోవింద ముకుంద కృష్ణ। గోవింద గోవింద నమోనమస్తే॥

శ్రీరామ నారాయణ వాసుదేవ। గోవింద వైకుంఠ ముకుందకృష్ణ॥ శ్రీకేశవానంత నృసింహ విష్ణో। మాంత్రాహి సంసార భుజంగ దష్టమ్॥

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

(6-వ సంపుటము 476-వ పుట శేషము.)

ఇంతకుపూర్వమున కేవల పశుప్రాయులైనవారు ఒక మెట్టెక్కుటకు సులభమైన ధర్మమును గురించి వ్రాయబడియుండెను. ఈ సంచికయందు అంతకంటె నెక్కువ తరగతివారు ప్రకృతమందుండు స్థితికంటె నెక్కువ స్థితినిపొందుట కేర్పడిన ధర్మములను గురించి వ్రాయబడును.

ప్రవృత్తి మార్గమునకుగాను నియమించిన ధర్మములు సర్వోత్కృష్టములని ఇంతకుముందు చెప్పబడియుండెను. ఈ ఉత్తమోత్తమములైన వర్ణధర్మములాచరించుటకు ఇప్పుడు కొంచమైన వీలు లేకుండపోయినది. ఇందుకై భరతఖండము లోనుండు సనాతన మతస్థులందరు శోచింపవలసినదిగా నున్నది. దీనికి ముఖ్యకారణము వర్ణసంకరము. వర్ణములే సంకరము కాకయుండినంతట ఈ దేశమందు పుట్టి పెరిగి మహాప్రసిద్ధి జెందియుండిన అరువది మూడు విద్యలు నశించియుండవు. మరియు నీదేశపు సౌభాగ్యదశ క్షీణించియుండదు. ఇంతియేగాక హీనవర్ణమువారు సులభముగా నుత్తమవర్ణమునకు వచ్చుట కు నేర్పడిన మార్గము విడుచుట కెవరును పూనియుండరు.

కాలానుసారముగను సందర్భానుసారముగను వర్తించక తప్పదు. ప్రకృతమందు ఆధర్మములను ఆచారములోకి తెచ్చుట కు బొత్తుగా వీలులేదనుట పైనచెప్పబడినది. అదేలన జనుల లో నేసంఘము వారు శ్రేష్ఠులు, ఏసంఘమువారు కనిష్ఠులని తెలిసికొనుట దుస్తరముగా నున్నది. పూర్వమందు దేహమనోబుద్ధుల పక్వానుసారము వేర్వేరు సంఘము లేర్పడి ఆయాసంఘము వారు పురోవృద్ధి అగుటకును దేశమం దేవిద్యగాని నశించకుండుటకును వృత్తిభేదము లేర్పడియుండెను. సంకరమైనందున

అవి యన్నియు మిశ్రమములగుటచే మార్గములన్నియు తప్పిపోయి నవి.

వర్ణసంకరముచే జనులు క్షోభకలిగి నశించుదురనియు దానికి నేను కర్తగా నేర్పడనని అర్జునునికి శ్రీకృష్ణ భగవాను లుపదేశించిన భగవద్గీత మూడవ అధ్యాయము 24 శ్లోకమందు చెప్పబడినది.

శ్లో॥ ఉత్సీదేయురిమేలోకానకుర్యాంకర్మచేదహం
సంకరస్యచకర్తాస్యాముపహన్యామిమాఃప్రజాః॥

శ్రీకృష్ణభగవానులానతిచ్చినట్లు వర్ణసంకరముచే కలిగిన క్షోభ యింతయని చెప్పుట కలవి కాక యున్నది.

వర్ణసంకరమునకు స్త్రీపురుష వ్యభిచారమే కారణము.

"స్త్రీషుదుష్టాసువార్ష్ణేయజాయతేవర్ణసంకరః॥

అనిగీతావచనము.

శ్లో॥ జాతిరత్రమహాసర్పమనుష్యత్వేమహామతే
సంకరాత్సర్వవర్ణానాందుష్పరీక్ష్యేతిమేమతిః
సర్వేసర్వాస్వపత్యానిజనయంతిసదానరాః
తస్మిన్నేవంమతిద్వేధేమనుఃస్వాయంభువోబ్రవీత్॥

సమస్తవర్ణముల వారి భార్యలు ఇతరవర్ణముల వారిని పొంది సంతానోత్పత్తి గావించినందున కలిగిన సంకరములో జాతిని గుర్తించుట కష్టమని పైశ్లోకమునకు ముఖ్యాభిప్రాయము. భారతము, ఆరణ్యపర్వము.

దీనిచేత బీజమునకు తగిన క్షేత్రమును, క్షేత్రమునకు తగిన బీజమును దొరుకుట దుస్తరమాయెను.

వర్ణసంకరముకాక పరిశుద్ధముగా నుండిన కాలమందు మహామహిమగల రాజర్షులును, బ్రహ్మర్షులును జనించుటకు పవిత్రములైన కుటుంబములును, పరిశుద్ధమైన గర్భములును క్షత్రియులలోను బ్రాహ్మణులలోను సమృద్ధిగనుండియుండెను.

ఇప్పుడట్టి పవిత్రపరిశుద్ధ గర్భములు లేనందున అట్టిమహనీయులు పుట్టుటకు ఆస్పదము లేక పోయె.

మహనీయులు అపరిశుద్ధ కుటుంబములందు జనించరు.

నియమేషుతపశ్శబ్దః తదతిక్రమేవిద్యాకర్మనిస్స్రవతి
బ్రహ్మసహోఽపత్యాదేతస్మాత్ కర్మిపత్యము
నాయుష్యంచ। తస్మాదృషయో
అవరేషునజాయంతేనియమాతిక్రమాత్॥

నియమమున తపస్సు, నియమాతిక్రమముచే విద్యాకర్మలు వదలినవాడగును. వాని సంతానము ఆయుహీనముగలదియు నగు గనుక అపరిశుద్ధ కుటుంబములలో ఋషులు పుట్టరని ఆపస్తంబ సూత్రములలో చెప్పబడినది.

సనాతనమతము వారిలో ద్విజులందరు వేర్వేరు ఋషుల గోత్రము వారని ప్రతిదినము చెప్పుకొనుచుండినను వారివంశములలో ఋషులుద్భవించకుండుటకు అన్ని కారణములలో సంకరము ముఖ్యకారణము.

మనవంశములలో ఋషులవతరించకపోవుట కంటె శోచనీయమైన దేమియు లేదు.

సంకరముచే కలిగిన ఇంకొక దోషమేమన వేర్వేరు మనో భావములుగల జీవులు పునః పుట్టునపుడు తమ పూర్వజన్మ మనోభావముల ననుసరించి వృద్ధియగుటకు తగిన కుటుంబములు గర్భములు, సందర్భములు ఇరుగు పొరుగులును దొరకక పోవుట.

శ్లో॥ యంయంవాపిస్మరన్భావంత్యజత్యంతేకళేబరం
తంతమేవేతికౌంతేయసదాతద్భావభావితః॥

భూలోకమందు జీవించుకాలమందు ఎవడు సర్వదా ఏయే భావనలు భావించుచుండునో ఆభావనలే దేహము విడుచు కాలమందు స్మరణకు వచ్చును. పునః జన్మమెత్తునపుడు అట్టి

భావనతోనే పుట్టునని ఆశ్లోకముయొక్క ముఖ్యాభిప్రాయము.

సామాన్యముగ జనులు జీవనమునకై ఏవృత్తిని అవలంబించియుందురో ఆవృత్తిసంబంధములైన తలంపులు మనసులో పదే పదే స్మరణకు వచ్చుచుండుననుట అందఱికిని అనుభవమే. ఆవృత్తి కార్యములందు ఎట్టినూతన పద్ధతులు కల్పించిన జనులు మెచ్చుకొని అకర్షింపబడుదురు, ఏచమత్కారము దానియందు చూపవచ్చును, ఎట్టిమార్పులుచేసిన అందరికి ఆహ్లాదకరముగా నుండును, అని యీ మొదలగు పలుతెఱంగులైన ఊహాపోహలే చేయుచుందురు. మరణకాలమందును ఇవితప్పవేరు భావనలెట్లు స్మరణకువచ్చును. మరణానంతరముకూడ ఇవే వెంటనంటును. మరణానంతర అవస్థలు అనుభవించిన తరువాత కూడా ఇట్టిభావనలతోనే పునః జన్మమెత్తుదురు. జన్మమెత్తునపుడు ఈభావనలను అభివృద్ధిపరచి వానిని కార్యములుగా పరిణమింపజేయుట యందు బుద్ధికుశలతయు, చమత్కారమును, సాహసమును చూపి అత్యంత మనోహరముగను, రమణీయముగను, సుందరముగను, శ్లాఘ్యముగను ఉండునట్లు గావించుటకు తగిన తలిదండ్రులును, కుటుంబములును, ఇరుగుపొరుగు, సమూహము ను లేనట్లయిన నెట్లుసాధ్యపడును?

పూర్వము ఔరంగజేబు చక్రవర్తి కాలమందు ఒకనేతకాడు అరువది మూరల నిడుపుగల తలగుడ్డనేసి ఒకచిన్న టెంకాయ బుర్రలోనుంచి చక్రవర్తికడకు తెచ్చియుంచెనట! నేతయందు ఇంతచమత్కారబుద్ధి గలవాడు కేవలవైదిక కర్మలాచరించు విప్రునియింట బుట్టితే వానికి పూర్వజన్మ కర్మానుసారమైన నేతయందుండు నిపుణత్వమును ప్రకాశమునకు తెచ్చి మరింత అభివృద్ధియగునట్లు చేయుటకు అవకాశముండునా? ఈవిప్రుల కుటుంబమందు పుట్టినబాలునికి అధ్యయనము, మొదలైనవి అభ్యసింపజేయుదురు. పూర్వజన్మమందు ఆవాసనే

యొఱుగని ఈనేత నేయు జీవునికి అధ్యయన విద్య పుట్టదు. నేత అభివృద్ధిపరచుటకు తగిన ప్రోత్సాహముగాని, కృషిచేయుటకు అనుకూలములైన సందర్భములుగాని లేకపోయె. ఈజీవునికి ఉభయభ్రష్టత్వము సంభవించె.

అట్లు కేవల శ్రోత్రియుడగు విప్రజీవుడు మాంసభక్షణ మద్యపానాదులు సేయు కుటుంబములో జనించినపుడు పూర్వ జన్మానుసార బుద్ధినిపట్టి అధ్యయన, అధ్యాపనాది విద్యలను వృద్ధిచెందించుటకును, దేవతలను తృప్తిచెందించి లోకక్షేమ మొనర్చుటకును తగిన సాధనము లేవియు లేకపోవుట బట్టి ఆజీవునకును భ్రష్టత్వము కలుగును.

సంకరమే అపరావిద్యకు చేరిన 63 విద్యలును నశించుట కు ముఖ్యకారణములలో నొకటిగా నేర్పడె. సముద్రయానమును నిషేధించుటచే నావికాబంధవిద్య మనలో పూర్తిగ నశించె. విమాన నిర్మాణ విద్య యొకటి ఉన్నదనెడు స్మరణమే తప్పిపోయె. యక్షిణీవిద్య, గారడీవిద్య, జలస్తంభము, అగ్నిస్తంభము, కను కట్టువిద్య, భరతవిద్య, మొదలైన విద్యలన్నియు నిర్మూలమాయె. దేహబలముతోను మనస్సాహసముతోను నేర్వదగిన దొమ్మర, జట్టి విద్యలును, ముష్టియుద్ధము, శస్త్రాస్త్రవిద్యలు, మొదలగునవి యన్నియు అడుగంటె. ఈవిద్యలచేతగదా మనదేశము ప్రపంచములో నుండు దేశములకన్నిటికంటె ప్రసిద్ధిచెంది సౌభాగ్యదశ నొందియుండె. మనలో నీవిద్య లెప్పుడు నాశమొందెనో అప్పుడే మనదేశపు భాగ్యనాశమునకు కారణమాయె. దీనికి తగిన ఇతర సందర్భములును కూడుటచే ఈదేశపు భాగ్యమంతయు నితరదేశీయుల పాలాయె. మనదేశమునకు దౌర్భాగ్యము ప్రాప్తించె.

మరియు గుప్తవిద్యలగు మంత్రశాస్త్రములు మొదలగు నవన్నియు పూర్ణగుప్తమును చెందె. జగత్ప్రసిద్ధిచెందిన

మన ఆయుర్వేద శాస్త్రమునకు వచ్చిన గతి ఇటీవల అందరికి గోచరముగానే యున్నది. ఈవిద్య నశించుటచే నెన్నికోట్ల ద్రవ్య మితర దేశములకు పోవునది లెక్క-చేసినవారికి బాగుగ తెలియును.

ఈ సంకరముచే బ్రాహ్మణుల కుటుంబములందు బ్రాహ్మణ స్వభావములగు శమదమాదిగుణములుగల జీవులుదయించుటచే వారికి బ్రాహ్మణవృత్తి యగు యజన యాజన అధ్యయన అధ్యాపన దాన ఆదాన షట్కర్మలందు అభిరుచిలేక వాణిజ్య, రాజకీయ ఉద్యోగ, న్యాయవాద, సేవాదివృత్తులందు ప్రీతిగలిగి వానినే అభ్యసించుచు వచ్చిరి. తద్వారా దేశమంతయు క్షోభనొందె.

శ్లో॥ దురిష్టైఃదురధీతైశ్చదురాచారైఃదురాగమైః
విప్రాణాంకర్మదోషైస్తైఃప్రజానాంజాయతేభయం॥

విప్రులు (బ్రాహ్మణులు) దుర్విషయములు కోరుటచేతను, దుర్మార్గసంగముచేయుటచేతను, దురాచారము లాచరించుటచేతను, చేసిన కర్మలచే ప్రజలందరికి భయముత్పత్తియగునని మత్స్య వాయు పురాణములందు చెప్పబడినది.

మొదటివారెప్పుడు ధర్మము తప్పిరో అప్పుడితరులును ధర్మము తిప్పుట సంభవించెను. దానిచేత కలిగిన దోషమేమన:-

శ్లో॥ జరావ్యాధిక్షుధావిష్టాః దుఃఖాన్నిర్వేదమాగమన్
విచారణంతునిర్వేదాత్ సామ్యావస్థావిచారణాత్॥
సామ్యావస్థాసుసంబోధఃసంబోధాద్ధర్మశీలతా
(వాయుపురాణము)

జనులందరు సంకరముచే తప్పుటవల్ల వృద్ధదశ రాక మునుపు ముసలితనము ప్రాప్తమగుటయు, పలురోగములచే బాధపడుటయు, ఆకలిచే తల్లడిల్లుటయు, దుఃఖముచే కృశించుటయు ప్రాప్తమగును. తద్వారా విసుకుపుట్టును. విసుకుచే వీనికి కారణమే

మని విచారబుద్ధికలుగును. విచారబుద్ధిచే సామ్యావస్థలభించును. సామ్యావస్థనుండి విషయములు బాగ బోధపడును, మంచిబోధచే ధర్మాచారము ప్రాప్తమగును. దానినుండి సుఖానుభవమగునని తాత్పర్యము.

పై శ్లోకములో చెప్పినట్లు జనులు అనేకబాధ లనుభవించి వైరాగ్యము కొంతకాలమునుండి ప్రారంభించినట్లు తెలియుచున్నది.

జనులకు సద్విచారముచేయు ఆసక్తి కలిగినపుడు తగిన బోధకులుండే తీరవలెను. సంకరముచే బోధచేయుటకు తగిన బ్రాహ్మణులు పుట్టుటకు స్వచ్ఛమైన కుటుంబములు లేకపోయె. ఇట్టి సమయమందు విచారపరులకేమి గతియని ప్రశ్నకలుగుచున్నది. దానికి మహాభారతమున భృగుభరద్వాజ సంవాదమందిట్లు చెప్పబడినది.

శ్లో॥ బ్రహ్మచైవపరంసృష్టంయేనజానంతితేద్విజాః
తేషాంబహువిధాస్త్వన్యాస్తత్రతత్రహిజాతయః
పిశాచారాక్షసాప్రేతావివిధామ్లేచ్ఛజాతయః
ప్రణష్టజ్ఞానవిజ్ఞానాఃస్వచ్ఛందాచారచేష్టితాః
ప్రజాబ్రాహ్మణసంస్కారాః స్వకర్మకృతనిశ్చయాః
ఋషిభిస్స్వేనతపసాసృజ్యంతేచాపరేపరైః॥

ఎవరు సృజింపబడినసర్వమును పరమమైన బ్రహ్మమని తెలియజాలరో వారు ద్విజులు కారు. ఇట్టి వారినుండి అనేక జాతు లుత్పత్తియగుచున్నవి. పిశాచములు, రాక్షసులు, జ్ఞాన విజ్ఞానములు లేకపోవుటచే నిచ్ఛానుసార వర్తనగల పలువిధములైన మ్లేచ్ఛులు నుదయించుచున్నారు. ఇట్టి దురవస్థ ప్రాప్తమైనపుడు స్వకర్మచే బ్రాహ్మణ సంస్కారము పొందినవారిని ఋషులు తమతపస్సుచే సృజించుదురని పై శ్లోకముల ముఖ్య తాత్పర్యము.

ఇట్టి ఋషుల తపోమహిమచే శ్రీబ్లావట్స్కీ అమ్మగారు కర్నల్ ఆల్కాటుగారు, ఆనిబెసంటమ్మగారు, యోగి లెడ్బీటరు గారు జినరాజదాసుగారును ఉదయించినవారని చెప్పుటకు ఏమి సంశయముండదని నాకుతోచుచున్నది. విచారపరులందరికి వీరు బోధకులుగా నుండుట బహుమందికి తెలిసేయున్నది.

ముందు వర్ణపరిశుద్ధమునకై బీజములుగా నేర్పడు చిహ్నములుగల ప్రజలు అక్కడక్కడ పుట్టుటకు ప్రారంభమైనదనియు, వీరినందరిని ఏర్పరచి ఒక ప్రదేశమందు చేర్చి వీరిలోనే వివాహాదుల నియమమేర్పరచి వర్ణపరిశుద్ధము చేయుటకు మహాత్ములు ప్రయత్నముచేయుచున్నారని వీరు (శ్రీ ఆనిబిసంటమ్మగారు మొదలగువారు) చెప్పుచున్నారు.

ఇంతియె గాక త్వరలో మహాపురుషు డొకడవతరించి దురాచారముల పోగొట్టి ఈకాలమున సందర్భములకు యుక్తమైనబోధచేసి అందరిని జ్ఞానమార్గమందు ప్రవేశింప చేయుననియును దృఢముగా చెప్పుచున్నారు.

నేను పైన వ్రాసినదంతయు ప్రశంసలోనుండు ప్రవృత్తిమార్గాచారములకు సంబంధించనట్లు తోచినను ముందు వ్రాయబోవునది తెలిసికొనుటకు అవశ్యమైనందున వ్రాసితిని. క్షమించవలెను. దీనికి ఆవలిసంచికనుండి ధారతప్పక వ్రాయబడును.

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

-:0:-

# బ్రహ్మసూత్రసారము.

## అద్వైత విశిష్టాద్వైత సామరస్యము.

పరమార్థదశలో జీవేశ్వరులకు నభేదముఁ జెప్పు శాస్త్రమద్వైతము. సూక్ష్మములగు చిదచిత్తులతోఁగూడిన బ్రహ్మమునకు, స్థూలములగు చిదచిత్తులతోఁగూడిన బ్రహ్మమునకు నభేదము బ్రతిపాదించు శాస్త్రము విశిష్టాద్వైతము. ప్రళయములో జీవులగు చిత్తులకు జ్ఞానమున్నను నది ప్రసరింపఁబడదు. మైనపు ముద్దలోనున్న బంగారు రేణువులవలె జీవులు ప్రకృతిలో లీనమైయుందురు. అచిత్తను ప్రకృతి, మహదాదిరూపమునఁ బరిణమింపక స్వరూపమాత్రమున నుండును. ఆ యవస్థయందుఁ గూడ నీశ్వరుఁడు చిదచిత్తులందుండి వానిని ధరించును. సృష్ట్యవస్థయందు సూక్ష్మమగు యచిత్తును దేహేంద్రియాదిరూపమునఁ బరిణమింపఁజేసి, జ్ఞానప్రసరణములేని జీవుల నందుఁ బ్రవేశింపఁజేసి శరీరముల కనుగుణమగు స్వభావమును గలుగఁజేయుచు నీశ్వరుఁడు ధారకుఁడై ప్రవర్తకుఁడైయుండును. సృష్టిప్రళయములగు రెండవస్థలందు నీశ్వరుఁడు చిదచిదంతర్గతుఁడై వానిని నియమించుచున్నందున శరీర (వాచకమగు) మునుబోధించు శబ్దములు శరీరియగు జీవునిఁ దెలియఁబఱచునట్లు చిదచిద్వాచకశబ్దములు చిదచిత్తులే శరీరముగఁ గల యీశ్వరుని బోధించును. ముక్తావస్థయందును గూడ జీవుఁడు బ్రహ్మముకంటె భిన్నుఁడు. సూక్ష్మచిదచిద్విశిష్టబ్రహ్మమునకు స్థూలచిదచిద్విశిష్టబ్రహ్మమునకు నైక్యమును 'తత్వమసి' లోనగు మహావాక్యములు బోధించును గాన విశిష్టాద్వైత మనఁబడును. అద్వైతులు వ్యవహారదశయందుఁ జెప్పునీశ్వర జీవ, ప్రకృతి, స్వరూపములు, సృష్టి ప్రళయక్రమములు, వర్ణాశ్రమధర్మములు, కర్మ, భక్తి, జ్ఞానయోగములు; ఈశ్వరోపాసనావిధానములు, వానిఫలములు, స్వర్గనరకాదిలోక

స్వరూపములు, అర్చిరాది ధూమాదిమార్గములు, శమాదులు, మైత్ర్యాదులు, శ్రవణాదులు, పరిణామసత్కార్యవాదములు, విశిష్టాద్వైతులకుఁ గూడనిష్టమె. ఆసాధనములచే సగుణబ్రహ్మానుభవము గలిగియుండి యవిద్యను దాటి పరమపదమను నప్రాకృతిక లోకమందలి భగవత్స్వరూపానుభవానందము ముక్తునకుఁ గలుగునని విశిష్టాద్వైతులనెదరు. బ్రహ్మలోకమందు సగుణముక్తి గలుగునని యద్వైతు లనుదురు. అనుభవానందములు సమానమె. సగుణముక్తుఁడు బ్రహ్మముతో సమాన జ్ఞానాదులు గలవాఁడని యుభయులు దలతురు కాని.—బ్రహ్మము నిర్విశేషమనియు, అజ్ఞానముచే జీవభావముఁ బొందుననియు, బ్రహ్మస్వరూపజ్ఞానముచే నవిద్యాస్వరూపము నాశము నొందుననియు, ముక్త్యవస్థయందు జీవబ్రహ్మములకు నైక్యమనియు, మొదలగు కొన్నివిషయములు మాత్రమద్వైతులకు సమ్మతము. నిర్గుణబ్రహ్మము చైతన్య స్వరూపమని యద్వైతు లందురు. ప్రకృతి నతిక్రమించిన పరమపురుషుఁడు శుద్ధజ్ఞానస్వరూపుఁడనియు నతని దేహేంద్రియములు గుణములు లోను గాఁగల సమస్తములు చేతన స్వరూపములనియు విశిష్టాద్వైతుల యాశయము. బ్రహ్మము జ్ఞానస్వరూపుఁ డనియు జ్ఞానిస్వరూపుఁడనియుఁ గూడ ననుదురు. నిర్గుణబ్రహ్మమునకుఁ బ్రకృతి వికారమగు గుణములు లేవని యుభయులు నంగీకరించిరి. ప్రకృతిజములుగాక ప్రకృతికంటె విలక్షణమైనగుణములు, భగవంతున కున్నవని, విశిష్టాద్వైతుల యాశయము. ఉండినను నవి జ్ఞానస్వరూపములేయగును, బ్రహ్మము చైతన్యఘనము గనుక దానిలో నవి యంతర్భాగములు గాన, వేఱుగా గుణవిభాగముఁ జేయ వీలులేదని యద్వైతుల యాశయము. గుణిగుణములస్వరూపము జ్ఞానమని యొప్పినచో నట్టిభేదము పరమార్థదశలో నవశ్యముగా కున్నను, వ్యావహారికమందు నుండవచ్చును. కాననే బాదరిజైమినులయభిప్రాయములు రెండు గ్రహింపనగు. శ్రీధరాదులు

గ్రహించిరి..

బ్రహ్మజ్ఞానముచే నజ్ఞానము స్వరూపముతో నశించునని యద్వైతులు, అజ్ఞానమును దాటుదురని విశిష్టాద్వైతులు, ననియెందరు. అద్వైతులు చెప్పు సాధనసాధ్యభక్తులు, విశిష్టాద్వైతులను భక్తిప్రపత్తులకు సమానములు. ప్రపత్తికిఁ బ్రపన్నభక్తి, శరణాగతి, నిర్గుణజ్ఞానము, అనన్యభక్తి, యనియుఁ బేళ్లు.

సూత్రభాష్య మందుఁగాని భగవద్గీతా భాష్యమందుఁ గాని రామానుజాచార్యులు ప్రపత్తి, మోక్షమునకు స్వతంత్ర సాధనమని వ్రాయలేదు; కర్మజ్ఞానములతోఁ గూడిన భక్తియే మోక్షమునకు సాధనమని వ్రాసిరి. భగవద్గీతా చరమశ్లోకవ్యాఖ్యలోఁ బ్రపత్తికార్యములు రెండువిధములుగ వ్రాసిరి. బ్రహ్మజ్ఞానమునకు సాధనములగు కర్మజ్ఞానభక్తియోగములు పుట్టకుండఁ జేయు ప్రతిబంధములను నివారించుటకుఁ బ్రపత్తిని జేయవలయునని యొకయోజనము చేసిరి. ప్రపత్తి బ్రహ్మానుభవ సాధనములకొకటి ప్రతిబంధనివారకము. కర్మజ్ఞానభక్తియోగములగు సాధనములు గలిగినను, బ్రహ్మానుభవమను ఫలముగలుగకున్నపుడు, ఫలము పుట్టకుండఁజేయు ప్రతిబంధములను నివారించుటకుఁ గాను శరణాగతిఁ జేయవలయునని రెండవయోజనము చేసిరి. ప్రపత్తి బ్రహ్మానుభవమగు ఫలము (సాధ్యము) నకుఁ బ్రతిబంధ నివారకము. కాన భక్తియే బ్రహ్మానుభవమగు మోక్షమునకుఁగారణమనియుఁ, బ్రపత్తి సాధనసాధ్య ప్రతిబంధ నివారకమనియుఁ దేలును. తర్వాత ద్రవిడ ప్రబంధ పాంచరాత్ర, రామాయణాదివ్యాసంగముననో, యేహేతువు చేతనో, శరణాగతి యగు ప్రపత్తియే మోక్షమునకు సాక్షాత్సాధన మని రామానుజులవారభిప్రాయపడిరని నాలాయిరం 11 వ పాట టీకలోనున్నది. దీర్ఘశరణాగతి యగు రామాయణము, ద్రవిడ ప్రబంధములును ఆ యభిప్రాయమును బలపఱచుట యుక్తమే. శ్రీవైష్ణవుల కన్ని

సాధనములలోను శరణాగతియే ముఖ్యమని నమ్మకము. శరణాగతి, కఠ, ముండక, శ్వేతాశ్వతర, నారాయణోపనిషత్తులలోను, భగవద్గీతలలో—7. అ 14 శ్లో. 8. అ. 21. 22. శ్లో. 9. అ. 15. 22. 34. శ్లో. 13. అ. 18. శ్లో. 15. అ. 4. శ్లో. 18. అ. 61. 62. 65. 66. 73. శ్లోకములలో నుపపాదింపఁబడినది. అనాద్యజ్ఞానమగు మాయను దాటుటకును, భగవదనుగ్రహ సంపాదనమునకును, ప్రపత్తి ముఖ్యకారణమని భగవంతులును, శంకరరామానుజాచార్యులును, నొక్కినుడివిరి. సర్వశాస్త్రములయొక్క పరమ రహస్యము ఈశ్వరశరణాగతియే యనియు, నాకారణముచేతనే భగవంతులు తమ గీతాశాస్త్రమును శరణాగతియందే పరిసమాప్తిఁ జేసిరనియు, మధుసూదసరస్వతులు చరమశ్లోక టీకలోవ్రాసిరి. కాని సర్వధర్మానిత్యాది గీతా చరమశ్లోకార్థము నిట్లు భగవంతులే ఉద్ధవునకుపదేశించిరి.

> తస్మాత్త్వముద్ధవోత్సృజ్య బోధనాం ప్రతిబోధనాం।
> ప్రవృత్తించనివృత్తించ శ్రోతవ్యంశ్రుతమేవచ।
> మామేకమేవశరణ మాత్మానం సర్వదేహినాం।
> యాహిసర్వాత్మభావేన మాయాస్వాహ్యకుతోభయః॥
> (శ్రీమద్భాగవతే స్కం 12 అ 15.)

దీనిని శంకరభాష్య మనుసరించుచున్నది కాన నీయుభయమతములలో సమానధర్మములు విశేషముగ నుండుటచే వానిని గమనించుట మనకుఁ గర్తవ్యము, శ్రేయస్కరము.

వావిలాల వెంకటశివావధాని.

# మోక్షమార్గ ప్రదీపిక.

(34-వ పుట శేషము).

" పంది బురదమెచ్చు పన్నీరుమెచ్చునా"

మఱియు క్రైస్తుదేవుడు సయితము ముత్యములను వరాహముల కిడవలదని బోధించిరి.

ఇట్లనధికారులకు విపరీతభావనచేఁ జెడుగు గలుగునని తెలిసియే మహాత్ములు పరావిద్యను గుప్తముగ నుంచుకొని యోగ్యత గలవారికే యుపదేశించుచుండిరి గాని ఓర్వలేమిచే గాదు.

ఎట్టివా రుపదేశార్హులైనది ఉపనిషత్తులలో స్పష్టముగా దెల్పఁబడియున్నది.

యముఁడు నచికేతసుని గఠినముగ బరీక్షించి వాని యోగ్యతను దెలిసికొనిన పిదపనే ఆత్మవిద్య నుపదేశించెనని కఠోపనిషత్తునందుఁ దెల్పబడియున్నది. నచికేతసుఁడు ఆత్మజ్ఞానము నుపదేశము చేయమని కోరగా అదివద్దు మరియెట్టి వరమడిగిన నిచ్చెదనని యముడు పల్కెను.

పుత్రపౌత్రులు, మహదైశ్వర్యము, మండలాధిపత్యము, విత్తము, చిరజీవిత్వము, మరియు,

యేయే కామాదుర్లభా మర్త్యలోకే సర్వాన్ కామాన్
శ్ఛందతః ప్రార్థయస్వ। ఇమారామాస్సరథాస్సతూర్యా
నహీదృశాలంభనీయామనుష్యైః.........

(కఠవల్లి I 25-2).

మర్త్యలోకమునందు బొంద నలవిగాని కోరిక లన్నిటిని నీ యిష్టప్రకారము కోరుము. మనుష్యులచే బొంద నలవిగాని రథతూర్యవాద్యములతో గూడుకొన్న ఈ యప్సర స్త్రీలను సయితము ఇచ్చెదనని యముఁడు చెప్పెను.

అందుకు నచికేతసుడు

శ్లో॥ శ్వోభావామర్త్యస్యయదన్తకైతత్
సర్వేన్ద్రియాణాంజరయంతితేజః
అపిసర్వంజీవితమల్పమేవ
తవైవవాహాస్తవనృత్యగీతే
నవిత్తేనతర్పణీయోమనుష్యో॥

(కఠవల్లి I. 26-2).

ఓ యముఁడా నీవు చెప్పిన నశ్వరములగు భోగములు మనుజుని సర్వేంద్రియముల తేజస్సును జీర్ణింప జేయునవియే కాని వేరొండు ఫలములేదు. ఆయుష్కాలము స్వల్పము. నృత్య గీతాదులు నాకు వలదు. నీకే యుండనిమ్ము. ధనమును బొంది తృప్తిజెందిన మనుజుడు లేనే లేడు.

అని యుత్తరమిచ్చి ఆత్మవిద్య వినా మరియొండే నొల్లనని పల్కెను.

అందుకు యముఁడు

సత్వంప్రియాన్ప్రియరూపాంశ్చకామాన్
అభిధ్యాయన్నచికేతోత్యస్రాక్షీః
నైతాంసృఙ్కాంవిత్తమయీమవాప్తో
యస్యాంమజ్జంతిబహవోమనుష్యాః
విద్యాభీప్సినంనచికేతసంమన్యే
నత్వాకామాబహవోలోలుపన్తః

(కఠవల్లి II 3-4).

ఓ నచికేతసుఁడా పుత్రపిత్తవనితాది ప్రియరూపములైన కామములను జక్కఁగ నాలోచించి వాని నతిక్రమించి యందఱు మునిఁగియుండు ధనరూపమగు సంసారమును బొందకపోతివి. నీవు (అవిద్యకు భిన్నమగు) విద్యను గోరువాడవు. బహుకోరికెల వినున్ లోపరచుకొనజాలక పోయెను.

అని పరీక్షించి నచికేతసుని పూర్ణవైరాగ్యమునకు మెచ్చి ఆత్మవిద్యోపదేశము చేసెను.

మఱియు ముండకోపనిషత్తునందు

పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద
మాయాన్నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం స
గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః......తస్మై

......ఉపసన్నాయ సమ్యక్ప్రశాన్తచిత్తాయ శమా
న్వితాయ......ప్రోవాచ తాంతత్త్వతో బ్రహ్మవిద్యాం
(ముండక II 12-13).

కామ్య నిషిద్ధకర్మఫలములగు లోకములను బరీక్షించి యిట్టి కర్మములవలన అకృతమైన బ్రహ్మవస్తువు లభ్యముకాదని యెఱిగి (వివేకము) నిర్వేదమును (వైరాగ్యము) బొంది ఆబ్రహ్మ జ్ఞానముకొఱకు (ముముక్షుత్వము) సమిధలు చేబట్టి (తీవ్రవైరాగ్యము) గురువునొద్దకు బోవలెను. అటు మిక్కిలి శాంతచిత్తుడును శమాన్వితుడైనట్టి (శమాదిసంపత్తి) యు దన్ను సమీపించి నట్టి వానికి గురువు బ్రహ్మవిద్యను యథార్థముగ నుపదేశించవలెను.

శ్రీశంకరాచార్యులవారు

మేధావీపురుషోవిద్వాన్ ఊహాపోహావిచక్షణః
అధికార్యాత్మవిద్యాయాముక్తలక్షణలక్షితః
వివేకినోవిరక్తస్య శమాది గుణశాలినః
ముముక్షోరేవహిబ్రహ్మజిజ్ఞాసా యోగ్యతామతా॥

మేధావంతుడును విద్వాంసుడును ఊహాపోహ సమర్థుడును వివేకవైరాగ్య శమాది సంపత్తి ముముక్షుత్వము గలవాడే బ్రహ్మజిజ్ఞాసకు యోగ్యుడని సెలవిచ్చియున్నారు.

బలమైన యాసక్తి యుండవలెను.

మరియు "పరమగురు చరణసన్నిధి" యందు

"తలుపు తట్టువారికి" బోధించవలెను.

అని విధింపబడియున్నది. తలుపు తట్టువాడనగా వైరాగ్య వృత్తి నవలంబించి నివృత్తిమార్గమునందు ప్రవేశించి "నేను లోకహితార్థము జ్ఞానమును గోరెదను. తలుపు దెఱచి నన్ను లోపలికి రానిచ్చి జ్ఞానము నొసంగుము" అని సంకల్పించి తలుపు తట్టినంతనే దానిని దెఱచి పరమగురువులు తమసన్నిధికి వారిని రానిచ్చి సహాయము జేయుదురు.

ఇందువలన మనగ్రంథములలో ఎవడు వివేకాది నాలుగు సాధనములను సాధించుటకు బ్రయత్నించునో వానికే బ్రహ్మ విద్యాధికారము విధించబడియున్నదని తెలియవచ్చెడిని.

ప్రకృతమందు "వెనిషియన్" అను ముక్తవరీయుల యభిప్రాయము సయితమిదియే యని సూత్రముల ముందు వ్రాసిన పంచవాక్యములవలన స్పష్టమగుచున్నది.

ఈ వాక్యములలో సాధనచతుష్టయ సంపన్నులగు శిష్య వర్గమునకే గ్రంథముద్దేశించబడినదని ప్రథమ వాక్యమునందు విధించబడియున్నది. "శిష్యులకు" అని చెప్పినందున ముముక్షుత్వము విధించబడియున్నది. "ఎల్లరకు" అనుపదమువలన ప్రథమభాగములోని సూత్రములు ముక్తగురు సాక్షాత్కారము కాని ముముక్షువులకు సయితము బోధనీయములని యర్థము. అయితే శిష్యతారతమ్యము కొలది అర్థము గ్రాహ్యమగును. ఈ గ్రంథములోని సూత్రములకు అనేకార్థములున్నవని టీ॥ సుబ్బరావు స్వామి గారు నుడివిరట. ధర్మాధర్మముల నెఱిగి ధర్మాచరణ పరులై సత్కర్మలచే చిత్తశుద్ధి బొంది జ్ఞానప్రాప్తి గోరువారు కొందరు. భేదబుద్ధిని బోగొట్టుకొని సర్వజనహితమే తన హితమని యు లోకోద్ధరణముకై ఈశ్వరసంకల్ప ప్రకారమే నడువవల యు ననియు కోరువారు పై జెప్పిన వారికంటె నుత్కృష్టులు. ఇట్లు అధికారిభేదము ననుసరించి బోధలు గ్రాహ్యమగును. పై

మెట్టుననుండు వారికి క్రింద నుండు వారికంటె రహస్యార్థములు విశేషముగా గోచరమగును.

"పరమగురు చరణసన్నిధి" యను గ్రంథమంతయు సాధన చతుష్టయములనుగురించి సులభమగు మాటలతో అనుష్ఠాన ప్రవర్తనకు సౌకర్యముగ వ్రాయబడి యున్నది. దానిని ముఖ్యముగ జదివి తదను ప్రవర్తనకు యత్నించవలెను. ఇచ్చట ఆవిషయము గూఢార్థముతో నయిదు వాక్యములు వ్రాయబడి యున్నవి. అందు మొదటిది పైన గనుపర్చబడెను.

ఇక రెండవ వాక్యము.

"కన్నులు చూడ గల్గుటకుమున్న బాష్పవారి విడుచుటకసమర్థములు కావలయును."

ఈ వాక్యమునకు విపరీతార్థమును జేసి ముముక్షువత్యంత కఠిన హృదయుడు గావలెనని విధించునట్లు భావింపవచ్చును. "కంటినీటిచుక్క రానియ్యక యెవడెంత కష్టపడినను ఎంత దుఃఖము పాలైనను వాని గతి విచారించ కూడదు. సహాయము జేయకూడదు. అట్లు సహాయము జేసినయెడల వాని కర్మము వాడనుభవించవలసినట్లు భగవంతుడు విధించియుండ మనము సహాయము చేసి భగవదాజ్ఞనుల్లంఘించినట్లగును. వాని కష్టము వానిది, మనము జోక్యము పుచ్చుకొనకూడదు". అని వాదించవచ్చును. ఇయ్యది యసురపక్ష వాదము. అసురులు పరుషగుణములు కలవారనియు, ఉగ్రకర్మలు సేయువారనియు, కేవలము స్వార్థమునే జింతించు కామ భోగపరులనియు, పరులను హింసించి ద్వేషించువారనియు, భగవద్గీత 16 అధ్యాయమందు నుడువబడి యున్నది. ఇట్టి గుణములు గలవారు అల్పబుద్ధులనియు నష్టాత్ములనియు జగత్తుకు శత్రువులనియు వారు నరకప్రాప్తులగుదురనియు చిరకాల మసుర యోనులందే జన్మించెదరనియు గీతయందు జెప్పబడి యున్నది.

దంభోదర్పోభిమానశ్చక్రోధః పారుష్యమేవచ

అజ్ఞానంచాభిజాతస్యపార్థసమ్పదమాసురీమ్
.........నష్టాత్మానోల్పబుద్ధయః
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయజగతోహితాః।
కామోపభోగపరమాః।.........
ప్రసక్తాఃకామభోగేషు పతన్తినరకేశుచౌ।
అసౌమయాహతశ్శత్రుర్హనిష్యేచాపరానపి।
అహంకారంబలందర్పం కామంక్రోధంచసంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోభ్యసూయకాః।
తానహంద్విషతఃక్రూరాన్ సంసారేషునరాధమాన్॥

(భ.గీ. 16 అ 4. 9. 11. 14. 16. 18. 19.)

ముముక్షువులు నరకప్రాప్తికి బాటుపడువారు కారు. ఈశ్వర గుణములను సంపాదించి ఈశ్వరునిసన్నిధి జెంద గోరువారు. అన్నిమతములందును ఈశ్వరుడు కరుణారససముద్రుడనియు, అపారభూతదయోపేతుడనియు, ప్రేమానుకంపభరితుడనియు, సంసార సముద్రమున మునిగి శ్రమపడుచుండు జీవులయందు బూర్ణానురాగముచే నుద్ధరింపజేయువాడనియు నొక్క చెప్పబడియున్నది.

"తేషామహంసముద్ధర్తామృత్యుసంసారసాగరాత్"

భ. గీ. 12

"సంసారపంకనిర్మగ్న సముద్ధరణపండితా"

(లలితాసహస్రనామము.)

అట్టి భగవంతుని జెందవలెనన్న, సత్యార్జవ అహింసా భూతదయ శమాది ఆత్మగుణములే సోపానమార్గములు గాని పారుష్యద్వేషాది యనాత్మగుణము లెంతమాత్రము కావు. పరశ్రమనివారణము భగవదాజ్ఞోల్లంఘనమని భావించుట తెలివిలేని మాటకాని వేరు కాదని సత్యముగా జెప్పవచ్చును. పరోపకృతి కైవల్యముకంటె నుత్కృష్టమైనదనియు,

పరోపకృతికైవల్యే తులయిత్వాజగద్గురుః।
గుర్వీముపకృతిం మత్వా అవతారాదశాగ్రహీత్।
భగవంతుడు లోకహితార్థమే పనిచేయుచున్నాడనియు,
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వామాం శాంతిమృచ్ఛతి।
(భ. గీ. 5 అ)

పరోపకారమే పుణ్యమనియు,
శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః।
పరోపకారః పుణ్యాయ పాపాయపరపీడనం॥

ఈశ్వరాజ్ఞాపరివర్తకులగు ఋషులు పరశ్రమనివారణమే స్వభావముగా గలవారనియు,

అయం స్వభావః యత్పరశ్రమాపనోద ప్రవణం మహాత్మనాం।

ఇట్లని గ్రంథములు ఘోషించుచున్నవి.

మఱియు భగవద్గీతయందు.
ఆత్మౌపమ్యేన సర్వత్ర సమంపశ్యతియోర్జున।
సుఖంవాయదివాదుఃఖం సయోగీపరమోమతః॥

అని చెప్పబడియున్నది.

పరమయోగి తన సుఖదుఃఖములవలెనే యితరుల సుఖదుఃఖములను గూడ జూచును. తాను దుఃఖించునపుడు ఇతరుల సహాయ మవశ్యకమని తన కెట్లుదోచునో అటులనే యితరులు దుఃఖించునపుడు తాను సహాయము చేయవలెనని తెలిసి తప్పక కష్ట నివర్తికి దోడ్పాటగును.

ఈశ్వరాజ్ఞ యట్లుండ ఇతరుల శ్రమ నివారించిన నతనికర్మఫలభోగమునకు భంగము గలుగ జేసి నట్లగునని తలంచుట సరికాదు. మనము చూచిన మనుజుడు కష్టపడుచుండుట వానిపూర్వదుష్కర్మఫలము, ఆసంకటమును నివర్తింపజేయు సహాయప్రాప్తికి కారణమగు సత్కర్మసయితము వాడు పూర్వముచేసియుండవ

చ్చును. ఆసత్కర్మయొక్క మంచిఫలము నొసంగు పుణ్యము ఈశ్వర ప్రేరితమై మనకు గల్గినదని తలచి ఈశ్వరస్వభావమైన పరోపకారము తత్క్షణము జేయవలయునే కాని తామసింపకూడదు. ఆలస్యము జేసినయెడల మనయందు దాగియుండిన దుర్బుద్ధి బయటికివచ్చి తొలుత బూనికొనిన పరోపకారచింతను బోగొట్టునేమో? మరియెన్ని విఘ్నములు వచ్చునో?

క్షణంచిత్తం క్షణంవిత్తం క్షణంజీవితమావయోః
యమస్యకరుణానాస్తి తస్మాత్ జాగ్రిత జాగ్రిత।

శుభకార్య ఘటనమునందు దామసము గూడదు. కనుక ముక్తవరీయుల రెండవ వాక్యము కాఠిన్యమును బోధించునదియెంత మాత్రము కాదు. ఇకను వాక్యముయొక్క యథార్థతాత్పర్యము నాలోచింతము.

ఈ గ్రంథమునందలి సూత్రవాక్యముల కనేకార్థములు అధికారభేదము ననుసరించి స్ఫురించునని యిదివరకే వ్రాయబడెను.

రెండవ వాక్యముయొక్క సాధారణార్థమేమన:—తన కెంతటిదుఃఖము సంభవించినను వ్యసనముచెందకూడదు. కంటనీరు బెట్టుట వ్యసనముయొక్క బాహ్యచిహ్నము. ఇట్లుదుఃఖము ప్రాప్తియగునప్పుడు చలించక సమీపించుటయే తితీక్షయనిపేరు.

సహనంసర్వదుఃఖానాం అప్రతీకారపూర్వకం।
చింతావిలాపరహితం సా తితీక్షా నిగద్యతే॥

సర్వదుఃఖములను చింతింపక విలపింపక వానిని గలుగజేసినవానికి ప్రత్యపకారము జేయదలచక సహించుటయే తితీక్ష.

అని వివేక చూడామణియందును,

సాధవేష్వపిసర్వేషు తితీక్షోత్తమసాధనం
యత్రవిఘ్నాఃపలాయన్తే దైవికాఅపిభౌతికాః।

అన్నిసాధనములలో తితీక్షఉత్తమ సాధనము. దాని

వలన ఆధ్యాత్మికాధి భౌతిక సర్వవిఘ్నములు ఫలాయనము లగుచున్నవి.

అని సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహమునందును జెప్పబడియున్నది.

దుఃఖేష్వనుద్విగ్నమనాః........స్థితధీర్మునిరుచ్యతే॥

దుఃఖముచే క్షోభము జెందని మనస్సు గలవాడు స్థితప్రజ్ఞుడని భగవద్గీతయందు వక్కాణింపబడి యున్నది.

పూర్వ మనేక జన్మములయందు జేసిన దుష్కర్మఫలము రోగాది యాధ్యాత్మిక, వ్యాఘ్రపీడాది యాధిభౌతిక, అగ్న్యాది యాధి దైవిక దుఃఖరూపముగా మనకు బ్రాప్తమగును. మనము చేసిన కర్మఫలము మన మనుభవించక తీరదు. అది ఋణమువంటిది. నిశ్శేషముగ దీర్చవలయు. ఈ ఋణమును గొప్పమూటను మన నెత్తిపై నుంచుకొని యుండువరకు మహాగురువుల పవిత్రమగు అభయహస్తము మన శిరస్సుపైన నుంచబడుట కవకాశము లేదు. సాధారణ మనుజునికి బూర్వజన్మకృత పాపములో గొంతభాగము ప్రారబ్ధరూపమున నీజన్మమందు బ్రాప్తించి భోగముచే క్షయించును. ముముక్షువుకు నింకయు హెచ్చుగా గష్టములు కలుగును. ముముక్షువు వైరాగ్యవృత్తి బూని లోక దుఃఖనివృత్తి సాధనమగు జ్ఞానమును సంపాదించుటకు సర్వప్రయత్నములు చేయు వాడు. దుష్కర్మ బలముగా శేషించిన యెడల వాని ప్రయత్నములకు బెక్కు అంతరాయములు కలిగి సఫలములు కానేరకపోవును. వానికి లక్ష్యస్థానమందు బూర్ణ గమనముండుటవలన దన కార్యమునకు విఘ్నములు కలుగజేయునట్టియు, తాననుభవించక దీరనివియు నగు పురాకృత కర్మమును శీఘ్రముగ దెంచి వేయవలెనని దృఢముగ సంకల్పించును. ఆసంకల్పబలముచే సాధారణ మనుష్యునికి బ్రాప్తించు ప్రారబ్ధకర్మమే కాక సంచితకర్మలో గొంతభాగము సయితము భోగ్యమున

కు బక్వమై తటస్థించును. అతని వైరాగ్యమెంత తీవ్రముగనుండునో అంత యెక్కుడుగ సంచితకర్మ అనుభవమునకు బ్రాప్తించును. ఒక యుదాహరణముచే దీనిని సులభముగ గ్రహించవచ్చును. పదివేలరూప్యములు ఋణముండినయెడల సాధారణ మనుష్యుడు నూరు రూపాయలవంతున నూరువాయిదాలుగా జెల్లించును. ముముక్షువు వెయ్యిరూప్యములవంతున పదివాయిదాలలోనే ఋణమునుదీర్చి యాంబాధను దొలగించుకొనుటకు బూనుకొనును. కనుక సన్మార్గప్రవర్తమునందు గష్టము లెక్కుడుగ సంభవించునను లోకోక్తి సహేతుకముగనున్నది. మనము చేసిన కర్మను మన మనుభవించవలసియే యుండును గనుగ సంతోషముతో ననుభవించ వలెనని వివేకముతో దెలిసికొనవలయును. చింతించుట నిష్ప్రయోజనము. ఎవరిమూలమున మనకీజన్మమందు దుఃఖము సంప్రాప్తమాయెనో వాడు మన పూర్వకర్మను మనచేత దీర్పించి మనల మోక్షమార్గమందొక మెట్టెక్కించెనని తలంచి వానియందు గృతజ్ఞత కలిగి సన్మానించవలెను. అట్లు భావించక మనకు నిడుములు ప్రాప్తింపజేసెనని వానిపైనలిగి వానికి బ్రత్యపకార మొనర్పదలచిన బురాకృతకర్మానుభవమునందు గ్రొత్తగా రాబోవు జన్మకొక కర్మము జేసినట్టగును. మనముచేసిన ఋణమును నడుగవచ్చిన వానిని దిట్టి కొట్టి హింసించిన యెడల తొలుతజేసిన యప్పు దీర్చుటయేకాక క్రొత్తగా జేసిన హింసాదులకు బ్రత్యేకశిక్ష ననుభవించ వలసి యుండును గదా.

(సశేషము).

జి. శంకరరావు.

# అరిషడ్వర్గములు.

## లోభము.

సాధారణముగా ప్రతిమనుజుని యందు నుండెడు మూడవ చెడు గుణము లోభము. ఇది ధనికులయం దెక్కువగానుండును. సామాన్యులయందు కొంచముగానుండును. బీదలయందుండు టకవకాశము గలుగదు. లోభము ఒక తల్లిగర్భమునందు జన్మించినబిడ్డల నైకమత్యమును పాడుచేసి వారిని వేరుచేయుచున్నది. ఒండొరులకు శతృత్వమును గలుగజేయుచున్నది. భగవంతుని యందు భక్తిలేకుండ జేయుచున్నది. శరీరపోషణమును జక్కగా జేయనిచ్చుట లేదు. దానధర్మములు జేయనిచ్చుట లేదు. మనుజునకు నిన్ని కీడులనొనరించి సంతృప్తినొందక వానిని పునర్జన్మములపాలుచేసి చివరకు నరకకూపములో పడునట్లు చేయుచున్నది.

లోభమనగా ధనమును సద్వినియోగము జేయకుండుట. ధన మెక్కడనుండి వచ్చినది. మనమార్జించినదే కదా! మన మార్జించినదానిని మనము సద్వినియోగము జేయక యితరులకొరకు దాచిపెట్టి వారిచేత నేల దుర్వినియోగము చేయించవలెను. జీవుడు స్థూలశరీరమును దాల్చి లోకములోకి వచ్చునపుడు తనతోకూడ నేమైన ధనము తీసుకొనివచ్చెనా? శరీరమును వదలిపోవునపుడేమైన తీసుకొని పోవునా? ఏమియు లేదుగదా. కావున మనమార్జించిన ధనమును దానధర్మములు చేయక దాచిపెట్టినందువలన లాభమేమి? మన మీజన్మములో నితరులకు నెంత ఇచ్చెదమో అంతయె మనకు ముందుజన్మమందువచ్చును గదా. ఒకచేతితో సంపాదించునపుడు మరియొకచేతితో ఖర్చుచేసినయెడల నెంతయు నిలిచియుండును. ధనమును సద్వినియోగము జేయవలయును. మనము మరుసటిదినమునకై ధనమును దాచిపెట్టుచున్నాముగదా. ఆదినమందు రాంబోవు సం-

గతిని మనము జెప్పగలమా? మనలను మనమే కాపాడుకొను చున్నామా? లేక భగవంతుడు సంరక్షించుచున్నాడా? రాతియందుంతు మండూకమును నేసుహేనుభావుడు కాపాడు చున్నాడో ఆయన మనలనుగూడ సంరక్షింపడా? ధనముమీద నుండు ప్రేమచే సోదరులను గూడ విడనాడుచున్నాము. దాని వలన పాపము సంభవించుటలేదా? ఇతరులచేత దూషింపబడు టలేదా? మనమితరులకు నెంతనిచ్చెదమో నంతయె మనకు తిర్గిగివచ్చును. మనము శరీరమును వదలి పోవునపుడు మనము చేసిన పుణ్యపాపములు వెంటవచ్చును గాని ధనము వెంటరాదు. లోభమును జయింపవలయు ననిన ధనమును సద్వినియోగము జేయవలయును.

## మోహము.

మనుజునియొక్క బుద్ధిని నశింపజేసి చెడుమార్గములో ప్ర వర్తింజేయు నాలుగవ గుణము మోహము. ప్రపంచమంతయు మోహముచే నిండియున్నది. మోహ ముండుటవలన తనవారలు నితరులు ననుభ్రాంతి మనుజులకు గలుగుచున్నది. ఈ మోహము సంసారమందలి యజమానునియందు మిక్కుటముగా వసించియుం డును. మోహమువలన సంతోషమును విచారమును కలుగుచు న్నవి. అతిమోహము మనుజుని నశింపజేయుచున్నది. మోహ మనగా సాధారణముగా వాడబడు ప్రేమ యని యర్థము. ప్రేమయన భార్యా పుత్రాదులయందు మమత్వము గలిగి వారలకు సుఖము సంభవించునపుడు సంతోషమును దుఃఖము సంప్రాప్త మైనప్పుడు విచారమును పొందుట. ఇదియె మోహ ము. ఎచ్చోట మోహము వసించునో యాస్థలమందు కష్ట ములు దుఃఖములు నెక్కువగా నుండును.

భార్యా పుత్రాదులయం దెక్కువ మమకారములేకుండు టచే యీమోహమును జయింపవచ్చును. వారలు ఇంత సౌఖ్య

మును గలుగజేయుచుండ వారియందు మోహము లేకుండుటెట్లు యిన సంసారములో మనుజునకు నెంత సౌఖ్యము గలదో యంత యధికముగా కష్టములు కూడ గలవు. ఇది యెల్లరకును విశదమైన సంగతియె. అందుచే వారల విడనాడవలయుననికాదు. అధికముగా ప్రేమింపవలయును. అయితే యాప్రేమ శరీరమునకు సంబంధించినదిగా నుండగూడదు. ఆత్మకు సంబంధించినదిగా నుండవలెను. శరీరము కొంచము స్వస్థతగా లేనియెడల విచారపడ గూడదు. శరీరము పోయినయెడల ప్రపంచమే లేదని యెంచరాదు. ప్రపంచమందు పరోపకార మొనర్చుటకుగాను మన కీశరీరము కారణగురువులచే నొసంగబడినది. భార్యాపుత్రుల యందెంత ప్రేమగలదో ప్రపంచములో నుండెడు ప్రతిమనుజుని యందును అంతప్రేమ యుండవలయును. అప్పుడు మోహ మచ్చోట వసింపజాలదు. మోహమును త్యజించుటకు మార్గమిదియె. మోహాంధకారమగు యజ్ఞానములోపడి చచ్చుచు పుట్టుచు ననేక యోనులయం దుద్భవించుటకంటె మోహమును తొలగించి జ్ఞానమనే దీపపువెలుగున పరమాత్ముని చేరుటకు మనము ప్రయత్నింపవలయు. మనుజున కేపనియు కష్టతరము గాదు. శ్రద్ధతో జేసినయెడల నేకార్యమైన నొనరింపగలడు.

## మదము.

మదమును గురించి మనము విచారింప వలసియున్నది, ఇది శత్రువులలో నైదవది. ఇది యొకటియె మనుజునియందు ప్రబలి యుండినయెడల వానిని నశింపజేయుటకు నితరశత్రువులతో పనిలేదు. దీనికంత మహిమగలదు. దీనికి మిత్రులు అహంకారము, డంబము. ఈమూడును ఎప్పుడును కలిసియుండును. ఒక దానిని విడిచి మరియొకటి యుండజాలదు. వీనికినుండు ఐకమత్యము మనుజులయందుగూడ గానము.

మదము సాధారణముగా నడవిజంతులయందు విశేషము

గాగలదు. అందు మొదటిది యేనుగు. అంతమదము మనుజులయం
దు గూడగలదు. కాబట్టి అటువంటివారు గజముతో సమానము.
ఈకారణముచేతనే వేమనయోగి "యేనుగు తిన్నవాడెంత
సుజ్ఞానియో" యని వచించియున్నాడు. అనగా ఏనుగును
చంపితినుట కాదు. మరేమి యనిన మనుజునియందు ఏనుగునం
దుండు మదమువలె నున్నమదమును నణచినవాడు సుజ్ఞానియని
యర్థము.

మదముండుటవలన తనకంటె నెక్కువ బలవంతుడు లే
డని తలచి మనుజుడు ఇతరులను లక్ష్యముచేయడు. పూర్వమం
దు హిరణ్యకశిపుడు, నరకాసురుడు, జరాసంధుడు మొదలయిన
రాక్షసులను నణచివేసినది యీమదమేగదా! కుమారుడగు ప్ర
హ్లాదుడు ఎన్నినీతులు బోధించినను హిరణ్యకశిపుడు చె
డచెవిని బెట్టెను గాని మదము నణచివేయ గలిగెనా. మదము
కండ్లకు కప్పినపుడు భూమ్యాకాశములు దెలియవు. "నేను"
అను అహంకారము ప్రబలమగును. అహంకారమువలన డంబ
ము హెచ్చును. అందువలన నశించును. సరుగుచెట్టు ఇతర వృక్ష
ములకంటె నెక్కువగా పెరిగి మనుజులకు నీడ నైనను నివ్వక
తానే యందరికంటె గొప్పవృక్షమని గర్వపడు సమయమందు
పెద్దసుడిగాలివచ్చి దానిని వేరులతోసహా భూమిమీద పడవేయు
చున్నది గదా. ఈగతియె మదముగల ప్రతిమానవునకును కొల
ది కాలములోనే తప్పక సంభవించును. కాబట్టి మనము మదము
ను తొలిగించు నుపాయమును కనుగొనవలయును. మనమనగా నె
వరు, ఎక్కడనుండి వచ్చితిమి, ఎందునిమిత్తము వచ్చితిమి, ఎక్క
డికి పోయెదము ఈసంగతులను చక్కగావిచారించిన యెడల మ
దము తొలగిపోవును, కర్త ఈశ్వరు డుండ, ఆయనచే ప్రతిపని
యు చేయబడుచుండ, ఆయన భృత్యులము మనమైయుండ మన
కు అహంకారమేల? చెట్టును కొట్టు మనుజుడుండ, కొట్టబడు

వృక్షముండ, మధ్యనుండు గొడ్డలికి అహంకారమేలని దానికి అహంకారములేదుగదా, మనము కూడ నొకగొడ్డలియె, కాబట్టి మనకు మదమేల? ఊహింపుడు. ప్రతివిషయమును తెలుసుకొనుట కతిసూక్ష్మముగానుండును, తిరిగి యాచరింపలేక యున్నారము. ఎంత చిత్రము! భగవంతుని మహిమను ఏమనికొని యాడగలను.

## మాత్సర్యము.

మాత్సర్యము మనుజులను నశింపజేయు శత్రువులలోఁ చివరది. మాత్సర్యమన నీర్ష్య. మనుజులను నశింపజేయుట కిది యొకటియె జాలును. ఈ యోర్వలేని తనమున కవకాశము చిక్కినయెడల అది మనుజునియందు పాతుకొని యెంత ప్రయత్నము చేసినను తిరిగి వానిని సులభముగా విడిచి పోజాలదు, ఏగుణమైనను అలవడుట కష్టముగాని అలవాటు పడిన దానిని విడుచుట యతిదుర్లభము. ఈమాత్సర్యముచేతనే పూర్వమందనేక రాజులు ఒకరితోనొకరు సంగ్రామమొనరించి తమ దారాపుత్రములను, రాజ్యములను, బంధువులను, సైన్యమును పోగొట్టుకొని చివరకు వనము పాలైరి. దుర్యోధనుడు పాండవులయందలి మాత్సర్యముచేత వారిని నడవులపాలు జేసి బహుకష్టముల నొందించి చివరకు సంగ్రామములో వారిచే మడిసెను.

ప్రథమమం దీ యీర్ష్య మనుజులకు గొప్పదశను తేసుకొని వచ్చినను చివరకువానిని నాశనము జేసి సంతసించి మరి పోవును, ఒకనియందు మనకీ మాత్సర్య మేల కలుగవలయును, ఇతరులు గొప్పదశయందుండ వారిని జూచి సంతసించుటకు మారుగా వారిని జూచి యేల యోర్వలేని తనమును అవలంబింప వలయును? ఇతరులకు ధనమును మనము గణించి ఇచ్చితిమా? మన సొమ్ము పెట్టుమని వారు మనదగ్గరకు వచ్చి

ప్రాప్తేయపడిరా? వారు తమంతట తాము కష్టపడి యార్జించి సుఖించుచుండ మనమేల వారిని జూచి మాత్సర్యమును పొంద వలయును, తనకు లేదని యేడ్చినయెడల నొకకన్ను పోవును. ఇతరులకు ఉన్నదని విచారపడినయెడల మరియొక నేత్రము పోవును. చివరకంధుడగును. ఇతరులను జూచి సంతసించి వారివలె మనముండుటకు బ్రయత్నింప వలయునా లేక వానిని జూచి మాత్సర్యమును పొందవలయునా? ఈమాత్సర్యము సోద రులలో నెక్కువగానున్నది. పెద్దవాడెక్కువ దశయందుండుట ను జూచి చిన్నవాడోర్వజాలడు. ఒక కుటుంబములోనే యీప్రకార ముండిన ప్రపంచములో నంతయును ఎంతో అధి కముగ నుండునని వేరే చెప్పవలయునా? ఒక కుటుంబ ములో నైకమత్యము లేనియెడల ప్రపంచమను నీగొప్పకుటుంబ ములో మనమందరమును నొకరితో నొకరు సఖ్యతగానుండు టెట్లు? మన మందరమును నీశ్వరుని యంశములమై యుండ ఒకరి యందొకరికి నీర్ష్య యేల కలుగవలయును.

ఈ మాత్సర్యమును విడనాడు నుపాయము ఇతరులను జూచి సంతసించుటయె

ముదునూరు శ్రీరంగయ్య.

---:o:---

శ్లో॥ జీర్యంతే జీర్యతః కేశాః। దంతాజీర్యంతిజీర్యతః॥
చక్షుశ్శ్రోత్రేచజీర్యంతే। తృష్ణైకానిరుపద్రవా॥

కం॥ వ్యాప్తిం జెందకవగవక
ప్రాప్తంబగులేశమైనఁ బదివేలనుచుణ్।
దృప్తిం జెందనిమనుజుడు
సప్తద్వీపములయందుఁ జక్కంబడునే॥

-:o:-

# Divyagnanadeepika.

CONTENTS OF THIS NUMBER.



—:0:—



—:0:—

**Registered No. M. 716.**

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కుడు ధర్మము లేదు).

సంపుటము 7. **June 1916.** సంచిక 3.

జూన్ నెల **1916.**

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

**June 1916.**

సంపుటము 7. జూన్ నెల 1916. సంచిక 3.

## కాలదేశ వర్తమానములు.

ఏప్రిల్ నెలలో కాంచీపురమున 'వర్ణాశ్రమ పోషణసభ' యను పేరుతో నొక గొప్ప సభ జేరెను. పండితులును వైదిక శిరోమణులును ననేకులు నానాస్థలములనుండి యాసభకు విజయము చేసిరి. సనాతనములగు వర్ణాశ్రమ ధర్మముల దృఢముగఁ బోషించవలయు నని యేకకంఠ్యముగ నాసభవారు తీర్మానించిరి. వర్ణసంకరము ప్రబలుచున్న యికాలమున నట్టి సభలును తీర్మానములును మిక్కిలి యావశ్యములనుటకు సందేహము లేదు.

అయినను ఆ సభలో వర్ణాశ్రమ ధర్మము లెవ్వియను నంశము విచారించినట్లుగాని తీర్మానించినట్లు గాని యగుపడలేదు. అది ముఖ్యముగ విచారించఁ దగిన విషయమైయున్నది. ధర్మమును గుర్తెఱిగినపుడు గదా యనుష్ఠించుటకు సాధ్యమగును. కావున వానింగొంత విచారింతము. వర్ణధర్మములు వేఱు

ఆశ్రమధర్మములు వేఱు. వర్ణధర్మముల మొదట విచారింతము.

గుణభేదముం బట్టియు కర్మభేదముం బట్టియు వర్ణవిభాగ మేర్పడినది.

శ్లో॥ చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః॥
(భ. గీ. 4 వ అ.)

గుణ కర్మ విభాగమువలన చాతుర్వర్ణ్యముల సృజించితినని భగవంతుఁడానతిచ్చె. ప్రకృతి గుణములు మూఁడు, సత్వము రజస్సు తమస్సునని. తమో గుణముగలవారు శూద్రులు. రజో గుణము గలవారు వైశ్యులు, సత్వగుణము గలవారు క్షత్రియులు, త్రిగుణాతీతులగువారు బ్రాహ్మణులు అని యర్థము. ఇఁక ఆత్మ గుణముల నాలోచింతము.

శ్లో॥ అహింసా సత్య మస్తేయ మకామక్రోధలోభతా।
భూతప్రియహితేహాచ ధర్మోయంసార్వవర్ణికః॥ (మను)

అహింస, సత్యము, దొంగతనములేకుండుట, కామ క్రోధలోభములు లేకుండుట, సర్వభూతములకు హితమాచరించ వలయునను కోరిక, ఈ గుణములు సర్వవర్ణముల వారికి సామాన్యములు. అనఁగా నీ గుణములు లేనివారు బ్రాహ్మణాది నాలుగు వర్ణములలో దేనికిం జేరినవారు గారు.

ఇఁక నగ్రజాతివారగు బ్రాహ్మణుల గుణములెవ్వి?

శ్లో॥ శమోదమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవమేవచ।
జ్ఞానంవిజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజం॥
(భ. గీ. 18—42)

తా॥ అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, శౌచము, క్షమ, నిష్కాపట్యము, శాస్త్రజ్ఞానము, అనుభవజ్ఞానము, ఆస్తిక్యము, ఇవి బ్రాహ్మణులకు స్వభావజన్యమైన గుణములు.

ఈగుణములలో నేదిలేకున్నను వాఁడు బ్రాహ్మణుఁడు

కాఁడు. ఎవనియందు కామము క్రోధము మొదలగునవి యున్నవో, ఎవఁడు శాస్త్రముంజదివి యర్థము గ్రహించఁడో, ఎవఁడు గ్రహించిన విషయములు ననుభవమునకు దెచ్చుకొనఁడో వాఁడు బ్రాహ్మణుఁడు కాఁడు.

ఇఁక బ్రాహ్మణ కర్మములెవ్వి?

శ్లో॥ అధ్యాపనంచాధ్యయనం యజనంయాజనంతథా।
దానంప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్॥
(మనుధర్మశాస్త్రము.)

తా॥ వేదశాస్త్రముల జదువుట, ఇతరులకుఁజెప్పుట, యజ్ఞముచేయుట, ఇతరులచే యజ్ఞము చేయించుట, దానమిచ్చుట, పుచ్చుకొనుట, అనియెడు షట్కర్మములు బ్రాహ్మణులకు నియమించఁబడినవి.

ఏ బ్రాహ్మణుడు పైఁజెప్పఁబడిన ఆఱుకార్యములఁజేయఁడో వాఁడు స్వవర్ణధర్మముం దప్పినవాఁడయ్యె. ఇదియునుగాక బ్రాహ్మణునికి జీవనోపాయ వృత్తుల విధించుటయందు "నశ్వవృత్త్యాకదాచన". అని మనుస్మృతియందు చెప్పఁబడియున్నది. 'శ్వవృత్తి' కూడదు. శ్వవృత్తి యనఁగా కుక్క చేయు పని యని యర్థము. సేవకావృత్తియని తాత్పర్యము.

సేవకావృత్తి బ్రాహ్మణునికి సర్వాత్మనా నిషేధింపఁబడియుండుటఁజేత దొరతనపువారి క్రిందను, జమీందార్ల యొద్దను, రెయిల్వేకంపెని మున్నగువారి యధికారములోను, నౌకర్లుగానుండు బ్రాహ్మణులందఱు స్వధర్మమును పరిత్యజించి నిషిద్ధవృత్తి నవలంబించిన వారైరి.

న్యాయాధిపతులు (Judges) గాను, దండనాధికారులు (Magistrates)గాను, న్యాయవాదులు (Pleaders)గాను, పోలీసు ఉద్యోగస్థులుగానున్న బ్రాహ్మణులందరు స్వధర్మమువదలి క్షత్రియ ధర్మములఁ జేయుచున్నవారు. ప్రజాపరిపాలనమునకుఁ

జేసిన యధికారము లన్నియు క్షత్రియవర్ణమున కుచితములైనవి. పాఠశాలలలో నుపాధ్యాయులుగా నుండువారు తప్ప దొరతనము వారి చేతిక్రింద నుద్యోగములు చేయుచున్న వారందఱు స్వధర్మమును విడిచినవారేను. పైన జెప్పిన యజనాది షట్కర్మములు వినా యేకార్యము జేయుచున్న వారైనను బ్రాహ్మణధర్మమును వదలిన వారేను. అట్టి వారు వర్ణాశ్రమ పోషణ సభకు నర్హులుగారు.

బ్రాహ్మణుఁడు అరుణోదయ కాలమున నిద్రలేచి స్నానము చేసి సూర్యోదయాత్పూర్వము సంధ్యావందనము చేయవలయు. మరల పగలుపండ్రెండు ఘంటలకు మాధ్యాహ్నికమును, సూర్యాస్తమాన సమయమున మరల సంధ్యావందనము నాచరించవలయును. ఇవ్విధంబున ప్రతిదినము త్రికాలములందు ననుష్ఠానము లేనివాఁడు బ్రాహ్మణుఁడు గాఁడు.

మధ్యాహ్నమున భోజన సమయము వఱకు స్నానము చేయకుండు వాఁడు బ్రాహ్మణ ధర్మమును బోషించువాడేనా? స్నానము లేకను సంధ్యావందనములేకను తెల్లవారి లేవగానే కాఫీ త్రాగుటయును, రొట్టెలు బిస్కతులు మొదలగునవి తినుటయు శాస్త్రవిహితములేనా? సోడావాటర్ త్రాగుట సదాచారమేనా? కల్లంగళ్లను సారాయి అంగళ్లను ఉంచుకొనుటకు లైసెన్సు పొందిన బ్రాహ్మణులను, బాహాటముగా శూద్రస్త్రీలనుంచుకొని యుండు బ్రాహ్మణులను, తప్పు పత్రములసృష్టించుట తప్పుసాక్ష్య మిచ్చుట సహజవృత్తిగా నుంచుకొనియుండు బ్రాహ్మణులను, వర్ణాశ్రమ పోషణసభవారు ఏమిజేయఁ దలచుకొన్నారు?

క్రయవిక్రయములు బ్రాహ్మణునకు నిషిద్ధకర్మములుగదా! తమపుత్రికల విక్రయించి శుల్కములు దీసికొను బ్రాహ్మణులును, ఇంగ్లీషు చదువుకొన్న పుత్రుల విక్రయించి వరదక్షిణలకు చెయి జాచు బ్రాహ్మణులును సదాచార సంపన్నులా?

అగ్రజాతివారు స్వధర్మములనింత చక్కగబోషించు చు న్నవారు. తక్కిన వర్ణములవారి సంగతి విచారించ వలయునా!

ఇఁక ఆశ్రిధర్మములఁ గొంత విచారింతము. బ్రహ్మచర్య ము ప్రథమాశ్రమము. ఆయుష్కాలమును నాలుఁగు భాగములు సేసి మొదటిభాగము బ్రహ్మచర్యమున గడుపవలయు. బ్రహ్మ చారి గురుకులవాసము చేయుచున్నవాఁడై తన వేదమును సాం గముగ జదువవలయు. దానితోఁగూడ మూఁడు వేదములుగాని రెండు వేదములుగాని కడకు ఒక వేదమునైన చదువవలయు.

అపుడు

శ్లో॥ నిత్యంస్నాత్వాశుచిఃకుర్యా ద్దేవర్షిపితృతర్పణమ్।
దేవతాభ్యర్చనంచైవ సమిధాధాన మేవచ॥
వర్జయేత్ మధుమాంసంచ గంధంమాల్యంరసాఁస్త్రియః।
శుక్తానియానిసర్వాణి ప్రాణినాంచైవహింసనం॥
అభ్యంగమంజనంచాక్ష్ణో రుపానచ్ఛత్రధారణమ్।
కామంక్రోధంచలోభంచ నర్తనంగీతవాదనమ్॥
ద్యూతంచజనవాదంచ పరివాదంతథానృతమ్।
స్త్రీణాంచప్రేక్షణాలంభ ముపఘాతంపరస్యచ॥

(మనుధర్మశాస్త్రము)

తా॥ బ్రహ్మచారి అనుదినమును స్నానముచేసి శుచిర్భూ తుఁడై దేవర్షిపితృతర్పణములను దేవతా పూజనమును సమిధా ధానమును జేయవలయు. మద్యము, మాంసము, గంధము, పుష్ప ములు, తీపు, స్త్రీలు, పెరుగు, పాలు, నెయ్యి, మజ్జిగ, జీవ హింస, అభ్యంగనము, అంజనము, చెప్పులు, గొడుగు, కామ ము, క్రోధము, లోభము, ఆట, పాట, జూదము, పోరు, నిందిం చుట, అసత్యమాడుట, స్త్రీలను కామముతో జూచుట, ఒకరికి ద్రోహము చేయుట, వీనినివదలవలయు.

ఇదియునుగాక,

శ్లో॥ భైక్షేణవర్తయేన్నిత్యం నైకాన్నాదీభవేద్వ్రతీః
(మనుః)

తా॥ బ్రహ్మచారి యెల్లప్పుడును భిక్షమెత్తి భుజింపవల సినదియే గాని ఒకని యన్నమును భుజింపరాదు.

ఇట్లు భైక్షాన్నముచే జీవించుచు వేదముఁ జదువుచు గురు శుశ్రూషజేయుచు బ్రహ్మచర్యము ముగించి సమావర్తనము జేసి కొని గుర్వాజ్ఞను బడసి వివాహము చేసికొనవలయు.

ఇవి బ్రహ్మచర్యాశ్రమ ముఖ్యధర్మములు. దేశమంతయు వెదకిసూచినను పైకనిన నియమముల సమగ్రముగ ననుష్ఠించుచున్న బ్రహ్మచారి యొకడైన గన్పడునా? వానిలోఁ గొన్నింటి నైన నాచరించు బ్రహ్మచారు లెందరున్నారు? వివాహముజేసికొని భార్యతో సంసారము చేయుచు కాలేజిలో ఇంగ్లీషు చదువుకొనుచున్న చిన్నవాండ్రు ఏయాశ్రమములోఁ జేరినవారు?

మొదటి యాశ్రమమీస్థితిలోనుండఁ దక్కిన యాశ్రమములగతి యెట్లుండు! గృహస్థుని యొక్క ముఖ్యధర్మములు ఈ సంచిక 87, 88 పుటలలో సంగ్రహముగా వ్రాయఁబడియున్నది. వానిని గ్రమముగఁ జేయుచున్న గృహస్థు లెందఱున్నారు? వానప్రస్థాశ్రమ మీకాలమున కంటికైన కన్పడుచున్నదా? సన్యాసులందఱును తమ యాశ్రమధర్మమును చక్కఁగ నిర్వర్తించుచున్నారా?

వర్ణాశ్రమధర్మముల పైఁజెప్పిన లోపముల నన్నిటిని చక్కఁబెట్టి పూర్వమువలె యథావిధిగ మరల ననుష్ఠానమునకు తేగలిగినచో మనదేశమునకు మిగుల శ్రేయోదాయకమై యుండు. వర్ణాశ్రమపోషణ సభవారు దలబెట్టుకొన్న కార్యము సంస్తవనీయమే గాని అయ్యది నెరవేరుట దుర్లభమని తోచెడిని. భగవత్సంకల్పమెట్లున్నదో!!

---:0:---

# గృహస్థుని నిత్య కృత్యములు.

దినదినమున గృహస్థు వాచరింపఁదగు దినచర్య యెట్టిదో చూతము.

బ్రాహ్మీముహూర్తమున మేల్కాంచి ప్రాతఃకాల క్రియలం దీర్చుకొని స్నానంబొనరించి సూర్యోదయమునకు ముందే సంధ్యావందన మొనరించి భగవంతుని ధ్యానముచేయవలెను.

వెనుక ప్రాతఃకాలమునఁజేయఁదగు నగ్నిహోత్రమును సలిపి దేవతలను గురువులను బూజించి కొంతకాలము వేదములను వేదాంగములను బఠించవలెను. పిదప కుటుంబపోషణమునకు వలయు ద్రవ్యము నార్జించుటకుం బోవలయును. తలిదండ్రులు, ఉపాధ్యాయులు, ఆచార్యులు మొదలగు వారికిని, దారాసుతులకును, గృహమున కేతెంచు బంధు మిత్రులకును, అతిథ్యభ్యాగతులకును, నిరాధారులు రోగపీడితులు నయి స్వోదరపోషణ సామర్థ్యము లేని బీదలకును, మఱియు గృహము నాశ్రయించుకొని తిరుగుచుండు జంతువులకును శరీర సంరక్షణమునకు వలయునంత మాత్రము సంపాదించి గృహమునకు మరలివచ్చి మాధ్యాహ్నిక క్రియలం దీర్పవలయును. మధ్యందిన సంధ్యావందనమును వైశ్వదేవమును జేసి దేవర్షి పితృగణములను దృప్తియగునట్లు చేసి యాసమయమునకు వచ్చిన యభ్యాగతులం బూజించి యన్నమిడి తృప్తులంజేసి భూతబలియు నొసంగి పిదప దాను భుజింపవలయు. వెనుక కొంతతడవు పురాణేతిహాసములను ధర్మశాస్త్రములను బఠించి స్వతంత్రముగఁ జదువుకొనఁజాలని వారలకు లోనియర్థములను బోధించి యనంతరము దేవతాగృహములను గాని సత్పురుషుల గోష్ఠినిగాని సందర్శించి మిత్రుల తోడఁ గొంత తడవు ప్రొద్దుపుచ్చుకొని సాయం సంధ్యాకాలము నతిక్రమింపక యిల్లుసేరి సాయంసంధ్యావందనాగ్నిహోత్రముల

నొనరించి భుజించి విశ్రమింపఁదగు.

శ్లో॥ భుక్త్వాతు సుఖమాస్థాయ తదన్నం పరిణామయేత్
ఇతిహాసపురాణాని ధర్మశాస్త్రాణి చాభ్యసేత్
వృథావివాద వాక్యాని పరివాదంచ వర్జయేత్
నాఽసచ్ఛాస్త్ర వినోదేన సన్మార్గార్థవిరోధినా॥

... ... ... ... ...

అహశ్శేషం సమాసీత శిష్టైరిష్టైశ్చ బంధుభిః

ఇట్లు దినమంతయును సత్కర్మముల నొనరించుటయందును శరీరపోషణమునకు వలయు కృత్యమునందును గడపవలయును గాని దూష్యసంభాషణమునందుఁగాని దూష్యవృత్తులయందుఁ గాని దుష్టజనుల సాంగత్యమునఁగాని కాలక్షేపము చేయరాదు.

ఇక్కాలమునకుఁ దగినరీతిని పైసూచింపఁబడిన మార్గము స్వల్పముగ మార్చుకొని దినచర్యను జరుపఁదగు. బ్రాహ్మీ ముహూర్తమున మేల్కాంచి సూర్యోదయమునకు మున్ను సంధ్యావందనము, భగవద్ధ్యానము వారివారి యాచారప్రకారము చేయఁదగు. పిదప గొంతసేపు సద్గ్రంథములఁ జదివి యితరులకు బోధించుటయందు గడుపఁదగు. అనంతరము గృహకృత్యములయందుఁ గొంతకాలము నడపి మాధ్యాహ్నిక క్రియలను జరిపి భుజించి రాజకీయ కార్యములు మొదలగు నుద్యమములకు బోనవకాశమున్నది. కార్యాలయములనుండి మరలి సాయంకాల కృత్యములం దీర్చుకొని కొంతకాలము సద్గ్రంథములఁబఠించి సద్గోష్ఠియందుఁ గాలము గడపి గృహకృత్యములం దీర్చి భుజించి యల్పకాలమైనను భగవంతుని మనస్సున నిలిపి ధ్యానించి నిదురింపఁ దగు.

(బ్రహ్మవిద్యాదర్పణము.)

# మోక్షమార్గ ప్రదీపిక.

(74-వ పుట శేషము)

అందువలననే తితీక్షయన

"సహనం అప్రతీకార పూర్వకం చింతా విలాపరహితం"

అని చెప్పబడియె.

ఈ వాక్యముయొక్క సాధారణార్థము పైన జెప్పబడెను. అది యేమన:-తన స్వంత దుఃఖమును బాటించక, యా దుఃఖ ప్రాప్తికి ఎవడైన నొకడు నిమిత్తమాత్రుడుగ నుండును కాని యథార్థముగా నందుకు బూర్వజన్మకృత దుష్కర్మమే కారణ మని యెరిగి, యా దుఃఖమునకు జింతించక, యందుకు నిమిత్త మాత్రుడైన వానియందు గోధ ముంచక సహించ వలయును. లక్ష్యస్థానమందు జేర బూనుకొనిన ముముక్షువు తనకు సంభవిం చిన దుఃఖముచే జలించక తనపనికి దాని నంతరాయముగ రానియ్యక,

యతి విఘ్నాః ఫలాయన్తే

అను వాక్యమును సార్థకముగ జేయ వలయును.

శ్లో॥ దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥
(భ. గీ. 18-8.)

దుఃఖము కలుగఁ జేయునని కర్మమును వదలి పెట్టు వాడు ఉత్తముఁడు కాదని చెప్పబడి యున్నది.

మ॥ ధీరుల్ విఘ్న నిహన్య మానులగుచుళ్ ధృత్యు
న్న తోత్సాహులై। ప్రారబ్ధార్థము లుజ్జగిం
పరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునళ్॥

ధీరులు విఘ్నముల బోదోలి ధైర్యముతో నుత్సాహము గూడుకొన్న వారై పూనుకొనిన పనిని మానుకొనరు.

కావున కష్టములకు వెఱచి చింతించుచు కన్నులనీరు కార్చుకొనుచు దైన్యవృత్తి నవలంబించుట మోక్షమార్గ ధర్మము కాదు.

ఈ వాక్యమున కింతకంటె విశేషార్థము స్ఫురించుచున్నయది. జ్ఞాన వైరాగ్య నిష్ఠలయందున్నత స్థితికి వచ్చిన వారికి భేదబుద్ధి నశించును. మనస్సు నిర్మలమై చలించక ప్రసాదము జెందిన వారికి ఆత్మయొక్క యథార్థజ్ఞానము ప్రకాశించును. వారికి బూర్వజన్మ జ్ఞానము కలుగును. ఈశ్వర సంకల్ప మిట్టిది యని తెలియును. అట్టివారికి దుఃఖ మూలమగు అజ్ఞానము నశించుట వలన చింతా విలాపములు కలుగ నేరవు. తమ కష్టముల కెంతమాత్రము ఖేదము జెందరు. పరుల సంకటములను జూచి వానిని గూర్చి మిగుల పరితాప పడుదురు, సహాయము జేయ బూను కొందురు. అంతియ కాని వారితో బాటు తాము సయితము చింతించరు. చింతించి చేయునదేమి లేదనియు, మనస్సు ఖేద క్షోభలచే జలించునెడ సంమోహ స్మృతి భ్రంశలచే దుఃఖితుల నాదరించు శక్తి సయితము లేక పోవుననియు, ఈశ్వరాజ్ఞా ప్రకారము దుఃఖ ప్రాప్తి కారణమగు దుష్కర్మ చేసిన కతన తత్ఫలము ననుభవించుట న్యాయమే యనియు, దెలిసిన తాము చింతించి మనశ్శక్తిని దుర్వినియోగము చేయక, ఆదరించి దుఃఖమును నివారించుటకై సర్వ ప్రయత్నములు చేయుదురు.

ఇట్టిరు తెగల వారికిని ఈవాక్య మన్వయించుచు సదోబ్ధ చేయుచున్నది. పరశ్రమ నివారణ విషయమై అయిదవ సూత్రముతో దీనిని జేర్చి చదువ వలయును.

మొదటి వాక్యము ముఖ్యముగా "తితీక్ష"ను బోధించుచున్నది యని తెలియచేయ బడెను. ఆ గుణము వివేక వైరాగ్యములు లేనిచో సాధ్యము కాదు.

వివేకమన నిత్యానిత్య వస్తు వివేకము.

శ్లో॥ బ్రహ్మైవ నిత్య మన్యస్తు హ్య నిత్య మితి వేదనమ్
సోఽయం నిత్యా నిత్య వస్తు వివేక ఇతి కథ్యతే॥

"బ్రహ్మ నిత్యము" ఇతర మంతయు అనిత్యము, అని తెలియుట వివేకమందురు. అయితే ఆ వాక్యముయొక్క యథార్థ తాత్పర్యమును జక్కగ గ్రహించుకొనిన గాని వివేకము గలుగదు. అనుదినంబును, క్షణ క్షణంబును, సర్వకార్యంబుల బ్రవర్తించుచు, సుఖ దుఃఖానుభవమునకు స్థానమై ధర్మ సాధనమై యొప్పుచుండు శరీరమును, భోగ్యవస్తువులును, ప్రత్యక్షాది ప్రమాణములచే దెలియబడుచుండు ప్రపంచమంతయు, మిథ్య యనియు, అనిత్య మనియు నెట్లెఱుంగ నగు? వ్యావహారిక దృష్టిచే నివి యన్నియు సత్యములే; అనిత్యమన, శాశ్వతముగ నుండునవి కావనియు, వికారములు జెందునవి యనియు దెలియవలయు; దేహము బాల్యకౌమారా ద్యవస్థలయందు మారుచు తుదకు మృతి జెందునని యెల్లఱకు దెలిసిన విషయమే. మఱియు దేహాధర్మము లైన రోగాదులు, క్రోధాదులు, పూజావమాన బహుమానములు, కొంతకాల ముండునే కాని చిరకాల ముండుట లేదు. దేహము బాల్యస్థితి యందుండిన ఆత్మయే వృద్ధత్వము నొందు నపుడు నయితముండును, కోపకాల మందుండును, శాంతకాల మందుండును. ఇట్లు భావ వికారములకు లోబడు దేహ మనిత్య మనియు దేహియగు ఆత్మ నిత్యుడనియు జెప్పబడును.

అన్తవన్తఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య।

నిత్యుడును, నాశము లేని వాడును, అప్రమేయుడు నగు శరీరియొక్క శరీరములు మాత్ర మంత్యము నొందునవి.

భ. గీ. 2-18.

ఇట్లాత్మవలె శాశ్వతముగ నుండునది కాదను హేతువున దేహము, నామ రూపాత్మక మైన ప్రపంచ మంతయు, నని త్యమని చెప్పబడునే కాని, అవి నిరర్థకము లనియు, వ్యావహారిక దృష్టిచే సయిత మసత్యమనియు నెంతమాత్రము భావించ గూడ దు. ఆత్మకు భోగ్యములుగ నుండు కాలమందు భోగ్య పదార్థము లు సత్యమే. ఎందువల నన, "నే నీవస్తువులను భోగించుచును, చూచుచును" అని ఆత్మ తలచిన మాత్రముననే ఆత్మయొక్క సత్యత్వమును భోగ్య పదార్థము వహించుచున్నది. "అహం ఏతత్" అని ఈశ్వరుడు సంకల్పించిన మాత్రమున ప్రపంచము సత్యముగ దోచి "అహమేతన్న" అనినపుడెట్లు అసత్యమగునో, అటులనే సకల వస్తువులును ఆత్మార్థము సత్యములు. జీవునియం దు బీజరూపమున నుండు నాత్మ శక్తులను ప్రకాశమునకు దెచ్చు నిమిత్తము ప్రపంచమును అందలి సకల పదార్థములును భగవం తునిచే నిర్మింపబడి యున్నవి. అవి లేనిచో జీవుని శక్తులు సం కోచముగ నుండునే కాని ప్రకాశించి భగవత్సన్నిధి జెందించ నేరవు.

తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్.

ప్రపంచమును సృష్టించి ప్రతివస్తువు నందంతరాత్మయై భగవంతుడు వెలుగుచుండును. ఏ జీవు డేమెట్టున నుండునో ఆ మెట్టు కాకర్షణీయమైన వస్తువు నందు దానగుపడి తనమహి మచే నావస్తువుకు రమ్యత్వము గల్పించి జీవుడు దాని గోరి భో గించుటచే వానియందలి యాత్మశక్తులు ప్రకాశింప జేయువాడు భగవంతుడే. ఈ రీతిన గొంచము జ్ఞానము హెచ్చి జీవుడు పై మెట్టుకు రాగానే, అప్పటి స్థితి కాకర్షణీయమైన పదార్థమందు దానే కన్పడి దానిచే మఱియు నెక్కుడు స్థితికి వానిని దెచ్చు ను. ఏ మెట్టున నుండునపుడు, అందుకు పైమెట్టుకు బోవజేయు జ్ఞానము నిచ్చుటకు సహకారియగు నవి యన్నియు నప్పటికి

సత్యములు. వలనన, భగవంతుడు వాని యందుండి వానికి సత్యత్వమును గల్పించి వానిద్వారా జ్ఞానమును వృద్ధిజేయును. పూర్వదశయందలివి మన కసత్యములగును. ఎందువలన ననగా మనకుగాను భగవంతుడు వాని నుపయోగించి సత్యత్వము నివ్వలేదు. ఆ పూర్వ దశయందలి వస్తువులు క్రింది మెట్టున నుండు వారల కుపయుక్తంబగు కారణంబున వారలకు సత్యంబులు. బాల్యంబున బొమ్మలు మొదలగు వినోద వస్తువులు ఉపయోగకరంబులు. పెద్ద పెరిగిన పిమ్మట నావస్తువుల ననిత్యమని భావించదగు. ఇట్లు సత్యత్వా సత్యత్వంబు లాత్మార్థత్వముగ నుండునని యెఱుంగునది.

"ఆత్మార్థత్వేనహిం ప్రేయాంస విషయా నస్వతః ప్రియః" దేహమాత్మ వలె నిత్యము కాదనియు, జీవుని జ్ఞానమును వృద్ధి జేయుట కుపయుక్తమైన కొరముట్టనియు, దెలిసికొని "దేహామే నేను" అను భ్రాంతిని విడుచుటయే వివేకము. ఈశ్వరాంశమగు జీవుడు ఈశ్వరునివలె ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు గలిగి స్వస్వరూపంబున వెలుగుచుండును. అధోలోకంబులైన భూర్భువస్సువర్లోక ములందు శక్తులనుజూపుట కసమర్థుడుగ నుండును. ఆ లోకములందు జనన మరణాములచే దిరుగుచు సుఖదుఃఖానుభవమున బీజరూప మునయుండు శక్తులను ప్రకాశింపజేయు నిమిత్తము వానికి వలయు దేహము లేర్పడియున్నవి. బాహ్యప్రపంచవిషయ జ్ఞానమును దెల్పుట కింద్రియము లేర్పడి యున్నవి. ఆవిషయములను గ్రహించు ఆత్మశక్తికి మనస్సని పేరు. జ్ఞాన సాధనార్థము విషయములను భోగించవలయు నను సంకల్పమును ప్రేరేపించు ఆత్మశక్తి కామ మనబడును.

శ్లో॥ ధర్మావిరుద్ధోభూతేషు కామోస్మిభరతర్షభ॥

(భ. గీ. 7-11.)

జ్ఞానేంద్రియములు భువస్సువర్లోక తత్త్వములతో నిర్మింప

బడిన మనోమయ విజ్ఞానమయ కోశములందు (Astral and mental bodies) ప్రవర్తించు మనోబుద్ధులకు బాహ్యప్రపంచ విషయజ్ఞానమును గలుగజేయును. మనస్సు (చిత్తమందంతర్భాగము) మనోమయకోశముననుండి (Astral and mental bodies) సంకల్పించుట, చింతించుట, వితర్కించుట, సంశయించుట, శోధించుట, కోరుట ఇత్యాది వృత్తులచే మెలగుచుండును. బుద్ధి (అహంకార మందలి అంతర్భాగము) విజ్ఞానమయ కోశమున నుండి (Mental body) కర్తృత్వాభిమానము గలిగి సంశయభావమును దొలగించి నిశ్చయ జ్ఞానమును గలుగజేయును. కర్మేంద్రియములు ప్రాణమయకోశమందుండి (etheric double) కార్యముల నిర్వర్తించును. ఇంద్రియ గోళములు అన్నమయకోశమందు (Physical body) గనుపడుచున్నవి. ఈ కోశము స్థూలభోగాయతనమై యొప్పుచుండు. జ్ఞానసాధనకిట్టి యుపపత్తి భగవంతునిచే గల్పింపబడియున్నది.

ఏకో నవద్వారవతీహ దేహే
సౌధే మహారాజ ఇవాత్మవర్గైః
సంసేవ్యమానో విషయోపభోగాన్
ఉపాధిసంస్థో బుభుజే యమాత్మా
జ్ఞానేంద్రియాణి నిజదైవత చోదితాని
కర్మేంద్రియాణ్యపి తథా మన ఆదికాని
స్వస్వప్రయోజనవిధౌ నియతాని సన్తి
యత్నేన కింకరజనా ఇవ. తం భజన్తే॥

స॥ వే॥ సం॥

ఒక్కడైన ఆత్మ మహారాజు మేడయందుండు నటుల నవ ద్వారములుగల యీశరీరమునందుండి ఇంద్రియ వర్గములచే సేవింపబడుచు విషయ భోగముల ననుభవించుచున్నాడు. జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములును మనస్సుతో గూడి తమ

తమ యధిదైవతములచే ప్రేరేపింపబడినవియై తమ తమ పనుల నెరవేర్పుటయందు సిద్ధముగానుండి సేవకులవలె ప్రయత్నముతో నాత్మను సేవించుచున్నది.

మఱియు కఠోపనిషత్తునందు:—

ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ
ఇంద్రియాణి హయానాహుః విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః
(3—3-4.)

ఆత్మ రథికుడు అనగా ప్రభువు, దేహమను రథములో బుద్ధియను సారథి మనస్సను కళ్లెముచేత నింద్రియములను గుఱ్ఱములను నడిపించు చుండగా, విషయములను దేశములందు సంచరించుచు భోగించు చున్నాడు.

ఉండవలసిన స్థితి యిట్టిది. అయితే జీవుడను ప్రభువు బీజరూపమున సంసారక్షేత్ర మందిడబడి జ్ఞానము మిక్కిలి సంకోచమై యుండునపుడు (అనగా నైనరుదశలో నుండునపుడు) తనరాజ్యకార్యమును జక్కగ నిర్వహించుకొన జాలకయుండును. అట్టి కాలమందు భృత్యులు యజమానులగుదురు. యజమాని కధికారము దప్పును, భ్రష్టుత్వము సంభవించును. యుక్తాయుక్త వివేచనచే గార్యాకార్యములను దెలిసికొని ధర్మాచరణమే కార్యమని నిశ్చయించి యింద్రియములను వానివాని పనులయందు నియమించవలసిన బుద్ధి మలినత్వమును జెందును. మనస్సు తమోగుణమువలన జడత్వము, మోహము, అలసత, ప్రమాదము, అను నావరణ దోషములచేతను రజోగుణ సంబంధమైన విక్షేప కామదోషములచేతను జిక్కుబడును. నియత కార్యములయందు మనస్సును ప్రేరేపించవలసిన ఇచ్ఛాశక్తి యింద్రియములతో గూడి మనస్సును క్షోభపెట్టి దానిని చింతా విషాదములు, హర్ష

శోకములు కామక్రోధాములు వీనికి లోబడునట్లు జేయును. ఇంద్రియములు మహాబలాన్వితములై యుద్వేగించును.

యస్త్వవిజ్ఞానవాన్భవతి అయుక్తేనమనసాసదా।
తస్యేంద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వాఇవ సారథేః॥

(కఠ. 3—5.)

ఎవడు ఏకాగ్రతలేని మనస్సుగలవాడై యవివేకి యగుచున్నాడో వానికి నింద్రియములు అసమర్థుడగు సారథికి దుష్టాశ్వము లెట్లు స్వాధీనములు కావో ఆవిధము గానే స్వాధీనములు కావు.

ఈమస్థితిని దాటవలయును, జీవునికి యథావిధి ప్రభుత్వము రావలెను. అందుకుగా నేర్పడిన మార్గములే నివృత్తి ధర్మములనియు సాధన చతుష్టయములనియు నెన్నబడుచున్నవి. తొలుత మనస్సు ఆవరణ దోషముచే మూఢత్వమును జెందినపుడు ఆత్మశక్తి కామరూపమున నింద్రియాముల బలముచే లోభాది రజోగుణములను వృద్ధిపరచి నిద్రాలస్య ప్రమాదములను దమోగుణముల నివర్తింపజేయును. ఇది యంతయు బ్రవృత్తి మార్గమున జరుగును. ఆమార్గమందు వృద్ధిజేయబడిన రజోగుణములే నివృత్తిమార్గము నందు ముముక్షువుకు బ్రతిబంధకములగును. ఇట్లు రజోగుణ జనితమైన కామమే సర్వానర్థములకు హేతువని చెప్పబడుచున్నది.

అథ కేనప్రయుక్తో౽యంపాపంచరతిపూరుషః
అనిచ్ఛన్నపివార్ష్ణేయ బలాదివనియోజితః
కామఏషక్రోధఏషరజోగుణసముద్భవః।

(భ. గీ. 3-36. 37.)

(సశేషము).

జి. శంకరరావు.

# అరిషడ్వర్గములు.

శ్రీపతివంద్యు నా శ్రితజనపోషుఁ
గైలాసగిరివాసుఁ గాత్యాయనీశు
భక్తియుక్తంబుగఁ బ్రార్థించిమదిని
దత్సుతువిఘ్నేశు ధ్యానంబొనర్చి
మంజరి ద్విపదను మన్నించినట్టి
శ్రీనాథకవివర్యుఁ జిత్తమందెన్ని
మహి నరిషడ్వర్గ మను పేరఁబరఁగు
షడ్గుణమహిమల సంగ్రహపరచి
వివరింపఁబూనితి విశదంబుగాఁగ
వినరయ్య బుధులార! విజ్ఞానులార!
తత్వజ్ఞులార! వేదాంతజ్ఞులార!
తనరఁ గామంబు, క్రోధంబు, లోభంబు,
మఱి మోహమును, మద మాత్సర్యములును,
విను మరిషడ్వర్గ మను పేరఁ బరఁగు.
వీని యుత్పత్తుల విధ మెట్టిదనిన:—
కామంబు పుట్టు సంకల్పంబువలనఁ
కామంబువలనన గలుగు క్రోధంబు
అర్థమస్థిరమని అఱయమిచేత
లోభంబు జనియించు లోకుల కరయ
నజ్ఞానమున మోహ మంకురంబగును
విత్తంబు కులమును విద్యయుగల్గ
మద మావహిల్లు మర్త్యులకు నెపుడు
సత్వహీనమున మాత్సర్యంబువొడము
ఈ యాఱుగుణము లీరీతినఁబుట్టి
జనునకుఁ గడుఘోర శత్రువులగుచు

వానికిఁ దెలియక వానిలో జొచ్చి
మరగున డాగి తస్కరుల చందమున
వానియందుండు సుజ్ఞానరత్నమును
వంచించి కొనిపోవఁ బొంచి వర్తించు
ఆంతరంగిక శత్రు లాట నీయాలు
బాహ్యశత్రులకన్న బలమైన వారు
తొడరి యీయాలును దోషేక్షభంగి
గవిసి మనుష్యులఁ గారియఁబెట్టు
నానావిధంబుల నరుల హింసించు
నిహపరసౌఖ్యంబు లెడబాపు నెపుడు.
లోకులు వీనికి లోఁబడిరేని
స్వాతంత్ర్యమును బాసి సర్వవిధముల
నిడుమలనొందుట నిక్కంబు సుమ్మి!
స్థిరబుద్ధి వీనిని జేరంగనీక
కనుగల్గి మెలఁగుట కర్తవ్య మరయ.
పంక్తిముఖుండును, బలిచక్రవర్తి
కార్తవీర్యుండాది ఘనులెల్లఁదొల్లి
బాహ్యశత్రుల నెల్లఁ బాఱంగఁదోలి
తమ లోనివైరులఁ దా మెఱుంగక నె
విగతశత్రుల మని విఱ్ఱవీఁగుచును
జెడరె! లోవైరుల చేత నే తుదను.
చెలగి దిగ్విజయంబు చేసితిమంచు
విఱ్ఱవీగిరి కదా! వెడఁగులు మున్న
దిక్కులు గెల్చిన దిగ్విజయుండె?
కామాదిశత్రుల ఖండించినట్టి
ధీరుఁడేకద! భూరి దిగ్విజయుండు.
[illegible]

వెలి పగఱల గెల్వ గెలుపనందగు నే?
యత్నంబుచేసి యభ్యంతరశత్రు
వరుస జయించిన వాఁడె ధన్యుండు.
కడఁగి యీషట్ శత్రుగణమును గెల్చు
సజ్జనునకు గల్గు సౌఖ్యముల్ రెంట.
అట్టి ధీయుతునకు నలవడ కున్నె
కరతలామలకమై ఘన మోక్షపదవి.

కామము.

వస్తువుపైగల వాంఛ కామంబు.
బంధనంబులలోన బహు దృఢమైన
బంధనమరయ గామంబను గుణము.
కామంబు చెరచు నఖండ సౌఖ్యముల
గాఢ నిద్రయు లేదు కామాతురునకు.
కామంబు మనసును గలవరపెట్టు
జ్ఞానమార్గంబున కదియె యడ్డంబు
మోక్షవాంఛల నది మొదలంటఁ జెరచు
గడలేని చింతల కదియె మూలంబు
దాని బలంబున ధర్మంబు చెడును
చెడుకర్మములనెల్లఁ జేయించు నదియె
గౌరవహానికిఁ గారణంబదియె
నరుఁ డేవిధంబున నైనఁ గామమును
దనలోన నుండక తరిమి నట్టయిన
మేఘపంక్తి నిబాసి మెఱసెడిపూర్ణ
చంద్రుని కైవడి, స్వప్రకాశమున
దనలోని యాత్మ సదా వెల్గుచుండు.
బలితంపుటురి గామ మనునది జనున
కారజ్జుఁ దెగఁగోయ నేరని వాఁడు

గోను లోపలఁ బడ్డ గోఱియ చందమున
దరిఁ గానఁగా లేక తపియించుచుందు.
కామంబుచేతనే గల్గు ద్రవ్యంబు
దానంబు భోగంబు నాశం బటంచు
మూడు పోకలు ధనమునకు ఘటించు
మొదటి రెండును లేక పోయినయెడల
మూడవ మార్గమే ముందును మునకు.
కామంబు ధనమును గడియించుఁగాని
తన్నాశనమునకుఁదా నడ్డపడునె?
ఘన మునివర్యులు గామంబు విడిచి
కాయలాకులు నీళ్లు గాలిని మెసవి
యనుభవించగలేదె ఘన సౌఖ్యములను
వెడఁగులై కామంబు విడిచిరే వారు?
కామభోగములు మేల్ గాదయ్యసుస్మి!
కడుతుచ్ఛమైనవి గానెంచి వాని
విడిచి చూడుము! పొందు విపులసౌఖ్యంబు.
కలలోనిభోగముల్ కామభోగములు
విశ్వసింపకు మవి శాశ్వతమనుచు
జాగ్రతనొందిన స్వప్నభోగములు
మాయమై చనుఁగాని మనకగుపడునె?
కామమా! నినుశత్రుకైవడి గెల్చి
ప్రాజ్ఞులు గొందఱు బ్రహ్మజ్ఞులైరి.
కాములే గద! మోక్షకాములైనారు.
వారిని జేరంగ వశమె నీకింత?
చెలఁగివారిని హింస సేయ నోపుదువె?
దూరంబుగాఁ బారఁ దోలితి మనుచు
దవ్వున నినుఁ జూచి నవ్వరే వారు?

నీ శౌర్యవీర్యముల్ నీ పరాక్రమము
నీ నిపుణత్వంబు నీ ప్రభావంబు
తెలివిహీనులదెసఁ జెలరేఁగు గాని
విజ్ఞానులను గన్న వెస భీతిఁ జెంది
తొలఁగి పోవును గదా దూరంబు గాను.
కామమా! నీ శక్తి గాల్పనే! యేల?
బ్రహ్మవేత్తలఁగన్న బాఱి పోయెదవు.
పామరులను గను పండితులునైన
నీవంటి కోఁచల నిగిడి పట్టెదవు.
పట్టి వారిని లెస్స బాధ బెట్టెదవు.
నీ వల్లనేకదా! నిర్జరేంద్రుండు
కఠిన శాపము నొందె గౌతము చేత.
బ్రహ్మవంశజుఁడైన పంక్తికంధరుఁడు
నీ కతంబునఁగదా నిర్మూలనం బయ్యె.
అరయంగ నా బ్రహ్మ హత్యాదోషంబె
నినుఁ బట్టి బాధించి నీ శక్తిఁ ద్రుంచి
గర్వభంగముచేసెఁ గాబోలుఁ నీకు.
అరసి చూడంగ మీ యాప్తురిలోన
పేరుకు మాత్రము పెద్దవు నీవు.
పిఱికి బంటుకు నీకుఁ బెత్తనం బేల?
పరిపంథిఁ గన్గొని పాఱిపోయినను
నీయనుజన్ములు నినుఁజూచినగరె?
నగు బాట్లపాలయ్యె నవని నీ బ్రతుకు
వసుధపై నీకిట్టి వర్తన యేల?
కామమా! యవనిపైఁ గల జనులెల్ల
కడకతోనిను శత్రు కరణిని జంపి
భ్రాంతులన్నియుఁదక్కి భవ్యసౌఖ్యముల

ననుభవింతురుగాక! యతిసంతసమున.

క్రోధము.

కోపంబునకుఁ బేరు క్రోధంబనంగ.
కాపురుషునికి లక్షణము క్రోధంబు.
సుజనుండు వైరిగాఁ జూచును దీని.
పరదోషముననిది ప్రభవించి జనులఁ
బట్టిబాధించును బహుప్రకారముల.
ఇది వచ్చిపూనిన నెట్టివారికిని
దెలివియు బుద్ధి స్వాధీనంబు దప్పి
మదపానవివశుఁడౌ మత్తుని కరణి
దయ్యంబు పట్టిన తరుణి చందమున
వెఱ్ఱి హెచ్చినయట్టి వెడఁగుని భాతి
మఱి వేల్పు సోకిన మనుజుని భంగి
గ్రింద మీఁదెఱుఁగక కెరలుచు నిచ్చ
వచ్చిన యట్లెల్ల వాపోవు చుండు.
తన్నుఁ దానెఱుఁగక ధరణీతలంబుఁ
దలక్రిందుగా జేయఁ దా బూనుకొనును.
మీఁ దెఱుంగదు గాన మితిలేని పాప
కర్మంబులనుఁ జేయు దుర్మతి యగుచు.
అరయ నీయున్మత్త మతి స్వల్పకాల
ముండి, కీడులు సేసి పోవును గాన
గొద్ది కాలపు పిచ్చి క్రోధం బటంచుఁ
బెద్దలు దీనికిఁ బేరిడినారు.
క్రోధంబె తపమును బాధలొనర్చు
నణిమాదిశక్తుల నది రూపు మాపు
ధర్మకార్యములకు దానడ్డపడును
కుపితుండు చేసెడి జపమును వ్రతము

ధరణీసురార్చనల్ దానయజ్ఞములు
సరవి జీవార్పనల్ శ్రాద్ధ కర్మములు
నపగతములు చేయు నంతకుఁ దలుక.
ధనములు బంధువుల్ దనరు భోగములు
స్థిరములు గావని తెలిసిన వాని
మనమున గ్రోధంబు మాయమై పోయి
శాంతత్వమమరును సంపూర్ణముగను
శాంతిసమృద్ధి మోక్షంబునొసంగు.
వసుధ జీకటియను వస్తువు లేక
తేజంబు లేమియే తిమిర మైనట్లు
క్రోధంబు నాఁ బడు గుణ మెద్ది లేక
తగు శాంతి లేమి క్రోధం బన బరగె
కాన శాంతత్వ మ నూనమై యొప్పు
పురుషుని గ్రోధంబు పొందదెన్నటికి.

లోభము.

లోభ మనంబడు లోభి భావంబె
భూతముల్ స్థిరమని బుద్ధిని నమ్మి
ధనపిశాచము పట్టి తను నీడ్చుచుండ
విసువకగతృష్ణారి వివిధదేశముల
క్షుత్పిపాసల సొక్కి సుఖముల డక్కి
కడు కష్టముల నొంది గాథల కోర్చి
దానధర్మము లేక ద్రివ్య మార్జించి
తానును గుడువక తన వారి కిడక
వడ్డి కిచ్చుచుఁ జీమవలె శేర్చి చేర్చి
యొంచిన విత్తంబు నెంచుచు మరల
దృష్టిమాత్రముచేతఁ దృప్తినొందుచును
ననయుంట నట్టిగా గాంచియూఁగనను

నిశియందుఁ గంటికి నిద్దుర లేక
కడు పదిలంబుగా గావలి యుండి
గాలికిఁ జెట్టాకు గలగల మనిన
చోరుండు భయమున జొకుఱ్ఱడు మాటిఱ్ఱ-
నింటికి లోపల నెకఱ్ఱడ్డనైన
నించుక శబ్దంబు వీనుల బడిన
దొంగ వచ్చె నటంచు దొట్రిలి బెదరి
రేయి యంతయు గంట తెప్ప వాల్పక నె
ధనపిశాచమునకు దాను దోడగుచు
కొఱవి దయ్యమువలె గూర్చొని యుండి
ధనరక్షణము చేసి దానిఁ దుదకు
దొంగల పాలనో దొరల పాలిటనో
పడునట్లు చేసెడు పాప కర్ముండు
లోభి యనంబడు లోకంబు నందు
అన్ని పాతకముల కన్న లోభంబు
బహు ఘోరమైనది పాటించి చూడ
దాని చేష్టల నెంచ దరము గాదయ్య
పరధన వాంఛయు బరదార యిచ్ఛ
వ్రీడా క్షమా సత్య విముఖ భావములు
గల్పించి ధర్మంబు గలచి మానవుని
గ్రియమాలి యేమిటి కేని బొంకించి
నలుగురి లోపల నవమాన పఱచు.
మానావమానముల్ మనమున కెఱుక
పడనీక వానిని మతి భ్రష్టు జేసి
జనులు జీవన్మృతు డను నట్లొనర్చు
కాన లోభంబతి హీనంబు దాని
దగ్గర జేర్పక తరుమంగ వలయు

స్థిరమైన తపము నింద్రియ నిగ్రహంబు
భూరి శాంతమునకు గారణ మండ్రు.
ఆశాంతికంటె మేలైన శాంతతకు
మూలమగు లోభత్వ మడగుట యరయ
శాంతిని సంఘంబు గనలేని రీతి
నెఱుగ జాలడు లోభి యే సుఖంబులను
దానధర్మంబుల దా జేయడు గద
దాతల గన్గొని తా నోర్వలేక
తన ముల్లె చనునట్లు తా గుందుచుండు
విత్తమే జగతికి వేపౌట నెఱిఁగి
న్యాయమార్గంబున నర్థమార్జించి
ఆర్జిత విత్తంబు నైదు భాగములు
గాగ విభాగించి కామంబునకును
నర్థంబునకును ధర్మాచారమునకు
యశమునకును మఱి యాచకులకును
సమముగా బెట్టుట సరియండ్రు బుధులు
అట్లు చేయని వాని నతిలోభి యండ్రు.

మోహము.

ఏకాగ్ర చిత్తత కిది ఘోరవైరి.
మనసును నొక మార్గ మందుండ నీక
పలువిధ భ్రమతలఁ గలిగించి మదిని
వివిధ పథంబుల కీడ్చు నెప్పుడును.
మోహ భూజమునకు నూహించి చూడ
వేఱు గామము గాని వేరు గానయ్య
ఓపికఁ గామంబు రూపు మాసినను
మోహం బనెడు చెట్టు మొదలంటఁ జెడును.

మదము.

మదమన గర్వంబె మఱియేమి గాదు.
మద మష్ట విధముల మను నంద్రు బుధులు
వాని నన్నిటి నిట వర్ణింప నేల
కారణ మదము నిష్కారణ మదము
నాఁబడు రెంటిని నరసినఁ జాలు
ధనమున రూప విద్యాదుల గల్గు
మదము సకారణ మదమనఁ బరగు
కత మించుకయు లేక గలిగిన యట్టి
మదము నిష్కారణ మద మనఁబడును
గర్వంబు దగ దెంత ఘనునకు నైన
బహుళ కష్టంబుల పాల్ సేయు మదము
ద్రావిడా ధీశుఁ డింద్ర ద్యుమ్న రాజు
గర్వాంధుఁడై కదా! కలశజు చేత
కఠిన శాపము నొంది కరి జన్మ మెత్తి
మకరంబుచేఁ జిక్కి మడువులో నొక్క
వేయి వత్సరములు వెతలచేఁ గుందె
మదము చేతనె కదా పక్షిరాజునకుఁ
బౌరుష హాని సంప్రాప్తించెఁ దొల్లి
మునుపు సుదర్శనుం డనెడు గంధర్వ
వరుఁడొకఁ డతి దర్పవంతుఁడై ఋషులఁ
పరిహసించిన వారు కరుణార్ద్రదృష్టి
శపియింపఁగా క్రూర సర్పమై యతఁడు
చిరకాల మడవులఁ జిక్కులఁ బడఁడె?
దితి వరపుత్రులు నతి బాహు బలులు
నగు హిరణ్యాక్షుండు నతని యన్నయును
మదమున మడియరే మధువైరి చేత.

తను జనులోర్వఁగ డంగ విని సజ్జనుండు
గర్వంబు నొందక కడు నమ్రుఁడగును
దుర్జను లోకులు స్తుతియించిరేని
నుబ్బు నహంకార మెుందును మిగుల
విత్తంబు వంశంబు విద్య రూపంబు
మదమును బెంచు దుర్మతులకు నెపుడు
సాధులఁ జేరినఁ జాల వారలకు
వినయంబు నడకువ వెలయించు నవియు
మదమన్ని విధముల మనుజుని జెఱచు
ఁగాన నా గుణమును గడద్రోయ వలయు.

మాత్సర్యము.

మాత్సర్య మనునది మఱియేమి గాదు
మది క్రోధమును బెంచ మాత్సర్య మదియె
క్రూరాహి వంటిది క్రోధ గుణంబు
దానిని బెంచినఁ దప్పదు కీఁడు
పాలోసి పెంచిన పాము చందమున
బెంచిన వానికిఁ బెను మృత్యు వగును
మాత్సర్య మనునది మదిఁ జేరెనేని
ఁబొడచు చుండును సదా ములుకుల భంగి
ఉత్తమునకు క్రోధముండు క్షణంబు
మఱికొంత సేపుండు మధ్యము నందు
నధమునందున నది యనయంబు నిల్చి
మచ్చరంబయి వాని బాధించు చుండు
క్రూర తరంబగు క్రోధ గుణంబు
పరదోషగణనచే ప్రభవించుఁ గాన
ఁబరుల దోషంబులఁ బాటింపకున్న
ఁదగులవు క్రోధ మాత్సర్యముల్ నరుని

వరుసగాఁ గామాది వైరివర్గంబు
దొంతి కుండల వలె నొకదాని కొకటి
యాధార భూతమై యనవరతంబు
మనుజుని లోపల మరగి వసించు
నరుఁడే విధంబున నైన యత్నించి
దొంతి కుండలలోన స్థూలమై యుండు
ప్రథమ భాండంబును బగుల మొత్తినను
దక్కిన భాండముల్ దను యంతఁ దామె
కూలి తుత్తునియలై నేల పాల్ గావె.
మహి నరిషడ్వర్గ మను పేరఁబరగు
షడ్గుణ లక్షణ సంగ్రహం బిదియె
గురుతర గౌతమ గోత్రోద్భవుఁడును
బరమ పావనమగు పరమాత్మవంశ
జాతుండు నగు రామస్వామయ్య దీని
రచియించె బుధజన రంజకంబుగను.

ఒక ఫకీరునకుఁ గొంతద్రవ్య ముండి దానిని గడుదరిద్రున కియ్యవలెనని చూచుచుండెను. అప్పు డాదారినే యాయూరు రాజు యేనుగపై నెక్కి పోవుచుండగా ఫకీరు చూచి యాధన మంతయు రాజుపై విసరివేసెను. రాజాశ్చర్యము చెంది యం దుకుఁ గారణ మడిగెను. అప్పుడు ఫకీరు "రాజా! ఈద్రవ్య మును గడు దరిద్రున కియ్యవలె నని యనుకొంటిని. నీకంటె దరిద్రుఁడు గాన్పించ లేదు. ఏలయన, ఐశ్వర్య మెంత హెచ్చు గా నుండునో కోరిక లంత మెండై యుండును. ఎవరికి కోరికలు విశేష ముండునో యట్టివాడే కడుదరిద్రుఁడు. కాన నీవె దీని కర్హుఁడవుగాఁ గాన్పించితివి" అని బదులుచెప్పెను.

---:0:---

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

(60-వ పుట శేషము)

గత సంచికయందు వర్ణసంకరముచే కలుగు దోషముల ను గురించి వ్రాయబడెను.

వర్ణసంకరముచే కలుగు దోషములలో విశేష బాధ కరమగు దోష మీక్రింద వివరింపబడుచున్న దోషమని తెలియు చున్నది.

హీనవర్ణము వారు ఉత్తమ వర్ణమునకు వచ్చుటకు అత్యంత సులభోపాయము ఉత్తమ వర్ణము వారి ఆశ్రయమును సేవయునని అనేక ప్రమాణము లుండుటే గాక అందరి అను భవ సిద్ధముగానున్నది.

ఉత్తమాచార మాచరించువారు ఉత్తమ వర్ణముకల వారుగా నుందురు. ఆచారము ననుసరించి వర్ణముండు. ఆచార వర్ణము లెల్లప్పటికి కలసియుండును గాని వేరుగానుండవు. ఎవ డెట్టి ఆచార మాచరించునో ఆయాచారము ననుసరించి వాని వర్ణముండును. ఉత్తమాచారవంతునకు ఉత్తమ వర్ణమును హీనాచార పరునికి హీన వర్ణముండును గాని హీనా చారవంతునకు ఉత్తమవర్ణమును ఉత్తమాచారము గల వానికి హీనవర్ణము ఎప్పటికిగాని యుండదు. ఇచ్చట వర్ణ మనగా తేజస్సు, వర్చస్సు, ప్రభ, కళయని యెరుగవలయు. ఈ తేజస్సు సామాన్య చర్మ చక్షువుల కగుపడక ప్రతి వస్తువును చుట్టియుండును.

శ్లో॥ బ్రాహ్మణాఃక్షత్రియా వైశ్యాఃశూద్రాశ్చద్విజసత్తమ
యేచాన్యేభూత సంఘానాంవర్ణాం స్తాంశ్చాపినిర్మమే.
బ్రాహ్మణానాంసితోవర్ణః క్షత్రియాణాంచలోహితః
వైశ్యానాంపీతకోవర్ణః శూద్రాణామసితస్తథా॥

బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులకును ఇతర సమస్త భూత సమూహమునకును వాని వర్ణములు నిర్మింపబడెను. బ్రాహ్మణులకు శుభ్రమైన తెల్లని వర్ణమును, క్షత్రియులకు ఎఱ్ఱని వర్ణమును, వైశ్యులకు పసపువర్ణమును, శూద్రులకు నల్లని వర్ణమును సృజింపబడెనని మహాభారత భృగు భరద్వాజ సంవాద మందు చెప్పబడినది.

దీని ముఖ్యాభిప్రాయ మేమన:- బ్రాహ్మణులకు సహజమైన శమ, దమ, క్షమ, ఆర్జవాది గుణములును, శౌచాచారములును సర్వభూతహితమును, దయయు, గల వారిచుట్టు ధావళ్యమైన(తెల్లని) ప్రభయు, క్షత్రియస్వభావమైన శౌర్య, వీర్య, ధైర్య, పరాక్రమ, దుష్టనిగ్రహ, శిష్టానుగ్రహాది పరిపాలన గుణములు కలవారి చుట్టు ఎర్రని తేజస్సును, కృషి, వాణిజ్య, గోరక్షణాది వృత్తులచే ధనార్జన చేయు గుణమును, ఆర్జించిన దాని వాపీ కూప తటాకాది ప్రతిష్ఠలందును అన్నదానము మొదలగు సత్పాత్ర దానములకు వినియోగించు గుణమును కలవారి చుట్టు పసపు వర్ణమును, శూద్రుల స్వభావమైన, హింస, అనృతము అప్రియము, లుబ్ధత్వ గుణమును కలిగి అశుచి పరులగువారి చుట్టు నల్లని రంగు వ్యాపించియుండునని తెలియుచున్నది. ఈవర్ణములు సామాన్య చక్షువులకు గోచరముకాదని ఇంతకుముందే తెలుపబడినది.

వర్ణసంకరముకాక యుండినపుడు పైచెప్పబడిన వేర్వేరు గుణవర్ణముగలవారు వేర్వేరు సమూహములుగా నేర్పడి యుండిరి. దీనిచేత నేగుంపు ఉత్తమగుణములు గలదైనదియు ఏసంఘము అధమ గుణముపొంది యుండినదియు సులభముగా తెలియుటకు వీలుండెను. అప్పుడు పుట్టుకయు, పుట్టుకకు తగిన విద్యయు, విద్యకు తగిన కర్మయు ఒకటి ననుసరించి యొకటి యుండెను. ఈమూడు నెవరియందు పరిశుద్ధముగా నుండునో

వారిని సేవించుచు వారి సమీపమునందుండుట ఇవి మూడును పరిశుద్ధముగా లేని వారికి శ్రేయస్కరమని మహాభారతారణ్య పర్వమునందు చెప్పబడినది.

శ్లో॥ యేషాంత్రీణ్యవదాతాని విద్యాయోనిశ్చకర్మచ
తాన్ సేవేత్తైస్సమాస్యాహి శాస్త్రేభ్యోపి గరీయసే॥

సంకరమైనందున ఈమూడును ఒకచో చేరుటకు వీలు లేక పోయెను. ఇంతకంటె దౌర్భాగ్యస్థితి దేశమునకు ఏది యున్నది?

ఇప్పుడు బ్రాహ్మణ కులములు పేరుకు మాత్రమున్నవిగాని కుల పారిశుద్ధ్యములేదు. దానిచేతనే ఆయాకులమునకు తగిన విద్యయందభిరుచి ఆ కులజన్ములకు లేకపోయె. ఈ రెంటికి లోపము కలుగుటచే తదనుగుణ్యమగు కర్మయు శూన్యమాయె. దీనిచేత వర్ణహీనులు, గుణహీనులు సంగమాత్రముననే వర్ణవంతులగుట కాస్పదములేదాయె.

పరిశుద్ధమైన విద్యాయోని కర్మలుగల వారిని సేవించుట చేతను, వారి సమీపమున నుండుటచేతను, వారితో మాటలాడుట చేతను కలుగు లాభములును, అవి అపరిశుద్ధము గల వారి సాంగత్యముచే సంభవించు నష్టములును ఈ క్రింది ప్రమాణములచే విశదమగుచున్నది.

"నిరారంభాప్యపివయం పుణ్యశీలేషుసాధుషు।
పుణ్యమేవాప్నుయామేహ పాపంపాపోపసేవనాత్॥
అసతాందర్శనాత్స్పర్శా త్సంజల్పాచ్చసహాసనాత్।
ధర్మాచారాఃపరిహీయంతె సిధ్యంతిచనమానవాః॥
బుద్ధిశ్చహీయతేపుంసాం నీచైస్సహసమాగమాత్।
మధ్యమైర్మధ్యతాంయాంతి శ్రేష్ఠతాంయాంతిచోత్తమైః॥

జనులు సత్కర్మానుష్ఠానమునకు గాని, తద్విరోధమగు దుష్కర్మావలంబనమునకుగాని ప్రయత్నము చేయకుండిన

ను సత్కర్మానుష్ఠానపరులైన సాధు సంగముచేత యిచ్చటనే పు ణ్యమును పొందుచున్నారు, దుష్కర్మానుష్ఠానపరులగు పాపిష్ఠు ల సహవాసముచే పాపమును పొందుచున్నారు. దుష్టులను చూ చుటచేతను, తాకుటచేతను, వారితో మాటలాడుట చేతను, కూడకూర్చుండుటచేతను ధర్మాచారములన్నియు నశించుచున్నవి.

మనుజులు సిద్ధిచెందరు. నీచుల సహవాసముచేత బుద్ధిచెడుచు న్నది. మధ్యముల సాంగత్యముచేత బుద్ధి మధ్యస్థమగుచున్నది. ఉత్తముల సమాగముముచేత శ్రేష్ఠత్వమును పొందుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ తస్మాత్ప్రాజ్ఞైశ్చవృద్ధైశ్చ సుస్వభావై స్తపస్విభిః।
సద్భిశ్చసహాసంసర్గః కార్యశ్శమపరాయణైః॥

ఈ కారణముచేత శమపరాయణులకు అనగా ఇంద్రి యనిగ్రహాపేక్షగలవారికి ప్రాజ్ఞులును వృద్ధులును సుస్వభావ ముగల తపోనిష్ఠులగు సత్పురుషుల సహవాసము ముఖ్యకర్తవ్య మని తాత్పర్యము.

పశుప్రాయస్థితిని మీరి కొంచము తారతమ్యము తెలిసి తీక్ష్ణములైన వ్రతములుగాని ఉగ్రమైన తపశ్చర్యలుగాని, నియ మముచే వేదాధ్యయనముగాని, కుశలబుద్ధిచే గ్రహించదగిన శాస్త్రముల వ్యాసంగముగాని చేయ శక్తిలేని శూద్రులు సులభ ముగా నభివృద్ధిజెంది సుగుణవంతులగుటకు సజ్జనసాంగత్యమే చాలునని తెలిసి శూద్రులకు సాధుజన సేవచేయవలెనని సనా తన శాస్త్రములందు నియమింపబడియున్నది.

ఎవ్విధమున క్రిందివారు పైవారి సుగుణములను పైవారి సమీపముననున్న మాత్రముననే పొందునదియు వివరముగా తెలిసికొనుదము. ప్రప్రథమమున సుగుణములను పొందగోరువారు, ఎవరినుండి తాము పొందదలచెదరో వారు తమకంటె నుత్తము లనెడు నిశ్చయము గలవారు గానుండవలెను. అట్లుండినపుడు

పై వారి గుణ ప్రవాహము వీరియందు ప్రవేశించుటకు ఉన్నత ప్రదేశమునుండి పారెడి ప్రవాహము పల్లములో నుంచియుండు తెరువబడిన పాత్రయందు సులభముగా ప్రవేశించు విధమున సులభముగా నుండును. అట్టి భావనలేని గుణహీనులు గుణవంతుల సమీపముననుండినను ఉన్నత ప్రదేశమునుండి పారుప్రవాహము మూయబడి పల్లమున నుంచిన పాత్రలో సులభముగా ప్రవేశించని యట్లుండును. మూయబడిన పాత్రమీద పైనుండి పడు ప్రవాహము తైలధారవలె విడువక పడుటచే కొంతకాలములో మూత పగిలి తరువాత ప్రవాహముప్రవేశించు చందమున పైవారిని గుణవంతులన్ని తలంచని వారియందు సహితము వారి సుగుణములు దీర్ఘకాలముననైనను ప్రవేశించును.

అదెట్లన:—

సజ్జను లెల్లప్పటికి సత్సంకల్పములనే కల్పించుచుందురు. సంకల్పములు (తలంపులు) మనస్సుకు సంబంధించి యుండును. మనస్సు సంకల్పాత్మకము. ఏదైన నొక తలంపు తలంచినపుడు మనోమయ కోశములో ఆతలంపున కనుగుణమగు చలనము కలుగును. ఈ చలనము మూడు తెరంగులగు ఫలములు కలుగజేయును. తలంచువానికొక ఫలమును, సామాన్యముగ మనోమయకోశమున నొకఫలమును, అనుసరించి సమీపమున యున్న వారికొకఫలమును సంభవించును. తలంచువానికి అట్టి సంకల్పములు తలంచిన కొలది ఇంకయు నాలాటి సంకల్పములు సంకల్పించుటకు సులభముగా నుండునట్లు తదనుగుణములగు అణువులు వాని మనోమయ శరీరమందు చేరుచుండును. తుదకు వాని మనోమయ శరీరము వేరువిధమైన సంకల్పములు తలంచుట కవకాశము లేకుండ పదిలముగ నీయణువులతోనే కట్టబడును. దీనిచేతనే "యద్భావంతద్భవతి" అందురు. ఎవడెట్లు భావించునో అట్లనే అగుచున్నదని తాత్పర్యము.

సజ్జనులు సర్వదా సర్వభూతహిత కరములగు తలంపులే జన్మజన్మముల నుండి తలంచుచుండినందున వారి మనోదేహము లు దుస్సంకల్పములకు ఆస్పద మివ్వకుండును.

రెండవది:-ఒకని మనోమయకోశమందు కలిగిన చలనము యొక్క వ్యాపకము మనోమయాకాశ మందు విస్తారముగ వ్యాపించి అనేక జనుల మనోమయ కోశములందు దానికి తుల్యము గు చలనము సూక్ష్మముగ కలుగచేయుచుండును గాని దృఢముగా కలుగచేయ జాలదు.

మూడవది:—సజ్జనుల సన్నిధియందు గుణహీనులు భక్తి విశ్వాసములతో సేవించుచుండు నపుడు సజ్జన మనోమయ కోశములలో కలుగు చలనమువంటి చలనము గుణహీనుల మనోమయ కోశములలో కలుగును. తద్వారా గుణహీనుల మనోమయ కోశములలో దృఢముగా స్థాపన అయియుండు సద్భావన ప్రతి బంధకములైన అణువులు పట్టువదలి తొలగి సద్భావన కనుకూలమగు మనోమయ అణువులకు సులభముగా నెడమిచ్చును. బహుకాలము సత్పురుషుల సేవచే గుణహీనులు తమకు నైజముగా గల తామసాది దుర్గుణముల కనుకూలములైన దేహాణువులుపోయి సత్వగుణ ప్రధానమైన అణువులు దేహ ములందు చేరుటవలన సత్వగుణాను వర్తనకు అర్హులగుదురు. అదేలనన సేవ్యులు అనుగ్రహ (Positive) స్థితిలోను సేవకు లు పరిగ్రహ (Negative) స్థితిలోనుందురు గనుక పైవారి గుణ ములు క్రిందివారికి సులభముగా పట్టుబడును. మరియు సంకల్ప ములు మిగుల దృఢసంకల్పము లాయెనేని అవి తదను సరణ వర్ణరూపములను పొంది లోకమునకు సంకల్పస్వభావముల ననుసరించి హితాహితములను కలుగజేయును. స్థూలదేహ సామర్థ్యమున కంటె దృఢ సంకల్పశక్తి ఎక్కువై యుండును గనుక మనస్సంకల్పముతో జనులు చేయునంత మేలు కీడులు

స్థూలకార్యములతో చేయజాలరు. ఈ రహస్యము తెలియక బహుమంది మనస్సంకల్పములతో లోకమునకు కీడు చేయుచుందు రు, గనుక శ్రీమహాభాగతమందు "తస్మాత్సర్వేషు కాలేషు మనసా శివమాచరేత్" అని చెప్పబడినది. సర్వకాలములందు మనసులో శుభమునే తలంచుచుండవలెనని తాత్పర్యము.

సత్పురుషులెల్లప్పటికి లోకహితమునే తలంచుచుండుటచే అట్టి వారి సమీపముననుండి వారి సేవ చేయుటచే ఏలాటి ఇతర ప్రయత్నమును చేయక సద్గుణములు పొందుటకు సులభోపాయ ముగా నుండుటనుపట్టి వర్ణహీనులగు శూద్రులు పై వర్ణము వారి సేవ చేయవలెనని చెప్పబడినది.

సద్గురువుల సన్నిధియందున్న మాత్రముననే జనులు (శిష్యులు) ఏ యితర ప్రయత్నము లేక మేలు పొందుదురని యోగి శ్రీ లెడ్బీటరుగారు వ్రాసిన (ఇన్నరులైఫు) అను గ్రంథ మందు వివరించఁబడియున్నది.

సామాన్యముగ పూర్వకాలమున బ్రాహ్మణు లెల్లప్పటికి స్వలాభాపేక్ష లేక లోకహితమునకే తాము చేయు సమస్త కర్మఫలముల నర్పించు చుండిరి గనుక అట్టివారి సేవ హీనవర్ణమువారి కవశ్యమని శాస్త్రములందు నియమింపబడి నది. బ్రాహ్మణ కర్మమగు లోకహిత కార్యములు చేయని వారిని కొల్వకూడదని అనేక ప్రమాణములు కలవు.

శ్లో॥ వృత్తిశ్చేన్నాస్తి శూద్రస్య పితృపైతామహీధ్రువా
నవృత్తింపరతోమార్గేత్ శుశ్రూషాంతుప్రయోజయేత్.
సద్భిస్తుసహసంసర్గః శోభతేధర్మదర్శిభిః
నిత్యంసర్వాస్వవస్థాసునాఽ సద్భిరితిమేమతిః
యథోదయగిరేర్ద్రవ్యం సన్నికర్షేణదీప్యతె
తథాసత్సన్నికర్షేణ హీనవర్ణోఽపిదీప్యతే
యాదృశేనహివర్ణేన భావ్యతేశుక్లమంబరం

తాదృశం కురుతే రూపమేతదేవమలేహిమే
తస్మాచ్ఛేషురజ్యేథా మాదోషేషుకదాచన
వృత్తిస్సకాశాద్వర్ణేభ్యస్త్రిభ్యో హీనస్యశోభనా
ప్రీత్యోపనేతానిర్దిష్టా ధర్మిష్టా కురుతేసదా॥
(భారతము శాంతిపర్వము)

పితృ పితామహులనుండి వృత్తిహీనులైన శూద్రులు ఇతర పవృత్తిని వెదకదగదు. సత్పురుషుల సేవ ప్రీతితో చేసిన మాత్రముననే వీరు ధర్మిష్ఠులగుదురు. ఎప్పటికిగాని దుర్గుణము గల వారి సేవ మాత్రము చేయదగదని తాత్పర్యము.

ఇప్పుడు వర్ణసంకరముచే బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు చెడి తమకు నైజముగా నుండదగిన వృత్తిని తొలగి అందరు శిశ్నోదర పరాయణులై స్వలాభమే లక్ష్యముగా కలవారై చెడి నందున హీనవర్ణము వారిని కడతేర్చు భాగ్యము వీరికి లేకపోయె. వర్ణసంకరముచే కలిగిన కీడు ఎంతని చెప్పవచ్చును!

ఏమియు తెలియని పసిపిల్లల వంటి శూద్రులను తమ దగ్గర తీయుటచేతనే కడతేర్చగల పుణ్యమును మూడువర్ణము ల వారును పోగొట్టుకొనిరి. ఒకరినొకరు కడతేర్చవలెననెడి తలంపే నాశనమాయె.

అన్ని వర్ణములవారు దేహములో వేర్వేరు అంగముల వలె నుండిరి.

బ్రహ్మాండమునకు బ్రాహ్మణులు ముఖముగాను, క్షత్రియులు భుజములుగాను, వైశ్యులు ఊరువులుగాను, శూద్రులు పాదములుగా నుండిరి. ముఖమందుండు కన్నులు వీడు మిత్రుడు, వీడు శత్రుడని తెలిపినపుడు బాహువులు శత్రువులను హతము చేసి మిత్రులను రక్షించును. (సశేషము).

జం. శ్రీనివాసరావు.

# శాంతము.

పుష్పము లన్నిటిలో రోజాపుష్ప మతి సౌందర్యము గాను వాసన గలది గానుండును. అందుచేతనే ప్రజలందరును దాని నెక్కువగా గణించి కొనియాడుచున్నారు. అయిన నారోజాపుష్పమున కంటె నతి సుందరమగు మరియొక గొప్ప పుష్పము గలదు. అది మనుజునకు వన్నె దెచ్చును. విలువ గలిగిన బంగారము గూడ దానితో సరిరాదు. అట్టి మహిమగల పుష్పము పేరు వినుటకు మనకందరకును నెంత కుతూహలముగా నుండును! దానిని మన మేమని కొనియాడ గలము. దానితో బూజించిన భగవంతుడెంత సంతసించును. గులాబి పుష్పమును దాల్చిన యెడల వెండ్రుకలకు మాత్రమె పరిమళము వచ్చును. ఈపుష్పమును దాల్చినయెడల శరీరమున కంతయు వన్నెవచ్చును. ఆమనుజు డందరిచేతను కొనియాడబడును. అటువంటి పుష్పమును ధరించిన మహానుభావుడు గౌతమ బుద్ధుడు. శ్రీకృష్ణుని మెడ యందుండు మణులలో నది యొకటి. విశ్వామిత్రు డనేక పర్యాయములు తపస్సు చేసి యాపుష్పమును బడయ ప్రయత్నించెను గాని విఫల మనోరథుడయ్యెను. అంత మహిమగల యాపుష్పము పేరు శాంతము.

పేరు విని నంత మాత్రమున నిది యేనా యని చులకన చేయ గూడదు. దీనిని బడయుట యతి దుర్లభము. ఇది సామాన్య జనుల కతీతమైనది. ఇది మోక్ష పదవిని చెందుట కొక సోపానము. వేలకొలది జనులు ఈమెట్టుమీదికి పోదలచి చివరకు పడిపోవు చున్నారు. మనుజునకు శాంత గుణమె ప్రధానము. స్త్రీలకు వేరు ఆభరణములతోను పుష్పములతోను నలంకరించుకొన పనియేమి. ఒక్క శాంతము

నగను ధరించిన నది శిరోభూషణము గదా! స్థూల శరీరమును విడిచిన యెడల సువర్ణభూషణములతో పనిలేదు. ఈ నాణ్యమట్లుగాదు. చనిపోయినప్పటికిని యీ శాంతమును అభ్యసింపవచ్చును. గృహిణికి శాంతముండిన యెడల యీ సంసారము స్వర్గమని జెప్పవచ్చునుగదా. శాంత స్వరూపముకల పుణ్యాత్మురాలి బిడ్డల గుణముల నేమనికొనియాడ గలము. వామనమూర్తి బలిచక్రవర్తిని మూడవ అడుగు ఎక్కడ నుంచవలెనని యడుగగా ఆరాక్షస రాజతి శాంతముతోను అతివినయముతోను నేమని జెప్పెను. "స్వామీ! జగద్రక్షకా! తమపాదమును నాశిరస్సునందుంచుడు" అనెను. ఆహా! యేమి శాంతము. దానిప్రభావమేమి? దానిని దలంచిన యెడల శరీర ముప్పొంగక మానదు గదా! శాంత పుష్పమును తలచిన మాత్రమున శరీర ముప్పొంగునపుడు దానిని నిర్మించిన మహానుభావుని స్మరించిన నెట్లుండును. సోదరులారా! యూహింపుడు.

## సత్యము.

సత్యమే మనుజునకు వన్నెదెచ్చును. సత్యమె గౌరవమును గాపాడును. సత్యమె వాక్కును శుద్ధిచేయును. సత్యమే జయించును. ఎన్ని గుణములు గలిగినను సత్యము లేని యెడల నిష్ప్రయోజనము. అది కలిగిన గాని మనుజుడు మోక్షమును పొందజాలడు. ఎంత చదివి పండితుడైన నేమి. సత్యమును వచింపని యెడల నా మనుజుడు సభలో ఖ్యాతిని పొందునా. ఈ సత్యగుణమును నభ్యసించుటకు మనము ప్రతి క్షణమును ప్రయత్నింపవలయును. సత్యముగా నుండవలెనని యనుకొనిన జాలదు. ఎంత స్వల్ప పని యందైనను నబద్ధమాడరాదు. ప్రపంచమందు అనేక జనులు యబద్ధపు సాక్ష్యముల జెప్పి విస్తారము ధనమార్జించుచున్నారు గదా! దానికి తగిన ఫలము ఈ జన్మమందె కాకపోయినను మరియొక జన్మ

మంగైనను అనుభవింపక మానరు.

మనకు ప్రాణము పోవు సమయము వచ్చినను, భార్యా పుత్రాదులు విడనాడినను, ధనములు గోలుపోయి నను, బంధువులు దూషించినను, సంపదలు తొలగి నను ఎన్నటికిని అబద్ధము చెప్ప గూడదు. సత్యమె వచింపవలయును. ఇది ప్రతి మనుజునకును ప్రథమ ధర్మము. పూర్వమందు హరిశ్చంద్రుడు సత్యమునకై విశ్వామిత్రునిచే పలుబాధల నొందెను. శిబి చక్ర వర్తి తాను ఆడి తప్పినందువలన దోషమువచ్చునని తన మేని కండలు కోసి యిచ్చెను. బలిచక్రవర్తి తాను వామనునకు మూడడుగుల నేలయిచ్చెదనని జెప్పి శుక్రాచార్యు లెంత బోధిం చినను వినక చివరకు తన రాజ్యమును గూడ గోలుపోయెను. దశరథుడు తన ప్రియ భార్యయైన కైకకు వరముల నిచ్చెదనని జెప్పి ఆమె దుస్తరమైన కోరికలు గోరినప్పుడు మారు వచింపక యిచ్చి చనిపోయెను. ధర్మరాజు సత్యమునకై యనేక కష్టము లు పడెను. అయితే ధర్మరాజు ఒక సమయమునందబద్ధ మాడెనని యుదాహరణముగా గైకొనుచున్నారు. ఆయన అస త్యమును పలికి నందుకుగాను దానికి తగిన ఫల మనుభవించెను. ఆపత్కాలమందసత్యము జెప్పవచ్చునని భాగవతములో శుక్రా చార్యులు చెప్పిరని కొందరు తలంచుచున్నారు. శుక్రాచార్యులు చెప్పినది వాస్తవమె. అయితె యానీతిని బలిచక్రవర్తి యంగీ కరించెనా. లేదు. ఆయనయే యంగీకరించనపుడు మనమేల యంగీకరింప వలయును. మనమందరమును సత్యపరులుగా నుండుటకు మన పురాణములలో నిన్ని దృష్టాంతములు గలవు. పూర్వమందే గాక ప్రస్తుత కాలమందు గూడ యథార్థవాదులు గా నుండు మహనీయు లెందరోగలరు. దివ్యజ్ఞాన సమాజము నకు నధ్యక్షులుగానున్న శ్రీమతి యానిబెసంటమ్మగారి జీవచరి

త్రమునొక సారి వీక్షింపుడు. ఈ మహనీయురాలు సత్యమునకై నిర్భయముగా వాదించును. ఈయమ్మగారొనరించు కార్యములె సత్యముయొక్క దృష్టాంతములు. లోకమాత యనదగిన యీ మహాతల్లి చరిత్రమునుండి నేర్చుకొనదగిన యంశములు పెక్కు గలవు.

సత్యమనాదిసిద్ధమైన ధర్మము. సత్యమునకు ప్రతి మానుజుడును నమ్రతతో సాష్టాంగ నమస్కారమొనరింపవలయును. సత్యమే తపస్సు. సత్యమే యోగము. సత్యమే బ్రహ్మము. యజ్ఞము లన్నింటిలో సత్యము గొప్పది. సత్యముయొక్క రూపము లెవ్వియనః—నిష్పక్షపాతము, ఇంద్రియ నిగ్రహము, వినయము, మంచితనము, పరిత్యాగము, ధ్యానము, గౌరవము, మనస్స్థైర్యము, కనికరము, నిరపాయము, ధర్మము. సత్యమును పలుకుటకంటె వేరు ధర్మము లేదు. అబద్ధమాడుటకంటె పాపము లేదు. పాపపుణ్యములకు సత్యము పునాది. ఒకానొక సమయమందు వెయ్యి అశ్వమేధ యాగములను సత్యమును త్రాసులో వేసి తూచినపుడు సత్యము గల పళ్ళెము అధిక బరువు గలిగి యశ్వమేధ యాగములుగల పళ్ళెమును త్రెళ్ళి వేసెను.

ముమనూరు ప్రేమయ్య.

## నియోగి మహాజన సభ.

కృష్ణాజిల్లా పామఱ్ఱు గ్రామమునందు

1916 సంవత్సరం జూన్ నెల ౧౬, ౧౭, ౧౮ తేదులయందు

౧౩-వ నియోగి మహాజన సభ

జరుపబడును.

# Divyagnanadeepika.

CONTENTS OF THIS NUMBER.



-:0:-

## నియోగి విద్యానిధి

1860 సం॥ 21 నెంబరు ఆక్టు ప్రకారము 25—10—15 తారీఖున రిజిష్టరు చేయబడినది.

ఈసంఘోద్దేశ్యము లేమియనగా

(1) నియోగిజనులలో వ్యావహారికవిద్యను వ్యాప్తిజేయుట. (సైంటిఫిక్, టెక్నికల్, విద్యలు వ్యావహారిక విద్యలలో చేరియున్నవి.)

(2) సంస్కృతము, వేదము, వీనిని నియోగిజనులలో వ్యాపింపజేయుట.

(3) పైన చెప్పిన యుద్దేశములలో అన్నిటినిగాని కొన్నిటినిగాని నెరవేర్చుటకు అవసరమగు లేక సహాయకారిగానుండు పనులనన్నిటిని నొనర్చుట.

ఈనిధియొక్క ప్రధాన కార్యస్థానము ప్రకృతము గుంటూరు నందున్నది.

-:0:-

Registered No. M. 716

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

## A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె వేరొకధర్మము లేదు)

July 1916.

సంపుటము 7. సంచిక 4.

జూలై నెల 1916.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
R P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఐరోపా యుద్ధమువలన కాగితములు దొరకుట దుర్లభమయినందున ఈమాసం [illegible] దెలియునుగదా. ఇది సకాలములో వెలువడక ఆలస్యమైనందుకు చందాదారులు క్షమించెదరుగాక.

ఓమ్.


# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 7. **July 1916.** సంచిక 4.

జూలై నెల 1916.


## కాలదేశ వర్తమానములు.

రాంగల ఆగష్టునెల 19-20 తేదులందు (శనిభానువారములు) మధ్యజిల్లాల దివ్యజ్ఞాన సమాజ శాఖలవారు అనంతపురములో సభ చేయుదురు. అనేకులు మహాశయులు ఆసక్తి కనపర్చెదరు. ఇంగ్లీషులోను తెనుగుభాషలోను ఉపన్యాసములు చేయబడును. పరస్థలముల నుండి సభకు వెళ్లువారికి భోజనాదులు వసతు లేర్పాటుచేయబడును.

అనిబెసెంటమ్మగారు పునహా పట్టణమునకు వెళ్ళియుండి కృతకార్యులై మరల అడయారునకు వచ్చిరి. పునహాలో జరిగిన కార్య విశేషము వలనను, వర్షము వచ్చినందువలనను వారి దేహస్థితి కొంచెము అనారోగ్యమైయుండెను. ఇప్పుడు మరల నారోగ్యస్థితికి వచ్చియుండుట నందరికిని సంతోషకరము. ఈనె

యందు ఈశ్వరాంశ మధికముగా నుండుటచేతనే అఘటనా ఘటన కార్యములను జేయుచున్నది. భగవంతు డీమె కారోగ్య భాగము నెక్కువగా ననుగ్రహించుగాక!

దివ్యజ్ఞాన సమాజమువారు మదనపల్లెలో జరుపుచుండు ప్రౌఢవిద్యాశాల (College) చాల నున్నత స్థితికి రాబోవు చిన్నములున్నవి. 100'×40' అడుగులు కొలతగల ఒక మందిరము. (Annie Besant hall) చాలకట్టుకు ముగిసియు న్నది. నాలుగువందల గదులుగల యొకభోజనశాల నిర్మించ బడుచున్నదని తెలియవచ్చినది. ఈవిద్యాశాల నాలుగంగముల గల విద్యాశిక్ష నిచ్చి బాలురను దేశవత్సలులు గాను, విద్యా ప్రౌఢులుగాను చేయుగాక!

*　　*　　*

ఏ కార్యమును జేయవలసి యున్నను అధ్యక్షుడును అనుచరు లనేకులును ఉండవలెను. వారికి గల సంబంధము కేవలము పవిత్రమయినదిగాన నుభయులును తమ యుత్తరవా దిత్వమును చక్కగానిర్వహింప యత్నించవలెను. అధ్యక్షునియం దు మంచితెలివియు, దూరాలోచన శక్తియు, నింగితజ్ఞతయు, భూతదయ పశ్చాత్తాపమును, క్షమాగుణము, కార్యనిర్వాహక శక్తియును, శాంతము, నిగ్రహము, పరులకష్టములను తెలిసి కొనుశక్తియును, సుహృదయము నుండవలెను. అనుచరులయం దు స్వామిభక్తియును, మనోప్రసన్నతయును, విధేయత్వమును, కష్టములనోర్చుకొను శక్తియును, ఆత్మనివేదనము నుండవలెను. ఇట్టి గుణములుగల అధ్యక్షులును అనుచరులును ఏకార్యమందు ప్రవర్తించెదరో ఆకార్యము ఫలకారి యగుట నిశ్చయము.

*　　*　　*

మన భరతభూమి యందాచరణ కంటెను మాటలెక్కు

వగా నున్నవి. తమకు నిశ్చయమని తోచిన విషయములయందు సయితము జనులనుష్ఠానపరులుగా లేరు. ఇది జనాంగముయొక్క పరివర్ధమానమునకు చాల ప్రతి బంధకమని చెప్పవచ్చును. సొరకాయను తినగూడదని బోధించిన యాచార్యుడు తనయింటిలో దానిని వండించి తినిన సామితకు తగినట్లుగా మన యాచరణ లున్నవి. మనము వాక్యాభిప్రాయములను వదలి దేనియందు యాథార్థ్యబుద్ధి మనకు గలదో దాని ననుసరించి నడవనేర్చినట్టయిన మనకును మన దేశమునకును మేలగును. ప్రకృత సమయమున తమ యభిప్రాయములకు తగినట్లు నడచువారనేకులు గావలసియున్నది. తమ మనస్సాక్షి కనుగుణముగా నడుచువారు శ్రేయోమార్గమును బొందుట యథార్థమేగాని తమకన్న నుత్తములు సూచించు మార్గములయందు వెళ్లువారి పరివర్ధమాన మంతకంటె త్వరగా నడుచును.

భిన్నాభిప్రాయముల నోర్చుకొని పనిజేయ నేర్చుట గొప్ప సద్గుణమని జెప్పనగు. లోకమంతయు నొకవిధముగానే భావించుచు, వర్తించుచున్న యెడల మానవజన్మమంత రమ్యముగా నుండదు. గానవిద్యయందు భిన్నభిన్నమైన ''సరిగమపదని'' యను సప్తస్వరము లుండుటచేతనే నది మన చెవులకింత నింపుగా నున్నది. వేర్వేరుస్వరములులేక నొకటే స్వరమున్న యెడల గాన మంత సుశ్రావ్యముగా నుండదుగదా! లోకములో భిన్నత్వము సహజమయి యున్నది. అది యుండుటచేతనే ప్రాణులకు సుఖసంతోషము లున్నవని జెప్పవచ్చును. భిన్నత్వము ప్రకృతిలక్షణము. ప్రకృతి మయమగు నీజగములో నుండువరకును తప్పకనుండును. బుద్ధిమంతులగువారు భిన్నత్వమున కాధారమగు నేకత్వమందు దృష్టియుంచి లోకహితమును నట్లాచరింతురు.

# విష్ణుస్తోత్రం.

అప్రమేయ హరేవిష్ణో కృష్ణ దామోదరాచ్యుత॥
గోవిందానంత సర్వేశ వాసుదేవ నమోస్తుతే॥

మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే। మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏషఏవ। త్వద్భృత్యభృత్యభృత్య పరిచారక భృత్య భృత్య। భృత్యస్య భృత్య ఇతి మాం స్మరలోకనాథ॥

గోవింద కేశవ జనార్దన వాసుదేవ। విశ్వేశ విశ్వ మధుసూదన విశ్వనాథ। శ్రీపద్మనాభ పురుషోత్తమ పుష్కరాక్ష। నారాయణాఽచ్యుత నృసింహ నమోనమస్తే॥

నాన్యంవదామి నశృణోమి నచింతయామి। నాన్యం స్మరామి నభజామి నచాశ్రయామి। భక్త్యాత్వదీయ చరణాంబుజ మంతరేణ। శ్రీ శ్రీనివాస పురుషోత్తమ దేహిదాస్యమ్॥

నమోనమఃకారణ వామనాయ। నారాయణా యామిత విక్రమాయ। శ్రీశార్ఙ్గ చక్రాబ్జ గదాధరాయ। నమోస్తు తస్మై పురుషోత్తమాయ॥

త్వమేవమాతాచ పితాత్వమేవ। త్వమేవబంధుశ్చ సఖాత్వమేవ। త్వమేవవిద్యా ద్రవిణం త్వమేవ త్వమేవసర్వం మమ దేవదేవ॥

యజ్ఞేశాచ్యుత గోవింద మాధవానంత కేశవ। కృష్ణవిష్ణో హృషీకేశ వాసుదేవ నమోస్తుతే॥

నమఃకృష్ణాయ దేవాయ బ్రహ్మణేఽనంత మూర్తయే॥
యోగీశ్వరాయ యోగాయ త్వామహం శరణంగతః॥

కం॥ నారాయణదామోదర నీరజదళనేత్ర చక్రి నిరుపమజగదా
ధారా గోవింద నమస్కారము యదుపుత్ర నిత్యకల్యాణహరీ॥

-:0:-

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

(116-వ పుట శేషము)

కన్నులు ఇది లాభమైన వస్తువు ఇది అలాభమైన వస్తువని తెలిపెనేని లాభమైన వస్తువుండు చోటికి కాళ్లుపోయి లాభమైన వస్తువును తెచ్చును. కాళ్లనంటి పాదములును నడుచుచుండును. ముఖముగా నుండు బ్రాహ్మణులు చెడినందున సర్వాంగములకు భాధకలిగె ఏ అంగమునకు బాధ కలిగినను దేహమంతయు తపించును. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులలో నెవరు చెడినను దేశమంతయు చెడు ననెడి తాత్పర్యము పూర్వము పదిలముగా నుండి నందున అందరు నైకమత్యము గలవారై దేహములో నే అంగమునకు బాధ వచ్చినను నివారణచేసి దేహమున కంతయు సుఖము కలుగచేయు చందమున ఒకరి నొకరు అనుసరించి అనుకూలముగ వర్తించుచుండిరి. పాదమునకు బాధకలిగనను, పాదమునకు కశ్మలమంటినను ఆబాధ నివారణచేయువరకును కశ్మలమును కడిగి పరిశుద్ధము చేయువరకు దేహియట్లు ఓర్వకుండునో అట్లనే ఏ వర్ణమునకు బాధ కలిగినను ఏ వర్ణమువారు అపరిశుద్ధులైనను అన్ని వర్ణములవారు చెడిన వర్ణమువారి లోపములను మాపి అందఱికిని సుఖము కలుగ చేయుచుండిరి.

ఇప్పుడో ఎవరంతటవారు తమ స్వలాభములు పొందుటకు ఇతరుల సుఖమునకును వృద్ధికిని ఎన్ని భంగములైనను బుద్ధిపూర్వకముగ కలుగచేసి యత్నింతురు. కాని లాభమేమో పొందజాలరు. అదెందుకనన ఇతరలనువారు తమలోనే చేరినవారుగా నుండుటచే, కాలికి హానిచేసి దేహము సుఖపడ జాలనట్లు ఒకరికి హాని చేయువారు తాము సుఖపడజాలరు.

ఈ రహస్యము తెలిసి పూర్వమందు సంకరముకాక వర్ణా

ధర్మములు క్రమముగ ఆచరణలోనుండి నపుడు హీనవర్ణ ముువారు ఉత్తమ వర్ణమువారి ననుసరించి మేలు పొందుచు ఉత్తము వర్ణమువారు హీన వర్ణమువారిని తమబిడ్డల వలె చూచుచు అన్యోన్య ప్రేమగలవారై తమతమయోగ్యతను, శక్తిని, విద్యను, అనుగ్రహమును పరస్పరము సమర్పించి అందరును ఆనందమొంది, సంతుష్టిచెంది సర్వదా అభివృద్ధి యగుచు ఈశ్వరసంకల్పము ననుసరించి ప్రవర్తించుచుండిరి.

అదెట్లన దేహసామర్థ్యము మాత్రముగల శూద్రులు తమ దేహసామర్థ్యమునే పైమూడు వర్ణములవారికి సేవ ద్వారా సమర్పించుచు పైవారి ఆశీర్వాదములద్వారా వారిగుణ ములు గ్రహించుచును, వైశ్యులు తాముసంపాదించిన ధనధాన్యా నులు తమకంటె నితరవర్ణములవారికి సమర్పించి సుఖము కలు గ జేయుచును, ఇతర వర్ణముల వారినుండి తాము ఆశీర్వాద, రక్షణ, సేవలను పొందుచును, క్షత్రియులు తమబలపరాక్రమ శక్తియు, పాలనాధికారమును ఇతరవర్ణస్థులకు వినియోగించి సుఖంబొనరించుచును, తాము ఇతరులనుండి వారిచ్చు దానిని స్వీకరించుచు, బ్రాహ్మణులు తమ జపతప, విద్యా, జ్ఞానసంపద ను ఇతరులకు విస్తారముగ ధారబోయుచు ముల్లోకములకును సుఖం బొనరించుచుండిరి.

ఇప్పుడిట్టి పరస్పర సహాయముల ప్రశంసే లేక పోయి యుండి ఇప్పుడిప్పుడు దివ్యజ్ఞానసమాజ బోధలచే మరల నంకుర మెత్తుచున్నది.

ఇట్లు చెడిన దానిని చక్క పెట్టుటకు సామాన్యుల వలన నెప్పటికి గాని కాజాలదు, కనుక మహాపురుషుడే రావలెను, ఆరాక సమీపమంమున్నదని తెలిసిన పెద్దలు చెప్పుచున్నారు.

ప్రవృత్తిమార్గ 'ధర్మములలో నేర్పరచినట్లు శూద్రులు శుశ్రూష చేయవలెనని చెప్పియుండుట, క్రమముగా నెరవేరి

నపుడు ఎంత మేలగునో యోచించుడు.

ఇంతవఱకు వర్ణములు స్వచ్ఛముగా నుండి నపుడు వర్ణహీనులైన శూద్రులు వర్ణవంతులైన బ్రాహ్మణుల సాంగత్యముచేతను సేవచేతను ఎట్లు ఉత్తమ వర్ణమునకు రాఁగలరో ఆ విషయమునుగురించి వ్రాయబడెను. ఇప్పుడు బ్రహ్మచర్యాశ్రమముచే కలుగు మేలును గురించి వ్రాయబడును.

బ్రహ్మచర్యాశ్రమము కేవలము ముఖ్యమైన ఆశ్రమము. ఈ ఆశ్రమమందు సాంతముగ శిక్షనొంది తేరినవారు దీనికి ఆవలి ఆశ్రమమును గృహస్థాశ్రమ ధర్మములు మిగుల సుఖకరముగ నెరవేర్చ సమర్థులై యుందురు. మొదటినగు ఈ యాశ్రమ ధర్మమును నెరవేర్చక ఉపేక్షించి నందుననే సమస్తాశ్రమ ధర్మములు నాశనమొంది మన మాతృభూమికి భరించజాలని అపయశస్సు ప్రాప్తమాయె.

బ్రహ్మచర్యాశ్రమము అన్నివర్ణములవారికి సామాన్యము. అనగా నీధర్మములు అందరు ఆచరించ దగియుండును. ఈ యాశ్రమమందు అన్నివర్ణములవారు అనగా బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు భిక్షాన్నముచేతనే జీవించవలసి యుండును. ఈ ఆశ్రమమునకు విధించియుండు ధర్మములు పూర్వజన్మములందు చేసిన కర్మానుగుణ్యముగ నుత్పత్తియైన సుగుణ బీజములు క్రమముగ అంకురమెత్తి వృద్ధి అగుటకును, దుర్గుణ బీజములను మొలవనివ్వక నాశము చేయుటకును ముఖ్య సాధనములుగా నుండును. అదెట్లన జీవుడు జన్మమెత్తు నపుడంతయు వెనుకటి జన్మ వాసనలచే సత్వరజస్తమో గుణముల వ్యత్యస్తములతో జనించును. ఒక జీవుడు తమోగుణ మధికముగను, ఒకడు రజోగుణమధికముగను, ఇంకొకడు సత్వగుణము ప్రధానముగను కలవాడై పుట్టు. ఈ బ్రహ్మ చర్యాశ్రమమందు దుర్గుణము లంకురమెత్తకుండను సుగుణము లత్యంత ప్రబలస్థితి నొందునట్లును

శిక్షించు విధి శాస్త్రములం దేర్పడి యున్నది. అది ముందు వివరింపబడును.

ఈ యాశ్రమ మందే ప్రతిజీవుడును తనకు తగిన విద్య నేర్చుకొనవలసి యుండును. పూర్వమందు విద్యాధనము పాత్ర మెరిగి యథేచ్ఛగ దానము చేయుచుండిరి. ఎంత బీదవాడైనను విద్యను సంపాదించుటకు వసతులేర్పడియుండెను. ఇప్పటివలె పేదలకు విద్య లభించుట దుస్తరముగ నుండలేదు. అదేలనన విద్యాదానమున కంటె నెక్కువ దాన మేదియు లేదనెడు నిశ్చయము అందరి హృదయములందు నాటియుండెను.

శ్లో॥ అన్నదానాత్పరంనాస్తి విద్యాదానంతతోధికం।
అన్నేనక్షణతృప్తిస్స్యాత్ యావజ్జీవంతువిద్యయా॥

అన్నదానమున కంటె నెక్కువ దానము లేదు. అంత కంటె నధికమైన దానము విద్యా దానము, అన్నము క్షణ మాత్రము తృప్తి నొసంగును, విద్య జీవిత కాలమంతయు సంతుష్టి కలుగజేయునని తాత్పర్యము.

శ్లో॥ నాస్తివిద్యాసమంచక్షుః నాస్తిసత్యసమంతపః।
నాస్తిరాగసమందుఃఖం నాస్తిత్యాగసమంసుఖం॥

విద్యకు సమమయిన కన్ను లేదు, సత్యమునకు సదృశమైన తపస్సు లేదు, రాగము (నాది అను భావము) నకు సరి పోలు దుఃఖము లేదు, త్యాగమున కీడయిన సుఖమును లేదని విదుర నీతియందు చెప్పబడినది.

అజ్ఞానాంధునకు విద్య కన్నువంటిది. గుడ్డివాడు మార్గ మందుండు మిట్ట పల్లములు తెలియక నెట్లు కష్టపడునో అట్లనే విద్యా నేత్రము లేనివాడు మంచి చెడ్డలు గుర్తెరుగక వగచు చుండును.

మఱియు విద్యాధనమునకంటె నెక్కువధనము లేదు. ఏ ధనముగాని ఇచ్చినకొలదిని తరుగునుగాని పెరుగదు. విద్యా

నము పూర్తిగనిచ్చినను పెరుగుచుండును. ఇతరధనమును ఎవరైన నపహరించ గలరు. ఈ ధనము నపహరించుటకు గోచరముగా నుండును. ఇతర ధనము ఒక సమయమందు సుఖమును, ఇంకొక సమయమందు దుఃఖము నిచ్చుచుండును. విద్యాధనము రాత్రింబగళ్లు సుఖమునే యిచ్చుచుండును. విద్యాధనము ఇతర ధనమునకంటె నెక్కువకీర్తి ఘటిల్ల జేయును. విద్య ఇంత యుత్కృష్టమైనదని భర్తృహరి చెప్పియున్నాడు.

శ్లో॥ హర్తుర్యాతి నగోచరంకిమ పిశంపుష్ణాతియత్సర్వదా
అర్థిభ్యఃప్రతిపాద్యమానమనిశం ప్రాప్నోతివృద్ధింపరాం
కల్పాంతేష్వపిన ప్రయాతినిధనం విద్యాఖ్యమంతర్ధనం
యేషాంతాన్ప్రతిమానముజ్ఝ తనృపాః కస్తైస్సహస్పర్ధతే॥

దీనితాత్పర్యము పైన వ్రాయబడినది.

కల్పాంతములైనను వెంటనంటివచ్చు ఉత్తమోత్తమమైన ధనము గనుక దీనిని సత్పాత్రమెరిగి పుష్కలముగ దానము చేయుచుండిరి. ప్రదానముగాని దేశకాలపాత్రములెరిగి దానము చేయవలెనని శాస్త్రములందు విధించబడినదిగాని అదేశ అకాల అపాత్రములందు దానమొసంగవలెనని నియమించలేదు. వేర్వేరు విద్యలకు వేర్వేరుపాత్రము లేర్పరచబడినవి. విద్యానుగుణ్యమగు పాత్రత తెలిసి పూర్వమందు విద్య నిచ్చుచుండిరి.

అపాత్రులకు విద్యాదానము చేయుటచే అనర్థములకు కారణమగును.

శ్లో॥ అసత్పాత్రేచయద్దత్త మసత్పాత్రేప్రతిగ్రహః
ఉభయస్యామనర్థాయ దాతురాదాతురేవచ;
యథాఖాదిరమాలంబ్య శిలాంవాప్యర్ణవంతరన్
మజ్జేతమజ్జతస్తద్వద్దాతాయశ్చప్రతిగ్రహీ॥

అపాత్రులకిచ్చుటచే ఇచ్చువానికిని పుచ్చుకొనువానికిని మంచిదికాదు. ఉభయులకును అనర్థము కలుగును. చంద్ర

మానునుగాని రాతిని గాని నావగా చేసికొని సముద్రము దాటను యత్నించినవాడెట్లు ఆ మానును రాతిని ముంచి తాను ను మునుగునో అట్లనే అపాత్రుల కిచ్చువాడును పుచ్చుకొన్న వాడును మునుగుదురని భారతమందు చెప్పబడినది.

దుర్జనులకు విద్యఘటిల్లినచో లోకమునకు భీతిగలుగ జేతురు.

శ్లో॥ దుర్జనః పరిహర్తవ్యో విద్యయాలంకృతోపిసన్
మణినాభూషితస్సర్పః కిమసౌనభయంకరః॥

విద్యచే నలంకరింపబడినవారయినను దుర్జనుల విడువ వలయు. సర్పము శిరస్సున దేదీప్యమాన మయిన మణియుండి నను భయంకరముగదా అని భర్తృహరి నుడివియున్నాడు.

శ్లో॥ విద్యామదోధనమద స్తృతీయోభిజనోమదః
మదాఏతేవలిప్తానా మేతఏవసతాందమాః।

విద్య, ధనము, కులము ఈమూడును దుష్టులను మదోన్మత్తులుగా జేయును. ఇవేసత్పురుషులను దమవంతులుగా జేయునని విదురనీతియందు చెప్పబడినది.

ఏదైననొక వస్తువును ఒకనికిచ్చినపుడు పుచ్చుకొన్నవానికిని లోకమునకును హితము కలుగజేయు నట్లుండినపుడు ఇయ్యవలెగాని పుచ్చుకొన్న వానికిని ఇతరులకును అహితము కలుగ జేయు నట్లున్న నది యియ్యదగదు. ఈ ధర్మము పూర్వము విద్య నేర్పువారు బాగుగ నెఱిగియుండిరి గనుక విద్యార్థులకు విద్యాస్వీకారమునకు పాత్రత కలుగజేసి విద్యనొసంగుచుండిరి.

శ్లో॥ శాకల్పలతాలోకే సచ్ఛిష్యాయార్పితావిద్యా
కోక్షయవట వృక్షస్స్యా ద్విధివత్సత్పాత్రదత్తదా
నంయత్॥

కల్పతరువువలె పదిసకలఫలంబు లొసంగునన సచ్ఛిష్యుల కు నేర్పిన విద్యయనియు, అక్షయ వటవృక్షమువలె పదిశాశ్వత

ముగనుండుననిన సత్పాత్రులకిచ్చిన దానమనియు శ్రీశంకరాచార్యులు ప్రశ్నోత్తర రత్నమాలయందు చెప్పియున్నారు.

పూర్వము విద్యార్థులకు ఎట్లు పాత్రత కలుగజేసి విద్య నిచ్చుచుండిన విషయమును గురించి యొక దృష్టాంతము వివరించెద:—

గంగాతీరమున నొక విద్వాంసుడగు యోగి యుండెను. ఆయన కడకు ఇద్దరు విద్యార్థులేతెంచి దండప్రణామ మొనర్చి చేమోడ్చి దీనభావంబున విద్యాభిక్షనడిగిరి. ఆయోగి అత్మవేత్తగాన అంతర్దృష్టితో వీరిద్దరిస్వభావము కనుగొని ఒకనితో నరుడా నీవుదయమున తనఆశ్రమమునకు వచ్చినవాడైన శిష్యునిగా గ్రహించి విద్యనేర్పెదననెను. రెండవవానితో క్రోధబీజములు నీస్వభావమందు విశేషముగ నాటియున్నవి, వానిని పూర్తిగ పెంచి పరిపక్వముచేసి ఫలమనుభవించిన తరువాత వచ్చినట్లయిన నిన్నుశిష్యునిగాగైకొని విద్యచెప్పెదనని పలికెను. వీనికిట్లు చెప్పుటకు కారణము, వీనియందు నాటియుండు క్రోధ బీజములు వాని ఫలానుభవము చేతనే తప్ప, బోధచేత గాని లేక యితర యేవిధమున గాని నాశముచెందుటకు సాధ్యముగా నుండకుండుట తప్ప వేరు కాదు. ఈవిద్యార్థి మారు బలుకక ఇంటికేగెను. వీనిలో నుండు క్రోధస్వభావము బలిష్ఠముగా నుండినందున ఏమాత్రము దానిప్రకాశమున కవకాశము కలిగినను మిగుల వృద్ధియై అందరితో కలహించునట్లును, విరోధము పెంచునట్లును వర్తింపజేసెను. కొన్నిరోజులలోనే వీనికి ఊరిలోనివారు విరోధులగుటయే గాక ఇంటివారు సయితము విసుకుజెంది ఇల్లువెళ్లగొట్టిరి. మరి కొంత కాలమునకు కొందరు వీనిస్వభావమున కోర్వజాలక దేహమంతయు వాయునట్లుకొట్టిరి. ఈ కష్టమంతయు అనుభవించిన తరువాత వాడు బుద్ధి తెచ్చుకొని ఈకోపము చేతకదా నాకిన్నివిధములకష్టములు దుఃఖములును ప్రాప్తమాయె? ఇదెంత చెడ్డది,

ఇకమీద ఎవరేమనినను నేనుమరుమాటలాడను, ఈకోపము నాలోనుంచి పారతోలెదనని నిశ్చయించి నాటినుండి అతి శాంతము వహించియుండెను. ఇట్లు కొంతదడవుండ ఒకనాడు గురువు ఎదురుగవచ్చెను. అపుడు గురువు ఏమిరా వత్సా నాయాశ్రమమునకు రాలేదు, కోప ఫలముపూర్తిగ అనుభవించితివా యని అడుగగా స్వామీ కోపఫలము పరిపూర్తిగ అనుభవించితిని దానిచే కలిగిన వంటి నొప్పులింకయు మానకున్నవి. మనోవ్యాకులము చెప్పుటకేలేదు. ఇంక దానిని నా సమీపమునకైనను రానియ్యను. ఇంక నాకు దానికి కడుదవ్వాయెనని శిష్యుడు చెప్పెను. అప్పుడా గురువు తండ్రీ నాయాశ్రమమునకు రమ్ము నీకు విద్య నేర్పెదనని తోడ్కొనిపోయి ఇట్లు చెప్పెను.

శ్లో॥ అపకారిణికోపశ్చే త్కోపేకోపఃకథన్నతే
ధర్మార్థకామమోక్షాణాం ప్రసహ్యపరిపంథిని॥

ధర్మార్థకామమోక్షములగు చతుర్విధ పురుషార్థములను పారదోలు కోపముమీద నీకు కోపము మొదటనె యెందుకు రాలేదు. ఇప్పుడు నీకు కోప ఫలానుభవము వచ్చినందున దానిమీద కోపమువచ్చి కోపమును పారదోలితివి. ఇంక నీకు విద్యనేర్పిన ఆవిద్యద్వారా నీకు నీనుండి యితరులకును మేలుకలుగును. కాననిప్పుడు నేర్పెద, ఈకోప స్వభావము నీయందు నాటియుండినపుడు విద్యనేర్పియుండినంతట నీకోప స్వభావము విద్యా బలముతోకూడి మితిలేని హాని దేశమునకు చేయుటకు వీలుగానుండెను. విద్యా బలములేకనే క్రోధము పలు తెరంగుల క్షోభ కలుగజేయును.

(సశేషము).

జం. శ్రీనివాసరావు.

# మోక్షమార్గ ప్రదీపిక.

(96-వ పుట శేషము.)

ప్రశ్న:- పురుషుడు దేనిచేత ప్రేరేపితుడై తన కిష్టములేకున్నను బలత్కారముగా నియోగింపబడినవానివలె పాపకార్యముల నాచరించుచున్నాడు?

ఉత్తరము:- రజోగుణమువలన బుట్టిన కామక్రోధముల వలన.

కావున నివృత్తి మార్గమున ముఖ్యముగ జేయవలసినపని ఆత్మశక్తి కామరూపముగా బహిర్గతమై యింద్రియములకు విజృంభణ మెక్కుడుజేసి మనస్సును దిరస్కరించునట్లు సేయ నియ్యక తానీశ్వర సంకల్ప మెఱుంగునది కనుక, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అన్నియు దనయిచ్ఛానుకూలముగ వినియోజిత కార్యము నెరవేర్చునట్లు దనవశములో నుంచుకొన వలయును.

కామము, ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని నధిష్ఠానములుగ జేసికొని పురుషుని దుష్కార్యములందు ప్రేరేపించును.

ఇంద్రియాణిమనోబుద్ధి రస్యాధిష్ఠానముచ్యతే
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినం॥

(భగ. 3. 40)

ఇట్లు శత్రుస్థానముల దెలిసికొని జయించ నుద్యమించవలెను.

మొట్టమొదట నింద్రియముల నియమించవలెను.

తస్మాత్ త్వంఇంద్రియా ణ్యాదౌనియమ్య భరతర్షభ

(భగ. 3. 41)

ఇవి బహుకాలము స్వేచ్ఛాప్రవర్తనము గలిగి యిప్పుడు నియమించ దలచువారి నెదిరించును. మోక్షమార్గమునందు ప్రయత్నము జేయు మేధావంతుని నయిత మడ్డగించును,

యతతోహ్యపికౌంతేయ పురుషస్యవిపశ్చితః
ఇంద్రియాణిప్రమాథీని హరంతిప్రసభంమనః॥
(భగ. 2. 60)

వాని నణగింప నుద్యమమే చేయనివారి స్థితియెట్లుండునన, ఘపానువాయువు వీచగా నావ గమ్యస్థానమునకు బోజాలక యిటునటు గొట్టబడినట్లుండును.

ఇంద్రియాణాంహిచరతాం యన్మనోనువిధీయతే।
తదస్యహరతిప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి॥
(భగ, 2. 67)

ఈ శత్రువును జయించు నుపాయమెద్ది? సాధారణ సంగ్రామములకన్న నీయుద్ధము మిగుల కష్టము. ఇచ్చట శత్రువును సంహరించ కూడదు. వశపర్చుకొని జెప్పిన పని మాత్రము చేయునట్లు జేయవలెను. వానికి గల గర్వమును బోగొట్టవలయును. వానికి గల బలము వానియందు గామ రూపమున నున్న ఆత్మశక్తి వలన గలిగినదే. ఆశక్తివలననవి, రాగద్వేష పురస్సరముగా బ్రవర్తించుచున్నవి.

ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌవ్యవస్థితౌ.
(భగ. 3. 34)

వానిని రాగద్వేషవియుక్తములుగ జేసి మన పనియందు విధేయతగా వర్తించునట్లు జేయవలెను.

రాగద్వేషము లెట్లుబోవును? ఇందుకు రెండు తెరగుల గు నుపాయములు కనుపర్చబడియున్నవి. అందు మొదటిది, బ్రహ్మేతర వస్తువులన్నియు అనిత్య ..లని వివేకముతో నెఱిగి యనిత్య వస్తువులందు బలుమారు దోషదృష్టినిడి రాగముపోవునట్లు జేయుట.

విరజ్యవిషయ వ్రాతాత్ దోషదృష్ట్యాముహుర్ముహుః॥
ఇది పైమెట్టుననుండు వారికి సాధ్యము. బ్రహ్మేతర సర్వ

పదార్థములం దనిత్యత్వము గని వానియందు దోష దృష్టితో విరాగము జెందుట మార్గారంభము నందుండువారికి గష్టముగ దోచును క్రమ క్రమముగ నీ రాగము నభ్యసించుట సులభము. అదియే రెండవ యుపాయము దేనిమీద బలముగ రాగమున్నదో దానికన్న గొంచము మేలయిన వస్తువునుజూపి దాని మీద రుచికల్పించి క్రింది దానిని ద్యజింప జేయవలయును. ఇట్టి క్రమ విరాగము కఠోపనిషత్తునందు పఠించబడియున్నది.

మొదట దేనికన్న నేది హెచ్చో కనుపర్చి హెచ్చుగు దానిచే క్రిందిదాని నియమించవలెనని చెప్పబడియున్నది.

ఇంద్రియేభ్యః పరం మనో మనసస్సత్వ
ముత్తమం సత్వాదధి మహానాత్మా.........

(6—7.)

యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని।
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్॥.........

(3—13.)

ఇంద్రియములను మనస్సు చేతను, మనస్సును బుద్ధిచేతను, బుద్ధిని మహదాత్మతోను, జయించవలెను. ఇందుకైనను జ్ఞానము లేక కేవలము దురాచార ప్రవర్తనలయం దింద్రియముల నుపయోగించుచు మనోదౌర్బల్యము నొందిన వారి విషయమిచ్చట ప్రశంసించలేము. నివృత్తిమార్గము నవలంబించవలెనని నిశ్చయించుకొన్న వాడు దురాచారములను సాధారణముగా వదలియుండును. యుక్తాయుక్తములను విచారించియే పనులు చేయుచుండును. అయిన నావిచారము స్వలాభము ననుసరించియుండును. కామ క్రోధాదులు ప్రవృత్తి మార్గమున నుండువానికన్న గొంచము తక్కువైనను బలవత్తరముగనే యుండును. నివృత్తి మార్గస్థునికి కర్మఋణ విమోచనము ద్వారా సంసార నివృత్తియే లక్ష్యస్థానము. ఆలక్ష్యస్థానమును మఱవకయే వర్తించు చుండవలయును.

ప్రతి కార్యము చేయుటకు ముందు, ప్రతిసంకల్పము సంకల్పించుటకు ముందు ఈ కార్యము, ఈ సంకల్పము నాలక్ష్యస్థానమును జెందించునా? లేక నిరోధించునా? అని యాలోచించి ప్రతి బంధకమగుచో దానిని వదలిపెట్టవలెనని నిశ్చయించవలెను. ఇందుకు మహా గురువుల బోధను దెల్పు వాక్యములు "పరమగురు చరణ సన్నిధి" యను గ్రంథమునందిట్లు వ్రాయబడియున్నవి. వానిని ముఖ్యముగ గమనించి యభ్యసించవలెను.

"నీశరీరము వేరు. నీవు వేరు. నీయిచ్ఛ నీశరీరము కోరు దాని ననుసరించి యెల్లప్పుడు నుండదు. నీ శరీర మెద్దియైనను గోరినచో నది యథార్థముగ నీవు గోరునదియగునా యని నిలిచి యోచించుము."

"నీ వీశ్వరుడవే. ఈశ్వరు డిచ్ఛయించు నదియే యథార్థముగ నీవును నిచ్ఛయింతువు. అయితే నీవు నీయంత రంగమును లోతున దిగి శోధించి నీలోనుండు నీశ్వరునిం గనుగొని వానిమాటను దెలిసికొనుము. అదియ నీమాటసుమా. శరీరములే నీవను పొరబాటు పడకుము. స్థూల శరీరము నీవు కావు కామమయి శరీరము నీవు కావు. మనోమయ శరీరము నీవు కావు. ఇవి యొక్కొక్కటియు దనకు గావలయు వానిని బొందుటకు దానే ఆత్మయని నటించును. అయినను వాని నన్నిటిని దెలిసికొని దానికన్నింటి కధీశ్వరుడవు నీవని యెఱుంగుము."

ఇట్లు ప్రతి కార్యము చేయుట యందును ప్రతి సంకల్పము సంకల్పించుట యందును "నేనీశ్వరాంశమును, దేహములు నేను కాను. అవినాపని చేయుటకు కొరముట్లు, నేనీశ్వరుని జెందగలవాడను. అందుకు బ్రతికూలమగు సంకల్ప మైనచో సంకల్పించను, కార్యమును జేయను అనుకూలమైనచో సంకల్పింతును. చేతును" అని లోతున దిగి శోధించి యుక్తాయుక్త వివేచన చేయుటలో ఈశ్వరుని దెసద్రిప్పబడిన మనస్సు ఈశ్వరానుగ్రహ బల

మును బడసి యింద్రియములను జయించును. నిశ్చయ తీర్మాన మందు బుద్ధి మనస్సును నియమించును. తానుండు మెట్టునెఱిగి పైమెట్టును లక్ష్యమునందుంచుకొని తదనుగుణ ప్రవర్తనము భావ్యమని యెంచుటచే వివేకము వృద్ధియగును. ప్రతిసంకల్పమునకు ముందును ప్రతికార్యమునకు ముందును ఈ వివేకమును బ్రయోగించవలెను. లేని యెడల యేక్షణమందైనను బ్రమాదము గలుగవచ్చును. అందువలననే "పరమ గురుచరణ సన్నిధి" యందు "మార్గారంభముననే గాదు, అడుగడుగునను, ప్రతిదినమును, తుదిముట్టు వరకు వివేక మభ్యసించ దగినది." అని తెల్పబడి యున్నది. వివేకముతో పైమెట్టును దెలిసికొనిన, క్రింది మెట్టునందు రాగము పోవును, అదియే విరాగము (వైరాగ్యము). ఇయ్యది క్షణకాల వైరాగ్య మనియు నిజవైరాగ్య మనియు రెండు తెరగులు. దుఃఖముల సహింప నేరమిచే గల్గునది 'క్షణకాలపు వైరాగ్యము.' అది నిజవైరాగ్యమునకు బూర్వగామియ గాని నిజవైరాగ్యము కాదు. నిశ్చయ విరాగము వివేకమువలన జనించునది కావున స్థిరముగ నిల్చును.

మనస్సునకు రెండు గుణములు:—బాహ్య విషయములను గోరుట, లోపల జింతించుట.

శ్లో॥ మనుతే మనస్యైవైష ఫలంకామయతే బహి॥

ఈ రెంటిలో బాహ్యవిషయ కామము విరాగమువలన శమించును. ఇకను లోపల స్వేచ్ఛానుసారముగా జింతించు గుణము నయితము పోవలయు. మనస్సు లక్షణము స్వచ్ఛపు అద్దమువంటిది. చింతించిన ప్రతి విషయము దానియందు బ్రతిబింబించుటయే కాక మనస్సు ఆ విషయాకారముగ బరిణమించును. వీనిని మనోవికారము లందురు. (Modifications of the thinking principle). ఎన్ని జన్మముల నుండియో ఎన్ని విష

రూకారములుగనో మనస్సు పరిణమించి యున్నది. ఎన్ని వికారములో జెందియున్నది. ఇవి యన్నియు దానిలో వాసనా (రస) రూపముగా నిమిడియున్నవి. వానిని సదా తనలోదానే చింతించుచుండును. అందువలననే మనస్సుయొక్క బాహ్యవృత్తి వైరాగ్యమువలన శమించినను రసము మాత్రము నిలిచియుండు నని భగవద్గీతయందు జెప్పబడియున్నది.

విషయావినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం........ (2—59.)

ఇక నీ రసము సయితము పోవలెను. మఱియు నహంకారాభిమానములను (individuality) బుద్ధివృత్తులు పరాజయము నొందవలెను. బుద్ధికి పైదాని వలననే బుద్ధివృత్తులు పోగలవు. బుద్ధికిపైనిది "ఆత్మ" అనిపైన జెప్పబడెను. (మహదాత్మా, శాంతాత్మా అనే వివరములు ప్రకృతమం దవసరములేనందున "ఆత్మ" అనిమాత్రము గ్రహించబడినది). ఆత్మయన, భగవంతుడన, గురువన, ఒకటియే. వారివారికి దేనియందు భక్తి ప్రేమయధికముగ నుండునో దానిని గ్రహించవచ్చును.

రసో ప్యస్య పరం దృష్ట్వా నివర్తతే. భగ. 2. 59.

రసము సయితము పరస్వరూపమును, భగవంతుని, గురువును చూచిన నివర్తించును.

తానిసర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః.
భగ. 2. 61.

ఇంద్రియముల నన్నిటిని నియమించి నాయందు మనస్సు నిల్పి నన్ను బొందవలెనని దృఢముగా గోరుచు నుండవలెను.

మఱియు "పరమగురుచరణసన్నిధి" యందు "ఆమహనీయుని మహాగురువు పావనమగు సన్నిధియను వెలుగునందు వారివలె కావలెనను కోరిక యొక్కటె తప్ప తక్కు కోరికలన్నియు నశించును."

ఇట్లు భగవంతుని మీదగాని గురువు మీదగాని మనస్సు నిడిన, రాగవాసన (రసము) అహంకారము నివర్తించును. అయితే, అట్లు మనస్సు నిల్చుట కష్టము. నిల్చినదేగాని రసముపోదు. నిల్చునట్లు మనస్సును జేయుటకే 1 శమము, 2 దమము, 3 ఉపరతి, 4 తితీక్ష, 5 శ్రద్ధ, 6 సమాధానము, అను షట్సంపత్తి విధించబడియున్నది. ఏవస్తువుపైన నిల్చితే దానిపైన నిల్చునట్లు జేయుట శమము.

"స్వలక్ష్యేనియతావస్థా మనసశ్శమ ఉచ్యతే" దీనివలన మనస్సను కొరముట్టును వాడి చేసినట్లగును. శమముచేత స్వాధీనమైన మనస్సును భగవంతునిపైననో గురువుపైననో నిల్పుట సమాధానము.

"జ్ఞేయవస్తునిదిత్తస్య సమ్యగాధానం సమాధాన మితీర్యతే"

కనుక సమాధానమునకు శమ మత్యంతావశ్యక సాధనము. శమము సాధించుట మిక్కిలి కష్టము. మనస్సు ఒకచోట నిలువదు. దానినిల్పుటకు విధించబడిన యుపాయము లెవ్వియనః-

ప్రాచ్యోదీచ్యాంగ సద్భావే శమస్సిద్ధ్యతి నాన్యథా
తీవ్రావిరక్తిః ప్రాచ్యాంగ ముదీచ్యాంగం దమాదయః।
స॥ వే॥ సం॥

పూర్వాంగము ఉత్తరాంగమునుండిననే శమము సిద్ధించుచున్నది. లేకున్న సిద్ధింపదు. తీవ్ర వైరాగ్యము పూర్వాంగము. దమాదు లుత్తరాంగము.

అభ్యాసేనతు కౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే।
భగ. 6—35.

అభ్యాసముచేతను వైరాగ్యముచేతను మనస్సు నిగ్రహించబడును.

వివేకముచేత మనస్సుయొక్క జ్ఞానశక్తి వృద్ధిపరుపబడినది. వైరాగ్యముచేత బాహ్యవిషయములను గూర్చి పోనియ్య

యుండుటవలన క్రియాశక్తి బలపర్చబడినది. ఇకను శమాదుల చేత భగవంతుని పైన నిలుపవలెనను నిచ్ఛాశక్తి స్థిరపడవలెను. పై రెండు వాక్యములవలన నభ్యాసము వలన మనశ్చాంచల్య ము పోవుననియు, దయాదులే అభ్యాసము చేయదగినవనియు దెలియవచ్చెడిని. అభ్యాసమన నేకాంత స్థానమందుండి జపము చేయుట మాత్రము కాదు. ప్రపంచములో బనిచేయుచునే లక్ష్య స్థానమును మఱవకుండునటుల నభ్యసించవలయును. అదియే శమ సాధనాభ్యాసము.

రాగద్వేషవియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి।

భగ 2—64.

రాగద్వేష వియుక్తములై స్వాధీనములైన యింద్రియ ములచేత విషయముల ననుభవించుచు స్వాధీనమైన మనస్సుగల వాడు ప్రసాదమును జెందును.

యస్త్వింద్రియాణిమనసా నియమ్యారభతేఽర్జున
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్స విశిష్యతే।

భగ 3—7.

ఎవ్వడు జ్ఞానేంద్రియములను మనస్సుచేత నిగ్రహించి కర్మేంద్రియములచేత ఫలాపేక్ష రహితుడై కర్మయోగమును జేయబూనుకొనుచున్నాడో వాడు శ్రేష్ఠుడు.

లోక సంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తు మర్హసి.

భగ. 3. 20.

పరోపకారార్థమైనను పని చేయదగుదువు.

కుర్వన్నే వేహకర్మాణి. ఈ. ఉ.

కర్మలను జేయవలసినదేను. (సశేషము).

జి. శంకరరావు.

# విషయలోలత.

ప్రపంచములోని మానవులందఱు, దుఃఖమును గోరక సుఖమునే కోరుచుండుటయు, నింద్రియానుకూల్య విషయముల నపేక్షించి ప్రతికూల విషయంబుల నుపేక్షించుటయు, నెల్లఱకుం దెల్లంబ. ఒకప్పుడు గలిగిన సుఖము ననుభవించి అట్టిసుఖమే తన కెప్పుడుఁ గావలయునని కోరుట రాగమనియు, మున్నొకప్పు డనుభవించిన దుఃఖము, తన కెన్నఁడుఁ గలుగఁ గూడదనుట ద్వేషమనియుఁ జెప్పబడును. రాగ ద్వేషములవలన సుఖదుఃఖములు గలుగుచుండు. ఈ సుఖదుఃఖములు అంతః కరణ ధర్మములు. మనస్సు విషయ సుఖంబుల మరగి ఎల్లప్పుడు విషయ సుఖానుభవముఁ గోరుచుండు. ఈ విషయ సుఖానుభవమువలన సహింప నలవికాని దుఃఖము లొదవుచుండినను, విషయ సుఖంబులంగోరు మానవుని స్థితి యాశ్చర్యకరమై శోచనీయమగుచున్నది. మానవుని మనం బింద్రియముల ద్వారా, బాహ్య విషయముల లోనికిఁ బ్రవేశించి విషయ సుఖంబు లనుభవించుచుండు. కొన్ని యెడల ఇంద్రియ సహాయంబు లేకున్నను, పూర్వానుభూత విషయంబులఁ దలఁచుకొనిగాని, క్రొత్తవిషయంబుల సంకల్పించుకొనిగాని సుఖంబులఁ దేలుచుండు. చిరకాలము ఇంద్రియ సాహాయ్యంబున నసద్విషయంబులం బ్రవేశించి వివిధానర్థంబులం జెందు మనస్సును వానినుండి మఱలించి సద్విషయంబునం బ్రవేశింపఁజేయఁ గడంగవలయు. అభిమతార్థంబుల నొసంగి యజమానుని తమ స్వాధీనముఁ గావించుకొన నిచ్ఛగించు సేవక బృందము చందంబున, ఈ యింద్రియభట వర్గంబును స్రక్చందన వనితాది విషయ సుఖంబుల చవిఁజూపి జీవుని తమ యధీనముఁ జేసికొని యాడింప బ్రయత్నించుచుండు. వివిధానర్థంబులఁ గలిగించు విషయ సుఖంబులనిచ్ఛ

నింద్రియములకు వశ్యుఁడై వర్తించు పురుషుఁడు, చిరకాలము లంచములఁ దినమరగి యెన్నరాని కీడులఁ గలిగించు సేవకులకు లోఁబడిన యజమానునివలెఁ బరతంత్రుఁడై చెడిపోవును.

శ్రు॥ పరాంచిఖానివ్యతృణత్స్వయంభూ।
స్తస్మాత్పరాఙ్పశ్యతి నాంతరాత్మా॥

పృథివి సంబంధములయిన యఱు మహత్త్వముచే నింద్రియములు, మనస్సు, సృష్టికర్తచే నిర్మితము లగుటంబట్టి స్వకారణంబులగు నైహిక విషయముల మీదికి మనంబును ఇంద్రియవర్గంబును బోవుచుండుట స్వభావ ధర్మము. ప్రకృతి సంబంధములయిన మనస్సును, ఇంద్రియవర్గంబును, ఉదకములు పల్లపుప్రదేశములలోనికి పాఱువిధంబున నధోముఖములగుచుండును గాని యూర్ధ్వముఖములగుట కానము. ప్రకృతియన జలంబు, జలస్వభావమగు నధోముఖ ప్రసరణము ప్రాకృతికములగు నింద్రియ వర్గంబునకును మనస్సునకునుఁ గలదని పై శ్రుతి యనువదించుచున్నది. విషయసంచయమను నాహారము లేక యింద్రియ వర్గంబు యింద్రియ వర్గంబు లేక మనస్సును నిలువఁజాలదు. చిత్తంబు విషయాసక్తంబయిన దుఃఖరూప బంధంబునకును, విషయవిముఖమై యీశ్వరాయత్తంబయిన శాశ్వతానంద సుఖంబగు మోక్షంబునకునుఁ గారణమగును. ఇట్లు పరిశీలింపఁగ విషయ జాలంబ వివిధానర్థంబులకుఁ గారణమని తెలుచున్నను కేవల వైరాగ్యసంపన్నుఁడగు జ్ఞానికిఁ దక్క లోకయాత్ర సలుపు తదితర మానవకోటికి విషయజాతంబును విడనాడుట కడుదుస్సాధ్యము కావున విషయములం దెయ్యవి సద్విషయములు ఎయ్యవి దుర్విషయంబులు అని వివేచనాశక్తిచే విమర్శించి ధర్మజ్ఞానసాధనములగు సద్విషయంబుల గ్రహించి దుఃఖానర్థ కారణంబులగు దుర్విషయంబుల బరిత్యజించి ధర్మరతుఁడైయుండు వానిని విషయములు బాధింపవు. విషయములయందలి దోషముల గ్రహిం

చి, వానియందాసక్తుఁడుగాక తామరాకుపైనుండు జల బిందువుంబోలెనంటియు నంటక ప్రవర్తింపవలయు. దయామయుండగు పరమేశ్వరుండు ప్రాణుల హింసింప నింద్రియంబులను, ఇంద్రియార్థంబులను సృజించెనని తలఁచుట యవివేకంబు దప్ప వేఱొకటి కాదు. పరమేశ్వరుని సృష్టిలో వ్యర్థమైన పదార్థ మొకటియును గానరాదు కాని వివేకదృష్టిచేఁ బరిశీలించినఁ బ్రతిపదార్థము నేదో యొక యుపయోగము కొఱకే యని బోధపడక మానదు. విషంబును నయిత మొకప్పుడు వైద్యుఁడు అమృతమునుబోలె నుపయోగించును. అయ్యది ప్రయోక్త యొక్క బుద్ధికౌశలమును బట్టియుండును. ఓషధులును, అక్షరంబులును కూర్పువాని యొక్క ప్రజ్ఞనుబట్టి విషంబుగను అమృతంబుగను బరిణమించుచుండు.

భగవంతుఁడు మానుషాది శరీరంబుల సృజించినప్పుడు, సర్వజ్ఞుండగుటచేతఁ జక్కగా నాలోచించి, ఈయింద్రియం బిందుకొఱకు సృజించెద, దీనినిందులకు నని యేర్పఱచి యుద్దేశపూర్వకముగానే సృజించెను. వానిని అనఁగా నేయింద్రియమునకెయ్యది విహిత ధర్మమో దానిని సద్విషయముగాఁ గైకొనదగును. మనకు ఇప్పటి యవస్థయందు ఇయ్యది విహితంబియ్యది యహితంబను వివేకము కడు దుర్లభంబు. మనయిండ్లయందు అన్నము వండుకొనుట, పాలు కాచికొనుట, నీరు కాచుట, దీపము వెలిగించుకొనుట మొదలగు పచన క్రియలకై యుద్దేశింపబడి యుండు నగ్నిని కొంపలఁ గాల్చుటకు, పొలములలో గడ్డివాములఁ గాల్చుటకు నుపయోగపఱచు చున్నట్లును, స్నానపానాది కార్య జాతంబున కుపయోగ పడుటకై యేర్పడిన నదీనదకూపతటాకాది జలాశయంబులు కారణవిశేష వశంబున, మనుజు లందుఁ బడి, మునిఁగి ప్రాణంబులఁ గోలుపోవ నుపచరించు చున్నట్లును, పండ్లు కూరఁగాయలు లోనగు వానిని

గోయుట కుపయోగింప వలసిన మనయిండ్లలో నుండు కత్తిపీటలు మష్టుల చేతఁబడి కుత్తుకలు గోయుట కుపచరించు చున్నట్లును మనశరీర సంరక్షణమునకై మన జీవయాత్రకై దయామయుండగు భగవంతునిచే నొసంగఁ బడిన యింద్రియంబులు మన్పూర్వవాస వశంబునఁ గలిగిన దురభ్యాస బాహుళ్యంబున జనించిన దుర్వాసనా బలంబునకు లోఁబడి, సదా దుర్విషయంబుల వెంటనే పరువిడు చుండును. ఇది కేవలము మన ప్రారబ్ధ ప్రవాహోను గతంబని యెంచదగదు. దేనికేని ప్రతీకారము గలదు. లేదేని ప్రత్యక్ష నిదర్శనంబులుగానుండు వైద్యాది సకల శాస్త్రంబులు వ్యర్థంబు లనవలయుఁగదా. కావున నింద్రియార్థంబులగు విషయములందు సద సద్వివేకము చేసికొన మనము యత్నించి చూతము.

మనశరీరమునందుఁ బది యింద్రియములు కలవు. అందు

1. త్వగింద్రియము (చర్మము) స్పర్శజ్ఞాన సాధనము
2. చక్షురింద్రియము (కన్ను) రూపజ్ఞాన సాధనము
3. జిహ్వేంద్రియము (నాలుక) రసజ్ఞాన సాధనము
4. ఘ్రాణేంద్రియము (ముక్కు) గంధజ్ఞాన సాధనము
5. శ్రోత్రేంద్రియము (చెవి) శబ్దజ్ఞాన సాధనము

(జ్ఞానేంద్రియ పంచకము)

ఇవి యైదును జ్ఞానేంద్రియములు నాఁబడును.

1. వాగింద్రియము నాలుక మాటలాడు సాధనము
2. పాణీంద్రియము చేతులు పనిచేయు సాధనము.
3. పాదేంద్రియము కాళ్లు నడచు సాధనము.
4. పాయ్వింద్రియము మలాది విసర్జనేంద్రియము మలమూత్రము విడుచుసాధనము.
5. ఉపస్థేంద్రియము (స్త్రీ) పురుష జననేంద్రియము మైథున సాధనము.

(కర్మేంద్రియ పంచకము)

ఈయైదును కర్మేంద్రియము లనబడును.

జ్ఞానేంద్రియములవలన స్పర్శాది గుణ జ్ఞానమును, కర్మేం ద్రియములవలన వాగాది కర్తృజ్ఞానమును నంతఃకరణమునకు గలుగును. ప్రపంచము నందలి సకల విషయములును గుణకర్మ రూపములే యగుట నవియెల్ల నిందంతర్భావముం జెందును. త్వగింద్రియాదు లైదును శరీర సంరక్షణమునకుఁ గామ తత్త్వద్విహిత ధర్మములతో నియమింపఁబడిన రక్షకభటులన దగును.

1. త్వగింద్రియము—మనశరీరమునకు అనుకూల మగు స్పర్శమును, అననుకూల స్పర్శమును, వివేచించి తెలుపును. అపుడు అనుకూలమగు దానిని గ్రహించి ప్రతికూలమగు దానిని విడుతుము. పక్ష్మ పత్రములు కండ్ల కడ్డికొందుము. దూలగొండికి దూరముగఁ దొలఁగుదుము. మృదు మార్గమున నడతుము. పల్లేరు గాయలుండు దారిని విడుతుము. ఇట్లే శరీరయాత్రకై శరీరానుకూలములగు పదార్థములు గ్రహించుటకును, తదితరములను విడనాడుటకును, త్వగింద్రియము విహితము. ఇది సద్విషయము.

ఇంతియగాని శరీరానుకూలములయిన వానియందును, శరీరయాత్రా మాత్ర ఫలకములుగాక "భోగేరోగభయ" మ్మనునట్లు రోగ నిదానములగు భోగములకుఁ బోవుట యసద్విషయము. శయ్యకు భూతలము చాలును. హంసతూలికా తల్పము భోగార్థము.

2. చక్షురింద్రియము—సనిమిత్తముగా ఖడ్గపాణియయి వచ్చువానిని విరోధియని యెఱింగించు నీచక్షురింద్రియ భటుడు చూత ఫలాదికమును గనఁబఱచి యనుకూలములని తెలుపును. గురువులజూచి నమస్కరించుమని తెలుపును. త్రోవలో నూయికలదు, గోయికలదు, గోడకలదు, మేడకలదు, అట్లుపోవలదు, అపాయము కలదని హెచ్చరించును. భోజన పదార్థము క్రిమ్యాది గ్రస్తమయినచో నది తెలిపి త్యజించు మనును. ఇట్లు

శరీరానుకూల్యమును దెలుపుటయు ప్రాతికూల్యమునుం దెలిపి యాపదనుండి తొలగించుటయు చక్షురింద్రియ ధర్మము.

వినోదములను జూచుట, వ్యర్థ పదార్థములను ప్రమారపదార్థములను వినోదార్థము చూడనోపుట లోనగునవి యసద్విషయము.

3. జిహ్వేంద్రియము—వస్తువుల రుచిని దెలిపి ఇది శరీరోపయోగి శరీరానుపయోగియను వివేకము పుట్టించి శరీర ధారణమున కావశ్యకములగు పదార్థములను భుజించుమని యీరసనేంద్రియ భటుండు తెలుపును. కావున మామిడిపండు తిందుము ముషిణిపండు విడుతుము. పిత్తాది దిగ్ధములగు వానిని తోడనే పట్టియుమ్మును. ఇట్టివి దీనివలని పనులు. చుట్టలు గాల్చుట కాఫీ తేయాకు గంజాపత్రము తాంబూలము మొదలగు మాదక పదార్థ సేవనము సేయుటకై కాదు. కడుపునిండ భుజించియు, జను తిండికై కాదు. సులభముగా జీర్ణములు కాందగినట్లు వంటం జేసికొని భుజించుటకు మారుగా తీవ్రముగా మసాలాచేర్చియు నేతివేపడములు చేసియు నిర్నిమిత్తముగా నప్రాపాదికమగు భక్ష్యవిశేషంబుల గూర్చియు మెసవుటకై కాదు. ఇవి యసద్విషయములు, భోగములు, రోగజనకములు.

4. ఘ్రాణేంద్రియములు—వస్తువులందలి గంధ విశేషములను దెలుపు రక్షాభటుండు. దీనివలన సువాసనగల పండ్లను పదార్థములను భుజింతుము. దుర్వాసనగలవి కుళ్ళినవిని విడుతుము. సహజదుర్వాసన గలవానిని దూరీకరింతుము. పశువులు పులివాసనను పసిపట్టి పులియని బెదరి పారును. కుక్కలు నట్లే మనుజులకు శరీరాపాయ కరములగు వానిని వాసన వలనం దెలిపి తొలగించును. ఇట్టివి సద్విషయములు.

దుర్వాయువులను మలుగుపఱచు, అత్తరు పునుగు మొదలగు సుగంధ ద్రవ్యములను సేవించుట, దుర్వాసనల సహించి

తొలగ నుండుట లోనగునవి యసద్విషయములు.

5. శ్రోత్రేంద్రియము—ఇతరులు తమయభిప్రాయా విష్కరణ మునకయి, పలుకు పలుకుల నాలించి కర్తవ్యంబొనరించుట, సదుపదేశ శ్రవణము, హరికథా శ్రవణము, పద్య మొదలగునవివిని కనికరించి సహాయ పడుట, పాము కూతవిని తొలఁగుట, పులిగాండ్రింపువిని మఱలుట మొదలగునవి సద్విషయములు. కొండెములు వినుట, చిత్తాప కర్షంబులగు పాటలు, కేవలములగు లోకాభి రామాయణముల శ్రవణము లోనగునవి యసద్విషయములు.

ఇఁక కర్మేంద్రియములు.

1. వాగింద్రియము—తన యభిప్రాయము దెలుపుట, పెద్దలఁ బొగడుట, భగవద్గుణ కీర్తనము, స్వాధ్యాయము లోనగునవి సద్విషయములు.

అసత్యమాడుట, ఇతరులను నిందించుట, ఇతరులకు చిత్తాప కర్షంబులగు వాక్యముల నాడుట, ఇతరులకు మనస్తాప జనకములగు మాటలను బలుకుట లోనగునది యసద్విషయములు.

2. పాణీంద్రియము—శరీరధారణోపయోగమగు కర్మము చేసికొనుట, పెద్దలకు నమస్కరించుట, దానము చేయుట, పతితుల నుద్ధరించుట, భగవంతుని పూజించుట లోనగునవి సద్విషయములు.

ఇతరులకు బాధకరములగు పనులు చేయుట, దొంగిలుట, ప్రాణిహింస లోనగునవి యసద్విషయములు.

3. పాదేంద్రియము—శరీర యాత్రకు వలయు చోట్లకు బోవుట, దేవగురు మందిరగమనము, తీర్థయాత్రాది గమనము, లోనగునవి సద్విషయములు.

వినోదములు చూడనేగుట, తన్నుట, పాదఘాతమున బుడమిని ముట్టుట లోనగునవి యసద్విషయములు.

4. పాయ్వింద్రియము—దేవబ్రాహ్మణాలయముల దరిని వీధులయందును, సస్యాదులందును మలమూత్రముల విడుచుట యసద్విషయము. తదితరములగు తావుల నొనరించుట సద్విషయము.

5. ఉపస్థేంద్రియము—సత్సంతాన సాధనత్వము సద్విషయము. కామాతురత యసద్విషయము.

వీని వివరము మానసికశాస్త్రాది యితరగ్రంథముల వలన నెఱుంగందగు. నిరవకాశంబగుట నింతట విరామము. ఇంద్రియములకు విహితకర్మముల నుండి యతిక్రమించి నడుచుట వ్యభిచార మనబడును. సర్వేంద్రియములను వ్యభిచరింపనీయక, స్వస్వధర్మంబులం బ్రవర్తిల్లఁ జేయుట యావశ్యకము. అది సత్సహవాస బలంబునను, సదభ్యాస బలంబునను జేకూరును.

తాను వివాహమాడిన ధర్మపత్నినతిక్రమించి సంచరించుట వ్యభిచరించుట యనఁబడునని మాత్రము పలువురు వాడుకొందురుగాని, యుపస్థేంద్రియ వ్యభిచారమువలెనే సకలేంద్రియములును వ్యభిచరించుచున్నవి. ఇంద్రియంబు లసద్విషయములందు వ్యభిచరింపకుండునట్లుగ, నభ్యాసముచేయుచు వత్తుమేని, విషయలోలత తగ్గి మన యంతఃకరణంబు నిర్మలంబుగానుండును.

(సశేషము.)

ముక్తినూతలపాటి గోపాలకృష్ణయ్య,
ఒంగోలు.

# పాతివ్రత్యము.

క. ఉపవాసంబులు వ్రతములు
దపములు వేయేల భర్త దైవతమనిని
ష్కపటతగొల్చిన సాధ్వికి
నృపవర దుర్లభము లేదు నిఖిలజగములన్॥

భాగవతము.

స్త్రీలకు బాతివ్రత్యమునకంటె మించిన వేరొక వ్రతములేదు. అది వారి యుత్కృష్ట వ్రతములలో బరమోత్కృష్టవ్రతము. ఈ మహావ్రతమును చక్కగా బరిపాలించిన స్త్రీలెంతటి పనినైనను జేయగలరు. వారి కసాధ్యమగు కార్యమెద్దియును లేదు.

మనపూర్వ నారీమణు లనేకులు ఈవ్రతమును చక్కగా బరిపాలించి దీనిమహిమచే ననేక యద్భుతాహవ కార్యము లొనరించి యున్నారు. వారెంతటి ఘనకార్యము లొనరించినదియు, వారికెట్టి యుత్తమ గుణరాజము లుండినదియు దెలియుటకై నొకరిద్దరి పూతచరితల వృత్తాంతములతో నొప్పు నొక యితిహాస మిందు బొందుపరచెదను.

పూర్వము ప్రతిష్ఠాన నగరమునందు కౌశికుండను నొక బ్రాహ్మణుడు గలడు. ఆయన పూర్వ జన్మమునందలి పాపముచేత కుష్ఠురోగము గలవాడయ్యె. ఆయన భార్యయగు సుమతి, కుష్ఠురోగముగల తన భర్తను దేవునిగ భావించుచు బూజసేయుచుండె. సత్యము, శాంతము, శీలము, భూతదయ లోనగు గుణరాజము లాసుమతియం దమరియుండె. ఆపూతచరిత హిందూ పతివ్రతా రత్నములలో నాయకమణిగ నెన్నుకొనబడుచుండె. కౌశికుడు మిక్కిలి కోపియగుటచే భార్యయందలి సుగుణ సంపదను దెలియనేరక నెల్లప్పుడును బెదరించుచుండెను.

ఆయనకుగల దుర్గుణములలో జారత్వము మొదటిదై యుండెను. అట్లయిన నాపతివ్రతా శిరోమణి యితనిని సర్వోత్తమునిగ భావించుచు పూజించుచుండెను. ఇట్లుండ నతఁడొకనాఁడు తనభార్యతో నిట్లనియె. ఓతరుణీ నేఁడు సాయంకాలము నేనొక వేశ్యను జూచితి. నాకు దానియందనురాగం బుప్పతిల్లుచున్నయది. నన్ను దానియింటికి గొనిపొమ్ము కాదేని నాప్రాణంబు విడుతు నని జెప్పుచున్న ప్రియుని వచనంబు నంగీకరించి యాగుణవతి భర్తను తనభుజంబుమీఁద నిడుకొని వేశ్యయొక్క గృహమునకు వచ్చుచుండె. అంతట నారాత్రియందు మేఘంబులు జనించె, అంమన ఘోరంబగు చీకటిగ్రమ్ముకొనియె. అట్టిసమయంబున మెఱుముల వెలుతురునుబట్టి రాజమార్గంబున వచ్చుచుండఁగ నొక విచిత్రంబు గన్పట్టె. అది యెద్దియనిన అంతకు మున్ను యాపట్టణపు రాజు చారుల వలన మాండవ్య మహామునిని చోరునిగ దలచి కొరతను వేయించె. అంమన నామునివర్యుండు దుఃఖంచుచుండె. ఆ సమయంబున కౌశికుండు భార్యయొక్క మూఁపు మీఁదనుండి పాదంబునుచాచె; అది సమీపంబున నున్న మాండవ్యునకు దగిలె. చీకటి యగుట వలన నా పతివ్రతకు తెలియదయ్యె. కాలితో దన్నుటకు మాండవ్యుండు కోపించి యిట్లనియె. ఓరీ నరాధమా నిష్కారణంబుగ గొర్తనుబడి దుఃఖించుచున్న నన్ను కాలిచేత దన్నితివి గాన రేపు సూర్యోదయంబున మృతుండవు గమ్ము అని శాపంబిచ్చె. అంత నా వృత్తాంతంబు విని యాపతివ్రతా శిరోమణియగు సుమతి సూర్యోదయంబున నాకు వైధవ్యము సంభవించును గదా నేనేమి చేయుదునని బహువిధంబుల విలపించి యిట్లనియె. నేను పతివ్రత నైతి నేని పతివ్రతలాడిన వచనంబు దప్పకుండు నేని సూర్యోదయంబు లేకుండవలయు, కాదేని సూర్యుని శపించెద ననియె. అంతట పతివ్రతా శాప భయంబున బహుదినంబులు సూర్యోదయంబు లేదయ్యె.

భూమియంతయు నంధకారంబు కప్పె. దేవత లందరును భయ
మును జెందిరి. భూలోకంబున యజ్ఞాది దేవకార్యంబులు నెడె,
కాలనియమంబు లేదయ్యె, అంతట దేవతలందరును మిగుల భ
యమును బొంది బ్రహ్మ కడకేతెంచి పతివ్రతా శాపవశంబున
జరిగిన వృత్తాంతంబంతయు దేటపరచిరి. అదివిని బ్రహ్మదేవుం
డిట్లనియె, పతివ్రతా శాపంబునకు వెఱచి సూర్యుం డుదయించ
డు. అదికారణంబున సర్వ లోకంబులకును గీడు వాటిల్లును.
కాబట్టి మీరందరును బోయి యత్రిమహాముని భార్యయగు నన
సూయను వేడుకొనుడు. ఆమె కృపవలన మేలు గలుగుననిన
దేవతలందఱు సంతోషంబున ననసూయయొక్క గృహంబునకు
బోయి జరిగిన వృత్తాంతం బంతయు జెప్పిరి. అంతట నాపతివ్ర
తా శిరోమణి చివుక్కనలేచి మహాపతివ్రత యగు సుమతి కడ
కుబోయె. అప్పుడా సుమతి యనసూయను జూచి మిగుల సంతో
షంబున నిట్లనియె. అమ్మా! మీవంటి పతివ్రతా శిరోమణులు విచ్చే
సినందున మాగృహంబు పావనంబయ్యె. మీరు వచ్చుటకు కార
ణంబేమి? అనిన నయ్యనసూయ ఇట్లనియె. అక్కా! లోకంబున
పాతివ్రత్యంబునకు మించిన మహిమ లేదు. స్త్రీలకు బతికంటె
నన్యంబగు దైవంబులేదు. పాతివ్రత్య మహిమచే నెట్టిదుర్ఘట
మయిన పనినైనను సాధింపవచ్చును. నీవంటి పతివ్రతను మూడు
లోకంబులయందును గానను. నీశాపంబునకు వెఱచి సూర్యుండు
దయించుటలేదు. అదికారణంబున లోకంబుల కన్నిటికి గీడువా
టిల్లె. కాబట్టి సూర్యుం డుదయించునట్లు వరంబొసంగుము. నీభ
ర్త మృతుండైనను మెండైన యవ్వనంబు గలవాడై మఱలంబ్ర
తుకును, కాబట్టి వైధవ్య మనుభవింతు ననెడి భయంబు బొంద
కుమని వరంబొసంగె. అంతట నాపతివ్రతా రత్నమగు సుమతి
సూర్యుం డుదయించు నటుల ననుగ్రహించె. అప్పుడు సూర్యుం
డుదయించె, లోకంబు లన్నియు సంతోషంబును బొందె. అత్త

ణంబున మాండవ్యుని వచన ప్రకారంబు కౌశికుండు మృతుం డయ్యె. అప్పుడా యనసూయ సుమతిని భయపడకుమని యభయం బిచ్చి స్నానం బాచరించి తనభర్తను డెందంబునం బొందుపరచి యేను పతివ్రత నైతినేని యీకౌశికుండు పునర్జీవితుం డగునని యె. అప్పుడా కౌశికుండు సుందరంబగు శరీరంబు గలవాడై పునర్జీవితుండయ్యె. అంతనా సుమతి మిగుల నానందంబుబొంది యా యనసూయను బహుప్రకారంబుల వినుతించె

ఇట్లే సీత, సావిత్రి, దమయంతి, చంద్రమతి లోనగు సాధ్వీమతల్లులగు తల్లుల నిర్వచనీయ మహిమగల పాతివ్రత్యము చే నాశ్చర్యకర కార్యము లనేకములొనరించియున్నారు. వారి లో నెక్కువ తక్కువలు నిర్ణయించలేము. ఘోరరాక్షస వ్యాఘ్ర భల్లూకాది ఘాతుక జంతుసేవితంబైన యరణ్యావాసం బును భర్తసాన్నిధ్యంబుచే స్వర్గసుఖంబుగా భావించిన సాధ్వీ మణియొకతె, లోకంబునంతయు నంతముం జెందించు నంతకుని వింతైన వాగ్వాదంబున గెలిచి భర్తకు బ్రాణంబు లిప్పించిన యద్భుత చారిత్రిణి యొకతె, వీక్షణమాత్రమున గిరాతుని విగత జీవుని గావించిన మహాశక్తి స్వరూపిణి యొకతె, సమస్తభోగ భాగ్యముల ననుభవించుచుండెడి సుకుమారియయ్యు నశనవస నాములు లేక కృశించి శ్మశానంబులో బతిధర్మంబును గౌరవించి యతనిని సత్యవ్రతమునుండి విముఖునిగానీయక పతియొక్క నిశితాసిధారకాహుతిగా శిరంబును సమర్పించిన మహాధైర్యవతి యొకతె, భర్త తన్నొల్లక యరణ్యంబుల కరగి మహోరగంబు వలన మృతుండైన నతని నన్వేషించి తానతని చితాగ్నిని బడ సాహసించి శంకరుం బ్రసన్నుం జేసి యతనిచే మెప్పువడసి పతిని పునర్జీవితునిగ నొనర్చి సుఖించిన మహాగుణవతియొకతె. ఏమి! చూచితిరా, పాతివ్రత్య ప్రభావము!! పతివ్రతల యద్భుత కృత్యములు!!! ఇట్టి యత్యద్భుత కృత్యములొనర్చుగల శక్తి వీరల

కెట్లు గలిగెను? ఎద్దాని మహిమవలన చేకూరెను? పాతివ్రత్య మువలననే గదా!

శ్లో॥ నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో నవ్రతం నాప్యుపోషితం।
పతింశుశ్రూషతే యేన తేన స్వర్గేమహీయతే॥

స్త్రీలకు పెనిమిటి వినాగా వేరు యజ్ఞములేదు. వ్రతము లేదు. ఉపోష్యము లేదు. తాను పెనిమిటికి ఒక అంగము వంటిదిగనుక స్వతంత్రించి వేరుగా నే కార్యము జేయుటకు నర్హురాలుకాదు. మరేమి చేయవలెననిన నెల్లప్పుడును ప్రతివ్రతయై అనగా పతియే వ్రతముగా గలదియై యతనింభజింపవలయును. దానివలన స్వర్గలోకమును బూజింపబడునట.

పాతివ్రత్యము వ్రతములలో పరమోత్కృష్టవ్రతము. ఆవ్రత నిష్ఠగలవారెట్టి ఘనకార్యములనైన జేయగలరు. స్త్రీలకిహపరసౌఖ్యముల నిచ్చునది పాతివ్రత్యమె. కావుననో నారీరత్నములారా! పూర్వపతివ్రత లాచరించిన ధర్మములు పరమార్థసాధన సూత్రములని నమ్మి, వారి దివ్యగుణములు మీకబ్బునట్లు నడుచుకొనుడు. మీరు మీపతినే దైవముగ నెంచుకొనుడు. పతియిష్టప్రకారము వర్తింపుడు.

గీ॥ అనపహార్యంబు తేజోమయంబు సర్వ
గుణములకు నలంకారంబు గురుతరంబు।
భామలకుఁ బతిభక్తియె పరమమైన భూ
షణంబిట్టివే పెరభూషణములు॥

(నలచరిత్ర)

పాతివ్రత్యమను భూషణము చోరులు హరించుటకు శక్యము గానిది. ప్రకాశవంతమైనది. ఈభూషణము, ధరించిన వారినే గాక చూపరులను సహితము సంతసింపజేయును. నిజమైన సౌందర్య గౌరవాదుల నిచ్చునది పాతివ్రత్యమేగాని తక్కినవికావు.

కావున నోసోదరీతిలకములారా! ఇట్టి యనుపమాన తేజో మయంబైన భూషణమును ధరించి కలిమిలేములు ప్రపంచస్థితికి సహజములని యెఱింగి వానిచే జలింపబడక నిశ్చలచిత్తముతో మీస్వకీయ ధర్మముల ననుష్ఠింపుడు. పాపములకు భయపడుచు సర్వప్రయత్నముల చేతను వాని పొంతకు బోకుండునట్లు పాటుపడుచుండుడు. మీమీ తల్లిదండ్రులయందును సహోదరులయందును, పుణ్యాత్ములయందును, సర్వభూతకోటియందును ప్రేమగలిగి యుండుడు, సత్యమార్గ మన్వేషించుచు సర్వ విధముల మీమీపతులకు సహాయపడుడు.

మీపతియే మీకుదైవము. తపోధ్యాన గరిష్ఠులగు యోగి పుంగవులకును, స్వకర్మ ఫలత్యాగులైన నిష్కామకర్ములకును, మహాగుణ గరిష్ఠులగు మహారాజులకును నలభ్యుండగు పరమేశ్వరుండు, పతిరూపంబున నిత్యమును మీకు దర్శనంబిచ్చుచు మీయర్ఘ్య పూజాద్యముల నెల్ల స్వీకరించుచు మీయెడల దయార్ద్ర హృదయుండై మిమ్ములను సదారక్షించుచుండును. జగజ్జాలముల నెల్లను సృజించుటకును రక్షించుటకును శిక్షించుటకును కర్తయైన పరమేశ్వరుడే మీకు ప్రత్యక్షసేవ్యుండై సదారక్షకుండై యుండ మీకెట్టి కొఱతయైన గలుగునా కలుగదు. తనభర్తయే విశ్వకర్తయను నమ్మకముతో ప్రవర్తించు సాధ్వీమతల్లికే కొఱతయును గలుగదు. ఆపతివ్రత కిహపర సౌఖ్యములు కలుగును.

కం॥ తరుణి తనప్రాణవల్లభు
హరిభావముగా భజించి యతఁడును దానున్
సిరిహరికైవడినుండును
హరిలోకమునందు సంతతానందమునన్॥

(భాగవతము).

నందగిరి త్ర్యంబకరావు.

# శరీరత్రయము.

దృశ్యమగు నీస్థూల ప్రపంచమె గాక దీని ననుసరించి మఱి రెండు లోకములుగలవు. వానికి భువర్లోకము, స్వర్గలోకము అని పేర్లు. ఈమూడు ప్రపంచములలో పనిచేయుటకు తగిన మూడు శరీరములు జీవునకు గలవు. వాని పేర్లు స్థూల శరీరము, కామమయశరీరము, మనోమయ శరీరము. స్థూలశరీర మందరికిని గోచర మగుచున్నది. మిగిలిన రెండును కర్మచక్షువులకు నగుపడుట లేదు. ఈ భూలోకమందు జీవుడు స్థూల శరీరముతో పనిచేయుచున్నాడు. భువర్లోకమందు కామమయ శరీరముతో పనిచేయుచున్నాడు. స్వర్గలోకమందు మనోమయ శరీరముతో పనిచేయు చున్నాడు.

## స్థూలశరీరము.

జీవునకీ ప్రపంచములో పనిచేయుటకుగాను స్థూలశరీర మివ్వబడినది. దీనివలన మనకు ప్రపంచములో ననేక కార్యములు జరుగవలసి యున్నది. అందుచేత మనము దీనిని జాగ్రత్తతో కాపాడవలయును. అశ్వమును సవారిచేయువాడు తనగుఱ్ఱమును పతీరున జాగ్రత్తతో కాపాడుకొనునో ఆప్రకారముగా మన మీస్థూల శరీరమును జాగ్రత్తతో కాపాడవలయును. దీనికి నెక్కువ పరిశ్రమ మిచ్చినయెడల చాలాకాలము మనకు పనిచేయజాలదు. ఈస్థూల శరీరమును సాత్వికాహారముచే పెంచవలయును. అతిశుభ్రముగా నుంచవలయును. ఈశరీరము చెప్పినట్లు మనము నడుచుకొనక దీనికి భృత్యులమయి యుండక మనకనుగుణముగా దీనిని నడుచునట్లు జేయవలయును.

ఈశరీరమును విడుచుటయె మరణమని జెప్పుదురు. జీవుడు ఈశరీరమును వదలి మఱియొక శరీరములో ప్రవేశించుచున్నాడు. శ్లో॥ "వాసాంసిజీర్ణాని యథావిహాయ నవానిగృహ్ణా

తినరోపరాణి, తథాశరీరాణివిహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవానిదేహీ'' యని శ్రీకృష్ణభగవానులు గీతయం దానతిచ్చి యున్నారు. అనగా మనుష్యుడు జీర్ణవస్త్రమును విడిచి నూతనవస్త్రమును ఏలాగు ధరించుచున్నాడో (ఆసమయమందు మనుజుడేమియు మారడుగదా!) ఆతీరుననె జీవుడీశరీరముతో పని ముగిసినపుడు దీనినివిడచి కొంతకాల మితరలోకములలో సంచరించి మగుడ స్థూలశరీరములో ప్రవేశించుచున్నాడు. ఇంతియె కాని మరణమనిన మరేమియు కాదు. చావు మన మేలుకొరకై వచ్చును. అది సంభవించునని మనము చింతింపవలసిన పని లేదు. మనుజుడు కారాగృహములో నుండునపుడు తాను బయల్పడవలయునని యెంత పరితపించునో ఆతీరుననె జీవుడీ శరీరమును వదలుటకు ప్రయత్నించును.

పగటివేళయందు జీవుడే స్థూలశరీరముతో పనిచేయుచున్నాడు, రాత్రికాలమందు దానికి విశ్రాంతి నిచ్చుచున్నాడు, నిద్రయనగా స్థూలశరీరమునకు విశ్రాంతినిచ్చుటయె, అప్పుడు శరీరము పనిచేయక యొకచోట నిలిచియుండును.

### లింగశరీరము.

స్థూలశరీరమునంటి మరియొక దేహముగలదు. దానినె లింగ శరీరమని చెప్పుచున్నారు. దీనిని కొంచము సూక్ష్మదృష్టిగలవారు విశదముగా జూడగలరు. ఈ లింగశరీరము స్థూలశరీరము నశించినపుడు కొంతకాలము వరకు నుండును. స్థూలశరీరమును విడచిపోవుటకు దీనికిష్టముండదు. అందుచేత తిరిగి దానిలో ప్రవేశించుటకు ప్రయత్నించును. అయితే ప్రవేశింపజాలదు. స్థూల శరీరమును దహనము చేసినయెడల నీలింగశరీరము త్వరలో నశించును. లేనియెడల నశింపజాలదు. అందుచేతనే మన పూర్వీకులు శవమును దహనముచేయుట యుక్తమని విధించి యున్నారు. కాబట్టి శవమును భూమియందు పూడ్చిపెట్టుటకం

కై దహనము చేయుట మంచిది.

### కామమయశరీరము.

రాత్రిసమయమందు ప్రతిమానవుడును నిద్రించుటకు విధింపబడి యున్నది. నిద్ర యనునది స్థూలశరీరమునకు సంబంధించినది. జీవునకు సంబంధించినది గాదు. స్థూల శరీరమును వదలి జీవుడు రాత్రి సమయమందు సూక్ష్మశరీరముతో భువర్లోకమునకు పోవుచున్నాడు. స్థూల శరీరమునకును సూక్ష్మ శరీరమునకును భేదమేమియనగా స్థూల శరీరముతో నున్నపుడొక కన్నులతో మాత్రమె చూడగలము. సూక్ష్మశరీర మందుండినయెడల యేవైపునైనను చూడగలము. స్థూలమునకంటె నతి సూక్ష్మముగ నుండునుగాన దీనికి సూక్ష్మశరీరమను పేరుగలదు. మనస్సు ఎల్లప్పుడును పనిచేయుచునే యుండును. అందుచేత నిది సూక్ష్మశరీరముతో రాత్రులందు పనిచేయుచుండును. రాత్రులందు చేయుపని పగటివేళ మనమొనరించు కార్యముల కనుగుణముగా నుండును. కలలనగా రాత్రియందు మనము భువర్లోకమందొనరించు కార్యములె. ప్రతిరాత్రియందును మనము పనిచేయుచున్నాము. మనము పరుండునపుడు మనస్సునందు దృఢముగా నేదిసంకల్పించుకొని నిద్రించుదుమొ యదియె మనకు కలగా పరిణమించును. ఇదినిశ్చయము. ఏదైన నొక మనుజునిగురించి మనముతలచుకొని పరుండినయెడల వాస్తవముగా నామనుజుని యొద్దకు మనము వెళ్లి ఆయనతో సంభాషించి చేయవలసిన కార్యములొనరించుదుము. తిరిగి స్థూలశరీరములో ప్రవేశించునపుడు అది మనకు జ్ఞప్తికిరాదు. అందువలన నదిమనము అసత్యమని యెంచుచున్నాము. ఆప్రకారము తలంచుట యజ్ఞానము. ఒకవేళ నామనుజుని మనము నిద్రలో సంధింపనియెడల మనమనస్సునందు కలత చెందియుండి ఆమనుజుని గురించి దృఢముగా మనస్సునందు సంకల్పింపక పోవుటచే నాతీరుగా పరిణమించినదని

మనము నిశ్చయింప వలసినది. ప్రతిదిన నభ్యాసము చేసినయెడల ననుభవము లోనికివచ్చును. ఒకరాత్రియందు సంధించుటకు తప్పిపోయినయెడల తిరిగి యత్నించిన యెడల తప్పక కలియగలము. మనసంకల్పముల కనుగుణముగా మనము సూక్ష్మలోకమందు వర్తించుదుముగాన రాత్రులందు నిద్రించుటకు పూర్వము చెడు తలంపులను మనస్సునుండి తొలగించి నిద్రింప వలయును. నిద్రించునపుడు ప్రతి మానవుడును తన యిష్టదైవమును ప్రార్థించిగాని మహానీయులను తలచుకొనిగాని, మంచిగుణముల నభ్యాసము చేయవలయునని యనుకొనిగాని నిద్రింప వలయును. అట్లు తలంచి నిద్రించినయెడల పరమానందమును పొందుదుము.

## మనోమయ శరీరము.

జీవుడు కలిగియుండు శరీరములలో మూడవది మనోమయ శరీరము. ఇదిమనస్సునకు సంబంధించి యుండుటచే దీనికా పేరువచ్చినది. ఇది సువర్లోక సంబంధమైన మట్టితో చేయబడినది. అందుచేత నిది యాలోకమందు పనిచేయుటకు విధింపబడియున్నది. సామాన్య గుణములు గలిగిన జీవుని యీశరీరము కోరిక లీడేర్చుటకుగాను కామమయ శరీరముతోకలిసి రాగద్వేషములు కలిగియుండును. జంతువులకును మనుజులకును గల తారతమ్యము ఈమనోమయ శరీరమువలన గలుగుచున్నది. జంతువులకు మనోమయ శరీరముండదు. ఉండినను మనుజుల యందు వికసించినట్లుగా వికసింపదు. బుద్ధి కుశలత యుండదు. మనుజునకివి రెండును గలవు. అందుచేత నేపని చేయుచున్నను బుద్ధిని విచారించి నిదానముగా చేయవలయును. సాధారణ మనుజలయం దీశరీరము నెక్కువగా వికసింపదు. ఇటువంటి మనుజులు స్వర్గలోకమం దెక్కువ కాలముసుఖము ననుభవింపజాలరు. బుద్ధిని విచారించి పనిచేయు వారల మనోమయ శరీరము కొంచము రూపము గలదిగా నుండును.

మతగ్రంథములను పరిశోధించుచు, భగవంతుని ధ్యానమొనర్చు చు, ప్రపంచమున కుపకార మొనరించుచుండినయెడల నీశరీరము రమ్యముగా నేర్పడును. జ్ఞానవంతులకీశరీర మతిసుందరమయిన రంగులుగలిగి గుణముల కనుగుణముగా మారుచుండును. ఇతర శరీరములకంటె దీనికి రూపము బాగుగా నేర్పడును. మనుజులు ఎక్కువ కాలము స్వర్గలోకమందు సౌఖ్యమును పొందవలయుననిన నీమనోమయ శరీరమును ఉత్తమగుణములు గలిగినదిగా నొనర్చుకొనవలయును. దీనియందు చెడుగుణముల నేమియు నుద్భవింప జేయరాదు. సదా భగవద్భక్తియు లోకోపకార చింతయుగలిగి, రాగద్వేషాదులను ఇంద్రియ వ్యాపారములను వశపరచుకొని, లోకమందు వర్తించినయెడల నీమనోమయ శరీరము చక్కగా నేర్పడి, మంచివర్ణములు కలదై యుండి మనకు నిహలోకమందు మంచి సుఖమునిచ్చి పరలోకమందు అమిత ఆనందమును పొందజేయును. తిరిగి జన్మించునపుడు మంచి శరీరములతోను మంచి మనస్సుతోను వ్రపంచమందు పుట్టుదుము.

ముదునూరు శ్రీరంగయ్య.

# గ్రంథస్వీకారము.

శ్రీ॥ భోగరాజు భక్తరాజుగారిచే ప్రచురింపంబడిన భక్తిమార్గము 1, శ్రీ॥ సిరిపి అంజనేయులుగారిచే పరిదింపఁబడిన విజ్ఞానదర్పణము 2, శ్రీ॥ ఆత్మూరి రామ మోహనరాయగారిచే రచియింపంబడిన పరమార్థవినోదములు 3, శ్రీ॥ ఎమ్. వెంకట్రామగారిచే ప్రచురింపంబడిన బాల్యవివాహములు 4, ఈనాలుగు గ్రంథములును కొంతకాలము క్రింద మా కార్యస్థానము నలంకరించినవి. అనివార్యము లయిన కొన్ని యసందర్భములవల్ల వానిని విమర్శించక నింతవఱకవకాశమయ్యె. ఆలస్యము క్షంతవ్యము.

1. భక్తిమార్గము—ఇది భాగవతోత్తములును తత్త్వవేత్తలునగు శ్రీపరమానంద స్వాములవారిచే నాంగ్లము భాషయందు వ్రాయఁబడి భోగరాజు భక్తరాజుగారిచే నాంధ్రీకరింపబడినది. ఇది భక్తి, నిర్మలత్వము, నిశ్చలత్వము, నిర్భయత్వము, ఇంద్రియ నిగ్రహము నని ఐదు ప్రకరణములుగా విభజింపబడియున్నది. భక్తులకు నుండవలసిన లక్షణములు, నాచరించవలసిన నియమములు, ఇంద్రియ నిగ్రహ విధానము మొదలగు పరమార్థ విషయము లనేకము లిందు విశదీకరింపబడియున్నవి. మూలగ్రంథమును వ్రాసిన మహనీయుని యొక్క పరమైకాంత భక్తియోగగ్రంథము నందంతయు వెల్లడియగుచున్నది. వెల 4 అణాలు, వలయువారు మచిలీబందరులో గ్రంథకర్తగారికి వ్రాసుకొనవలయును.

పైనుదహరించిన ఇతర గ్రంథములు మరుసటి సంచికలో విమర్శించఁబడును.

# Divyagnanadeepika

CONTENTS OF THIS NUMBER.



—— :o: ——



## దివ్యజ్ఞాన సమాజము.

ఈ సమాజములో చేరగోరువారు అందుకై యేర్పాటు చేయబడి యుండెడు దరఖాస్తు అచ్చుఫారములో దస్కతు చేసి కాశీలో ఇండియన్ సెక్షన్ సెక్రటరి గారికి పంపుకొనవలయును. అట్టిఫారములు సదరు సమాజము ఉండెడు స్థల ఆ కార్యదర్శియొద్ద దొరకును. సమాజముయొక్క ఇన్స్పెక్టరుయొద్దను దొరకును. ప్రవేశరుసుమేమియును చెల్లించ నక్కరలేదు. ప్రతి సంవత్సరము మూడురూపాయల కంతున చందా చెల్లించవలయును. మొదటి సంవత్సరపు చందా ప్రవేశ దరఖాస్తుతోడ పంపవలయును. అట్టివారికి దివ్యజ్ఞానదీపిక నెలనెలకు ఉచితముగ పంపబడును. స్త్రీలు, పురుషులు, ఎవరైన నీసమాజమున జేరవచ్చును.

చిత్తూరు,
1—7—1916. }

పరమాత్ముని నరసింహయ్య,
పబ్లిషర్.

Registered No. M. 716

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువధర్మములేదు.

August 1916.

సంపుటము 7. ఆగష్టునెల 1916. సంచిక 5.

విషయసూచిక.

పుట



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 7. August 1916. ఆగష్టు 1916. సంచిక ౫.

## కాలదేశ వర్తమానములు.

జూలై నెల 29, 30 తేదులయందు వేలూరులో ఒక దివ్యజ్ఞాన సభ చేరెను. హైకోర్టు జడ్జిగారైన దివాన్ బహదూర్ సదాశివయ్యగారు అగ్రాసనమును వహించిరి. నానా స్థలములనుండి అనేకులు సాధుజనులు ఆసభకువచ్చిరి. ఇంగ్లీషుభాషయందును ఆంధ్రమునందును ద్రవిడమునందును ఉపన్యాసములు అత్యద్భుతములుగ జరిగెను.

* * *

ఈనెల 19-20 తేదులందు అనంతపురములో నొకదివ్యజ్ఞాన సభ చేరును. ఆసభయందును హైకోర్టుజడ్జిగారగు దివాన్ బహదూర్ సదాశివయ్యగారు అగ్రాసనము నలంకరింతురు. తెనుగు భాషయందును ఇంగ్లీషునందును ఉపన్యాసములు జరుగును. ఇతరస్థలములనుండి సభకువచ్చువారికి భోజనాదులకు వసతులేర్పరుప బడును.

మదనపల్లెలో దివ్యజ్ఞాన సమాజమువారొక (కాలేజును) ప్రౌఢవిద్యాశాల నేర్పరిచి యున్నారని మనవాచకుల కిదివరకే తెలిపియున్నాము గాదా! భారతీయబాలికలకు విద్యాశిక్షణల నిచ్చునిమిత్తమై అచటనొక హైస్కూలును (Girls' High School) స్థాపించవలెనని తీర్మానించుకొని అందుకు వలయు ద్రవ్యసహాయమునకుగాను యత్నముచేయ నారంభించియున్నారు. కాశీక్షేత్రమున బాలికాప్రౌఢ విద్యాశాల (Girls' College) ఈసంవత్సరమే ర్పరచి యుండుటచే యాప్రాంత్యపు బాలికలకు చాల మేలయిన దిగాని దక్షణమున నట్టి విద్యాశాల యొకటియుండిన నీప్రాంత్యపుబాలికలకు మంచిది. సర్కారువారును, క్రైస్తుపాదిరీలును నీదేశమున నచ్చటచ్చట బాలికాపాఠశాలల నేర్పరిచి యున్నారు గాని హిందూబాలికల కనుకూలమయిన విద్యాశిక్షణలు లేకయున్నవి. ఏలయన సర్కారు పాఠశాలలలో మతసంబంధమైన విద్యను నేర్పించరు, క్రైస్తుపాఠశాలలలో క్రైస్తు మతమునుమాత్రమే బోధించెదరు. గాన నీరెండును హిందూబాలికల కంతగా ప్రయోజనపడవు. దివ్యజ్ఞాన సమాజమువారు స్థాపించుపాఠశాలలలో మతమును, నీతినిపహా బోధించుదురుగాన భారతీయులకు చాల ప్రయోజనకరములై యుండును. ప్రకృతము మదనపల్లెలో స్థాపించబోవు బాలికాపాఠశాలకు నుదారులగు ధనికులు సహాయము జేసిన త్వరగా దానిని స్థాపించవచ్చును. ద్రవ్యసహాయము జేయువారు తమకు తోచిన మొత్తమును Ernest Kirk Esq. Besant Gardens, Theosophical Society, Adyar, Madras S. గారికిగాని, Secretary, Theosophical Educational Trust, Adyar, Madras S. గారికిగాని పంపవచ్చును.

* * *

బళ్లారిలో మైత్రేయికళాతత్వజ్ఞాన సమాజమొకటి స్థాపింపబడియున్నదని వాచకులకిదివరకే తెలిపియున్నాము.

ఈసమాజమున 25 స్త్రీలు మెంబర్లుగా నున్నారు. ప్రతిదినము సాయంకాలము 3 ఘంటల మొదలు 5 ఘంటలవరకు గ్రంథవ్యాసంగమును జ్ఞానవిచారణమును జేయుచున్నారు. దాదాపుగా 50 మంది స్త్రీలు ప్రతిదినము వచ్చుచుందురు. వారికిగల శ్రద్ధాభక్తులు చాలశ్లాఘ్యతరము లయియున్నవి. జగద్గురు సేవాసమాజముని (Order of the Star in the East) యొక శాఖనేర్పరచుకొని యున్నారు. దానిలో సుమారు 102 స్త్రీ పురుషులున్నారు. ప్రతివారమున నీసమాజపు సభలు జరుగుచున్నవి. బళ్లారి వైశ్యస్త్రీలలో వర్ధిల్లుచుండు భక్తిశ్రద్ధలును పారమార్థికబుద్ధియు నాశ్చర్యకరములై యున్నవి. వీరికి భగవంతుడు భక్తిజ్ఞాన వైరాగ్యముల నతిశయింపజేసి లోకోపకారార్థము పాటుపడు సామర్థ్యము నిచ్చుగాక! వీరిపారమార్థికాభివృద్ధికొరకును జ్ఞానాతిశయముకొరకును నేకరీతిగా పాటుపడుచున్న చాతకుంటి సుబ్బాశాస్త్రిలవారికి భగవంతుడాయు రారోగ్యభాగ్యము నిచ్చుగాక!

* * *

సృష్టిలోని పదార్థములను విచారదృష్టితో మనుజుడాచినయెడల వానిరచనాక్రమ మెంత యందముగాను, సొష్టకముగా నున్నదో మనకు గోచరించకతప్పదు. వస్తువుల కిట్టి విచిత్రమగు రచనాక్రమ మేలాగున సంభవించునో దెలియయత్నించినయెడల మన యందరికంటెను బుద్ధి కుశలతయందును శక్తియందును ఊహాపోహలయందును ననేకమారులుత్తములై వెలయుచున్న ఒక మహానుభావుడు వాని కిట్టి స్థితిని కలుగజేసియుండ వలయునని స్ఫురించుచున్నది. అతడే సర్వశక్తుడును, సర్వాంతర్యామియును సర్వజ్ఞుడును నను భగవంతుడు. అతని ప్రభావమును మానవులగు మనము కనుగొనజాలము గాని సృష్టిలో నగుపడు విచిత్రమయిన పదార్థము లన్నియును నతని మాహాత్మ్యమును కొంతవఱకు వెల్లడి జేయుచున్నవి. అతడే

మనజీవమున కాధారుడు. అతడే మనప్రేమకాధారుడై ప్రీతిపాత్రుడై యున్నాడు. అతనిని బొందు నిమిత్తమే లోకమంతయును నానా రూపములుగా పరిణమించియున్నది. రాళ్లు, చెట్లు, పశువులు, మనుష్యులు, దేవతలు సహిత మతని ప్రకాశమునే వెల్లడిజేయుచుందురు. అతనిని కనుగొన గోరువాడతడు ప్రకాశించుచుండు సమస్తరూపముల విభూతిని ధ్యానించుచు తదేకనిష్ఠుడై వానికి హితమాచరించ యత్నించవలయును. లోకమును తా స్మరించుచు నతనిని కనుగొనుట కష్టము. ప్రాణులకు హితమొనరింపక అతనిని బొంద నలవిగాదు. మాయాతీతుడగు నా మహానుభావుని ప్రసాదము త్యాగముచే తప్ప వేరువిధముగా లభించదని కొన్నికృతులు ఘోషించుచున్నవి.

* * *

త్యాగమనగా స్వార్థత్యాగము. స్వార్థపరత్వమే మనలను పాపకార్యములయందు ప్రవర్తింపజేయునది. అదియే మనచే పరులకపకారము జేయించునది. స్వార్థపరత్వమువలన మనుజుడీలోకమున జేయని పని గాని, తలవని తలంపు గాని, కోరనిమనోరథముగాని లేదు. తనకే సర్వసుఖము గావలయు ననియు తనకే సమస్తశక్తు లుండవలయుననియు, తన్నే సర్వజనులు సన్మానించవలెననియు స్వార్థపరుడు కోరును. ఇట్టిచిత్తవృత్తి యుండువరకును మనుజులు నిశ్శ్రేయస మార్గమును బొందజాలరు. సాధనముచే వీరికి కొన్నిశక్తులు లభించినను వానిని దురుపయోగపరచెదరుగాన క్రమక్రమముగా వామాచార మార్గమునుబొంది స్వారాత్మఘాతకులగుదురు. ఎవరు స్వార్థత్యాగము జేసి లోకహితార్థముగా పాటుపడుదురో వారు పారమార్థికస్థితిని బూని కృతకృత్యులగుదురు. తమకు కావలెనని కోరువారికి భగవంతుడేవస్తువునివ్వడు. అయితే మాకేమియు పనిలేదని విరక్తితో వర్తించువారికి సర్వమును భగవంతుడు కరుణించును.

# ప్రసన్నత్వము.

51-వ పుట శేషము

మూడవపాత్రత యగు ఆనంద సంకల్పములను గురించి ఇపుడు వ్రాయుచున్నాను. జగత్తునందుండు సమస్తమును ఆనందమునే వెతకుచున్నవి. చిన్నసస్యములును పశువులును మనుష్యులును ఆనందము నందుండవలెనని యత్నించుచున్నారు. ఇది వారి స్వభావమం దంతర్భూతమైయున్నది. ఆనందముగ నుండవలెనుట నైజమైన ప్రేరణగా నున్నది. ఇట్లుండియు ప్రపంచ మందంతట చూడగా ఆనందమునకంటె దుఃఖమును కష్టమును అధికముగా నున్నట్లు తెలియుచున్నది.

ప్రపంచమునందు నీడలుండుట కేమికారణమో అట్టికారణమే దీనికిని యని తెలియవలసినది. సూర్యుడెల్లప్పటికి ప్రకాశించుచున్నాడు. సూర్యుని ప్రకాశమునకును భూమికిని ఏదైన అడ్డము వచ్చినపుడు భూమి మీద నీడ పడును. అట్లనే ఆనందమనుభవించని జనులు తమ ద్వారములను శుచిగా నుంచియుండరు. నేను మీకు ద్వారములని చెప్పినది మనకు ఉండవలసిన గుణములని మీకు జ్ఞాపకముండవచ్చును. ద్వారములవలెనుండు ఈగుణములలో నేదైన వికారముగలదాయె నేని నీడలు పడుట స్వభావము. మైత్రేయమహాముని ఈశ్వరుని గుణములు వర్ణించునప్పుడు "ఆయనయందు చీకటిలేనేలేదు అయితే జనులు తమ వీపులను ఆయన ప్రకాశమున కడ్డముగా త్రిప్పి తమనీడలలో నడుచుచు చీకటియని పిలపింతురు" అని చెప్పియున్నారు.

ఇప్పుడు విశేషముగదుఃఖము ప్రపంచమందున్నది. ఎందుకనన స్త్రీపురుషులు అనేకవేల సంవత్సరములనుండి తమ వీపులు వెలుతురుకడ్డముగా త్రిప్పి స్వలాభపరులై ఒకరినొకరు బాధపెట్టుచున్నారు. ఈకర్మఫల మనుభవింపవలెను. ప్రపంచపు సమష్టికర్మ

లను ఒకటే తూరి మార్చుటకు సాధ్యముకానేరదు. దానిని నిదానముగ మార్చదగినది. భూమియందుండు జనులను ఆనందము పొందించుటకు ఈశ్వరుడు యత్నించుచున్నాడనుట జ్ఞాపకముంచుంచవలెను. జనుల వర్తనయందు వెలుతురును ఆనందమును ఉండుటకుగాను ఈశ్వరుడు చీకటిని చెదరగొట్టుటకు సర్వదా యత్నించుచున్నాడు. మహాగురువు సహితము స్త్రీలకు పురుషులకు శిశువులకుసాధ్యమైనంత ఆనందము కలుగజేయవలెనని ప్రయత్నించుచున్నాడు. ఆగురువునకు తోడ్పడుట మనధర్మము.

ఉత్తమాటలతో మాత్రిమునసే జనులకానందము గలుగజేయుట సాధ్యముకాదు. చెడుగునకై యుండు సందర్భములను తొలగించవలెను. మంచిపనులు కలుగజేయవలెను. సుసమయము పొందుటకై అనేకకార్యములు చేయవలెను. మీరు పెరిగి పెద్దవారైనపుడు ప్రపంచమునకు విస్తారముగ పనిచేయవలసియుండును. మీరు చూచినవారందరికి ప్రపంచమందుండు తప్పులను గురించి చెప్పవలసియుండును. ఇది కొంత కాలమున కావలచేయదగినపని. వయసుపొందిన మేము దుఃఖహేతువైన సందర్భములను మార్చుటకు చేయతగిన యత్నములను మీరుచేయవలెనని నిరీక్షించుటలేదు. అయినను బాలురుగానుండి ఆనందసంకల్పములచే మీరు ఎక్కువగ పనిచేయగలరు. కనుక మీరుఆనందభరితులై యుండవలెను. పరమగురువులు ఆనందభరితులైయున్నారు. వారు మీగుండా ప్రపంచము చూచుటకు మీరు ద్వారములుగా నుండవలెను. ఈవిషయమయి పరమగురువులందరేకరీతిన నుందురు. వారు ఆనందమగ్నులై ప్రపంచమునకంతయు దానిని పంచిపెట్టి నిశ్చింతులయి యుందురు.

గురువులెట్లు స్తుతింపబడుదురు?

"ఆనందమానందకరం ప్రసన్నం."

తాము ఆనందముతో నిండి ఇతరులకు ఆనందము గలుగ

జేయువారుగాను ప్రసన్నముఖులుగా నుందురని తాత్పర్యము.

"బ్రహ్మానందం పరమసుఖదం"

బ్రహ్మానందము పరిపూర్తిగ అనుభవించుచు ఇతరులకు పరమ సుఖమిచ్చువారని గురుగీతలందు చెప్పబడినది.

పరమగురువు లెల్లప్పటికి ఆనందమందు మునిగియుందురని చెప్పబడినది. వారి ఆనందము ప్రకాశించుటకు మీరు ద్వారములుగా నుండగోరినపుడు మీరు కూడ ఆనందమయులై యుండవలెను.

దినదినము ఉదయమున జగద్గురువగు గౌతమబుద్ధులు ఎట్లు ధ్యానించుచుండినది మీకు బోధించి యుండినచో మీకది జ్ఞాపకమునకు వచ్చును. ప్రతిదినము ప్రాతఃకాలమున అయన మేల్కొనినతోడనే ప్రపంచమంతయు తనప్రేమానంద ప్రవాహ అలలు వ్యాపించునట్లు ఆశీర్వదించుట మొదటి పనిగా నియమించుకొనియుండిరి. వారు ప్రతివానికి నుండు ఆనందమును గురించి పదేపదె చెప్పుచుండిరి. మరియు వారిశిష్యులకు వారు వెళ్లిన చోట్లనంతయు నెట్లుఆనందము వ్యాపించవలయునో ఆ విషయము బోధించుచుండిరి. ఇప్పుడు కూడా బౌద్ధసన్యాసికి నేదైన నుపచారముచేసినపుడు (నీవు వినకుండ లోపలనే) పాలీభాషతో "సుఖీభవతు" సుఖముకలుగుగాక యనుచున్నాడు. నమస్కారము చేయుటకు నీవువంగినపుడు దీనినే పాలిభాషతో నుచ్చరించుచున్నాడు. మనుష్యులలో నందరియందు ఈ ఆనందభావముతో నొకరి కొకరు వందనములొనరించవలెనని బుద్ధులపేక్షించినారు.

శ్రీకృష్ణమూర్తి వేణుగానముచే, తనచుట్టు నుండిన జనులనందరిని ఎంత ఆనందమొందించినది మీకు జ్ఞప్తికిరావచ్చును. ఆయన పూర్ణానంద భరితుడైయుండినందున పక్షులు కూడ ఆ యానందగానము వినుటకు ఆకర్షింపబడుచుండెను. క్రీస్తుమహాపురుషునిగురించి చదువగా ప్రపంచమునకు ఆయన వేరువిధముగ

ఆనందమిచ్చినట్లు మీకు తెలియవచ్చును. యూధులమధ్య ఆయన పనిచేయుచుండినపుడు వారు ఆయనను బాధపెట్టినందునను ఆయన చేయుపనికి అడ్డముగా వచ్చినందునను ఆయన ఆనంద స్వభావమునంతయు చూపుటకు వీలులేకపోవుటచే కొంచముమాత్రము చూపవలసి వచ్చెను. అయినను అప్పటిజనులకు బాగుగ తగినట్లు ఆనందమిచ్చెను. "నాయొక్క శాంతమును మీకు ఇచ్చుచున్నాను" అని చెప్పెను. మహాపురుషులశాంతము గోచరముకాని ఏమియుచేయక ఊరకయుండునది కాదు. నిండుపండు వెన్నెలయందు అంతయు చల్లగ శాంతముగనుండు సమయమున కలుగు పూర్ణోల్లాస ఉత్సాహమువలె నుండును.

ప్రతిమహాపురుషుడును దినదినము ప్రపంచమునకు ఆనందవర్షమును కురుపించుచుండును. అందుకే ఆమహాపురుషుల శిష్యులుగా ప్రపంచమునకు ఆనందమునిచ్చుటకు మీరును శిక్షితులు గావలెను. మీరు ముఖ్యముగా బాల్యదశలో నుండుటనుపట్టి ఆనందమున కాటపట్టుగా (మధ్యస్థానముగా) నుండవలెను. కాలము గతించుచురాను మీరు చేయవలసిన పనులు విశేషముగ నుండును. పూర్ణానందమగ్నులై యుండుటకు సులభముకాకనుండు సమయములు తటస్థించవచ్చును. ఇప్పుడు మీయోగక్షేమములు విచారింపబడుచుండ, మేము మీబాల్యదశ ఆనందముగ నుండుటకు ప్రయత్నించుచుండ మీరు ఆనంద భరితులయియుండుటకు యత్నించవలెను.

జం॥ శ్రీనివాసరావు.

# ప్రవృత్తినివృత్తిమార్గములు.

(132-వ పుట శేషము)

బ్రహ్మచర్యాశ్రమము.

గతసంచికయందు విద్యాదానము అపాత్రులకు చేయదగదనియు చేసినట్లైన దానిచే కలుగు అనర్థములను గురించియు రెండు దృష్టాంతములతోడ చెప్పబడెను. అపాత్రులకు విద్యాదానము సేయుటచే కలుగు అనర్థములకు పారమే లేకున్నది.

విద్యాశక్తి, యుక్తబలములను స్వార్థముకై ఉపయోగించుటచే జనులకు సంభవించు కష్టనష్టము లింతింతని చెప్పటకు లవికాదు. విద్యను గ్రహించిన అపాత్రులు రాజకీయ అధికారము పొందినవారు తమ అధికారబలముతో జనులను పెట్టు పలుబాధ లెవరెరుగరు?

ఈ సత్యమును పూర్వము మనపెద్దలు తెలిసియుండిరి గనుక విద్యార్థులకు పాత్రత కలుగజేసి విద్యనొసంగుచుండిరి. ఏకలవ్యు డనువాడు శస్త్రాస్త్ర విద్యను నేర్చుకొనుటకు పరమభక్తితో ద్రోణాచార్యులవారి యొద్దకు వచ్చి వినయభయ విశ్వాసములతో దీనభావమున ప్రార్థించగా ద్రోణాచార్యులవారు, వాడు అపాత్రుడుగానుండుటను పట్టి వానిని శిష్యునిగా నంగీకరించలేదు. అయినను ఏకలవ్యుడు కేవల దృఢమనస్సు కలవాడగుటచే ఈవిద్య నెట్లనైన సంపాదించితీరెదనని ప్రతిజ్ఞ జేసి బంకమట్టితో ద్రోణాచార్యుల ప్రతిమను కల్పించి ఆప్రతిమనే ద్రోణాచార్యునిగా భావించి దానికి గురుపూజావిధానములు తప్పక అర్పించి దానిని ఎదురుగా నుంచుకొని శస్త్రాస్త్రములు ప్రయోగించ నారంభించెను.

ద్రోణాచార్యులవారు పాండవులకును కౌరవులకును తమయాశ్రమమందు అదే విద్య గఱపుచుండిరి, వీరికి విద్యపూర్తిగవచ్చిన

పిదప చెప్పుట చాలించి వారికి సెలవిచ్చిరి. పాండవులు కౌరవులు ఈవిద్యయందు పారంగతులైన సమయములోనే ఏకలవ్యుడును వీరితో సమానమైన నిపుణత పొందెను. ఈసంగతి ద్రోణాచార్యులవారెరింగి ఏకలవ్యునికడ కేగిరి. ఏకలవ్యుడు వీరినిచూచినతోడనే వినయ భయవిశ్వాసము లతిశయిల్ల సాష్టాంగ దండప్రణామము లొసంగి ముకుళితహస్తుడై స్వామీ తమఅనుగ్రహముచే శస్త్రాస్త్రవిద్య సాంతముగ నేర్చితిని, గురుదక్షిణ ఏమికావలయునో ఆనతిండని ప్రార్థించ ద్రోణాచార్యులవారు నీకుడిచేతిబొట్టనవ్రేలిమ్మని సెలవిచ్చిరి. అప్పుడు ఏకలవ్యుడు మారుబలుకక తత్క్షణముననే ఆ వ్రేలుకోసి గురువునకు సమర్పించెను. దీనికి ద్రోణాచార్యులవారు సంతసించి ఆశ్రమమున కేగిరి. గురుదక్షిణగా బొట్టనవ్రేలు అడుగుటకు కారణమేమన:- ఆవ్రేలుఉన్నయెడలవాడు శస్త్రాస్త్రములు ప్రయోగించుటకు సాధ్యముగా నుండెను. అదిలేకుండ చేయుటచేవాడు నేర్చిన విద్యయంతయు వ్యర్థమాయె. వీడు ఆవిద్య నుపయోగించుటకు సమర్థుడుగా నుండెనేని లోకకంటకుడై సర్వభూతములను హింసించువాడుగానుండెను. దీనిచే వానికిని వానిద్వారా జగత్తునకును అహితమగుచుండెను. గనుక ద్రోణాచార్యులు మొదటవిద్య నేర్పనని చెప్పినను వానిమనోదార్ఢ్యముతో విద్య నేర్చినందున ఆ నేర్చినవిద్యను వినియోగ పెట్టుటకు వీలులేకుండునట్లు వానివ్రేలును పోగొట్టిరి. జర్మనీ దేశమువారు ఇట్టి విద్యను నేర్చినందునకదా సమస్త దేశములకు హానికలుగ జేయుచున్నారు. ఈవిద్యలను ఎన్నివిధములనో లోకోపకారమునకై వినియోగించశక్యమై యున్నది. వీరు ఆవిద్య నేర్చుట కపాత్రులైనందున లోకమునంతయు హతముచేయ నుపక్రమించినారు. ఇదిమిక్కిలి శోచనీయముగానున్నది. పూర్వమందు గురువులు తత్వవేత్తలుగాను సర్వదాశిష్యుల హితమునే తలంచువారుగానుండిరి.

"కో గురురధిగతతత్త్వః
శిష్యహితాయోద్యత స్సతతమ్

గురు వెవడు, తత్త్వము తెలిసినవాడును, ఎల్లప్పటికిని శిష్యులహితము కోరువాడని శ్రీశంకరాచార్యులవారు ప్రశ్నోత్తర రత్నమాలయందు చెప్పినారు.

శిష్యులయందుండు దోషములను పూర్తిగ నశింపజేయుట గురువులకు ప్రథమధర్మముగా నున్నది. దోషములెప్పటికైనను బాధపెట్టునవి గాని హితము చేయునవి కావనుట సర్వత్ర స్థాపితమైన సిద్ధాంతము. శిష్యులయందు నైజముగ దోషములు నిండియుండ విద్య గఱపుటచే శిష్యులకత్యంత ఆహితము చేసినట్లగును గాని వేరు కాదు. దాని వలన లోకము హతమగును. ఈ కారణముచే గుణములు తీర్చుట ప్రథమ కర్తవ్యముగాను విద్య నేర్పుట ద్వితీయ కర్తవ్యముగా నెంచి యుండిరి.

గుణములు తీర్చుటకు యుక్తమైన కాలము బాల్యదశ.

బాలబాలికలకు ఏడు సంవత్సరములనుండి గుణములంకురమగుటకు ప్రారంభించును. దుర్గుణములు అంకురమెత్తకుండ నశింపచేయుటకును సుగుణములు సమృద్ధిగ పెరిగి పక్వమగుటకును ఆవయసు మొదలుకొని బాలురను శిక్షించుటకు (తీర్చుటకు) గురువు స్వాధీనము చేయుచుండిరి. దుర్గుణములు మొలచి పెరిగి మూలములు దృఢముగ నాటి వృక్షమై శాఖలెల్ల ప్రకరాలవ్యాపించిన వెనుక తెగవేయుటయు పెరికివేయుటయు కష్టము గనుక మొలవకమునుపో, లేక మొలచినతోడనో పెరికివేయుటకు ఏడు సంవత్సరములనుండి ప్రారంభించుచుండిరి. పూర్తిగ పెరిగినతరువాత పెరికివేయుటకు ఆయుర్దాయమంతయు కావలసి యుండును.

ప్రవృత్తిమార్గధర్మముల ముఖ్యోద్దేశము నివృత్తిమార్గధర్మములలో ప్రవేశింపచేయుటతప్ప వేరు కాదు. అనాత్మవస్తుజ్ఞానము ఆత్మవస్తుజ్ఞాన సాధనముగానుండుటకే నని సిద్ధాంతము. క

నుక ప్రవృత్తిమార్గమందు అనాత్మవస్తుజ్ఞానము నేర్పు సమయము న గురువులెల్లప్పటికి నివృత్తిజ్ఞానముఖ్యసాధనమగు అసంగమునే లక్ష్యమందుంచి వర్తించుచుండిరి.

ప్రవృత్తిమార్గరూపకమగు జననమరణాత్మకమైన సంసారము అశ్వత్థ వృక్షమునకు పోల్చబడినది. దీనిఆకులు వేదములు. ఈ వృక్షమును తెలిసినవాడు వేదవేత్తయగును. దీని మూలముపైనను శాఖలు (కొమ్మలు) గుణములతో ప్రవృద్ధమానమై పైనను క్రిందను వ్యాపించినవై, వ్రేళ్లు అడుగున పెరిగి మనుష్యలోకమందు కర్మచేత బంధించుచున్నది. దీని స్వరూపముయొక్కయు, ఉత్పత్తియొక్కయు, అంతముయొక్కయు, జ్ఞానమిక్కడపొందుట కలవికాదు. దృఢముగా నాటినవ్రేళ్లు గల ఈఅశ్వత్థ వృక్షమును అసంగమను శస్త్రముచే నరికినతరువాత నివృత్తిమార్గపదమును తెలియవలెనని భగవద్గీత 15 అధ్యాయమందు చెప్పబడినది.

శ్లో॥ ఊర్ధ్వమూలమధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయం।
ఛందాంసి యస్యపర్ణాని యస్తం వేద స వేదవిత్॥
అధశ్చోర్ధ్వం చప్రసృతాస్తస్య శాఖా
గుణప్రవృద్ధా విషయప్రవాళాః।
అధశ్చమూలాన్యనుసన్తతాని
కర్మానుబంధీని మనుష్యలోకే।
నరూపమస్యేహతథోపలభ్యతే
నాన్తోనచాదిర్నచసంప్రతిష్ఠా।
అశ్వత్థమేనంసువిరూఢమూల।
మసఙ్గశస్త్రేణ దృఢేనఛిత్త్వా
తతః పదంతత్పరిమార్గితవ్యం॥

ఈ శ్లోకముల అర్థముపైనవ్రాయబడినది. గురువులు శిష్యులకు ప్రవృత్తిమార్గమందు అనాత్మవిద్యనేర్పునపుడు విషయములందు సంగరాహిత్యముండునట్లు సాధ్యమైనంత జాగ్రతగలిగి

చూచుచుండిరి.

సాధారణముగ జనులందరు విషయవస్తువులను సంగ్రహించుట దేహసుఖమునకని అందరు యెరుగుదురు. శిష్యులు గురుకులవాసము చేయునపుడు ఏవిషయవస్తువునుగాని దేహసుఖమునకై విని యోగపెట్టకుండ ఖండితముగ నియమించుచుండిరి. ఇదిముఖ్యమైన గొప్పశిక్ష (Discipline) గా నెంచియుండిరి.

విద్యార్థి గురుసమీపమునకు విద్య నేర్చుటకు వచ్చినతోడనే మొదట విద్యాభ్యాసంగము చేయుచుండు వరకు దేహసుఖాదులను విడువవలెనని శాసనము చేయుచుండిరి.

శ్లో॥ సుఖార్థినఃకుతోవిద్యా
నాస్తివిద్యార్థినస్సుఖం
సుఖార్థీవాత్యజేద్విద్యాం
విద్యార్థీవాత్యజేత్సుఖం॥

సుఖమపేక్షించువానికి విద్యలేదు, విద్యనపేక్షించువానికి సుఖములేదు, సుఖమపేక్షించువాడు విద్యవదలవలెను, విద్యనపేక్షించువాడు సుఖమువిడువవలెనని విదురనీతియందు చెప్పబడినది.

సుఖమపేక్షించువారిని శిష్యులుగా నంగీకరించుచుండలేదు. విషయసుఖాపేక్షపరు లెల్లప్పటికి నాశనమొందుదురు. గురువులు సర్వదా శిష్యులకు హితము కోరువారని ఇంతకుముందుదాహరింపబడియుండెను. శిష్యులనాశమునకు గురువులెప్పటికి నోర్వజాలరు. అందుకై విషయసుఖాపేక్ష వదలుట శిష్యులకు ప్రథమధర్మముగా నెంచియుండిరి.

విషయసంగమెట్లునాశము చేయును?

శ్లో॥ ధ్యాయతోవిషయాన్ పుంస
స్సఙ్గస్తేషూపజాయతే,
సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోభిజాయతే॥

క్రోధాద్భవతిసమ్మోహః।
సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో।
బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

విషయములను స్మరించుటచే వాటితో సంగము కలుగును. సంగమువలన కామము పుట్టును. కామము క్రోధము నుత్పత్తి చేయును. క్రోధముచే మోహముజనించును. మోహముచే స్మృతి భ్రంశకలుగును. స్మృతి భ్రమచే బుద్ధినశించుచున్నది. బుద్ధి నాశముచే నాశమొందునని భగవద్గీతా ప్రమాణము.

సర్వప్రకారముల వినాశకరమగు విషయసంగములందు శిష్యులను ప్రవేశపెట్టక ఎట్లుశిక్షించుచుండినది దిగువవ్రాయబడును:—

శ్లో॥ తమస్త్వజ్ఞానజంవిద్ధి మోహనం సర్వదేహినాం।
ప్రమాదాలస్య నిద్రాభి స్తన్నిబధ్నాతిభారత॥

తమోగుణము అజ్ఞానమునుండి పుట్టుచున్నది. దేహధారులగు సర్వ జీవులకు మోహముకలుగజేసి అజాగ్రతచేతను, సోమరితనముచేతను, నిద్రచేతను జననమరణ రూపక సంసారమందు కట్టివేయుచున్నదని భగవద్గీతయందు చెప్పబడినది.

నిద్రాలస్య ప్రమాదములు అజ్ఞానులు దేహమునకు సుఖప్రదాయకంబులని భావించి వాటిని పొందుటకు ప్రయత్నములు చేయుదురు. సద్గురువులు తమశిష్యులు వీటిని దేహధారణకవశ్యముండినంత మాత్ర ముపయోగించునట్లు అభ్యసింప చేయుచుండిరి. దేహసుఖమునకు వాటిని పొందనివ్వక శిక్షయందుంచుచుండిరి, శిష్యులు గురువు నిద్రించినతరువాత నిద్రించవలె ననియు, గురువులు మేల్కొనకముందు మేల్కొనవలెననియు విధించిరి. పూర్వము నిష్ఠాపరులగు ఆర్యులందరు బ్రాహ్మ్యముహూర్తమునకు తప్పక మేల్కొనుచుండిరి. బ్రాహ్మ్యము

హూర్తమున సూర్యోదయాత్పూర్వము రెండుగెంటల సమయము అనగా వేకువనాలుగుగంటల కాలమని తెలియవలెను. గురువులెల్లప్పటికి వాన గాలి చలి ఎండ కాలముల భేదములను పట్టి సూర్యోదయమునకంటె రెండుగంటలకుముందు నిద్రలేచుచుండిరి. శిష్యులు గురువులకంటె కొంచము ముందుగా లేచుట విధించియుండుటచే వీరును ఆకాలమునకు కొంచము ముందులేచుట అభ్యసించుచుండిరి. ఈ వేకువజామున లేచుట నభ్యసించని సామాన్యజనులకు అప్పుడు నిద్రబోవుట అతిసుఖముగా తోచుచుండును. మరియు చలికాలమున ఆసమయమందు మేల్కొనుట అమితకష్టముగాతోచును.

చిన్ననాటినుండి అకాలములోను అమితముగను నిద్రపోకుండ శిక్షించుటచే శిష్యులదేహములు, రానురాను, అకాల అమిత నిద్రాపేక్షలకు ఆస్పదమివ్వకుండునట్లు పెరుగును. అనగా సకాలమందును, మితముగను నిద్రించుట నైజమగును. అనగాస్వభావమైపోవును. అప్పుడు అకాలనిద్రయు అమితనిద్రయు చేయుట సుఖముగనుండుటకు మారుగ కష్టముగనుండును. దీనిచేత తామసగుణములో నొకభాగమగు నిద్రకు లోపడక దానిని లోపరచుకొని నట్లాయె.

మరియు పగటినిద్ర అకాలనిద్ర. శిష్యులు దివమునందు నిద్రపోకుండ పగలంతయు చేయుటకు పనులు నియమించుచుండిరి. పగలు నిద్రపోవుటచే రోగముత్పత్తియగును. ఆయుస్సు క్షీణించును. వేకువజాము నిద్రచే సంపద తొలగును. అని ప్రమాణములు గలవు.

సూ॥ దివాస్వపం, మైథునంచనకుర్యాత్,
కుర్యాచ్చేత్, ఆయుః పుణ్యయోర్హానిః,
అని గౌతసూత్రమందు చెప్పబడినది.

శ్లో॥ అత్యంబుపానాత్ అతిమైథునాంచ।
దివాస్వపంజాగరణం చరాత్రౌ।
సంధారణాన్మూత్రపురీషణంచ
షడ్భిర్మనుష్యైః ప్రభవంతిరోగాః॥

అధికముగ నీళ్లు త్రాగుటచేతను అమితముగ రతిసల్పుట చేతను, పగలు నిద్రించుటచేతను, రాత్రి మేల్కొని యుండుట చేతను, జలమలములు బిగబట్టుట చేతను ఈఅరింటిచేత రోగము లుదయించుచున్నవని వైద్యశాస్త్రమందు చెప్పబడినది.

శ్లో॥ చత్వారిఖలు కర్మాణిసంధ్యాకాలేషువర్జయేత్।
ఆహారంమైథునంనిద్రాం స్వాధ్యాయంచతథైవచ।
ఆహారాజ్జాయతేవ్యాధిః క్రూరగర్భస్తుమైథునే।
శ్రియంహరతివైనిద్రా స్వాధ్యాయాన్మరణంధ్రువం।
ఆయుఃక్షయోదివా నిద్రా దివాస్త్రీపుణ్యనాశినీ॥

ఆహారము పుచ్చుకొనుట, మైథునముసల్పుట, నిద్రించుట, అధ్యయనముసేయుట ఈనాల్గుకార్యములును సంధ్యాకాలము లందుచేయదగదు. చేసినట్లైన ఆహారముచే వ్యాధియు, మైథునముచే క్రూరులుదయించుటయు, నిద్రచేసంపద్వినాశమును, అధ్యయనముసేయుటచే మరణమును ప్రాప్తించును, పగటినిద్ర చే ఆయుర్నాశమును కలుగునని తాత్పర్యము.

శిష్యులను సర్వదా ఆరోగ్యస్థితిలోనుంచియుండుట గురువులకు ముఖ్యధర్మముగనుక రోగమునకాకరమగు అకాల అమిత నిద్రలకులోపడకుండునట్లు మొదట శిక్షించుచుండిరి.

ఇతరదుర్గుణములను ఎట్లునశింపజేయునది ముందువ్రాయ బడును.

సశేషము.

—:0:—

# మోక్షమార్గ ప్రదీపిక.

(140 పుట శేషము).

నహి దేహ భృతాశక్యం త్యక్తుం కర్మాణ్య శేషతః
(భ. గీ. 18—11.)

కర్మములను సంపూర్తిగా విడుచుటకు దేహధారుల క శక్యము.

కనుక ప్రతిమనుజుడు పూర్వ కర్మ నాశముకొఱకో, లోకసంగ్రహార్థమో, పనిచేయుచునే యుండవలయు. అట్లు జేయు చున్నను లక్ష్మికిస్థానమైన భగవంతుని మఱవ కుండునట్లు అభ్యాసము సేయవలయును. క్రమ క్రమముగ నభ్యాసముచే యుట భగవద్గీతయందు గనుపర్చబడి యున్నది. మొదట భగవ త్ప్రీతికొఱకు ఫలాభిసంధి రహితముగా కర్మాచరణము చేయ వలెను.

మద్యోగమాశ్రితః సర్వకర్మఫలత్యాగం తతఃకురుయతాత్మవాన్.
(భ. గీ. 12—11.)

నన్నుజెందవలెనను సంకల్పముతో మనస్సును స్వాధీన ముచేసికొని ఫలమును విడిచి పనులను జేయవలెను.

పిమ్మట భగవదర్థముగానే పనిజేయుచు పనిని భగవంతు ని కర్పణచేసి మనము కొఱకుట్లని భావించుచు కర్మాచరణము జేయవలెను.

మత్కర్మపరమోభవ మదర్థమపికర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి.
(భ. గీ. 12—10)

అటుపిదప సకలపనులు భగవంతుని వలననే జేయబడుచున్నదని కర్తృత్వాభిమానమువదలి పకార్యము నెరవేర్పుచున్నను,

నైవకించి త్కరోమీతి.........
ఇంద్రియాణీంద్రియార్థేషువర్తంత ఇతిధారయన్.
(భ. గీ. 5—8. 9.)

ఇంద్రియములు విషయములందు ప్రవర్తించుచున్నవని నిశ్చయించిన వాడగుచు నేనుజేయలేదని కర్తృత్వాభిమానమును వదలవలెను.

దేహము పనిచేయుచున్నను మనస్సు భగవంతునిపైన నిల్చునట్లు అభ్యసించుచు రాగా ఆలాగుననే మనస్సునిల్చును.

అభ్యాస యోగేనతతో మామిచ్ఛాప్తుం ధనంజయ.
(భగీ 12 9)

ఇదియే అభ్యాసము. కర్మాచరణమందు భగవంతునిపైన మనస్సునిలుచుట కంతరాయములు కలుగకుండ జేసికొని, యాచరించు కర్మ శమ సమాధానములకు సహకారిగ జేసికొనవలెను. కర్మవిధించ బడినది యందుకొఱకే. ఈశ్వరునియందు మనస్సు నిలిపి కర్మనిర్వర్తించుట కంతరాయము కలుగజేయ కుండునట్లు ఇంద్రియములను నియమించుట దమము. మొదటినుంచి రాగద్వేష యుక్తముగా ప్రవర్తించుచు వచ్చిన యింద్రియములు వివేక వైరాగ్యములచే, తద్వియుక్తములు కాగా, భగవదర్పిత కర్మాచరణమందా సక్తిలేకపోవును. అట్లుగానియ్యక రాగద్వేష రహితముగా నింద్రియములజేత బనిజేయించుట దమము. ఉపరతి, తితీక్షలచే బుద్ధిదోషములగు నహంకారాభి మానములు తొలగవలయు. బుద్ధ్యధిష్ఠానకామ శత్రువును జయించవలయు. ఉపరతి యన నభిమానవిసర్జనము. శ్రీశంకరాచార్యులవారు దీనికి సన్యాసమని పేరిడిరి. "పరమ గురుచరణసన్నిధి" యందు దీనిని భిన్నరుచుల సహనమని నిర్వచించియున్నారు. లోకసంగ్రహార్థమయినను పనిజేయవలసియే యుండునపుడు సన్యాసమన నభిమాన విసర్జనమనియే దెలియవలెను. అభిమాన రాహిత్య

ము భిన్నరుచుల సహనమూలమున వృద్ధిబొందును. మఱియునిం కొక విధమున నీయభిమానము ప్రవర్తించును. అహంకారమమ కారముల వదలవలెను. వివేకవైరాగ్యముల వలన నైస్పృహ్యా ము కలిగినను "నాకునష్టము కలిగెను. నాకు బాధవచ్చినది. నాబంధువులు మృతినొందిరి. నాకుగష్టము సంభవించినది" అను మనస్సుయొక్క అస్థైర్యమువలన దుఃఖము జనించును. అదిశమ సమాధానముల కంతరాయము. దుఃఖసహనము మాత్రముచా లదు. ఈశ్వరార్పిత కర్మజేయువాడు దుఃఖమును సహించుట యేకాక ఉత్సాహపూరితుడై యుండవలెను.

ముక్తసంగోనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తాసాత్త్వికఉచ్యతే॥

భగ—18.

సంగము విడిచినవాడును, తాను గర్తయను నభిమానము లేనివాడును, ధైర్యము ఉత్సాహము గలవాడును, కార్యము సఫ లంబైనను నిష్ఫలంబైనను వికారముజెందని కర్త సాత్త్విక స్వభా వము గలవాడు.

అందువలననే "పరమ గురుచరణ సన్నిధి" యందు "తితిక్ష" యన "సంతసముని" వ్రాసియున్నారు. ఇట్లుపరతి తితిక్షలచేత బుద్ధిమాలిన్యములైన అహంకారాభి మానములను నాశనము జేసికొని శ్రద్ధయను గుణముచేత "భగవంతుడు దయా సముద్రుడు. కనుక నన్నుద్ధరించును. కరుణచే జేకొని కడతేర్చును. ఇదినిశ్చయము" అనునమ్మకము సంధించుకొనినయెం డల దేనిమీదనుంచితే దానిమీద నిలుచు యోగ్యత శమమువలన సాధించగా ఆమనస్సు భగవంతునిపైననైన గురువుపైననైన నిల్చుటకు సమాధానమువలన సిద్ధించును.

అప్పుడు మనస్సునందుండు వాసనలు (రసము) అహంకా రాభిమానములు నివర్తించును.

ఈస్థితి రెండువిధములగు సాధనములచే గల్గును. వివేకవైరాగ్యములచే రాగనివృత్తి. అనగా నిస్పృహత్వము, అనగా ధర్మవిరుద్ధ కామము, దుస్సంకల్పము, దురాచారము, వీనిని వర్జించుట. ఇవి (negative virtues) అనబడును. శమాదులవలన అభిమానము పోగొట్టుకొని ఈశ్వర కర్మజేయుట యందంత రాయముల జయించి కర్మాచరణకు సహకారియగు ఉత్సాహ, ఏకాగ్రత, స్థైర్యాది యోగ్యతలు సంపాదించబడును. ఇవి (positive virtues) అనబడును.

అందువలననే శమమునకు వైరాగ్యమొక యంగమనియు దమాదులు మఱియొక యంగమనియు నుడువబడియె.

ఇట్లు పరిశుద్ధమైన మనస్సునందాత్మ శక్తిచక్కగా ప్రకాశించును. విషయాసక్తియను వాయువుచే గొట్టబడని మనస్సునందు గాలిచేత జలింపబడని దీపమువలె ఆత్మశక్తి ప్రకాశించును. ఆ జ్ఞానదీపమువలన నజ్ఞానముతొలగి యథార్థజ్ఞానము గలుగును. జ్ఞానబలమున బుద్ధి, మనస్సు, ఇంద్రియములను భృత్యులుగా గైకొని ఈశ్వర కైంకర్యము చేయగలుగును. నష్టరాజ్యము ప్రాప్తించును.

యత్ జ్ఞాత్వానపునర్మోహ మేవంయాస్యసిపాండవ।
ఏనభూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథోమయి॥

(భగ 4. 35)

ఏజ్ఞానముచేత పునః మోహముజెందవో, సర్వభూతములను నీయందును నాయందును జూడగలవో ఆజ్ఞానము నీకు ప్రాప్తించును.

అనగా సర్వభూతైకత్వము జూడనోపును.

తత్రకోమోహఃకశ్శోక ఏకత్వమనుపశ్యతః।

ఈ. ఉ.

ఏకత్వజ్ఞానముచేత శోకమోహములు నశించును. అవిన

శించినపుడు కన్నీరెట్లువచ్చును? దుఃఖము తనకొఱకా? ఇతరులకొఱకా? తన స్వంతమున కేపాటిదుఃఖము వాటింపనోపదు. తాను వేఱను భావము లేనపుడు తనకు గలది యితరులకు బోయెనని కాని యితరులది తనకు జెందలేదని కాని చింత కలుగనేరదు. మఱియు నితరులనుగూర్చి నయితము దుఃఖము జెంద నవసరము లేదని తెలియును. సకల కార్యములు భగవత్సంకల్పానుసారముగా జరుగుచున్నవని తెలిసినపుడు అన్నియు సరిగానే జరుగుచున్నవని నమ్మును. తాను సహాయరూపముగా జేయవలసిన కార్యము నాలోచించునే కాని చెడుగు ప్రాప్తించెనని ఖేదము జెంద నవకాశముండదు. మరియు.

యోమాంపశ్యతి సర్వత్రసర్వంచమయిపశ్యతి
తస్యాహంనప్రణశ్యామి సచమేనప్రణశ్యతి.

భగ—6 30.

ఎవడు సమస్తవస్తువులందు నన్ను చూచుచున్నాడో సమస్తవస్తువులను నాయందు చూచుచున్నాడో వానికి నేనపరోక్షుడనుగాను. అంతటను నన్ను చూచియానందించువానికి జెడుగెట్లు గల్గును! అనుభగవంతుని యభయప్రదవచనంబులు తెలిసి ఎవడెట్లుదుఃఖించదగు, ఎట్లుకన్నీరొల్కనోపు?

ఇకను మొదటివాక్యముయొక్క తాత్పర్యము తెలియగలదు. "కన్నులు చూడగల్గుటకు మున్ను" అనగా యథార్థదృష్టికల్గుటకుమున్ను. యథార్థదృష్టి అనగా సర్వం బ్రహ్మమయమని తెలియుట. అట్టిదృష్టి సాధారణమనుజునివలె దుఃఖములకు జలించువాని కలవడదు. యథార్థదృష్టివలన భగవంతుని విశ్వరూపమును జూడశక్యమగును. అట్టివిశ్వరూపము సాధారణ కన్నులతో జూడనోపవని శ్రీకృష్ణు డర్జునునితో జెప్పెను.

నతుమాంశక్యసేద్రష్టు మనేనైవస్వచక్షుషా।
దివ్యందదామితేచక్షుః పశ్యమేయోగమైశ్వరమ్॥

(భగ 11 8.)

దివ్యచక్షుస్సు నిచ్చినగాని విశ్వరూప సందర్శనము సాధ్యపడకపోయెను. దివ్యచక్షుస్సు అనగా దుఃఖబాష్పములు విడుచునది కాదు. జ్ఞాననేత్రము. అర్జునుడు "నావారు నాబంధువులు" అనునభిమానమును వదలియుండలేదు. కావున దివ్యదృష్టికి వలయుసంపూర్ణ యోగ్యతను బొందినవాడు కాడు. అందువలననే విశ్వరూపము నీక్షించి "నేనోర్వజాల భీతిజెందితిని పూర్వపు సౌమ్యరూపము ధరించు" మని ప్రార్థించెను.

భయేనచ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవరూపం
ప్రసీద దేవేశ జగన్నివాస॥

భగ 11—45.

కావున సుఖదుఃఖాది ద్వంద్వములకు జలించని వానికన్నులే చూడ గలుగును.

మూడవ వాక్యము.

చెవి విన గలుగుటకుమున్ను పరవాదమునకు జలించుస్వభావమును బోగొట్టుకొని యుండవలెను.

ఇచ్చట వినదగిన దీశ్వరశబ్దము. ఈశబ్దము ప్రణవాత్మకమై లోకమందంతయు నిండియున్నది.

ప్రణవో హ్యపరం బ్రహ్మ ప్రణవశ్చపర స్స్మృతః।
అపూర్వోఽనంతరోఽబాహ్యో నపరః ప్రణవోఽవ్యయః॥

(మాం॥ ఉ॥ 4—26)

సముద్రము మ్రోయుటయందును గాలి వీచుటయందును మేఘము ఘర్జించుట యందును వినబడుశబ్ద మీశ్వరశబ్దము. శుకపికశారికాది పక్షుల మధురవాక్కులందును, నస్వారస్యముగ దోను కాకాదుల శబ్దములందును, బలుకువాడు భగవంతుడే. మఱియు నధ్యాపకుల వేద ఘోషలయందును, బాలుర నిర్దోష సల్లాపములందును, నృపతుల గంభీర వాక్కులందును, ఆర్తులదీ

నాలాపములందును జగదీశ్వరుడు పలుకుచుండు. పరమేశ్వరుడు లోపలను వెలుపలను నెల్లపుడును సుఖజనకంబగు శాంతరసమును బ్రణవాత్మకమగు దన వాక్కుచే వెదజల్లుచుండును. వినబడు ప్రతి శబ్దమును భగవంతునివాక్కుగ నమ్మి యానందించ వలయునేగాని చలించరాదు. పరులవాక్కు మనయెడల స్తుతినిందాపరముగనుండవచ్చును. సుఖదాయకముగ నుండవచ్చును. శోకాస్పదముగానైన నుండవచ్చును.

నప్రహృష్యేత్ప్రియంప్రాప్య నోద్విజేత్ప్రాప్యచాప్రియం।
(భ॥ గీ॥ 5—20)

తుల్యనిందాస్తుతిర్మౌనీ (భ॥ గీ॥ 12—19)

ప్రియప్రాప్తియందు సంతోషించగూడదు. అప్రియము సంభవించినపుడు భయపడగూడదు.

స్తుతిచే హర్షంబును నిందచే శోకంబును జెందగూడదు. నిందాస్తుతులయందు సమత్వమును నిలుపుకొన వలయును. ఇందుకు గారణము విచారణీయము. తొలుత దూషణ వాక్కులను గుఱించి విచారింతము. దూషించినవాడు కామక్రోధములచే జిక్కబడిన వాడేకాని జ్ఞానికాదు. వివేకము వలన దేహధర్మములగు కామ క్రోధాదు లనిత్యములని యిదివరకే వేద్యమైయున్నది కదా. అట్లుండ కామక్రోధోద్భవమగు దూషణవాక్కులను సరకుజేయగూడదు. వాని వలన మనకేమియు నష్టము కలుగలేదు. ఆమాటలవినకయుండినయెడల మన మావిషయములో జోక్యము బుచ్చుకొన దలచము. కనుక మాటలయందేమి ఫలములేదు. మనము వాని నెన్నికొనుట వలన గష్టమును దెచ్చుకొన్నారమేగాని వేరొండులేదు. ఇట్లు దూషణవాక్కును సరకుజేయక నుండుట మాత్రమే చాలదు. ఆవాక్కునందీశ్వర శబ్దమును వినవలెను. అనగా అదిభగవంతుని వాక్కుగ దలచవలెను. ఇపుడు మనల

నిందించువానిని బూర్వజన్మములలో మనము నిందించి ప్రపంచ సమష్టిశాంతమునకు భంగము గలుగజేసినందున దానిని జక్కపెట్టుటకు భగవంతుఁడు నిందించువాని వాగ్రూపముగా మనపాపమును బోగొట్టి కలవరపెట్టబడిన సమష్టిశాంతము నుద్ధరించును. ఇట్లు నిందారూపకమైన వాక్కు ఈశ్వరశబ్దమే నని తెలిసి యానందించవలెను. ఇందొకయాక్షేపము కలుగవచ్చును. ఉత్తమవాక్కు లీశ్వరశబ్దములనదగును గాని హేయమైన దూషణ పలుకు లీశ్వరవాక్కులని యెట్లుదలవదగును? ఇందుకు సమాధానము కొన్నియుదాహరణములవలన దెలిసికొనవచ్చును.

ఒకకుటుంబములో బాలురు వృద్ధులు బలవంతులు బలహీనులు జ్ఞానులు అజ్ఞానులు ఉందురు. బలహీనులును అజ్ఞానులును కుటుంబములో జేరినవారు కావని నిరాకరించుటలేము. వారికి వలయుసహాయ మొసగుట ధర్మమని యెఱిగి కుటుంబములోని బలవంతులు జ్ఞానులు వారిని గాపాడుదురు. మఱియు నొకరాజ్యమునందలి మనుజుడు మఱియొకరాష్ట్ర ప్రజలకెగ్గుజేసిన నాకార్యము మొదటిదేశమురాజు చేసినయపరాధముగ నెంచి పరిహారముగోరుట విదితమైయున్నది. గానమునందపస్వరములు స్వరములతో జేరినవాని శృంగారరసము నెక్కుడుజేయును. అజ్ఞానులాడు దూషణవాక్కు లపస్వరములవంటివి. ఈశ్వర గానానందమును హెచ్చుజేయును. భగవంతు డపస్వరములను స్వరములతోగలిపి తనవాక్కునందానందమును గల్పించును. అతిపిరికితనము. అతిసాహసము ప్రత్యేకదృష్టిచే వర్జనీయములయినను రెండునొకచోట గూడినయెడల నన్యోన్య సహకారులయి సామరస్యము నొందును. దూషణవాక్కులాడు వాడజ్ఞాని. క్రిందిమెట్టుననుండువాడు. మాటలే రానివాని కన్నవాడు మేలు.

పరనిందచెడ్డదని కాలక్రమమున నెఱుగును, ప్రకృతమం

ము వానిమాటలను లక్ష్యపెట్ట నవసరములేదను శాంతగుణమును మనకు గలుగుటయందు వాడు మనకు సహకారి. ఇట్లు తనవృద్ధి కిని మనవృద్ధికిని దోట్పాటగు మాటలు ఈశ్వరవాక్కులు కావ ని యెట్లు చెప్పనగును? ఈవిషయమందొక కథచెప్పబడుచున్నది. పులుగు లన్నియుజేరి గానముజేయ దొడగెను. అందుకాక స్వరమీశ్వరస్తుతి రూపగానమున కనుపయుక్తమని యాఒక్కని మాత్రము తమసంఘములో జేర్చుకొనక నిరాకరించిరి. ఈశ్వ రుడాగానమును మెచ్చక నిట్లు బక్షులను గూర్చివచించెను. "మీరుచేసిన గానమునందు లోపముకన్పట్టు చున్నయది. అది నాకపస్వరముగ దోచుచున్నది. కాకస్వరము చేరనందున గాన స్తుతియందెంతయు గొఅంతకలైను. ఎల్లవాక్కులు నావాక్కులే. మీరపస్వరములని యెన్నునవి సయితము నావాక్కులే. నిష్కార ణముగ వాయసమును నిరాకరించితిరి. దానిస్వరము లేమింజేసి మీరుపాడినది మదీయజగదానంద జనకముగు వాక్కుకాకపో యెను. ఇకనీరీతి నెవరిని దిరస్కరించవలదు." అని హితోపదే శముజేసి తిరోధానమాయెను.

పరనిందనువిని చలించుట వలన మనకు మేలులేక పోవు టయేగాక ఇతరులకు గీడుజేసినట్లగును. నిందించినవాని దుష్ట తలంపువలననే లోకసమూహ శాంతమునకు భంగముకలిగెను. అందుకు మనస్సు చలించి క్రోధముజెందినయెడల సమష్టి శాంత మునకు నెక్కుడుగ హానికల్గును. అందువలన జనసామాన్యము నకు మనము గోచరముకాని విధమున నపకారము జేసినట్టగును. అందువలననే అపకారమునకు బ్రత్యపకారము జేయరాదనియు, ద్వేషము ద్వేషముచేత వృద్ధియగునేగాని నశించదనియు, ప్రేమ వలన నశించుననియు నార్యోక్తికలదు. ఇట్టివిషయములలో సమ ష్టిదృష్టిచేచూడవలెను. ఒకడు ద్వేషించిన సమష్టిమైత్ర భావ మునకు లోపము కలుగును. మనము సయితముద్వేషించి నట్ట

యున సమష్టికి రెండులోపములు. అట్లు చేయక ప్రేమించినయెడల మనప్రేమసంకల్పము వెనుకటిద్వేష ఫలమును సంహరించి సమష్టి మైత్రియందు గలిగినలోపమును దొలగించును. భేదభావము నతిక్రమించినవానికి బరనింద నిందగా దోచనేరదు. ఏకీభావమువలన దనయందలి లోపముగనే గన్పడును. ప్రత్యపకారబుద్ధి కలుగదు.

నహీనస్స్యాత్మనాత్మానం।

భ॥ X॥ 13—29.

అప్పుడు జలించుట కవకాశమేలేదు. ఇచ్చటనొక దురభిప్రాయము కలుగవచ్చును. "మనయందలి దౌష్ట్యమును గూర్చి జెప్పబడు మాటలను మనము లక్ష్యపెట్ట నక్కఱలేదు. ఎవరేమిచెప్పినను మనము వినక మనస్వేచ్ఛానుసారముగా వర్తించవచ్చును" అని తలచవచ్చును. ఇది అహంకార భావము. ఆసురస్వభావము. అట్లుచేయరాదు. గురువుల వాక్యతాత్పర్యము మనమితరుల మాటలను లక్ష్యపెట్ట గూడదనికాదు. వానిని విని మనయందలి పరోపకార భంగమగు లోపములున్నయెడల జక్కపెట్టుకోవలెను. ఆమాటవలన మనము చలించకూడదనగా చింతాదైన్యముల నొందించిన వానియందసూయాక్రోధములనుంచి ప్రత్యపకారము జేయబూనుకొనరాదని తాత్పర్యము.

ఇకస్తుతి విషయమాలోచింతము. స్తుతికి జలించకుండుట కష్టము. నిందకు దీనికిని భేదము గలదు. నిందించబడినపుడు మనయందారోపించబడిన లోపములు మనయందులేవనియు నిష్కారణముగా దురుద్దేశముతో నారోపింప బడినవనియు నమ్ముదుము. ఉద్వేగము శమించినపిమ్మట నిందించినవాడు మంచియుద్దేశముతో మనమేలుకొఱకు మనలోపములను మనకు గాన్పించెనని చెప్పినయెడల దానిని నమ్మి యటుపిదప మనస్సు చలించకుండునటుల జేసికొనినను జేసికొనవచ్చును. స్తుతి విషయమి

ట్లుకాదు. స్తుతిచేయువాడు మనయందులేని సుగుణమును మన యందిడును. వానియుద్దేశము మంచిదియని నమ్ముదుము. వానియుద్దేశము చెడుదియని కాని మనయందా సుగుణములు లేవని కాని చెప్పుటకితరులు సందేహింతురు. చెప్పినను నామాటలను విశ్వసించుటకు మనకిష్టముండదు. కపటస్తుతివచనములకు మన ముప్పొంగి మోసపోవుదుము. కొన్ని సమయములలో స్తుతివచనములు భక్తిపూర్వకముగా సమర్పించబడినవిగ నుండవచ్చును. ఈసందర్భములలో యథార్థస్థితిని దెలిసికొనుటకు పరమగురుచరణ సన్నిధియను గ్రంథమందు బోధించబడిన మహాగురువాక్యమే సహకారియగును. దేహాభిమానోద్రేకమువలన బ్రేరితమయినదానికిని ఆత్మప్రేరితమునకును భేదమును గనిపించవలెను. స్తుతివచనమును వినినంతనే సహజముగా మనోమయ విజ్ఞానమయకోశము లుప్పొంగును. అట్లుగానివ్వక గురువాక్యప్రకారము లోతునదిగి పరిశోధించి యిట్లని వితర్కించుకొనవలెను. "ఈస్తుతివచనములు మంచి యుద్దేశముతోనే బల్కబడి యుండుగాక! స్తుత్యర్థమైనను గుణగ్రాహ్యము మంచిదే. నాయందీ సుగుణసంపత్తిలేదు. అయినను దానిని సంపాదించుటకు బాటుపడెదను. నాయందు సుగుణము లుండినయెడల వానినిజూచి గ్రహించి మెచ్చిస్తుతించి యెందరో మేలుబొందగలరు. సర్వసుగుణాధారుడు భగవంతుడేకదా!

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవం॥

భ॥ గీ॥ 10—41.

నాయందుసుగుణములు నిజముగా గల్గియుండినచో వాని ద్వారా నాయందీశుడే ప్రకాశించుచున్నాడు. స్తుతివచనములాయన కన్వయమే కాని నాకుగాదు. నాయందుండినను లేకున్నను సుగుణస్తుతిచే నీశ్వర స్తుతి జేసిన వాడాయెను. వానిని

భగవంతు డనుగ్రహించి రక్షించుగాత"

అనిచింతించి దేహములు ప్రాంగకుండునటుల జేయవలెను. నిందించబడినపుడు నిందితగుణములు దేహసంబంధము లనియు స్తుతించబడినపుడు స్తోతవ్యగుణము లీశ్వరునివనియు భావించినిందాస్తుతులయందు జలనస్వభావము బోగొట్టకొనవలెను. ఇట్లు నిందాస్తుతులయందు దుల్యత్వమును జెందువాడు గుణాతీతుడగును. మాటవినినంతనే జలించువానికి మనఃప్రసాధము కలుగదు. ప్రసన్నత లేనిచో నీశ్వరధ్యానమందు బుద్ధినిలువదు. విషయవాసనారాహిత్యము లభించదు. సంసారదుఃఖనివృత్తి కలుగదు.

నాస్తిబుద్ధిరయుక్తస్య నచాయుక్తస్యభావనా।
నచాభావయతఃశాంతి రశాంతస్యకుతఃసుఖమ్॥

భ॥ గీ॥ 2—66.

కావున సమస్తకర్తలను జేయునపుడు సమస్తశబ్దములను వినునపు డవియన్నియు నీశ్వర స్వరూపములే నని నమ్మి ప్రసాదము నొందవలెను.

సర్వకర్మణ్యపిసదాకు ర్వాణోమద్వ్యపాశ్రయః।
మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతంపదమవ్యయమ్॥

భ॥ గీ॥ 18—56.

జి. శంకరరావు.

# విషయలోలత.

(148 పుట శేషము).

ఈశబ్దాది విషయంబు లేభూతంబుల వలననుత్పత్తియయినది, యోకించుక విచారింతము. ఆకాశమువలన శబ్దంబును, వాయువువలన స్పర్శమును, అగ్నివలన రూపంబును, ఉదకంబువలన రసంబును, పృథివివలన గంధంబును, ఇట్లు పంచతన్మాత్రలు గలుగుచున్నవి. ఈపంచతన్మాత్రలు శ్రోత్రాదీంద్రియములకు విషయములై జీవునకు సుఖము గలిగించు చున్నవి. పాంచభౌతికములగు నీవిషయములందు బద్ధానురాగులగు మానవులు స్వకర్మ వశంబున వివిధంబులగు సుఖ దుఃఖంబుల ననుభవించుచుందురు. సద్విషయంబులవలన సుఖంబును, అసద్విషయంబులవలన దుఃఖంబును, ననుభవింతురని, పూర్వోక్త ఇంద్రియ ధర్మములఁ జెప్పినపుడు విశదీకరింపఁ బడినది. సృష్టియందు, ఏకేంద్రియ, ద్వీంద్రియ, త్రీంద్రియ, చతురింద్రియ, పంచేంద్రియ, ప్రాణులుగలవు. అందుమానువుఁడు పంచేంద్రియ ప్రాణికోటిలోఁ జేరినవాఁడు. ఒక్కొక్క యింద్రియ గుణంబుచేతనే, కొన్ని ప్రాణులు బద్ధాను రాగములయి యనర్థంబులఁ జెందుచున్నవి.—

గోఁతిగట్టుననుండి పిల్లనగ్రోవివాయించు కిరాతునిగీతము నువినుటవలన జింకలు వానివలలోఁ జిక్కుకొనును. కొమ్మలచేఁ గప్పఁబడిన గోఁతులపైఁగన్పడు, అరఁటికంబములను, ఫలంబులను, ఆడ యేనుఁగు పటమునుఁజూచి, వాని ననుభవింప వలయునను నాసచేఁ దుండంబున భూస్పర్శ సేయుచుఁబోయి యేనుగుబా గోఁతిలోఁబడును, ఆకసమున స్వచ్ఛందముగా సంచరించునవి యయ్యు, బకులు, ఊరులచే గప్పబడిన మాంసపు ముక్కలనుజూచి, యాసచే వానిపైవ్రాలి యుచ్చులలోఁ జిక్కుకొను

ను. నీటసంచరించు మత్స్యము లెఱలరుచి మరిగి, గాలాఫ్రు రువ్వల కొనలనుండిన మాంసపుముక్కల (జవిఁగొని యందు తగులుకొనును. తుమ్మెదలు తమ్మిపూగుత్తుల నెత్తావుల వాసనచూచుచు నందలి తేనియల (గ్రోలుచు, సంపెంగ పువ్వుపై(వ్రాలి దానిని నాఘ్రాణించి మృతిఁజెందును. ఇటు శబ్దంబువలన కురంగంబులును, స్పర్శమువలన మాతంగంబులును, రూపమువలన పతంగంబులును, రసంబువలన మీనంబులును, గంధమువలన భృంగంబులును, ఆశాపాశ బద్ధములై యొక్కొక్క యింద్రియగుణంబుచే నసించుచుండ, పంచేంద్రియ గుణంబులకు (లోబడి యుండు మానవుని మాట యేమనిచెప్పవచ్చును?

పంచేంద్రియంబుల వలన (గలుగు ననర్థంబులన్నియు, నంత రింద్రియంబగు మనసొక్కటియే, తనకుఁదాను కల్పించుకొని చిక్కువడిన సాలెపురుగు చందంబున ననుభవించును. కావున, ధీరుఁడు వివేక యుక్తమానంబున నింద్రియార్థంబులకు లోఁబడక, వానియందుఁగల దోషముల నృమర్శించి, విషంబుల బోలెఁజూచునది.

> శ్లో॥ ఇంద్రియాణిపరణ్యాహు రింద్రియేభ్యఃపరంమనః
> మనసస్తుపరాబుద్ధి ర్యోబుద్ధేఃపరతస్తుసః॥

(స్రక్చందన వనితా భరణాంబరాది విషయంబులకన్న నీవిషయంబుల గనుఁగొను నింద్రియంబులు (శ్రేష్ఠంబులు; ఇంద్రియములుకన్న వీని కధిష్ఠానమై నడఫు మనస్సు (శ్రేష్ఠతరంబు; మనస్సుయొక్క చాంచల్యంబును, వికారములను దోషములను గనుఁగొను బుద్ధి(శేష్ఠతమము, ధీవృత్తులను (జేరేపించుచు నన్నిటికి సాక్షియైన చైతన్యస్వరూపమగు నాత్మసర్వోత్కృష్టము. ఇట్లు పరిశీలింపగ, విషయేంద్రియ మనోబుద్ధి వృత్తులకు నధిష్ఠానము, స్వకీయచైతన్య తేజోవిశేషంబున నన్నిటిని (బకాశింపజేయుచు, నన్నిటిగుణ దోషంబుల దెలిసికొను నాత్మయొక్క

టియే సర్వోత్కృష్టంబు గావున, అసదర్థంబులగు నింద్రియార్థంబుల దూరీకరించి, యాత్మ స్వరూపానుసంధానము సేయుటవలన, మనస్సును విషయములనుండి మరలించి, శాశ్వతానంద సుఖదంబగు సత్పథంబున బ్రవర్తింప జేయవలయు.

మనస్సు ఏదేని కారణంబున గాలుష్యముం జెంది విషాద పూరితమయినపుడు, విషయంబులు సన్నిధియం దుండినను వానిపయికిబోవదు. మనస్సెవ్విధంబుగ నుండిన లోకంబాచందంబుగ గన్పించు. సంతుష్టాత్ములకు సంతోషానంద భరితముగను, దుఃఖితాంతః కరణులకు నెటజూచిన దృష్టిలేక వ్యసనాంధకార బంధురితముగను; కామాత్ములకు బ్రణయమయంబుగను ధనసంపాదనా పరాయణులకు ద్రవ్యమయంబుగను. బ్రహ్మానుభవ తత్పరులకు బ్రహ్మమయంబుగను లోకము కన్పట్టుచున్నది. లోకమందలి వస్తువు లేకాకారముగనుండినను వారి వారి చిత్తములకు దగినటుల వస్తువులాయా విధంబుగ దోచుచున్నందున, మనస్సు ననుసరించి లోకము విస్తరింప బడుచున్నది గాని, లోకముననుసరించి చిత్తముండుటలేదు. ఇవ్విషయంబునే శ్రీశంకర భగవత్పాదా చార్యులవారు, మహావాక్యదర్పణమునందు నుడివియున్నారు.

శ్లో॥ మనఏవాఖిలంవిశ్వం సృజత్యత్రతునోవిధిః।
స్వప్నవన్నహిస్వప్నార్థో బ్రహ్మణాసృష్ట ఈక్ష్యతే॥
రూపంనామచజాతించ కల్పయిత్వాస్వశక్తితః।
బ్రహ్మాజ్ఞమపివాచిత్తం సంసారయతిపూరుషం॥
సంసారోమనసాపుంసః కల్పితోస్తినవస్తుతః।
మనశ్శాన్త్యేసుషుప్త్యాదౌ సంసారోనైవదృశ్యతే॥
యత్రయత్రమనస్స్ఫూర్తి స్తత్రతత్రజగత్త్రయం।
యత్రయత్రమనోనాస్తి తత్రతత్రనకించన॥

సుషుప్తికాలమందు మనస్సులీనమై యుండుటవలన లోక

ములున్నను, మనోగోచరము లగుటకానము. కావునమనస్సే, విష యమయంబగు లోకమును సృజించి యెంతటివిజ్ఞునినేని సంసార మున బడవైచుచున్నది. ఎచటనెచట మనఃప్రసాదము కలదో య చట లోకంబు కలదనియు మనస్సు శూన్యమగుచోట లోకంబులే దనియు దెలియుచున్నది. కాబట్టి విషయమయంబగు లోకంబు మనస్సననుసరించియున్నది. ఇవ్విషయంబు, హరిభక్తిరసాయన మందిట్లుకలదు.

శ్లో॥ పరివ్రాట్కాముకశునా మేకస్యాం ప్రమదాతనౌ।
కుణపః కామినీభక్ష్య మితి తిస్రో వికల్పనా॥

తరుణీమణి నొక తెనుగాంచి స్తన్యపానము నొసంగుటం బట్టి యాహారపదార్థంబని శిశువును మాతవలె బ్రోచుటం జేసి వాత్సల్యపదార్థంబని బాలకుండును, స్వర్లోకసౌఖ్యంబుల నొసంగు భోగపదార్థంబని తరుణుండును, మేదోమజ్జాస్థిపురీషా మిషపూరితంబగు శవాకారంబని విరాగియు దలచును. కాంత, యొకతయయ్యు వారివారి చిత్తవృత్త్యను గుణంబుగ భావనలు దోచినవి. పవిత్రమగు భాగవతగ్రంథమును గని మిఠాయినమ్ము కొను వర్తకుడు దానిబరువునుబట్టి యొకమణుగు మిఠాయిపదా ర్థములను పొట్లములుగట్టుట కుపయోగించు కాగితములు కలవని యు, అచ్చొత్తించువారు దానికాగితములరకమును ముద్రింపించు టకగు వ్యయంబులను లాభంబులనుగని యింత వెల సేయుననియు బైండుసేయువారు, క్యాలికో బైండనియు, మృదుచర్మ బద్ధమని యు, సుందరముగ గట్టబడినదనియు, మాత్రమే వర్ణింతురు. భక్తి జ్ఞాన సంపన్నులగు మహనీయులందలి భక్తిరస పూరితంబులగు పద్యంబులను, ఆధ్యాత్మిక జ్ఞానబోధకంబులగు విషయంబులను భగవన్మహిమను వేనోళ్లగొని యాడుదురు. ఇటభాగవత గ్రంథం బను విషయమొక్కటి వారివారిచిత్తవృత్తికి దగినటుల స్ఫురించి నవి. శ్రీకృష్ణభగవానుడు మధురాపురవాసులకు గన్పించిన విధ

క్రిందఁ జెప్పినట్లు శ్రీభాగవతమునందు గలదు.

శ్లో॥ మల్లానామశనిర్నృణాంనరవరః స్త్రీణాం స్మరోమూర్తిమాన్।
గోపానాంస్వజనోసతాంక్షితిభుజాం శాస్తాస్వపిత్రోశ్శిశుః।
మృత్యుర్భోజపతేర్విరాడవిదుషాం తత్త్వంపరంయోగినాం
వృష్ణీనాంపరదేవతేతివిదితోరంగం గతస్సాగ్రజః॥

అన్నయగు బలరామునితోఁ గూడి మధురాపురంబునకే తెంచిన శ్రీకృష్ణమూర్తి చాణూరమల్లుర కన్నులకు పిడుగుగను, మానవులకు పురుషోత్తముఁడుగను, స్త్రీలకు రూపముధరించిన నవమన్మథుండుగను, గోపాలురకు తమవాఁడుగను, దుష్టులగు రాజులకు శిక్షించువాఁడుగను, తలిదండ్రులకు బిడ్డగను, కంసుని పాలిటికి మృత్యుదేవతగను, అవివేకులకు రాజ్యము లేనివాఁడుగను, యోగీశ్వరులకు పరబ్రహ్మంబుగను, వృష్ణివంశస్థులకు పరదేవతగను, కనుపించెను. ఇట శ్రీకృష్ణభగవానుఁడొకఁడయ్యు వారివారి చిత్తవృత్త్యను గుణంబుగఁ బొడగట్టెను.

కావున, లోకంబునగల విషయజాతంబుపై, విషయపరాయణులకుగల చూపునకును, ధర్మజ్ఞాన సంపన్నులగు జితేంద్రియులకు గల చూపునకును మిగుల భేదముకలదు.

తత్త్వజ్ఞాని ప్రతివిషయంబునను, దానికిగల వినశ్వరత్వమును, క్షణికస్వభావమును, దోషమును గనిపెట్టుచుండు. విషయాసక్తుఁడు గుణదోషవివేచనాశక్తి లేక విషయంబుల దవిలి వానిని గ్రోలుచు నవి నశించినంతట బేలయై దుఃఖించును. భగవన్మాయ కాంతా కనకరూపముగను, వివిధ విషయనిచయంబుగను, పరిణమించియున్నది. విషయంబులు శాశ్వతముగాక, యస్థిరంబులుగనుండును గనుకనే, తత్త్వజ్ఞులు వానిస్వభావమును దెలిసికొని విషముపలెఁజూచి తొలంగుచున్నారు.

శ్లో॥ విషస్య విషయాణాంచ దూరమప్యంతరాంతరం।
ఉపభుజ్యవిషంహంతి విషయాస్స్మరణాదపి॥

విషమునకును విషయములకును మిగుల తారతమ్యముక లదు. విషయములకన్న విషము మేలు. ఏలయన విషము తన్ను భుజించువారిని మాత్రము చంపును. విషయములన్ననో, తన్ను స్మరించువారిని జంపును. స్మరణమాత్రముననే నశింపజేయగల విషయములు విషమునకన్న తీవ్రములని తాత్పర్యము. మఱియు విషము, విషయము, ఈ రెంటిలో, విషముకన్న నొక వర్ణమధికము విషయమందుగలదు. కావున, విషమునకన్న విషయము అధిక దోషదాయకమని భావము.

శ్లో॥ అపారే సంసారే విషయ విషపూరే జలనిధౌ।
నిమజ్జ్యాయం భ్రమతికుమతిఃకుత్సితగతిః

విషయములను విషప్రవాహపూరితమగు తుది లేని సంసార సముద్రమందు, వివేకము లేని మూఢుడు మునుగుచు తేలుచు దరిగానక కొట్టుకొని పోబడుచున్నాడని వివేకచూడామణియందును గలదు కాబట్టి విషయములను విషములుగ జూడ వలసినదని తత్త్వగ్రంథముల యందనేక చోట్ల జెప్పబడియున్నది.

జీవనము బుద్బుదప్రాయము, యౌవనము ఝరీవేగతుల్యము, సంపదలు విద్యుచ్చంచలములు, భోగంబులు రోగనిదానంబులు, ధనములు నిధనదాయకములు, భవనంబులు క్రూరసత్త్వశరణ్యవనంబులు, సుందరీమణులు దరీగతభుజగీమణులు, లక్ష్మి దీపశిఖవలె నస్థిరము. ఇవ్విధంబున విషయజాతంబునగల దోషములన్నియు విమర్శించి, వివేకులు విషమువలె జూచి తొలగుచు సక్తులుగాక మంటిలోని కుమ్మరపురుగువలెను, పద్మపత్త్రములోని జలబిందువు చందమునను అంటియు నంటక వ్యవహరింతురు. స్రక్చందనవనితాది విషయజాతముయొక్క స్వరూప స్వభావములు దెలిసినవారు రాకకు హర్షమును పోకకు విషాదమును జెందక సమచిత్తులుగ నుందురు. జనకాదులు గృహస్థా

శ్రమమునసుండినను విషయభోగాన్వితంబగు రాజ్యము నేలు చుండినను సత్సహవాసంబున గలిగిన యాధ్యాత్మిక జ్ఞానబలంబున విషయాసక్తులుగాక హర్షవిషాదముల యందును సుఖదుఃఖములయందును శీతోష్ణములయందును సమచిత్తులయి యుండిరి.

రాజర్షియగు జనకమహారాజు, ఒకపాదమును శ్రీచందన పంకమందును మఱియొకపాదమును సముజ్జ్వలిత పావకమందు నునిచి హర్షవిషాదముల నిట్టులసహింప వలెనని లోకమునకు నిదర్శనముజూపె. మఱియు, మేడలు, మిద్దెలు, రథగజ తురగాభరణాది వివిధపదార్థములతోడ బట్టణము దహనమగుచున్నదని సేవకులు నివేదింప వించుకైన విషాదము జెందక స్వస్థచిత్తుడై యాజ్ఞ్యవల్క్య మహర్షియొద్ద వేదాంతశ్రవణము గావించుచుండెను. పట్టణము దహనమగుచుండ జింతింపవేలయని మహర్షులడుగ, "కోరక దుఃఖములు ప్రాప్తించినట్టుల సుఖములు ప్రాప్తించును; సుఖదుఃఖములు దైవాయత్తములు. మనుష్యుడుచింతించి యొకింతయు బ్రయోజనములేదు. ధైర్యమవలంబించి సమచిత్తుడయి యుండవలయు; నావస్తువులని వానియందు దృఢాభినివేశములేదు; పాంచభౌతికములగునవి, నశించుటయే స్వభావముగ కలవి గనుక చింతించి వానిస్వభావము పోగొట్ట గలుగుదునా?" యని జనకమహారాజు వారితో నుడివెను. దీనింబట్టి యారాజర్షికి విషయలోలత లేమిచేసియే చింత యమ్మహనీయుని బాధింప లేదని నిశ్చయించుకొనిరి.

శ్లో॥ వనేషుదోషాః ప్రభవంతిరాగిణాం
గృహేషుపంచేంద్రియనిగ్రహస్తపః।
అకుత్సితే కర్మణియఃప్రవర్తతే
నివృత్తరాగస్య గృహంతపోవనమ్॥

విషయాసక్తులగు రాగులకు అరణ్యములయం దున్నను దోషములు కలుగును. విషయవిముఖులగు విరక్తులకు గృహ

ములయందున్నను ఇంద్రియనిగ్రహరూపమగు తపంబు కలుగు. జితేంద్రియుడగు జ్ఞానికి భవనము తపోవన మని చెప్పవచ్చును. కావున విషయాసక్తి లేని జనక మహారాజు జితేంద్రియుండు జ్ఞానియునగుటం జేసి గృహమందే యోగ జ్ఞాన తపంబుల సాధించెను.

విషయ లోలతయన, స్రక్చందన కాంతాకనకాది విషయములలో నేదే నొకదానియందు జిరకాలము సంసక్తచే తస్కుడై దానిననుభవించి, యది నశించిన మఱియొక విషయము ననుభవించి తనివి జెందక యింకను ననుభవింపవలయు ననెడి తృష్ణ. ఈ తృష్ణకంతము లేదు. అగ్నియందెన్ని చిదుగులు వైచినను తృప్తికలుగనట్లు, ఈతృష్ణాగ్నియందెన్ని విషయసుఖ సమిధలు వైచినను దనివి కలుగదు. ఇంద్రియములతోడ, మనస్సు విషయములమీదికి బరుగిడి శక్తిని గోల్పోయి యలయుచు, శాంతి జెందక భ్రమించుచుండు. విషయలోలత వలన దుఃఖములొదవుచుండి, బాధపడుచున్నను విష్క్రిమి న్యాయంబుగ చిరకాల పరిచితంబులగు విషయవాసనల విడువజాలక యాదుఃఖములనే సుఖములని తలచుచు ననుభవించుచుండును.

శ్లో॥ యథావ్యాళగళస్థోపి భేకోదంశానపేక్షతే।
తథాకాలాహినాగ్రస్తో లోకోభోగానశాశ్వతాన్॥

పామునోట జిక్కినప్పటికి కప్ప దోమలను దినవలయునని కోరుచున్నట్లు, మృత్యుసర్పగ్రస్తమగు నీప్రాణివర్గము అశాశ్వతములును, తుచ్ఛములునగు నైహికవిషయ సుఖములను గోరుచుండునని తత్త్వశాస్త్రమందు గలదు.

(సశేషము.)

ముక్తినూతలపాటి గోపాలకృష్ణయ్య,
ఒంగోలు.

# ఒక ప్రాచీన కథ.

(సుపంథనుండి గ్రహించc బడినది.)

పశ్చిమదేశములో నొకరాజు రాజ్యము చేయుచుండెను. అతడు తన బుద్ధికుశలతయు తనద్రవ్యమును తనప్రజలనిమిత్తము ధారాళముగా వ్యయము చేయుచుండెను. ఇట్లుండగా నొకదినము తనకి ఒక యోచన పారెను. దానింబరీక్షించుటకయి యొకనాటి రాత్రి గాఢాంధకారమున మేఘంబులాకాశమును ఆవరించిన సమయముచూచి యేకాంగిగా ఎవరికి కనుపడక తన సౌధము నుండి వెడలి యొకమనుష్యుడు శ్రమముతో మోయగల యంతటి పెద్ద ఱాతిని, రాజవీధిలో మధ్యలో నాటి చిరునవ్వులతో వానగాలికి చిక్కి తడిసి పరుగిడి తన అంతఃపురముచేరి తనలో తానీరీతిగా యోచించెను. ''రేపటిదినము ఈవేళకు నేచేసిన యోచన సరియాకాదా అనునది వెల్లడిపడును'' అనితలచెను. మరుసటిదినము తనప్రాసాదము నెక్కి యున్నతమైన యొకకిటికి గుండా రాజ వీధియందు నడచుచుండెడు వారిని చూచుచుండెను రాజవీధిమార్గముగా వచ్చుజనులలో నొకరైనను తాను రాత్రి నాటిపెట్టిన రాతిని పెరికివేయక చుట్టు తిరిగి పోవుచుండుట చూచి తనలోతాను నవ్వుకొనుచుండెను. ఇంతలో నొక యెద్దు బండి రాతిసమీపమునకు వచ్చెను. ఆబండి తోలువాడు పుష్టిగల వాడును రాతిని ఎత్తునంతటి బలాఢ్యుడుగానుండెను. వాడు మనస్సు పెట్టియుండినట్టయిన జనోపద్రవకరమగు రాతిని ఒకనిమిషములో ఎత్తి పారవైచి యుండవచ్చును. అట్లుండియు తనకెందుకు, ఇతరులాపని చేయుదురని వదలి తనకు కర్తవ్యమయిన పనిని మానుకొనెను. బండిని కొంచె ము దూరముతోలి రాజవీధి తన అదృష్టముచేత విశాలముగా నున్నదనియెంచి బండిని ఒకప్రక్కకు త్రిప్పుకొని

తన దోవ సులభముగా నున్నందున, వెళ్లిపోయెను. తరు వాత నొక సిపాయి బంగారు జల్తారుతో కూడిన యెఱ్ఱబనాతు ఉడుపుల ధరించి యొకపాటను పాడుచు మిక్కిలి జంబముతో ఆరాజ వీధిని వచ్చెను. బాటలో పడియుండిన రాతిని గమనిం చకనే వచ్చినందున ఆశిపాయి కాలికి రాతికొనతగిలి గాయము కలిగినది. ఆతత్క్షణమే కన్ను తెరచిచూచి "ఇదియేమి ఏబుద్ధి శూన్యుడయిన మనుష్యుఁడు ఈరాతిని ఎత్తివేసి సరిచేయక ఉంచి నాడు, ఇది యొక గొప్పకార్యమా! ఈశిపాయి కాలికిగాయము కలిగించుటకు అవకాశమిచ్చినయీరాతిని ఇచ్చట వేసిన ఆపాపి నాదృగ్గోచరమయినచో యీక్షణంబున వానికి తగినశిక్షవిధించు దును, అనుచు తనచేతిలోనున్నకత్తిని ఝుళిపించెను. ఇంతయి నను రాజవీధిలో నున్న రాతినిమాత్రము కదలించలేదు, తప్పు మాత్రమితరులయందు ఆరోపించి వచ్చినదోవన వెళ్లిపోయెను.

మేడమీదనుంచి చూచుచున్న రాజు ఇదిచూచి యేరీతిగాఅవు నని నేను ముందు తలంచి యుంటినో ఆరీతిగానె అయినది. అని తనమనస్సులో తలపోసి మరికొంచెము సేపు రాతిపట్టుచూచుచు కూర్చొనియుండెను. ఇంతలో సంతకు వచ్చెడు వ్యాపారస్థులు తమ సామాను మూటలను మోసుకొని కొందరు గుఱ్ఱము మొదలగు చతుష్పాద జంతువులమీద కొందరువచ్చుచుండినది రాజుకనుగొ నెను. ఈ గుంపుగుంపుగా వచ్చెడు పల్లెటూరి వాండ్రైనను జనోపకరముగ లోకహితమునకై పాటుపడి తానుపాతిన రాతిని తీయుదురేమో అని రాజుతలచుచు కంటిరెప్ప వేయక చూచుచుం డెను గాని వారిలో నొకరయినను అతనితలంపుకు సరిగా తో డుపడి రాతిని యెత్తివేయకనే పోయిరి. దానికిబదులుగా ఇద్ద రిద్దరుగా రాతియిరుప్రక్కల వెళ్లుచు, "ఇదియేమి సిగ్గుచేటు! ఇట్టిరాజవీధిలో ఈరాయి అర్ధదినమంతయు పడియుండడ మేమిః ఏబుద్ధిమంతునికయిన నీసంగతి తోచలేదా? అను

చు వెళ్లిపోసాగిరి. ఈరీతిగానే రాజవీధిలో రాయి రెండు మూడు వారములు పడియుండి భూమికిగట్టిగా కరచుకొనిపడి యుండినది. ప్రజలెల్లరును ఇదియేమిఅన్యాయము? రాయి యీవీధి లో నీలాగుపడియున్నది అనుచు వెళ్లుచు వచ్చిరిగాని యొకరైనను దానిని ముట్టలేదు. రాజు తుదకు తనమనంబున ననుకొన్నరీతిజరిగి నదని అనుభవమువలన సిద్ధాంతముచేసి, తనసంస్థానములోని ప్ర జలెల్లరువచ్చునట్లు ఊరిలో దండోరా వేయించెను. ఏదినమురావ లయునని రాజాజ్ఞఅయియుండెనో నాడు నగరుచుట్టు జనులు గుమిగూడిరి. జనులందరు గుంపులు గుంపులుగా చేరినతరువాత రాజుమేడదిగి దివ్యమయిన శ్వేతాశ్వమును ఎక్కి తనపరివార ముతో రాజవీధి నడుమపడియుండిన రాతిసమీపమునకు వేంచే పెను. నలుదిశలనుండి వచ్చినజనులు రాజును అత్యంతోత్సాహ ముతో చూచుచు వెంబడించిరి. రాతియొద్దకురాగానే రాజుతా నెక్కినగుర్రమునుండిదిగి నేలకువంగి రాతిని పీకి పైకియెత్తెను. ఆ సమయమందు వచ్చినప్రజలెల్లరు మహాశ్చర్యముతో చూచుచు చిత్రలిఖిత ప్రతిమలవలె నిశ్చేష్టితులయి నిలిచియుండిరి. రాతిక్రిం దనొక చిన్నపెట్టెకనబడినది. దానికి పైభాగమున అక్షరములు వ్రాయబడియుండెను. రాతిని పైకియెత్తిరాజు పెట్టెపైన వ్రాయ బడిన దానిని చదువ నుపక్రమించెను. దానిపైన నీక్రింద చెప్పిన రీతిగా వ్రాయబడియుండెను. "ఈరాతిని ఎవరైతే ఎత్తిదూర ముగావైచెదరో వారికి ఈపెట్టెలోని పదార్థము చెందవలసి నది." అని వ్రాసియుండెను. అదిచదివినతోడనే రాజు పెట్టె మూతను తెరిచెను. తెరవగా కంటికి మిరుమిట్లు పడునంతటి ప్రకాశము కలిగినఉంగరము ఒకటియు ఒకసన్నతిత్తినిండ రాము టెంకీలును ఉండినవి. వీనిని ప్రజలెల్ల కనుగొనిరి. వారిని చూచి రాజు ఈరీతిగా వక్కాణించెను. "మీలో ఎవరైనను సరె యీ రాతిని యెత్తియుండినట్లయిన వారికి ఈయుంగరము ఈబం

గారు నాణ్యములు చెందవలసి యుండెను. ఇట్లుండ ఇప్పుడు ఈ రెండును నాకు చేరినవని చెప్పుకొనుటకు నాకు చాలావ్యసనముగా నున్నయది. ఈ రాతిని ఈ రాజవీధి మధ్యలో పెట్టినవాడు నేను తప్పనురి యొకడు కాను. జనులబుద్ధి యేలాగున్నదో చూచుటకును రాజ్యములో యెట్టి ప్రజలున్నారని తెలిసికొనుటకును ఈ రీతిగా రాతిని నునిచితిని గాని వేరొండు కారణంబుతో కాదు. స్నేహితులారా! మంచిది, మీ మీ స్థానములకు జనుడు.'' అని చెప్పి రాజు తన గుఱ్ఱము నెక్కి వెళ్లిపోయెను.

అతని పరివారము అతనిని వెంబడించెను. తలవంపులతో నున్న ప్రజల మధ్య థళథళమని ప్రకాశించెడు కత్తులను ధరించి రాజు సైన్యము వెడలి పోయెను. ప్రజలెల్లరును తమలో తాము సిగ్గుపడి తమ్ము తాము తుచ్ఛముగా చూచుకొని వ్యసనాక్రాంతులగుచు వెళ్ళిపోయిరి. జనులారా! వ్యసనపడునంత కార్యము లేదు. ఈ కథలో మనమందరము ఒక నీతిని నేర్చుకోవలయును. బాహ్యముగా స్థూలచక్షువులకు గనపడెడి కనకము కనకము గాదు. పరోపకారము లోకహితార్థముకొరకు పాటుపడినచో, దానిలో కంటికి కానరాని రత్నములు ఎల్లప్పటికి నిండి నిబిడీకృతముగానుండును.

---

ఈ కథ సుపంథలో కన్నడ భాషయందు వ్రాయఁబడి బ్ర॥ ఏ. గుండురావు గారిచే తెనిగించంబడినది.

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

సంపుటము 7. **September 1916.** సెప్టెంబరునెల 1916. సంచిక 6.

## కాలదేశ వర్తమానములు.

అనంతపురమునందు గడచిన ఆగష్టునెల 19, 20, 21 తేమలలో నొక దివ్యజ్ఞాన సభ చేరెను. హైకోర్టుజడ్జి దివాన్ బహదూర్ సదాశివయ్యగారు అగ్రాసనాధిపత్యమును వహించిరి. వారి ధర్మపత్నిగారును సభకు విచ్చేసిరి. బ్ర॥ టి॥ రామచంద్రరావుగారు, రావుబహదూర్ వి॥ కె॥ రామానుజాచార్లవారు నింకయు చిత్తూరు, నెల్లూరు, బెజవాడ, కర్నూల్ బళ్లారి, కడప, మదరాసు మొదలగు నానాస్థలమునుండి యనేకులు నాసభకు వచ్చియుండిరి. థియాసఫిని హిందూమతమును సమన్వయముచేసి రావుబహదూర్ రామానుజాచార్యులవారు ఇంగ్లీషుభాషతో నుపన్యసించిరి. బ్రహ్మవిద్యను నిత్యకర్మమునందనుష్ఠించవలసిన విధానమునుగురించి బ్ర॥ చిట్టమూరు రామయ్యగారును, కర్మయోగమునుగురించి బ్ర॥ జి॥ శంకరరావుగారును తెనుఁగుభాషలో నుపన్యాసము లిచ్చిరి. సోమవారము ఉదయమున బ్ర॥ టి. రామచంద్రరావుగ్గారు దివ్యజ్ఞాన సమాజము

వారు ప్రకృతమీదేశమున చేయదగిన కర్తవ్యాంశమునుగురించి ఇంగ్లీషుభాషతో నొకయుపన్యాసము నిచ్చిరి. ఉపన్యాసములన్నియు జ్ఞాననీతిభక్తిదాయకములై చిత్తశాంతికరములై సర్వజనాహ్లాదకరములై యొప్పెను. ఇతరస్థలములనుండి సభకువచ్చిన వారికందఱికి భోజనాదివసతులు అనంతపురమువారు బహువితరణగా సమర్చిరి.

* * *

భారతీయులలో పరమార్థవిచార మధికముగా నున్నదిగాని లోకహితముకొరకు పాడుపడు వాడుకలేదు, విచారమాత్రముచే పరమార్థమును బొంద నలవిగాదు. భూతసేవయు నావశ్యకము. ప్రసంగవేదికలపై నిలిచి యమోఘములగు నుపన్యాసములను గావించువారు సయితము నోటిమాటలలో దక్షులయి యున్నారు గాని కార్యములలో లేరు. ఇది శోచనీయమైన స్థితిగానున్నది. ప్రజలకుగల దుఃఖములను, కష్టములను, అసందర్భములను నాలోచించి వానిని పరిహరింప యత్నించుట దేశవత్సలురగు ప్రతివారికి కర్తవ్యమై యున్నది. మన భరతభూమికి నన్యాదృశమగు గొప్పస్థితి రాబోవుచున్నదని దైవజ్ఞులు జెప్పుచున్నారు. ఇది నిజమయినచో భారతపుత్రులగు మన మాస్థితికి కారకులు గావలయును, జనులకు తెలివి తేటలను గలుగజేయవలయును, ఆరోగ్య నియమములను బోధించవలయును, మూఢ నమ్మకములను బోగొట్టి సదభిప్రాయములను గలుగజేయవలయును. దేహాభిమానమునకన్న దేశాభిమానమందెక్కువ శ్రద్ధను గలుగ జేయవలయును. పరమార్థమునకు సాధకములగు నాచారవ్యవహారములను బోధించి వారిని సన్మార్గ ప్రవర్తకులుగా జేయవలయును. ఈకాలమున లోకహితము కొఱకెంత శ్రద్ధగా బాటుపడిన నంత త్వరగా మనకు పారమార్థిక స్థితి లభించును. తత్రాపి భారతీయులగు మనకు

మనమాతృభూమి నుద్ధరించుట చాల అవసరమయిన పనిగా నున్నది.

కాలదేశ వర్తమానములను బట్టి యూహించిన నీదేశ మునకు శీఘ్రమున పూజ్యత గలుగునని తోచుచున్నదిగాని మన మందు నిమిత్తమయి పాటుపడకుండిన ప్రయోజనము లేదు. మనలో కొందరికి దేశవాత్సల్యమే తక్కువ, మరికొందరికి యుపేక్ష యెక్కువ, ఇక కొందరికి మరియొకరు పాటుపడి తమకు కీర్తి రావలయు నను కోరికయధికము. మరికొందరికి దేశమేలా గయినను బాగుపడుచున్నది గాని మన మనవసరముగా శ్రమతీ సికొన నక్కరలేదని యభిప్రాయము. అంతకన్న నధికము గా తాము చేయబూను కార్యములకు విఘ్నములును విరోధము లును నధికముగా యుండుటచే వానిని నివారించుకొను ధైర్య సాహసములు లేనివారయి తూష్ణీం భావమును వహించి కొంద రున్నారు. ఇవి యన్నియును నార్యవంశజులమగు మన కనుచిత ములైయున్నవి. మనకుండు శక్తిని బుద్ధిని ప్రీతిని చక్కగా వినియోగపరిచి దేశోద్ధారక కార్యములను మనము చేయ వలయును.

*

బాల్యవివాహములు నింద్యములని యనేకవిధములయిన కారణములను జెప్పుచు దేశవత్సలురగు పండితులు గ్రంథముల ను కూడ వ్రాసియున్నారు. ఇటీవల గోదావరిజిల్లాకు చేరిన పెద్దాపురములో నీకాలపు పెద్దల కాశ్చర్యకరమగు నొక బాల్యవివాహము జరిగియున్నది! ఒకబ్రాహ్మణ కుటుంబము లోని పండ్రెండు సంవత్సరముల బాలునకు మరియొక కుటుం బములోని మూడుసంవత్సరముల బాలికకు వివాహము జరిగి నది! ఇది యేమివింతయో చదువరు లాలోచించుడు. ఒక వేళ "అష్టవర్షాభ వేత్కన్యా" యను ప్రమాణము ననుసరించి

చూచినను మూడుసంవత్సరముల బాలికకు వివాహము జేయుట యశాస్త్రీయమే గదా! ఇట్టి యశాస్త్రీయమైన వివాహముల ను జరిపించ కుండులాగున ఆస్తిక శిఖామణులగు విప్రోత్త ములు నిరోధింపపనిలేదా? రజస్వలానంతర వివాహము జేయ కూడదని సాధించు విప్రోత్తము లిట్టి బాల్యవివాహము లశా స్త్రీయములని సాధించి యేల నిర్బంధించరాదు? ఆస్తిక శిఖామణులే శాస్త్రములను ధిక్కరించి నడవ సాగినయెడల పూర్వ సంప్రదాయముల కేలాగు ప్రాశస్త్యము గలుగును?

మూడుసంవత్సరముల కన్యకకు నిరాక్షేపణగా వివాహ ము జేయగలిగినయెడల రజస్వలానంతరము కన్యకకేల వివా హము జేయరాదు? ఆస్తిక శిఖామణులని జెప్పుకొను వారి దృష్టి లో నివి రెండును నశాస్త్రీయములే! ఒకటిని మాత్రము నిరో ధించక మరియొకటిని నిషేధించుట యేమి న్యాయము?

* * *

విశాఖపట్టణముజిల్లాకు చేరిన చోడవరము గ్రామము లో విద్యాభ్యాసమునకుగాను గ్రామాంతరములనుండి వచ్చి యున్న విద్యార్థులకు నివసించుట కనుకూలమయిన వసతులులేక బాధపడుచుండిరి. దివ్యజ్ఞాన సమాజముయొక్క ఇన్స్పెక్టర్ గా రగు మ. మొళ్ళకాల్మురు వెంకటరావుగారు ఆగ్రామముననున్న దివ్యజ్ఞాన శాఖాసమాజమునకు త్తేజనము గలుగజేయ వెళ్లియుండి కొన్ని ప్రసంగములను జేసి క్రొత్తగా కొందరు మెంబర్లను స మాజమునకు జేర్చి పురజనులయొక్కయు సామాజికులయొక్కయు సహాయముచే విద్యార్థులకు వసతియగునట్లు (Students' Home) విద్యార్థి నిలయము నేర్పరిచి ఆగష్టునెల 27 తేది విధ్యుక్తముగా స్థాపించిరి. దానిని స్థాపించిన కాలమున చోడవరం గ్రామము లోని డిస్ట్రిక్టు మునిసిపుగారును, కొందరు వకీల్లును, స్కూల్ మాష్టర్లును, మరియు నితర పెద్దమనుష్యులును వచ్చియుండిరి. బో

గ్గులోకల్ సెకెండరీ స్కూల్ హెడ్ మాష్టర్ గారు విద్యార్థి ని లయములోని బాలురనీతి విద్యావ్యాసంగము మొదలగు వానిని తాము తమ సహోపాధ్యాయులును విచారించు కొనెదమ ని సన్మతించి యున్నారు. ఇట్టి నిలయములవలన బాలురకు మంచినడత పరోపకారబుద్ధి మైత్రి మొదలగు సద్గుణములు పట్టుపడుట నిశ్చయము. ఈవిద్యార్థి నిలయము చక్కగా వర్ధిల్లుగాక!

* * *

మరణానంతరము మనుష్యునకు నరక యాతన లమితముగా నున్నవని మతగ్రంథములయందు వ్రాయబడియున్నవి. దివ్యజ్ఞానసమాజము వారీవిషయమును పరిశోధించి కనుగొనుటలో నరకయాతనలు మానవులందరికిని సంభవించుట లేదనియు, భూలోకమందు కేవలము తుచ్ఛమగు కామాది విషయములలో ప్రవర్తించుచున్న వారికి మరణానంతరము తటస్థమగు భువర్లోకములో తమకభ్యాసముగా నున్న విషయములు దొరకక పోవుటచే మనోవ్యథ యెక్కువగా గలుగుచున్నదనియు దీనికే యాతన యని జెప్పబడు చున్నదనియు ఈ లోకమందుండగా భోగవిషయములయం దెక్కువ మమత లేనివారికి భువర్లోకమందు సుఖమబ్బుననియు తెలిసి బోధించుచున్నారు. భువర్లోకములో మనుజులస్థితి వారి భూలోక ప్రవర్తనల ననుసరించి యుండును. ఇనుప ముక్కులుగల కాకులు, దహించుచున్న సుక్కస్తంభము మొదలగు యాతనోపకరణములు భువర్లోకమున లేవు గాని వానివలన గలుగు యాతనలు మనుజుల మనస్సులో గలిగి మరల భోగవిషయములయందు ప్రవేశింప నిష్టములేక వారికి విరక్తిని గలుగజేయును.

* * *

ఇప్పటి బ్రాహ్మణులకు కర్తవ్యమునుగురించి "స్వధర్మ ప్రకాశినీ" పత్రిక ఇట్లు వ్రాయుచున్నది:—

"ఇప్పటికాలపు బ్రాహ్మణులందఱు దేశాభివృద్ధికరములగు పనులనే చేయుచున్నారనిగాని తదితరజాతులవారు అట్టి సత్కార్యము లొనర్చుట లేదని గాని నే జెప్పుటలేదు. కాలకర్మవశముచేతనో సహవాసముచేతనో బ్రాహ్మణులలో పలువు రిప్పుడు ఇతర జాతులవలెనే స్వార్థ పరులయి భోగైకాభిలాషను పొందుచున్నారు. అయ్యది మానవస్వభావము. భోగాసక్తులగు వారలు ఇతరులచేత గౌరవింపబడజాలరు. అట్టి భోగాసక్తి లేకపోవుటచేతనే వెనుకటి బ్రాహ్మణులు ఇతరులవలననుండి సన్మానము నభిలషింపక పోయినను చక్రవర్తులవంటి వారలు సైతము వారి దర్శనము నభిలషించు నంతటి గౌరవమునకు పాత్రులయిరి. వారే స్వార్థరాహిత్యాచరణముచేత అట్టి గౌరవము నందిరో అట్టి యుదారగుణమును పోగొట్టుకొన్న మనవంటి బ్రాహ్మణులము అట్టి యుదారవర్తనమును విడనాడి ఇతరులు మనలను గౌరవింపలేదని వారియందు దోషారోపణమొనర్చుటమాత్రము ముమ్మాటికి తగదు. మనము కూడ తదితరజాతులవలెనే స్వార్థపరాయణులమై భోగాదిక మనుభవించ ప్రయత్నించునెడల మనయందు ఇతర జాతులవారు గౌరవము కనఁబఱచవలసిన యవకాశ మేమి యున్నది? కావున బ్రాహ్మణులు తమ జాతి ఇతర జాతికంటె మాననీయముగ నుండవలయునని తలంతురేని సాధ్య మయినంతవరకు ప్రయత్నించి సామాన్యముగ జీవించునంతటి స్థితితో తృప్తిచెందుచు తమ యావచ్ఛక్తిని పరార్థమునకు వినియోగించిన గాని యథార్థసత్కారము నందజాలరు."

# విష్ణుస్తోత్రం

కృష్ణాయవాసుదేవాయ దేవకీనందనాయచ।
నందగోపకుమారాయ గోవిందాయనమోనమః॥
నమఃపరమకల్యాణనమస్తేవిశ్వభావనా।
వాసుదేవాయశాంతాయ యదూనాంపతయేనమః॥
నమోబ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణహితాయచ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః॥
అసతీ పుష్పసంకాశం పీతవాసస మచ్యుతమ్।
యే నమస్యంతి గోవిందం న తేషాం విద్యతేభయమ్॥
కృష్ణకృష్ణేతికృష్ణేతి యోమాం స్మరతి నిత్యశః।
జలంభిత్వా యథాపద్మం నరకా దుద్ధరామ్యహమ్॥
జన్మాంతర సహస్రేణ తపోధ్యాన సమాధిభిః।
నరాణాంక్షీణపాపానాం కృష్ణభక్తిః ప్రజాయతే॥
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాజయః।
యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః॥
గోవిందేతి సదాస్నానం గోవిందేతి సదాజపం।
గోవిందేతి సదాధ్యానం సదాగోవింద కీర్తనమ్॥
జయతి జయతి దేవో దేవకీనందనోఽయం।
జయతి జయతికృష్ణో విష్ణువంశ ప్రదీపః।
జయతి జయతి మేఘశ్యామలః కోమలాంగో।
జయతి జయతి పృథ్వీ భారనాశో ముకుందః॥
శ్రీమన్నృసింహ విభవే గరుడధ్వజాయ।
తాపత్రయోపశమనాయ భవౌషధాయ।
కృష్ణాయవృశ్చిక జలాగ్ని భుజంగరోగ।
క్లేశవ్యయాయ హరయే గురవే నమస్తే॥
కృష్ణత్వదీయ పదపంకజ పంజరాంతే।

అద్యైవ మే విశతు మానస రాజహంసః।
ప్రాణ ప్రయాణసమయే కఫవాతపిత్తైః।
కంఠావరోధన విధౌ స్మరణం కుతస్తే॥
హరేర్నామైవ నామైవ నామైవమమజీవితమ్।
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥
కృష్ణేతి మంగళంనామ యస్యవాచి ప్రవర్తతే।
భస్మీభవంతి తస్యాశు మహాపాతక కోటయః॥
కృష్ణాయవాసుదేవాయ హరయేపరమాత్మనే।
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమః॥
నమామి నారాయణ పాదపంకజం।
కరోమి నారాయణపూజనం సదా।
వదామి నారాయణ నామనిర్మలం।
స్మరామినారాయణ తత్త్వమవ్యయమ్॥
ఆలోడ్యసర్వశాస్త్రాణి విచార్యైవం పునఃపునః।
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణస్సదా॥
శరీరంచ నవచ్ఛిద్రం వ్యాధిగ్రస్తం కళేబరమ్।
ఔషధం జాహ్నవీతోయం వైద్యోనారాయణో హరిః॥
జలేరక్షతువారాహః స్థలేరక్షతువామనః।
అటవ్యాంనారసింహశ్చ సర్వతఃపాతు కేశవః॥
శంఖచక్రగదాపాణే ద్వారకా నిలయాచ్యుత
గోవిందపుండరీకాక్ష రక్షమాం శరణాగతం ॥
గోవిందేతి పరంబ్రహ్మ గోవిందేతి చత్ర్యక్షరమ్
సకృదుచ్చారితంయేన విష్ణోస్సాయుజ్యమాప్నుయాత్॥
నారాయణేతిమంత్రేణ చతురక్ష ర్యహర్నిశమ్।
యన్మనోవిలయంయాతి తస్యవిష్ణుః పరంపదమ్।

# థియాసఫి (అనగా బ్రహ్మవిద్య.)

మ-రా-రా-శ్రీ T. రామచంద్రరావుగారు 29—7—16 తేదిని వేలూరులో జరిగించిన ఉపన్యాసముయొక్క సార సంగ్రహము.

థియాసఫీయొక్క ముఖ్యోద్దేశమేమి? థియాసఫికిని ఇతర మతములకును గల సంబంధమేమి? థియాసఫికిని హిందూ మతమునకును గల సంబంధమేమి? ఈసంగతులను గురించి చెప్పుటయే నాయుద్దేశము. సాధారణముగా మనదేశములో హిందూమతము మనకు ముఖ్యమతముగా నుండగా థియాసఫియనునది యెందుకు కావలయునని అనేకమంది యోచన చేయుచున్నారు. థియాసఫి యొక దేశమునకే కాదు, ఒకమతమునకే కాదు, హిందువులకు మహమ్మదీయులకు బౌద్ధులకు అన్నిమతములవారికి పనికివచ్చునది. అందరును కలిసి పనిచేయుటకు ఒక స్థళము నేర్పరచుకొనవలెను. అందుకుగాను ఒక సమాజము (Society) ఉండవలెను. అదే దివ్యజ్ఞానసమాజము (Theosophical Society). ఒక మతమువారిని చూచి మరియొకమతమువారు కొట్లాడడము వైషమ్యములు పెంచుకొనడము పనికిరాదు. హిందువులను తీసికొందము. మనలో త్రిమతస్థులున్నారు. అద్వైతులు, విశిష్టాద్వైతులు, ద్వైతులు, వీరు ఒకరితోనొకరు కొట్లాడుదురు. ఈ మతముల ఉద్దేశమేమి! మనుష్యుడెందుకుపుట్టినాడు? ఏమిచేయవలెను? అనుసంగతి తెలియక అవస్థపడుచున్నారు. తెలుగులో ఒకసామెతకలదు. ''అడుసుత్రొక్కనేల కాలు కడుగనేల''. పరమాత్మకు మనకును నిజమయిన సంబంధమేమన, మంటలోనుంచి వచ్చు మిణుగురులవలె పరమాత్మలో నుండి మనుష్యులు వచ్చినారు. పరమాత్మ పెద్దచెట్టు, మనము విత్తనములు. విత్తనములే పెద్దచెట్లగును. తల్లిదండ్రుల శక్తులు

బిడ్డలయందుండును. ఆలాగేమనలో భగవంతునిలోనున్న శక్తులు న్నవి. అవి యన్నియు మనము అనుభవములోనికి తెచ్చుకొని వికసింపజేసికొనవచ్చును. థియాసఫి ఈవిషయము మన మనస్సుకు వచ్చునట్లు చెప్పుచున్నది. ఒకరొకరు తమలోని భగవచ్ఛక్తులను వారివారికి వీలగుమార్గముల వినియోగింపవలెను. అట్లు చేసిన యెడల మనుష్యుడు భగవంతుని అంతవాడు కావచ్చును. అయితే ఏమిలాభము? ముక్తికలుగుచున్నది అందురు, సుఖముగా సంతోషముతో దేవుని సన్నిధానమం దుండవచ్చునందురు. ఈ సంగతి కొంచెము యోచింపవలయును. భగవంతుడు ఏలాగు చేయునో మనముకూడ అట్లే చేయవలయునని చెప్పియున్నది. భగవంతుడుమనకు సహాయముచేయును. మనము కూడ లోకులకు సహాయము చేయవలయును. హిందూమతములో ఒకడు అద్వైతి అయితే అద్వైతమే సరియనియు ద్వైతిఅయితే, ద్వైతమే సరియనియు, మిగిలినవన్నియు, అబద్ధమని కొట్లాడుదురు. ఇట్లు కొట్లాడుటకు అవకాశమేమి. భగవంతుడు పిచ్చివాడా ఇన్ని మతములు ఎందుకుపెట్టినాడు. వేదమార్గముఒకటి, సాంఖ్యమార్గముఒకటి, యోగమార్గము ఒకటి, శైవమార్గముఒకటి, వైష్ణవమార్గముఒకటి, బౌద్ధమార్గముఒకటి, ఇవన్నియు ఒకచోటికే పోవుటకు సాధనములు. నదులన్నియు సముద్రములోనికి పోయినట్లు అన్నిత్రోవలు ఒక్కచోటికి పోవును. "రుచీనాం వైచిత్ర్యం" అనునట్లు ఈమతములన్ని యుండుటకు రుచిభేదమే కారణము. భోజనములో ఒకరికి పులుసు ఒకరికి కారము మొదలగునవి ఎట్లు ఎక్కువ తక్కువగా నుండుట యిష్టమో అట్లే కొందరికి జ్ఞానమార్గము కొందరికి భక్తిమార్గము కొందరికి సేవామార్గము అనగా కర్మమార్గము ఇష్టము. థియాసఫి రుచిభేదములకు తగిన అవకాశమిచ్చును. ఎవరెవరికి నేయేత్రోవ మనసుకుబట్టునో ఆత్రోవనే పోవలయును. మనవారు ఇదిసరిగా

చెప్పరు. ఇది దివ్యజ్ఞాన సమాజమువారిలో సామాన్యులమతము. లోతులోదిగి చూచినవారు ఇంకొక మార్గముకూడా నేర్చుకొనుట మంచిదని చెప్పుచున్నారు. జ్ఞానము కొంచెము భక్తికొంచెము కర్మకొంచెము ప్రతివాడును నేర్చుకొనవచ్చును. థియాసఫి అన్నిమతములకు మంచి ఉపకారము చేయుచున్నది. భగవంతుడు అంతట నున్నాడు. ప్రపంచమును ఆయన సృష్టి చేసినాడు, అన్నిపనులు ఆయనవే. ఆయనపనికానిది యేదియులేదు. మనము భోజనము చేయుట నిద్రపోవుట కాలక్షేపము చేయుట అన్నియు ఆయన పనులు. లోకములో నేదియున్నదో అన్నియు ఆయనవే. హిందూమతములో భగవంతుడు అంతటనున్నాడని బాగా చెప్పియున్నది. నీవు చేసేపని యంతయు నాకు అర్పణ చేయుము అని భగవంతుడు చెప్పినట్లు గీతలో చెప్పియున్నది. ముండకోపనిషత్తులోని శ్లోకమునకు శంకరులు ఎవరియందు అబద్ధము లేదో మాయలేదో వారికే బ్రహ్మలోకము కలుగుననియు, పవిధముగా నయిన గృహస్థులకు అబద్ధము చెప్పకతప్పదు, మాయ లేకతప్పదు, గనుక గృహస్తునకు బ్రహ్మలోకములేదు, సన్యాసులకు అబద్ధము మాయ అవశ్యములేదు, గనుక వారికిమాత్రమే బ్రహ్మలోకము వచ్చుననియు వ్యాఖ్యానము చేసినారు, లౌకిక కార్యములలో అబద్ధము చెప్పినను సరే వైదిక వ్యవహారములలో సరిగా చేసినయెడల చాలునని అందురు.

ఈ సిద్ధాంతము (principle) మనము హీనస్థితికి (degradation) వచ్చుటకు కారణము. మనదేశము చెడిపోవుటకు కారణము. ఇది మారవలయును. దేవుడు ఎక్కడను ఉన్నాడు. సమస్తము భగవంతుని కార్యమే. అంతయులౌకికమే అన్నియు వైదికమే అని చేయవలెను. మనముచేయునది అంతయు పారమార్థకమని (spiritual) థియాసఫి తెలుపును. మనము చేయునదిఅంతయు (religious) అని పారమార్థికమే అని తెలియ

వలెను. ప్రపంచములో పనిచేయువారు అందరుగృహస్థులు. నేను కూడా గృహస్థును. "విష్ణు త్రిలోకే గృహస్థః" ముల్లోకములను సంరక్షణ చేసెడు పని ఆయనది. మనము గృహస్థులుగా చేసే పనులన్నియు భగవంతుడు చేసినట్లు చేసినయెడల అదే పారమార్థికము (spiritual). మనము ఏయుద్దేశముతో చేయుదుమో దానిని చక్క జేసికొనవలయు. అంతయు త్రికరణ శుద్ధిగా భగవత్ప్రీతిగా భూతసేవగా చేయవలెను. పారమార్థికముగా పనిచేసిన అదేలాభము. అదే థియాసఫి యొక్క ముఖ్యలక్షణము. (Ideal Theosophy.) హిందూమత సారము బాగుగా తెలిసినవారికి థియాసఫి చెప్పునది యేమియు లేదు. మనదేశమునకు వర్ణాశ్రమ ధర్మములు మూలములు. వర్ణమనగా యోగ్యతానుసారముగా మనముచేయు పనియే. బ్రాహ్మణుడు తనలాభమును చూచుకొనక యితరులకు నిజమయిన జ్ఞానబోధను చేయవలెను. అట్లు బోధచేయువాడే బ్రాహ్మణుడు. బ్రాహ్మణపుట్టుకపుట్టకపోయినను కర్మచేత బ్రాహ్మణుడగును. ఇది వర్ణధర్మము. వర్ణధర్మమనగా యథార్థముగా మానవసేవయే. బ్రాహ్మణుడు తానుచదివి తెలిసికొని యితరులకు చెప్పవలెను. చిన్నవాడుగానున్నప్పుడు వాని యోగ్యతాను సారముగా తగినచదువు చెప్పవలెను. ఏ పనిచేసిన యోగ్యత సంపాదించు కొనగలడో ఆపనికే తరిపీతు చేయవలెను. ఇదియే ఆశ్రమధర్మము. ఎదుటివారిపనులను మనము నేర్చుకొందము మనము నేర్పుదము. న్యాయముగా లోకమునకు మేలుచేయుదము. భగవంతుడు అన్నిచోట్లనున్నాడు. మనము చేసేపనులలో మనసోదరులకు బాధలేకుండ చేయడమే థియాసఫి. చివరకు నాప్రార్థన యేమనగా సారము తెలిసికొని హిందూమతము ప్రకారము వర్తించుట మంచిది. ఆయామతములవారు ఆయామతములప్రకారము వానిలోనుండు సారము తెలిసికొని లోకసేవ చేయవలయు.

# మోక్షమార్గప్రదీపిక.

(188-వ పుట శేషము)

(నాల్గవ వాక్యము.)

వాకు పరమగురువుల సన్నిధానమందు వచించగల్గుటకు మున్ను ఇతరుల మనస్సునకు నొప్పి గలుగజేయు శక్తిని బోగొట్టుకొని యుండవలయు.

రెండవ మూడవ వాక్యములలో నుదహరించబడిన చక్షుశ్శ్రోత్రేంద్రియములు జ్ఞానేంద్రియము లన్నిటికి నుపలక్షణార్థము జెప్పబడినవి. బాహ్యవిషయ జ్ఞానమును గలుగజేయుట వలన జ్ఞానేంద్రియములని తెలియబడుచున్నవి.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాంస్తితీక్షస్వ భారత।
యంహినవ్యథయంత్యేతేపురుషం పురుషర్షభ।
సమదుఃఖ సుఖంధీరం సోఽమృతత్వాయకల్పతే॥

(భ॥ గీ॥ 2—14, 15)

ఒకప్పుడు సుఖమును మఱియొకప్పుడు దుఃఖమును గలుగజేయునవియును వచ్చుంబోవు స్వభావముగలవియు ననిత్యములునగు విషయసంస్పర్శలకు నెవడు చలించకనుండునో వాడు మోక్షమునకు సమర్థుడగును.

ఈ యర్థము రెండవ మూడవ వాక్యములచే స్పష్టపరుచబడెను. నాల్గవ వాక్యము కర్మేంద్రియములను గూర్చి జెప్పుచున్నది. వాకు సకల కర్మేంద్రియముల కుపలక్షణార్థ ముదహరించబడినది. కర్మేంద్రియములచే మనము కర్మజేయుదుము. బాహ్యవస్తువులు, మనుష్యులు వీనివలనగలుగు సుఖదుఃఖములచే జలించకుండునటుల జ్ఞానేంద్రియ నియమనమును విధించినటుల నే మనము చేయు కర్మలవలన నితరులకు బాధకలుగకుండు

నటుల జేయవలయునని యిపుడు కర్మేంద్రియ నియమములను గూర్చి జెప్పబడుచున్నది.

యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగ మసక్తస్సవిశిష్యతే॥

(భ॥ గీ॥ 3—7)

ఈశ్వరసంకల్ప మెఱిగి లోకపురోవృద్ధికి బాటుపడవలెనని మనస్సులో దృఢముగ నిశ్చయించి యింద్రియములను నియమించుకొని లోకోపకారమగు కర్మనాచరించుట కుపయుక్తములగు నుపకరణములు కర్మేంద్రియములు. సర్వభూతములు భగవంతుని బిడ్డలేననియు నొకక్కటియగు నాత్మ పలురూపములుగ నగుపడుచున్నదియేకాని నిజముగ నొండొరులకు భేదములేదనియు స్మరించుచుండవలెను.

ఏకోవశీసర్వభూతాంతరాత్మా ఏకంబీజంబహుధాయః
కరోతి తమాత్మస్థం ఏఽనుపశ్యంతిధీరాః తేషాంసుఖం
శాశ్వతం నేతరేషాం।

కఠ॥ 5—12.

లేనియెడల కర్మానుష్ఠానము దధర్మాచరణము సంభవించును. భేదబుద్ధితో జేయునది బరహితార్థముగ నుండనేరదు. ప్రాయశః నొప్పిగలుగ జేయునదిగ నుండును. ఇట్టి దీశ్వరార్పిత కర్మ యనబడనేరదు. సదా లోక హితార్థము మనోవాక్కాయములచే బ్రవర్తించు మహాపురుషుల సన్నిధానమందు బరహింస నొనరించువాడెట్లు జేరనగు? అచ్చటికి బోనేయోగ్యతలేనివాడెట్లు మాట్లాడనోర్చు? పరమగురువుల సన్నిధానమందుండి మాట్లాడుటకెంతయో అహింసాభూతదయాది ప్రేమగుణములు వృద్ధిజెందించుకొని యుండవలయు. కర్మేంద్రియములన్నిటిలో వాగింద్రియము మిగుల దుర్నిగ్రహము. దానివలన ననేకవిధముల జనహింస జేయుచున్నారము. బుద్ధిపూర్వకము

గా, అబుద్ధిపూర్వకముగా నితరులకు నొప్పి గలుగజేయు చున్నాము. ఈయింద్రియ శక్తిని వినియోగ పర్చుటయం దనుష్ఠింపవలసిన ముఖ్యమయిన విధులీక్రింద వ్రాయబడుచున్నవి.

అనుద్వేగకరం వాక్యం సత్యంప్రియహితంచయత్
........వాఙ్మయం తప ఉచ్యతే।

భ॥ గీ॥ 17—15.

సత్యంబ్రూయాత్ ప్రియంబ్రూయాత్ నబ్రూయాత్ సత్యమప్రియం। ప్రియోఽపినానృతంబ్రూయాత్ ఏషధర్మస్సనాతనః।

ప్రాణులకు దుఃఖమును గలుగజేయనదియు, సత్యమయినదియు, ప్రియమయినదియు, హితమయినదియు నగువాక్కు తపఃఫలము నిచ్చుననియు నీనాల్గింటిలో నేదికొఱతయయినను తపస్సనిపించుకొన నేరదనియు గీతాభాష్యమునందు నుడువబడియున్నది. "పరమగురుచరణ సన్నిధి" యనుగ్రంథమునందు వాఙ్నియమమును గురించి మిక్కిలి విపులముగ బోధించబడియున్నది. ఆ బోధలను దెలిసికొనుటవలన విశేష మేలు కలుగునుగావున వాని నీక్రింద వివరించబడును.

1. వాక్కు సత్యముగను ఉద్రేకరహితముగ నుండవలెను.

2. పరదూషణమాటలు మనము వినినను నితరులకు జెప్పగూడదు.

3. మాట్లాడవలెనను కోరికె యుండగూడదు. అనగా అవశ్యకమున్నయెడల మాట్లాడవలయునేగాని మాట్లాడడమే కోరికగా నుండకూడదు.

4. మితభాషణము మంచిది.

5. మాట్లాడుటకుముందు వచించబోవుమాట సత్యమయినదేనా, దయోపేతమయినదేనా, హితకారియయినదేనా, అని

జాగ్రతగా యోచించుకొని మూడుగుణములను గల్గినదగునేని వచించవచ్చును. లేనియడల, ఆమాటను వెడలనియ్యవలదు.

6. మాటాడుటకుముందు బాగాయోచించుట కిప్పటినుండియే యభ్యసించవలెను. ఎందువలననగా గురుసాక్షాత్కారమైనపిమ్మట ప్రతిమాటను కనిపెట్టవలసియుండును. ఆడగానిమాట బైటబోవునేమోయని కనిపెట్టవలసియుండును.

7. సాధారణముగా జనుల సంభాషణ మనావశ్యకముగను తెలివిలేనిదిగ నుండును. అందు బరనింద చేరినయెడల దుర్మార్గమయినదని చెప్పవలెను.

8. మనయభిప్రాయమును ఎవరైనగావలెనని కోరినయెడల చెప్పవచ్చునేగాని ముందు ముందుగానే మనము చెప్పగూడదు.

9. మౌనమతి దుస్సాధ్యము.

10. ఈమాట పరమగురువునోటినుండి రాదగుమాటయేనా అని మనస్సులో ముందుగా నాలోచించుకొని తగునని తోచినయెడల వచించవచ్చును. లేనియెడల వచించకూడదు.

11. ఇతరులకు నొప్పిగలుగజేయుమాట బుద్ధిపూర్వకముగా జెప్పబడ దనునది సరియే! అంతియగాదు. అజాగ్రతగానైనను నొప్పిగలుగజేయుమాట బలుకగూడదు. అజాగ్రతగ నుండనేకూడదు.

ప్రమాదోమృత్యురిత్యాహుః

12. ఇతరులకు బాధగలుగజేసినపుడు మన మబుద్ధిపూర్వకముగ జేసితిమని చెప్పినంతనే వారికి బాధనివృత్తి కానేరదు. పరులకు బాధగలుగజేసిన కర్మ మనమనుభవించక దీరదు. కనుక గురుసాక్షాత్కారము గోరువాడు తనవలన నితరులకు గలుగు ఫలమును యోచించియే ప్రవర్తించును.

13. దూషణవాక్కులను సర్వ ప్రయత్నములచేత నణగ

దొరకవలెను. ఎవరినిగురించి మనము మాట్లాడుదుమో వాని యందు మనమారోపించిన దోషములేక యుండవచ్చును. అట్టి యెడల మన దుస్సంకల్ప దుష్టవాక్కులచేత వానియందు సుప్తించియుండు దోషము విజృంభించవచ్చును. మన మట్లు జేయకుండినయెడల వాని సత్సంకల్ప సత్ప్రవర్తనలవలన నాదోషము నశించి పోదగియుండును. మనవలనవానికి మిగుల జెడుగు కల్గినట్టాయెను. వానియందాదోషము నిక్కముగ నుండినయెడల మనము చేసినదానివలన నది వృద్ధియగును. ఏవిధముచేతను వానికి మన మపకారముజేసి నట్లగును. మనకు నయితముమేలు లేదు. దోషచింతనచే మనయందును దోషము వృద్ధియగును. ఇట్లుభయులకు జెడుగు కలుగును. కావున పరదూషణవాక్కెట్టి వ్యాజముననైనను మనము పలుకకూడదు.

ఇతరుల మనస్సుకు నొప్పి గలుగజేయు శక్తిని బోగొట్టుకొనియుండవలెనని చెప్పబడియున్నది. ఇచ్చట శక్తియను పదము విశేషార్థద్యోతకము. స్వార్థత్యాగము, పరహితాచరణము అనుగుణములను సదా స్మరించుచు ననుష్ఠించుచురాగ మనోమయకోశము పరిశుద్ధమగు నణువులతో నిండియుండును. అట్టి శరీరములో దుస్సంకల్ప ముదయించ నేరదు. ఏలనన, తదుత్పత్తికారణమగు స్థూలాణువు లభావము. దుస్సంకల్పప్రేరితము కాని దుష్టవాక్కు లేదు. ఎంతకష్టపెట్టబడినను హరిశ్చంద్రుడు కల్లలాడకబోయెను. ఆ మహాపురుషునికి అసత్యమాడుటకు సాధ్యమేలేకపోయెను. మహాపరిశుద్ధుడు కనుక దుష్కృతమాచరింప నోపడాయెను. అటులనే మనకును నొప్పి గలుగజేయుశక్తి నశించవలెను.

ఈ గుణము బహుకాల మభ్యసించినగాని పట్టుపడదు. మన మెందరికో జ్ఞాతాజ్ఞాతాపకారమును మనమాటలతో జేయుచున్నాము. ఒక దినము కనిపెట్టిన జాలును. మన దౌష్ట్యము

మన మనస్సుకు వచ్చును. లెక్కించిచూడ నెందరికో వాక్కుచే హింసించినారమని తెలియవచ్చును. కావున తామసించక వాఙ్నియమము నుద్యమించవలెను.

ఇటులనే మిగిలిన నాల్గు కర్మేంద్రియములను నియమించుకొనవలెను. వాగింద్రియమును వశపర్చుకొన్నయెడల సర్వేంద్రియనిగ్రహము సుసాధ్యము. ఎందువలన నన, వాఙ్నియమమునందు మనోనిగ్రహము కలుగును. యుక్తాయుక్తముల నాలోచించి మాట్లాడుట కభ్యసించుచురాగా మనశ్శుద్ధికూడా కలుగును. కావుననే భగవద్గీతయందు మౌనమును మానసికతపస్సుగా జెప్పియున్నారు.

మనఃప్రసాద స్సౌమ్యత్వంమౌన మాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానసముచ్యతే॥

భ॥ గీ॥ 17—16

ఇంద్రియ రాట్టగు మనస్సు శాంతముగ నుండునపు డింద్రియములు క్షోభించనేరవు.

ఇచ్చట నొక యాక్షేపణ జేయవచ్చును. వాక్పారుష్యములేనిదే ప్రపంచమందు గార్యము నిర్వహించబడనేరదు, ముఖ్యముగ బామరుల విషయములో మంచి మాటలతో బ్రయోజనము లేదు, కాఠిన్యమే సహకారి యగుగాని మార్దవము నిష్ప్రయోజనము, అని యాక్షేపింతురు. ఇది యోచించవలసిన విషయమే. పామరసంఘాధ్యక్షత్వ భారమును వహించిన వారలకు ముఖ్యముగ నీ సంశయోత్పత్తికి గారణ ముండును. అయితే ఈ విషయమందొక సంగతిని గమనించవలసి యున్నది. మనస్సు కఠినముగ నుండవలెనని ఎచ్చటను జెప్పియుండలేదు. రాజనీతులలో సయితము హృదయదయాళుత్వము నొక్కి జెప్పబడియున్నది. మనస్సౌమ్యత్వముగలవాడు బాధ గలుగజేయడు. లోపములను జక్కబెట్టి మంచి మార్గమునకు దెచ్చుటకు బ్రయ

ల్పించు నేగాని నొప్పి గలుగ జేయదు. బాహ్యదృష్టికి నొకవేళ వాక్కాఠిన్యము నగుపర్చినను దానివలన నొప్పి గలుగదు. ఎందువలన ననగా మనస్సు మనస్సుపైన బనిజేయును. సముద్దేశముతో జెప్పుమాట మనస్సుకు నొప్పి గలుగ జేయదు. మంచి మనస్సుతో జెప్పినమాట ప్రాయశః కఠినముగ నుండదు. ఒకవేళ పారుష్యమును నటించినను మేలు కలుగునుగాని చెడుగు కలుగదు. అయితే పరుషవాక్కు సాధారణముగ ననావశ్యకముగ నుండును. మనమాడు కఠినమాటలు చాలామట్టుకనవసరముగ నుండును. అకారణముగ నొకనికి గాక వాని తల్లి మొదలగు వారికి సయితము పరిభవము గలుగ జేయు పదములను ప్రయోగించుచున్నాము. ఇది మిక్కిలి మూర్ఖపద్ధతి. పరమగురువుల యనుగ్రహము గోరువాడు వాగింద్రియమును లోకోపకారమునకు వినియోగించునుగాని బాధ గలుగ జేయనోపడు. ఏవిధముచేత నైనను తప్పుజేసిన వానిని గఠినముగ జూడకూడదనియు తప్పును సవరించి మంచి త్రోవకు దేవలెననియు బోధించబడి యున్నది. అబుద్ధిపూర్వకముగ నైనను వాక్కుచేత గీడు జేయగూడదని చెప్పబడియున్నది. ఎంతో దుర్మార్గుడైనను మంచిమాటలతో జక్కపెట్టబడగలడు. కేవల మూర్ఖుని యెడల కొంచము పరుషముగ గన్పడు మాటబల్కినను ఉద్దేశము మాత్రము మంచిదిగ నుండవలెను. మనస్సుతో జెడుగు గోరువాడెంత తపస్సొనరించినను గురుసన్మానమును బొందనేరడు.

(ఐదవ వాక్యము.)

జీవాత్మ పరమగురువుల సన్నిధానమందు నిలవగలుగుటకు మున్ను వానిపాదములు హృదయ రక్తముతో బ్రక్షాళణము జేయబడవలెను.

రెండవ మూడవ వాక్యములచే జ్ఞానేంద్రియ నియమమను నాల్గవ వాక్యముచే గర్మేంద్రియ నిగ్రహమును విధించి యిప్ప

డయిదవ వాక్యమువలన బ్రాణకాంతుసయితము విడువవలెనని చెప్పబడుచున్నది.

సర్వేంద్రియముల కధిష్ఠాతప్రాణము.

ప్రాణస్యేదంవశేసర్వం త్రిదివేయత్ప్రతిష్ఠితం

(ప్ర॥ ఉ॥ 2—13)

ప్రాణస్వరూపమును గురించి ప్రశ్నోపనిషత్తునందు విపులముగ జెప్పబడియున్నది.

ఇంద్రియములు మనస్సు తామే శ్రేష్ఠులమనియు దేహము ధరించుచున్నామనియు గర్వించిరి. ఆ యభిప్రాయము సరికాదని ప్రాణముచెప్పినను విననివారయిరి. అప్పుడు ప్రాణముతక్రమించినట్లు నటించగా సర్వేంద్రియములు మనస్సు నిశ్చేష్టితులై తమకందరికి బ్రాణమే యాధారమని యంగీకరించి ప్రాణమును స్తుతించిరని చెప్పబడియున్నది.

తేఽశ్రద్దధానాబభూవుః సోఽభిమానాదూర్ధ్వముత్క్రామతఇవ
తస్మిన్నుత్క్రామత్యథేతరేసర్వఏవోత్క్రామంతే।
తస్మింశ్చప్రతిష్ఠమానే సర్వఏవప్రతిష్ఠంతే॥

(ప్ర॥ ఉ॥ 2—3, 4)

స్తోత్రము.

ఏషోఽగ్నిస్తపతి ఏషసూర్యఏషపర్జన్యో మఘవానేషవాయుః
ఏషపృథివీరయిర్దేవః సదసచ్చామృతంచయత్।
అరాఇవరథనాభే ప్రాణేసర్వంప్రతిష్ఠితమ్॥

ప్రాణమే అగ్నిరూపమున దహించుచున్నది. ప్రాణము సూర్యుడు, పర్జన్యుడు, ఇంద్రుడు, వాయువు, పృథివి, చంద్రుడు, సత్తు, అసత్తు, అమృతము.

రథము బొడ్డునందాకులవలెనే సర్వము ప్రాణమునందు బ్రతిష్ఠించబడియున్నది. (ప్ర॥ ఉ॥ 2—5, 6)

(సశేషము.)

# విషయలోలత.

(196-వ పుట శేషము)

విషయసుఖముల జిరకాల మనుభవించి, వివిధ దుఃఖము లజెంది యందు దనివిజెందక శాశ్వత సుఖానంద పదార్థమర యుటకై ప్రయత్నించు. ఇదియ విషయ విముఖత.

శ్లో॥ విపద్వైరాగ్యజనని

యనునట్లు విషయానుభవమువలన గలుగు కష్టమువల నగాని వైరాగ్యము కలుగదని తత్త్వజ్ఞులు నుడువుదురు.

నిండు చెఱువులోని నీరు గండ్లద్వారా వెలికి బోయి గ్రామములను భూములను ముంచునట్లు మనస్తటాకములోని తేజోద్రవము ఇంద్రియములద్వారా వ్యర్థముగ వెలుపలికిబోయి యనేకానర్థముల గలిగించును. గండ్లు పూడిచి తటాకపు గట్టును బాగుపఱిచి శ్రేష్ఠమయిన జలరంధ్రముల నేర్పఱిచి యుక్తకాలమున పైరులు పండుటకు వలసిన జలమును విడిచి తక్కిన కాలముల యందు రంధ్రములు మూసిన తటాకములోని జలము సమృద్ధముగనుండి ప్రాణికోటికి స్నానపానాదుల కుపయోగపడి వర్షము కురియక క్షామము కలిగినను దానినుండి యెంతయు రక్షించును గదా? అవ్విధింబున మనస్తటాకమునందలి జలంబును వ్యర్థంబుగ విషయములమీదికి బోనీయక పురుషార్థంబునకును పరోపకార కార్యములకును దేహయాత్రకును నెంతకావలయు నంతమాత్రము వదలి తక్కిన కాలములయందు నింద్రియముల నిరోధించి యంతర్ముఖము గావించిన మనస్తటాకమున బ్రజ్ఞాజలములు సమృద్ధముగ నుండి ధర్మార్థకామమోక్షములు సాధించుటకును యోగశక్తిని బడయుటకును భూతకోటికి నుపకరించుటకును దగిన మనోబలము కలుగును. దానివలన నెంతటి కార్యముల నయిన సాధింపసమర్థుడగును. దయామయుడగు పరమేశ్వరుండు ప్రాణులు కడతేరుట కింద్రియవర్గంబును మనస్సును నిచ్చియుండ నద్దాని

యుపయోగ మరయక వ్యర్థముగ నుపయోగించు మూఢునికన్న వేఱొక కృతఘ్నుఁడు కలఁడా? భగవదుద్దేశ్య మరయవలదా? అమూల్యమగు నింద్రియ వర్గంబును మనస్సును యౌవనావస్థయందు విషయవ్యసనార్తుఁడయి విషయంబులమీఁదికి బోనిచ్చి దుర్వినియోగము గావించిన తురీయావస్థయందు దుర్బలుఁడయి యెట్టి కార్యములనొనరింప సమర్థుఁడుగాక, పరతంత్రుఁడయి దుఃఖించును. కాబట్టి లోకయాత్రకును గేహ దేహ యాత్రలకును మాత్రమెంత కావలయు నంత హితమితముగ నుపయోగపరుపవలయును గాని వ్యర్థముగ నుపయోగించిన భగవదుద్దేశ్యమునకు వ్యతిరిక్తముగ బ్రవర్తించినవారలయి దుఃఖముల పాలగుదురు. ఆరోగ్యమును గాంక్షించువాఁడు పదార్థముల నిచ్చవచ్చినట్లు భుజింపక హితముగను మితముగను పథ్యరూపముననుఁ బుచ్చుకొనునట్లు పరమార్థమును గోరువాఁడు హిత మిత పథ్యరూపముగ విషయముల స్వీకరింపవలయుగాని భోగాసక్తితో గైకొనిన నమితముగను స్వేచ్ఛగను మెసవి రోగముల దెచ్చుకొనినట్లు భోగంబులవలన దుఃఖరోగములు కలుగును. స్వార్థత్యాగముచేసి పరోపకార పరాయణుఁడుగ నుండువానికి, విషయభోగేచ్ఛ తగ్గియుండును. విశేషముగ ధనము వ్యయముచేసి విలువగల బట్టలు కట్టక, సామాన్య వస్త్రములు ధరించియు, ఆభరణములఁ బెట్టుకొనక, పరులకుపకరించుటయే పరమాభరణమనియు, నెక్కువ భోగములనపేక్షింపక, దేహధారణారోగ్యములకుఁ గావలసినంత మితముగ స్వీకరించియు, నక్కఱనపంతయు బ్రాణులకొఱకే ఉపయోగించి, వారి యోగక్షేమంబులఁ జూచి యానందించునట్టి వానికి, తనభోగ సౌఖ్యములకన్న వేయిమడుంగు లానందము గలుగును. విషయలోలుని చిత్తము విషయాసక్తమై, దానినే గ్రోలుటవలన, విషయాంతరముకుఁ బోవఁజాలక, దుర్బలమై చెడియుండును. దుర్బలచేతసుఁడు, మనస్థైర్యము

లేని వాఁడగుటచే ధర్మకార్యముల నొనరింపఁజాలఁడు. విషయలోలుపునికి, చిత్తస్థైర్యము, ధైర్యము, మేధ, ప్రజ్ఞ, ధర్మచింత, సత్యప్రవర్తనము, పరశ్రేయస్సహనము, ద్వంద్వసహనము గలిగియుండవు. జితేంద్రియునికిఁ బైనఁజెప్పినవన్నియుఁ గలిగియుండును. ఇంద్రియములకు తానులోఁబడక, ఇంద్రియముల నన్నింటిని లోఁబఱచుకొని, వశవర్తులఁ గావించుకొనిన వానికి స్వారాజ్య సౌఖ్యముకలదు. ఇంద్రియములనే స్వాధీనపఱచుకొనఁ జాలనివాఁడు, పెక్కువేల జనులుగల స్వరాజ్యమునెట్లు పరిపాలింపఁగలఁడు? విషయలోలతలేనివాఁడు స్వధర్మమునఁ బ్రవర్తించి, కులోచితవృత్తులను, లోకోపకారక వ్యాపారములను నభివృద్ధిఁగావించును. విధివిహిత కర్మములనొనరించుచు, వానిఫలము నపేక్షింపక, పరమేశ్వరాంశ సంభూతులని ప్రాణులకుపకరించు ధర్మాత్మునికి ద్వంద్వ సహిష్ణుత కలుగును. అప్పుడు, లోకుల దూషణభూషణలుగాని, లాభనష్టములుగాని, సుఖదుఃఖములుగాని, స్వత్వపరత్వ భేదములుగాని పాటింపక, యుదారాశయముతో ననేక మహాకార్యములొనరించి, మానవజన్మ సాఫల్యముఁ జెందించుకొనునుగాని, విషయలోలుపత్వముచే, స్వార్థపరాయణతఁజెంది, పశుపక్ష్యాదులవలె వ్యర్థముగ కాలము బోఁగొట్టుకొనజాలఁడు. వ్యర్థజీవి కొలిమి నూఁదు తోలుతిత్తినిఁ బోలియుండు. జ్ఞానమునుఁబడసి లోకోపకారకకార్యములనుఁ గావించి, పుణ్యవిశేషంబున నుత్తమలోకములుగాని, పరమేశ్వరు సాన్నిధ్యముగాని పొందుట మానవజన్మముఖ్యోద్దేశ్యము. అటుగాక తానువచ్చిన కార్యమును మఱచి విషయలోలుఁడగుట, పాంథుఁడు యాత్ర సేయుచు, మార్గమధ్యంబునంగల సత్త్రములలో విడిసి యచ్చటి వైచిత్ర్యములను జూచుచు, తదేకాసక్తుఁడై, తానుద్దేశించి యేతెంచిన కార్యమును మఱచుటఁబోలె నుండును. పుత్రమిత్రకళత్ర

బంధువర్గముతోడి సంగము, బాటసారులందఱు నొకసత్త్రమున విడిసి యుండుకాలము, స్నేహమునఁగలసి మెలసి మఱలవీడి, తమతమగమ్య స్థానములకుఁ బోవనుద్దేశించిన విధంబునుబోలి యుండు. ఖజానాలోని లక్షల ద్రవ్యమును షరాపు లెక్కఁ బెట్టుచు తాకుచునుండి, తనద్రవ్యము కాదని తలఁచునట్లును, రాజపుత్రుల నెత్తుకొని యాడించు దాసదాసీజనము, ఆబిడ్డలు, తమవారుకా రనుకొనునట్లును, వివేకసంపన్నుఁడు, పుత్రమిత్ర కళత్ర గృహక్షేత్ర స్వర్ణాభరణాంబర వాహనోద్యాన శయ్యాసన ధనకనకాది వివిధవిషయ జాతంబుతోడఁ గూడియున్న నెప్పటికేని వియోగంబు తప్పదనియు నశాశ్వతంబులనియు, పరిణామ దుఃఖదాయకంబులనియుఁ దలఁచి, సంసక్తుఁడుఁగాక యంటియు నంటనట్టులుండి, అతిథివలెఁ బ్రవర్తింపవలయు. విషయ సుఖానుభవమందు, దుఃఖముకలదని భర్తృహరి యోగీశ్వరుఁడును నుడివియున్నాడు.

శ్లో॥ అవశ్యం యాతారశ్చిరతర ముషిత్వాపివిషయాః
వియోగేకోభేద స్త్యజతిన జనోయత్స్వయమమూ౯।
వ్రజంతస్స్వాతంత్ర్యాదతుల పరితాపాయమనస
స్స్వయంత్యక్తా హ్యేతేశమసుఖమనంతంవిదధతి॥

మనము విషయములతోఁగూడి యెంతకాలమున్న నెప్పటికేని వియోగము కలుగక తప్పదు. విషయములు మనలను విడిచినను, మనము విషయములను విడిచినను రెండునొక్కటియే కదాయని తలంపఁగూడదు. విషయాసక్తులమగు మనల నవి విడిచి పోవునపుడు మితిలేని దుఃఖము మన కుఁగలుగును. విషయస్వరూప స్వభావములను దెలిసి, వానినే మనము విడిచితిమేని మేరలేని సుఖము గలుగు. వానిచే మనము విడువఁబడుటకన్న, మనచే నవి విడువఁబడునేని ధీరులమగుదుము; లేనిచో జేలల మగుదుము. పురాకృత సుకృ

త విశేషంబున, విషయ సుఖంబులు మనకుఁ బ్రాప్తములై, సుకృతము క్షయించుకొలఁదిని, విషయంబులు పోయి దుఃఖములు కలుగుటవలన, విషయ సుఖానుభవమందు సుకృతము క్షీణించు నని వివేకులు తెలిసికొని, యప్రసక్తులై విషయలోలురు కాక యుందురు. సంయోగములు విప్రయోగాంతములు, సుఖములు దుఃఖాంతములు; కావున విషయములు ప్రాప్తంబు లగునపుడు, వియోగ దుఃఖములు కలుగుననియే భావింపవలయు. సప్త విషయ వ్యసనములచే నొక్కొక్క దానిచే నొకరొకరు హతులైరి.

శ్లో॥ ద్యూతాద్ధర్మసుతోపలాదిహబకోమద్యాద్యదోర్నందనా
శ్శక్రోజారతయామృగాంతకతయాస్యబ్రహ్మదత్తోనృపః।
చోరత్వాచ్చ్యయయాతిరన్యవనితాసంగాద్దశాస్యోమహా
న్నేకైకవ్యసనార్దితాయతఇమే సర్వైర్నకోనశ్యతి॥

ద్యూతమువలన యుధిష్ఠిరుడును, నరమాంసమందలి యాసచే బకాసురుండును, మద్యపానమున యాదవులును, జారత్వమున నింద్రుడును, మృగయావినోదంబున బ్రహ్మదత్తమహీపతియు, చోరత్వమున యయాతియు, పరకాంతాసక్తివలన రావణుండును, వీరలొక్కొక్క విషయవ్యసమునచేతనే మితిలేనికష్టము లనుభవింప నిందుగొన్న కాని యన్నికాని కలిగియున్నవాని విషయ మికేమని చెప్పవలయు? విషయాసక్తికూడదని భారత భాగవత భగవద్గీతాది శాస్త్రములయందు విశేషముగ దెలిపిరి.

శ్లో॥ యేహిసంస్పర్శజాభోగా దుఃఖయోనయఏవతే।
ఆద్యంతవంతఃకౌంతేయ నతేషురమతేబుధః॥

అర్జునా! విషయేంద్రియ సంయోగమువలన గలుగు భోగములు దుఃఖమూలకములు; ఆదియు నంతమును గలవి. కావున, వివేకసంపన్నుడు పరిణామ దుఃఖంబులగు విషయములయందాసక్తుడు కాడని భగవద్గీత 5 అధ్యాయము 22 వ శ్లోకమునందు జెప్పఁబడినది.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే।
సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥

విషయంబుల దలచువానికి విషయములయం దాసక్తి కలుగు. ఆ విషయాసక్తివలన, విషయసుఖంబు లనుభవింపవలయు ననెడి కోర్కె వొడమును. ఆకోరిక కొనసాగకున్నను పరులచే నుపహతమయినను క్రోధము కలుగును. క్రోధమువలన నొడలెఱుగని యావేశమోహము కలుగును. మోహమువలన స్మృతిచెడును. స్మృతిచెడుటవలన బుద్ధినశించును. కావున సకలానర్థంబులకు విషయాభిధ్యానమే మూలకారణము. (గీత॥ 2 అ.)

శ్లో॥ విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషువిషజ్జతే।
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవప్రవిలీయతే॥

విషయముల ధ్యానించువాని చిత్తము, విషయాకారముగ బరిణమించి విషయములు నశించినంత నాచిత్తము సంక్షోభము జెందును. భగవంతుని ధ్యానించువాని చిత్తమున భగవత్కల్యాణగుణములు నెలకొని శాశ్వతానందము నొందును.

అనాద్యవిద్యా వాసనవలన చిత్తముచెడి స్వగతమాలిన్యంబున బహిర్విషయముల మీదికి ఇంద్రియములతోడ బరుగిడును. ఇంద్రియ గ్రామము ఎంతటి ప్రజ్ఞావంతునేని పండిత ప్రకాండునేని వివేకశీలునేని తత్త్వజ్ఞునేని మోసపుచ్చి భ్రాంతిగలుగజేసి విషయములలోనికి బ్రవేశింపజేయు. ప్రపంచమున కాంతాకనకరూప విషయవ్యామోహముతో దుల్యమయినది మఱియొకటిలేదు. దీపాగ్నినిజూచి యాహారమని భ్రమజెంది శలభంబులు దానం బ్రవేశించు చందంబున కామినీ జనహావభావాది శృంగారచేష్టలకు లోనయి యువకుల మనమ్ములు కామాగ్నిని దహింపబడుచుండు. మైనికుండు జలంబులనుండు మీనంబుల

బట్టుటకయి బడిశాగ్రమునం దామిషము జూపి గ్రహించులాగున మన్మథ ధీవరుండు కామినీజన నవతారుణ్య లావణ్య సంజనిత వివిధ శృంగార చేష్టాసంపత్తిని జూపి మానవుల మనోమీనంబుల హరించుచున్నవాడు. విద్యావినయ సౌజన్య సౌశీల్యౌదార్యాది సుగుణగణ నికేతనులగు మతిమంతులనేకులు అసత్సహవాసంబున కామినీమణుల భ్రూచాప వినిర్ముక్తమార క్రూరనారాచంబుల నంబరగు కటాక్షవీక్షణముల విద్ధచేతస్కులయి మోహజాలములలో జిక్కి సుగుణసంపత్తిని గోల్పోయి తుదకు బేలలగుచున్నారు. కావున ధీరులగు పురుషవరేణ్యులు విషయారణ్యంబులందు విచ్చలవిడిగ సంచరించు చిత్తమత్తేభంబును వివేకాంకుశముచే వశవర్తిగావించు కొనవలయును. ధీరులు విషయదోషంబుల దెలిసికొని ప్రమాదం బొరయకుండునది.

శ్లో॥ ఆత్మానంరథినంవిద్ధి శరీరంరథమేవచ।
బుద్ధింతుసారథింవిద్ధి మనఃప్రగ్రహమేవచ।
ఇంద్రియాణిహయానాహుః॥

దుష్టాశ్వంబులం బూన్చిన రథంబునెక్కి ప్రభువర్యుండు సుందరోద్యానమందిరంబునకు బోవునెడ మార్గము నిరుపక్కనగాధములగు• గర్తములున్నను అత్తటి సారథినేర్పరియై పరాకులేక పగ్గములు చేబూనిన ఆహయంబు లభిమతప్రదేశమునకుం గొనిపోయి చేర్చును. అటుగాక సారథి మద్యపానపరాయత్తచిత్తుండయిన నీమష్టతురంగంబులు పెడత్రోవకు నీడ్చి గర్తంబులలో బడవైవ రథము తుత్తునియ లగుటయే గాక రథికాశ్వసారథుల కాయంబులు గాయంబులతో నిండి తుదకు ప్రాణహానియు సంభవించును. అవ్విధంబున ఇంద్రియ హయంబుల మర్పబడిన శరీరరథము నారోహణము గావించువాడు జీవుడను ప్రభువు. బుద్ధియను సారథి మనఃప్రగ్రహములను జేబట్టి జాగరూకత కలిగి హయంబుల చోదనంబు గావించిన నీతిన్యాయ

క్షుణ్ణ మార్గంబున జక్కఁగబోయి శాశ్వతానంద భాసురంబగు పరబ్రహ్మానంద మందిరమునకుం జేర్చును. అటుగాక బుద్ధిప్రమాదావస్థను జెందిన నీయింద్రియాశ్వంబులు విషయాశామహాగర్తంబులలోనికి బడద్రోయునెడ బుద్ధీంద్రియజీవులకు మహాదుఃఖములు సంప్రాప్తములగును. కావున ధీరుండగు మానవుండు ఇంద్రియంబులు పోవు మార్గంబున బోనీయక స్వాధీనమునందుంచుకొని భటులను బోలె యుక్తకార్యంబుల నియోగించునది. జీవదయాపరుండగు పరమేశ్వరుండు మనయెడ నపారముగు కృపకలిగి దయనొసంగిన యింద్రియవర్గంబును మనోబుద్ధులను నసద్విషయములకయి వినియోగింపక పరమేశ్వరాంశ సంభూతులగు జీవులకును దేశక్షేమంబునకును ఉపయోగపఱచి దేహగేహాలోకయాత్రల నిర్వహించుటకుమాత్ర మావశ్యకమయిన విషయజాతంబును హితమితపథ్యంబుగ స్వీకరించి స్వార్థవిషయంబులగు భోగంబులవిసర్జించి మానవజన్మమును సాఫల్యమును గావించుకొనువాడు కృతజ్ఞుడయి యీశ్వరానుగ్రహమునకు బాత్రుడగును. అటుగాక స్వార్థపరాయణతచే విషయలోలుడయి భగవదుద్దిష్టములగు నాజ్ఞల గ్రహింపజాలక ప్రాణికోటికి మేలొనరింపక మనో బుద్ధీంద్రియవర్గమును అసద్విషయముల బోనిచ్చి భోగంబుల ననుభవించువాడు, కృతఘ్నుడయి పిదిని మేరలేని యిడుముల బడయును, కావున జగదీశ్వరుండును దీనజనావన తత్పరుండును ఆశ్రితభక్తజన కల్పశాఖియునగు నాపురుషోత్తముని భక్తితాత్పర్యంబున నాశ్రయించిన మనోమాలిన్యంబును విషయలోలుపతను బోగొట్టి జితేంద్రియతను మనోధార్ఢ్యమును ధర్మపరాయణతనిచ్చి ప్రోచుగాన నాపరమేశ్వరు నాశ్రయింపవలయు.

ముక్తినూతలపాటి గోపాలకృష్ణయ్య,
ఒంగోలు.

# నిర్మలత్వము.

## గృహములు.

మనము నివసించు గృహములను కట్టుటలోగాని క్రయమునకు తీసికొనుటలోగాని యోచించి పనిచేయవలయును. వానిని నేత్రరుపక పూర్వము ఇరుగుపొరుగు మంచిది యగునా కాదా యనియు నిర్మలవాయువు వీచునా లేదా యనియు విచారింపవలయును. మనము నివసించు గృహములయందు సూర్యరశ్మి సాధారణముగా నుండవలయును. మంచిగాలి వచ్చుచుండవలెను. ఇరుగు పొరుగువారలు సత్ప్రవర్తన గలవారయి యుండవలెను. అంగడివీధుల దగ్గరగాని మృగములను చంపు స్థలములసమీపమునగాని చెఱసాల దగ్గరగాని కసాయివారి అంగళ్ల దగ్గరగాని చాలామంది విహరించు ప్రదేశములందుగాని యెక్కువవర్తక వ్యాపారము జరుగు బాటలమీద గాని మోక్షమార్గమున ప్రవర్తింప దలచినవారి గృహము లుండతగవు. ఏలయన, అనేకమంది జనులు పలుతలంపుల నాస్థలమందు విడుచుచుందురు గాన నాతలంపులు మనయందు ప్రవేశించి బాధించి మనసంకల్పములను చెడుగా జేయగలవు. కాబట్టి మన గృహములను పరిశుభ్రమయిన ప్రదేశములయందు కట్టుకొనవలయును.

గృహములు పయికి నంద వికారముగా నుండగూడదు. వానిచుట్టును ఖాలీస్థల ముండవలయును. వానియందు చిన్నతోటలను నిర్మింపవలయును. మనకు బడలికగా నుండునపుడు ఆచెట్ల సమీపమునకు వెళ్లి వానినుండి వచ్చు నిర్మలవాయువుచేతను వానియం దుద్భవించిన పుష్పముల వాసనచేతను పచ్చికనేత్రోత్సవము సల్పుటచేతను మన శ్రమ పోయి మనస్సున కొకవిధమైన యానందము గలుగును. మనగృహముల సమీపమం దెక్కువ శబ్దము నుండగూడదు. ఆప్రకారముండుటచే మన సూక్ష్మమనోమ

ణు శరీరములు కదలిక గలిగి కొంతసేపటి వరకును పూర్వస్థితికి రాజాలవు.

గృహములను అలంకరించుటయందు యోచించి పని చేయవలయును. ప్రతిగదియందును పటముల నుంచవలయును. అందవికారముగల రాక్షసులయొక్కయు చూచుట కతిభయంకరమయిన మృగములయొక్కయు వస్త్రములేని స్త్రీలయొక్కయు పటములనుంచరాదు. ఏలయన వానిని మనమువీక్షించునపుడు మనలనుండి యొక విధమయిన తలంపు వానియందు జేరును. తిరిగి మన మాగదియందు సంచరించునపుడు ఆసంకల్పములు మనస్సునందు ప్రవేశించి మనస్సును కలతపెట్టును. ఆపటములయొక్క చరిత్రము లతిభయంకరముగా నుండును. వానిని తలంచునపుడు మనయందొక విధమైన భీతి పొడమును. కాబట్టి అటువంటి పటముల నుంచరాదు. దేవతల పటములను భగవంతునియొక్క అవతారము గలిగిన పటములను, మహానీయుల పటములను, గొప్పనదులను తోటలను కనబరచు పటములను ఉంచుటచే మనమువీక్షించునపుడు ఆనందము కలుగుట యేగాక ఆపటములు మనయందు మంచి తలంపులను కలుగజేయుచుండును. ఆపటములనుచూచినవారి చరిత్రములను కొంచము జ్ఞప్తికి తెచ్చుకొనినయెడల వారలు పూర్వకాలమందెటుల ప్రవర్తించియుండిరో యాప్రకారము నడుచుకొనుటకు మనకు కుతూహలము గలిగి ప్రయత్నింతుము.

గదుల నలంకరించుటలో నేవస్తువు నెచ్చోటనుంచిన నందముగా నుండునో ఆలోచించి నాయాస్థలములయందు వానినుంచవలయును. వానిని నిత్యము శుభ్రముచేయు చుండవలెను. ప్రతివస్తువు చూచుట కందముగా నుండవలెను. పచనముచేయు శాల కొంచము దూరముగా నుండవలెను. లేని యెడల వంటచేయునపుడు అగ్నినుండి వెడలు పొగ గదులయందు ప్రవేశించి

వానియందుండు వస్తువులను మలినము జేయును. కూర్చుండి పని చేయుటకొకటియు, పరుండుటకొకటియు, సామానులుంచుట కొకటియు, నీప్రకారముగ గదులు వేరుగా నుండవలయును. గృహములయందు నిరుగు పొరుగు వారలను పోగు చేసి లేనిపోని వ్యర్థప్రసంగమును జేయరాదు. ఇతరుల గృహములకుం దరుచు తిరుగుచుండరాదు. ప్రాతఃకాలమందు పూజ చేయుటకుగాను నొకగది వేరుగా నుండవలయును. ఆగదిని యెప్పుడును మూసి యుంచవలెను. దానిని దైవభక్తిగలుగ జేయు పటములచే నలంకరింపవలయును. సుగంధము లాగదియందుంచవలయును. ఆగదియం దెవ్వరిని రానియ్యగూడదు. మన మాగదిని మన ప్రాణసమానముగ నెంచుకొనవలయును. ఆప్రకారముగా నుంచినయెడల ఆగదియందు మనము ప్రవేశించునపుడు మన కొకవిధమయిన యానందము గలుగును. ఆగదిలో యాసీనులై యున్నపుడు మనము మంచితలంపులు గలిగి భగవంతునియందె మనస్సు నుంచవలయును. చెడు తలంపులు కలిగినయెడల వానిని పారదోలుటకు ప్రయత్నింపవలయును.

గృహములయందు రంగులు గల వస్తువులు వారియిష్టములకు ననుసరించునట్లు ఉంచుకొనవలయును. చక్కగా విచారించి చూచినయెడల యెక్కువ నలుపు రంగును ఎక్కువ యెరుపురంగును ఈ మొదలయిన రంగులు కొంచమసహ్యకరముగా నుండును. గులాబిరంగుగాని, ధూమ్రవర్ణముగాని, మేఘవర్ణముగాని, యే లేతరంగుగాని కంటికి నింపుగా నుండును. మోక్షమార్గమున ప్రవర్తింప దలచినవారు ఈరంగులతో పనిలేక శ్వేతవర్ణమును మాత్ర మంగీకరించెదరు. ఇది అన్నిరంగులలో గొప్పది. ఇది యశరీరత్వమును దెలుపును.

### ఆభరణములు.

సాధారణముగా ప్రతికుటుంబములోని స్త్రీలును ఆభ

రణములయందు మితిలేని యాసక్తిని గలిగియుందురు. వారలను సంతృప్తి చెందించుటకయి వారి కోరికల నీడేర్చుటకుగాను పురుషులు ప్రయాస పడుచున్నారు. ఆభరణములు ధరించుటవలన లాభమేమి? కంటికి నింపుగామాత్ర ముండును. నిష్పక్ష పాత బుద్ధితో విచారించిన యెడల శరీరముమీదబరువు బెట్టినట్లుగా నుండును. (సొమ్ములధరించుట స్వభావికమగుటచే భారమువహించినట్లగపడుటలేదు.) ఆభరణంబులు ధరించినందున సొమ్ములులేని నిరుపేదగువారలు అసూయత వహించెదరు. శరీరము విడుచునపుడాభరణములు వెంటనంటి రావను సిద్ధాంతమందరికిని గోచరమే గదా. వానిని శరీరమునుండి దీయుటయు ధరించుటయు నొకప్రయాసము. వానిని ఇతరులు తస్కరించినయెడల దీర్ఘవిచారము. అవి యున్నంతవరకును వానిని కాపాడుట దుస్తరము. అవసరమయినపుడు వానిని విక్రయించినయెడల చేయించునపుడు వ్రయము చేసిన సొమ్ము తిరిగి రాజాలదు. అవి ధరించినయెడల నొక శరీరమునకు మాత్రమె సౌందర్యము. అయితే యీశరీరము శాశ్వతమైనదా—కాదు. శాశ్వతమైనదాని నలంకరించుట మంచిదా—లేక యశాశ్వతమైనదాని నలంకరించుట యోగ్యమా—శాశ్వతమైనది యాత్మ—అశాశ్వతమైనది శరీరము. అశాశ్వతమైనశరీరమునకు వెండి బంగారు నగలు ఆభరణములు. శాశ్వతమైనయాత్మకు సత్ప్రవర్తనయు, దానధర్మములొనరించుటయు, పరోపకార మొనర్చుటయు, వాక్శుద్ధిగలిగియుండుటయు, దైవభక్తి గలిగియుండుటయు ఆభరణములు. బంగారు నగలు కొంతకాలమున కరిగిపోవును. ఈనగ లెన్నటికిని నరుగక మిగుల వన్నెగలిగి శరీరమునకొక విధమైన కాంతి నిచ్చును. కాబట్టి యీయిరు తెగల యాభరణములలో దేనియందెక్కువ ప్రీతిగలదో వానిని స్త్రీలుధరించి పురుషులను శోభగలుగజేయవచ్చును.

## ఆహారము.

మనుజులు నోటియందు వేసుకొను పదార్థములకంటె నోటినుండి వచ్చువాక్కు వారిగుణములను వెల్లడి చేయుచున్నదని యొకమహనీయుడు వచించియున్నాడు. మనము చేయు పనులయందును, ఉచ్చరించు మాటలయందును నెంతజాగరూకత గలిగియుందుమో, దానికి పదిరెట్లధికముగా మనము భుజించెడి యాహారము విషయమై జాగరూకతగా నుండవలయును. ఒకరు భుజించు ఆహారము మరియొకరికి హేయముగ నుండును. అందుచే మనుజు లెటువంటి యాహారమును భుజింపవలయునని జెప్పుట దుస్తరము. అయినను మోక్షమార్గమందు ప్రవర్తింపదలచినవారు ఏ యాహారమును భుజింపవలసినదియు, భుజించు నాహార మేమగునదియు దెసిలికొనుట మంచిది.

మనము భుజించిన యాహారము శరీరమందు ప్రవేశించి యక్కడ జీర్ణమై శరీరమునకు బలము నిచ్చుచున్నది. కాబట్టి ఆహారము భుజించుటలో బహుశుభ్రముగా నుండవలెను. ఇష్టము వచ్చిన పదార్థములన్నియు భుజింపరాదు. వానిలో మంచిగుణము నిచ్చునవి మాత్రము భుజింపవలెను. ఆహారమును పచనముచేయువారు పరిశుభ్రముగా నుండవలెను. వారు మంచిగుణము గలవారై యుండవలెను. ఏలయన, వారిచేతులనుండి యాకర్షణశక్తి (Magnetism) యాహారములోనికి పారుచున్నది. ఆ యాహారమును నితరులు భుజించిన వారి గుణములు భుజించినవారి కలవడుచున్నది. ఈకారణముచే నపరిశుద్ధముగా నుండు నితరుల ఇండ్లలో భుజింపరాదు. పూటకూళ్ళయిండ్లయందు అతి నిర్మలముగా నుండనందునను వంట చేయువారి గుణములు మంచివిగానుండక పోవుటచేతను భుజింపరాదు. ఆలాగు భుజించిన యెడల మనకు దుర్గుణము లలవడుట కవకాశము గలుగును,

మనుజులు పరిశుభ్రముగా నుండని యన్యజాతీయులతో

భుజింపరాదు. కారణమేమన, వారిప్రక్కన కూర్చుండి భోజనము చేయునపుడు వారి చెడుగుణములును వారి చెడుతలంపులును మనయందు ప్రవేశించును. కాబట్టి ఒంటరిగాభుజించుట యెల్లప్పటికిని శ్రేయస్కరము. మనము భుజించు పదార్థములు సాత్విక గుణము గలిగినవిగా నుండవలెను. వాటిని భుజించినందు వలన శరీరమునకు మత్తుగా నుండగూడదు. మనము ఈస్థూల శరీరముయొక్క క్షేమమును మాత్రమేగాక సూక్ష్మమనోమయ శరీరముల శ్రేయస్సునుగూడ విచారింప వలయును. ఏ పదార్థమైనను, ఎంత ప్రీతిగలిగినను, అది శరీరమునకు సరిపడనియెడల వర్జింపవలయును. మాంసము, ఉల్లిపాయలు ఈమొదలైన తమోగుణ పదార్థములు తినుటవలన సూక్ష్మశరీరము మొద్దగును. అందువలన మోక్షమార్గమందెక్కువ పరిశ్రమ యొనర్చి వృద్ధికాజాలము, తామసగుణము గలిగిన పదార్థములు వర్జించినందువలన మనుజునకు శ్రేయస్కరము. ఎక్కువ చింతపండును కారమును తినుటవలన కామము జాస్తియగును. అందువలన శరీరము బలముగా నుండజాలదు. మత్తెక్కు పదార్థములన్నియు వర్జింపవలయును. కల్లు, సారాయి, బ్రాంది మొదలైనపదార్థములు మనుజులను నశింపజేయును. వాటిని సేవించిన సమయములందధిక ఆనందముగ నుండినను నవి శరీరమునకు గలుగజేయు కీడులను దలంచినయెడల అమితవిచారము గలుగును. త్రాగుటవలన ధనమూ వ్రయమగును. శరీరమూ రోగముల పాలగును. అన్యులూ నిందించెదరు. ఈ సారాయిని విక్రయించు అంగడికి పోయి దానిచుట్టు మూగియుండు మనుజుల సూక్ష్మశరీరముల నొకసారి వీక్షించిన యెడల శరీరము కంపమొందును. త్రాగకుండినయెడల శరీరము రోగములపాలగు ననియు, మన జాలమనియు, వచింపుచున్నారు. ఏదైన నొకపని పలుమారు చేయుటచే నలవాటగును. ఆ యలవాటును మార్చుటకు

శక్తిలేనివారమా! మానుట యతి దుస్తరమైనను అభ్యాసముచే చక్కజేయవచ్చును. దీర్ఘరోగములను ఔషధసేవచే నివారణ జేయుటలేదా. ప్రపంచములో మనము జన్మించినందుకు శరీరము చక్కగా నుంచుకొని పరోపకార మొనర్ప వలయునని భగవంతుని సంకల్పము. అట్లుండ మనము భగవంతుని యాజ్ఞను ఏల మీరవలయును, శరీరము నేల పాడుజేసుకొనవలయును, పాపముల పాలేల కావలయును, దుఃఖము నేల యనుభవింపవలయును. కాబట్టి వీటిని వర్జించుట మన ధర్మము. శాస్త్రసమ్మతము. పూర్వకాలమందు గర్భిణిస్త్రీలు ప్రసవించిన తరువాత శీతలమును పొందకుండ కస్తూరి మొదలైన ఉష్ణపదార్థముల నుపయోగపరుచుట వాడుకయై యుండెను. పురాణవిద్య నభ్యసించిన లాభము విద్యావంతు లిప్పుడు వాటికి బదులు బ్రాంది నుపయోగపరచుచు దానిచే శరీరము నెక్కువ బలముగా నుండునని జెప్పుచున్నారు. తత్కాలమునకు శరీరము స్వస్థతగానుండినను తరువాత నిది యొనరించు కీడులనుగురించి దలచరు. అదివరలో నెన్నడును నెరుగనట్టియు త్రాగుటకు కష్టముగా దోచునట్టియు బ్రాందిని ఏల యుపయోగపరచి క్రొత్తయలవాటును యేల చేయవలయును? దివ్యతరమైన కస్తూరిని ఏల విసర్జింప వలయును. ఆంగ్లేయ విద్య నభ్యసించుటచే నిటువంటి నవీన దుర్గుణపూరితమైన మార్గమందు బ్రవేశింప వలయునా!

ప్రజలకు కఠినదుర్గుణములలో రెండవది గంజాయి, చుట్టలు మొదలైనవి త్రాగుట. చుట్ట త్రాగునపు డొకవిధమైన చెడు వాసన వచ్చి దగ్గర కూర్చుండువారి కసహ్యత కలుగజేయును, త్రాగువారినోటినుండి వెడలెడు పొగమేఘములను పిల్లలు చూచిన భయము చెందుదురు. ఆ పొగ సమీపమందుండు వారి ముక్కురంధ్రములయందు ప్రవేశించి వారిని త్రిప్పునట్లు చేయును. అన్యులసంగతి యటుండనిచ్చి స్వలాభమును విచారింతము. ధనమా వ్రయ

మగును. పొగచుట్ట త్రాగుటవలన శరీరము పాడగును. ఎముక గొమ్ము నెండిపోవును. నోటినుండి దుర్గంధము వచ్చుచుండును. సూక్ష్మశరీరము మొద్దగును. శరీరము విషపూరితమగును. వీటి యందు మద్యసారముండుటవలన శరీరము త్వరలో నశించును. ఈ యలవాటుగలవారు మోక్షమార్గమందెక్కువ దూరము పోజాలరు కాబట్టి వీనిని వర్జింపవలెను.

మనము భుజించు పదార్థములు శుభ్రముగా నుండవలెను. శుచిగా నుండుటయే యాచారమని జెప్పుదురు. ఈ యాచారమతి ఘోరకలిగా నుండగూడదు. మనస్సును నిర్మలము చేయుటకై బాహ్యనియమము లేర్పరుపబడియున్నది. శరీరము శుచిగా లేని యెడల మనస్సు నిర్మలముగా నుండజాలదు. అన్నము పాకము చేయు పాత్ర శుభ్రముగా లేనియెడల వానిలోనుండు పదార్థ మేల శుచిగా నుండును. నిర్మలమనస్సునకై శరీరమును శుభ్రముగా నుంచవలయును. శరీరమందేవిధమైన మలినమును ఉండగూడదు. మన ముపయోగించు పాత్రములన్నియు ధరించు వస్త్రములన్నియు శుభ్రముగా నుండవలయును. మనము భుజించు పదార్థములన్నియు శుచిగా నుండవలయును. ప్రతిదినము స్నానము చేయుటవలన శరీరములో మురికి పోయి శుభ్రముగా నుండును. ఇతరులు చూచినయెడల నసహ్యించుకొనరు. స్థూలశరీరము శుచిగానుండిన సూక్ష్మమనోమయ శరీరములు చక్కగా నుండగలవు. పనివారలు శుభ్రముచేసిన పాత్రలను, వారు ఉతికిన బట్టలను నీరు చల్లితీసుకొనుట శుభ్రతకొరకును, వారియందుండి ప్రవహించిన యాకర్షణశక్తిని తీసివేయుటకును యాచార మేర్పరుపబడి యున్నది. కొందరు జనులు ఆచారము నెక్కువగా గణించి తోమిన పాత్రను పది పర్యాయములు త్రోముచు, ఉతికినబట్టను చినుగునంతవరకు నుతుకుచు, గోమయముతో స్నానముచేసి, ప్రాతఃకాలమందా

వుపంచితమును త్రాగుచు మూఢభక్తి గలిగి యున్నారు. ఇటువం
టి భక్తి గలిగినందువలన శరీరమునకు శుభ్రతయేర్పడునేగాని
మనస్సు నిర్మలముకాజాలదు. ఆచారము లెక్కువగలిగి మన
స్సు నిర్మలము లేనియెడల లాభమేమి? మనస్సును చెడుగుణముల
లోను చెడుమార్గములలోను ప్రవర్తింపజేయకుండుట ఆచారము.
దీనికై యెక్కువ పరిశ్రమ జేయవలయును, ఇది ప్రధానమైనది.

వస్త్రములు.

మనము ధరించు వస్త్రములు బహుశుభ్రముగా నుండ
వలెను. వస్త్రములు మలినముగా నుండి చినిగినయెడల చూ
చువారి కసహ్యముగా నుండును. ధరించిన వస్త్రములనుబట్టి
మనుజుల గుణముల నేర్పరచెదరు. ఏ వస్త్రమును శరీరమందు
బిగువుగా ధరింపగూడదు. కంబలి గుడ్డల నుపయోగపరచిన
యెడల శరీరమందలి శీతోష్ణములు బయటికిని బయటనుండి
లోపలికిని పోజాలవు. ప్రతిదినమును శుభ్రము చేయదగిన వ
స్త్రములు ధరించినయెడల కడు రమ్యముగా నుండును. విలువగ
లిగిన దుస్తులను ధరించినయెడల లాభమేమి? ధనము మాత్రము
వ్యయమగును. అవి త్వరలో చినిగి పోవునని తరుచుగ ధరించుట
కు మనస్సొప్పదు. ధరింపక దాచిపెట్టిన పురుగు తినిపోవును.
మనము నిద్రించు పరుపులు మొదలైనవి బహుతెల్లగాను అద్ద
మువలె మలినములేకను ఉండవలయును. అప్పుడు మనకు
గాఢముగా నిద్రగలుగును. దుర్గంధము గలిగి నల్లగా నుండినయె
డల నిద్రపట్టజాలదు. కాబట్టి మనము భుజించు నాహారపదా
ర్థములును, ధరించు వస్త్రములును అతిశుభ్రముగానుండవలెను.
ఇందువలన మనస్సు నిర్మలముగానుండుట కవకాశము గలుగును.
మనస్సు నిర్మలముగా నుండుటచే అమితఆనందము గలుగును.

ముదునూరు శ్రీరంగయ్య

# ఉర్లాం శ్రావణి షష్టిపూర్త్యుత్సవము

ఈ శ్రావణ శుద్ధపూర్ణిమ మొదలు 3 రోజులు (ఆగష్టు ౧3 ౧౪ ౧౫ తేదులు) గంజాజిల్లా ఉర్లాం గ్రామమందు శ్రావణిషష్టిపూర్తి ఉత్సవము సవైభవముగ జరిగెను.

హిందూదేశమునందు విదేశీయ ప్రభుత్వమువలన నానాటికి హీనస్థితికి వచ్చుచున్న వేదశాస్త్ర విద్యలకు ఉర్లాం సంస్థానమువారు చాల ప్రోత్సాహము నిచ్చుచున్నారు. శ్రీవారి యాదరణము వేదశాస్త్రములందు పండితుల పరీక్షించి వారికి వార్షిముగ క్రొత్తద్రవ్యము నిచ్చుట అయి యున్నది. ఇప్పుడు ఉర్లాం సంస్థానమునందు తర్క-వ్యాకరణ వేద వేదాన్తాది విద్యలందు వార్షికముగ బహుమతులనందు పండితులు దాదాపు ౫౦౦ మంది గలరు. ఇందు వేదమునందు మాత్రము 3౫౦ పైగా గలరు. పొట్టకూటికి వేదవిద్యవలన లాభములేదని ఎరింగియు వేదవిద్యను అభ్యసించుట బ్రాహ్మణునకు విధియను తలంపుతో అత్యన్తపరిశ్రమతో వేదవిద్య నభ్యసించుచున్న బ్రాహ్మణోత్తముల నెవ్వరు సత్క-రింపరు? ఈ సంవత్సరము పరీక్షకుగాను ౧౮ ఘనపాఠులు వచ్చిరి. ౧౬ రు జయమందిరి. పిదప క్రమముగ:—

౧. శ్రీ. వై. కోటీశ్వర శర్మశాస్త్రిగారు ఆశ్రమధర్మములగూర్చియు, ౨. మహామహోపాధ్యాయి తాతాసుబ్బారాయ శాస్త్రిగారు స్వధర్మమునుగూర్చియు, 3. పేరి కాశీనాథ శాస్త్రిగారు పురుషార్థమునుగూర్చియు, ౪. వావిలాల శివావధానులవారు భక్తినిగూర్చియు ఉపన్యసించిరి.

బ్రహ్మశ్రీ నారాయణ దాసుగారు ఉత్తమరామ చరిత్రయందు సీతను అరణ్యమునందు విడుచుట కుశలవజననము దీనిని హరికథా రూపమున చెప్పిరి. సభ్యులందరు చాలసన్తసించిరి. సంస్థానపు దివానుగారగు బ్రహ్మశ్రీ జిల్లెళ్ల కృష్ణారావు పన్తులు

వారు చాలఓపికతో పండితులకు ప్రేక్షకులకు తగిన సదుపాయములను చక్కగా నేర్పాటుచేసిరి.

బ్రహ్మశ్రీ చాగంటిసీతయ్య శాస్త్రులవారు ఆచంటిసూర్య నారాయణరాజుగారు ఓలేటి పార్వతీశ్వరులగారు బాలాంత్రపు వెంకటాద్రిగారు వీరలు పద్యములతో సభనువర్ణించి ఆ పద్యములను ముద్రించిన గ్రంథములను సభ్యులకు పంచిపెట్టిరి. మామూలుగ పరీక్షాధికారులకు ఇచ్చెడి బహుమాన ద్రవ్యము శాలువలు నివ్వబడెను. పరీక్షింపబడిన పండితోత్తములకును ఇదివరకు పరీక్షింపబడి ప్రతిసంవత్సరము వార్షికము గ్రహించుచున్న పండితులకును బహుమానద్రవ్యము లివ్వబడెను. స్వధర్మ ప్రకాశినీ పత్రికాధిపతులగు శ్రీ. ద్వై. కోటీశ్వర శర్మశాస్త్రిగారికి రు ౧౧౬—౦—౦ వార్షికబహుమాన మొసంగబడెను. ఆంధ్రదేశమునందలి శ్రీమంతులును జమీందారులును ఇట్లె వేద శాస్త్రములను పరీక్షించి తగిన సత్కారము లిచ్చుచు ప్రోత్సాహము నొనర్తురేని మరల మన వేదశాస్త్రములు వెనుకటివలె యభివృద్ధి నొందగలవు.

మన పండితులు సకల విషయములందును శ్రమను వహించియైనను విద్యాభివృద్ధికి సహకారులు కావలయు ననియు శ్రీమంతుల మెప్పునకయి మోమోటములకు అశాస్త్రీయ విషయములందు ప్రవేశింపక యుందురేని శ్రీడుగ్లాం పురాధీశులవంటి విద్యాప్రియు లాదరింతురనియు గమనింతురుగాక.

## బాల్యవివాహములు.

శ్రీమతి ఆనిబిసెంటమ్మగారు ఇంగ్లీషుభాషతోఁ జెప్పిన యొకయుపన్యాసమును బ్ర॥ ఎం. వెంకట్రావుగారు తెనుగున వ్రాసి పుస్తకరూపమున బ్రచురించియున్నారు. ఈదేశమున కొన్ని వర్ణములయందు బ్రకృతమున ఆచారములోనుండు బాల్య వివాహముల వలని బాధలు ఇందు వివరింపబడి యున్నవి. ఇం దలి ముఖ్యాంశము లెవ్వియన:—ప్రాచీనకాలమున బాల్యవివా హము లాచారము నందుండినవిగావు. వేదములయందు బాల్య వివాహములు విధించియుండలేదు. ఇకాలమునను వివాహ కాలమునందు జెప్పబడెడు వేదమంత్రములవలన యౌవన దశప్రా ప్తించిన వధూవరులకు వివాహకర్మ విధించ బడినట్లు స్పష్టమగు చున్నదేగాని అజ్ఞానదశలో నుండు పసిబాలురకును బాలికలకు ను వివాహవిధి యేర్పడినట్లు ఎంతమాత్రమును సూచించుట లే దు. కొన్ని స్మృతులయందు బాల్యవివాహముల విధించు వా క్యము లుండుట యథార్థమేగాని ఆవిధులు అప్పటికాలసందర్భము లననుసరించి యేర్పడినవి. అందు గొన్ని ప్రక్షిప్తములు. అవియ న్నియు బ్రకృతధర్మములకు విరుద్ధములయి యున్నవి. వేదోక్త విధులన్ననో బ్రకృతి ధర్మముల ననుసరించియున్నవి. పూర్వకా లమున స్త్రీలకు వివాహము చేసుకొనునట్టు నిర్బంధములేదు. కొందఱు స్త్రీలు బ్రహ్మచారిణులయియుండి వేదాధ్యయనముచేసి బ్రహ్మవిద్యనయిత మభ్యసించిరి. గృహస్థాశ్రమము బ్రవేశింపగో రువారు యుక్తవయస్సువచ్చిన పిమ్మట వివాహముచేసికొని గృ హస్థధర్మముంజరిపిరి. అట్టివారికి గలిగిన స్త్రీపురుష ప్రజలు ధీరులును దృఢగాత్రులును ఆరోగ్యవంతులు నయియుండిరి. పసి బాలికలకు గర్భాధానము చేయుటవలన వారు కృశాంగులు ను రోగపీడితులు నగుటయగాక వారికి బుట్టుపిల్లలు తేజోహీను లును దుర్బలులును అల్పజీవితులునయి యుందురు.

Registered No. M. 716

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక

**A TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.)

సంపుటము 7. | October 1916 అక్టోబరునెల 1916. | సంచిక 7.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయి.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

# క్రొత్త గ్రంథములు.

## ౧. ఆర్యవిద్యారహస్యము. వచనము వెల ౦-౧౨-౦

మన యార్యావర్త దేశమునందు చిరకాలమునుండి వ్యాపించియున్న ౪ వేదములు ౪ ఉపవేదములు ౬ వేదషడంగములు ౬ ఉపాంగములు ౧౮ పురాణములు ఉపపురాణములు ౬౪ చతుష్షష్టికళలు మున్నగువానిని గూర్చిన వివరముగలదు. ఆయావిషయములనుగూర్చి ఆయుర్వేదము, పాకశాస్త్రము, అర్థవేదము, కామశాస్త్రము, ధనుర్వేదము, అశ్వశాస్త్రినికము, సాముద్రికము, గాంధర్వవేదము, అలంకారశాస్త్రము, రాగాధ్యాయము, సంగీతశాస్త్రము మున్నగునవి వివరింపబడినవి. అనగా ధనుర్వేదమునందు అస్త్రశస్త్రనామాదికములు వ్యూహనిర్మాణాది వివరణము సంగీత శాస్త్రమునందు రాగములు తాళములు స్వరములు మున్నగు వాని వివరము చక్కగా తెలుపబడినవి. ఇవియేగాక ఆయాశాస్త్ర ప్రవర్తకులయొక్క సంప్రదాయానుసారమగు చరిత్రయు, తత్తచ్ఛాస్త్రములను సంబంధించిన గ్రంథములనుగూర్చియు అతి సంగ్రహముగను చరిత్రయునిందువివరింపబడినది. ఇదివరకు ఇట్టిగ్రంథము ముద్రిపబడలేదు.

## ౨ ఈశ్వరదర్శనము. వచనము వెల ౦ ౧౨ ౦

ప్రకృతకాలమున ఎక్కడజూచినను వేదాంతులు విశేషముగా గనంబడు చున్నారు. తదర్థము వేదాంత గ్రంథములు సయితము ప్రచారమును పొందుచున్నవికాని యనధికారదశలో అగ్రంథముల విచారింపబూని తుదముట్టజాలక ఉభయభ్రష్టులగుచున్నారు. యాథార్థము నెఱుంగజాలకున్నారు. అట్టివారి యుపయోగార్థము ఉత్తర హిందూస్థాన దేశవాసులును సకలశాస్త్ర పారంగతులును అగు బ్రహ్మానంద సరస్వతీ యతీంద్రులవారు వేదములు, ఉపనిషత్తులు, పురాణములు మున్నగు వానియందచ్చటచ్చట సిద్ధాంతీకరింపబడియున్నను సమన్వయజ్ఞానములేనివారలకు కలుగు సకల సందేహములను పోగొట్టునట్లుగాను మీమాంసాగ్రంథముగా ౪ అధ్యాయములు సూత్రములుగ వ్రాసి వారే స్వయముగ విపులముగ భాష్యమునొసగినారు. ఆభాష్యమునను సులభశైలిలో ఆంధ్రభాషయందు వివరమును వ్రాసి ముద్రింపించారము. మేడనెక్కువానికి మెట్లుఎట్లుముఖ్యమో జీవన్ముక్తిదశను పొందగోరువారికి ఈగ్రంథమంత యావశ్యకమని చెప్పగలము.

N. B. కడపటి కాగితము చూడుడు.

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

**October 1916.**

సంపుటము 7. { అక్టోబరునెల 1916. } సంచిక 7.

## ధర్మము.

కడచిన జూలై నెల 29-30 తేదులయందు వేలూరులో చేరిన దివ్యజ్ఞానసభలో బ్రహ్మశ్రీ జం. శ్రీనివాసరావుగారు జరిపించిన యుపన్యాసము.

శ్లో॥ ధర్మఏవహతోహంతి ధర్మోవర్ధతివర్ధితః।
తస్మాద్ధర్మోనహంతవ్యో మానోధర్మహతోవధీత్॥

ధర్మమును వదలినట్లాయెనేని ధర్మము మనలను దుఃఖములపాలుచేయును. ధర్మమును వృద్ధిచెందించితిమేని అది మనలను వృద్ధిచెందించును. కాబట్టిధర్మమును వదలక మనము దుఃఖపడకుండ యుందుముగాక అని మనుస్మృతియందు చెప్పబడినది.

ధృతరాష్ట్రునికి విదురు డిట్లుపదేశించినాడు.

శ్లో॥ ఇదంచత్వాంసర్వపరంబ్రవీమి।
పుణ్యంపదంతాతమహావిశిష్టం।
నజాతుకామాన్నభయాన్నలోభాత్।
ధర్మంజహ్యాజ్జీవితస్యాపిహేతోః॥

ఓపుత్రిడా! అన్నిటికంటె శ్రేష్ఠమయినదొకటి చెప్పు చున్నాను. అది పుణ్యప్రదమయినదియు కేవలముత్కృష్టమైనదియు గానున్నది. కోరికె లీడేర్చుకొనుటకుగాని, ధనార్జనకుగాని, భయమువలనగాని తుదకుప్రాణము కాపాడుకొనుటకుగాని ఎప్పటికేగాని ధర్మమును మాత్రము వదలకుము.

ధర్మమునకింత యుత్కృష్టత ఎందుకియ్యబడినది? ఇట్లు శ్లాఘించుట కేమి కారణము?

"ధర్మోవిశ్వస్య జగతఃప్రతిష్ఠా"

ధర్మము జగత్తునకు ప్రతిష్ఠ కారణము అని నారాయణోపనిషత్తునందు చెప్పబడినది.

"ధారణాద్ధర్మఇత్యాహుః ధర్మోధారయతిప్రజాః"

ధరించుటచేత ధర్మమని చెప్పుదురు. ధర్మము ప్రజలను ధరించుచున్నదని మహాభారతమం దుదాహరించబడినది.

ధర్మముచేత జగత్తు నిలిచియున్నదని దీని ముఖ్యాభిప్రాయము. ధర్మము లేనట్లయిన జగత్తు ఉండజాలదు గనుక ధర్మమునకింత యుత్కృష్టత చెప్పబడినది.

ధర్మమన భగవదాజ్ఞ. జగత్తునం దంతయు భగవదాజ్ఞానుసారము వర్తించుచున్నదిగాని వేరువిధముగ వర్తించదు. భగవదాజ్ఞ అనినను భగవత్సంకల్ప మనినను భగవదిచ్ఛయనినను ఒకటే యని తెలియవలెను. ఎప్పుడు జనులు కేవలస్వప్రయోజనపరులై ధర్మమునకు (భగవదాజ్ఞకు) విరుద్ధముగ వర్తించుదురో అప్పుడే భగవంతుడు అవతరించి ధర్మవిరుద్ధముగ నడచువారిని శిక్షించి ధర్మమును (భగవదాజ్ఞను) ప్రతిష్ఠ చేయుచున్నాడని భగవద్గీతయందు భగవంతుడు ప్రతిజ్ఞ చేసినాడు.

శ్లో॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానంసృజామ్యహం।
పరిత్రాణాయసాధూనాం వినాశాయచదుష్కృతాం।

ధర్మసంస్థాపనార్థాయ సంభవామియుగేయుగే॥

ధర్మముచే కలుగు ప్రయోజనము.

ధర్మము ననుసరించి వర్తించుటచే రెండు ప్రయోజనము లు గలవు. అన్నిటికంటె ముఖ్యమయిన ప్రయోజనము జీవులు పశువర్గమునుండి మనుష్యజాతికి వచ్చినది మొదలు క్రమక్రమము గ అభివృద్ధియగుచు ఈశ్వర సములగుట.

శ్లో॥ కర్మాతిశయమాసాద్య పశోఃపాశపరిక్షయః।
ఏవంప్రక్షీణపాపస్య బహుభిర్జన్మభిఃక్రమాత్॥
భవేద్విషయవైరాగ్యం వైరాగ్యాద్భావశోధనం॥
భావశుద్ధ్యుపపన్నస్య శివజ్ఞానసమన్వయః।
జ్ఞానధ్యాననియుక్తస్య పుంసోయోగఃప్రవర్తతే।
యోగేనతుపరాభక్తిః ప్రసాద స్తదనంతరం।
ప్రసాదాన్ముచ్యతేజంతు ర్ముక్తశ్శివసమోభవేత్॥

పశువర్గమునుండి మనుష్యసమూహమునకు ఎక్కిన జీవులు విధ్యుక్తములైన కర్మములు అనేకజన్మముల చేయుటచే పాపములు నశించును. పాపనాశముచే విషయములందు వైరాగ్యము కలుగును. విరాగముచే సంకల్పశుద్ధి లభించును. సంకల్ప శుద్ధిచే శివజ్ఞానము (ఆత్మజ్ఞానము) బాగుగ తెలియును. జ్ఞానధ్యానములతో కూడిన వానికి యోగము ప్రాప్తమగును. యోగముచే అనన్యభక్తి యుత్పత్తియగును. భక్తిచేత పరమేశ్వర ప్రసాదము అనగా అనుగ్రహము ఘటిల్లును. దానిచే జీవులు ముక్తినొంది ఈశ్వర సములగుదురని వాయు సంహితయందు చెప్పబడియున్నది.

ధర్మాచరణచే కలుగు రెండవ ప్రయోజనము ఇహపరములందు సుఖము.

శ్లో॥ సుఖమిచ్ఛంతియేమూఢాః నేచ్ఛంతిసుఖకారణం।
నేచ్ఛంతిదుఃఖలేశంవా తద్ధేతోసతతంయతాః॥

మూఢులు సుఖమును కోరుచున్నారుగాని సుఖమునకు కారణ భూతమైనదానిని మాత్రము చేయరు. దుఃఖమునెవరును ఇచ్ఛయించరు దుఃఖహేతువులయిన కార్యములను మాత్రము సర్వదా యత్నించుచున్నారు. దుఃఖములనిచ్చు కార్యములను చేయుచు సుఖమనుభవించ వలెననుట విషమును త్రాగి అమృత ఫలమపేక్షించ నిశ్చయించిన పగిది నుండును.

శ్లో॥ సుఖమిచ్ఛంతిసర్వేహి తచ్చధర్మసముద్భవం।
తస్మాద్ధర్మస్సదాకార్యః సర్వవర్ణైఃప్రయత్నతః॥

అందరును సుఖమును కోరుచున్నారు. సుఖము ధర్మమువల్ల కలుగుచున్నది గనుక ధర్మమే యెల్లప్పటికి సమస్తవర్ణములవారిచేత చేయదగినదని దక్షస్మృతియందు చెప్పబడినది.

ధర్మమును ఏర్పరచినవారెవరు? అది ఎచ్చటనుండి వచ్చినది?

శ్లో॥ అస్యధర్మస్యసర్వజ్ఞః కల్పాదౌపరమేశ్వరః।
వ్యంజకః కేవలంవిప్రా నైవకర్తానసంశయః॥

కల్పాదియందు సర్వజ్ఞుడయిన పరమేశ్వరుడు ఈధర్మము ను బయల్పరచెను. దీనికి కర్త లెవరును లేరు. ఇందుకు సంశయము లేదని మత్స్యపురాణమందు చెప్పబడినది.

ఈశ్వరుడు ప్రళయమందు తనలో నణిగి యుండిన ప్రకృతిని సృష్టిసమయమున బయల్ పరచినపుడే ప్రకృతిధర్మములును బయల్పడెను గనుక ధర్మమునకు వేరు కర్త లేదని చెప్పబడినది. ఈశ్వరుడు ప్రకృతి తోడు లేక ప్రకాశింపజాలడు. ప్రకృతి తన గుణములను ధర్మములను వదలియుండదు. ఈ కారణముచేత సృష్టిసమయమున ఈశ్వరుడు ప్రకృతితోను ధర్మముతోను పరిణమించినాడని చెప్పవలసినదిగా నున్నది. ధర్మము ఈశ్వర సంకల్పమని పైన చెప్పబడెను. సంకల్పములు లోన ఉదయించును గాని బయట నుండిరావు గనుక ధర్మము ఈశ్వరుని యందుండి

వచ్చినదనుటకు సంశయములేదు. ధర్మము తెలియవలయు నేని ఈశ్వరసంకల్పము తెలియవలెను, ఈశ్వరుని తెలియక ఈశ్వరసంకల్పములు తెలియుట కలిపికాదనుట స్పష్టము. ఇట్టుండ ధర్మము తెలియుటెట్లు అని ప్రశంసకలుగుట సహజము.

శ్రుతి (వేదము) లో చెప్పినది పరమధర్మమని మితిలేని ప్రమాణములు గలవు. వేదమే ఈశ్వరసంకల్పము. అది ఈశ్వరునిలోనే స్థాపనయై యున్నది.

శ్లో॥ బ్రహ్మాణంమునయఃపూర్వం సృష్ట్వాశస్త్రైమహేశ్వరః
దత్తవానఖిలాన్ వేదాన్ విప్రాత్మనిసుస్థితాన్॥
బ్రహ్మణాచోదితోవిష్ణుః వ్యాసరూపీద్విజోత్తమః
హితాయసర్వభూతానాం వేదభేదాన్ కరోతిసః॥

అనగా మహేశ్వరుడు పూర్వము బ్రహ్మనుసృజించి తనలో బాగుగ స్థాపనయైయుండు సమస్తవేదములను ఆయనకు నిచ్చెను. ఆబ్రహ్మచే ప్రేరేపింపబడినవాడయి వ్యాసరూపమును ధరించిన విష్ణువు సర్వభూతహితముకొరకు వేదములను విభజించెనని మత్స్యపురాణప్రమాణము.

పరమేశ్వరుడు కల్పాదియందు జగత్తును తననుండి పరిణమింప జేసినపుడు తనసంకల్ప రూపకమయిన వేదమును, లేక వేదరూపకమయిన తనసంకల్పమును, బ్రహ్మకు తెలిపెనని దీని ముఖ్యాభిప్రాయము. అనగా జగత్తులో సమస్తమును ముందెవ్విధంబున ఉత్పత్తియై అభివృద్ధిజెంది లయము కావలయునో ఆ పటము (Divine plan) బ్రహ్మకు తెలిపెనని అర్థము. ధర్మమునకెట్టుకర్త లేదని చెప్పబడినదో ధర్మమే వేదమగుటనుపట్టి వేదమునకుకూడా కర్త లేడని ప్రమాణము లేర్పడినవి.

నకశ్చిద్వేదకర్తాచ వేదంశ్రుత్వాచతుర్ముఖః
తద్దైవధర్మాన్ స్మరతి మనుఃకల్పాంతరేంతరే॥

వేదమున కెవరును కర్తలు లేరు. చతుర్ముఖుడగుబ్రహ్మా వే

దములను వినుచున్నాడు. కల్పాంతరములందు మనువులు ధర్మ
మును స్మరించుచున్నారని పరాశర స్మృతియందు చెప్పబడినది.
దీనిచేతనే ధర్మము తెలియుటకు సర్వోత్కృష్టమయిన
ప్రమాణము వేదమని ఏర్పడినది.

వేదోక్తఃపరమోధర్మః ధర్మశాస్త్రేషుచాఽపరః
శిష్టాచారంచశిష్టానాం త్రివిధంధర్మలక్షణం॥

వేదమందు చెప్పబడినది యుత్కృష్టధర్మము ధర్మశా
స్త్రములందనగా స్మృతులలో చెప్పినది రెండవది. శిష్టులనగా
తెలిసినవారు పెద్దలాచరించునది మూడవది. ఇట్లు ధర్మములు
మూడువిధముల తెలియదగినవిగా నున్నదని తాత్పర్యము.

శ్రుతి స్మృతులు ప్రకటించినవారు భగవత్సంకల్పమును
తెలిసిన మహామునులు. వీరు బ్రహ్మవేత్తలగుటచే బ్రహ్మ (ఈశ్వ
ర) సంకల్పానుసారముగ జగత్తు అభివృద్ధిచెందుటకు ఈశ్వరు
నికి తోడ్పడు వారుగానున్నారు. వీరు చేసిన స్మృతులు జనులం
దరికి భగవదాజ్ఞానువర్తనకు సులభోపాయంబుగ నున్నవి.

శ్రుతింపశ్యంతిమునయః స్మరంతిచతదా స్మృతిం॥

శ్రుతిని మునులు చూచుచున్నారు, స్మృతులను స్మరించు
చున్నారని పరాశర స్మృతియందు చెప్పబడినది. వీరుచేసిన ప్ర
మాణగ్రంథములు దైవ సంకల్పమును (Divine plan) చూచి
వ్రాయబడినవిగాని బుద్ధిఊహతో చెప్పినవి కావు. కనుకనే ఈ
శ్వరుడయిన శ్రీకృష్ణులు అర్జునునికి అశ్వమేధపర్వమందు శ్రుతి
స్మృతులనుగురించి యిట్లు చెప్పినారు.

శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా యస్తానుల్లంఘ్యవర్తతే
ఆజ్ఞాచ్ఛేదీమమద్రోహీ మద్భక్తోపినమేప్రియః॥

శ్రుతిస్మృతులు నా ఆజ్ఞలు. ఎవరువానిని తిరస్కరించి నడు
చుచున్నారో వారు నా ఆజ్ఞను ధిక్కరించిన వారగుచురు. వారు
నాయందు భక్తిచూపినను నాకు ప్రియులుగారని తాత్పర్యము.

ఈప్రమాణములచేత శ్రుతిస్మృతులు భగవదాజ్ఞను తెలుపునవని స్పష్టమగుచున్నది. ఈకారణమును బట్టియే శ్రీకృష్ణులు అర్జునునికి భగవద్గీతయం దిట్లుపదేశించియున్నారు.

యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతేకామకారతః
నసనిద్ధిమవాప్నోతి నసుఖంనపరాంగతిం॥
తస్మాచ్ఛాస్త్రంప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వాశాస్త్రవిధానోక్తం కర్మకర్తుమిహార్హసి॥

ఎవరు శాస్త్రములలో చెప్పినప్రకారము చేయక ఇచ్ఛానుసారము వర్తించుచున్నారో వారు ముక్తిని చెందరు. ఇహమందు సుఖ మనుభవించరు, పరలోకమందు సయితము ఆనంద మొందరు గనుక ఇదిచేయదగినది ఇది చేయదగనిదియని నిశ్చయించుటయందు నీకు శాస్త్రమే ప్రమాణము. శాస్త్రవిధిని తెలిసి ఇకడ ఈలోకమందు కర్మచేయుటకు తగినవాడవగుదువు. అనితాత్పర్యము.

శాస్త్రములలో విధించిన వర్ణాశ్రమాది ధర్మములు భగవదాజ్ఞయగు మూలధర్మమును అనుసరించియున్నవి. భగవంతుని సంకల్పము బ్రహ్మాండమందుండు సమస్తమును తన బీజములేగనుక ఆబీజములన్నియు తనవంటి వృక్షములు కావలెననుట తప్ప వేరుకాదు.

మమయోనిర్మహద్బ్రహ్మతస్మిన్ గర్భందధామ్యహం
సంభవస్సర్వభూతానాం తతోభవతిభారత॥

నాకు యోనిమహత్తు, నేను ఆమహత్తునందు గర్భము ధరింప చేయుచున్నాను, దానినుండి సమస్తమయిన భూతములు పుట్టుచున్నవి, అని భగవద్గీత పదునాలుగవ అధ్యాయమందు స్వామి చెప్పియున్నాడు.

బీజములు వృక్షములగుటకు భూమి యెరువు నీళ్లు ఎండ గాలి కలుపుతీయుట లోనగునవి కావలసినట్లు భగవద్బీజము

మొలకయెత్తి వృక్షమగుటకును ప్రకృతిభేదములు మొదలగునవి అవశ్యములుగా నుండును. భగవద్బీజము ప్రకృతిలో ప్రవేశించి క్రమముగా సూక్ష్మావరణముతో కప్పబడి చివరకు అత్యంత స్థూలావరణమగు ఖనిజము ఆవరణములు కలదిగా నగును. అచ్చటనుండి మరియు క్రమముగ స్థూలావరణమును పెకలించుకొని భగవద్బీజ ప్రకాశమునకు తగినట్లు సూక్ష్మావరణములు కలదియై చివరకు పయావరణ మటంకములేక ప్రకాశించును. విస్ఫులింగము (మిడుగురు) మంటగా కావలయునేని మొదట తేలికగానుండు చెత్త పుల్లలు కట్టెలు పిమ్మట పెద్ద లావు మొక్కలెట్లు అవశ్యమో అట్లనే భగవంతుని మిణుగురులు ప్రజ్వలించుటకు ప్రకృతిలో ప్రవేశించుట అవశ్యముగానుండు. మొదట మిడుగురు గాలిసహాయముచే ఆకును కాల్చి తరువాత పుల్లలను తరువాత కట్టెలను చివరకు పెద్ద మొద్దులను కాల్చునట్లంత ప్రకాశమును జ్వాలయు వృద్ధియగునట్లు భగవంతుని అంశమగు జీవకళ ప్రకాశమునకు వచ్చుటకు మొదట భంగముగా నున్నట్లు తోచు ప్రకృతి భేదములను జయించుచు రావలెను.

ప్రకృతిని జయించు క్రమమే ధర్మశాస్త్రమందు చెప్పబడియుండు విధి.

వర్ణాశ్రమ ధర్మములు ఒకటిగా లేక తారతమ్యములుగా నున్నవనుట అందరికి తెలిసినదే. అందరికి నొకటేధర్మమెందుకుండకూడదని అనేకులు ఆక్షేపించుదురు. జగత్తునందందరు సమముగాలేక వ్యత్యస్తములుగా నుండుటనుపట్టి ధర్మములును వారివారి దేహమనోబుద్ధుల తారతమ్యానుసార మేర్పరుపబడినది.

ఒకకొండమీద నొక జ్యోతిని చేరుటకు అనేక వేలజనులు ప్రయత్నించుచున్నారని యూహించుడు. కొందరు కొండయొక్క మొదటిమెట్టుకూడా యెక్కక భూమిమీదనే మొదటిమెట్టుకు

సమీపమున నుండు వారును, కొందఱు మొదటి మెట్టుమీదను, మఱి కొందఱు రెండవ మెట్టుమీదను ఇటులనే ఒక్కొక్క మెట్టుమీద జనులు గుంపులు గుంపులుగా నుందురు. నూటయెనిమిది మెట్లెక్కిన వారికి జ్యోతి లభించునని తలంచుడు. మొదటి మెట్టెక్కిన వాడు నూటయెనిమిదవ మెట్టుమీదికి లంఘించుటకు యత్నించినట్లయిన మొదటి మెట్టెక్కుటకును సాధ్యము లేక కాళ్లు విరుగు చందంబున కఠినధర్మములు చేయ నలవి కానివారు ఆ ధర్మము లాచరించబోయిన స్వధర్మ మాచరించుటకు సైతము శక్తి లేని వారగుదురు. ఇట్టి అనర్థములు ప్రాప్తముగునని తలచి మహనీయులు లోకహితార్థమై వివిధజనులకు తగినట్లు వర్ణాశ్రమ ధర్మములేర్పరచినారు.

దీనిని పట్టి యోచించగా స్వధర్మమనగా తాను ప్రకృతమందుండు స్థితినుండి పైకి ఎక్కుటకు కావలసిన ధర్మమని స్పష్టమగుచున్నది. ఎవరు స్వసుఖము, స్వలాభము వదలి పరులకుగాను కష్టపడి పరులకు మేలును సుఖమును కలుగజేయుటకు సమర్థతకలవారో వారికి అంతకంటె కష్టముతో చేయతగిన కర్మ స్వధర్మముగా విధించబడినది.

బ్రాహ్మణులకు విధించిన కర్మ సామాన్యులు చేయుటకు కష్టముగా నుండును. వీరెల్లప్పటికి దేహేంద్రియ సుఖములు వదలి శీతోష్ణ మానావమానములు మొదలగు ద్వంద్వములకు చిక్కక సర్వభూతదయాపరులయి లోకోద్ధార కార్యములందే సర్వదా కాలము గడుపుచుండవలెను. ఇట్టివారినే పూర్వము బ్రాహ్మణు లనుచుండిరి గాని కేవలము శిశ్నోదర పరాయణులను కాదు.

సంప్రాప్తే దేహజాలాని కదాచిదిహ మానుషే।
బ్రాహ్మణ్యం ప్రాప్య తేజంతుః తత్పుత్ర పరిపాలయ॥

అనేకములైన మనుష్యేతర దేహము లెత్తిన తరువాత

ఒకానొకప్పుడు మనుష్యదేహము ప్రాప్తమగుచున్నది. అందులో బ్రాహ్మణదేహము శ్రేష్ఠము. హేపుత్రా, దానిని బాగుగ పరిపాలించుము. అని శ్రీవేదవ్యాసులవారు శుకమహామునికి చెప్పినట్లు శ్రీమహాభారతమందు చెప్పబడినది. బ్రాహ్మణదేహమును పాలించుట యనగా పడకనుండి లేచినతోడనే బెడ్ కాఫీ, తరువాత ఉప్పుపిండి, మొదలుగునవి తినుటచేతను, కోకో, టీ, త్రాగుట చేతను, 10గంటలకు గుచ్యమైన కూరగాయలు, పచ్చళ్లు, శాల్యాన్నము, చారుపులుసు, అప్పళములు సద్యోఘృతము పెరుగుతో భుజించుటచేతను, మరల 3 గంటలకు ఉపహారములు, టీ, కాఫీ గైకొనుటచేతను, మరియు రాత్రికి రుచ్యమైన భోజనము సాపడుటచేతను, పరుండుసమయమున మీగడతోకూడ పాలు త్రాగుటచేతను పెంచుటకాదు. మఱెట్లు పెంచవలెననిన వ్యాసులవారే శుకులకు ఇట్లు చెప్పినారు.

బ్రాహ్మణస్యతు దేహోఽయం న కామార్థాయజాయతే।
ఇహక్లేశాయ తపసే ప్రేత్యత్వనుపమంసుఖం॥

బ్రాహ్మణశరీరము కలిగియుండుట సుఖమనుభవించుటకుగాదు, మరెందుకు పుట్టినదన ఇచ్చట తపస్సుచేసి ఆ తపోఫలము సర్వభూతముల కొసంగి దేహము విడిచిన వెనుక నిరుపమానమైన సుఖమనుభవించుటకని తాత్పర్యము.

బ్రాహ్మణ దేహమునకు సుఖమొసంగుటచే దానిని హేళన అనగా తిరస్కరించినట్లును అవమానపరచినట్లును అగుచున్నదనియు, ఆదేహమును ఎల్లప్పటికి అధ్యయనము చేయుచు తపస్సొనరించుచు బాహ్యేంద్రియములను నిగ్రహించి లోకకుశల లోకక్షేమకార్యములకే ఉపయోగించుచుండవలెనన్నియు శుకుల వారికి వేదవ్యాసుల వారుపదేశించినారని ఈ క్రింది శ్లోకములు భారతమందుదాహరించబడినవి.

బ్రాహ్మణ్యం బహుభిఃతపోభిర్లభ్యతే।

తల్లబ్ధ్వానరతిపరేణ హేళితవ్యం।
స్వాధ్యాయేతపసి దమేచనిత్యయుక్తః।
క్షేమార్థీ స్సర్ కుశలపరస్సదాయతస్వ॥
ఈ శ్లోకముల అర్థము పైన వ్రాయబడినది.

బ్రాహ్మణులుగా నుండుట జగత్తునందు సమస్తమును తరింప జేయుటకే గాని స్వసుఖ మనుభవించుటకు గాదు.

బ్రాహ్మణాలోకసారేణ సృష్టాధాత్రాగుణార్థినా।
లోకాస్తారయతుంకృత్స్నాన్మర్త్యేష్వక్షితిదేవతాః॥

బ్రాహ్మణులు లోకసారముచే మనుష్యులందు దేవతలుగా సమస్తలోకములను తరింపచేయుటకు అనగా సంసారసముద్రమునుండి కడతేర్చుటకు సృజింపబడినారని భారతమందు చెప్పబడినది.

సముద్రములో మునిగి తేలుచుండు వారిని గడ్డ చేర్చుటకు నావ కావలెను. బ్రాహ్మణులకు నావయేది?

జప్యైర్మంత్రైశ్చ హోమైశ్చ స్వాధ్యాయాధ్యాపనేనచ।
నావంవేదమయీంకృత్వా తారయంతి తరంతిచ॥

వేదమునే నావగా చేసికొని వేదోక్తప్రకారము జపములు చేయుటచేతను, మంత్రములుచ్చరించుటచేతను, వేదాధ్యయనము చేయుటచేతను, ఇతరులకు చెప్పుటచేతను, హవిస్సును అగ్నియందు హోమము చేసి దేవతలను తృప్తిపరచి వృష్ట్యాదులు కురిపించుటచేతను నావికునివలె తాము దాటి ఇతరులను దాటించుదురని తాత్పర్యము.

బ్రాహ్మణులకు ముఖ్యమైన ధనము ఏది?

నైతాదృశంబ్రాహ్మణస్యాస్తివిత్తం।
యథైకతాసమతాసత్యతాచ।
శీలేస్థితిర్దండవిధానమార్జవం।
తతస్తతశ్చోపరమఃక్రియాభ్యః॥

ఏకత్వము అనగా నితరులను తన్నుగా చూచుట, సమత్వము అనగా శీతోష్ణసుఖదుఃఖ లాభాలాభ మానావమాన జయాజయములు మొదలగు ద్వంద్వములు ప్రాప్తించినపుడు వికలము చెందకుండుట, సత్యసంధత్వము అనగా అనృతమాడకుండుట, సదాచారమందు నిలుకడ, ఇంద్రియములను ఆటోపము లోనుంచుకొని యుండుట, ఋజుత్వము నిష్కాపట్యము వీనితో సమానమైన విత్తము అనగా ధనము బ్రాహ్మణునికి వేరులేదని శాంతిపర్వమందు చెప్పబడినది.

మఱియు విష్ణుపురాణమందు

సర్వభూతహితం కుర్యాత్ నాఽహితంకస్యచిద్విజః।
మైత్రీ సమస్తభూతేషు బ్రాహ్మణ స్యోత్తమంధనం॥

బ్రాహ్మణుడు సమస్తభూతములకు హితమునే చేయుచుండవలెను, ఏ భూతమునకు గాని అహితము అనగా చెరుపు చేయకూడదు, అన్నిభూతములందు మిత్రభావము బ్రాహ్మణునికి సర్వోత్తమమైన ధనమని తాత్పర్యము.

ఈ ధనము సంపాదించుటచేత నెవరికిని ఏలాటి బాధయు నష్టమును కష్టమును లేకుండును. ఈ ధనార్జనమునకు ఒకని ఆశ్రయించ నవసరముండదు. ఇది యత్నించువానికి తనలోనే పుట్టి పెరుగుచుండును. ఈ ధనము పెరిగిన కొలదిని తనకును తన కుటుంబమునకును ఇరుగుపొరుగువారికిని లోకమునకును సుఖ మధికమగుచుండును.

ఇట్టి పరమోత్కృష్టమైనదియు, సర్వభూతసుఖప్రదమైనదియు నగు ఈ ధనార్జనమునకు మారుగా కేవలము నశ్వరమైనదియు, అన్యజనబాధకరమైనదియు నగు సామాన్యవిత్తము సంపాదించుట కెప్పుడు బ్రాహ్మణు లుద్యమించిరో అప్పుడే తమధర్మము తప్పినవారై లోకమునకు భయ ముత్పత్తి చేసినవారైరి.

శ్లో॥ దురిష్టైఃదుర ధీతైశ్చదురాచారైః దురాగమైః।

విప్రాణాంకర్మదోషైస్తైః ప్రజానాంజాయతేభయమ్॥

బ్రాహ్మణులు తాము ఇచ్ఛయించదగిన యిచ్ఛలు వదలి యిచ్ఛయించ దగనవి యిచ్ఛయించుటచేతను, అధ్యయనముచే యవలసినది విడిచి చేయరానిది అధ్యయనము చేయుటచేతను, దుష్టాచారములు ఆచరించుటచేతను దురాగమనముచేతను ప్రజలకు భయము కలుగుచున్నదని మత్స్యపురాణమందు చెప్పబడినది.

ఇప్పుడు ద్రవ్యార్జనేచ్ఛ తప్ప లోకోపకారేచ్ఛచే తదను పుణ్యములగు పనులు సర్వదా చేయుచుండు వారెందరు గలరు? వేదాధ్యయనము లోకసంగ్రహార్థమే చేయు పరోప కారపరుల నెక్కడ చూడగలము? అనృతమాడక పరాపవాద ములు పలుకక, పరుషోక్తు లుచ్చరించక, పరదార పరద్రవ్యము లం దాశపడక, భూతసంఘములకు అహిత మొనరించక నుండు సాధుజను లెచ్చట వెలుగుచున్నారు?

ఇప్పుడేకర్మ చేయవలసి యున్నను, ఏవ్రతము సల్పవలసి యున్నను, ఏచదువు చెప్పవలసియున్నను, ఏ పురాణము విన పించవలసియున్నను ద్రవ్యమే ప్రధానముగాను లక్ష్యముగా నెంచియున్నారు.

ఇట్టివారు పాపిష్ఠులని మహాభారతమం దుదాహరింప బడినది.

ధర్మమర్థనిమిత్తంచ చరేయుర్యత్రమానవాః।
న తాననువసేజ్జాతు తేహిపాపకృతోజనాః॥

ధనమునకై ఎవరు ధర్మము అనగా శాస్త్రోక్తకర్మలు చే యుచున్నారో వారు పాపప్రవర్తకులు. వారి సమీపమున నుండ దగదని తాత్పర్యము.

ఇప్పుడు అర్థమే ముఖ్యలక్ష్యముగా నుంచి సర్వకార్యము లు చేయుచున్నారనుటకు సంశయము లేదు. బ్రాహ్మణాదివర్ణ ముల వారు తమధర్మము ఏలాటి ఇతరనిమిత్తమును లేక స్వభావ

ముగా అనువర్తించువారుగా నుండవలెను.

నధనార్థం యశోర్థం వా ధర్మస్తేషాం యుధిష్ఠిర॥
అవశ్యంకార్యఇత్యేవ శరీర స్యక్రియా స్తథా॥

సాధువులగు బ్రాహ్మణులు ధర్మమాచరించుట ధననిమిత్తముగాని, కీర్తికొరకు కాని కాదు, శరీరధర్మములనగా ఆహార నిద్రాదులయందు ఆయా సమయములలో నెట్లు సామాన్యజనులు స్వభావముచే వర్తింతురో అట్లనే నిజమైన బ్రాహ్మణులు పరశ్రమ నివారణకై స్వభావముచే వర్తించుదురని తాత్పర్యము.

దీని కొక దృష్టాంతము కలదు.

కాశీపట్టణమున నొక బ్రాహ్మణుడుండెను. ఆయన శివభక్తుడు. ప్రతిదినము మూడువేళలలో తప్పక పార్థివపూజ చేయుచుండెను. పూజ చేసిన తరువాత బిల్వాది నిర్మాల్యవస్తువులను గంగలో వేయుచుండెను. ఒకనాడు ఆపూజాద్రవ్యములో తేలు ప్రవేశించియుండెను. పళ్లెములో నుండిన నిర్మాల్యమును గంగలో వేయగా ఆ తేలు నీళ్లలో కొట్టుకొని పోవుచుండెను. అప్పుడా బ్రాహ్మణుడు దాని నెట్లైనను గడ్డను వేసి కాపాడవలెనను నుద్దేశముతో పళ్లెముతో గడ్డను త్రోయ పోగా ఆ తేలు చేతిమీదికి యెక్కి కుట్టెను. కుట్టినను దానికే బాధ చేయక ఆబ్రాహ్మణుడు గడ్డను వేసెను. అది తోడనే సమీపములో నున్న బొక్కలో దూరెను. గట్టున నిలిచి దీని నంతయు చూచుచుండిన ఒక స్త్రీ ఇట్లు ఆబ్రాహ్మణుని అడిగెను. ఓయి పిచ్చి బ్రాహ్మణుడా! ఎంత బుద్ధిహీనులైన నిట్టిపని చేయుదురా! తేలు దుష్టజంతువనునది నీకు తెలియదా? ఎవరు గాని దానిని చూచిన తోడనే చంపుదురు. నీవు అట్లు చేయక నిన్ను కుట్టినను లక్ష్యపెట్టక బాధపడుచున్నైన దానిని గడ్డకు వైచితివి, అది బొక్కలో దూరెను, ఇది బాలురు వృద్ధులు స్త్రీలు పురుషులెందరో వచ్చు చోటుగా నున్నది. ఆ తేలు ఎందరిని కుట్టి కష్టపెట్టునో తెలియదు. ఆదోషము నీకు

అంటదా యని పలుక దానికి ఆబ్రాహ్మణు డిట్లనెను. తేలు తాకినతోడనే కుట్టు స్వభావము కలది. బ్రాహ్మణునికి సర్వభూతములకు హితము చేయు స్వభావము. తేలు తనస్వభావము ననుసరించినట్లేను. నేను బ్రాహ్మణుడను, నాస్వభావము ననుసరించి నేను రక్షించితిని, నీ వేమియు వగచెదవని ఆమెను పంపెను. ఇట్లు స్వభావముగా తమ ధర్మమును చూపువారే బ్రాహ్మణులు.

స్వభావముగా బ్రాహ్మణులు ఆచరించదగిన ధర్మమును ఆచరించు వారిప్పుడెకట(-డ నున్నారు?

దివ్యజ్ఞానసభవారు ఈకాలమునకు ఇప్పటి సందర్భములకు, ఇప్పుడుండు జనులకు తగినట్లు ధర్మాచరణ సల్పుటకు ప్రయత్నము చేయుచుండ, నూతనముగా నేర్పడిన వర్ణాశ్రమ ధర్మరక్షణ సభవారు ఈదివ్యజ్ఞాన సభవారు చేయు బోధయు, ఆచరించు ఆచారములును శాస్త్రీయమైన వర్ణాశ్రమధర్మములకు విరోధంబనియు, వీరిని నమ్మదగదనియు, నిందించుచు వర్ణాశ్రమధర్మములు అత్యంత శ్రేష్ఠతమములనియు, వాటిని రక్షించుట సర్వోత్తమమైనకార్యమనియు అచ్చటచ్చట సభలుచేరి నిర్ధారణలు చేయుచు వానిని ప్రకటించుచున్నారు గాని ఆనిర్ధారణలు కార్యములందు పమాత్రమైనను చూపుటలేదు.

ఈ సభవారెన్ని అధ్యయనపాఠశాలలు స్థాపించినారు? ఎందరు బీదలకు విద్యనేర్పుటకు సహాయము లొనర్చినారు? ఎందరు తమబాలురను శాస్త్రప్రకారము బ్రహ్మచర్యధర్మములు సలుపుటకు గురుకులవాసము చేయించుచున్నారు? ఎందరు శాస్త్రములలో చెప్పినటుల శిష్యహితార్థమే విద్య గఱపుటకు గురువులుగా నేర్పడినారు? ఎందరు శాస్త్రరీత్యా తమ సంతానమునకు వివాహములు చేసి గృహస్థధర్మమువలంబింప చేయుచున్నారు? ఎందరు తమ గృహములలో గార్హ్యపత్యాగ్ని నునిచియున్నారు? వెయ్యిమాటలేల ఈసభవారు మాటలవారే

కాని కార్యము చేయువారు కారని తెలియుచున్నది. ఈ కాల దేశ సందర్భములనుపట్టి ఎంతవరకు శాస్త్రాచారములు ఆచరించవచ్చును, ఏ ఆచారములు ఇప్పుడాచరించుటకు సాధ్యమగును, ఎవి విడువవలెను అను విషయములు యోచించక శాస్త్రోక్తములైన వర్ణాశ్రమధర్మములు శ్రేష్ఠమైనవని చెప్పిన మాత్రమున ఫల మేమియు లేదు. కాలము మారినది, సందర్భములు మారినవి, వీనిని అనుసరించి పోవుటయే ధర్మముగాని విరోధముగ పోవుట ధర్మమెప్పటికిని కాదు.

శ్లో॥ భూమిర్నద్యోనగాశ్శైలాః సిద్ధాదేవామహర్షయః।
కాలం సమనువర్తంతే యథాభావాయుగేయుగే॥

భూమియు, నదులును, వృక్షములును, పర్వతములును, సిద్ధులును, దేవతలును మహర్షులును యుగభావము ననుసరించి అనువర్తించుచున్నారని మహాభారత అరణ్యపర్వమందు హనుమంతుడు, భీమసేనునికి చెప్పినట్లుదాహరించబడినది.

దేవతలు ఋషులు మొదలగువారే కాలము ననుసరించి పోవలసినప్పుడు ఈ సభవారెంతవారు?

రుచ్యమైన వివిధభక్ష్యంబులను నోటితో భుజించక నానా ప్రకారముల వర్ణించి పొగడినమాత్రమున ఏలాటి ప్రయోజనమెట్లు లేకుండునో అట్లనే వర్ణాశ్రమధర్మములు ఆచరించక అవిశ్రేష్ఠమైనవని నిర్ధారణలు చేయుటచే ప్రయోజనము లేకుండును.

శ్లో॥ అకృత్వాశత్రుసంహార మగత్వాఖిలభూశ్రియం।
రాజాహమితిశబ్దాన్నో రాజాభవితుమర్హతి॥

శత్రువులను సంహరించక సమస్త భూసామ్రాజ్యమును పొందక నేను రాజు ననుకొన్న మాత్రమున రాజు ఎట్లు కాజాలడో అట్లనే బ్రాహ్మణధర్మమగు లోకము నుద్ధరించు కార్యములు సేయక బ్రాహ్మణు డనుకొన్నమాత్రమున బ్రాహ్మణుడు కాజాలడు.

శృతియందు "సత్యం వద, ధర్మం చర" అని చెప్పబడినది. ఇప్పుడు అందరు మొదటి వాక్యముయొక్క మొదటి పదమును రెండవ వాక్యముయొక్క రెండవ పదమును మఱేది, రెండవ వాక్యముయొక్క మొదటి పదమునకు మొదటి వాక్యపు రెండవ పదమును చేర్చి "ధర్మంవద" అను వాక్యమును ఆచారమునకు తెచ్చినట్లగుపడుచున్నది. ఎవరు చూచినను ధర్మము చెప్పువారే గాని ఆచరించు వారు లేరు. బ్రాహ్మణులు వర్ణాశ్రమ ధర్మము లుత్కృష్టమైనవని చెప్పుట మాత్రముచే తృప్తులయి నారు. రాజులు నిష్పక్షపాతముగ జనుల రంజించుటకు సమష్టియందు జనులఅభీష్టములను నెరవేర్చెదమని ప్రకటించుటచే మాత్రము తమ ధర్మము నెరవేర్చినట్లాయె ననుకొని యున్నారు. వైశ్యవృత్తి వహించిన రైల్ వే యుద్యోగస్థులు రైల్ బండ్లగదిలో 8 మందికి మాత్రము ప్రతిగది యేర్పడినదని గదులలో వ్రాయుట మాత్రమున సంతసించి ప్రతిగదిలోను 12-16 మందిని నయితము త్రోయుచు "ధర్మంవద" అను మాటను మాత్రము పాలించుచున్నారు. ఇట్లు శృతివాక్యములను మార్చి చెప్పుటచేత మితిలేని అనర్థములకు కారణమై "ధర్మంవద" అనుట సిద్ధించినది.

"ధర్మంవద" అను వాక్యమును నెరవేర్చుట అందరికి సాధ్యము.

"ధర్మోపదేశ సమయేజనాస్సర్వేపి పండితాః ।
తదనుష్ఠానసమయే మునయోపి న పండితాః" ॥

ధర్మము నుపదేశించుటకు అందరు పండితులే, ధర్మమును ష్ఠించుటకుమాత్రము మునులును పండితులుకారని చెప్పబడినది.

ఇప్పుడు అన్నివిధముల ధర్మలోప మధికమగుచున్నది. వివాహవిషయముల చూచినచో ఆ యధర్మము చెప్ప నలవి కాకయున్నది. పసిబాలురకు వివాహము చేసి కేవల బాల్యదశలో గర్భాధానకర్మములు సలుపుటచే కలుగు కీడు ఇంతింతని చెప్పనలవి కాదు. పన్రెండు పదమూడేండ్ల పిల్లలను తల్లులుగాఁజేయు

కార్యము ఎట్టి కర్మ మనవలెను. ఈపిల్లలు పెరుగు కాలములో గర్భము ధరింపచేయుటచే, వారికి దేహపటుత్వము లేనందున గర్భవేదన భరించుటకు శక్తిలేక బహుమంది మృతినొందుదురు. బ్రతికి యుండినను పలురోగములకు చిక్కి సర్వదా బాధపడుచు ఏ కర్తవ్యమును చేయుటకు అసమర్థులై కుటుంబమునకును భూమికిని భారముగా నుందురు. వీరికి పుట్టిన పిల్లలెట్లుండునది మీరే యోచించుడు. నానావ్యాధుల ననుభవించుచు కేవల మర్భలేంద్రియులై ఏ మహాత్కార్యము చేయుట కసమర్థులై లోకబాధగా అల్పాయుస్సు గలవారై బ్రతుకుదురు. ఇట్టివారి బ్రతుకు బ్రతుకా? ఇట్టి కార్యములు అనుచితములని చెప్పువారిని నిందించుట యుక్తమా? శాస్త్రములందిట్టి కార్యములు అనుచితములని చెప్పలేదా?

ఊనషోడశవర్షాయామ ప్రాప్యఃపంచవింశతిం।
యద్యాధత్తేపుమాన్ గర్భంకుక్షిస్థస్స విపద్యతే।
జాతోవాన చిరంజీవేత్ జీవేద్వాదుర్బలేంద్రియః।
తస్మాదత్యంత బాలాయాం గర్భాధానం న కారయేత్॥

పదారు సంవత్సరములు నిండని స్త్రీయందు ఇరువదైదేండ్లు నిండనివాడు గర్భము ధరింపజేసెనేని ఆ గర్భము స్రవించనైనా స్రవించును, స్రవించక సంతానముత్పత్తియైన అది చాలాదినములు జీవించదు, జీవించినను దేహేంద్రియ పటుత్వములేక యుండును, గనుక అత్యంత బాల్యదశయందు గర్భాధానము చేయదగదని తాత్పర్యము.

పదారు సంవత్సరములకు ముందు రజోదర్శనమగుట స్త్రీలకు ఋతుచిహ్నము కాదని సయితము చెప్పబడినది.

ఋతుకాల మితిప్రోక్తంగార్గ్యాదిమునిసత్తమైః॥
స్త్రీచిహ్నం యౌవనంప్రాప్య షోడశేవత్సరేసదా॥

స్త్రీలు పదారు సంవత్సరములకు యౌవనముచెంది ఋ

తువగుటయే సర్వదా ఋతుకాలమని తలంచవలెనని గార్గ్యాది మునులు చెప్పినారని తాత్పర్యము.

ఇట్టి శ్లాఘ్యములైన ధర్మము ననుసరించి వర్తించుటకు తగిన ప్రమాణములుండ ఏదో తత్కాలమున కనుగుణమగు హేతువుచేత శాస్త్రములందు చేర్చిన ధర్మవిరుద్ధములగు వచనములను ప్రమాణములుగా నెంచి ఈశ్వరాజ్ఞాఘాతకులమై ఈ దేశమునకును, పవిత్రములైన వంశములకును, సర్వసుఖప్రదాయకంబులగు శాస్త్రములకును, శాస్త్రకారులగు మహర్షులకును అపకీర్తియు, అపవిత్రతయు, అప్రామాణ్యమును, నిందయు కలుగ చేసితిమే! ఇదేమి కర్మమనవచ్చును? ఆర్యవంశజులారా! భరతఖండమగు ఈ భూమాత, జమదగ్ని వశిష్ఠవామదేవాదిమహర్షులను, రామచంద్ర హరిశ్చంద్ర యుధిష్ఠిర అర్జునభీమాదులను, సీత దమయంతి అనసూయ మొదలగు వీరమాతలను కన్న తల్లిగదే. ఇట్టివారిని కని లోకఖ్యాతి గాంచిన ఈ భూమి మనబోటివారిని కని అపకీర్తిపాలై గోడాడుచున్నదే! ఆగోడు వినరాదా? కశ్యపాత్రి భరద్వాజాది వంశములలో పుట్టినవారమని దినమును ప్రవర చెప్పునపు డనుకొనుచున్నారమే? ఆ వంశములలో మనబోటివారుదయించుటచే నెంత అపవిత్రములాయెను? సత్యంబులగు శాస్త్రములు మనము ధర్మాచరణ వదలుటచేతగదా వానికి అప్రామాణ్యము కలిగినది? శాస్త్రకారుల మాట అసత్యము గాదోచినది? వీనికన్నిటికి మూలము ధర్మము వదలుటచేతగదా? మనము మనమాతృభూమియొక్క ఆశీర్వాదము పొందవలసియున్నను, కులములు పవిత్రము చేయవలసియున్నను శాస్త్రములకు ప్రామాణ్యము కలుగచేయవలసియున్నను శాస్త్రకారులగు ఋషులవాక్కులు సత్యమనిపించవలసియున్నను ఈశ్వరప్రసాదము పొందవలసియున్నను ధర్మాచరణ పదిలముగబూని అనువర్తించవలెను.

అనువర్తించుటకు ఇది ధర్మము ఇది అధర్మమని స్పష్టముగ నేర్పరచిచెప్పి అందరిని అనుష్ఠింప జేయువారు సర్వతత్వములను తెలిసి మహనీయులుగా నుండవలె గాని సామాన్యులు చెప్పిన నెవరును వినరు. ఇది మహనీయులుదయించి ధర్మప్రతిష్ఠ చేయుటకు సుసమయమనియు, అట్టిమహనీయుడు శీఘ్రముగనవతరించ బోవుచున్నాడని తెలిసి దివ్యజ్ఞానసభవారు అట్టిమహాపురుషుని రాకకు దారు లేర్పడుటకు సమస్తవిధముల ప్రయత్నించుచున్నారు.

సర్వమతములకు సామాన్యమైన బ్రహ్మజ్ఞాన ఆత్మజ్ఞాన విషయవిచారము పాత్రులకు కలుగజేయుటకు లోకమంతయు దివ్యజ్ఞానసమాజ శాఖలేర్పరచి తదనుగుణ్యములగు ఉపన్యాసములిచ్చుచు ఈ కాలమునకు ఈ జనులకు తగినట్టి పుస్తకములు ప్రకటించుచున్నారు. బాలురు నాస్తికావలంబకులు కాక యుండుటకు, స్వమతమందలి రుచి వదలకుండుటకు, స్వదేశ స్వకులాభిమానములు బాగుగ పట్టుబడుటకును తగినట్టి పాఠశాలలనేకములు స్థాపించియు, స్థాపించుచును ఉన్నారు. ఇది బ్రాహ్మణధర్మము కాదా? దీనికై వారు ప్రతిఫలాపేక్షలేక సర్వవిధముల పాటుపడుచుండుట ఎవరెరుగరు?

మరియు అందరు కడు నీచముగ చూచు హీనజాతివారని పిలువబడు పంచముల అభివృద్ధికై పాఠశాలలు నియమించి వారికి భోజనవస్త్రాదులకు సదుపాయము సాధ్యమైనంతలో ఏర్పరచి నానావిధముల ప్రయత్నించుచున్నారు.

ఇట్టి భూతదయాపరత్వము బ్రాహ్మణధర్మము కాదా? ఈ సభానాయకులు ఊరక మాటలాడుమాత్రము వారు కాదు. మొదట తామాచరించి ఇతరులాచరించుటకు ప్రోత్సాహపెట్టువారుగానున్నారుగాని తాము సర్వసుఖములనుభవించుచు ఇతరులను కష్టపడమని చెప్పువారు కాదు. వీరు నిజముగా ఆచార్యులుగా ను

న్నారు. ఆచార్యులన నెట్టివారు?

ఆచినోతిహిశాస్త్రాణి ఆచారేస్థాపయత్యపి।
స్వయమాచరతేయస్మా త్తస్మాదాచార్యఉచ్యతే॥

శాస్త్రములను చదివి విచారించి తాము ఆచరించుచు ఇతరులను ఆచరింపచేయువారు గనుక అట్టివారిని ఆచార్యులనుచున్నారని తాత్పర్యము.

దివ్యజ్ఞానసభాధ్యక్షులిట్టివారనుటకు సంశయము లేదు. మరియు వీరు రాజులు తమధర్మములను వదలకుండుటకు వారి లోపములను నిర్భయముగ యథార్థము తప్పక బయల్పరచుచు తమకెన్ని విధముల వారినుండి నష్టకష్టములు కలిగినను లక్ష్య పెట్టక మహాధీరులై సర్వజనుల క్షేమమే లక్ష్యమందుంచుకొని నీతిపదము లవలేశమైన తప్పక స్థైర్యము వహించియున్నారు.

శ్లో॥ నిందంతునీతినిపుణాః యదివాస్తువంతు।
లక్ష్మీస్సమావిశతు గచ్ఛతువాయథేష్టం।
అద్యైవమరణమస్తు యుగాంతరేవా।
న్యాయాత్పథ ప్రవిచలంతినధీరాః।

నీతి నిపుణులు అనగా నయతత్వకోవిదులు (నీతులు పలుకువారు) నిందించినను సరే స్తుతించినను సరే, విశేషము సంపద లభించినను లేకయున్నదంతయు నాశమయినను, తోడనేగాని లేక దీర్ఘకాలములోగాని మరణము ప్రాప్తింపనున్నను ధీరులు న్యాయమార్గమును మాత్రము వదలరని తాత్పర్యము.

ఇట్టి వారికి దృష్టాంతము శ్రీ ఆనిబిసంటమ్మగారనుటకు సంశయములేదు. అన్నివిధముల ధర్మప్రవర్తకులై లోకోపకారము చేయు ఇట్టి సభను దూషించుచు తెలియని వారికి సభను గురించి ఉపేక్ష కలుగజేయుట ధర్మముకాదు. సర్వదా ధర్మమే జయించును. ధర్మనిష్ఠులకు మనోదార్ఢ్యమును పరీక్షించుటకై మధ్య అనేక నష్టములు కష్టములు ప్రాప్తించును. ప్రాప్తించినను

వారు తమ నిష్ఠవదలక స్థిరముగ తదను వర్తనయందే నిలుకడగ నుందురు.

ఇందుకు ఒక కథ.

ధర్మిష్ఠుండగు ఒక రాజుండెను. ఆయన యొక సంత తన నగర సమీపమున ఏర్పరచి ఆ సంతకు తెచ్చిన సరుకులు వలయు వారందరు కొన్న తరువాత మిగిలిన దంతయు తనకు గాను కొని భండారమందు చేర్చి సమయము తటస్థించినపుడు వినియోగించు నట్లుత్తరువు చేసి యుండెను. ఇట్లు కొంత కాలము జరుగ తెచ్చిన సరుకు లన్నియు సెలవగుటనుపట్టి ఆసంతకు అన్ని వైపులనుండి నానావిధములగు సరకులు వచ్చుటచే లోకప్రఖ్యాతినొందెను. ఇట్లుండ ఒకానొక సంతకు ఒకడు కొయ్యతో నొక బొమ్మను సుందరముగ చేసి మెరుగైన వన్నె వేసి, అనేక గిల్టు ఆభరణములతో నలంకరించి, మంచి చీరగట్టి ఆబొమ్మను తెచ్చెను. దానిని కొను టకు జనులు అడుగ వాడు అత్యధికమైన వెలచెప్పెను. ఎందు కింత వెలచెప్పుచున్నావని అడుగ వాడు ఈ బొమ్మయందధికమైన మహత్తు కలదు, దీనిని కొని యింట నుంచిన వాని కళత్రమిత్రాదు లు మృతినొందుటే గాక ప్రపంచమందు దేహికి ఎన్ని కష్టములు న ష్టములు రాగలవో అవి అన్నియు ప్రాప్తమగునని చెప్ప దానినె వరును కొనక పోయిరి. రాజాజ్ఞానుసారము సంత ఉద్యోగస్తు డు వచ్చి ఆబొమ్మ వెల అడిగెను. అందరికి చెప్పిన వెలచెప్పి దా ని మాహాత్మ్యమును వానికెరుగించెను. ఆ యుద్యోగియు అందరి వలెనే కొనక వెళ్లెను. అప్పుడు ఆ బొమ్మను తెచ్చిన వాడు రా జును గురించి అమితముగ దూషించ నారంభించెను. అది రాజు విని ఎందుకు వాడట్లు దూషించుచున్నాడని విచారించ బంపెను. సంతకు అమ్మను తెచ్చిన సరకును కొననందున దూషించుచున్నా డని రాజున కెరుగించగా రాజు అందుకై నియమింపబడిన వాని రప్పించి విచారించగా వాడు దాని మాహాత్మ్యమిట్టిదని మనవి చేసి

అందువలన కొనలేదని విజ్ఞాపించెను. అప్పుడు రాజు మంత్రులను రప్పించి ఆలోచన యడుగ వారు అట్టి దురవస్థను కలుగజేయు పదార్థమును కొని యుంచుట అయుక్తమని చెప్ప వారిని పంపి తాను నెమ్మదితో కొంతదడవు ఆలోచించి నేను దానిని కొనకపోతి నేని ధర్మము తప్పువాడ నగుదును. "నృపతీశులకుఁ బొంకమి తొడవు" అని చిన్ననాడు బడిలో నీతిశతకములో చదివియుం టిని. చదివిన ప్రకార మాచరించిన కదా చదివినందుకు సార్థ కము, రాజులు మాట ఆడి తప్పుట ధర్మము కాదని ఆ నీతివా క్యము చెప్పుచున్నది. అది తెలిసి నేను ఆచరించక పోయినట్లయి న రాజనీతి తొలగినవాడ నగుదును. మరియు ధృతరాష్ట్ర మహా రాజునకు విదురుడు రాజధర్మమిట్లుపదేశించినాడు.

"ధనేనకిం యన్నదదాతిచాశ్నుతే,
బలేన కిం యేన రిపుంనబాధతే,
శృతేనకిం యేన నధర్మమాచరేత్,
కిమాత్మనా యేన జితేంద్రియోవశీ.

తానుకుడువక నితరులకిడకనుండువాని ధనముతో నేమిఫల ము, శత్రువును జయించ కుండినవాని బలముతో నేమికార్యము, ధర్మవాక్యములు విని ఆచరించకుండిన వినినదానితో నేమిప్రయో జనము. అంతః ఆత్మయుండియు ఇంద్రియములను జయించి వశప రచుకొనకున్నచో నేమి లాభము అని తాత్పర్యము. ఇదిగాక నేను ధర్మము తప్పితినా దేశములోనుండు ప్రజలందరు ధర్మము తప్పు దురు. "యథారాజా తథాప్రజా" యని వచనము గలదు, కనుక నేను ధర్మము తప్పనని దృఢమనస్కుడై ఆబొమ్మను కొని యింట నుంచమనెను.

దానిని ఇంటనుంచిన మూడవరోజే రాజుపట్టపుభార్య మృతినొందెను, అయిదవ రోజు కొడుకుచచ్చెను, ఎనిమిది రో జులలో సేన యంతయు తిరుగబడిరి. ఇంతలో పరరాజులు

దండెత్తి వచ్చుచున్నారని సమాచారము వచ్చెను. ఇట్లయ్యును తాను ధైర్యము చెడక, ఉద్యానవనమందు ఉపాయము ఆలోచించుచు పాదచ్ఛాయ వేయుచుండెను. అప్పుడు ఒక మహాప్రకాశముతో వెలుగుచు అతి సుందరవతియు, పతివ్రతామహిమ కాంతితో చుట్టబడి, దుఃఖాక్రాంతముచే కన్నీరొలుకించుచు పోవుచుండు ఒక స్త్రీని చూచెను. అంత నారాజు ఆమె సమీపమునకు వెళ్లి అమ్మా! నీవెవరు ఇంత దుఃఖముతో వెళ్లుచున్నావే, నీకెవరు ఏలాటి అపచార మొనరించిరి చెప్పుము, నీదుఃఖనివారణ గావించెదనని చెప్పగ నామె నేను లక్ష్మీదేవిని, ఇన్నివాళ్లు నీరాజ్యమున సుఖముగ నుంటిని, ఇప్పుడు నీవు నన్ను తిరస్కరించి అవమానపరచితివి. అందుకు నేనోర్వజాలక నీ రాజ్యము విడిచి వెళ్లుచున్నాననెను, అమ్మా ఇదేమివింత నేనెప్పటికి లక్ష్మీనారాయణుల పూజలొనరించువాడనే, నేనెట్లు నిన్నుతిరస్కరించి అవమానపరచితిని అనతిమ్మని రాజు మారుబలుక నామె ఓరాజా ఆబొమ్మను కొనియుంచిన నీరాజ్యమునుండి సకలైశ్వర్యములు తొలగిపోవునని చెప్పినను లక్ష్యముంచక దానినికొని యుంచితివి. సమస్త ఐశ్వర్యములకు నేను కదా మూలము. నాయందు గౌరవ ముంచక దానిని కొంటివి. తద్వారా నన్ను అవమానపరచితివి గనుక నేను వెళ్లెదనని చెప్పెను. రాజు ఎన్నివిధముల వేడుకొనినను వినక ఆమె ఆరాజ్యము దాటిపోయెను. వెంటనే ఒక మహాపురుషుడు పోవుచుండెను. ఆయనను మహారాజు ఎవరని ప్రశ్నచేసెను. దానికామహాపురుషుడు నేను నారాయణుడను, నీపూజలను గైకొని సంప్రీతుడనై నీరాజమందిరమున నుంటిని నీరాజ్యమునుండి లక్ష్మి వెడలెను, లక్ష్మీసమీపమున నేనెల్లప్పుడు వసించువాడను కనుక లక్ష్మిపోవుచోటికి పోవుచున్నాడ నని బదులు చెప్పెను. రాజు ఆయనను పలువిధముల బతిమాలినను గమనించక వెళ్ళిపోయెను. వెంటనే ఇంకొక లక్ష్మి

వంటి స్త్రీ నారాయణుని వెతకుచు పోవుచుండెను. ఆమెను రాజు నీవెవరని అడిగెను. ఆమె నేను ధర్మదేవతను "ధర్మస్య ప్రభురచ్యుతః" అని చెప్పబడినది, నాకు ప్రభువు నారాయణుడు, నా ప్రభువు నీరాజ్యము విడచివెళ్లెను, నేను కూడ ఆయన కడకేగెద నని చెప్ప నా రాజు క్రోధగ్రస్తుడై ఓ! నీవు నారాజ్యమందుండ దగిన దానవు కావు, నీవు పోకుండినను నేను వెళ్లగొట్టెద ననిన నామె ఏమిటిటు మాటలాడెదవన, నారాజు నేనెవ్వరిని నమ్మియుండలేము, నిన్ను మాత్రము నమ్మియుంటిని, నమ్మినవారిని విడిచిపోవు విశ్వాసఘాతకురాలు నారాజ్యమందుండదగదని పలికెను. అప్పుడామె తలవంచుకొని నేనిచ్చటనే ఉండెద ననెను. దానికారాజు సంతసించి నీవు ఒక్కతె యున్న చాలును, అందరు నిన్ననుసరించియుందురని ఆమెను గౌరవించెను. అనంతరము నారాయణుడు వెనుక తిరిగి చూడగా ధర్మదేవత వెంటనంటి రానిది చూచి, ఓహో! ధర్మదేవత అక్కడనే నిలిచెను, ధర్మము స్థాపించుటకే నేనవతరించినది, ఆధర్మదేవత ఉండుచోట నుండదగినవాడను నేనని నారాయణుడు మరల నారాజ్యములో ప్రవేశించి నిలిచెను. లక్ష్మియు నారాయణుడు లేక నేనెట్లుందును ౼ నని ఆరాజ్యమును పునః ప్రవేశించెను. అప్పటి నుండి ఆరాజు సకలైశ్వర్యములను సమస్త సుఖము లనుభవించుచు సర్వలోకములందు ప్రసిద్ధివెలిగెను.

గనుక

శ్లో॥ ధర్మఏవహతోహంతి ధర్మోరక్షతిరక్షితః।
తస్మాద్ధర్మోనహంతవ్యో మానోధర్మహతోవధీత్ ॥

ఉపన్యాసముసమాప్తము.

జం॥ శ్రీనివాసరావు.

# నిర్వాణ షట్క-స్తోత్రమ్.

మనో బుద్ధ్యహంకార చిత్తానినాహం,
నశ్రోత్రం నజిహ్వా నచఘ్రాణ నేత్రే
నచవ్యోమ భూమి ర్న తేజో నవాయు
శ్చిదానంద రూప శ్శివోహం శివోహమ్॥
నచప్రాణసంజ్ఞో నవై పంచవాయు
ర్నవాసప్తధాతు ర్నవాపంచకోశః
నవాక్పాణిపాదౌ నచోపస్థపాయు
శ్చిదానంద రూప శ్శివోహం శివోహమ్॥
నమేద్వేషలాభౌ నమేలోభమోహౌ
మదోనైవమే నైవమాత్సర్యభావః
నధర్మో నచార్థో నకామో నమోక్ష
శ్చిదానందరూప శ్శివోహం శివోహమ్॥
నపుణ్యం నపాపం నసౌఖ్యం నదుఃఖం
నమంత్రో నతీర్థం నవేదానయజ్ఞాః
అహంభోజనం నైవభోజ్యం నభోక్తా
చిదానంద రూపశ్శివోహం శివోహం॥
నమృత్యు ర్నశంకా నమేజాతిభేదః
పితానైవ మేనైవ మాతాచజన్మ
నబంధుర్నమిత్రం గురుర్నైవశిష్య
శ్చిదానంద రూపశ్శివోహం శివోహం॥
అహంనిర్వికల్పో నిరాకారరూపో
విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్
నచాసంగతం నైవముక్తిర్నమేయ
శ్చిదానందరూప శ్శివోహం శివోహమ్॥

:0:

# థియాసఫి (బ్రహ్మజ్ఞానము.)

థియాసఫి అనగా బ్రహ్మజ్ఞానము. ఇది యొక్కొక్క భాషలో నొక్కొక్క పేరుతో వ్యవహరింపబడును. గ్రీక్ జనులు దీనిని తియోసోఫియా అనియు, మహమ్మదీయులు తసౌవఫ్ అనియు, క్రైస్తులు నాస్టిసిజం అనియు, హిందువులు బ్రహ్మవిద్యా, పరా విద్యా అనియు చెప్పుదురు. వస్తువేమో ఒకటే, భాషలు వేరు వేరు, దానివలన ఆ యొక వస్తువునే అనేకపేళ్లతో పిలుచుట సహజము.

థియాసఫియొక్క పరమార్థము.

మనుష్యమాత్రుడైన ప్రతియొక్కడు చివరకు అనగా పర్యవసానమందు బ్రహ్మసాక్షాత్కారమును స్వయముగ పొందును అనుటయే థియాసఫియొక్క పరమార్థము; అనగా ప్రతియొక్కడు బ్రహ్మమువలె పూర్ణానుభవమును పూర్ణజ్ఞానమును పొంది పూర్ణశక్తితో వర్తించును అని యభిప్రాయము.

దేవుడు సచ్చిదానంద స్వరూపుడు; అనగా తాను ఎల్లప్పుడు శాశ్వతుడనేడు సంగతి స్వానుభవముచే తెలిసినవాడు, అన్నిటిని తెలిసినవాడు, ఆలాగు తెలిసియున్నానని ఎఱిఁగిన వాడు, పూర్ణశక్తుడుగానుండి, దాని నెఱిగినందువలన పూర్ణానందము గలవాడు. మనమందరము అతని కుమారులము. మనము ఈ దేహములు కాము. సచ్చిదానంద స్వరూపుడైన అతని అంశములుగ నున్నాము. అతనిశక్తులు అన్నియు మనలో బీజరూపముతో అణగి (ఇమిడి) యున్నవి. మనమన పరిపక్వమునకును, ప్రయత్నమునకును అనుసారముగ శీఘ్రముగానో, సావకాశముగానో కొన్ని జన్మములలోనో అనేక జన్మములలోనో ఎప్పుడైన ఒకానొక సమయమందు ప్రతియొక్కరు పూర్ణులము కాగలమని థియాసఫి బోధించుచున్నది.

థియాసఫియు స్వానుభవము.

ఈ బ్రహ్మజ్ఞానమును పెద్దలుచెప్పినారు గనుక ఒప్పవలె ననిగాని, పవిత్రమైన వేద శాస్త్రములు, కురాన్, బైబిల్, త్రిపిటిక, జెండవెస్ట మొదలైన గొప్ప గొప్పమతగ్రంథములలో చెప్పియున్నది గనుక నమ్మవలెననికాని, బహుకాలమునుంచి వచ్చినది గనుక నమ్మవలెనని కానికాదు. బ్రహ్మజ్ఞానము వట్టి నమ్మకము కాదు, వట్టిఒప్పికయు కాదు, చెప్పుట వ్రాయుటకాదు. వీనికన్నిటికిని మూలమైన స్వానుభవము. ఏది ఒకటి తెలిసినట్లైతే అన్నియు తెలియునో అది బ్రహ్మజ్ఞానము. పరోక్షజ్ఞానము కాదు, తన స్వంత అనుభవము; పుస్తక వ్యాసంగము కాదు, ఒకరు మరి ఒకరికిచెప్పి నేర్పు పాఠముకాదు. స్వయముగా ప్రయత్నము చేసి అభ్యాసమువలన పొంద తగిన అనుభవము.

చక్కెరయొక్క రుచి పుస్తక వ్యాసంగము వలనగాని గురుబోధ వలనగాని తెలియ తగినదికాదు, తాను తినిచూచుట వల్ల తెలియతగినది. బ్రహ్మజ్ఞానము సయితము అట్లనే. అనగా సరియైన పుస్తకమువల్లను గురువువల్లను ప్రయోజనము లేదని అర్థము కాదు, అవి రెంటిని గుఱుతుచూపు చేతిమానులని (Sign Posts) చెప్పవచ్చును. అవి రెండు సయితము అటువంటి పరమ శ్రేష్ఠమైన పదవి యొకటి ఉన్నదనియు, దానిని పొందు క్రమమును, దానికిగా చేయతగిన ప్రయత్నమును మనస్సుకు అంటునట్లుగా బోధించును. అయితే బ్రహ్మజ్ఞానానుభవము మాత్రము స్వప్రయత్నమువల్ల మాత్రమే రాతగినది.

థియాసఫియొక్క రెండవ అర్థము.

బ్రహ్మజ్ఞానము సకలమత శాస్త్రవేదాంత సిద్ధాంతముల యొక్క మూలము. బ్రహ్మజ్ఞానమువలననే ఎల్లమతములు శాస్త్రములు సిద్ధాంతములును వచ్చినవి. ఇవి అన్నియు దానియొక్క అనేకశాఖలు. దీనిలో బోధింపబడు తత్వములు సకల మత శా

స్త్ర సిద్ధాంతాముల తత్వములుగా నున్నవి. ఇవి అన్నిమతము లకు సమానము, ఇదే రెండవ అర్థము. ఒకరు మరి ఒకరికి నోటితోగాని లిఖిత మూలకముగ కాని బోధించ తగిన అంశము లన్నియు అపరావిద్యయే. పంచభూతములు మనస్సు బుద్ధి అహంకారము మొదలైన స్థూలసూక్ష్మ ప్రపంచములకు సంబంధించిన సకల వేదములు శాస్త్రములు అన్నియు అపరా విద్యయే. 63 విద్యలు అపరావిద్యలే.

బ్రహ్మవిచారము, ఆత్మవిచారము, ప్రపంచ విచారము, వీనియొక్క పరస్పర సంబంధములు మొదలైన వానినిగురించి, వాక్కుతోగాని గ్రంథముల మూలకముగ కాని బహిరంగముగ అందరికి తెలియునట్లుగా బోధించెడు బోధనలే వెలుపల అగుపడెడు ఎల్లమత గ్రంథములు శాస్త్రములు మొదలైనవి. కాల క్రమమున ఇవి అన్నియు మారుచుండును?

దీనిలో రహస్యభాగము ఒకటియున్నది. పూర్ణానుభవముగల జీవన్ముక్తుడైన మహాత్ముడును, మోక్షమార్గమును ప్రవేశించి ముక్తిస్థితికి సమీపస్థుడును నిజమైన గురువులు. వీరు స్వయముగా తమ దేహేంద్రియమనస్సులను తాముస్వాధీనము పరచుకొని, ఈశ్వర సంకల్పమును తెలిసి, దానికి అనుసారముగ తమ వర్తనములన్నిటిని ఉపయోగించుచు, ఆత్మానుభవమును జన్మాంతరానుభవమును స్థూలసూక్ష్మాది లోకాంతరానుభవములను కలిగినవారై లోకసంగ్రహార్థముగ శిష్యులను అంగీకరించుట కద్దు. అటువంటి గురువు స్వార్థమును వదలి, పరార్థమునకై పాటుపడుచు దేహేంద్రియ మనస్సులను శుద్ధిజేసి స్వాధీనమునకు తెచ్చుకొనుటకై ప్రయత్నించుచు చిత్తశుద్ధిద్వారా ఆత్మానుభవమును పొంది లోక సేవకుగా ప్రయత్నించుచు నుండు శిష్యునికి రహస్యముగా ఆయా శిష్యునియొక్క యోగ్యతా స్వభావ రుచిభేదములను పట్టి యోగ్యతానుసారముగ చిత్తశుద్ధి

క్రమమును బోధించుచుందురు. ఆ మూలకముగా శిష్యుడు మూల తత్త్వములను అనుభవమునకు తెచ్చుకొను మార్గమును బోధింతురు. ఇదే గుప్తవిద్య ఇదే రహస్యము. ఇవి రెండు అపరావిద్యలు. ఈవిధముగా బోధన పొందిన శిష్యుడు తనప్రజ్ఞప్రయత్నములకు అనుసారముగ జ్ఞానానుభవములును స్వతః పొందును. ప్రత్యక్షానుభవమే పరావిద్య.

4. థియాసఫీ బోధించు మూలతత్త్వములు.

థియాసఫీ యేదో యొక క్రొత్త మతమునైనగాని క్రొత్త తత్త్వమునుగాని బోధించుటలేదు. కేవల పురాతనమైన తత్త్వములనే క్రొత్తరీతిగా బోధలు చేయును. సర్వ మతములకును మూలమైన శాశ్వత తత్త్వములును బోధించును. బహుపురాతనమగు దానివల్ల నిండా అనుభవమందు మరచిపోయినటువంటి శాశ్వత తత్త్వములను ఈకాలమునకు తగినట్టు విద్యావంతుల మనస్సుకు చక్కగా బోధకు వచ్చునట్టుగా క్రొత్తరహాగా సవరించును.

థియాసఫీ బోధనచేయు మూలతత్త్వము లేవనగా:—

1. దేవుడు ఒకడే:—అన్నిమతములు దేవుడు ఒకడే యని చాటించుచున్నవి. ఒక్కొక్క మతమువారు ఒక్కొక్క భాషలో ఒకడైన దేవుని వేరేవేరే పేరులతో పిలుచుచున్నారు. సకల ప్రపంచము అతనినుంచి వచ్చి అతనిలోనే ఉన్నది. అణువు మొదలు బ్రహ్మపర్యంతము సమస్తచరాచర ప్రపంచమంతయు నిండియుండునది అతని చైతన్యమే; అన్నిబ్రతికియుండుట అతనిప్రాణశక్తివల్లనే; అతడు లేని సమయము లేదు; అతడు లేనిస్థలము లేదు; అతనికి తెలియని సంగతిలేదు; అతనికి చేత కాని పనిలేదు. అన్నిటిలోనను వెలుపలను నిండిఉన్నాడు. పర్వతములోని స్థైర్యగుణము అతనిదే; పెద్దతుఫానులోని పిడుగు, ఆకాశములోని అగాధతయును, సూర్యునియొక్క తేజస్సు

ను, సముద్రముయొక్క గాంభీర్యము, సూర్యోదయ సూర్యాస్తమయముల సౌందర్యమును, దంపతులలోనుండే ప్రేమయు ఈ అన్నిగుణములును అతనిదే. అతడు ఈ అన్నిటిలోను అంతటమీదను ఉన్నాడు. అతనిని విడచి ఒక్కటియు లేదు.

2. త్రిమూర్తులు—ఆ ఒకడయిన దేవుడు మూడుమూర్తులుగా ప్రపంచములో వ్యక్తమగు చున్నాడు. బ్రహ్మరూపముతో సృష్టిచేయును. విష్ణురూపముతో కాపాడును. శివునిరూపముతో పాతదైన వెలుపటివేషములను తీసివేసి క్రొత్తదయిన ఉత్తమసృష్టికి అవకాశము చేసియిచ్చును. ఈ పుట్టుట ఉండుట నాశమగుట యనెడు మూడుకార్యములును ప్రపంచమందు అన్నిదిక్కులయందును అన్నిటియందును ఎల్లప్పుడును సంభవించుచున్నది. ఈ త్రిమూర్తులయొక్క భావనను క్రైస్తవ మతమందు తండ్రి, కుమారుడు, పరిశుద్ధాత్మయనెడి మూడుపేరులతో పిలుచుచున్నారు. ఈవిధముగానే ఒక్కొక్కమతమందు ఒక్కొక్కవిధముగా త్రిమూర్తుల స్వరూపమును కార్యమును చెప్పుదురు.

3. దేవతలు—దేవునిసంకల్పమును తెలిసి అతడుచేయుచుండు సృష్టిస్థితిలయ కార్యములకు సహాయముచేయు దేవతలు అనేకులున్నారు. వారిని ఏంజల్స్అనియు అర్కేంజల్స్అనియు క్రైస్తవులును మహమ్మదీయులును పిలుతురు.

4. జన్మాంతరము—మనము దేహములుకాదు. మనము భగవదంశములము, శాశ్వతులము. దేహము మనది. పూర్వము అనేకస్థలములలో ఇట్టి దేహములను ధరించి అనుభవమునుపొంది ఇంత పెరిగినాము. ముందర ఇంకయు ననేక అనుభవములుసంపాదించ తగినదిగానున్నది. ఏలయన మనము దేవుని బిడ్డలము, అతనిలోనుండు శక్తులన్నియు మనలోనణగియున్నవి. అవి అన్నిటిని వృద్ధిచేసికొని సమస్తఅనుభవ గుణజ్ఞానశక్తులును పొంది దే

వునివలె పూర్ణులమై వర్తించుటకై వచ్చినాము. ఇంత పెద్దపని ఎంత ప్రయత్నము చేసినను ఒక జన్మములో సాధ్యము కాదు. గనుక పలుమారు అనేక స్థళములలో అనేక సందర్భములయందు అనేకవిధములగు మానవదేహములలో వచ్చి ప్రతియొక దేహమునందును ఎక్కువ ఎక్కువగా వృద్ధిజెందిన అనుభవ శక్తులతో పునః పునః [illegible]ంత విశేషముగా ప్రయత్నము చేయుచు చివరకు కొన్ని జన్మములలో ప్రయత్నానుసారముగ అతనివలె పూర్ణులగుదుము.

5. కర్మ:—మన ప్రయత్నములకు తగిన ఫలము లభించును. చేసిన పనికి ఫలము గాకనే పోదు. చేయని కార్యమునకు ఫలమెప్పటికిని రాదు. మనుష్య జన్మమెత్తినది మొదలుకొని పూర్ణులగు పర్యంతము ప్రతిజన్మమందును మనము చేయు ప్రయత్నమునకు తగినట్లు ఎదుగుదుము. ఇప్పటి మన అనుకూల ప్రతికూలములు, శక్తి అశక్తులు, తెలివి మోటుతనములు, సద్వాసన దుర్వాసనలు, సుగుణ దుర్గుణములు, ఇవి అన్నియు వెనుక మనము చేసిన ప్రయత్నములకు అనుసారముగ ఉండును. ఇప్పటి మన యత్నానుగుణముగా త్వరగా కాని సావకాశముగా కాని వృద్ధిపొందుదుము. ఇప్పుడు మనము ప్రయత్నమువల్ల మంచివానిని వేగవృద్ధిచేసికొని చెడ్డవానిని నిర్మూలము చేయవచ్చును. ఎక్కువ ప్రయత్నము చేసినట్టెల్ల త్వరలో వృద్ధిజెంది పూర్ణులు కావచ్చును. కర్మమనునది ఇతరులు మన నెత్తిమీద కట్టి మోపినగంటు కాదు. వెనుక మనము చేసిన ప్రయత్నమే. ఇప్పటి మన ప్రయత్నానుసారముగ వానిని వృద్ధిచేయవచ్చును. మార్చవచ్చును. ఎట్లు కావలసిన అట్లే చేసికొనవచ్చును. ఈ అంశము అన్ని లోకములకు అన్వయమవును.

6. లోకాంతరములు—ఇప్పుడు మన కన్నులకు కనుబడెడు ఈ లోకము ఒకటే కాక ఇంకయు అనేక సూక్ష్మలోకములున్నవి. ఒకటికంటె ఒకటి అతిసూక్ష్మములయిన అణువులచే ఏర్పడి ఒక

టిలో ఒకటై పాలు నీళ్లవలె కలిసి ఓత ప్రోతముగ నున్నవి. మానము భూలోకమందు పనిచేయుటకు ఇక్కడి అణువులచే పర్ప డిన దేహము ఏలాగు ఉన్నదో, అట్లనే సూక్ష్మలోకములయందు వర్తించుటకు ఆయాలోక అణువులచే పర్పడిన దేహములు కలవు. ప్రకృతము మూడులోకములలో వర్తించుచున్నాము. ఆయాలోకములలో ఆయా దేహములద్వారా పనిచేయుచు అక్క డి అనుభవజ్ఞానాదులను సంపాదించుచు క్రమక్రమముగా ఎ ల్లదేహములను స్వాధీనమునకు తెచ్చుకొని అన్నిలోకము లందు ను స్వతంత్రముగా పనిచేయు శక్తికలిగి పూర్ణులగుదుము.

7. సర్వసహోదర భావము—కొందరు ఎక్కువ జ న్మములను ఎత్తి విశేష అనుభవశాలులుగాను కొందరు కొద్ది జన్మములను ఎత్తి తక్కువ అనుభవము కలవాగుగను ఉ న్నారు. కొందరు కొద్ది జన్మములే యెత్తినను విశేష ప్రయత్న ము జేసి ఎక్కువ శక్తిజ్ఞానానుభవ శాలులయినారు. ఇతరులు అనేకజన్మము లెత్తినను వాటిలో ప్రయత్నము చేయక సోమరులు గానుండి కాలముగడిపి అల్పశక్తి జ్ఞానాదులుకలవారుగ నున్నా రు. గనుక లోకమునందుండెడి మానవులలో విశేష అనుభవము గల జీవులు, సామాన్య జీవులు, కొంచము అనుభవాదులుగల బాలజీవులు ఈప్రకారము నానాతరగతులుగా నున్నారు. గనుక ప్రతి మనుష్యుడు వానివాని జన్మముల సంఖ్యకు ప్ర యత్నముల కనుసారముగ కోట్యాంతర మెట్లలో ఒకొక టిలో ఉన్నారు. అయితే వారందరును ఈశ్వరాంశులయి అతనిచైతన్యమును పొంది పుట్టియుండుటవల్ల అందరు స హోదరులే గనుక క్రిందివారికి సహాయము చేయుటయు పైవారికి భక్తిని చూపుటయు సహజము. దీనిని మహాత్ములు మాత్రమే పూర్ణముగా చూపగలరు. తక్కిన వారందరు వారి వారి శక్తికొలది చూపవచ్చును.

లోకమందలి సమస్తచైతన్యము ఈశ్వరునిదే. ఆ ఒకటైన చేతనమును పొంది మనమందరము పుట్టినాము. గనుక ఎవరికి సహాయముచేసినను కొనకు అది మనకేవచ్చును; ఎవరికి ఏమి మేలు జేసినను అదియు మనకేవచ్చును. ఒకపాత్రనీళ్లలో వేసిన కొంచెము చక్కెర నీళ్లు అంతటపలాగు వ్యాపించునో ఆలాగుననే మనము చేయుమంచిగాని కీడుగాని లోకమంతట వ్యాపించి లోకమునకెల్ల మేలునో చేటునో జేయును. గనుక ఈ సహోదర భావమును తెలిసి ఇతరులమేలుకయి వర్తించుటయే మనుష్యుని నైజకర్తవ్యము, సర్వభూతములలో తానుండుటయు తనయందు సర్వభూతము లుండుటయును తెలిసి సర్వత్ర సోదరభావమును అనుష్ఠించుటయే బ్రహ్మానుభవమునకు ముఖ్యమార్గము.

8. మహర్షులు—ఈ మూడులోకములందును సంపాదించతగిన అనుభవము లెల్లను సంపాదించి జనన మరణ బంధమును తప్పించుకొని మూడులోకములలో ఎక్కడ ఏపనిగాని చేయుసామర్థ్యము కలిగియుండు దయాస్వరూపులయి పూర్ణులయి జీవన్ముక్తులయిన మహర్షులు ఉన్నారు, వారు ఈలోకమందే మనవలెనే దేహధారులయి యున్నారు. ఇక్కడ కామక్రోధములకు లోబడి అజ్ఞానమనెడి చీకటిలో దోపగానక తిరుగుచుండెడు మానవకోటికి మోక్షమార్గమును చూపి పూర్ణులై భగవంతునివలె లోకసేవానిరతులు కాదగిన మార్గమును వారు చూపుచున్నారు. వీరు ఈశ్వర సంకల్పమును లోకమందు నెరవేర్చుటకు బద్ధకంకణులైయున్నారు. ఈకార్యమందు వారికి సహాయసేవలను చేయు యోగ్యత సంపాదించవలెననెడి శ్రద్ధావంతులయిన వారిని శిష్యులుగా అంగీకరించి, వారిని శిక్షించి, బోధించి, తమవలెనే పూర్ణులగునట్లు చేయుచున్నారు.

కె. నరహరిశాస్త్రి.

# పరోపకారము.

లోకములోని సమస్తజనులను సృజించినవాఁడొక్క-ఈశ్వరుఁడే. ఆసర్వేశ్వరుఁడు మనలనందరిని పుట్టించినవఁడున మనకతఁడు తండ్రివంటివాఁడు. సృజింపబడిన మనమందరము పరస్పరము సోదరులమయి యున్నాము. ఒకకుటుంబములో కొందరసమర్థులయినను కుటుంబక్షేమము నిమిత్తమందరును పాటుపడుట ఎట్లు ధర్మమో, ఈశ్వర కుటుంబమయిన ఈప్రపంచమునందలి ఎల్లవారును సోదరభావమును వహించి పరస్పరానురాగము గలవారయి యన్యోన్యసహాయము చేసికొనుచుండుట యట్లే పరమధర్మము. మనము నడుమ తెచ్చి పెట్టుకొన్న జాతిమతాభిమానములను పూని యొకరినొకరు ద్వేషించుచు దూషించుచు పరస్పర సహాయులము కాకుండుట పాపమూలము.

భగవంతుని దృష్టియందు జనులందరును సమానులు. ఆయన తనబిడ్డలయిన సమస్తజనులను సమానమయిన దయతోనే చూచుచు కాపాడుచున్నాఁడు. ఆయన కాపని రాజని బ్రాహ్మణుఁడని పంచముడని ధనికుడని దరిద్రుడని పండితుడని పామరుడని హిందువని మ్లేచ్ఛుడని క్రైస్తవుడని వైష్ణవుడని చూడక ఎల్లవారికి సమానముగా కరచరణాద్యవయములను మనోబుద్ధ్యాదులను సుఖసాధనములను దయచేసియున్నాఁడు. రాజుల దివ్యభవనముల మీదప్రకాశించునట్లే బీదల గుడిసెలమీఁద కూడ సూర్యుడు నిత్యమును ప్రకాశించి వెలుతురు నిచ్చునట్లు చేసియున్నాడు. బ్రాహ్మణులకును పంచములకును నొక్క-రీతిగా నీరిచ్చునట్లు మేఘములను జేసియున్నాడు. వాయువెల్లవారును సమానముగా ననుభవించునట్లు చేసియున్నాడు. కాబట్టి ఈ భూతములన్నియు నీశ్వరాజ్ఞచేత మనకు జీతబత్తెములులేని పరిచారకులవలె విడువ

క సేవచేయుచున్నది. సూర్యుడు చమురుపోయని దీపమువలె కాలముతప్పక ప్రతిదినము వెలుగుచున్నాడు. వాయువు వీధులు మొదలగునవి శుద్ధిచేయుచు మనచెమ్మట లార్చుచు సదాపని చేయుచున్నది. అగ్ని మనచలి పోగొట్టి నీళ్లుకాచి పాకముచేయుచున్నది. భూమి యాహార పదార్థములను నిచ్చుచున్నది. ఈ ప్రకారముగా నొక్క-భూతములు మాత్రమేకాక ప్రపంచములోని సమస్తజీవరాసులును సమస్తచరాచరములును భగవదాజ్ఞచేత మనకందరకును సమానముగా నేదో యొకవిధమున పనిచేయుచు మనసుఖ సంతోషాదులకు సహాయపడుచున్నవి. దేవుడు ఈలోకమునకు బంపునపుడు మనలనందరిని సమానముగానే బంపియున్నాడు. శైవునిబిడ్డ విభూతిరుద్రాక్షములతో బుట్టడు. వైష్ణవునిబిడ్డ తుళసీనలినాక్షి మాలలతోబుట్టడు. రాజుబిడ్డ పీతాంబరముతోను కిరీటములతోను పుట్టడు. కాపుబిడ్డ గోచిపాతతోను కొడవలితోను పుట్టడు. చక్క-గా విమర్శించిచూచినయెడల భగవంతుని కెవ్వరియందును పక్షపాతములేదని విశదముకాక మానదు. ఆయన యుద్దేశానుసారముగా నెవ్వరుపాటుపడుదురో ఎవ్వరు సన్మార్గమున ప్రవర్తింతురో వారందరును భగవత్క-టాక్షమునకు పాత్రులయి సుఖసంతోషాదుల ననుభవింతురు.

అంతేకాక ఈశ్వరుడు మనుష్యులందరును స్వార్థ పరత్వమును విడిచి పరస్పరసహాయులయి పనిచేయునప్పుడే సుఖాతిశయమునుపొందునట్లు చిత్రముగా చేసియున్నాడు. రాజునకయినను బీదవానికయినను ఒక్క-దినము సుఖముగా జీవించుట కెందరిసహాయమో కావలసియుండును. శ్రీమంతులు భుజించుపంచభక్ష్యపరమాన్నముల కెట్లో నిరుపేదలు తినుగంజిమెతుకులకట్లే పలువురు భూమిదున్ని గింజలుచల్లి నీరుపెట్టి కలుపుతీసి కావలికాచి పంటకోసి కుప్పలువేసి ధాన్యముచేసి దంచి బియ్యముచే

సి పలువిధముల పాటుపడవలయును. ఒకకుటుంబములోని పలుప నులు చేయుటకు కుటుంబములోనివారు పాటుపడవలసినట్లే ఈ గొప్ప భగవత్కుటుంబమయిన ప్రపంచములోని వారందరు పర స్పర సహాయులయి సర్వజన సుఖార్థమయి పాటుపడవలయును. ఒక కుటుంబములో వ్యాధిగాని విపత్తుగానివచ్చినప్పుడు తక్కిన వారు నిద్రాహారాదులమాని వారి క్షేమనిమిత్తమయి పా టుపడునట్లే లోకకుటుంబములోను జనులన్యోన్య క్షేమనిమిత్తమ యి శ్రమపడుచు నొకరినొకరు మోసపుచ్చక యొండొరులకు కీడు చేయక వ్యాధులు మొదలయిన యాపదలు వచ్చినప్పుడు చేతనై నంత సహాయమును చేయుచు జాతిమత ద్వేషములనువిడిచి స ర్వజన యోగక్షేమార్థమయి శ్రమపడవలెను. ఈశ్వర దృష్టికం దరు సమానులే యైనను దేశక్షేమము నిమిత్తమయి కుటుంబము నందువలెనే జగత్కుటుంబమునందును సాధ్యమయినంతమ ట్టుకయినను మనమందరమును గౌరవతారతమ్యములుంచవలెను. దానికి వలయు భక్తి శ్రద్ధలు మనకియ్యవలెనని మనమందరము ను పరమ దయాళుడయిన పితామహుండగు నాసర్వేశ్వరుని గూర్చి ప్రార్థింపవలయును.

పద్మావతీబాయి.

:0:-

# బాల్య వివాహ గ్రంథము.

"బాల్య వివాహములు" అను పేరుతో థియసాఫికల్ లాడ్జు ఇన్‌స్పెక్టరు ఎమ్. వెంకటరావు అనువారు శ్రీమతి అనిబిసెంటుగారి యుపన్యాసమునకు ఆంధ్రభాషయందు భాషాంతరీకరణ మొనర్పబడిన గ్రంథమును విమర్శనార్థము మాకు పంపిరి. ఈ యుపన్యాసమునకు అగ్రాసనాధిపత్యమును హైకోర్టు జడ్జిగానుండు దివాన్ బహదూరు జస్టిస్ సదాశివయ్యగారు వహించిరి. వారుకూడా దీనినిగురించి కొంతచెప్పిరి. అదియు ఇందేగలదు. ప్రథమమున శ్రీ అయ్యరుగారి యుపన్యాసములోని భాగములకు మానుషదృష్టిలో నాకు తోచినంతవఱకు విమర్శ చేయుచున్నాడను.

"బహు పురాతనమయి విరుద్ధవాక్యములతో గూడిన శాస్త్రార్థవిషయమై మీకు సందేహము కలిగినప్పుడు మీరెట్లువర్తించవలయునో తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడియున్నది యెట్లన:-

"పరాపరజ్ఞానముగలిగి మూఢాభిప్రాయములులేక సత్యాన్వేషణ పరులైయుండు దేవాంశ పురుషుల సమాజమునకు వెళ్లి వారు నిశ్చయించు శాస్త్రార్థమును ప్రమాణముగా గైకొనుము" అని చెప్పబడినటుల ఈ గ్రంథమున గలదు.

తైత్తిరీయోపనిషత్తునందు ఫలానివాక్యమని నిర్ణయింపనందువలన వీరేవాక్యమునకు పైయర్థమును వ్రాసినారో చెప్పజాలనుగాని ఇదే యర్థముగల వాక్యముమాత్రము ఆ యుపనిషత్తునందు లేదు. ఈ ఛాయగల వాక్యసముదాయముగలదు. ఆ వాక్యముయొక్క భాషాంతరీకరణము నీ క్రింద నిచ్చుచున్నాడను:—

నీవు (శ్రౌతస్మార్తాది) కర్మములను గూర్చిగాని (కుల పరంపరాగతమగు లౌకిక) ఆచారమును గూర్చిగాని (ద్వివిధముగా

నుండు నెడల దేని నాచరింపవలయునను) సందేహము కలిగిన యెడల అప్పుడు ఆ సమయమునందు ఆ కులమునందు సమ్మర్శులును, యుక్తులును, ఆయుక్తులును, అలూక్షులును ధర్మకాములును అగు బ్రాహ్మణులు ఆ (సందేహ) విషయమునందు ఏవిధముగ చరింతురో నీవును అట్లే చరింపుము అని తై. ఆరణ్యకం ౭ వ ప్రశ్నము ౧౧ వ అనువాకములోనున్నది.

౧. సమ్మర్శులనగా రాగము, ద్వేషము, ఔత్సుక్యము, అనగా తనకభిమతమగు దానియందే ప్రయత్నించుట లేక చక్కగ శాస్త్రవిషయమును నిర్ణయించుటకు సమర్థులు. ౨. యుక్తులనగా తమకు విధింపబడిన నిత్యనైమిత్తిక కర్మలను ఒకరి ప్రేరణములేకయే స్వయముగ ఆచరించువారలు. ౩. అయుక్తులనగా ఎట్లో ఆకర్మల నాచరింతమనిగాక యథాశాస్త్రీయముగ నాచరించి తీరవలయునను పట్టుదల గలవారలు. ౪. అలూక్షులనగా:—క్రోధముగాని ఆగ్రహముగాని లేనివారలు. ౫. ధర్మకాములనగా ధర్మమునే కోరువారలు, జనులవల్లనుండి ధనలాభమునుగాని సన్మానమునుగాని కోరనివారలు అని సాయనాచార్యులవారు భాష్యమునందు వివరించినారు.

మూలవాక్యముకూడ ఈక్రింద ఇచ్చుచున్నాడను.

అథయది తే కర్మవిచికిత్సావా వృత్తవిచికిత్సావాస్యాత్
యేతత్ర బ్రాహ్మణాస్సమ్మర్శినః యుక్తా ఆయుక్తాః
ఆలూక్షా ధర్మకామాస్స్యుః యథా తేతత్ర వర్తేరన్
తథా తత్ర వర్తేథాః॥

ఇటులనుండగా ఈ దేవాంశ పురుషుల సమాజమునకు వెళ్ళి మున్నగు కల్పనలు అయ్యగారు కల్పించిరో లేక భాషాంతరీకరణము చేసినవారు కల్పించిరో తెలియుటలేదు, లేక ఆ తైత్తిరీయ ఉపనిషత్తునందే మరొక వాక్యము దేనిని గ్రహించిరో తెలుపుట బాగుగానుండును.

బాల్య వివాహముల విషయమై కీర్తిశేషులగు శ్రీరఘునాథరావుగారి యభిప్రాయములను వ్రాసినారు. రావుగారి యభిప్రాయములన్నప్పుడు మనము విమర్శించుట న్యాయముకాదు. అయ్యరుగారు తైత్తిరీయోపనిషత్తులోనిదని వెనుక చెప్పిరి కావున ఆ యుపనిషత్తునందేమియున్నదో విమర్శించితిని. పిదప అయ్యరుగారు తమయుపన్యాసము నుపసంహరింపుచు బిసాంటుగారిని గురించి "ఈమె యభిప్రాయములు వస్తుతః శాస్త్రసమ్మతములయి యున్నవని నేను నమ్ముచున్నాను............హిందువులందఱును నీయుపన్యాసకర్త్రి వాక్యముల నాలకించి వర్తింతురుగాక యని వేడెద" అని చెప్పినారు.

దీనివలన అయ్యరుగారికి వేదశాస్త్రములందు విశ్వాసమున్నటుల స్పష్టమగుచున్నది. ఆ వేదశాస్త్రములను శుష్కతర్కములచేత విమర్శింప దగదనియు, వేదవేదాంగములను నిష్పక్షపాతబుద్ధితో అభ్యసించి నిష్పక్షపాతబుద్ధితో శాస్త్రములను విచారింపవలయుననియు అయ్యరుగారి యుపన్యాసములోనే ఒకచోట వాక్రుచ్చియున్నారు. ఈ విషయమును శ్రీబిసంటుగారెంతవఱకు అవలంబించినారో విమర్శించుకొందము. పై సంఖ్యయందు బిసాంటుగారి యుపన్యాసమును గూర్చి వ్రాసెదను.

మార్కండేయశర్మ.

గుంటూరు.

## ౩ సనత్సుజాతీయము సశంకరభాష్యము ౦—౧౨—౦

సనత్సుజాతులవారు ధృతరాష్ట్రున కుపదేశించిన తత్త్వవిషయకమగు గ్రంథము. శ్రీమన్మహాభారతమునకు చేరినది. శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు భాష్యమును వ్రాయుటచేతనే ఈగ్రంథముయొక్క మహిమను మనము గ్రహింపవచ్చును. ఇంతవఱకు భాష్యసహితముగగాని ఒట్టిమూలముగాని ఆంధ్రాక్షరములతో ముద్రింపబడి యుండలేదు. మహాప్రయాసముతో సంపాదించి సంస్కృత భాష్యము ఆంధ్రప్రతిపదటీక తాత్పర్యములతో ముద్రించినారము

పై మూడుగ్రంథములను ఒకపర్యాయముకొను దివ్యజ్ఞానదీపికా చందాదారులకు గ్రంథభాండాగారములకు రు ౨—౦—౦ లకే ఇచ్చెదము.

౪. తొట్టివైద్యగ్రంథములు, ఇతరగ్రంథములును మావద్ద లభించును.

౫. హఠయోగ ప్రదీపిక సాంధ్రతాత్పర్యము. యోగాసన పటములతో సహా ... రు ౩—౦—౦

౬. రాజయోగ రత్నాకరము ... ౨—౦—౦

ఇతరగ్రంథములు లభించును.

౭. జగద్గురు ఆదిశంకరాచార్యపటము ౪ శిష్యులతో సహా సైజు 16 × 14 ౧—౦—౦

౮. గాయత్రి ధ్యానశ్లోకసమేతము ... ౦—౬—౦

౯. ప్రాతస్సంధ్య, మధ్యాహ్నసంధ్య, సాయంసంధ్య, వీటి ఒక్కొక్కటి ౦—౬—౦

౧౦. పై ౫ పటములు ౧ పర్యాయము కొనువారలకు ౨—౦—౦

వలయువారు,

మానేజరు స్వధర్మప్రకాశిని, గుంటూరు అని వ్రాయునది.

# Divyagnanadeepika.

CONTENTS OF THIS NUMBER.



---:o:---



## చందాదారులకొక విజ్ఞాపనము.

చందాదారులు మాకు ఉత్తరములు వ్రాయునప్పుడు వారి నంబరు తెలియపరచవలయును. ప్రతిచందాదారునికి ఒక్కొక్క నంబరు ఇవ్వబడి అడ్రెసులోకూడా అచ్చువేయబడియున్నది ఆనంబరు తెలియపరచవలయును. లేనియెడల రిజస్టరులో ఆపేరు కనిపెట్టుటకు సాధ్యముకాదు. కొందరు నం 716 అని వ్రాయుచున్నారు, అది చందాదార్ల నంబరుకాదు. చందాదార్ల నంబరు చక్కగా గమనించి తెలిసికొనవలయును. మాకు వ్రాయు ఉత్తరములు అక్షరములు విడి విడిగా వ్రాయవలయును. అడ్రెసు వివరముగా వ్రాయవలయును. కన్నడ అక్షరములుగాని కన్నడభాషగాని మా ఆఫీసులో ఎవరికిని తెలియదు.

చిత్తూరు,
1—10—1916.

పరమార్థ్యని నరసింహాచార్య,
ఎడిటర్.

Registered No. M. 716

౧కు

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక

## TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.)


సంపుటము 7. November 1916 / నవంబరునెల 1916. సంచిక 8.


## విషయసూచిక



సం॥రమునకు చందా 1 రూపాయ.


CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher.*

**D**

# (1) యోగవాసిష్ఠ రత్నములు.

## ఆంధ్రతాత్పర్య సమన్వితము.

శ్రీరామచంద్రుఁడు ౧౫ సంవత్సరముల వయసుకలిగియున్నప్పుడు వసిష్ఠ మహర్షి నీతి, మత, వేదాంత విషయములను బోధించెను. ఈబోధకే యోగవాసిష్ఠ మను పేరుతో ౩౨ వేల శ్లోకముల సంఖ్యకలిగియున్నది. ఈగ్రంథములో లేని నీతులుగాని అత్యుపయుక్త విషయములుగాని ప్రసంగించునప్పుడు ఉదాహరించవలసిన శ్లోకరత్నములుగాని మఱొక గ్రంథమున గనంబడవు. అతివిస్తార మగుటచేత దుర్బోధమయి యుండుటచేత ముముక్షువుల యుపయోగార్థము సర్వదా పారాయణమున కుపయోగించుటకుగాను ౭౦౦ శ్లోకరత్నములు అగ్రంథమునుండి వేంకటరమణకవివరుడు సంగ్రహించెను. ఇతనికి శ్రీజగద్గురువులవారు "కలియుగ జనకుఁడు" అను బిరుదము నిచ్చిరి. ఆంధ్రతాత్పర్యముండుటచేత స్త్రీలకు బాలురకు పామరులకుకూడ శ్లోకార్థము తెలియుంగుటకు చాలతోడ్పడుచున్నది. పక్కానిదళసరి కాగితములందు ౧౬౦ పుటలలో ముద్రించినను పలువురుపయోగించు గ్రంథమగుటచేత వెల రూ ౦—౮—౦ ఉంచితిమి.

# (2) సంఖ్యార్థనామ ప్రకాశిక.

## లేక సకలశాస్త్రవిషయ నిఘంటువు.

దీనియందు నీతి, వేదాంత, సాహిత్య, ఛందఃతర్క, పురాణాది సకలశాస్త్రములందును, మతములందును, సాంకేతికముగ చెప్పఁబడు సకలవిషయములు బాలురకు సైతము తెలియునంతటి సులభశైలిలో వచనమునందు వ్రాసినారము. సంఖ్యాక్రమముగ వ్రాయుటచేత ఈపేరు పెట్టినారము. ఇటుల ౧౦౮ సంఖ్యలకు గలదు.

౨ వ సంఖ్యక్రింద ద్వివిధదుఃఖములు ద్వివిధజంతువులు మున్నగు పేర్లు వ్రాసి వివరము వ్రాయబడును. ౩ వ సంఖ్యక్రింద త్రికరణములు, త్రిమూర్తులు, త్రిపుటులు, త్రిగణములు, ౪ వ సంఖ్యక్రింద సాధనచతుష్టయము, అనుబంధచతుష్ట

కడపటి కాగితము చూడుఁడు.

ఓమ్.




# దివ్యజ్ఞానదీపిక

TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.)

సంపుటము 7. November 1916 నవంబరు నెల 1916. సంచిక 8.


## కాలదేశ వర్తమానములు.

దివ్యజ్ఞాన సమాజముయొక్క సాంవత్సరికోత్సవము గడచిన సంవత్సరమున బొంబాయిలో జరిగెను గదా. ఈ సంవత్సరము డిసెంబరు నెలలో ఉత్తర హిందూదేశములో లక్నో (లక్ష్మణపురి) పట్టణమున జరుగఁగలదు. లక్నో పట్టణము అయోధ్యా దేశములో నున్నది. ఆదేశమున కది ప్రధాన నగరము. అతి పవిత్రమగు అయోధ్యానగరమున కతిసమీపము.

కాంగ్రెస్ మహాసభకూడ అచటనే ఆసమయములోనే జరుగును. శ్రీఆనిబెసంటమ్మగారు దయచేసి రెండుసభలను జరుపుదురు. సాధువరులును దేశవత్సలురు నగు ననేకులచటికి వెళ్లుదురు.

లక్నోపట్టణము మన దేశమునకు చాలాదూరమైనను అచటి కి వెళ్లువారికి కాశీ అయోధ్య మొదలగు పెక్కుపుణ్యక్షేత్ర దర్శనము ఘటించును. లక్నోపట్టణమునకు వెళ్లువారికి దిగుటకు స్థలము భోజనాదులును చక్కగా విచారింపబడును.

* * *

(గంజాంజిల్లా) బరహాంపూరు దివ్యజ్ఞాన సమాజమువారు గంజాం మండలమునకు చేరిన శాఖా సమాజములనిమిత్తమై యొక (Conference) కాన్ఫరెన్సును బరహంపురములో జరిగించులాగున తీర్మానించుకొనియున్నారు. అనీబిసెంటమ్మగారిని, జస్టిస్ సదాశివయ్యర్ గారిని వారి ధర్మపత్నిగారిని నాహ్వానింపదలచి యున్నారు. నవంబరు నెలలోగాని డిసెంబరు మాసములోగాని కాన్ఫరెన్సును జరుప నిశ్చయించుకొని యున్నారు.

* * *

నవంబర్ నెల మొదటివారములో నైజాముయిలాఖా దివ్యజ్ఞాన సమాజములవారు హైదరాబాదులో కాన్ఫరెన్సు జేయ నిశ్చయించుకొనియున్నారు. జి. యస్. అరండేల్ దొరగారు హైదరాబాద్ కాన్ఫరెన్సుకు వెళ్లి యుపన్యాసములను కావించెదరట.

* * * * *

సర్వసహోదరభావము దివ్యజ్ఞాన సమాజమున కుప్రధమోద్దేశముగా నున్నదిగదా! దీని నభ్యసించుటకు చాలమనోదార్ఢ్యమును హృదయ పరిపాకమును గావలసియున్నది. సోదరభావమున సమత్వభావమున్నదని గొందరు దలచెదరు కాబోలు! అట్లు లేదు. ఒకమాతృగర్భమునజన్మించిన సోదరీసోదరులు వయసునందుగాని, బుద్ధియందుగాని, సమముగా నుందురా? భిన్నత్వమే ప్రధానముగానున్న ఈప్రపంచమున సర్వసమత్వ మెప్పటికిని

తటస్థించదు. ఐనను మనము సోదరభావము నభ్యసించుటకు ప్రతిబంధకము లేదు.

ఏకోదరులగు నన్నదమ్ములు భిన్నవయస్సు గలవారును, భిన్నాభిప్రాయములు గలవారును, భిన్నరుచులు గలవారును, భిన్నములగు మనోహృదయ పరిపాకము గలవారుగా నున్నను వారియందు పరస్పర ప్రేమ వర్ధిల్లుచున్నది గదా! అలాగుననే సర్వ సహోదరభావము నభ్యసింపదలచినవారు తమకు నైజముగానున్న ప్రేమాతిశయమును సర్వజనులయందును గలిగియుండవచ్చును. మన ప్రేమకు మానవుల భిన్నాభిప్రాయములుగాని, భిన్నములగు రుచులుగాని, భిన్నములగు సంపదభ్యుదయములుగాని, భిన్నములగు జాతిమతములుగాని, దేహభేదములుగాని యడ్డపడకుండునట్లాగున మనము జాగరూకులై యుండవలయును. మనమతమే యితరులమతమై యుండవలయుననిగాని, మన యభిప్రాయములే యితరుల యభిప్రాయములుగా నుండవలయుననిగాని, మనకుగల రుచియే యితరులకు రుచిగానుండవలయుననిగాని, మనయొక్క బుద్ధియే యితరులయొక్క బుద్ధిగా నుండవలయుననిగాని మనము తలవకూడదు. లోకమందెల్లరు నొక్కవిధముగానే భావించుచు, నొకతీరుననే యూహించుచు, నొకమార్గముననే వర్తించుచు నున్నయెడల నాత్మవికాసమునకు సదుపాయము లేకపోవును. భిన్నభిన్నములగు స్వరముల నుచ్చరించుటచే గలుగు ఆనందమొక్కటే స్వరము నుచ్చరించుటవలన గలుగదు గదా! వేరువేరు రంగులు జేరినపుడు మన నేత్రములకానందము గలుగులాగున నొకటే రంగువలన గలుగదుగదా! ఈ దృశ్య ప్రపంచమునకు భిన్నత్వమే హితకరముగాని ఈశ్వరాంశ సంభూతులమగు మనము నానావిధములుగా ప్రకాశించుచున్న నొక చైతన్యమునే జూచుచు దాని విభూతిని శ్లాఘించుచు సర్వ సోదరభావము నభ్యసించవలయును.

సోదరభావమునకు ప్రేమయే ప్రధానసంపత్తు. ఇది త్రివిధములైయున్నది. మనకంటెను పెద్దలయెడ మనకుగలిగియుండు ప్రేమకు భక్తియనిపేరు. మన సమానులయెడ మనము జూపు ప్రేమను స్నేహమనియు, సుహృదమనియు జెప్పెదరు. మనకన్నను తక్కువస్థితిలోనున్నవారిపై మనము జూపు ప్రేమను కనికరమనియు, దయ యనియు జెప్పెదరు. త్రివిధరూపములుగానున్న ప్రేమ నభ్యసించుటచే మనకు సర్వ సోదరభావము సిద్ధించును. కొందరు తమ మనసున ప్రేమ యున్నదని జెప్పుకొనుచు యాచరణయందు మాత్రము తద్విరోధమైన కార్యములను జేయుదురు. కాయావాచామనసా మన మేకరీతిగా వర్తించవలయునే గాని త్రికరణశుద్ధి లేని యాచరణ పనికిరాదు లోకులందరికిని త్రికరణశుద్ధిగా ప్రేమ నభ్యసించుటకు చాలినంత యవకాశము లున్నవిగాని వారట్లభ్యసించుటలేదు. పరులదోషములను, లోపములను, దుర్గుణములను పరిగణించుచు ప్రేమకు విరుద్ధములైన ప్రవర్తనము నభ్యసించెదరు. ఇందువలననే లోకమునందు పలువిధములైన దుఃఖములున్నవి, ఇందువలననే జగమంతయు హాహాకారము జేయుచున్నది. ఇందువలననే లోకవత్సలురగు మహనీయులు లోకులకు తమ జ్ఞానమును గలుగజేసి హితమాచరింప దలచెదరు. ఇందువలననే నీరహస్యము నెరిగిన మహనీయులు జేయబూనియుండు లోకోద్ధారకార్యమునకు సహాయ మొనరింప నుద్యమించవలయును.

* * *

మానవు లపరిపూర్ణులు. దుర్గుణములు, లోపములు, దోషములు వారియందుండుట యాశ్చర్యము కాదు, గాన నీసంగతి నెరిగిన పరిపూర్ణులగు జీవన్ముక్తులు వారియెడ నిర్వ్యాజాంతఃకరుణగలవారై వారి బలహీనతను తమశక్తిచేతను, వారి మాలిన్యమును తమపరిశుద్ధత్వముచేతను, వారివిషయలోలతను త

ము విరక్తిచేతను, వారి దుస్సంకల్పములను తమ సత్సంకల్పము లచేతను, వారి యజ్ఞానమును తమ జ్ఞానముచేతను బోగొట్టుచున్నారు. ఇదియే నిజమైన లోకసేవా విధానము. ఈ మార్గముననే మనకు సర్వ సోదరభావము లభించునది.

* * *

జీవన్ముక్తుల యనుగ్రహమునకు బాత్రులై పరిపూర్ణులుగా దలచినవారు వారివలె లోకసేవ నొనరించవలయును. తమకన్న తక్కువ తెలివిగలవారికి తమకుగల తెలివిని గలుగజేయవలయును. తమకన్న తక్కువ నీతిగలవారికి తమనీతిని బోధించవలయును. ఏవిధముగానైన నితరులకు సహాయముజేయ నుద్యమించవలయును.

"యేనకేనాప్యుపాయేన పగస్య పురుషస్యతు
సంతోషం జనయేత్ప్రాజ్ఞః తదేవేశ్వరపూజనం"

అని వశిష్ఠులకు సాంబశివమూర్తి బోధించినట్లు మనమితరులకు సంతోషమును నుత్తేజనమును గలుగ జేయవలయును. ఇదియే ఈశ్వరపూజ.

* * *

హిందూ సుందరులకు కాలయాపన జేయు విధానమిదివరకు తేట పడలేదని దేశసంచారము జేయువారి కందరికి విదితమగుచున్నది. ఏ గ్రామమునకు వెళ్ళిజూచినను మన స్త్రీలు వృథాగా కాలము పుచ్చుచుండుటయే యధికముగా గోచరించుచున్నది. సద్గోష్ఠియును, సద్విచారమును, బహుతక్కువ. వ్యవధానకాలమును వ్యాసంగమునకై వినియోగించుట యరుదు. భోజన భాజనాది విషయములు తప్ప మరియే ముచ్చటలును వారికి రుచింపవు. వారిట్టి స్థితియందుండుటకు పురుషులే కారణము. పురుషులు తమ యుద్యోగములపై వెళ్ళినపుడు స్త్రీలకు సత్కాలక్షేప మగులాగున సదుపాయములను జే

యుటలేదు. వారికి చదువురాదు. ఇంటిపనులు ముగిసిన వెంటనే చేయుటకు పనిలేక పనికిమాలిన మాటల నాడుచుందురు. దేశహితముయొక్క వార్తే వారి చెవిన పడుటలేదు. అనేకులకు దేశములో జరుగుచున్న సంగతులే తెలియవు. పురుష దేహములయందున్న ఓ జీవులారా! మీ సహధర్మచారిణీల నిట్టిదశయందుంచిన పాపము మీకు రాకమానదు. మీరు ముందు జన్మములయందు స్త్రీ శరీరములను బొంది కర్మఋణమును తీర్చుకొనవలసి వచ్చును. ఇప్పుడే జాగరూకులై స్త్రీలవిషయమై మీరాచరించవలసిన కర్తవ్యములను శ్రద్ధతో పరిగ్రహింపుడు. వారికి విద్యను నేర్పుడు, నీతి నభ్యసింపజేయుడు, ఆత్మవికాసమును గలుగజేయుడు!

* * *

గడచిన అక్టోబరు నెల 21-22 తేదులయందు బళ్లారిజిల్లా ఆదవని గ్రామములో దివ్యజ్ఞాన సభయు, సంఘ సంస్కరణసభయు, మండలరాజకీయ సభయు, (District Political Conference) ఈమూడుసభలను జరిగినవి. దివ్యజ్ఞానసభకు శ్రీమతి అనిబెసంటమ్మగారు, సంఘసంస్కరణ సభకు దివాన్‌బహదూర్ జస్టిస్ సదాశివయ్యగారు, రాజకీయసభకు దివాన్‌బహదూర్ గోవింద రాఘవయ్యగారును అగ్రాసనాధిపత్యమును వహించి కార్యముల నెరవేర్చిరి.

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

## బ్రహ్మచర్యాశ్రమధర్మములు.

ఆగస్టు నెల సంచికయందు తామసగుణ లక్షణమగు నిద్రను జయించువిధము వ్రాయబడెను.

ఇప్పుడాగుణ సంబంధమైన ఇతరలక్షణములను, వానిని జయించు ఉపాయములను గురించి వ్రాయబడును.

తామసగుణముయొక్క రెండవ లక్షణము ఆలస్యము, అనగా సోమరితనము. సోమరితనమును జయించుటకు సులభమైన యుపాయము సర్వదా ఏదైన నొకపని సేయుచుండుట. దేహమును పనిని చేయనివ్వక సుఖముగా నుంచినట్లాయెనేని అది సమయము ప్రాప్తమైనపుడు మన ఆజ్ఞకు లోపడదు. కాబట్టి శిష్యులు వేకువ లేచిన తోడనే శౌచాది కర్మములు తీర్చికొని గురువులు నిత్యకర్మములు నలుపుటకు అవశ్యమైన సామగ్రినంతయు సిద్ధముగా నుంచునట్లు గురువులు ఆజ్ఞాపించుచుండిరి. గురువుల పాత్రలు శుద్ధిచేయుట, వస్త్రములుతుకుట, పూజాద్రవ్యములను తెచ్చియుంచుట ఈ మొదలగు కార్యములు చేయించుచుండిరి. సోమరితనమునకు వైరి పనిచేయు వాడుకగా నుండుటనుపట్టి సోమరితనమున కాస్పదమివ్వక ఈ పనులు చేయుటచే సోమరితనము ఫలాయన మగుచుండెను. సామాన్యమైన యితరపనులు చేయుటకంటె గురు సేవచేయుట శ్రేష్ఠము గనుక ఆపనియందు మునుచుచుండిరి.

తామసగుణ మూడవలక్షణము ప్రమాదము. అనగా అజాగ్రత (Carelessness). శిష్యు లేపని చేయవలసియున్నను మిగుల జాగ్రతగలిగి ఆపనిని ఎంత పరిశుద్ధముగా నెంత పరిపూర్తిగా నెంతలక్షణముగా చేయవలెనో అంతయు చేయుట కెంతకాలము పట్టునో అంతకాలమును ఉపయోగపెట్టి ఆపనియందేవిధ

లోపముండకుండునటుల సంపూర్ణముగ చేయునట్లు అభ్యసింప జే యుచుండిరి. ఏపని గాని అజాగ్రతచే అసంపూర్తిగ, వికార ముగ, అపరిశుద్ధముగ తొందరతో జేయనిచ్చువారు కారు. దీని చే ప్రమాదమును అనగా అజాగ్రతను తద్వైరియగు జాగ్రతచే జయింప జేయుచుండిరి.

తామసగుణ లక్షణములైన ఈ నిద్రాలస్య ప్రమాదము లను శిష్యులనుండి పారదోలి లోకసేవకు ముఖ్యసాధనములగు భూతహితాది సద్గుణములను పెంచుచుండిరి, చిన్ననాటినుండి బాలురను భూతహత మొనరించకుండ, మరల్చి భూతహితమును చేయుట అభ్యసింప చేయుటచే పెరిగి పెద్దవారైనపుడు క్రూర కార్యములు నిష్ఠురుణ్యకార్యములు చేయుట కుపక్రమింపకుందు రు. అదెట్లభ్యసింప చేయుచుండిరన:—గురువులు అగ్నిహోత్ర ము లుంచుటకు సమిధలు (కట్టెలు) తెచ్చుటకాజ్ఞాపించుచుండిరి. అప్పుడు వారు ఎండిన కట్టెలు తేవలెననియు మరియు వాటిలో చెదలు గాని ఇతర ఏలాటి పురుగులు గాని యుండినట్లైన తేగూడ దనియు విధించుచుండిరి. అదేలనని శిష్యులు ప్రశ్నసేయ గు రువులిట్లుత్తర మిచ్చుచుండిరి.

శ్లో॥ ప్రాణాయథాత్మనోభీష్టా భూతానామపి తేతథా।
ఆత్మౌపమ్యేనభూతేషు దయాంకుర్వంతిసాధవః॥

నీకు ప్రాణమెంత ప్రియముగా నుండునో అట్లనే సమ స్తభూతములకును ప్రియముగా నుండును. సాధువులు సర్వ భూతములను తనువలె భావించి దయచూపుదురు. నీదేహమున కు నిప్పు తగిలెనేని ఎట్లు బాధయగునో ఆపురుగులకుకూడా అ ట్లనే బాధయగును గనుక చెదలు గాని చీమలుగాని యితర ఏజంతువులు గాని యుండిన కట్టెలు తేదగదని చెప్పి జీవహింస కార్యములను చిన్ననాటినుండి నివారింప జేయుచుండిరి. ద

యాగుణము ఇంతమాత్రముతోనే ముగించుచుండలేదు. సస్య వర్గమునందు సహితము వ్యాపింపజేయుచుండిరి.

ఎండినకట్టెలు దొరకనపుడు పచ్చికట్టెలను తెచ్చుటకుత్తరవు చేయుచుండిరి. అప్పుడు గొప్పవృక్షము నరికి హానిచేయకుండ ప్రాదేశమాత్రము నిడుపుగల వ్రేలెడు లావుండు చిన్నకట్టెలను తెచ్చునట్లు చేయుచుండిరి. వృక్షములను మూలాగ్రముగ నరికినట్లైన వృక్షములో వ్యాపించియుండు ఈశ్వరాంశమైన జీవము ఆవృక్షరూపముద్వారా కాతగినంత అభివృద్ధియగుటకు భంగమగుటచే నట్లువర్తింప జేయుచుండిరి.

మరియు జిహ్వాది సమస్తేంద్రియములను నిగ్రహించి స్వాధీన పరచుకొనుటకు తగినట్లు సర్వకార్యములు చేయించుచుండిరిగాని ఇప్పటివలె అనవసరమైన సుఖపదార్థములను దేహధారణకు అవశ్యమైన వస్తువులుగా నేర్పడునట్లు ఆచరింప జేయుచుండలేదు.

శిష్యులు భిక్షాన్నముచే జీవించుచుండిరి. ఈ భిక్షాన్నము సంపాదించుటయందు అనేక నియమములకు లోబడవలసియుండెను. భిక్షకు తమతలిదండ్రుల యిండ్లకుగాని, వారి బంధువుల యిండ్లకుగాని, గురువుయింటికి, గురుబంధువుల యిండ్లకుగాని పోనిచ్చుచుండలేదు. అదేలనన, బాలురు వారియిండ్లకు భిక్షకు నిత్యము వచ్చెదరని తెలిసెనేని తల్లులు, బంధువులు తమబాలురమీద ప్రీతిచే రుచ్యమైన పదార్థములు వండిపెట్టుటకు ఆస్పదమిచ్చును. అట్టిపదార్థములు తినుటకలవాటుపడుటచే జిహ్వేంద్రియము లోపడక పెద్దవాడైనపుడును అట్టి రుచ్యమైనవస్తువులనే గోరుచు ఆవస్తుసంపాదనయందు కాలమును ద్రవ్యమును వినియోగించునట్లేర్పడును గనుక స్వకీయేతరుల యిండ్లకుపోయి భిక్షము తెచ్చుట నియోగించుచుండిరి. దానిచే వివిధసాత్త్వదొరికినది తిని తృప్తిచెందియుండుట అలవాటగును. స్వసుఖ

మునకు ఎక్కువకాలము ద్రవ్యము వినియోగించుటకు మారుగా లోకసేవకై వినియోగించుటకు తోడ్పడును.

ఇంతియె గాక శిష్యులు తాము సంపాదించిన భిక్షాన్నము తాము మాత్రము కుడువక గురువున కొకభాగ మిచ్చునట్లు నియమించుచుండిరి. ఎంత కావలయునో అంతకంటె నెక్కువగా సంపాదించకూడదని నిరోధించుచుండిరి. ఇట్లు చేయుటచే నితరులకు గృహస్థులు భిక్షమిచ్చుటకు వీలు కలుగుచుండెను. తనకు కావలసిన దానికంటె నెక్కువ తెచ్చి వ్యర్థ పరచుటచే గృహస్థులకును ఇతర భిక్షులకును నష్టము సంభవించును గనుక చిన్ననాటినుండి పదార్థములను వ్యర్థముచేయ కుండుటయు, ఇతరులకు నష్టము చేయకుండుటయు, కావలసినంతటి మాత్రముతో తృప్తిజెంది యుండుటయు ఈ గుణములు పట్టుబడునట్లు చేయుచుండిరి.

ఇప్పుడు విద్యార్థులకు ఇట్టిసద్గుణము లేర్పడుటకు పైను దాహరించిన పూర్వపు పద్ధతులు నియమించుటకు సందర్భము లేవియు లేవనుట అందరికి విశదమే. అయిన నీకాలమునుపట్టి ఎట్లు బాలురు ఆకలిదప్పుల కోర్చుటకును, రుచ్యమైన పదార్థముల కోరకుండుటకును, శీతోష్ణముల సహించుటకును, కష్టముల కు దేహము తాళునట్లును అభ్యసింపచేయుట లేదు. ఇప్పుడు విద్యలభించుట సామాన్యులకు సాధ్యపడదు. అన్నవస్త్రములకు సుఖముగా జరుగువారు తమబాలురకు రాజకీయవిద్య నేర్పుటకుగాను ఇండ్లు భూములు కుదువనుంచి అప్పులపాలై నాశమొందుచున్నారు. పాఠశాలల కివ్వవలసిన జీతములతో నెన్నికుటుంబములు జీవించవచ్చును. బాలురకు అన్నపానాదుల కమర్చిచ్చుటయే కడు దుస్సాధ్యముగా నున్నది. బాలురు అనవసరములగు ననేక సుఖముల గోరుచున్నారు. లేచినతోడనే కాఫీ ఉపహారములు లేకజరుగదు. తొమ్మిదిన్నరగంటలకు భోజనము,

ఒంటిగంటకు తేయాకురసము ఫలహారము, రాత్రి ఎనిమిదిగం టలకు భోజనము మరల నిద్రించుటకుముందు పాలు ఇవన్నియు తల్లిదండ్రులు అమర్చవలసియున్నది. పుస్తకములకు కాకితము లకు విశేషము ద్రవ్యము కావలసియున్నది. ఇంతకుముందు గణితము మొదలగునవి నేర్చుకొనుటకు స్లేట్లుపయోగించుచుం డిరి. ఇప్పుడు వాటికిమారుగా పుస్తకములు కొనవలసి వచ్చి నది. కాగితముల వెలకు పారమే లేకున్నది. ఇదిగాక క్లబ్బు ల చందాలు వేరు, చదువుటకు గదులబాడుగ లొకటి. బల్లలు కుర్చీలు లేనిది పనులు జరుగవు. 5-6 రూపాయలు వెలగల పౌంటెన్‌పేనాలులేక వ్రాతసాగదు. ఇన్ని సుఖోపకరణము లమర్చుటకు కుటుంబపు ఆస్తియంతయు సనుసి అప్పులపాలై దరిద్రము ప్రాప్తమగుచుండుట అందరి అనుభవముగా నున్నది. ఇది బాలురకన్నవారికి తత్కాలఫలము.

ఇంక బాలికలను కన్నవారి అనుభవము విచారింతము. బాలి కలకన్నవారు తమపిల్లలకు విద్యావంతుడైన వరుని వెతుకవలెన ని బాలుర తండ్రులను అడుగగనే తాము తమకొడుకుల విద్య నేర్పుటకై చేసిన అప్పు వడ్డితో నివ్వవలెనని అడుగుటయగాక ముందు తాము బ్రతుకుటకుకూడా ద్రవ్యమడుగుదురు. వీరిశ్ర మ చెప్ప నలవికాక యున్నది. ధర్మదృష్టి కించిత్తైన లేదు. అందరును ఎవ్విధంబుననైన నెంతక్రూరగ వృత్తిగాని వహించి ద్రవ్యము పోగుచేయవలెననెడి కోరికతప్ప వేరులేదు. గుణ ములు చక్కపరచక విద్యనేర్పుటచే కదా ఇన్ని అనర్థములు కలుగుచున్నవి?

విద్యార్థులు పూర్వమందు విద్యపూర్తిగ పొందువరకు అనగా దానికిగాను నియమించినకాలము ముగియువరకు వివా హమునకు యత్నించుచుండలేదు. దీనికి బ్రహ్మచర్యాశ్రమము

ని పేరురక పెట్టినదిగా లేదు. విద్యార్థులందరు బ్రహ్మచర్య వ్రతమవలంబించి నెరవేర్చవలసియుండెను. అందాక స్త్రీ ప్రశంస ఇంచుకైన లేక పుష్పతాంబూల దేహాలంకారాదులు మాని, రేతోనిగ్రహులై తేజోవంతులై దృఢగాత్రులై సుఖదుః ఖముల కోర్చుచు ఏకార్యము చేయుటకైనను సమర్థులై యుండిరి.

ఇప్పుడెందరో పిల్లలతండ్రులై చదువుచునే యున్నారు, ఏకాగ్రచిత్తముతో విద్యనభ్యసించుటకు మారుగా లేప్రాయమం దు వివాహములు సేయుచు, దీపావళి మొదలగు పండుగదిన ములందు అల్లుండ్లను పిలువనంపి వివాహమైన బాలబాలిక వ ధూవరులను కూర్చుండబెట్టి నలుగులుపెట్టి వేడుకలు చూచుచు ఒకరికొకరు గంధము పూయుటయు, తాంబూలము లిచ్చుటయు పూలబంతులాడుటయు మొదలగు వీర్యోద్రేకకార్యములు గావిం చుచు సంతోషపడుచుందురు. దీనిచే కలుగు అనర్థములు మా త్రము తలంచనే తలంచరు. ఇది మిక్కిలి శోచనీయముగా నున్నది. బాలబాలికలకు వీర్యోద్రేకము గలుగజేయుటచే బా లికలు సకాలముగాక మునుపే ఋతుమతు లగుదురు, అయిన తోడనే కేవలము చిన్న వయసునందు నిషేకకర్మ సలుపుదురు. దీనిచేత దంపతుల కుభయులకు సమస్తవిధముల బలము తగ్గి శీఘ్ర ముగ మృతినొందుదురు. బ్రతికినను జీవచ్ఛవములై యుందురు.

ఈ దుస్థితిని మాన్పు క్రమము మొదలగునవి ముందుసం చికలయందు వ్రాయబడును,

స శేషము.

జం. శ్రీనివాసరావు,

# భక్తియోగ ప్రదీపిక.

శ్లో॥ శ్రీమత్సదానంద మచింత్య మవ్యయం।
శ్రీమత్సదానంద మరూప మద్వయం।
శ్రీమత్సదానంద మఖండ మచ్యుతం।
శ్రీమత్సదానంద గురుం నమామ్యహం॥

ఎవరు ధర్మోపేతమై అమృతమువలె భోగ్యమగు ఈ భక్తియోగమును శ్రద్ధగలవారై ఆచరింపుమరో నన్నేకోరిన ఆభక్తులు నాకు మిగుల ప్రియులని చిత్రావతారుండును దేవకీ పుత్రుండును నగు శ్రీ పురుషోత్తమదేవుని వాక్యము గనుక ఈశ్వర ప్రీతికై భక్తి చేయు విధమును ఇచ్చట విచారింతము.

శ్లో॥ మంత్రోలయహటో రాజ యోగశ్చేతి చతుర్విధః అను శాస్త్రప్రకారముగా మంత్ర, లయ, హట, రాజయోగములను నీచతుర్విధయోగములయందు ప్రథమంబగు మంత్రయోగమే భక్తియోగంబనఁబడు.

భక్తియోగ లక్షణము.

ఇట్టిభక్తియోగలక్షణంబెట్టిదనిన:—

శ్లో॥ ఏకాక్షరంద్వ్యక్షరంవాషడక్షరమథాపివా,
అష్టాక్షరం వామంత్రాయమంత్రయోగీ సదాజపేత్॥

అను ప్రమాణరీతిగా, ఏకాక్షర ద్వ్యక్షర షడక్షర అష్టాక్షర మంత్రంబులని నాల్గువిధంబులు గలదు. ఇందు ఏకాక్షర మనునది ప్రణవము. "ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" "ఓ మితి బ్రహ్మ." అనగా నీ ప్రణవమే బ్రహ్మమని శ్రుతులు ఘోషించుచున్నవి.

ద్వ్యక్షరము;—అజప మంత్రము. ఇయ్యది అప్రయత్నముగనే ప్రతిదినము ఇరువదియొక్క వేల ఆర్నూరుమార్లు జపముగుచుండునదిగాన నజపయనంబడె, ఈ యజపమంత్ర మథ్యమంబై ప్రణవమేబలుకును. ఎట్లనిన; సకారోఽకారస్వరంబును

హకారో పరిబింమవుంగూడి ప్రణవము పలుకును. దీనికి ప్ర
మాణంబు

॥శ్లో॥ సకారోధ్యాయతే జంతుర్హకారోహిభవేధ్ధ్రువం॥

సకారరూపైన జీవుఁడు హకారరూపుఁడైై పరమేశ్వ
రుని కలిపి ధ్యానించినట్టాయెనా హకారమే యవును. అనగా
బ్రహ్మైక్యమవును.

షడక్షరియనగా, ప్రణవముతోగూడిన శివపంచాక్షరి.

అష్టాక్షరియనగా; శ్రియఃపతి యనంతనామంబులలో సా
రంబైనది సహస్రనామంబు. అందు ముఖ్యంబైన నారాయణ
గాయత్రియందు ప్రథమోపాత్తమై ప్రణవయుక్తంబైన నారా
యణ మంత్రంబు. ఇదియుగాక

పరబ్రహ్మమునకు స్వరూపలక్షణమనియు, తటస్థలక్షణమ
నియు నిరుతెరఁగులు గలవు. అందు స్వరూపలక్షణమనఁగా
సచ్చిదానందమును విడువనిది. వీనిని విడిచినయెడల తటస్థలక్ష
ణమనఁబడు. దృష్టాంతమెద్దియనగా, ఉష్ణత్వ ప్రకాశత్వ
లోహితాదులను అగ్ని యెటుల విడిచియుండదో, అట్లే సచ్చి
దానందమును విడిచి బ్రహ్మముండదు. ఇదియే జ్ఞానోపదేశమం
దుండు బ్రహ్మనిష్ఠ.

తటస్థలక్షణము,—వటవృక్షముమీది చంద్రుడు, రావివృ
క్షముమీదిచంద్రుడు అని రెండు వ్యవహారములున్నను, వృక్ష
ములను విడుచునెడల చంద్రుడొకఁడే యున్న రీతిగా నొకఁ స
చ్చిదానంద బ్రహ్మమే సృష్టి స్థితి లయములకై, రజ స్సత్త్వ
తమోగుణములతోగూడి హరి హర బ్రహ్మరూపములధరించు. ఇ
దియే త్రిమూర్తిస్వరూపము. దీనిం దెలియక కొందరు శివకేశ
వులయెడ భేదము గల్పించి నిందింతురు. యథార్థముగా విచారిం
చ పురియందును కించిత్తైనను భేదము లేదు.

శ్లో॥ శివాయ విష్ణురూపాయ, శివరూపాయవిష్ణవే॥
అను స్కాందోపనిషద్వాక్యము ఇచ్చట నిదర్శనంబగు. గనుక పరబ్రహ్మావతారమే త్రిమూర్తిస్వరూపములని తెలిసి అభేదాద్వైత బ్రహ్మజ్ఞానము గలవారై భక్తిసల్పి ఉపాసించుట మనకవశ్యంబగు. ఇదియే తటస్థలక్షణము.

జ్ఞానముగలిగి బ్రహ్మసాక్షాత్కారమైన పిమ్మట నీనామరూపాదులను విడిచి ఈ లక్షణభక్తులైనవారు ఇట్టి భగవద్రూపములందు ఏదైననొకమూర్తిని ఉపాసించుటయే భక్తియోగము.

భక్తి జేయవలసిన మార్గంబులు.

విరాజమానంబైన శ్రీ బ్రహ్మణ్యదేవునియందు భక్తి చేయవలసిన మార్గంబులు మూడుగలవు. అవి ఉపాసనాభక్తి, అనన్యభక్తి, ఏకాంతభక్తి యనిచెప్పంబడు.

ఉపాసనా భక్తిలక్షణము.

ప్రథమంబగు ఉపాసనాభక్తి తొమ్మిది విధంబులు. దాని క్రమమెట్టిదనిన;

శ్లో॥ శ్రవణంకీర్తనంవిష్ణో స్మరణంపాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥

శ్రవణము:—శ్రీదేవదేవుని మితిలేని అవతారంబుల లీలా వినోదంబులైన చరిత్రంబులను వినుట.

కీర్తనము:—అతని దివ్య నామావళుల నత్యంత ప్రియతో బాడుట.

స్మరణము:—అతని నామంబులలో సారంబై ఆపోజ్యోతి రసామృతంబై, పరమరహస్యంబై, బ్రహ్మేంద్రాది భక్తసేవితంబైన తారక మంత్రంబు మనసున స్మరించుట.

పాదసేవనము:—దయామయుండయిన శ్రీభగవన్తుని దివ్య పాదారవిందంబుల హృదయంబున సేవించుట.

అర్చనము:—జగన్మోహనాకారుండైన శ్రీ బ్రహ్మణ్యదేవుని

హృదయపీఠంబుననిల్పి మానసపూజ సేయుట.

వందనము;—అతని దివ్యపదకెందామరలకు సాష్టాంగ నమస్కారములుజేయుట.

సఖ్యము:—ఇతర సంగములను విడిచి, అతని పాదారవిందంబులే గతియని హృదయ పూర్వకముగా నమ్మి యుండుట.

ఆత్మనివేదనము:—ఏకాగ్రమైన చిత్తంబు శ్రీవాసుదేవుని కర్పించి, సర్వమును మఱచియుండుట, ఇత్యాది నవ విధభక్తులే ప్రథమసాధనము.

అనన్యభక్తి. ద్వితియ్యంబైన అనన్యభక్తియెట్లనిన:—శ్రు॥ "విశ్వం నారాయణం దేవం," "అనియు, "ఏకో నారాయణద్వితియోస్తి" అనియు, "సర్వభూతాత్మకో నారాయణః" అనియు నుండు శ్రుతివాక్యానుసారముగ, సర్వమును నారాయణుడు, సర్వము నారాయణ నిర్మితము, సర్వభూతములయందుండి ప్రకాశింపజేయుచు సర్వసాక్షియైన వాఁడు నారాయణుఁడే యని భావించుట, అతనికన్న నన్యంబులేదు. "నతదస్తివినాయత్స్యా న్మయాభూతంచరాచరం" అను గీతావాక్యము ఇచ్చట గమనించఁదగు, ఇట్టి నిశ్చలజ్ఞానముచే సమదృష్టి గలవారై జూచుటయే యనన్యభక్తి.

ఏకాంతభక్తి.

పైజెప్పినట్లు యనన్యభక్తి గలిగి దృఢచిత్తంబు గలవారై సర్వమును ఆత్మస్వరూపముగా నెఱింగి సచ్చిదానందమైన శ్రీ కమలా మనోహరుని ఏకాంత చిత్తమున నిశ్చలమైన బుద్ధియనుజ్ఞాన నేత్రముచే జూచి నిత్యానందమునుఁ జెందుట. ఇదియే ఏకాంతభక్తి యని శ్రీవేంకట చిదానందయోగులవారిచే బోధింపఁబడియున్నది.

ఈ విధమైన భక్తియోగంబువలన, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను చతుర్విధముక్తులు సమగూడు.

ప్రశ్న॥ ఈమూడు విధభక్తులయందును ఏ యేభక్తిచే ఏ యే

పదవి లభించు? ఉ॥ ఉపాసనాభక్తిచే సాలోక్యపదవియు, అనన్యభక్తివలన సామీప్య సారూప్యములును, ఏకాంతభక్తివలన సాయుజ్య పదవియునుం గలుగు.

ఈ భక్తియోగంబును చక్కఁగా నెఱింగి యెల్లప్పుడును శ్రీరమామనోహరుని భజించుచుండుట మనకు శ్రేయోదాయకంబగు. అట్లయిన భగవంతుఁడు మనయెడల కృపఁగలవాడై జ్ఞానయోగము గలుగునటుల దయచేయుననుటకు సందియము లేదు.

శ్లో॥ తేషాంసతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగంతం యేనమాముపయాన్తి తే॥

తాత్పర్యము॥ ఎల్లకాలము యోగముచేయుచు భజింపుచుండెడివారికి నన్నుచేరుటకు ఉపాయమైన జ్ఞానయోగమును నేనే ప్రీతిపూర్వకముగ నిచ్చుచున్నాను అని గీతావాక్యము.

ఈ భక్తియోగమును శ్రద్ధగలవారై కించిత్తైనను లోపము లేక యాచరించుటయే శ్లాఘనీయము. అట్లులేక వాచామాత్రము చెప్పుటచేతను చదువుటమాత్రము చేతను ఇయ్యది లభించదు. అట్లు ఇతరులు గౌరవించుటకును, పొగడుటకును, పూజించుటకును, డంబముచేత జేయఁబడు తపస్సు రాజసమనఁబడు.

శ్లో॥ సత్కారమానపూజార్థం తపోదమ్భేనచైవయత్
క్రియతే తదిహప్రోక్తం రాజసంచలమధ్రువమ్॥

అను గీతావాక్యము ఇచ్చట పరమోదాహరణంబగు.

చెట్లు మొదలగు స్థావరములకు వేళ్లవలెను, దీపమునకు తైలమువలెను, ఈ భక్తియోగంబునకు భూతదయ ముఖ్యాధారంబగు. భూతదయ లేనియోగంబు యోగంబుగాదు, అది రాక్షస యోగంబనియు, క్షుద్రవిద్య యనియుఁ జెప్పందగు. కావున భూతదయ యావత్కర్మలకును ముఖ్యాధారము.

పి. ఏ. కృష్ణస్వామినాయుఁడు.

:0:

# పరలోక యాత్ర.

ఇహలోకయాత్ర ముగియగానే ప్రతి మనుజుడును పరలోక యాత్ర సేయును. ఇహలోకమునందెంత కాలము జీవించియుండునో దానికి పది పండ్రెండు మడుగు లెక్కువ కాలము పరలోకమందు గడపును. ఇహలోక యాత్రాస్వరూప మెల్ల వారికి విదితమై యున్నది. పరలోకయాత్ర విషయమై కొన్ని విషయము లీక్రింద వివరించఁబడును.

సామాన్య మనుజుఁడు భూర్భువస్సువర్లోకముల సంచరించు వాఁడు. జన్మప్రభృతి ఆ మరణాంతము స్థూలశరీరధారియై భూలోకయాత్ర సలుపును. అది మొదలు మరల జన్మమెత్తువఱకు సూక్ష్మశరీరాంతర్వర్తియై మొదటఁగొంత కాలము భువర్లోకమందును పిమ్మట దీర్ఘకాలము స్వర్గలోకమునను సంచరించు. పిమ్మట స్వర్గలోకమునుండి దిగివచ్చి మరల మాతృగర్భమునం జొచ్చు. ఇవ్విధంబున వాఁడు త్రైలోక్యచక్రబద్ధుండై దానినుండి విముక్తి జెందనోపక పరిభ్రమించుచుండు. కావున సామాన్య నరుఁడు త్రిలోకి యనంబడును.

భూలోకమునకు ఇహలోకమనియు, భువర్లోక సువర్లోకములకు పరలోకమనియు, నామాంతరములు గలవు. ఇమ్మూఁడులోకములు నొక్కస్థలముననే యున్నవి. అట్లగుటంజేసి స్థూలదేహధారులై భూలోకమున నున్నవారును స్థూలదేహముంబరిత్యజించి (అనఁగా మృతినొంది) పరలోకమున నున్నవారును ఒక్కచోటన నివసించుచున్నవారు. సూక్ష్మదృష్టిగలవారికి పరలోకము ఆ లోకవాసులును సహజముగ గోచరమై యుందురు. సూక్ష్మ దృష్టిలేనివారికి సయితము ఒకానొక సమయమున పరలోకవాసులు దృష్టిగోచర మగుదురు.

భూలోకమున శరీరము పరిత్యజించి వెళ్లగానే మనుజులు

భువర్లోకముం జేరుదురు. అపుడు వారేస్థలమున నుందురు, వారి స్థితి యెట్టిదైయుండు, వారేమి చేయుచుందురు ననువిషయముల విచారింతము.

శరీర పరిత్యాగము చేసిన మనుష్యుఁడు తాను పూర్వము నివసించుచుండిన స్థలమునే సాధారణముగ నాశ్రయించియుండును. తన వాసగృహము, తనయుద్యోగస్థలము, తాను తఱుచుగా సంచరించుచుండినచోట్లు, తనకతి ప్రియులగు బంధువులు స్నేహితులు నున్న తావులు, తనకు మనోహరములగు విషయములున్న ప్రదేశములు నివి యన్నియు మృతునకు సంచార స్థానములైయుండు. బ్రతికియున్నపుడు ఏ వస్తువుమీదనైనను అతికాంక్షయుండెనేని చనిపోయిన పిమ్మట చిరకాలము వఱకు దానిం గాచుకొనియుండు. ధనమును భూమిలో పాతిపెట్టి మృతినొందిన వానికి ధనాపేక్ష అధికముగ నుండునేని వాఁడు చాలాకాలమచట బద్ధుండైయుండు. ధనమచట పాతిపెట్టియుండు సంగతి తనవారికిం దెలియదేని వారికిఁదెలియఁజేయుటకై వేచియుండి సర్వవిధములఁ బ్రయత్నించు. అట్టివాఁడొకప్పుడు దృష్టిగోచరమగును. ఎట్లనిన వాని ఆశాబలముచేత వాని సూక్ష్మశరీరములోకి చుట్టునున్న స్థూల ప్రకృతి అణువులు కొన్ని ప్రోగై స్థూలాకారము గలుగును. అపుడు వాఁడు బ్రతికియున్న వారికన్నులకు కనఁబడుటమాత్రమేగాక వారితో మాట్లాడుటయుఁ గలదు.

కొన్ని సంవత్సరముల క్రిందట ఇంగ్లాండు దేశములో నొకయింట నొకముసలిపిశాచము ఆయింటివారికి పలుమారు గోచరించుచుండెను. ఉన్నట్టుండి ఇంటిలోపలను ఇంటిచుట్టునున్న తోటలోను ఆ ముదుసలి కనఁబడుటయు అంతలో మాయమైపోవుటయు నిట్లు జరుగుచు వచ్చెను. తరుచుగా ఆమె తోటలో నొక రేగుచెట్టు క్రిందనే కానవచ్చుచుండెను. కొంతకాలము

వరకు ఆమెను చూచినవారు భయపడుచుండిరి. కొన్నాళ్లకు సహజమాయెను. అయిన నామెతో నెవరును మాట్లాడబూనుకొన్న వారు గారు. ఇవ్విధంబున పెక్కేండ్లు నడిచె. తరములు గడచెను. ఒకనాడు సాయంకాలము నాతోటలో బనిచేయు కాపువాఁడొకఁడు మద్యపానముచే కొంచెముద్రేకించియున్న సమయమున ముసలామె వానికగుపడెను. అపుడు వాఁడామెనుజూచి నీవెవతెవు ఎందుకు పలుమారిచటికి వచ్చుచున్నావని యడిగెను. ఆమె ప్రత్యుత్తరమేమియు జెప్పక మెల్లన నారేగుచెట్టు యొద్దకుఁబోయెను. కాపువాఁడును వెంబడించిచనెను. అచటికి వెళ్లి ఆమె ఆచెట్టుక్రింద ఎన్నడు కదిలించని యొక పొదుస్థలమును చూపెను. అచట నాకాపువాఁడు త్రవ్వగా కొంతలోతున ధనముతోనిండిన బిందెలగుపడెను. వానినన్నిటిని వాడొక్కొక్కటిగా బైటతీయువఱకు ఆమె అచటనే నిలువఁబడి చూచుచుండెను. కడపటిబిందెను ఎత్తినపుడు ఆమె ముఖమున పరమానందసూచకమగు దరహాసము గాన్పించెను. అంతట నామె అదృశ్యమాయెను. మరల నెప్పుడును ఆచోట నామె పొడచూపలేదు.

ఈ కథ యథార్థమైనది. ఆకాలమున వ్రాసిన గ్రంథములో వర్ణించఁబడియున్నది. ఇట్టివే ధనపైశాచములనఁబడును.

పైనచెప్పిన కారణమొక్కటియగాదు, అనేకకారణములవలన నట్టివారొక ప్రదేశమున నిబద్ధులైయుందురు. బావిలోపడుట ఉరిదీసికొనుట మొదలగు నకృత్యములవలన ఆత్మహత్య జేసుకొన్న వారును, ఆకస్మికముగా దుర్మరణము నొందినవారును మరణభూమిని కాచుకొని ఎంతోకాలము పడియుందురు. భూలోకకార్యములను గురించి యేదేని యొక విషయము మనస్సున బాధించుచున్నయెడల తన్నిమిత్తమై సయితము మరణానంతర

మున మనుష్యుఁడొక స్థలముఁ గనిపెట్టుకొనియుండు.

ఇంగ్లండు దేశమున నొక పాదిరియుండెను. క్రీస్తుమత సంప్రదాయ ప్రకారము, ఎవఁడైన పాపము జేసినయెడల పాదిరియొద్దకు వెళ్లి తాఁ జేసిన పాపము నతనితోఁ జెప్పుకొను నేని పాప విముక్తుఁడగునని యొక సిద్ధాంతము కలదు. దానిని నమ్మి క్రీస్తుమతస్థులనేకులు తాము చేసిన పాపములను రహస్యముగ తమ పాదిరి గురువుతో చెప్పికొనుటయు, ఆ గురువు దానిని వ్రాసుకొని అతి రహస్యముగనుంచి తాను భగవంతుని పూజ చేయు సమయమున నావిషయమును భగవంతునికి నివేదించి క్షమాపణ వడయుటయు ఆమతమునందాచారమై యున్నది. ఇగ్లాండ పైకనిన పాదిరి యొకనాడు వేటాడుటకై అడవికి వెళ్ల నిశ్చయించి, ఆయుధపాణియై గుఱ్ఱము నెక్కి బోవు సమయమున ఆయన శిష్యవర్గములో చేరిన యొక గొప్పయింటి స్త్రీ అచటికి వచ్చి తాఁ జేసిన యకృత్యమును చెప్పి క్షమాపణ వేడఁగోరెను. ఆపాదిరి ప్రయాణ సంరంభములో నామె చెప్పిన దానిని నొక కాకితమున వ్రాసి ఆ కాకితమును తన గదియొక్క గోడలో నున్న యొక నెరియలో బయటికి కానరాకుండునట్లు లోపలితట్టు పెట్టి, మరలవచ్చి తగు భద్రము చేసెదనని తలచి అవసరముగా గుఱ్ఱము నెక్కి వెళ్లిపోయెను. పోయినచోట వేటాడునపుడు గుఱ్ఱము మీదనుండి క్రిందపడి ఆయన తక్షణమే మృతినొందెను.

అతడు గోడలో పెట్టివచ్చిన కాకితములోని సంగతులు బయల్పడు నేని ఆ స్త్రీకిమాత్రమేగాక ఆకుటుంబమువారి కందఱకును బంధువులకును చెప్పరానంత అపకీర్తి కలుగును, అనేక సంకటములకు కారణమగును. ఈవిషయము ఉత్క్రమణకాలమున నాపాదిరి మనంబున బాధించె. అందుచే మరణానంతరమున నాపాదిరి పిశాచియై తనయిల్లుజేరి పైకనిన గోడచే నావరింపఁబడిన తనగది నాశ్రయించి యుండె. అపుడపుడు యింటి

వారికి ఆగదిలో నతడు కనబడుచుండెను. కొంతకాలమునకు ఇంటి వారు ఇల్లుమరమ్మతుచేసి గోడలలోని సందులన్నిటింబూడ్చి సున్నము పూయించిరి. కాకితము గోడలో చిక్కికొనెను.

70 80 సంవత్సరములు జరిగెను. 2-3 తరములు దాటెను. ఆయింటిలో ననేకకుటుంబములు కాపురములు మారెను. ఎన్ని సంవత్సరములు గడిచినను, ఎన్ని కాపురములు మారినను, మన పాదిరిమాత్రము తనగదిని విడిచినవాడు కాడు. తాను సజీవుడై యుండగా తానుపయోగించుచున్న కుర్చీమీదనే కూర్చుండి అపుడపుడు ఇతరులకు గోచరమగుచుండెను. ఇంటివారు ఆ గదిని మాత్రము వదిలిపెట్టి ఇల్లంతయు వాడుకొనుచుండిరి. దీర్ఘకాల పరిచయమువలన సహజమయి యెవరును భయపడుట లేకుండెను.

ఇట్లుండగా నాయింటిలో నొకవిందు జరిగెను. స్నేహితులనేకులు విందుకు పిలువంబడిరి. విందుకు వచ్చిన స్నేహితులలో నొకనికి కుర్చీమీదకూర్చొనియున్న మనపాదిరి యగుపడెను. అతడుకూడ విందుకు వచ్చినాడు కాబోలునని ఆయన యనుకొనెను. అందరునువచ్చి భోజనమునకు కూర్చున్నపిదప ఆస్నేహితుడు యింటియజమానురాలిని జూచి ఆగదిలోకూర్చున్న మనుష్యుఁడెందుకు భోజనమునకు రాలేదని యడిగెను. అందుకామె కలవరపడి మరల సవరించుకొని అతని వృత్తాంతమును తెలియపరిచెను. అది విని ధైర్యవంతుఁడుగావున తత్క్షణము తఁడాగదిలోకి వెళ్లి పాదిరితో నీవెవఁడవు ఎందునిమిత్తమిచట నున్నావని యడిగెను. అందుకాపాదిరి మిగుల సంతసించి తన వృత్తాంత మంతయుం జెప్పి గోడలో తానుంచిన కాకితపు సంగతిని తెలియపరచి నీవా కాకితమును బైటతీసి యెవరికింజూపక నీవునుజూడక కాల్చివేయునట్లు వాగ్దానము చేసెదవేని కాగితముండు చోటు నీకుచూపెదనని చెప్పెను.

అక్కడజేసెదనని యతఁడు వాగ్దత్తముచేయగా పాదిరిగోడయొద్దకు పోయి ఆ తావుచూపించెను. అంతట నాస్నేహితుఁడు భోజన శాలలోకి వెళ్లి అందరు వినునట్లు ఈ సమాచారమును చెప్పగా అచటనుంచి అందరును పాదిరిగదిలోకి వచ్చునంతలో పాదిరి అదృశ్యుఁడాయెను. అంతట వారందఱు నొకపనివానిని రప్పించి గుర్తుపెట్టినచోట గోడలో త్రవ్వించిరి. గోడలోనొక సందుండెను. ఆసందులో పాదిరిచెప్పిన గుర్తులుగల యొక పాత కాకితముండెను. దానిని బైటతీసిరి గాని విప్పిచూడక మాటప్రకారము దానిని కాల్చివేసిరి. అదిమొదలు పాదిరి ఆ స్థలములో నెన్నడును గన్పట్టినవాఁడు కాఁడు.

ఈ వృత్తాంతము కొన్నిదినముల క్రిందటనే జరిగినది. సాక్షి నిదర్శనములతోడ వార్తాపత్రికలయందు ప్రచురింపఁబడెను. దీనివలన మనకు తెలియవచ్చెడు విషయ మేమన చనిపోవు సమయమున నేదేని ఇహలోక సంబంధమగు బలమైనకోరికె మనస్సున నాటియుండెనేని అది నెరవేరువఱకు మనుజుఁడ చ్చోఁ గాచుకొనియుండు.

ఈకథయందు మఱియొక సందేహము కలుగవచ్చును. అంత దీర్ఘకాలమువఱకు నాపాదిరికా పాశము ఎందువలన విడువకుండెను. ఆ కాగితమునకు సంబంధపడిన మనుష్యులందఱు ఎప్పుడో కాలధర్మమునొందిరి. 2-3 తరములు వెళ్లెను. అప్పుడొకవేళ నాకాగితపుముక్క ఇతరులచేతికిఁ జిక్కినను, దానిలోని సంగతులు బయల్పడినను, ఎవరికేమియు బాధ లేదు. అట్లయినను పాదిరి యెందుకు కాచుకొనియుండెను ? కారణము భగవద్గీతయందిట్లు వివరింపఁబడియున్నది.

శ్లో॥ యంయంవాపిస్మరన్ భావం । త్యజత్యంతేకళేబరమ్ ॥
తంతమేవైతికౌంతేయ । సదా తద్భావ భావితః ॥

జీవుఁడు శరీరమును విడిచి వెళ్లునపుడు వాని మనస్సుననే

భావము కలిగియుండునో పరలోకమున సదా వాడు దాని నే స్మరించుచుండునని తాత్పర్యము. అట్టి భావ మొక స్థలము ననుసరించియుండె నేని జీవుఁడా స్థలము నాశ్రయించుకొనియుండు.

బలిష్ఠములగు కోరెకలు లేనివారు తమ పరిచయ స్థలములందే మరణానంతరమున వసించుచుందురు. వారొకప్పుడు స్వప్నమున మనకు గోచరింతురు. నిద్రించునపుడు మనమును వారును సూక్ష్మశరీరధారులమై యొకచోటనుండుటచే నన్యోన్య సమాగమంబు సహజము.

భువర్లోక వాసులకు ఒకస్థలమునుండి యొకస్థలమునకుఁబోవుట యతి సులభమైయుండు. తలచిన మాత్రమున నొకక్షణములో వారెంతదూరమైన వెళ్లగలరు. అయినను బ్రతికియున్నపుడు దేశసంచారముచేయక స్థలాంతరములకు పోవలయుననెడి ఆశలేక కూపగతభేకమువలె నున్నచోటనే పడియున్న వాఁడు మరణానంతరము సయితము ఆచోటనుంచి కదలకనుండు. బ్రతికియున్నపుడు యాత్రలుచేయవలయునని బలమైనకోరిక గలిగియుండి ఆకోరికను నెరవేర్చుకొనుటకు తగిన సముపాయములు లేక నూరకున్నవాఁడు మరణానంతరము యథేష్టముగ కోరిన స్థలములకెల్ల యాత్ర జేయు.

భువర్లోకవాసులందఱు భూమినంటియుండ నగత్యము లేదు. సాధారణముగా భూతలమునకు పైన కొంతదూరమున నంతరిక్షముననుందురు. కేవలము నిహలోక వాంఛలుగలవారు మాత్రమే అధోముఖులై భూమినంటియుందురు. భూలోకబంధములనుండి విడిపించుకున్నవారు ఊర్ధ్వముఖులై క్రమ క్రమముగ భూమికి నుపరిభాగమున సంచరింతురు. భువర్లోకములో పెక్కు అంతస్థులున్నవి. వారి వారి పుణ్యపాపములకు నుచితములగు స్థలములందు మనుజులు భువర్లోకముననుందురు.

పరమాత్ముని నరసింహయ్య.

# మోక్షమార్గ ప్రదీపిక.

(222 వ పుట శేషము.)

మఱియు

ప్రకృతిం విద్ధిమేపరాం।
జీవభూతాం మహాబాహో।
యయేదంధార్యతే జగత్॥

దేనివలన జగత్తు ధరింపబడుచున్నదో అట్టి ప్రాణస్వరూపమైనదాని నాపరాప్రకృతిగా దెలిసికొనుము.

భ. గీ. 7—5.

మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం।
హేతునానేనకౌంతేయ జగద్విపరివర్తతే।

నాయధ్యక్షత్వమున ప్రకృతి చరాచరాత్మకమైన ప్రపంచమును సృజించుచున్నది. తన్నిత్తమున నే జగద్వ్యాపారము జరుగుచున్నది.

భ. గీ. 9—10.

ఇందువలన ప్రాణమన, పరాప్రకృతియనియు, ఈశ్వరశక్తియనియు దెలియవచ్చుచున్నది.

ఈశ్వరునికి, ఈశ్వరశక్తికి భేదములేదు.

ప్రాణోహ్యేష

ముం. ఉ. 3—4.

ప్రాణమీశ్వరుని షోడశ కళలలో నొకటియనియు జెప్పబడుచున్నది.

ఇహైవాన్తశ్శరీరే సోమ్యసపురుషో యస్మిన్నేతా షోడశకళా ప్రభవన్తీతి సప్రాణమసృజత.

ప్ర. ఉ, 6—2, 4.

ఇట్లు సమష్టి దృష్టిచేజూడ నీశ్వరశక్తియగు ప్రాణమీశ్వ

రాంతస్థమై యాదిత్యాది సర్వభూత చైతన్యమున కధిష్ఠానమై యుండునట్లు వ్యష్టియందును జీవశక్తియగు ప్రాణము జీవునికంటె భిన్నము కానిదిగనై సర్వకరణముల కధిష్ఠానమై యొప్పచుండు. ఈశ్వరాంశమగు జీవుడవినాశియని తెలిసియున్నదికదా. జీవుని శక్తియగు ప్రాణము విషయములో భయము జెందుటకు కారణములేదు.

ప్రాణ మాత్మస్వరూపమని తెలిసినపుడు ప్రాణము పోవునని చింతించుట కవకాశము లేదు. జీవుని సంసారభ్రమణ కాలమునం దేయేజన్మములో నెట్టి యనుభవప్రాప్తి కావలయునో, ఎంతజ్ఞానము సాధించవలయునో, తత్సాధ నార్థ ముపయుక్తములగు దేహము లేర్పడియుండును. ఏ దేహముతో బనిదీరునో, ఏ దేహముతో నెక్కుడుజ్ఞానము సాధించుటకలవికాదో, ఏ దేహమికందనశక్తులను బ్రకాశింపఁజేయుటకుసహకారి కానేరదో, అట్టిదేహమును జీవుడువదలి, పైమెట్టునకు అనగా నెక్కుడు జ్ఞానశక్తి ప్రకాశమునకు దగిన దేహమును మఱియొకటి నిర్మించుకొనును.

వాసాంసి జీర్ణాని యథావిహాయ।
నవాని గృహ్ణాతి నరోఽపరాణి।
తథాశరీరాణి విహాయజీర్ణా।
న్యన్యాని సంయాతినవానిదేహీ॥

మనుజుఁడు జీర్ణవస్త్రములను ద్యజించి నూతన వస్త్రములను ధరించునట్లు జీవుడు జీర్ణమైన శరీరములను విడిచి క్రొత్తవానిని గైకొనును.

ఏ దేహమును జీవుఁడు పరిత్యజించునో, ఆదేహమునుండి జీవశక్తియగు ప్రాణముత్క్రమించినదని వ్యవహరించబడుచున్నది. ఆదేహము మృతిబొందెనని భావింతుము. అంతకన్న మేలైన శరీరము కావలసియుండి, అందునిమిత్తమై జీర్ణమైన శరీరమును

జీవుడు విడిచెనని తెలిసికొంటిమేని త్యజించబడిన శరీరముకొఱకై శోకింపనోపము.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిః, ధీరస్తత్ర న ముహ్యతి॥

ఎట్లు జీవితకాలములో కౌమార యౌవన జరావస్థలలో నొకటిపోయి మరియొకటివచ్చి దేహాకారము మారినను జీవుఁడు మారుటలేదో ఆలాగుననే దేహాంతర ప్రాప్తి సయితము జీవయాత్రలో నొకయవస్థతో సమానమే యనిభావించి బుద్ధిమంతులు మరణమునుగూర్చి మోహము జెందరు.

భ. గీ. 2—13.

మృతినిమిత్త శోకమునుగురించి విచారించగా, ఆత్మ యవినాశియగుటంజేసి దానినిగూర్చి శోకింప నవసరములేదనియు, దేహము నశించుస్వభావము గలదియే గనుక దానిని గురించి దుఃఖించుటవలన నుపయోగము లేదనియు, భగవద్గీతయందు బోధించబడియున్నది.

ప్రాణము పోయెననెడు లోకోక్తి తాత్కాలిక దేహము నకన్వయించు కొనవలయును. అనగా, ఆశరీరమునుండి ప్రాణ ముత్క్రమించునేగాని ప్రాణము నశించుటలేదు. మరల జన్మము సంభవించినపుడు నూతన శరీరములో నాప్రాణము ప్రవేశించి "బ్రతికియున్నాఁడు" అనియెడు వ్యవహారమున కాశ్రయమై యొప్పును. ఇట్లు సదాజీవుని నంటియుండు జీవశక్తి యగు ప్రాణమునుగూర్చి శోకించ నవసరములేదు. భీతిజెంద నవశ్యకములేదు.

ఇవ్విధమున ప్రాణముయొక్క యథార్థ లక్షణమును గ్రహించిన, భగవంతునియందు నిజమైన భక్తిప్రాప్తించును. ఆయన శరణ్యుఁడు, ప్రాప్యస్థానము.

గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణంసుహృత్।

ప్రభవః ప్రళయస్థానం నిధానంబీజమవ్యయమ్॥

భ. గీ. 9—18.

నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం.॥

మనమాయనయందు శరణుజొచ్చి ఆయనయందనన్యభక్తి నిడినయెడల మనలను గాపాడి సంసారపంకనిర్మగ్నులమైన మనల నుద్ధరించి తన్ను జేర్చికొనును.

యేతుసర్వాణి కర్మాణిమయిసన్యస్యమత్పరాః।
అనన్యేనైవయోగేన మాంధ్యాయంత ఉపాసతే।
తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామినచిరాత్ పార్థమయ్యావేశితచేతసామ్॥

ఎవరు సర్వకర్మములను నాయందుసన్యసించి నాయందు ప్రీతిగలవారై అనన్యయోగముచేత నన్నుధ్యానించి యుపాసించుదురో వారలను మృత్యు సంసారసముద్రము నుండి యుద్ధరించెదను.

భ. గీ. 12—6, 7.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్।
యత్తపస్యసికౌంతేయ తత్కురుష్వమదర్పణమ్॥

ఏ కార్యమును జేయుదువో, దేనిని భక్షింతువో, ఏ హోమము జేయుదువో, ఏ దానము జేయుదువో, ఏ తపస్సు జేయుదువో, దానినంతయు నా కర్పణముగా జేయుము.

భ. గీ. 9—17.

"సర్వము ఈశ్వరార్పణము" అనుభావము వృద్ధిజెందించుకొనవలెను. మనకు ప్రీతిలేనట్టియు మనకు రుచింపనివియు నగు పదార్థము లీశ్వరార్పణమని యనుట సులభము, కాశీలో మనకిష్టములేని వస్తువులను విడిచికాశీలో విడిచినామని డంభముగా జెప్పుకున్నట్లుండును. అట్టి త్యాగమువలన నుపయోగము లేదు. సర్వము భగవదర్పణము జేయుటకు సిద్ధముగనుండవలెను,

యథార్థముగ విచారించినచో నన్నియు భగవంతునివియే. ఆయన సొమ్మాయనకప్పగించుట కెంతయో ఖేదము జెందుచున్నారఘే! ఇది యెంతమూఢత్వము! ప్రతిజన్మమందును భగవంతుడు మనకొసగిన శరీరమును ద్రవ్యమును శక్తిబలవీర్యములను సత్కార్యములయందు వినియోగించి తుదివారి సొత్తు వారికర్పించవలెను. మనకుప్రాప్తించు జయము మహిమయు వారివే మనవికాదు. ఈ విషయమును గురించి కేనోపనిషత్తు మూడవఖండమును ముఖ్యముగ బఠించవలెను. ప్రథమమంత్రములో,

బ్రహ్మహ దేవేభ్యోవిజిగ్యే।
తస్యహబ్రహ్మణో విజయే దేవా అమహీయంత।
త ఐక్షంతాస్మాక మేవాయం విజయోఽస్మాక మేవాయం
మహి మేతి॥

ఈశ్వరుడు దేవతలకు (దానవులతోడి యుద్ధములో) జయమునొసగెను. ఆభగవద్విజయమునందు దేవతలు మహిమనొందిరి. అయితే దేవతలు జయము మహిమ తమవేనని దురభిప్రాయపడిరి.

కే. ఉ. 31—10.

ఆ దురభిప్రాయము నెఱింగి భగవంతుడు యక్షరూపమున దేవతలకగుపడెను. యక్షమెద్దియైనది, యేకతమున నేతెంచినది, దేవతలు కానలేకపోయిరి. యక్షమును సమీపించి దానిస్వరూప మహిమలను గనిపెట్టిరమ్మని యగ్నినమపగా, యక్షముతృణమును వైచి దహించమనగా దాని ననలుడు సర్వప్రయత్నముల జేసియు గాల్పలేకపోయెను. పరాభవముజెంది దేవతలతో దన యనుభవమును దెల్పుకొనెను, ఆరీతిననే వాయువు సయితము పరాజయమునొందగా నిలింపరాట్టగు, దేవేంద్రుడు స్వయముగావెళ్లి యక్షమును ధ్యానించగా ఉమారూపమున నింద్రునికి ప్రత్యక్షమై దేవతలకు జయమునిచ్చినది భగవంతుడే

యనియు ఆయనవలన దేవతలకు మహిమగల్గెనేగాని యితరము కాదనియు నుపదేశించి తిరోధానమాయెను.

> సాబ్రహ్మేతి హోవాచ బ్రహ్మణోవా।
> ఏతద్విజయే మహీయధ్వమితి॥
>
> కే. ఉ. 4—1.

మఱియు భగవద్గీతయందు,

> యద్యద్విభూతిమత్ సత్వం శ్రీమదూర్జితమేవవా।
> తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవం॥

విభూతిమంతమును, శ్రీమంతమును. ఊర్జితోపేతము నగునట్టిది యంతయు నా తేజోంశమువలన గల్గినదని యెఱుగుము.

భ. గీ. 20—42.

ఇట్లు సర్వము భగవంతుని వలననే గలిగినదనియు, ఆయన కర్పించుటకు సదా సిద్ధముగనుండవలయుననియు దెలిసికొనవలెను. ఆయన కార్యముకొఱకు మనప్రాణమైనను త్యజించుటకు సంకోచించగూడదు. అల్ప భోగత్యాగమునకన్న ప్రాణత్యాగ మెక్కుడు.

చైతన్యార్ఘ్య సమారాధ్యా చైతన్య కుసుమప్రియా।
"చైతన్యమనియెడు అర్ఘ్యముచేత నారాధింపబడునట్టిది, చైతన్యమను కుసుమమునందు ప్రీతిగలది".

అని లలితా సహస్రనామమందు దేవి స్తుతించబడియున్నది. ప్రవాహమునుండి దెచ్చిననీటితో నభిషేకముచేయుట కష్టముకాదు. చెట్టునుండిగోసిన పువ్వుతో బూజించుటయు గష్టముకాదు. లోకోపకారమగు గార్యమును ఘటించుటయందు బ్రాణత్యాగమునకైననోర్చి కార్యమును జేయబూనుకొనవలెను. ధర్మాచరణమందు బ్రాణత్యాగమయ్యేనేని ఆరక్తస్రావము భగవత్ప్రీతిగజేయు గంగాభిషేకము. ఆప్రాణవిసర్జనము లక్షబిల్వార్చన, తులసి పత్రార్చన.

అన్నిటికన్న మనుష్యులకు బ్రాణముపైన నెక్కుడు ప్రీతియని స్పష్టముగ దెలిసినవిషయము. కనుక ప్రాణము సయితము విడువనుద్యమించిన భగవంతుడు ప్రీతిజెంది మనకిప్పటికన్న మేలైనసాధనములతో దన్ను సేవించుట కవకాశమిచ్చును. ప్రాణము నిజముగ బోవుటలేదని యిదివరకే జెప్పబడియున్నది. ఈశ్వరార్పణము జేయబడిన ప్రాణమిప్పటికన్న మేలయిన యుపాధిలోజేరుట ప్రాప్తించునే గాని నష్టములేదు. నాశము లేదు. ఫలకాంక్షరహితముగ నొనర్చు త్యాగమే ఈ వాక్యము నందు బ్రస్తావించిన త్యాగము. దంభాహంకారముతో గూడి ఫలాపేక్షతో జేయబడు త్యాగము జన్మబంధ హేతువగును.

ఇప్పుడీ యయిదవ వాక్య తాత్పర్యము విశదమగును.

జీవాత్మపరమగురువుల సన్నిధానమందు నిలువగలుగుటకుమున్న వానిపాదములు హృదయరక్తముతో బ్రక్షాళనము జేయబడవలెను.

ఇచ్చట "రక్తము" అనగా త్యాగము. హృదయము ప్రేమస్థానము, పాదములు సేవోపకరణములు.

పాదములను హృదయరక్తముతో బ్రక్షాళణము జేయుట యనగా మనకు దేనియందు బ్రీతి యతిశయముగనున్నదో (అన్నిటికన్న నెక్కుడు బ్రీతికరమగు ప్రాణము సయితము) దానిని ద్యాగముజేసి గురుసేవకు బాత్రతబడయవలయు.

బుద్ధిపూర్వకముగ హత్యజేసికోవలెనని యీవాక్య తాత్పర్యము కాదు. ఈశ్వర, గురుసేవారూపకమగు పరోపకారాచరణమందు, వలయునెడ ప్రాణమును సయితము త్యజించుటకు సిద్ధముగనుండవలెనని మహాగురువుల వాక్యముయొక్కయభిప్రాయమే గాని బుద్ధిపూర్వకముగా హత్యజేసికోవలెనని కాదు. అట్లు జేసినయడల మహాపాపము సంభవించును. ఆ మరణము దుర్మరణము. అది ఈశ్వరసేవకాదు. జీవహింసు

చే నీశ్వరహింస జేసినంతపాపము. శరీరము ననావశ్యకముగా విధివిహితముగాని కష్టములపాలు జేయగూడదనియు అట్లుగష్టము పెట్టినయెడల నా దేహమందంతర్యామియయియుండు భగవంతుని గష్టపెట్టినట్లగుననియు భగవద్గీతయందు జెప్పబడియున్నది.

అశాస్త్రవిహితం ఘోరం తప్యంతే యే తపో జనాః।
దంభాహంకారసంయుక్తాః కామరాగబలాన్వితాః॥
కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతసః।
మాంచైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్॥
(భ॥ గీ॥ 17 5—6.)

ఇకను బుద్ధిపూర్వకముగ దేహమును జంపుకొనువారల పాపమెంతయని జెప్పవచ్చును.

సేవకుడు గుర్వాజ్ఞానుసారము తనకెంతకష్టము సంభవించినను కార్యము జేయుటకు బూనుకొనవలెను. సులభమైనపని, తనకు సమాధానమైన పని జేయుటయందు జాగరూకత గలిగియుండుటయును, తనకాపద కలుగుచో వెనుదీయుటయును, సన్మార్గపక్షము కాదు. ఋషులు లోకోపకారార్థ మనేక కార్యములు నెరవేర్చుచుందురు. వానిలో కొన్నిటిని దమ శిష్యకోటివలన జేయించుదురు. కష్టము సంభవించునని వెనుదీయు శిష్యునివలన నుపయోగము లేదు.

దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥
(భ॥ గీ॥ 18.)

కష్టము దుఃఖము ప్రాప్తమవునని వెఱచి పనినిమానుకొనువాడు రాజస స్వభావము కలవాడని భగవద్గీతయందు జెప్పబడియున్నది. ఎట్టి కార్యమైన తనకెంత దుఃఖమును గలుగజేయు కార్యమైనను లోకోపకారార్థము గురుభగవత్ప్రీతికొఱకు జేయ బూనుకొనువాడే గురుకటాక్షమునకు బాత్రుడగును. అట్లుసాహ

సించి కార్యమును నిర్వహించువానిని మహానుభావులు మఱువ రు. సత్కార్యమునకై యింత త్యాగము జేసెనేయని యాహ్లాదిం చి యెన్నిజన్మములకైనను వానిని గాపాడుచు వృద్ధికి దెత్తురు. ఇప్పుడు ఐరోపాయుద్ధములో ననేకులు దేశక్షేమముకొఱకు ప్రాణములను సంతోషముతో విడుచుచున్నారని మనకుదెలిసి యున్నదికదా. అట్టివారిలో ననేకులు లేత వయస్సులోనుండి ఆరోగ్యబల ఐశ్వర్య దారాపుత్రాదిసుఖంబుల ననుభవించు చుండి దేశముకొఱకును ప్రభుమానరక్షణార్థమును సర్వసుఖము లను విడనాడి యుత్సాహముతో యుద్ధరంగమున కఱిగి శౌ ర్యముతో బోరాడి దేహత్యాగము జేసినవారున్నారు. వారి త్యాగము నిష్ఫలము కానేరదు. శీఘ్రకాలములోనే వారుత్తమ జన్మమెత్తి పూర్వమునకన్న నెక్కుడుగ బరోపకార మొనర్చుట కవకాశముకలిగి నియతకర్మను భగవత్ప్రీతిగ నొనర్చి లోకమునకు హితముజేయు వారుగాబోదురని దివ్యజ్ఞానముగల పెద్దలు జెప్పు చున్నారు. అట్టి త్యాగబుద్ధిగలవారే నిజమైనగురుభక్తులు. సకల ప్రీతికరమైన వానిని విడుచుటయే హృదయరక్తమును విడుచుట. విడిచి సేవకు బూనుకొనుటయే గురుసన్నిధానమందు నిలువ గలుగుట. కనుక యీయుదవవాక్యము పరమ వైరాగ్యము ను బోధించుచున్నదని భావించవలెను.

పంచవాక్యములు సంపూర్ణం.

జి॥ శంకరరావు.

# సమత.

వేదాంత భాషయందు కొన్నికొన్ని భావములను తెలియ పఱచుటకు కొన్నికొన్ని పదములున్నవి. ఇట్టి పదములకు పరిభాష యనిపేరు. సమత, కర్మము, సంసారము, భవము, ముక్తి అనునవి ఇట్టిపదములలోనివే. సామాన్యప్రజలు ఇట్టిపదములను పలుమార్లు వాడుచున్నారు. పండితులు నయితమిట్టిపదములను ఎక్కువగా ఉపయోగింతురు. అయిన నిట్టిపదములకు నిజమైన అర్థమిదియని తెలిసికొనక జనులభావములే పొరబడుచున్నవి. సమత అను పదమునందు జనులకుగల పొరబాటును కొంతవరకు సవరింప తివురుటయే యీవ్యాసముయొక్క యుద్దేశ్యము.

సమత అనుపదమునకు సమభావము, సర్వసమత్వము, అనునవి పర్యాయపదములు. సామాన్యజనులు అన్నివస్తువుల ను సమముగా చూచుటయే సమత యనిభావింతురు. అన్ని పదార్థములయందును ఈశ్వరాంశము ఉన్నదనియు, ఆకారణము చేత పదార్థములయందు భేదబుద్ధి తగదనియు వారనుకొందురు. దీర్ఘముగా విచారించినప్పుడు. ఈ అర్థముతో వారిమనస్సుకు తట్టుభావమెట్టిదో నిష్కర్ష చేయుట కష్టము. సమత అను పదము ను మన పెద్దలు ఏ యర్థముతో వాడిరో కొంత విచారింతము.

ఒక్కొక్క మనుష్యుడును సంతోషమును కోరి జీవించుట సహజమైయున్నది. ఈ సంతోషమనునది వారి వారి మనస్థి తులనుబట్టి పరిపరివిధములుగ నున్నది. దేహమునకుమాత్రము సంతోషమునిచ్చు సంగతులు కొన్నికలవు, మంచిభోజనము, మంచిపడక, చల్లనిగాలి యివియన్నియు అట్టిసంతోష కారణములు. ఇవి స్థిరమైనవికావు. ఆపదార్థములుండువరకును సంతోషము లుండునేకాని ఆపదార్థములు మనకబ్బనపుడు మనకుదుఃఖము వా టిల్లును. ఈకారణముచేతనే విచారపరులగువారు వీనిని విడిచి యెక్కువతరగతి సంతోషములను కోరుచుందురు.

బుద్ధి సంతోషములు రెండవ తరగతికి చేరినవి. మంచి కవిత్వము చదివిగ్రహించుట, విచారపరులతో సంభాషణచేయుట మున్నగునవి దేహసంతోషములకంటె స్థిరములని చెప్పవచ్చును. ప్రజలను పరిశీలించి చూచినప్పుడు, ఇట్టిబుద్ధిసంతోషముతో జీవించువారనేకులున్నారు. అయినను ఈ బుద్ధిసంతోషమునకంటె ఎక్కువగు మరియొకవిధమైన సంతోషమున్నది. దానిని దయాసంతోషమని చెప్పవచ్చును. ఈ దయాసంతోషమునకే మనపెద్దలు సమత యని పేరుపెట్టియున్నారు. ఈసమతయే మానవులు సాధించతగిన గుణములలో మిక్కిలి యెక్కువయైనది.

భగవద్భక్తుడగు త్యాగయ్య ఒకశ్రేష్ఠమైన కీర్తనను వ్రాసియున్నాడు. విద్వాంసులు దానిని పంచరత్నములలో నొకటి యని వాడెదరు. ఈ కీర్తన "ఎందరో మహానుభావులు" అనుపదములతో ఆరంభమగును. ఈకీర్తనయందు నాల్గవచరణము అతి శ్రేష్ఠమైనది. దానిని ఈక్రింద వ్రాయుచున్నాను.

"హరిగుణమణులను సరములుగళమున శోభిల్లుభక్తకోటులిలలో తెలివితో చెలిమితో కరుణగల్గి జగమెల్లను సుధాదృష్టిచే బ్రోచువారెందరో మహానుభావులు"

సమత యనుపదమునకు గల సంపూర్ణమైనయర్థ మీచరణము నందిమిడియున్నది. సమత యనగా తెలివి, చెలిమి, కరుణ ఈమూడిటియొక్క సమ్మేళనమే. ఒక్కమనుష్యునికి తెలివిమాత్రము కలిగియుండి, చెలిమి, కరుణలేనియెడల అట్టివాని జీవితమందు నిజమైన సంతోషముండదు. ఒకడు తానుదయావంతుడు కావలెనన్న తెలివి ముఖ్యమైన సాధనము, ఒకమనిషికి తెలివి కరుణ రెండును ఉండినను, చెలిమి లేకపోయినపక్షమున ఆరెండును సంపూర్ణమైన సంతోషము నొసగవు. మనము సాకుచుండు కుక్క, గుఱ్ఱము మొదలగు జంతువులయందు కరుణగలిగి యుండుట సహజమై యున్నది. అయితే, అట్టి కరుణయందు

చెలిమి కవకాశములేదు. కరుణ, తెలివియను రెండుగుణములు చెలిమితో కలిసినప్పుడే, ఆగుణము సమతయగును. పాలుకు మీగడ యెట్లో దయకు సమతయట్లు. మీగడకు వెన్న యెట్లో సమతకు చెలిమియట్లు. ఇట్టి సమత గలిగినవారి శక్తి అపారమైనది. ఈ సమత గల్గినవారు వేరుప్రయత్నములేకనే, త్యాగయ్యగారు చెప్పినట్లు తమదయగల చూపులచే మాత్రమే లోకములనే ఉద్ధరించగలవారై యుందురు.

ఈ సమత గలిగినవారే మానవకోటియందు ఘనులనుటకు భాగవతవాక్యము నొకటి నీక్రింద వ్రాసెదము.

సీ॥ తలప బ్రాహ్మణులుత్తములు వారికంటెను వేదవేత్తులు వేదవిదులకంటె। విలసితవేదార్థ విదులు వారలకంటె, సకు ధిక శాస్త్రసంశయమువాన్పు। మీమాంసకులు మఱి మీమాంసకులకంటె। నిజధర్మవిజ్ఞాన నిపుణులరయ। వారికంటెను సంగవర్జితచిత్తులు, దగవారికంటె సద్ధర్మపరులు.

తే॥ ధార్మికులకంటె నుత్తమోత్తములు వినుము
మత్సమర్పిత సకలధర్మస్వభావ
మహిమములు గల్గి యితర ధర్మములు విడిచి
సమత వర్తించునప్పుణ్యతముడు ఘనుడు.

వ॥ అట్టివాని.

క॥ కని సకలభోగగణములు,
మనమున నానంద జలధిమగ్నములగుచు౯
ఘనబహుమాన పురస్సర।
మనమున జాటిల్ల వినుతులర్థింజేయు౯

ఇదిగాక భగవద్గీతయందు ఈక్రిందిశ్లోకము ఈయర్థమునే బోధించుచున్నది. యీ యొకశ్లోకము గీతాసారమని చెప్పవచ్చును, భగవద్గీతలో ఈశ్లోకము లేకయుండెనేని లోకములో గీతకు విలువేయుండదు.

శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని।
శునిచైవశ్వపాకేచపండితా స్సమదర్శినః॥

అయితే ఈ శ్లోకముయొక్క నిజమైన భావమును అనేకులు గుర్తెరుగరు. విద్యావినయముగల బ్రాహ్మణుడు, ఆవు, ఏనుగు, కుక్క, కుక్కమాంసము తిను నీచుడు వీరినందరియందును పండితుడగువాడు సమదర్శనము కలిగియుండునని ఈ శ్లోకార్థము. ఈ శ్లోకమునకు భాష్యము లనేకములున్నవి. ఈ శ్లోకము ఇతర భాషలయందును పరివర్తింప బడియున్నది. ఈ భాష్యములను పరివర్తనములను చదువు వారికి అన్నివస్తువులను సమానమని చూచుటయే, సమదర్శన మనుట తప్ప మరియేమియు తోచదు. విద్యావినయ సంపన్నుడగు బ్రాహ్మణుని, కుక్కమాంసము తినునటువంటి నీచుని సమముగాచూచుటెట్లో ఊహించుటకు కాదు. కొందరు పండితులు ఈ యిద్దరియందును ఈశ్వరాంశ మొక్కటే అను భావము మనసుకు తట్టినతోడనే, ఈ శ్లోకార్థము జీవితమందు అనుష్ఠించినట్టేయని తలంతురు. ఇది గొప్ప భ్రాంతి. ఇది నిజమైన అర్థముకాదు. విద్యావినయ సంపన్నుడగు ఒక బ్రాహ్మణుడు సమదృష్టిగల వానియొద్దకు పోయినప్పుడు అట్టివాడు అట్టిబ్రాహ్మణుని మనస్సుయొక్క అంతస్థును గుర్తెరిగి అట్టి అంతస్తుకు తగినట్టు తన మనస్సుతో చెలిమి సాగించువాడై యుండును. కుక్కమాంసము తినునంతటి నీచుడైనను, సమదృష్టిగలవానియొద్దకు వచ్చునేని, వాని నైచ్యమునుగూర్చి అసహ్యించుకొనక ఆనైచ్యము తనకు సంభవించిన యెట్లుండునో అని పరిశీలించి, అట్టివానిమనస్సుయొక్క అంతస్థునందు తాను నిల్చి చూచి అట్టి మనస్థితికి గలకష్టములన్నియు గ్రహించి ఆకష్టముల నివారించను ప్రయత్నపడును.

త్రాగుబోతు ఒకడున్నాడనుకొందము. వాని త్రాగుబోతు తనము వదలించుట ఈశ్వర ప్రీతిగదా! ఈ వ్యసనము వదలించుటకు

చేయు ప్రయత్నములు అనేకములు గలవు. త్రాగుబోతుతనము చెడ్డది యని తెలిసికొనినవాడు అట్టిత్రాగుబోతు యొద్దకుబోయి మంచిదికాదని చెప్పవచ్చును. అట్లు చెప్పుటయందు తాను త్రాగుబోతుకాదను నహంకారముతోను, త్రాగుబోతు తనకంటె తక్కువ యనుభావముతో ఉపదేశించినప్పుడు అట్టి యుపదేశమునందు త్రాగుబోతు నుద్ధరించుశక్తి బొత్తిగానుండదు. సమదృష్టిగలవాని ప్రయత్నము వేరువిధమైయుండును. సమదృష్టిగలవాడు త్రాగుబోతుతనము తనకు ఘటించెనేని తనకెట్లుండునో యని యూహించు శక్తికలవాడై యుండును. ఇట్లు ఒక్కొక్కని అంతస్థును ఊహించునప్పుడే తానుద్ధరించ తలచుకొన్న త్రాగుబోతునందు నిజమైన దయగలవాడగును. అట్టి దయతో శ్రద్ధయు నీవచ్చును. ఇట్టి దయాశ్రద్ధలు కలిగినప్పుడు అట్టి త్రాగుబోతు కల్లంగడికిపోవుచున్నను వానిని వెంబడించి వాని భుజముపైన చేయివేసుకొని కనులనీరుగార చెలిమిగల్గి వానిని మరలింపచొచ్చును. ఇట్టివాడే సమత గల్గినవాడు. ఈమన స్థితికే సమతయని యర్థము, ఇట్టివాని ప్రయత్నములు విఫలమై, దుఃఖించునేని ఆదుఃఖమునందు లోకమునుద్ధరించుశక్తి అంకుర మిమిడియున్నదని చెప్పవచ్చును.

ఇట్లు దుఃఖించిన వారిలో ప్రహ్లాదుడొకడు. విష్ణువు హిరణ్యకశిపునకు ముక్తినొసగిన పిమ్మట ప్రహ్లాదుని భక్తికి మెచ్చి యాభక్తుని, కావలసిన వరములను కోరికొమ్మనెను.

మ॥ భగవద్దివ్యగుణానువర్తనసుధా।
ప్రాప్తైకచిత్తుండనై। బెగడన్ సంసరణోగ్రవైతరణికిన్।
భిన్నాత్ములై తావకీయగుణస్తోత్ర పరాఙ్ముఖత్వమున।
మాయాసౌఖ్యభావంబులన్। సుగలింగానని
మూఢులంగనిమదిన్ శోకింతు। సర్వేశ్వరా॥

ఈ దుఃఖమే ప్రహ్లాదుని సమతకు ఆనవాలు. భాగవ

తమున ప్రహ్లాదుని గుణములు వర్ణించుటయందు "తనయందు న ఖిలభూతములందు నొకభంగి సమవర్తనంబున జరుగువాడు" అని యున్నది. ఇట్టి సమతను అభ్యాసముచేత ఒకడు సాధిం చినప్పుడు ఒకటే కాలమునందు అనేకుల మనస్థితియొక్క యం తస్థులయందు నిలిచి వారివారి సుఖదుఃఖముల తాననుభవించుట చే దుఃఖములు తగ్గుటయు, సంతోషము హెచ్చుటయు సంభవిం చును. సర్వేశ్వరునియందు గల సమత యిట్టిదని చూపుటకే దశమస్కంధమందలి రాసక్రీడ దృష్టాంతము. ఆయీశ్వరశక్తిచే త ఒక్కొక్క గోపికకును సంతోషమునొసగుటకై ఒక్కొక్క కృష్ణుడు ప్రకటనుండ గల్గుట సమతకు తార్కాణము.

పంచములు మున్నగు హీనజాతివారు మనయండ జేరిన ప్పుడు వారిని హీనముగాచూచినయెడల మనసు నొప్పిగల్గునని తెలిసికొని వారియెడల ప్రియముగల్గి వర్తించుట సమత.

విద్యా వినయములులేక మౌఢ్యముతో జీవించు గ్రామ జనుల కష్టముల నూహించి వారికి తెలివియొసగ జూచుట సమత. అనాథలగు స్త్రీ జనుల శ్రమసంకటములను గుర్తించి వారిదుఃఖ ముల తగ్గింపజూచుట సమత. మడకలు దున్ని భారములనీడ్చి కపిలె లాగు మూగజంతువుల దుఃఖముల నెరిగి వాటిని యాదరిం ప సమకట్టుట సమత. నీరులేక శుష్కించుచుండు వృక్షజాల ము సోలియాడునప్పుడు వానియందు దయగల్గి నీరువేయ య త్నించుట సమత. కలరా ప్లేగు మున్నగు బాధలనుండి క్షీ ణించుచుండు గ్రామముల యందలి కష్టములు తనవని భావించి సవరింపజూచుట సమత. వేయేల, ఈశ్వర సృష్టియందు ఒ క్కొక్క పదార్థమును తానుగా నుండునట్లూహించి ప్రవర్తింప జూచుట సమత.

ఇట్లు సమత అభ్యాసముచే సాధింప తగినది. ఒక భా షగాని, ఒక శిల్పముగాని మనపాట్లకొరకై నేర్చుట కారంభిం

చినది మొదలు వానిని సాధించువరకు సంవత్సరములు కొలది మనము శ్రమించుచున్నారము. ఆత్మోద్ధారమునకై సాధించవలసిన ఈ సమతకు అభ్యాసమక్కరలేదా? తెల్లవారిలేచి ఈశ్వరుని ధ్యానించునప్పుడు నేను దయామయుడు గావలెనని యనుకొనుటయందు కష్టమేమున్నది? మన తలంపులలో శక్తియిమిడియున్నది. నేదయామయుడు కావలెనను తలంపు పలుమార్లు మనస్సుకు వచ్చునేని కొంతకాలములోనే అట్టి తలంపు చింతగా ముదురును. ఇట్టి చింత బలిసినప్పుడు మనకు తెలియకనే మనప్రవర్తనము కుదిరి మనము దయానంతుల మగుదుము. దీనికి దయగల తలంపులు తలంచుచుండుటకన్న వేరు మార్గము లేదు. తలంపు మనసులో నుండునది గనుక మనము పోయిన చోటికెల్ల వాటిని గొనిపోవచ్చును. మోయుటకు బరువైన పదార్థములు కావు. ప్రయాణమై పోవుచుండు నప్పుడును పనిలేకయూరకుండునప్పుడును వెతకి దయగల తలంపులే తలంచుచుండుట సమతయను పరమార్థసాధనకు మొదటిపాదము. గుణములలో సమత దొడ్డది. సమత మహాశక్తిమత్తమైనది. సమతచే కొండయు పిండిచేయవచ్చును. సమతగల్గెనేని సామ్రాజ్యములనే నిర్వహించవచ్చును, సమతగల్గినవారికి సద్గతి తామున్న చోటికి వెతకికొని వచ్చును. ఈ సమతనే బ్రహ్మజ్ఞాన సంఘము వారు యూనివర్సల్ బ్రదర్ హుడ్డనియు, సర్వభ్రాతృభావమనియు పిలుతురు. ఇవి సమతలోని గంభీరమైన యర్థమును వెల్లడించుటకు చాలినపదములుకావు. మనము కోరదగిన వరములలో సమతయే గొప్పది.

సమతను సాధించినవారికి భయముండదు. వారినిచూచి లోకము భయపడదు. ఇట్టి సమతనుసాధించిన వారిలో శుకమహాముని యొక్క జీవితము గొప్పదృష్టాంతము.

యము. ఇట్లే పంచభూతములు, పంచీకరణములు, పంచకోశములు, షడ్గుణములు, షడ్రిపులు, సప్తభూతములు, సప్తలోకములు, సప్తభూమికలు, అష్టమూర్తులు, అష్టపశువులు మొదలగునవి చాల వ్రాసితిమి. డిమ్మీ 8 పుటల సైజున ౨౩౨ పుటలు గలిగియున్నను వెలను ౦—౮—౦ ఉంచినారము.

# త్రివర్గ ప్రదీపిక.

## టీకా తాత్పర్య విశేషార్థ సమన్వితము.

ఈగ్రంథమునకు ద్రావిడామ్నాయమని వ్యవహారముగలదు. ద్రవిడభాషయందు ఈగ్రంథమునకుగల ప్రసిద్ధిఏగ్రంథమునకులేదు. ఆంధ్రభాషయందు శ్రీమహాభారతమునకు ఎట్టిగౌరవమో అరవమునందు ఈగ్రంథమునకు అట్టిగౌరవముగలదు. ప్రథమమున ౨౦ పుటలయందు ద్రావిడగ్రంథకర్తయగు తిరువళ్ళువరు నాయనారుగారి జీవితచరిత్రము వ్రాయబడియున్నది.

౧. భాగము. ధర్మకాండము:—ఇదిప్రవృత్తి ప్రకరణము నివృత్తిప్రకరణము అని రెండుభాగములు. ౧ దానియందు ౨౮ అధ్యాయములు. భగవన్మహిమ, వర్షమహిమ, యతిప్రశంస, ధర్మ, గార్హస్థ్య, పుత్ర, దయాగుణ, ఆతిథ్యప్రియవక్తృత్వ, కృతజ్ఞతా ప్రశంస మొదలగునవి గలవు. ౨ వదానియందు ౧౮ విషయములు. జీవకారుణ్యము మాంసభుక్తి వర్జనము మొదలగునవిగలవు. డిమ్మీ 238 పుటలుగలది రూ. ౧—౦—౦.

౨. వ భాగము అర్థకాండము:—దీనియందు రాజ్యప్రకరణము, లింగప్రకరణము, శేషప్రకరణము, అని 3 ప్రకరణములు గలవు. ౧ ప్రకరణమున రాజమహిమ, విద్య శిక్షణము శ్రవణము, వివేకము షడ్వర్గనిగ్రహము మున్నగు ౨౫ విషయములును, ౨ వ ప్రకరణమున మాంత్రికత్వము వాగ్మిత్వము మున్నగు 3౨ విషయములును 3 వ ప్రకరణమున లీనత్వము మానము, గౌరవము మున్నగు ౧3 విషయములును గలవు. 336 పుటలు 1—4—0.

☞ పైగ్రంథములు వలయువారు గుంటూరులో స్వధర్మప్రకాశిని మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

# Divyagnanadeepika.

CONTENTS OF THIS NUMBER.





## విజ్ఞాపనము.

కాకితముల ధరవిశేషము హెచ్చినది. యుద్ధారంభమునకు పూర్వము ఒకరూపాయ వెలగలిగియుండిన కాకితములు ఇపుడు అయిదురూపాయలకు దొరకుట దుర్లభమయినది. ఇట్టిస్థితిలో మాపత్రికను ఉచితముగా ఇవ్వవలయునని కోరుట న్యాయము కాదు. మంచికాలమున ననేకులకిచ్చితిమి, ఇక యుద్ధముముగియువఱకు నటుచేయ వశక్తులము.

కొందఱు మాపత్రికను పంపవలయునని మాకు ఉత్తరము వ్రాసి మేముపంపిన వెనుక త్రిప్పికొట్టిరి. ఇదిమిగుల దోషము. మాచదువరులందరు శక్త్యానుసారము మా యుద్యమమునకు తోడ్పడ ప్రార్థితులు.

చిత్తూరు,
1—11—1916.

పరమాత్ముని నరసింహయ్య,
పబ్లిషర్.

Registered No. M. 716

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక

**TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్రదివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె నెక్కువ ధర్మములేదు.)

**December 1916**

సంపుటము 7. డిసెంబరునెల 1916. సంచిక 9.

## విషయసూచిక.



సం॥రమునకు చందా 1 రూపాయ.

CHITTOOR. PRINTED BY M. RAMANUJA CHARIAR
AT THE VICTORIA JUBILEE PRESS
FOR P. NARASIMHA AIYA GARU, *Publisher*.

ఓమ్.



# దివ్యజ్ఞానదీపిక

**TELUGU MONTHLY ORGAN OF THEOSOPHY.**

ఆంధ్ర దివ్యజ్ఞాన మాసపత్రిక.

(సత్యమునకంటె వేఱొక ధర్మములేదు.)

సంపుటము 7. **December 1916** డిసెంబరునెల 1916. సంచిక 9.

## కాలదేశ వర్తమానములు.

దివ్యజ్ఞానసమాజము 1875 సం॥రం నవంబరునెల 17 తేది అమెరికా ఖండములోని న్యూయార్కునగరమున కర్నల్ అల్కాట్, బ్లావట్స్కీ అనునిద్దరు మహనీయులచే స్థాపింపఁబడినది. కడచిననెల 17 తేదికి 41 సం॥రములు నిండినవి. మొదట నెచ్చటనో ఒకమూల 5-6 గురుచేరి యేర్పరచిన ఈసమాజమిపుడు లోకమంతయువ్యాపించి అన్నిదేశములందును నానావర్ణములవారియందును సర్వమతస్థులయందును గౌరవమునొంది దిగంతవిశ్రాంతమై యున్నది. ఇపుడు దీనికిచేరిన శాఖాసమాజములు ప్రపంచములో 1000 ఉన్నవి. 26,000 మెంబర్లు ఇందులోచేరియున్నారు. మానవులందఱు పరస్పరము సహోదరులనియెడి భావమే వీరియొక్క ప్రధాన సిద్ధాంతమైయున్నది.

* * * *

ఈనెల కడపట దివ్యజ్ఞాన సమాజముయొక్క సాంవత్సరికోత్సవము లక్నో నగరమందు జరుగఁగలదు.

* * * *

1916 అక్టోబర్ 10 తేది రాత్రి బళ్లారి మహిళా తత్వజ్ఞాన సమాజముయొక్క ప్రెసిడెంటుగా నుండిన శ్రీమతి పబ్బతి రిందమ్మగారు స్వర్గస్థురాలైన సంగతి తెలుపుటకు చాల చింతించుచున్నాము. చిన్ననాటనుండియు నీమెకు వేదాంత విషయమందు చాల యభిరుచియుండెను. యౌవనమున సకల సంపదలతో కూడియున్నపుడును పరావిద్యయందీమెకు గల భక్తి శ్రద్ధలు తక్కువకాలేదు. సదా విచారపరుల సాంగత్యమునందే సంతసించుచు నధ్యాత్మశాస్త్రము నెడతెగక శ్రవణము జేయు చుండెను. తనభర్త స్వర్గస్థుడై నీటిబుగ్గవలె సంపద యంతయు తొలగిపోయినపుడును నామె తనధైర్యమును, పట్టుదలయును వదలక తాను శరణుబొందిన మరుదేవాపి మహానుభావుల సమాజమునందత్యంత శ్రద్ధాభక్తిగలదియై యనేకస్త్రీల నాసమాజమునకు నాకర్షించెను. మనదేశమున స్త్రీల నెట్టిస్థితిలో నుంచియున్నామో తెలిసియున్నదికదా! అరుదుగా నెచ్చటనో యొక నారీమణి స్త్రీజాతిని పరిశుద్ధము జేయగోరిపనిజేయ నారంభించిన మొదల పురుషులందరు నామెను పలువిధముల నాడుకొని యామెచేయు పనులకు విఘ్నములను కావించెదరు. స్వర్గస్థురాలైన పబ్బతిరిందమ్మగారిట్టి కష్టములను సయితమోర్చుకొని మహనీయుల కార్యమును జరిపెను. ఆమె యకాల మరణము మహిళా తత్వజ్ఞాన సమాజమున కెంతయో నష్టముగా నున్నది గాని మహాత్ముల సేవకొరకై యేర్పడిన నాసమాజము యీమె పోయినమాత్రముననే నిలుచుటలేదు. ఆపదవికేర్పరచబడిన సుంకరి కరెమ్మగారును కార్యదర్శియగు ముత్యాల అచ్చమ్మగారును నెప్పటివలె సమస్తకార్యములను నడిపింతురని నమ్ము

చున్నాము.

గతించిన రిందమ్మగారి కుమారుడు శేషయ్యశెట్టిగారు తత్వజ్ఞానసమాజమున కేర్పరుచబడిన సన్యాసులలో నొకరైయున్నారు. వారి మాతోశ్రీగారు బూనియుండిన పనిని తాము వహించి స్త్రీ సమాజము నుద్ధరింతురుగాక యని నిరీక్షించుచున్నాము. తమస్వకార్యములను వదలి స్త్రీలకు తత్వజ్ఞానమును బోధపరుచుటకై కంకణబద్ధులై నిలిచియున్న చింతకుంట సుబ్బాశాస్త్రిల వారెప్పటివలె నభిమానముతో తమ బోధనాకార్యను జేయుదురుగాక యని నమ్ముచున్నాము.

తమకు మార్గదర్శిగా నిలిచి సమస్త కష్టముల నోర్చుకొని తమకు మేలుజేసిన శ్రీమతిరిందమ్మగారి యనువర్తకులగు బళ్లారి మహిళా తత్వజ్ఞాన సమాజపు సోదరీమణులు ధైర్యముదెచ్చుకొని లోకసేవామార్గమున నెడతెగక వర్తింతురుగాక యని నమ్మెదము.

* * *

కడచిన అక్టోబర్ నెల 21-22 తేదులయందు బళ్లారి అనంతపురముజిల్లాల దివ్యజ్ఞానసమాజ శాఖలసంఘము ఆదవానియందు కూడియుండెడి కార్యములన్నియు మిక్కిలి విజృంభణముతో జరిపెను.

ప్రసిద్ధిగాంచిన దివ్యజ్ఞాన సమాజమునకు అధ్యక్షురాలగు శ్రీమతి శ్రీ ఆనిబిసంటమ్మగారు అగ్రాసనాధి పత్యము వహించిరి. సభికులు బళ్లారి, అనంతపురము, హొసపేట, రూపనగుడి, ధర్మవరము, పెనుగొండ, కడప, కర్నూలు, ఆడియారు, రాయచూరు, మొళకాల్మురువు మొదలగు శాఖలనుండి వచ్చియుండిరి.

శ్రీమతి ఆనిబిసంటమ్మగారు అగ్రాసనాధి పత్యమువహించి జరిపిన యుపన్యాసము వర్ణించుటకు శక్యముకాదు. తెలుగులో

బ్రహ్మశ్రీ జీ. శంకరరావుగారు ఇచ్చిన కర్మయోగమునుగురించిన యుపన్యాసము అత్యంత శ్లాఘ్యముగ నుండినది.

ఆదవాని సభవారు ఇతరస్థలములనుండి వచ్చిన వారికి నివాసములును అన్నపానాదుల వసతులును చేసియుండిరి.

ఆదవాని దివ్యజ్ఞాన సభాశాఖ ఇంతవరకు గాఢ నిద్రయందుండినది. ఇప్పుడు కొందరు నూతనముగ సభకు చేరినందున ఇకమీదనైనను మేల్కొని క్రమముగ చేయతగిన కార్యములు జాగ్రతతో నెరవేర్తురని నమ్ముచున్నారము.

చేరినవారిలో కొందరు సుగుణశాలి వారున్నారు. వీరియందు త్రాగుట కులాచారముగ నేర్పడినది. చేరినవారందరు ఆదుర్వ్యాధుకను తాము వదలుటమాత్రముగాక సాధ్యమైనవఱకు తమ యిష్టులను బంధువులను ఆదుర్వ్యాధుకనుండి మరలించుటకు సర్వప్రయత్నములు చేసెదమని ప్రతిజ్ఞ చేసినారు. ఇదెంత గొప్పపని! దివ్యజ్ఞాన సభ చేయు నుపకారమును అందరును స్మరించవలెను.

అచ్చటనే ఆదినములందే సంఘ సంస్కార సభయు చేరెను. దీనికి బ్రహ్మశ్రీ, హైకోర్టుజడ్జి దివాన్ బహదూర్ సదాశివయ్యర్ గారు అగ్రాసనాధిపత్యము వహించిరి.

వీరు వ్రాసి చదివిన యుపన్యాసము ఉత్తమోత్తముగ నుండెను. దీని ముఖ్య సారాంశమేమన సమస్త సంస్కారములు భగవంతుని చెందుటకును మన మాతృభూమియగు భరతఖండము ప్రఖ్యాతిచెందుటకును సాధకములుగా నుండవలెగాని ఇంద్రియలోలతకును క్షణభంగురములైన ఇహసుఖములకును లాగువవిగా నుండకూడదని నొక్కి వక్కాణించిరి.

ఇతరులు అనేకవిధముల సంఘ సంస్కారవిషయమై మాటలాడిరి. అయితే వీరిలో వాటిని ఆచారమునకు తెచ్చువారెందరేర్పడుదురో చూడవలయును.

# పరలోకయాత్ర.

మరణానంతరమున మనుష్యుని స్వభావము, గుణము, శక్తి మొదలగునవి యెట్లుండునో విచారింతము. మరణకాలమందు జీవుఁడు స్థూలశరీరమును మాత్రము పరిత్యజించును. సూక్ష్మ శరీరము యథాప్రకారమే యుండును. ఇంద్రియములు సూక్ష్మ శరీరము నాశ్రయించుకొని యున్నవి. సూక్ష్మశరీరము "పంచ ప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్" అని వర్ణింపఁబడి యున్నది. స్థూలశరీరమునందే ఇంద్రియములున్నట్టు బయటికి గన్పడినను యథార్థమున నింద్రియశక్తి సూక్ష్మదేహమున నున్నది. స్థూలశరీరమున నింద్రియగోళములు మాత్రమున్నవి. ఎట్లన;- నేత్రేంద్రియమనఁగా నేత్రములందుండెడి గోళములుగావు. ఆగోళకములద్వారా బాహ్యవస్తురూపముల గ్రహించు శక్తి గలది నేత్రేంద్రియము. అవ్విధముననే సర్వేంద్రియములు నాయా గోళములకంటె భిన్నములై ఆయాగోళములద్వారా తమతమ వ్యాపారముల జేయును. కావున నింద్రియములకు నధిష్ఠానమైనది సూక్ష్మదేహము. మరణకాలమున సూక్ష్మదేహము నశింప దగుటచే మరణానంతరమున సయిత మింద్రియములు యథాస్థితినుండు. రాగద్వేషము లింద్రియముల నంటియుండు. కాఁబట్టి ఎవనికిఁగాని బ్రతికియున్నపుడు రాగద్వేషము లెట్లుండునో మృతిజెందిన వెనుకను నటులనేయుండు. మృతి జెందినమాత్రమున మనుష్యుని స్వభావ మెంతమాత్రము మాఱదు. వాని స్వభావసిద్ధమగు గుణములు వానినివీడువవు. కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాదులన్నియు పూర్వము వలెనే యుండును. వాని యుద్రేకము కొంచెమధికమై యుండుటయు గలదు.

ఇచట ముంగోపియై యున్నవాఁడు భువర్లోకమునను ముం

గోపియై యుండు. ఇచట నోర్వలేమితనము గలిగినవాఁడు భువర్లోకమునను నటులనే యుండును. ఇచట త్రాగుబోతై యున్నవాఁడచటను సురాపానాసక్తుఁడై యుండు. ఇచట స్త్రీలోలుఁడై యున్నవాఁడు అచటను కామోద్రేకముతోఁ గుందుచుండు. బ్రతికి యున్నపుడు కుట్రలు మరాలోచనలు చేయుచుండినవాఁడు పరలోకమున నట్లే చేయుచుండును. ఇచట యెవ్వరియెడ శత్రుత్వము జాటించెనో చచ్చియు వారియెడ శత్రుత్వమే జూపును. ఒకప్పుడు పిశాచియై వారింబట్టి వేధించు. తాను స్వయముగా పగదీర్చికొన ననువుగానిచో తనయిష్టసంకల్పమునకు ననుగుణ్యస్వభావముగల సజీవుడగు మఱియొకనిం దనకు వశవర్తిగావించుకొని వానిద్వారా తనసంకల్పము నెరవేర్చికొనును.

ఇచట కేవలము దుర్వృత్తియందు కాలము గడపుచున్నవారికి చనిపోయిన పిమ్మట సయితము ఆదుర్బుద్ధి వదలదు. ఆదుర్మార్గకార్యములు చేయుటకు వారికి స్థూలశరీరము లేకుండుటచే బ్రతికియుండువారిని ఆశ్రయించి వారివలన తమయాశలఁ దీర్చికొందురు. మద్యపానాపేక్ష గలవాఁడు స్వయముగ త్రాగుటకు వీలు లేనందున త్రాగుబోతుల శరీరమునందుఁ బ్రవేశించి వారు త్రాగెడు మద్యమువలన సంతుష్టుండగును. కామాతురుఁడైన వాఁడు యౌవనవంతులైన స్త్రీ పురుషుల దేహములోఁ బ్రవేశించి వారిద్వారా కామసుఖము ననుభవించును. దీనినే దయ్యము బట్టుట యందురు. ఇది దయ్యమునకును దయ్యముపట్టినవానికిని ఉభయులకును పెక్కు దురవస్థలకు గారణమగు. బ్రతికియున్నపుడే కామోద్రేకము నణచుకొనక పోవుటచేతనే యీలాటి యుపద్రవములు గలుగును.

జీవించి యున్నప్పు డెవరివలన దాను భీతి జెందియుండెనో పరలోకమునను వారిని జూచి భయపడును. ఇచట మనచే బాధనొందిన వారందఱు పరలోకమున మనలను బాధింతురు.

ఇచట నెవరివలన మనకు విశేషభయము కలిగియుండునో అట్టి వారు మృతినొందినపుడు పీడవోలఁగెగదా యని ఒకపుడు సంత సింతుము. అది యట్లుగాదు. అట్టివాఁడు పరలోకమున వేచియుండి మనమచటఁ జేరగానే మునుపటికంటె పెక్కుమడుంగు లధికము గ మనకు భయము గలిగించు. లోకమున ననేకులకు కంటకుఁడై యుండెనేని పరలోకమున వారందఱొక్కటిగ గుమిగూడి యటి వానిపై పగదీర్చికొందురు. మనుష్యులను మాత్రమే కాదు తిర గ్జంతువుల హింసించువారు సయితా మట్టిబాధల నొందుదురు.

ఈ విషయము భాగవత చతుర్థస్కంధమునందు ప్రాచీన బర్హి యనురాజు చరిత్రమునందు సూచింపబడియున్నది. ప్రాచీన బర్హి కేవలము కర్మాసక్తుఁడై యనేక యజ్ఞములుచేసి లెక్కలేని పశువులను హింసించె. అతనియెడ కృపాయత్తచిత్తుండై నారదు డొక్కనాడతనికిం బ్రత్యక్షుండై యతనితోనిట్లనియె. రాజా! ఈ యజ్ఞములవలన నీకు శ్రేయంబు లభింపదు, నీచేఁజంపఁబడిన పశువులు వేలసంఖ్యలై యున్నవి,

శ్లో॥ ఏ తేత్వాంసంప్ర తీక్షంతేస్మరంతోవైశసంతవ
సంపరేతమయః కూటైః ఛిందంత్యుత్థితమన్యవః॥

తా॥ అవి యన్నియు నీవుచేసిన ఘాతుకమును స్మరించుచున్న వై నీవు పరలోకమునకు రాఁగానే నిన్ను హింసింపఁదలచి ఇనుప ములుకులవంటి కొమ్ములతో నీమరణమునకై కాచుకొని యున్నవి. ఇట్టిసంకటంబును తొలఁగద్రోచికొనుటకై నీకొక్క యితిహాసంబు చెప్పెదనని యతనికి పురంజనోపాఖ్యానంబుం జెప్పెను.

యజ్ఞంబునఁ బశువధ చేయువారి గతియె ఇట్లుండ క్షుద్ర దేవతల తృప్తిజేయుటకై జీవజంతువుల బలియిచ్చువారును అం తకంటె క్రూరకర్ములగు స్వోదర పూరణార్థము జీవహింస చేయు వారును పరలోకమున ననుభవించఁగల బాధలిట్టిట్టివని జెప్ప శక్యమే!

భూలోకము నందువలెనే భువర్లోకమందును మనుజులు వారి వారికి తగిన సాంగత్యమును వెదకికొనుదురు. త్రాగుబోతులందఱు నొకచోటఁజేరుదురు. దొంగలందఱొకటిగా గూడుదురు. జూదరులందఱు నొకయెడ ప్రోగగుదురు. ఒకరితోనొకరు మాట్లాడుకొనుటకు ఈలోకమునందు వలెనే భువర్లోకమందును భాషావశ్యకము కలిగియుండుటచే సామాన్యముగ ఏ భాషతో మాట్లాడువారు ఆ భాష తెలిసినవారియొద్ద జేరుదురు. మనుజుడిచట నేవృత్తివలన జీవించుచుండెనో ఆ వృత్తికి సంబంధించినవారి సహవాసము వెదకును.

కొన్ని దయ్యములు తమదుష్టకార్యముల నెరవేర్చుకొనుటకనుకూలమైన యొకవస్తువు నాశ్రయించుకొని యుండును. దీనికి దృష్టాంతమొక కథ.

కొంతకాలము క్రిందట నొక యూరిలో నొక మహమ్మదీయుండుండెను. వానిభార్య మరియొకనిం దీసుకొని లేచిపోయెను. ఈ వృత్తాంతము భర్తయెఱింగి వారుండుస్థలమునకు వెళ్లిచూడగా వారిద్దఱు కలిసియుండిరి. దానింజూచి వాఁడు క్రోధపూరితుఁడై అచ్చటనున్న బల్లెముతో మొదట తనభార్యను పొడిచి చంపి వెంటనే పరపురుషునింగూడ జంపెను. అంతట వానికి వీరావేశముకలిగి స్త్రీజాతినే నిర్మూలము చేసెదనని ప్రతిజ్ఞచేసి ఆబల్లెముతో మఱికొందఱు స్త్రీలంజంపెను. అంతట కొన్నాళ్లకు వాఁడును జంపబడెను. తత్క్షణము వాఁడు పిశాచియై ఆబల్లెము నాశ్రయించెను. అదిమొదలుఆబల్లెము నెవఁడు చేతబట్టుకొన్నను వానికి స్త్రీలవధించవలయుననిబుద్ధిపుట్టుటయు వాఁడు దానితో స్త్రీలను పొడిచిచంపుటయు నీప్రకార మనేక సంవత్సరములు జరిగెను. అది యనేకస్థలములకు మారెను. అనేకులచేతఁ దొరికెను. పోయినచోటనంతయు స్త్రీహత్యలకు కారణభూతముగ నుండెను. ఇట్లుండ నొకగొప్ప మాంత్రికుని కీవృత్తాంతము దె

గొని వాడు ఆ ఆయుధముం దెప్పించి దన చేతం బట్టుకొనెను. బట్టు
కొనంగానే ఆసమీపముననున్న యొకస్త్రీవైపునకు ఎవరో తన్ను
బలాత్కారముగా పట్టి యీడ్చినట్టు వానికిందోచెను. వాండా
యాకర్షణను నిగ్రహించి తన యోగశక్తివలన విమర్శించగా
నా తురకదయ్యము వానికిం గోచరించెను. నీవెవండవు ఎందుని
మిత్తమీ యాయుధము నాశ్రయించి యున్నావని మాంత్రికుండడుగ
నాదయ్యము తన వృత్తాంతమును సవిస్తరముగ జెప్పెను. అంతట
నా మాంత్రికుం డాదయ్యమునకు ధర్మబుద్ధి నుపదేశించి వాని నా
బల్లెమునుండి తొలంగం గొట్టి ఆబల్లెమును తుత్తునకలు గావించెను.
అంతట మహమ్మదీయుండును భూలోక బంధమునుండి విడువంబడి
నవాండై యూర్ధ్వముఖుండై పరలోకయాత్రను సుఖముగ జరి
పెనని యామహనీయుండు వ్రాసియున్నాడు.

ఇంకయు నిట్టి దృష్టాంతములు పెక్కుగలవు. చనిపోయి
న తరువాత మనుజుడూర్ధ్వముఖుండై స్వర్గలోకమును గూర్చి పో
వలయునేగాని యధోముఖుండై భూలోకబంధముల దగిలికొని
యుండుట పరమ దౌర్భాగ్యము. కావున బ్రతికియున్నపుడే
కామక్రోధములం దగ్గించుకొని ఏ వస్తువుమీదగాని అధిక సంగము
లేక వర్తించుచువచ్చి ఉత్క్రమణ సమయమున ఇహలోక విష
యములనుండి మనంబును ద్రిప్పి భగవంతునిమీదనో ఆత్మమీదనో
పరలోకముమీదనో స్మరణనుంచినవాండై శరీరములోనుంచి లేచి
పోవు వాడు ధన్యుండు.

చనిపోయిన తర్వాత మనుష్యుని జ్ఞానము, శక్తి, సామర్థ్య
ము నివియన్నియు బ్రతికియున్నపుడు యుండినట్లే యుండును.
స్థూలశరీర పరిత్యాగమాత్రముచేం బురుషుడు పూర్వమునకంటె
జ్ఞానవంతుండుగాని శక్తివంతుండుగాని కానోపండు. అవివేకి
అవివేకిగానే ఉండును, బుద్ధిమంతుండు బుద్ధిమంతుండుగానే
యుండును. మూఢబుద్ధిగలవాండు మూఢుడుగానేయుండును.

లోకమునకు మంచిగాని చెఱుపుగాని చేయుట కిచట నెంతశక్తి వంతుఁడైయుండెనో పరలోకమునందును వానిశక్తి అంతమాత్ర మే యుండును.

మృతినొందినవారెప్పుడైన నగుపడుదురేని సామాన్యజనుఁడు భయపడును. అయ్యది గొప్పవిపత్తుగా దలచును. ఇది కేవల మవివేకము. వాఁడు బ్రతికియున్నపుడు వానినెన్ని మారులో చూచియుంటిమి గదా. అపుడు వానింజూచి మనమే [illegible]యపడుచుంటిమా? శరీరము పోయినకారణముచేతనే వా[illegible] భయకారణమెట్లగును? అట్టివాఁ డగుపడినపుడు మనము భ[illegible]క సహజముగ వానితో మాట్లాడినయెడల వాఁడు మనల [illegible]యు బాధించఁడు.

మృతినొందినవారికి అన్నపానాదులతోనక్కఱ యుండదు. కావున జీవనోపాయమునకును శరీరపోషణమునకును చేయవలసిన కార్యములేమియు వారికి నుండవు. బ్రతికియున్నపుడు ఉదరపోషణార్థమే యావత్కాలమును వినియోగించుచుండినవానికి భువర్లోకమున చేయునదిలేక పొద్దుబుచ్చుటయే కష్టమైయుండును. ఇచట గ్రంథశోధనమునందును జ్ఞానసంపాదనమునందును నాసక్తుఁడయి యున్నవాఁడు పరలోకమున నావ్యాసంగమునందే పరామర్శ గలిగియుండు. గ్రంథపఠనమునకును జ్ఞానాభివృద్ధికిని ఇచ[illegible]కంటె భువర్లోకమున సదుపాయము లధికముగనుండు. ఇచట సంతోషముగను సుఖముగను కాలము గడపుచుండిన వాఁడు భువర్లోకమునను అటులనే కాలము గడుపు. ఇచట నితరులకు సహాయము చేయుటయందాసక్తుఁడయి యున్నవాఁడు ఆలోకమునను పరోపకారము చేయుచుండు. వేయిమాటలేల ఏమనుజుఁడుగాని భూలోకమున నెట్లువర్తించెనో భువర్లోకమున నట్లేవర్తించు.

పరమాత్ముని నరసింహయ్య.

# ప్రసన్నత్వము.

## ఆనందసంకల్పములు.

సామాన్య సుఖమునకును ఆనందమునకు నుండు భేదము తేటపరచెద. జనులు తమకేమయిన బహుమానము లిచ్చినపుడును ఇతరులు ప్రేమించినపుడును సుఖులుగా నుందురు. అయితే అది బాహ్యములగు ప్రాపంచిక వస్తువులనుంచి కలిగిన సుఖము. నిజమయిన ఆనందము మీ లోపలినుండి వచ్చును. సర్వదా రాత్రింబగళ్లు బుద్బుదములతో నెగయుచు భూమినుండి పైకివచ్చు ఊటను మీరు చూచి యుండవచ్చును. అట్లనే నిజమైన ఆనందముండును. అది మీలోనుండి వచ్చునది. అది ఇతరులు మీకొనర్చు కార్యములపై ఆధారపడక నిరంతరము వచ్చుచునే యుండును. ఇతరులు మీకు సుఖము కలుగజేసినపుడు మీ యానందము ఆసుఖముద్వారా ప్రకాశించును. వారు సుఖము కలుగజేయనపుడును లోపల బుద్బుదములతో నెగయుచు దాని ప్రభావము వ్యాపించుచునే యథాప్రకారము ప్రవహించుచుండును.

మీలో ప్రతివానియందును పూర్ణానందము అంతశ్స్వభావముగా నుండును, బుద్ధిలక్షణము మీరందరు వినియుండవచ్చును. మీరు మనస్స్వభావమును కామస్వభావమును అతిక్రమించియున్నారు. మీయందు ఒకలక్షణమున్నది. అదే మీయందలి భగవంతుని యాత్మ. కావున మీలో ప్రతివానియందును ఆనందమున్నది. దానిని మీరు బయల్పరచవలెను.

మీరు దాని నెట్లు బయల్పరచవలెనను ప్రశ్న కలుగుచున్నది. ఉపకారపు తలంపులచే దానిని బాగుగ బయల్పరచగలరు. మీరితరులకు సహాయము చేయునపుడు అట్లు సహాయము చేయునది మీరుగారు, భగవంతుడే మీద్వారా చేయుచుండును. స్వలాభమునుండి మరలి ప్రపంచమునకై ఏదైన పనిచే

యుటకు ప్రయత్నించినపుడు భగవంతుడు మీకుతోడ్పడి మీతో కల సి పనిచేయును. ఉపకారముచేయు మీశక్తితో భగవంతుని శక్తి చేరును, మీరు సహాయము చేయుటకు తలంచినపుడు మీతో ఆయ న (భగవంతుడు) తలంచును. జీవితకాలమందు భగవంతుడును పరమగురువును మీతోకూడ తలంచుటకంటె అతిశయించిన భా గ్యమేదియు లేదు.

కనుక మీకు ఉపకారపు తలంపులు కలిగి యుండవలెను. అయితే ఎట్లు నేను ఉపకారిగా నుండవచ్చునని అడుగుదురు. మీ రు బాలురుగా నుండుటనుబట్టి దెలుసుకొనుటకు మిక్కిలి సులభ మైన కొన్ని మార్గములు కలవు. మొదటిది గృహమందే యున్నది. ఔదార్యము (దాతృత్వము) ఇంటియందు ప్రారంభించునని కేవ లము రమణీయముగ చెప్పబడినది. అయితే అన్నియు అక్కడ నే ప్రారంభించును. ప్రేమయు, ఉపకారమును ఇంటియందే ప్రారంభించవలెను. మీకు కేవలము సమీపమందుండు వారికి స హాయము చేయనపుడు దూరముననుండు ఇతరులకు పూర్తిగ సహా యము చేయుటకు అశక్తులైయుందురు. కనుక మొదటిమార్గము, కుటుంబములో మీకంటె పెద్దవారికిని, చిన్నవారికిని ఎట్లుసహాయ ముచేయుదునని తలంచుట. ప్రతికుటుంబములోను మీకంటె పెద్ద వారికి ఎట్లు తోడ్పడి వారిబ్రతుకు సుఖకరముగా నుండునట్లు చే యవలెననుటను గురించి మీకు తెలిసియుండును. మీకు ఇచ్చిన ప నిచేయుచు వారికి సహాయపరులుగా నుండుడు. అవ్విధంబుననే మీకంటె చిన్నవారివిషయమై వయసునందు చిన్నగాక జ్ఞాన మందు చిన్నగానుండు పనివాండ్రనుగురించి గమనించునపుడు వారిపనులు చక్కగ చేయునట్లు సహాయముచేయ యత్నించవ లెను. మీకు సహాయము చేయుటకుగాను వారిపనులనుండి మర లించకుండ దయతో చూడుడు. ఇవ్విధముననే పాఠశాలలందు కూడ నుండవలెను. మీరు పాఠశాలలో నుండునప్పుడు తోడ్పడు

ధర్మములు మీకున్నవి. మీ యుపాధ్యాయులకెట్లు మీరు సహాయభూతులుగా నుండుటను గురించి తలంచుచుండవలెను. మీతరగతిలో నుండు వారికందరికి ఆ కాలమంతయు అభిరుచి కలుగునట్లు ఏరీతిన చేయవలసినది సయితము తలంచుచుండవలెను. ఇట్లు చేయుట మీనిమిత్తము కాదు. ఇతరుల కందరికి అభిరుచి కలుగు నిమిత్తము. ఇట్లనే విద్యాశాల నంతటికి సహాయము చేయుటకు పూనవలెను. మీరు ఆటలాడునపుడు ఆయాట ఎట్లు సాఫల్య మొందించవలసినందుకై యోచించవలెను. మీకు సాఫల్యమగుటకు మాత్రముకాదు విద్యాశాలకంతయు సాఫల్యమగుటకు. ఇదిగో ఇట్టిసహాయము చేయు ఉత్సాహము మీరు కలిగియుండవలెను. ఎక్కడనైతే పరోపకార తలంపు ఉన్నదో అతలంచువాని హృదయమందు ఆనందముండును. ప్రదైన నొకయుపకార కార్యము చేయుచుండుటచే సర్వదా ఆనంద సంకల్పములను పొందియుండవలెను. అంతరాత్మయందు ఆనందపు అంకురమున్నది. అది పత్రములను పుష్పములను వికసింప చేయుచున్నది. దినదినము ఇంటియందును విద్యాశాలయందును ఎట్లుసహకారిగా నుండుటనుగురించి తలంచవలెను. ఇక్కడ మీరు సాఫల్య మొందుటచేతనే పరమగురువుకు మీరు ఎక్కువగా తోడ్పడు వారగుదురు. మీకు సమీపముననుండు కార్యములను చేయక దూరమున నుండు భవిష్యత్కార్యములను గురించి ఊరక తలపోయుచుండకుడు. ఆనందమూలమును మీరు మీయందు కనిపెట్టుటయందు సాఫల్యమును పొందవలసియున్నచో మొదటికర్తవ్యము మీకు అత్యంత సమీపముననుండు వారికనగా నింటియందుపకారగ కార్యము చేయుచుండుట యని జ్ఞాపకముంచవలెను.

ఆనంద సంకల్పమంతయు బహిర్ముఖముగా నున్నది. ఆనందముతో నిండిన సంకల్ప ముండునపుడెల్లను నీవు ఇతరునిగురించి తలంచుచుందువు, లేక ఇతరునికేమైన చేయవలెనని

అనుకొనుచుందువు. గనుక నీస్వ సుఖదుఃఖములను గురించిగాని విఫలమును గురించిగాని తలంపు ఉదయమయినపుడు దానినుండి మరలించి బాహ్యమునకు త్రిప్పవలెను. నిన్నుగురించి తలంచుచుండుట కాదని అనవచ్చును. నామనసుకు సుఖములేదనవచ్చును. అప్పుడు నీవు ఆతలంపునుండి మరలించుటకు దృఢప్రయత్నము చేయవలెను. అట్లు మరలించుటకు శ్రేష్ఠమయిన యుపాయము ఇంకొకని కేమిచేయుదునని తలంచుటకు యత్నించుటయని తెలియవలెను. పరమగురువు ఒకప్పుడేమిచెప్పి యుండినది జ్ఞప్తియుంచుకొనుము. నీమనసుకు తలంచుట కేతలంపులును లేని సమయమందు తలంచుటకై కొన్ని సంకల్పములు హృదయమందుంచియుండవలెను. హృదయమందుంచవలసిన తలంపులు మనోహరమయినదియు ఉపకారకరమయినవియుగా నుండవలెనని పరమగురువు అభిప్రాయము. నిన్నుగురించిన సమస్తమును బాగుగనుండి నీవు సుఖముగా నుండినపుడు నీసుఖము ఇతరునికిచ్చుటకు యత్నించుదువు. ఎవనికైన జాబువ్రాయుటకు యత్నించుదువు, లేక ఏవిధమునయిన నితరునికి సహాయముజేయబూనుదువు. కాలానుగతముగ నీహృదయాంతర్గతమందు రమ్యమైనట్టియు సహాయకరమయినట్టియు తలంపులు పెరుగునని తెలియును. ఈతలంపులు శత్రువునుండి రక్షించుకొనుటకు కోటవలెనుండును. శత్రువులగు స్వప్రయోజనపర తలంపులును, దుఃఖసంకల్పములును వచ్చినపుడు ప్రపంచమునకై స్వభావముగ నేర్పరచియుండిన సహాయకరమైనట్టియు, సర్వోత్తమములయిన తలంపుల కోటలో ప్రవేశించవచ్చును.

సశేషము.

జం॥ శ్రీనివాసరావు.

# ప్రవృత్తి నివృత్తి మార్గములు.

## బ్రహ్మచర్యాశ్రమము.

గత సంచికయందు విద్యార్థులగు ఇప్పటిబాలురకు పట్టుబడిన దురభ్యాసములను తొలగించు క్రమము ఈసంచికయందు వ్రాయబడునని సూచింపబడి యుండెను. ఇప్పుడావిషయము వ్రాయబడును.

వర్ణాశ్రమ ధర్మరక్షణ సభవారి బ్రహ్మచర్యాశ్రమ ధర్మము విధ్యుక్తముగ ఆచరింపచేయుట కేలాటి ప్రయత్నము చేయ బూనినారో తెలియకున్నది. వారి ప్రయత్నములన్నియు నీయాశ్రమ ధర్మమునకుగాను ఉపయోగించినయెడల నన్ని యాశ్రమ ధర్మములు చక్కపడు ననుటకు సంశయములేదు. ఈవిషయమై హిందువులందరు కలిసి దృఢప్రయత్నము చేయవలెననుట మాయభిప్రాయము.

ఇప్పుడుండు స్థితిగతులనుపట్టి యోచించగా పూర్వము మన శాస్త్రములలో చెప్పినట్లు ఆచరింపచేయుట అసాధ్యమని నిశ్చయమగుచున్నది. లోకోద్ధారణకై తాము ముక్తినొంది ఇతరులను తరింపజేయుటే విద్యసంపాదనయొక్క ముఖ్యోద్దేశమని తలంచి విద్య నేర్పువారును నేర్చుకొనువారును ప్రాయశః లేరనే చెప్పవచ్చును. సమస్తులును ద్రవ్యార్జనమునకును, అధికారము పొందుటకును తద్వారా స్వకుటుంబపోషణ, స్వసుఖానుభవము కలుగుటకును దానికి తగిన విద్యను నేర్చుకొనుచున్నారు. విద్య నేర్పువారును తమలాభమే ముఖ్యముగనెంచి విద్య నేర్పుచున్నారుగాని శిష్యహితమే ముఖ్యప్రయోజనముగా నెంచి చెప్పువారు అరుదైయున్నారు.

ప్రకృతము బ్రాహ్మణులలో చాలామట్టుకు అందరును, ఇతరులలోను బహుమందియు, రాజభాషయగు ఇంగ్లీషువిద్య నభ్య

సించుచున్నారు. ఈకాలమున కావిద్య నేర్వవలసినది అత్యావసరమనుటకు సంశయములేదు. ఈవిద్య నేర్పుటకు పర్పడిన విద్యాశాలలు తరుచుగ మనమతద్వేషులగు మిషనరీలచేతను, ప్రమతమునందును ప్రవేశించమని బద్ధకంకణము వహించిన సర్కారు దొరతనము వారిచేతను, స్థాపింపబడినవి. మిషనరీ విద్యాశాలలలో మన మతమునందెన్నివిధముల దోషములు ఆరోపణ చేయ శక్యమో అన్నివిధముల ఆరోపణజేసి బాలురకు బోధించుచుండుటచే మన మతగ్రంథములందు వారికి తుచ్ఛభావమును గ్రంథ కర్తలగు మహర్షులయందు అగౌరవమును మత తాత్పర్యములందు దురభిప్రాయమును పొంది ఇంచుక మతగ్రంథములందు చెప్పబడిన బాహ్యాచారము లాచరించుచుండెడు తలిదండ్రులను, బంధువులను, ఇతరులను హేళనచేయుటకు కారణమాయెను.

సర్కారు విద్యాశాలలందు స్వమతద్వేషము కలుగుటకు తగిన బోధలు చేయకుండినను మతవిషయ మేమాత్రమును ప్రశంసించకుండుటచే బాలురకు పరమార్థభావమే పట్టుబడక సకలము స్వలాభ స్వసుఖమునకే యను నభిప్రాయము హృదయమందు నాటి పరోపకారబుద్ధియు, పెద్దలయందు భక్తియు పూర్తిగనశించె.

మరియు బాలురకు మనదేశములయొక్క మహామహిమయు, శూరుల ధీరుల పరాక్రమ శౌర్య ధైర్యగుణాతిశయములును, మహర్షుల తపశ్శక్తియు, జనుల సత్యసంధత్వమును, నీతివర్తనయు, సకల విద్యా కౌశల్యమును, ఉదార చరిత్రమును, దయాపూర్ణత్వమును, విషయ విరక్తియు, ఇంద్రియ నిగ్రహప్రభావమును, మనస్థైర్యమును, అనన్య నిశ్చలమైన దైవభక్తియు, నిష్పక్షపాత సకలజనరంజకమైన రాజపరిపాలనాతిశయమును, నారీశిరోమణుల పతివ్రతా ప్రభావమును, గృహకృత్యనిపుణతయు,

మొదలగు సద్గుణైశ్వర్యముతో వెలుగుచుండిన మహాపురుషుల చరిత్రమును తెలుపు రామాయణ భారతాది గ్రంథములన్నియు పుక్కిటి కల్పనాకథలని బోధించుచు, తమదేశ ప్రభావమును తమ జనుల ధైర్య శౌర్యాది గుణాతిశయములను, తమ నీతిమార్గ ప్రవర్తనమును తెలుపు ఇంగ్లీషు చరిత్రలనే చదివించుటచే బాలురకు ఆదేశ సంప్రదాయములందే అభిరుచి గలిగి వారే గొప్పవారనెడు అభిప్రాయము హృదయములందు నాటుటచే మన దేశము అప్రయోజక మైనదనియు, మన మూలపురుషులు మూఢులనియు పశుప్రాయులనియు తలంచుట కవకాశము కలిగె.

విదేశీయులగు యూరోపువారే సర్వవిధముల శ్రేష్ఠులని బాలురకు మనస్సునందు వ్యాపించుట వలన వారి యాచారములలో సులభముగ నాచరించుటకు శక్యమయిన వన్నియు ఆచరించ నారంభించిరి. చుట్ట, బీడి, సిగరెట్లు మొదలగునవి త్రాగుట, తెల్లవారినది మొదలు రాత్రిపర్యంతము నాలుగయిదుమారులు ఆహారముగొనుట, తల్లిదండ్రులయందు విశ్వాసము తప్పుట, నాస్తికము హెచ్చుట ఈ మొదలగు అభ్యాసములు పట్టుబడి అతివేగముగ దేశమంతయు వ్యాపించ నారంభించెను.

ఈ దుర్గతిని ఆపుటకయి మహాత్ముల ప్రేరణచే దివ్యజ్ఞానసమాజపు మొదటి అధ్యక్షులుగా నుండిన కర్నల్ ఆల్కాటుగారీ దేశమునకు వచ్చి బాలురకును ఇతరజనులకును మనమతము యొక్క యుత్కృష్టతను, మన మూలపురుషులగు ఋషులప్రభావమును, పూర్వపు మనరాజులయొక్క నిష్పక్షపాత జనరంజకమయిన పలికను, వారి ధైర్యశౌర్య పరాక్రమములను శ్లాఘించిచెప్పుచు ఉపన్యాసము లిచ్చుచు వచ్చి, బాలురయొక్కయు జనులయొక్కయు మనోగతమయిన దురభిప్రాయములను మాన్పచక్కని త్రోవకు త్రిప్పిరి. వారు గతించిన తరువాత వారి స్థానమునకువచ్చిన శ్రీ ఆనిబిసంటమ్మగారు మన బాలురందును బాలికలం

దును వాత్సల్యతయు, మన దేశమందు మాతృభావమును వహించి అత్యంత దయాపరులయి వీరి నుద్ధరించుటకు కంకణబద్ధులయి బహు విధముల దృఢప్రయత్నములు చేయుచున్నారు. బాలబాలికలు చదువుటకు రామాయణ భారత సారమగు రెండు దివ్యగ్రంథములు ప్రకటించిరి. వానిలో మన మతద్వేషులగు మిషనరీలు, నాస్తికులు ఆక్షేపణచేయుటకు వీలుండు అంశములకు తగిన సమాధానములును, కారణములును విశదముగా నగుపరచినారు. మరియు మన దేశముయొక్కయు మనదేశపు శూరులయొక్కయు ధీరులయొక్కయు కథలుచేర్చి చదువువారికి, దేశమందును కులములందును అభిమానము గలిగి వారి నడవడిని అనుసరించుటకు ఉత్సాహము పుట్టునట్లు ఒక గ్రంథము వ్రాసియున్నారు. ఇది గాక అనేకలక్షల రూపాయలు పోగుచేసి కాశీపట్టణమందు మధ్యకళాశాల స్థాపించిరి. అచ్చట చదువు బాలురకు మన మతాచారములు బాగుగ బోధపడుటకు తగిన మూడు గ్రంథములు సనాతనధర్మప్రదర్శనమను నామముతో ప్రకటించిరి. ఆపుస్తకములు హిందూపాఠశాలలందు విశేషముగా వాడుచున్నారు. ఆ కళాశాలను వృద్ధిబొందించి హిందూయూనివర్సిటీవారి స్వాధీనముచేసిరి. అచ్చట మన పూర్వపు ధర్మములలో నాశమైన బ్రహ్మచర్య ధర్మమును మరలస్థాపించిరి. ఆ కళాశాలయందు వివాహముకానివారినే చేర్చుకొందురుగాని వివాహమైనవారిని చేర్చుటలేదు. ఇది ఈకాలమునకు తగిన బ్రహ్మచర్యాశ్రమ ధర్మము ఆచరించుటకు తెచ్చినట్లాయె ననుటకు సంశయమున్నదేమో రోహించుడు. ఇట్టి నిబంధన ప్రతివిద్యాశాలయందును ఆచారమునకు తెచ్చినట్లాయెనేని అశాస్త్రీయము లైనట్టివియు, వంశనాశకరములైనట్టివియు, శిశువులను యౌవనముపొందని బాలికలను మృత్యువుబారి కొసంగునట్టివియు, బాలుర తేజోవీర్యబలములను పీల్చునట్టివియునగు బాలబాలికా వివాహములు అడుగం

టి పోకుండునా? విద్యార్థులు అట్టి కాలములందు పూటకూలి యిండ్లలో పాసిన అన్నము అనారోగ్యములైన పదార్థములు భుజింపకుండ, ఆరోగ్యమైన భోజనము చేయుటకుగా ఆ కళాశాలకు చేర్చి ఒక భోజనశాల నేర్పరచియుంచినారు. అచ్చటనే సరస్వతీ ఆలయమొకటి స్థాపించినారు. వీనినన్నింటిని హిందూయూనివర్సిటీవారి స్వాధీనము చేసినతోడనే ఇంకొక విద్యాశాల ఆనగరమందే బాలబాలికలకు స్థాపించిరి. ఈపాఠశాలలో నొక మతగ్రంథములు మాత్రము గాక సర్వమతసమ్మతమైన యొక గ్రంథము వ్రాసి ప్రకటించి బాలురకు ఏమతమందుగాని ద్వేషబుద్ధిపుట్టకుండ సమస్తమతములకు జగదీశ్వరుడొకడే ధామమని సప్రమాణములతో యుక్తియుక్తముగ నేర్పుచున్నారు.

ఇదిగాక దివ్యజ్ఞానసభవారు తమస్వాధీనమునకు అనేక విద్యాశాలలు పుచ్చుకొని వానియందు మతవిషయములు నేర్పుచు గుణములు తీర్చుచు ఇహపరముల సుఖమనుభవించుటకు తగిన ఆచారములు ఆచరించుటకు తగినట్లు శిక్షించుచున్నారు.

ఇంతియె గాక మద్రాసునందుండు విద్యార్థులకు తగిన అన్నశాల లేదని తలచి వారికి యుక్తాహారమిచ్చుటకు నొక అన్నశాలయు, నివసించుటకు రమ్యమైనగృహమును, సభలు చేరి ఉపన్యాసము లిచ్చుటకు గొప్పవిశాలమైన కట్టడము గోక్లేకట్టడమని పేరిడి నిర్మించినారు. శ్రీ ఆనిబిసంటమ్మగారు, మన మాతృభూమియందుదయించిన బాలబాలికలు మన పెద్దల మహిమాతిశయములు పొంది జననభూమికి పూర్వపు ఖ్యాతి చెందింపజేయవలెనను ఉద్దేశముతో నింతపని చేయుచున్నారు.

శ్రీ అమ్మగారు బాలురకుగాను ఇచ్చు ఉపన్యాసములలో నంతయు, పూర్వపు సదాచారములను దృఢముగా నిలుపుకొని, ఇటీవల పట్టుబడిన దురాచారములను వదలి, ఇతర దేశీయులందుండు సదాచారములను గైకొని అభ్యసించుచు వారియందుండు దురా

చారములను పాగదోలుచు వృద్ధినొందవలెనని నొక్కిచెవకాంక్షించుచున్నారు.

తైత్తిరీయోపనిషత్తునందిదే బోధకడాచేసియుండునది.

యాన్యనవద్యాని కర్మాణి। తాని సేవితవ్యాని।
నోఇతరాణి, యాన్యస్మాకగ్ సుచరితాని।
తానిత్వయోపాస్యాని। నోఇతరాణి॥

ఏకర్మములు అనవద్యములో అనగా కల్మషరహితములో అవి మాత్రము గ్రహించి ఆచరించదగినవికాని ఇతరములుకావు. ఏవి మాకు సదాచారములో అవిమాత్రము సేవింపదగినవిగాని ఇతరములుకావు అని తాత్పర్యము.

శ్రీ అనిబిసంటమ్మగారు బాలుర విషయమయి ఔదార్యముతో చేసిన పనులు వ్రాయుటకు కారణమేమన:— నిజమయిన ఆసక్తితో, విశ్వాసముతో, దేశమును లోకమును క్షేమపడవలెననెడి నిష్కల్మష భావముతో నొకరే ఇంతపని చేయుటకు సాధ్యపడినపుడు, అనేకులు ఇట్టికారుణ్యమును ఔదార్యమును సుహృద్భావమును కలవారు దృఢప్రయత్నము చేసినంతట మనదేశము శీఘ్రముగ పూర్వపు ప్రఖ్యాతినొందుననుటకు సంశయములేదని చెప్పుటకు వ్రాయబడినది.

మన బాలబాలికలను సన్మార్గమునకు త్రిప్పవలెనను సదుద్దేశముండువారందరు ఎప్పటికైనను వారిని మిషనుపాఠశాలలకు పంపకూడదు. స్వకీయపాఠశాలలు స్వయముగ స్థాపించుటకు ద్రవ్యమును, ఇతరవిధములయిన వసతులును ఒనగూడనపుడు ఇప్పుడు మన మతాచారములు సుగుణగణమును వృద్ధిజేయుటకు విద్యాశాలలు నియమించుటకు ప్రతిజ్ఞవహించిన దివ్యజ్ఞాన విద్యాభ్యాససంఘము (Theosophical Educational Trust) వారికి శక్తికొలది ద్రవ్యాది సహాయముచేయుచు దేశీయ విద్యాలయములను అన్నిచోట్ల వ్యాపింప చేయవలెను.

ఈవిషయ మందెంత ద్రవ్యము వ్యయము చేసినను చాల ను. ఇంతకంటె నెక్కువ పాత్రము ఈకాలములో దొరకజాల ను. విద్యాదానమునకంటె శ్రేష్ఠమయిన దానమేదియు లేదు.

అన్నదానాత్పరంనాస్తి విద్యాదానంతతోధికం।
అన్నేనక్షణతృప్తిస్స్యాద్యావజ్జీవంతువిద్యయా॥
త్రీణ్యాహురతిదానాని గావః పృథ్వీసరస్వతీ।
అన్నంపరంహిదానానాం విద్యాదానంతతోధికం॥
యోదద్యాత్ జ్ఞానమజ్ఞానాం కుర్యాద్వాధర్మదర్శనం।
సకృత్స్నాంపృథివీం దద్యాత్తేనతుల్యం నతద్భవేత్॥

అని భారతమందును,

"సర్వేషామేవదానానాం విద్యాదానంపరంస్మృతం।
విద్యయాప్రాణినాం ముక్తిస్తస్మాత్తద్దానముత్తమమ్"

అని మనుస్మృతియందును చెప్పబడినది.

దానములకన్నిటికన్న అన్నదానము శ్రేష్ఠము. ఆయన్న దానమునకంటె విద్యాదానము శ్రేష్ఠతరము. అన్నముచే క్షణ మాత్రము తృప్తియగును, విద్యచే యావజ్జీవము తృప్తిగలుగును. గోదానము, భూదానము, విద్యాదానము, ఇవిమూడును అతిదాన ములనబడును. అన్నదానము దానములలో శ్రేష్ఠము. విద్యా దాన మంతకంటె నధికమైనది. ఎవరు అజ్ఞానులకు జ్ఞానమిచ్చు చున్నారో ఎవరు ధర్మమును తెలుపుచున్నారో అట్టివారితో భూమండలమంతయు దానముచేసిన వారుకూడా సములుకారు. అన్నిదానములకంటె విద్యాదానమధికము, విద్యచేత ప్రాణుల కు ముక్తి కలుగును, గనుక విద్యాదానము సర్వోత్తమము. కావున మనదేశీయులందరు ఇతర దానములు మాని ఈసత్పాత్రదానము నకై ద్రవ్యము విశేషముగా సెలవుచేయుట ఉత్తమోత్తమము.

సశేషము.

జం॥ శ్రీనివాసరావు.

# విదేశగమనము. *

## భారతీయులన్యదేశమునకేల వెళ్లవలయును?

1913 సంవత్సరము అక్టోబరు 18-వ తేదిలో జరిగిన ప్రథమ సభకు మదరాసు హైకోర్టులో ఆక్టింగ్ ఛీఫ్ జస్టిస్‌గా నుండిన సర్. ఎస్. సుబ్రహ్మణ్యయ్యర్ C. I. E., L. L. D. గారగ్రాసనమును వహించి యొకవ్యాసమును వ్రాసి దెచ్చిరిగాని యాసమయమున గొన్నిభాగములుమాత్రమే జదువబడెను. ఆప్రాజ్ఞుని యభిప్రాయములు చాల వెలగలవై యుండుటవలన బోగొట్టనలవి గాక నావ్యాసమంతయు నిందు ప్రచురింప బడియున్నది.

సభాధ్యక్షుడు వచించిన దేమనగా:—

పండిత శిఖామణియగు నుపన్యాసకురాలి పరిచయము నావలననే మీకిపుడు కావలసినదిలేదు. తనకు మాతృభూమియని భావించిన యేతద్దేశమునకు మేలొనరింపదలచి యామెవహించియున్న సంపూర్ణమగు శ్రద్ధకు నిపుడు ప్రయత్నించియున్న ప్రసంగములు మరియొక నిదర్శనముగా నున్నవి. మన కత్యవసరములైన విషయములనే యేర్పరచుకొని యుండుటయే గాక యమోఘమగు తనప్రజ్ఞా శక్తులతో వానికి సంబంధించిన యావదంశములను వెల్లడివరచును. ఈమె బోధించు బుద్ధివాదమునకు తగిన యాలోచన లియ్యబడునను మనోనిశ్చయము నాకున్నది. గాని యెవరికొరకయి యీ బుద్ధివాద మియ్యబడునో వారు దానిననుసరించి నడువగలుగుదురు గాక యని నమ్మియున్నాను.

పద్ధతి ననుసరించి నడవదలచిన నేను మరేమియు వచింపక యుపన్యాసకురాలిని ప్రసంగము జేయ నియమించవలెను. అయితే చెప్పనవసరములేని కొన్నిహేతువులచేత నువ

* ఇది శ్రీమతి ఆనిబిసంటమ్మగారిచే ఇంగ్లీషుభాషలో ఇయ్యఁబడిన యుపన్యాసము. బ్రి॥ ఎమ్. వెంకటారావుగారిచే తెనుఁగించఁబడినది.

న్యాసకురాలి యభీష్టము ననుసరించి నేనంత్యమందు చెప్పవలసినదానిని నిప్పుడే వచించెద. నేటిప్రసంగ విషయ మిదివరకే మనయాలోచనకు వచ్చియుండుటచేతను, దానిపూర్వాపరములందరికిని కొంతవరకు తెలిసియుండుటచేతను, నీపద్ధతి భేదమువలన నంతగా దోషములేదని తోచుచున్నది.

ప్రసంగవిషయమును, విద్యావాక్కు లతిశయముగా నున్న యుపన్యాసకురాలిని, తలచుకొనిన ద్రావిడదేశమందు నీతివంతురాలనియు బోధకురాలనియు వన్నెకెక్కియున్న "అవ్వయార్" అను కవీశ్వరురాలు కొన్ని శతాబ్దములకు మునుపు బాలురకొరకయిరచియించిన సూత్రములలో నొకటి నాకు జ్ఞాపకమువచ్చుచున్నది. ఆసూత్రమును భాషాంతరీకరించిన నీయర్థము నిచ్చుచున్నది. "తరంగయుక్తమగు సాగరముపై పయనము జేయుటవలన నయితము ధనార్జనము కాగలదు". ద్రావిడదేశస్థురాలయినను నా బోధకురాలు జెప్పిన యభిప్రాయమునకును నార్యధర్మమందీ విషయమాయి యుపపాదింపబడిన యభిప్రాయమునకును భేదములేదని తెలియుడు. ఏలయన వర్తకమే వైశ్యునకు సహజమయిన ధర్మము కదా. సముద్రయానమును మాని వర్తకముజేయుటెట్లు తటస్థించును? తన ధర్మమును జక్కగా నిర్వహించుటకు సముద్రయానమును నిరోధించుట ప్రతిబంధకముగా నుండదా? ద్విజవర్గమునకు జేరినవాడయి యుండుటవలన వైశ్యునకు ఉపనయనమే మొదలగు వైదికసంస్కారములు, గాయత్రీజపము, వేదాధ్యయనము విధిగా నున్నవి! అవసర మేర్పడినపుడు ద్విజవర్గమునకు జేరిన ఇతరవర్ణస్థులు నయితము సముద్రయానము జేయగూడదనుటకు తగిన ప్రమాణములు దొరకవు. అట్లు చెప్పుటచే వైశ్యుడు యుద్ధము చేయకూడదనియు క్షత్రియుడధ్యయనము చేయకూడదనియు నియమించి నట్లగుచున్నదిగాన నదియసంబద్ధము. ప్రతితరగతివారును క్లిష్టమయిన ప్రవర్తనము

తప్ప నితరయాచరణలకు బోగూడదని మన యార్యులు విధించి యున్నారని దలచుటలో మనసంఘ నిర్మాణకుల ముఖ్యోద్దేశము నే కనుగొనజాలక యున్నామని తేటపడుచున్నది. ఇదిగాక వాడుకను పట్టిజూచిన పూర్వమందు సముద్రయానము ధారాళముగా జరుగుచుండినట్టు సంస్కృత గ్రంథములవల్లను వానితో సమానమగు నితరమూల గ్రంథములవల్లను వెల్లడి యగుచున్నది గాన నీనిదర్శనమును మనము తృణీకారము చేయ వీలులేదు. సందర్భము లిట్లుండ సముద్రయానము బ్రాహ్మణులకెట్లు నిషేధింపబడెనని మీరడుగవచ్చును గాని దానిమూలకారణమును గనుగొనుట కష్టముకాదు.

పూర్వమున బ్రాహ్మణులందరును సామాన్యముగా విద్యానిరతులైయుండిరని మీకు తెలిసే యున్నది, వారికి విధింపబడియుండిన విద్యావ్యాసంగమును పూర్తిజేయుటకు చాలసంవత్సరములు శ్రమపడవలసియుండెను గాన ధనార్జనమే మొదలగు లోకవ్యవహారములకు జిక్కనలవిగాక యుండిరి. ఇదిగాక నాకాలమున విద్యాభ్యాసనిరతులగు బ్రాహ్మణుల యభివృద్ధికనుకూలమైన స్థితులుండెను. విద్యనితరులకు బోధించుచు సంఘముకొఱకు యజ్ఞాదిక్రతువులను, జనుల నిమిత్తమితర వైదిక కర్మలను జేయించుచు వారుజీవనము జేయుచుండిరి గాని పొట్టకొరకితర విధముగా పాటుపడవలసిన యవసరముండలేదు. ఆస్థితిలో వారు ధనసంచయము జేయుటకు వీలెక్కడిది? అయినను నాకాలపు ప్రభువులును, ధనికులగు నితరజనులును వారికొఱకుతగిన యుపవృత్తులను కల్పించియుండిరి గాన వారిజీవనమునకెట్టి కొఱతయు నుండలేదు. రాగిరేకులమీదను, నితరశాసనములమీదను బ్రాహ్మణుల కియ్యబడియున్న యనేక మాన్యములిందుకు నిదర్శనములైయున్నవి. దర్భంగారాజ్యముయొక్క మూలపురుషునకు లభించినట్టు విద్యానిపుణతకొర కపూర్వస

స్థానమును బొందిన బ్రాహ్మణు లరుదుగా నున్నను మరి యేయుపాధులు లేక విద్యావ్యాసంగమందే కాలము గడుపుచు సులభమగు జీవనము జేయదలచి యున్న యెడ బ్రాహ్మణు లల్పతృప్తులై యుండ వలసివచ్చెను, కేవలము విద్యాప్రజ్ఞలతో నొప్పుచున్న బ్రాహ్మణునికి ధనముపై విరక్తియే సర్వోత్తమగుణముగా భావింపబడుచుండెను. బొంబాయి విశ్వవిద్యాలయమున కుపాధ్యక్షులై యుండిన సర్ రామకృష్ణగోపాల్ భండార్కర్ గారొకవేళ నుత్తీర్ణులయిన విద్యాప్రౌఢులకు (Graduates) నుపన్యసించ దటస్థించగా వారు వచియించిన సంగతులలో విద్యకొరకే విద్య నభ్యసించవలెనను బుద్ధివాద మొకటియుండెను. ఆ బుద్ధివాదమున కాదర్శుడయియున్న యామహాశయుడు తప్ప మరెవరును విషయమునంత ప్రశస్తముగాను బలముగాను బోధింప నలవికాదు. ఉత్తీర్ణులయిన విద్యాప్రౌఢుల కీబుద్ధివాదమును నొసంగునపుడు "శిష్ట" శబ్దమునకు సంస్కృతమున విద్యాప్రాజ్ఞులు గల వాడను నర్థమేలాగువచ్చెనో వివరించిరి. నాకు జ్ఞాపకమున్నంతవరకు నాశబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థ మొక సంభవమునుండి వచ్చినదని వారానతిచ్చిరి. ఆసంభవమేమనగా పూర్వమున విద్యావంతులగు విరక్తులయొద్ద నొకకుండెడు ధాన్యము తప్ప మరి యేయాస్తియు నుండలేదట. అట్టివారే శిష్టులని వారానతిచ్చిరి. అయితే రోజ్‌బరీ ప్రభువుకు (Lord Rosebury) తోచినట్లు విద్వత్వ దారిద్ర్యము లొకచోటనుండగలుగునా యను సంశయము మీకు గలుగవచ్చునుగాని దారిద్ర్యముతో తృప్తి జెంది విద్యావినయ సంపన్నులై యున్న వారికెంతయో గౌరవమ్ము గలుగుట యనుభవసిద్ధమై యున్నది. ఈ కారణమునుబట్టియే మహనీయులగు నట్టిశిష్టుల జీవచరిత్రము లిటీవలబుట్టిన తరముల వారికుత్తేజకరములై విద్యయందే యాసక్తిని గలుగజేసెను. పూర్వమున నావిద్యాసక్తి యెంత ప్రయోజనకరమై యుండినను

బుద్ధినుపయోగించు సులభమగు జీవనోపాయములకు తప్ప కష్ట మగు వేరువృత్తులకు బ్రాహ్మణుల ననర్హులుగా జేసి యున్నది. తీర్థయాత్రలకు తప్ప మరియేకారణములచేతను ప్రయాణము జే యుకష్టము బ్రాహ్మణుల కయిష్టమాయెను. సందర్భము లిట్లుండ నావ పయనమందు బహుదినము లుండుటలో గలుగు అననుకూల మును, నిత్యకర్మలకు తటస్థించు ప్రతిబంధకములను, వంట మొద లగు విషయములలో కల్పించుకొనియున్న నియమములను ఆ లోచించి సముద్రయానము తమకు తగదని వారు నిర్ణయించుకొ నుట తటస్థించెను. ఈనిర్ణయము నుల్లంఘించి నడచిన మతధ ర్మములను, సంప్రదాయ విధులను తిరస్కరించిన దోషమువచ్చు నని విధించుకొనిరి. అయితే యిపుడు మనము వానిని వెనుకకు త్రోయవలసిన యవసరమేర్పడి యున్నదని యంగీకరించక త ప్పదు. ఈ యవసరముచేతనే చిన్నలు పెద్దలు సయితమీ ని యమముల నుల్లంఘించ నారంభించియున్నారు. అందుకొరకు వారిని దూషించుట న్యాయముకాదు. పలయన, బేకన్ (Bacon) యను నొక విద్వాంసుడు వచించినట్లు "కాలము సమస్తమును నూతనముగా జేయుచున్నది." బేకన్ మహాశయుడానతిచ్చు టకు బహుకాలమునకు మునుపే హిందూదేశమందు వర్ధిల్లిన జైన వైయాకరణి యగు ఫావనందియను విద్వాంసుడు "ప్రాతదానిని విడిచి క్రొత్తదానిని తీసుకొనుటచేత త్యాగముకాజాలదు. పల యన నది కాలనియమమునకు లోబడియున్నది." అని తన గ్రంథరత్నమందు సంక్షేపముగా జెప్పియున్నాడు. నేనుప పాదించు మార్పు లనిశ్వాహములని మీరెంతశీఘ్రముగ గ్రహించిన నంతమేలని నాకుతోచుచున్నది. అన్నివిషయములవలె మానవ వ్యవహారములకును మార్పులు గలుగుట సహజమని తెలియజాల కయున్న నంతకంటెను నధిక దుఃఖమేమి గలదు?

అది యట్లుండనిండు. సముద్రయానము బ్రాహ్మణులకు

నిషిద్ధమైనదనుట కేమిప్రమాణమున్నదని కనుగొనుటకై పండితు లనేకపర్యాయములు శాస్త్రశోధనమును జేసిరిగాని చివరకు జేయవచ్చునని తేటపడెను. ఇందునిమిత్తమై జరిగిన యనేకసభల లో నిటీవల తంజావూరుజిల్లాలో నడచిన పట్టిత్తాఖైరు సభయని నాకు తోచుచున్నది. ఆసభలో నిర్ణయింపబడినదేమనగా:— బర్మాదేశమునకు వెళ్లి బహుకాలమచ్చట నివసించి మరల వచ్చిన వారికి బహిష్కారమే మొదలగు మతసంబధమైనశిక్షలవశ్యకము లేము" అని ఆంగ్లవిద్యా సంపర్కమించుకైనను లేమింజేసి సదయ హృదయుడగు నాసభాధ్యక్షుడు వచియించిన యభిప్రాయములను నిష్పక్షపాత బుద్ధితో జదివిన సముద్రయానము జేయవచ్చుననుటకు నిర్దిష్టములగు కారణములు దొరకుచున్నవి. గనుక సముద్రయానవిషయమై బ్రాహ్మణులకుగల ప్రతిబంధకములు పోవుటయును మనకిపుడు సంప్రాప్తమైయుండు సందర్భభేదముల కనుగుణముగా మనచిత్తవృత్తిని మార్చుకొనుటయును నత్యవసరమూలైయున్నవి. ఇదిగాక, యాంగ్లేయ ప్రభుత్వమీదేశమునకు వచ్చినది మొదలు జీవనార్థమై విద్వాంసులకు మాన్యముల నిచ్చుపద్ధతి నిలిచిపోయినది. వారు వచ్చినదిమొద లే తత్పర్యంతము నొక యడుగుభూమినైనను సర్కారువారు మాన్యముగా నిచ్చియున్నట్టు నాకుతోచదు. సర్కారువారిదివర కనుసరించుచున్న నిర్ణయము నిపుడు మార్చెదరనిగాని, యట్లుమార్చుట మంచిదనిగాని నేనుజెప్ప నవసరములేదు. ఏలయన పట్టాభిషేక ముహూర్తమైనపిదప నొక మహామహోపాధ్యాయునకు నియమించిన యనధికమగు రు. 8—5—4 మాసాశన మీవిషయమందు జనుల సంశయమును బోగొట్టుటకు ప్రత్యక్ష నిదర్శనముగానున్నది. సర్కారు ఉద్యోగములయందు సయితమికమీద బ్రాహ్మణుల నధికముగా జేర్చుటకు వీలులేదు. ఒకవేళ చేర్చదలచిన న్యాయముగా నుండదు. ఎంతచేయవచ్చునో

నంతకంటె నధికముగా బ్రాహ్మణులకు సహాయము జేయుటను నిరోధించునిమిత్త మనేక సన్నాహములు నడచుచుండుట యందరికిని తెలిసేయున్నది. అతిసూక్ష్మమైన ఈవిషయమందు స్క్రెటరీగారి యాఫీసునుండి రహస్యముగు ఉత్తరవు లప్పుడప్పుడు వెళ్లుచుండునని యొకప్రవాదము గలదు. ఇది సకారణముగా నున్నదో లేదో నాకు తెలియదు గాని కొన్ని సంవత్సరముల క్రిందటి వరకు జరుగుచుండిన ప్రావిన్షియల్ సివిల్ సర్వీస్ (Provincial Civil Service) పరీక్షనుమాత్ర మొకతూరి తప్ప నితర కాలములయందు బ్రాహ్మణులే యుత్తీర్ణులై యున్నారను కారణముచేత తీసివేసినది యథార్థమే. అట్లు తీసివేసినది గొప్ప పొరబాటనే నాయభిప్రాయము. ఏలయన, అందువలన గొప్ప గొప్ప యధికారములకు మనదేశీయులు వెళ్లుటకు వీలులేక పోయియున్నది. తుదకు సంవత్సరమున కొకరిచొప్పుననైనను మనదేశీయుల నాయధికారములకు తీసికొనియుండిన నంతయాక్షేపణగా నుండదు. మరియును నిదివరకే యాదేశీయాధికారములలో బ్రవేశించినవారు ప్రదర్శించియుండులాగున వారును నధికారగౌరవమును, కార్యనిర్వాహక కౌశల్యమును జూపుచుండిరి. తిరువాన్కూరు రాజ్యములో దివాన్‌గా నుండు వారును, నెల్లూరుజిల్లా ఖాయం కలెక్టరుగా నుండువారును, వారికి బదులుగా నిపుడు వెళ్లియుండు వారును, కార్పొరేషన్ (Corporation) కు రెవిన్యూ ఆఫీసర్‌గా నుండువారును దీనికి నిదర్శనమైయున్నారు. ఈ సంగతి నిచ్చట ప్రస్తావించుటలో సర్కారువారి రాజ్యనీతిని యాక్షేపించవలెనని కాదు గాని జాతినే ముఖ్యముగభావించి యోగ్యతను తిరస్కరించగూడని స్థలమందు సివిల్ సర్వీస్‌లో బ్రాహ్మణు లధికమగుచున్నారను భీతి యెంతబలముగా పనిజేయుచున్నదో జూపించదలచి జెప్పినాను. తమకును తమదేశమునకును నత్యవసరములైయున్న విద్యాశిక్షల

ను బొందుటకై మన దేశపు చిన్నవాండ్రను విదేశములకు బంపుటవలనతప్ప వేరువిధముగా ప్రయోజనము కాజాలదని విచారపరులెవరికిని తోచకపోదు. రాజ్యాంగమునకు సంబంధించిన యనేక శాఖలలో గొప్ప గొప్ప యధికారములను సంపాదించు నిమిత్తమే గాక చేతిపనులు మొదలగు నితరవృత్తులలో చక్కగా విద్యా శిక్షలను బొందునిమిత్తమై మనబాలురనేక సంవత్సరములవరకు విదేశములకు వెళ్ల నవసరమున్నది. అట్లు విద్యాశిక్షలను బొందనియెడల వేయారుమందికి జీవనోపాయములు దొరకకపోవుటయే గాక కుశలవిద్యలకు సంబంధించిన వృత్తులతో నీదేశమును పోషించుటకు వీలులేకపోవును. ఇంతకన్న ప్రబలతరమైన కారణములు మీకు తోచవలయును. ఇందుకు దృష్టాంతముగా మన యాధిపత్యముయొక్క మంత్రాలోచన సభలోనుండుమన దేశబాంధవుడు పిమ్మట స్టేట్ సెక్రెటరీగారి సభకుగాని, జుడిషియల్ కమిటీకిగాని నియమించబడి యచ్చటికి వెళ్లి చాలమంచి పనులనుచేసి మరల మన దేశమునకు వచ్చినయెడల, నొకప్రక్క యతనికి స్వాగత మర్యాదలను మరియొకప్రక్క బహిష్కారమును నిచ్చెదరా? అట్లు జేసిన నంతకంటెను అన్యాయమును నవివేకమునైనపని యేమియున్నది. కాలాతీతమగుటవలన మరేమియువచింపక నేనుపరమించవలెను. సముద్రయాన విషయమై ద్విజవర్గమువారియందనుకూలమైన యభిప్రాయము తనంతటతాను మానముగా వచ్చుచునే యున్నదిగాని ఐరోపా, అమెరికా, జపాను దేశములకు విద్యాభ్యాసముకొరకు బోవు యువకులు తమవారికిని నితరులకును నసహ్యకరములైయుండు హేయమగు విదేశీయ పద్ధతుల నవలంబించక నాయభిప్రాయమును మరింతపోషింప నవకాశమిచ్చెదరు గాక యని కోరుచున్నాను. అట్టి చెడ్డవాడుకలవలన వారిగౌరవము తగ్గిపోవుటయే గాక సంఘమునకు మేలొనరించుశక్తియు నశించును. కాన వారు నిగ్ర

హావరులై యుండుట కర్తవ్యముగానున్నది. దీనిని వారు లక్ష్యమునం దుంచుకొనెదరుగాక యని వేడెద.'' అని చెప్పి సుబ్రహ్మణ్యయ్యర్ గారు తమ యుపన్యాసమును ముగించిరి.

పిమ్మట **ఆనీబెసెంటమ్మగారు** ఇట్లు వచించిరి.

మిత్రులారా,

నేను జేయబూనియుండు నీ ప్రసంగములలో భారతీయుల హృదయములందతి తీవ్రముగా బాధించుచున్న విషయముల జర్చింప దలచియున్నాను. హిందువులుగా బుట్టి హిందూమతమందభిమానము గలవారై యున్నవారిచే తప్ప నితరులచే జర్చింపనలవి కాని విషయములు కొన్ని గలవు. పురోహిత వర్గమును శుద్ధిపరుచుటయు గార్హస్థ్య ధర్మములను, దేవాలయములో జరుగవలసిన కైంకర్యములను చక్కబెట్టుటయు మొదలగు నీవిషయములు చాల పవిత్రములై యుండుటవలన నామతమందే జన్మించి యాపద్ధతులనే యవలంబించుచున్న వారు వానిని చర్చించవలయును. ఇతరులు వాని చర్చింప బూనుకొనుటలో నామతస్థుల భక్తి విశ్వాసములకు లోపము గలిగించ నవకాశమున్నది. అట్టి విషయములుగాక, నావలె భారతీయులకొరకిరువది సంవత్సరములుగా పాటుబడుచు పరస్పర విరుద్ధములగు నాగరికతలకు పాశ్చాత్య బుద్ధిని భారతీయహృదయమును జేర్చ శక్తిగలవారు చర్చింప నవసరమైన పరదేశీయమగు విషయములు కొన్నిగలవు. "దేశీయ రాజ్యభార క్రమముతో ఇకమీద వర్ధిల్లగల గొప్పసామ్రాజ్యమున హిందూదేశ మేస్థానము నాక్రమించవలయును. హిందూదేశమునకు స్వరాజ్య సంపదలెట్లు గలుగును. భారతీయులకుండు ననివార్యము లేమి, వానిని నివారించు టెట్లు'' అను నీ సంగతులా వర్గమునకు జేరియున్నవి. వేయేల నేనిపుడు సంఘసంస్కరణ విషయములో బ్రవేశింపదలచినాను. అది నా

కు క్రొత్తది కాదు. ఎందుకనగా కాశీక్షేత్రమందు స్థాపించిన హిందూజాతీయ ప్రౌఢపాఠశాలలో (Central Hindu College) మే మొక సంఘసంస్కరణ సూచకమైన నియమము నిదివరకే విధించియున్నాము. పెండ్లియయిన బాలుర నాపాఠశాలలో జేర్చుకొనుట లేదని నియమించియున్నాము. పాఠశాలలయందు చదువుచుండు వరకును వివాహము జేయమని బాలుర తండ్రుల చేత నొక ప్రతిజ్ఞను జేయించుకొనెదము. స్వయముగా పాఠశాలల నేర్పరిచినవారును, పాఠశాలలు తమ యాధీనమందుంచుకొనియున్న వారును ఈనియమములను వానియందు విధించి యాచరణకు దెచ్చిన బాల్యవివాహదోషము లీదేశమునుండి తొలగిపోయి భారతపుత్రు లరోగదృఢగాత్రులగుదురు.

నే నీతూరి యుపన్యసించెడి విషయములకు పూర్వాపర క్రమ మేమియు లేదు. అగ్రాసనాధిపతుల యనుకూలములనుబట్టి ప్రసంగ విషయములను నే నేర్పరచుకొన్నాను. ఈ మొదటి ప్రసంగమునకు సర్ సుబ్రహ్మణ్యమయ్యరుగారు తప్ప మరెవరును సభాధ్యక్షులు కాజాలకయుండిరి. విదేశగమనమే తమకు సమ్మతమైన విషయమని వారానతిచ్చినందున నిదియే ప్రథమోపన్యాసముగా నేర్పడినది. ఇతర ఉపన్యాసములుకూడా యీలాగుననే యగ్రాసనమును వహించుటకు దయచేసి యంగీకరించిన మహాశయుల కార్యానుకూలములనుబట్టి యేర్పరచబడియున్నవి. వీనిలో సంబంధసరణి యున్నదని భావింపకుడు. ఏలయన నిజముగా నట్టి సంబంధ సరణి లేదు. నే నేక్రమమున నుపన్యసించెదనో ఆ క్రమముననే వానిని పరిగ్రహించి చక్కగా నాలోచింప గోరెద. అంతేకాదు. ఈ సభయందుండు వరకును సంఘ సంస్కరణ విషయములు బాగుగా నిర్దేశింపబడినవని కరతాళముల జేయుచు బయట వెళ్లగానే వాని ననుసరించి పనిచేయునంత ధైర్యములేకున్న నీభరతభూమి యున్నత్

దశకు రానేరదు. ధైర్య సాహసములు లేని ప్రజలవలన దే శోన్నతి సర్వథా గలుగనేరదు. హిందూదేశపు మహిమ వె ల్లడి కాజాలదు.

విదేశ గమనమే మన మీర్నాటి విచారము జేయవలసిన విషయము, ఈ విషయమందును నికమీద ప్రసంగించు విషయ ములయందును నేనొక మార్గమును బట్టి జెప్పదలచినాను. మీక ది సమ్మతమగునో లేదో నేను చెప్పజాలనుగాని సమ్మతము గాకు న్నానంత దోషము లేదు. ఏలయన, మనమందరమును నొక టేవిధ ముగా నాలోచించుచుమేని ప్రపంచము నడవనేరదు. అభిప్రాయ భేదముకలిగి యుండుట మంచిది. నేనుద్దేశించి యుండుమార్గము మీకు క్రొత్తదిగాదు. నామార్గము దూషణమార్గముగాని ఖండన మార్గముగాని కాదు. సవరించి యభివృద్ధిజేయుటయే నామార్గ ము. గనుక నే నీ ప్రసంగములలో సూధించు మార్పులకును పూర్వాచరణములకును గల సంబంధమును మీకుజూపించ దలచి నాను. పూర్వాపర వంశమువారిని జేర్పుటచే తప్ప నేజనాం గమును ఉన్నతదశకు రాజాలదనియు దానికి క్రమమయిన యభి వృద్ధి కలుగదనియు నేను నమ్ముచున్నాను. ఒకకాలములో నున్న వారి యభివృద్ధి స్థితినిబట్టి ముందరి కాలమువారి యభివృద్ధి తట స్థించుచున్నది. ఒకదుంపను భూమిలో నాటిన, రాబోవు ఋతువు లో నెగసెడు దుంపదానిలోపలనే గోచరించక బెరుగుచుండు ను. అట్లునెగసిన దుంపను తీసికొని పాతదుంపను పారవేసిన యెడల సికముందు క్రొత్తదుంప బుట్టదు. ఆచెట్టుయొక్క సౌం దర్యమును వెల్లడిజేయు పుష్పము వికసించదు. మీపాతచీనులు మీకంటెను సెక్కువయుకారులయి యుండిరనియు ప్రజ్ఞాశాలుల గు నాపాతచీన జ్ఞానులు నిర్ణయించిన పద్ధతులను వదలి యిటీవ ల తరమువారు కల్పించిన బంధనములను మీరు జిక్కియున్నార నియు మీరున్నత స్థితికి పోనువీలు లేకుండునట్లు మీ యవయవముల

బంధన సూత్రములను కల్పించియున్న హారీటీపల కాలమునకు జేరిన శాస్త్రములు, శాస్త్రకారులుగా నున్నారనియు మీకు రుజువుచేయ యత్నించెద. ఆచార విరుద్ధముగాను, దోషయుక్తముగాను ఉన్నవని మీరుభావించెడు ననేక సంప్రదాయములు పదివేల సంవత్సరములక్రిందట శిష్టాచారములై యుండెను. ప్రాచీనులలో గొందరనైనను మీతో జేర్చుకొన దలచితిరేని పూర్వాచారములనన్నిటిని త్రోసివేయక యా పునాదిపై మీ పురోవృద్ధి మందిరమును నిర్మించవలయును. పెలయన మిమ్ములను విడిచి మీవృద్ధులెట్లుండజాలరో అటులనే వారిని విడిచి మీరు నుండజాలరు. వృద్ధి పొందుటయే మీకు నియత ధర్మము. మీకుపదేశించుటయే మీవృద్ధులకు ధర్మము. ఆయాకాలమందాసన్నమగు విద్యమానములను ఆతరమువారే చర్చజేసి తీర్మానించుకొనవలెనని యువకుల పరము నేను మాటలాడుచున్నను కష్టతరమగు నీవిషయమందుమాత్రము ధారాళహృదయముగల ప్రాచీనులను మీత్రోవకు త్రిప్పుకొనుట మంచిది. మీరు బోవ యత్నించియున్న మార్గమున పాశ్చాత్యపద్ధతు లేమియులేవనియు, మీప్రాచీన సంప్రదాయములే మాసిపోయి యుండుటవలన వానిపై బహుకాలముగా నాగియున్న ధూళినిమాత్రమే తుడిచివేయుచున్నామనియు మీరు వారికి జూపెంచిన మీ మార్గమునకు రాకపోరు. మీప్రాచీనులలో విదేశగమనము సర్వసామాన్యమైన పద్ధతిగా నుండెను. గనుక మీరిపుడే క్రొత్తగా సముద్రమునుదాటి యాపద్ధతిని కల్పించియున్నామని గర్వమును జెందకుడు. బహుకాలమునకు వెనుక మీప్రాచీనులు విదేశగమనమును జేయుచుండిరి. ఐరోపాఖండమున మధ్యకాలమనియు (Middle Ages) క్రైస్తుశకములో యుద్ధకాలమనియు పిలువబడుచున్న యదృష్టహీనమగు సంధికాలమున మీరు మీపూర్వ స్వాతంత్ర్యమును బోగొట్టుకొని శాస్త్రసమ్మతమగు నీపద్ధతిని విడిచియున్నారు.

అట్లయిన, శాస్త్రములయందు ప్రమాణ మేమియున్నది? కొందరు మాత్రమే తప్ప సామాన్యముగా హిందువులందరును వేదములనే సర్వోత్తమ ప్రమాణములుగా బరిగ్రహింతురు. వారిలోనుండు సమస్తతెగల వారును నేకీభవించునది ప్రమాణవిషయమగు నీయొక యంశమందుమాత్రమే. తరువాత పురాణేతిహాసములును నిటీవలబుట్టిన ధర్మశాస్త్రములును ప్రమాణములై యున్నవి. ఆచారములకు స్మృతులే ముఖ్యాధారములై యున్నవి. వీనినిగురించి రెండుసలహాల నివ్వదలచినాను. మొదటిది, పాశ్చాత్యుల మతగ్రంథములవలె శ్రుతిస్మృతులను సయితము పరిశుద్ధమగు నాక్షేపవాదమునకు (Higher Criticism) లోబరుచుట మంచిదని నాకు తోచుచున్నది. బైబిల్‌లో నిట్లు జెప్పబడి యున్నదని యెవరైనను వచించిన నది దేశచరిత్రవలన గలుగు ఆక్షేపవాదమునకును (Historical criticism) పరిశుద్ధమగు యాక్షేపవాదమునకును (Higher criticism) సమంజసముగా నున్నదా యని యడుగవలయును. "నీవు చెప్పునది సప్రమాణికమై యున్నదా? ప్రక్షిప్తములు (కల్పనలు, Interpolations) గాని దోషములుగాని లేవని నిష్కర్షగా జెప్పగలవా" యని యడుగవలెను. లోకమందుగల యితర సమస్తమతముల మతగ్రంథములును విద్యావంతులయొక్కయు, జ్ఞానులయొక్కయు యాక్షేపణలకు లోపరచబడి తమసత్యత్వమును జూప నియమింపబడి యుండగా మీగ్రంథములను మాత్రమేల యంత పవిత్రముగా నెంచి లోపల నుంచుకొనవలెను? ఆక్షేపవాదమునకు లోబరచుటచే సత్యమును బోధించు గ్రంథములకు బాధకమేమియు గలుగదు. ఒకవేళ కల్మషమేమైనను జేరియుండిన నది దగ్ధమై పరిశుద్ధమగు సువర్ణము తేలును. వేదమును బూజించుచున్న నే నాక్షేపాగ్నిలో దానిని వేయ సందేహింపను, వెరువను. ఏలయన, ఆయగ్నివలన దానిలోని కశ్మలమంతయు దహింపబడి

చల్లారిన పిదప బంగారము బయలుదేరునను నమ్మకము నాకున్న
ది. గనుక మీకు నేను జెప్పున దేమనగా ఏస్మృతినైనను మీరు
బూజించుటకు మును పది యెపుడు పుట్టెను, దానిని వ్రాసినవారె
వరు, అదేల ప్రమాణముగా నెంచబడవలసినది యను నీ సంగ
తులను విచారించుడు. ఏలయన, కాలచక్రము తిరుగుచుండును,
యుగములు మారును. ఒక్కొక యుగమున కొక్కొకస్మృతి
వ్రాయబడును. ఏ యుగమున కే స్మృతి విధింపబడునో ఆయు
గమునకు ముందుగాని తరువాతగాని యది యుపయోగపడదు.
ఒక సంగతినిమాత్రము సత్యమని మీరు తెలిసికొనుడు. అదేద
నగా, తన జగ మభివృద్ధికావలయు ననుటయే భగవంతుని సం
కల్పము. తరతరములోను నది వృద్ధికావలెను, తరతరములోను
నది జ్ఞానపరమార్థముల నెడి కొండ నెక్కవలెను, తరతరము
లోను నది యభ్యుదయ మార్గమందే వెళ్లవలెను, ఉన్నచోటనే
యుండుట తటస్థించదు, ధర్మమనగా నేమి, యధర్మమనగా
నేమి? ఈశ్వరాజ్ఞారూపమగు ప్రవర్థమానచక్రము ననుసరించి న
డచుటయే ధర్మము. దానికి విరుద్ధముగా నడచుటయే యధర్మ
ము. ఈ యర్థ మెప్పటికిని సరిపోవుచున్నది. ఒక యుగము
నకు ధర్మమెద్దియనగా, యాకాలములో జగము ప్రవర్థమానమ
గుట కనుకూలమైన కార్యమే, మానవునియందు దేవుడు ప్రకా
శించుట కనుకూలమైన యుపాయమే, మానవకోటి యున్నత ద
శకుబోవు మార్గమే, అనంతమగు పూర్ణస్థితి లభించు సాధనమే,
సృష్టియంతయు బాగుపడు విధానమే. అధర్మ మెద్దియనగా,
పూర్వ బంధనములను మరల గలుగజేసుకొను కార్యము, పురో
భివృద్ధికై బోధింపబడిన యుపదేశ వాక్యములను లోక మెంత
దూర మభివృద్ధియై యున్నదో యని పరీక్షించు మైలురాళ్లుగా
భావించుటకు బదులుగా ముందు నడపను వీలులేనట్లు గోడలుగా
నేర్పరుచుకొనుట. సోదరులారా! మీలోనున్న స్వామిని నమ్ము

డు. మీయందు సదా వికసించుచు మీదేశమును వెనుకకు పోనివ్వక ముందరికే తీసికొని వెళ్లుడని సూచించుచు, పూర్వుల అనుభవముచే ధైర్యమును, దోషముచే వివేకమును సంపాదించి నడువుడని మీయంతరంగమున బలుకుచున్న స్వామి వాక్యములకు విరుద్ధముగా నడవకుడు. అట్లైన పురాతనములగు గ్రంథములేమి వెల్లడి జేయుచున్నవి? వేదములు వ్రాయబడినపుడు విదేశగమనమున కవశ్యకమైన సముద్రయానము నిషేధించబడియుండలేదు, ఇంతియేగాక వానిలో వర్ణింపబడియుండు కొన్ని సంగతులు సముద్రయానమందనుభవముగల వాకు సయితము ప్రాచీనుడైన గ్రంథకారునికి హృదయంగమమైనంతె స్పష్టముగా కాలేదని నేనొప్పుకొనక తప్పదు. ఋగ్వేదములో (I cxvi 3) వశిష్ఠునిచే జెప్పబడిన వాక్యార్థమును జెప్పుచున్నాను. ఆఋషి వర్ణించియుండుదానినంగీకరించెదరో లేదో మీలో సముద్రయానము జేసినవారు జెప్పవలెను. వశిష్ఠుడు వచించినదేమనగా:—"నేనును వరుణుడును ఓడలో కూర్చుండి సముద్రమధ్యమునకు బోయి ఉయ్యాల ఊగినట్లుగా తరంగయుక్తమగు నీళ్లపై నటుయిటు నుల్లాసముగా నూగులాడుచుంటిమి." ఇది నా యనుభవమని నేను జెప్పజాలను. నేనుకూడా తరంగయుక్తమగు సముద్రముపై వెళ్లినాను. భారతీయులనేకులతోజేరి నే నింగ్లాండుదేశమునకు వెళ్లియున్నానుగాని యలలపై యూగులాడుచుండగా నుల్లాసము బుట్టినట్లు వారుచూపించలేదు. అనేకులకాలాటి యూగులాడడము దుఃఖకరమైయున్నదిగాని యుల్లాసకరముగా లేదు. వశిష్ఠుడైననో దానిని చాల యానందకరముగా భావించియుండుట నిజమే. సముద్రపయనముం నతడు బహు ఉత్సాహముతో సలిపియున్నాడు. ఋగ్వేదములో (VII IXXX, VIII 3) మఱికొన్ని యోడలలో తాను పయనముజేసినట్లును తరంగములలో నిటునటు మనోహరమగు డోలోత్సవము ననుభవించినట్లు మరల జె

ప్పియున్నాడు. గనుక నాకాలమున మీవారలు సముద్రయానము జేయుచుండిరని స్పష్టమగుచున్నది. అలహాబాదులో నుద్దామ పండితుడగు మహామహోపాధ్యాయ విద్వాన్ గంగానాథ్ జాయను నతడేతద్విషయమై యనేక ప్రమాణములను సమకూర్చి పూర్వమున హిందువులు విదేశగమనము జేయుచుండిరని ఋజువుచేసియున్నాడు. ఈగొప్పపండితుడిందునిమిత్తమై తన ప్రజ్ఞనంతయు వినియోగపరచియుండుట యన్యాదృశమైన సంగతిగానున్నది. ఈ విషయమున నికను స్పష్టమైన ప్రమాణములు గావలెనన్న కాశీపట్టణమందు జరిగిన మతసంబంధమైన వ్యాజ్యములో నివ్వబడిన తీర్మానమును జదువుడు. సీమకు వెళ్లివచ్చిన యొక దాయాదితో భోజనము సలిపినందున బాబు గోవిందదాసు, అతని సోదరుడగు బాబు భగవాన్ దాస్ గారును కుటుంబ సమేతముగా బహిష్కరింపబడిరి. కాశీపట్టణపు "అగర్ వాలాలకు" గలిగిన యానిర్బంధమును తొలగించు నిమిత్తము బహిష్కారము నిచ్చినవారిపై బహిష్కృతులైన సోదరులిరువురును మాననష్టమునకు నావ్యాజ్యమును దెచ్చిరి. వ్యాజ్యమేమో సోదరులపరము గెలిచెనుగాని బహిష్కారముమాత్ర మింకను పోలేదు. ఉత్తరహిందూస్థానములోని కొన్ని భాగములలో తత్రాపి కాశీపట్టణమందు కొన్నివిషయములలో మతాధికారుల ప్రాబల్య మెక్కువగా నుండుటవలన విదేశములకు వెళ్లివచ్చిన ముగ్గురు బహిష్కరింపబడియుండుటయేగాక వారితో భోజనము జేసినవారు సయితము వెలివేయబడియున్నారు, ఎవరికిని తెలియకుండ పార్సివారి, యూరోపియన్ వారి భోజనశాలలకు వెళ్లి భుజించివచ్చిన బహిష్కార ప్రస్తావమేమియు నుండదు. ఇది నిజమైన సంగతి. విదేశమునకు వెళ్ల సాహసించి తద్వారా ముందు వెళ్లువారికంతయు సులభమగునట్లు జేసిన మహాశయులకు మాత్రము వెలివేయబడు దురదృష్టము తప్పక గలుగు

చున్నది. అట్టివారు తమ పుత్రులకును పుత్రికలకును వివాహమొనర్చ వీలులేదు. వారి గృహములలో నైమిత్తికకర్మలను జరుగనవకాశము లేదు. హిందువులకు విధింపబడియున్న సామాన్య సంస్కారములుకూడ వారికి దూరమైపోవును. సీమకు వెళ్లివచ్చువారి సంఖ్య ప్రతిసంవత్సరము నధికమగుచుండుట నిశ్చయమేగాని పైసూచించిన యసందర్భములను లక్షించకుండుట కతి ధైర్యము కావలయును. అతయేవ, జనుల యభిప్రాయమును సవరించుకొరకు, విదేశగమనము జేసి వచ్చినవారికిని మతాధికారులకును జరుగుచుండు యుద్ధము కొంతవర కుపయోగకరగునే నాయభిప్రాయము.

పూర్వమున వినోదార్థముయి హిందువులు సముద్రముపయి పయినము జేయుచుండిరనుటకు ప్రాచీన గ్రంథకారుల కవితావర్ణనలు మాత్రమే కాదు. శిష్టుడని గణింపదగు మనువు వేరువేరు వస్తువులపై విధింపబడు వడ్డినిగురించి యొక నియమము నేర్పరుచునపుడిట్లు విధించియున్నాడు:—సముద్రయానమున నెక్కువ యనుభవముగలవారు దేశకాల వస్తువులనుబట్టి యెంతలాభమును గణించెదరో దానినే న్యాయమైన వడ్డియని భావింపతగు.'' యాజ్ఞ్యవల్క్యస్మృతి వ్యవహారాధ్యాయము 38 వ శ్లోకములో సముద్రముమీదను, భూమిమీదను వర్తకులవల్ల తీసుకొనిపోబడు సరకులపై విధించవలసిన వడ్డినిగురించి కొన్ని నియమము లియ్యబడియున్నవి. సముద్రయానములో లాభముగలుగు నిమిత్తమే కొన్ని శ్రాద్ధము లేర్పడియున్నవి. మరియొకవింతమైన సంగతి యేమనగా:—బ్రహ్మహత్య జేసినవారు సముద్రయానము జేయుటచే నాపాపమునుండి విముక్తులగుదురని వ్రాయబడి యున్నది. అట్లు వెళ్లువాడు పడవనుండి సముద్రములో పడిపోవలెనను యభిప్రాయమున్నదో యేమో నాకు తెలియదు.

సశేషము.

ఎం. వెంకట్రావు.

# గ్రంథ విమర్శనము.

1. బ్రహ్మశ్రీ వావిలాల వేంకట శివావధానులవారిచే రచియింపఁబడిన "బ్రహ్మసూత్ర సారము" అను గ్రంథరత్నము మా కార్యస్థానము నలంకరించెను. ఇది మిగుల నుత్తమమైన గ్రంథము. బాదరాయణ మహర్షిచే విరచింపఁబడినఁ బ్రహ్మసూత్రము లను గ్రంథము మన దేశమున త్రిమస్థలకును పూజనీయమగు ప్రమాణ గ్రంథములలో నొకటియై యున్నది. అయిన నిది కేవలము పండితులకుఁదక్క నన్యులకు దురవగాహము. ఇప్పుడు దీనియొక్క సారమును అవధానులవారు తెనుఁగుభాషయందు ఎల్లవారికి సుబోధమగునటుల సులభశైలిని వ్రాసియున్నారు. వారు సంస్కృత భాషా పాండిత్యము సంపాదించి సూత్రభాష్యమును గురుముఖమున సంప్రదాయానుసారముగ పఠించినవారగుటచేతను, అనేక గ్రంథముల శోధించి వేదాంతసారమును చక్కఁగ గ్రహించి స్వానుభవము దెచ్చుకొన్న వారగుటచేతను మూలగ్రంథము యొక్క సారాంశమును అభిప్రాయానుతో విశదీకరించి యున్నారు. మూల గ్రంథమును పఠించుట కవకాశము లేనివారికి నియ్యది యత్యంతోపయోగముగనున్నది. మూలగ్రంథమును చదువ గోరువారికిని నిది సోపానప్రాయమై సహాయకారియై యుండును. గ్రంథాదియందు విషయసూచిక 16 పుటలు నిండియున్నది. విషయసంఖ్య 137, తదనంతరము వేదాంతములు, వానిభాష్యాములు, బాదరాయణులు కృష్ణద్వైపాయనులను వ్యాసులాకారా అను సంశయవిమర్శనము, సూత్రభాష్యములవయి దేశభాషలో నుండు టీకలు, సూత్రములలోని విషయసంగ్రహము, అద్వైత విశిష్టాద్వైత సిద్ధాంతముల సామరస్యము, ఆనిబెసంటమ్మగారు లోనగు మహనీయుల అభిప్రాయము ఈ మొదలగు విషయములు 56 పుటలు నిండియున్నవి. పిమ్మట సూత్రసారము వ్రాయఁబడి

యున్నది. గ్రంథాంతమున శంకర చరిత్రమును సూత్రముల మూల గ్రంథమును 50 పుటలు నిండియున్నవి. పుస్తకము మంచి దళమైన కాగితములమీద తప్పులులేక నిర్దుష్టముగ నచ్చు వేయబడియున్నది. గ్రంథము ఆమూలాగ్రము 380 పేజీలకంటె నధికముగ నున్నది. మేలు ప్రతి వెల రూ. 1—4—0. సాధారణ ప్రతి రూ 1—0—0. వలయువారు చెన్నపురికి సమీపం అడయారులో థియసాఫికల్ పబ్లిషింగ్ హౌస్ మానేజరుగారికి వ్రాసుకొనవలయును.

:0:

2 బెంగుళూరులో నూతనముగ నుపక్రమించఁబడిన "ఆనందచంద్రిక" యను కన్నడ మాసపత్రికయొక్క ప్రథమ (1916 నవంబరు) సంచిక మా కార్యస్థానము నలంకరించెను. ఇందు ముఖ్యముగా మతవిషయములు నీతివిషయములు విద్యావిషయములును ప్రచురింపఁ బడియున్నవి. దళసరములగు మేలుకాగితములతో మిక్కిలి ముచ్చటగ నచ్చువేయఁబడినది. ముఖపత్రమున సరస్వతీ పటము ముద్రించంబడి యున్నది. మైసూరు మహారాజాగారు, గోపాలకృష్ణ గోఖ్లేగారు, ఆనిబె సంటమ్మగారు, వివేకానందస్వామిగారు, పండితరమాబాయిగారు మొదలగు ననేక మహాపురుషుల చిత్ర పటములతో నిండి మిక్కిలి శోభాయమానముగ నున్నది.

ఈ సంచికయందు భగవత్సేవా మహిమ, ప్రార్థన, ఆనందసాగరము, పరమార్థ ప్రబోధిని, జ్ఞానాంజన, జీవిత దిగ్విజయము, నీతి సంగ్రహము, అర్థశాస్త్రము, హాస్యలహరి, వృత్తాంత సంగ్రహము ఐరోపాయుద్ధము మొదలగు విషయములు చర్చింపఁబడి , యున్నవి. ఈనూతన పత్రిక దీర్ఘాయుష్మంతమై వర్ధిల్లుగాక.

# Divyagnanadeepika.

## CONTENTS OF THIS NUMBER.





## విజ్ఞాపనము.

కాకితముల ధరవిశేషము హెచ్చినది. యుద్ధారంభమునకు పూర్వము ఒకరూపాయు వెలగలిగియుండిన కాకితములు ఇప్పుడు అయిదురూపాయలకు దొరకుట దుర్లభమయినది. ఇట్టిస్థితిలో మాపత్రికను ఉచితముగా ఇవ్వవలయునని కోరుట ధర్మము కాదు. మంచికాలమున ననేకులకిచ్చితిమి. ఇక యుద్ధముముగియునను నటుచేయనశక్తులము.

☞ ఏప్రిల్ నెలలో చందాదారులకందరికి దివ్యజ్ఞానదీపిక వి. పి. పోష్టులో పంపబడును. పత్రిక అక్కరలేనివారు తక్షణము ఆసంగతి మాకు తెలియజేయవలసినని ప్రార్థించెదము.

చిత్తూరు,
.12 — 1916



పరమాత్ముని నరసింహాయ్యా,
పబ్లిషర్.